Kṛṣṇamūrtiśāstri, Śrīpāda, 1866-1960

Śrīkṛṣṇabhāratamu : araṇyaparvamu

Muktyāla, 1918

Record no. 287

## Bibliographic Record Target

కృష్ణమూర్తిశాస్త్రి, శ్రీపాద, 1866-1960
శ్రీకృష్ణభారతము : అరణ్యపర్వము / సంస్కృతభారతానుసారము ; శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతము.- ముక్త్యాల : శ్రీమాహిష్మతీముద్రణశాల, 1918.
v. <2 > (various pagenation). ;25 cm.
Record no. 287

Kṛṣṇamūrtiśāstri, Śrīpāda, 1866-1960.
Śrīkṛṣṇabhāratamu : araṇyaparvamu / సంస్కృతభారతానుసారము ; Śrīpāda Kṛṣṇamūrtiśāstri praṇītamu.- Muktyāla : Śrīmāhiṣmatī Mudraṇaśāla, 1918.
v. <2 > (various pagenation). ;25 cm.
Record no. 287

శ్రీరస్తు.

శ్రీబాలాత్రిపురసుందర్యైనమః.

# శ్రీకృష్ణభారతము

ఆరణ్యపర్వము—ద్వితీయసంపుటము.

సంస్కృతభారతానుసారము.

కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

ప్రణీతము.

చింతలపాటివంటు జమీందారులు

శ్రీరాజా వాసిరెడ్డి శ్రీచంద్రమౌళీశ్వరప్రసాద్ బహదర్ వారి

నామాంకితము.

శ్రీమాహిష్మతీముద్రణశాలయందు

ముద్రితము.

ముక్త్యాల.



1918.

# విజ్ఞాపనము

—:o:—

ఆర్యులారా! భారతీయులారా!

నాభారతప్రథమసంపుటమందు భారతప్రారంభకారణము మున్నగునవి చర్చింపఁబడి యున్నవి. మరల నిట వ్రాయుట నిరవసరమైనను వనపర్వవిశేషములు వెల్లడించుటయకాక తద్రచనాకాలంబున నాకుఁ గలిగినయంతరాయములం దెలుపుకొనుటయొకటి ముఖ్యమని నాకుఁ దోఁచుటంజేసి యిట్లు దొడంగితి.

శ్రీమహాభారతములో నారణ్యపర్వము విఘ్నకారి యనియు నది రచించునపుడే నన్నయభట్టు మృతినొందె ననియు నాభయముననే తిక్కనసోమయాజి వనపర్వశేషమును విడిచి విరాటాదిం దొడంగి తెలిఁగించె ననియు వెనుక నెఱ్ఱనార్యుఁడు నారణ్యపర్వశేషము నన్నయపేరుమీఁదనే పూరించె ననియు లోకప్రవాదము కలదు. ఇదికాక యాపర్వము చదువువారి కిప్పటికి నేవో విఘ్నములు గలుగుచుండు ననియే పెద్దలు చెప్పుదురు. ఇవి యన్నియు నేను లోనిడికొని సభాపర్వము ముగిసినపిదప విరాటపర్వము ప్రారంభించి యదియు నుద్యోగములోఁ గొంతయు వ్రాసి పిమ్మటనే యీపర్వము ప్రారంభించితిని. ఇది ప్రారంభించినముహూర్తమును నాశరీరములో వాతామయ మంకురించిన ముహూర్తము నొక్కటియే. ఆవాతామయమునఁ గీలుకీలునకును నొప్పి పుట్టినది. అందు వామాంసమునందలినొప్పి రెండుదినములు ప్రాణసంశయముం గలిగించినది. ఆకాలములో మాతల్లిగా రొకసంవత్సరపరిమితకాలము వ్యాధిపీడితురాలై కాలధర్మమునొందె. నారోగముచేతనే కాక తల్లిగారిపరిచర్యచేతను గ్రంథరచనకుఁ గొంతకాల మంతరాయము కలిగెను. పిమ్మట నాహృదయభాగమందుఁ బ్రాణాపాయమైనదెబ్బ తగిలినది. అది మూఁడుమాసములు మంచమునుండి లేవ నీయనివిధముం గలిగించినది. మఱియు నెన్నో మనస్సంకటములు పుట్టి బెట్టుగ వేధించినవి. ఇన్నివ్యాధులు నాధులు నన్ను మూఁగికొన్నను జీమగంగాయాత్రవలె భగవదనుగ్రహమున నీపర్వ మెట్లో పూర్తి గావించితి నని వ్రాయుటకు సంతసించుచున్నాఁడ.

ఆరణ్యపర్వమునం దనేకధర్మములు కర్మములు నీతులు రీతులు నితిహాసములు తత్త్వార్థోపన్యాసములు తీర్థవృత్తాంతములు ప్రకృత్యాదిశాస్త్రోదంతములు లోనగునానాఘట్టంబులు గలిగి గహనంబై యుండుటంజేసి మహారణ్యంబు నాఁ బడి ప్రవేశంబునకుఁ జో టీక ప్రచారంబు సాగనీక మిక్కిలి చిక్కులం బెట్టినది. అందు నన్నయభట్టు

రచించినభాగమువలె కొంతవిధమునఁ దెమలినను ప్రబంధపరమేశ్వరుఁడు రచించినభాగ మెంతకాలమువఱకును దెమలినదికాదు. నే నీభారతమును మూలార్థమును వెల్లడించుటకుఁ బ్రారంభించితినిగాని కవిత్రయమువారికవిత్వములో నాకవిత్వమును దులఁదూఁగింతు నని కా దని మున్నే విన్నవించుకొనియున్నాఁడను. ఈవనపర్వము సర్వత్ర మూలానుసరణముగనే యుండుటగాని విజయునింద్రకీలగమనాదికము, కాలకేయనివాతకవచసంహారము, శ్రీరామచరిత్రము, శిబిచరిత్రము, మఱియుం గొన్నితీర్థములవృత్తాంతములు మొద లగునవి మూలమున రెండుమూఁడుతడవలు వర్ణింపఁబడియున్నవి. నే నాయాసందర్భముల నుచితరీతి నిం దొక్కొకపర్యాయమే వాని నెల్లం బొందుపఱచితిని. అది మూలాతిక్రమణ మని తలంచి పెద్దలు గర్హింపకుందురుగాక.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి,
గ్రంథకర్త.



# పీఠిక.

---

మ. స్థితికృద్వ్యాసవచస్సరోజము లసద్గీతార్థగంధోత్కటం
బతిచిత్రం బతిపాత్ర ముత్తమము నానాఖ్యానకింజల్క మూ
ర్జితమై యంతకథామధూన్నతము సద్భృంగప్రపేయంబు భా
రతపంకేజ మొసంగెడుం గలిమలప్రధ్వంసమై శ్రేయముల్.

శ్రీకృష్ణభారతాదిగ్రంథకర్తలును, కవిరాజబిరుదాంకితులు నగుబ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిని నేను గొన్నిసంవత్సరములనుండి యెఱుంగుదును. వారురచించిన గ్రంథము లన్నియుం జదివియున్నవాఁడ. వారికవిత్వమందు నాకు మంచియభిప్రాయము. వారు మానగరమం దుండి వనపర్వమును బూరించునపుడు ప్రతిదినమును నేను వారి కడం గూరుచుండి చూచుచుండువాఁడ. కవిత్వ మన నేమియో పద్య మెట్లుండవలెనో వారికిఁ దెలిసిన ట్లిపుడు మఱియొకరికిం దెలియఁబో దని నానమ్మకము. అట్టిశ్రీశాస్త్రిగారిభారతపర్వములం దొక్కదానికిఁ బీఠిక వ్రాయవలయు నని నాకు సంకల్పము పుట్టి వారితో సూచింప వారు:—

"క. కవి వవధానివి దక్షుఁడ, వవ రాజువునందు నీకు నీడీవనప
ర్వవరమునకు పీఠిక వ్రాసివెలార్పు మిలన్ ముడుంబసింగ్రాచార్యా."

అని ప్రోత్సాహ మొనరించిరి. ఇది బహుగ్రంథశోధకు లగుమహామహులు చేయవలసినకార్యము గాని యలంతి యగు నావంటివాఁడు చేయవలసినకార్యము కాదు. నే నెంతయు నసమర్థుఁడ నైనను కవిరాజప్రోత్సాహము నూఁతగా గొని యీయుద్యమమునకుం గడంగితిని. ఇందలినాయసమర్థతకు విద్వదగ్రేసరులు మన్నింతురు గాక.

నారాయణాపరావతారం బని ప్రసిద్ధి గాంచినవేదవ్యాసమహామునీంద్రుఁడు పంచమవేదం బని కొనియాడంబడునట్లు భారతము రచించి జగదుపకారంబు గావించె. దాని ప్రాశస్త్యముం బట్టి పెక్కురు పెక్కుభాషలలోనికి మార్చియున్నారు. దానినే నన్నయభట్టారకాదు లాంధ్రీకరించియున్నారు. ఆంధ్రప్రపంచమున కదియే లక్ష్యగ్రంథము. కాని దానియందు మూలమందుఁ గలసర్వవిషయములును జూపట్టుటలేదు. వారు కథామాత్రమున్ స్వీకరించి సంక్షేపించి వ్రాసియున్నారు కొన్నికొన్నిస్థలములందు మూలవిరుద్ధములును బడియున్నవి

"ఉ. నన్నయముఖ్యసత్కవినిబంధనంబులకాస్యములందు లేఖకుల్
కొన్నియుఁ గాకకాధములు కొన్నియుఁ బోకడఁబెట్టి కక్కసై

యున్నెడఁ గాంచి జానపదు ♦ లోడక దిద్దినతప్పులొప్ప లె
ల్లన్నిజ మంచుఁ గైకొనిన ♦ లక్షణవేత్తలు నవ్వుతింతురే.''

అని యప్పకవి చెప్పినట్లు భారతమునం దెల్లెడల నేలేఖకపాఠకాదులవలననో మూలవిరుద్ధములు పెక్కులు పడియున్నవని నిశ్చయింపఁ దగియున్నది. అట్టి వ్యత్యయవినిమయాదులెల్ల సంస్కరించుచు మూలానుసరణముగా మఱియొక భారతము వ్రాయుట సముచిత మని తలంచి మనకవిరాజుగారు తమపేర నీభారతమును రచించుటకుం బ్రారంభించి యిప్పటికి మూఁడుపర్వంబులు ముద్రించియున్నారు. ఇది మిక్కిలి సమంజసకార్య మని నాయభిప్రాయమే చెప్ప నేల పెక్కురుమహాపండితులయభిప్రాయము నని మొదటి సంపుటమునందలిపండితాభిప్రాయములవల్లనే తెల్ల మగుచున్నది. ఇట నేను వాకొనుట చర్వితచర్వణమే యగు నని తద్విషయమును ముగించి మనగ్రంథకర్తగా రారణ్యపర్వ మెట్లు తెలిఁగించినారో వివరించుచు మునుమును వారికవిత్వతత్త్వ మెట్టిదో కొంచెము పరిశీలించి ప్రస్తుతమునకు వచ్చుచున్నాను.

కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

పెక్కుకృతులు రచించినవీరు తమకవిత్వగురువు శ్రీనాథుఁ డని తెలిపియున్నారు దీనివలన వీరు శ్రీనాథునిగ్రంథములు మిక్కిలి చదివియుందు రని గ్రంథశైలింబట్టి తెల్ల మగుచున్నది. శ్రీనాథునిసీసమువలెనే వీరిసీసమును నునుపారి కర్ణరసాయనముగ నుండును. వీరిగద్యపద్యములు లోకస్వభావానుగుణ్యపదరచనం దగిలి పెక్కుస్థలములందు దృశ్యప్రబంధములం బోలఁదోఁపించుచుండును. రసమునకుం దగినపదములు పదములకుం దగినరచన రచనకుం దగినభావగాంభీర్యాదులును వీరి కవిత్వమందుఁ బొందుపడియుండును. పెద్దవిషయమంతయుఁ జిన్నపద్యమందును జిన్నవిషయమంతయుఁ బెద్దపద్యమందును జెప్పి యొప్పించునేర్పు వీరికిం గుదిరినట్లు మఱియొకరికిం గుదురు టరిది. వీరికవిత్వమందు సామాన్యముగా యతిప్రాసములకై యేఱి తెచ్చి వేసినపడికట్టురాళ్లు లే వని చెప్ప నొప్పు. ప్రాయికముగా నాధునికకృతులం దిట్లుండుట దుర్లభము. దూరాన్వయాదులం బొందక వీరికవిత్వము సామాన్యముగా మాటలాడుకొనుచున్న ట్లుండును. యమకాదు లందు వీరి కిష్టములేదు. లేకున్నను గద్యపద్యములందు ముఖ్యముగా నక్షరసామ్యము చూచియే పదము ప్రయోగింతురు. ఎంతదుష్కరప్రాస మైనను సుకరప్రాసమువలెం బోలఁ దోఁపఁ బద్యము నడపింతురు. వీ రనేకస్థలములందు స్త్రీవర్ణనము చేసియున్నారు. శృంగార మని జుగుప్సాకరముగా వర్ణించియుండ లేదు. బాల్యమునుండియు వీరికవిత్వ మొకవిధముననే ధారాశుద్ధి గలిగి నాతికఠినమృదుమధురశైలిం దగిలి ద్రాక్షాపాకమై





యుండును. దీనింగూర్చి వారియితరగ్రంథములనుండి కొన్నిపద్యము లుదాహరించి చూప నెంచియు గ్రంథవిస్తరభయంబున మాని ప్రస్తుతాంశమునకు వచ్చుచున్నాను. అది—

శ్రీకృష్ణభారతము.

ఈపేరున మనశాస్త్రిగారు మూలానుసరణముగా మహాభారత మాంధ్రీకరించుటకుం గడంగి కొన్నిపర్వములు రచించి యున్నప్పుడు ముక్త్యాలసంస్థానాధీశ్వరులు మహామత్ మర్తబత్ వ ఆలి మంజిలత్ శ్రీరాజా వాసిరెడ్డి శ్రీచంద్రమౌళీశ్వరప్రసాద్ బహదర్ మన్నెసుల్తాన్ సర్దేశముఖ్ మన్నెవార్ సర్కార్ ముర్తుజాన్నగర్ వగయిరా చింతలపాటివంటుజమీందార్ గారు మనకవిరాజు గారిని బిలువనంచి బహూకరించి:—

"ఉ. భారతపర్వధర్మములఁ ♦ బ్రస్తుతి కెక్కినభారతంబునం
బేరు పఠించు టెంతయును ♦ దెల్మికిఁ గారణ మట్లుగాన నీ
భారతమందు మాకొలము ♦ వర్ణనముం బొనరించుచుం గడుం
గోరిక మీఱ నాంధ్రమునఁ ♦ గూర్పుము నేర్పున పర్వపర్వముల్." (శ్రీ॥కృ॥భా॥)''

అని కోరి గ్రంథమును బూర్తిచేయించుచుండి రని వినుట కెంతయును సంతసించుచున్నాను. ఇది ప్రసిద్ధి గాంచినవాసిరెడ్డివంశజుల కనురూపమే కదా. తొల్లి మనకృతిపతిగారిపితామహు లగుశ్రీరాజా భవానీముక్తేశ్వరప్రసాద్ బహద్దరువారు బ్ర॥చివుకుల మహాదేవశాస్త్రిగారివలన సంస్కృతభారతము నామూలాగ్రముగ నెన్నియోతడవ లాకర్ణించి సంస్కృతభారతమునం గలసర్వవిషయంబులును దెలుఁగుభారతమున లేమిం జేసి మూలానుసరణముగా మఱియొక తెలుఁగుభారతమును జేయింపవలయు నని యెంతయో ప్రయత్నించి రట కాని యది వారికి సిద్ధింపక వారియాత్మ కాత్మ యగు వీరికి సిద్ధించుటయు వారికి సిద్ధించినట్లే యగునుగదా. ఆహా! శ్రీభవానీముక్తేశ్వరప్రసాద్ బహద్దరువారి యాత్మయే యిట్లు పౌత్రునియాత్మం జొచ్చి యిమ్మహాకార్యమునకుఁ బ్రేరేచిన దనియు దీనివలనఁ బితామహులమనోరథమును నెరవేర్చినఫలంబును మహాభారతమును గృతి నొందినఫలంబును శ్రీచంద్రమౌళీశ్వరప్రసాద్ బహద్దరువారికిఁ గలిగి శాశ్వతకీర్తి సంపాదింపఁబడిన దనియుం ద్రికరణశుద్ధిగం జెప్పుచు నిఁక గ్రంథవిమర్శనమునకుం గడంగుచున్నవాఁడ నమ్మహాగ్రంథము:—

శ్రీకృష్ణభారతారణ్యపర్వము.

ఇది కృష్ణమూర్తిశాస్త్రిగారు దాదాపు రెండుసంవత్సరములక్రిందటనే ప్రారంభించి రనియు నిందు వీరి కనేకాంతరాయములు తటస్థించె ననియు నిందలియాశ్వాసాద్యంతపద్యములవలనఁ దేటతెల్లం బగుచున్నది. ఆపద్యములు ప్రాతమార్గంబునం బట్టక క్రొత్తమార్గంబునం బట్టి తత్తత్సంగతిసందర్భములనెల్ల వెల్లడించునట్టివియై యున్నవి. పాండవులు

పాంచాలీసహితులై వనవాసంబుఁ జేసి శ్రమంపడినకారణంబున వనపర్వంబు నాఁ బను నిందు ననేక ధర్మంబులు ననేకతత్త్వోపన్యాసంబులు ననేకచరిత్రంబులు ననేకేతిహాసంబులు లోనగువిషయంబు లెల్ల వర్ణింపఁబడియున్నవి. ఇం దనేకమహాఘట్టంబులు గలవు కావుననే గ్రంథాంతమందు మనగ్రంథకర్తగారు.

"మ. పరధర్మాపనిజంబులన్ . విపులతత్త్వప్రశస్తముల్ ప్రక్రియా
గిరిదుర్గంబు లనేకవర్గపదముల్ • క్లిష్టార్థఘట్టంబులన్
ధరమై యుండ ఏకంబుఁ బోలువనపర్వం బిట్లు మూలంబుతో
దొరయం జేసెను కృష్ణమూర్తికవి వైదుష్యంబు వర్తింపఁగన్."

అని చెప్పియున్నారు. పర్వములలో శాంతిపర్వముతర్వాతఁ బెద్దది యని ప్రసిద్ధి గాంచినదీనియందు మూలమున 11664 శ్లోకంబులు గలిగి నన్నయభట్టారకునిభారతమున 2900 పద్యములు గలిగి శ్రీకృష్ణభారతమున 4866 పద్యములు గలదియై యున్నది. మన దేశంబున క్షామడాంబరాదిమహోపద్రవములు గలిగినప్పుడును శాంతికపౌష్టికాది క్రియాకలాపంబు లొనరించునప్పుడును శ్రీమహాభారతము పఠించునాచారము తొంటినుండియుం గలదు. వర్షప్రతిబంధము కలిగినప్పుడు విరాటపర్వపారాయణముఁ జేయుట నే టొఱుంగుదుము:—

"సీ. విజిగీషు వగురాజు • విని దీని రిపుల నిర్జించి భూచక్ర మార్జించి మించు
సుతుల నర్థించినసతి భారతము విని, మంచికొమాళ్లను • గాంచి మించు
నామయగ్రస్తుఁ డీయాగమార్థ మెఱింగి, మించినరోగంబుఁ • జెంది మించు
నిరుపేదభక్తితో • నిరత మీశాస్త్రము వాలించి ధనాఢ్యతఁ • గాంచి మించు
తే. పరయ ధర్మార్థకామమోక్షాంచితంబు, భారతంబు దీనిని భక్తిఁ ధరితు లగుచు
వినినవారికిఁ బాపముల్ • వెస నశించుఁ, బుణ్యమును మించు దేవత్వమును లభించు."
శ్రీ॥కృ॥భా॥

అని వంశావతారపర్వాదిని వర్ణింపఁబడి యున్నది.

శ్లో. "కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్య చ
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనం." సం॥భా॥

అని చెప్పియుండుటచే నీవనపర్వమున నలచరిత్రము పవిత్రమైన దని యెన్నఁబడుచున్నది. తొల్లి శ్రీహర్షుఁడు వేదమును గల్పించుటం జేసి తనకుఁ గల్గిననోటిలోనిక్రిమిరోగమును నలుని వర్ణించి పాపుకొనియె నని యొకప్రతీతియుం గలదు. మఱియు నిందు ధర్మరాజు సూర్యు నారాధించి వరంబు నడసినఘట్టంబును నర్జునుఁడు పరమేశ్వరుని సందర్శించి సన్నుతించినఘట్టంబును లోమశుండు ధర్మజునకు ధర్మోపదేశంబుఁ జేసినఘట్టంబును ధర్మవ్యాధుఁడు కౌశికునకు జీవలక్షణాదిధర్మంబు లెఱింగించినఘట్టంబును తీర్థయాత్రాఘట్టం



బును రామాయణకథాఘట్టంబును పతివ్రతామాహాత్మ్యఘట్టంబును యక్షప్రశ్నఘట్టంబును లోనగుఘట్టంబులెల్ల మహాపాతకోపపాతకహరంబులై కరంబు డంబుమీఱు. అట్టిమహాగ్రంథము ననుసరించిన—

—— ఆంధ్రీకరణము ——

దేశోపకారక మని చెప్పుట పునరుక్తియే యగును. సంస్కృతము రానివారి భారతధర్మంబులెల్లం దెలుపుట కిది తల్లివంటి దగును. అట్టితెలుఁగు మూలమునకు సరియైనది కానిచో ధర్మవ్యత్యయము కలిగి కేవలాంధ్రులకుఁ దబ్బిబ్బుపడవలసి వచ్చుచుండును. నన్నయభట్టారకుని యారణ్యపర్వంబున సూర్యు నారాధించి వరంబుఁ గొను పట్టునఁ బెద్దకథ విడువంబడియున్నది. ఆసూర్యస్తవమంతయు మహామంత్ర మనియుఁ బాఠకుల కాయురారోగ్యప్రద మనియు నందుఁ జెప్పఁబడియున్నది. అది ప్రత్యహము పారాయణ మొనర్పం దగు నట్టిది కావునఁ దప్పక యుండవలయును. శ్రీకృష్ణుఁడు సాల్వునితో యుద్ధముఁ జేయుట నభివర్ణించుటలో నన్నయభట్టు మిక్కిలి సంగ్రహించినాఁడు దానివలన మనము తెలిసికొనం దగినవిషయములు పెక్కులు కలవు. శ్రీకృష్ణునికోటయుం దిప్పుడు మనము వినుచున్నవానికన్న వేయిమడుఁగులు హెచ్చయి ప్రసిద్ధిఁ గాంచినశతఘ్నులు యంత్రఘనకంబులు నాకాశవిమానంబులు జలయంత్రంబులు బాంబులు (ఇప్పటిబాంబులు విమానములును వీనిలోనిసహస్రాంశము నకునైనం బోల్పుటకుఁ జాలవు.) మొదలగునవియుండినట్లును సాల్వునివిమానము లక్షలకొలందిజను లధిష్ఠించుటకుం దగినదియై మహామహోన్నతజ్యోతులు (సర్చిలైట్లు)కలది యై యున్నట్లును వర్ణించుటయే కాక నానావిధాయుధములతోడి యుద్ధమును జేర్కొనఁబడియున్నది. అది వర్ణింపమి మననాగరికతకు లోపమేకదా! నలచరిత్రములో దమయంతిని నలుఁడు బెడఁ బాసి పోయినపిమ్మట దమయంతి వనంబులం గ్రుమ్మరుచుఁ బరితపించినవిషయ మంతయు మూలమున నెంతోకరుణ పుట్టించునట్లు స్వభావసిద్ధమై యున్నది. నన్నయభట్టుభారతములో నట్లు గాక మఱియొక్కవిధమై సంక్షేపింపఁబడియున్నది. మఱియు మార్కండేయుండు ధర్మజున కొక్కచో దానమహిమాదికంబు విస్తరించి వర్ణించుచుం జెప్పె. అది యంతయు శంభుదాసునిభారతమునఁ బూజ్యము. ముఖ్యముగా నిప్పటివారవి యెల్లఁ దెలిసికొని తత్తల్లాభములఁ బొందవలసిన వారై యుండిరి. మఱియుఁ గర్ణునిజన్మవృత్తాంత మాదిపర్వమున సద్యోగర్భ మని వ్రాయఁబడి యుండ నారణ్యపర్వాంతమున శంభుదాసుఁడు కుంతీదేవి తొమ్మిదిమాసములు గర్భము మోసి పదియవమాసమునఁ గర్ణునిం గనినట్లు వ్రాసియున్నాఁడు. ఇది మూలవిరుద్ధము. ఏతద్విషయ మంతయు నిందు 530 పుటయందు వివరింపఁబడియున్నది. ఇత్యాదులు పెక్కు

శీయారణ్యపర్వమునుండి చూప నగును గాని గ్రంథవిస్తరభయమున నావిషయ మింతతో విడిచి మూలానుసరణముం గూర్చి ముచ్చటించుకొందము

"మూ॥ కో భవాన్ కి న్నిమిత్తం వా వానరం వపు రాస్థితః
బ్రాహ్మణానంతరో వర్ణః క్షత్రియ స్త్వాంతు పృచ్ఛతి
కౌరవ స్సోమవంశీయః కుంత్యాగర్భేణ ధారితః
పాండవో వాయుతనయో భీమసేన ఇతి శ్రుతః
సవాక్యం కురు వీరస్య స్మితేన ప్రతిగృహ్యాతత్. సం॥ భా॥

ఉ. ఈ వనవీథిప్లవంగతను ♦ వేటికిఁ దాల్చితి క్షత్రియుండ నే
నావరశారవాన్వయము♦నందుఁ బృథాపతికిన్ సదాగతి
ప్రీవలనం జనించితి ధ♦రిత్రిఁ గపీంద్ర వృకోదరాఖ్యకుం
డావల మైతి నావుడును ♦ నవ్వుచు నవ్వనచారి యిట్లనున్. శ్రీ॥ కృ॥ భా॥

తే. క్షత్రియు ప్రవరుండ వి♦ఖ్యాతబలుఁడఁ, బాండుతనయుండఁ గుంతిగ♦ర్భంబునందు
వాయువరమునఁ బుట్టిన♦వాఁడ నన్ను, భీముఁ డండ్రు భూజనులు క♦పిప్రభుండ.
నన్నయభారతము.

"మూ. సరావాసంస్థితం భూతం మత్స్యమీషం సమాగమత్
నిఘ్నన్ ప్రోథేన పృథివీం విలిఖం శ్చరణై రపి
సమాజం జతరే ణోర్వీం వివర్తం శ్చ ముహు ర్ముహుః. సం॥ భా॥

ఉ. వందిరొయొకండు నాకడకు ♦ వచ్చెను హెచ్చుగ ఘుర్ఘురించుచున్
సందడిసేయుచుం బుడమి ♦ జర్జరితంబుగ ముట్టెఁ గొట్టుచున్
ముందఱిఁగాళ్లఁ దు మ్మెగురఁ♦ బోయుచు ఱొమ్మున నేల రాయుచున్
గ్రిందుగ నిప్పుఁ గ్రక్కుచును ♦ గ్రిక్కదలాడెడు కొండయో యనన్. శ్రీ॥ కృ॥ భా॥

ఇదినన్నయభారతమున లేదు.

"మూ. భగవన్ క్షుద్ర మత్స్యోస్మి బలవద్భ్యో భయం మమ
మత్స్యేభ్యో హి తతో మాం త్వం త్రాతు మర్హసి సువ్రత
దుర్బలం బలవంతో హి మత్స్యమత్స్యం విశేషతః. సం॥ భా॥

మ. అలఘూదారగుణాబ్ధి! నీదుశరణం ♦ బర్థింతు మత్స్యంబులన్
బలవంతంబులు దుర్బలంబులఁ దినున్ ♦ బాటింప కింతేని నే
నలఁతిన్ మత్స్యభయంబు నామనమునం ♦ దర్యోన్ మహోద్రిక్తమై
విలసత్కీర్తివి నన్ను దీనుని దయన్ ♦ వీక్షించి రక్షింపవే. శ్రీ॥ కృ॥ భా॥

వ. అయ్యా! యేను కడునల్పమత్స్యం బగుటంజేసి బలవంతంబు లగుజలచరంబులవలన నాకు బాధ యయ్యెడు నని భయంబు గలిగియుండు నిమ్మడుగు మత్స్యవంశులంబు గావున నపాయంబు నొందకుండ నన్నుద్ధరించి యుండెడం బెట్టిన నేను నీకుఁ బ్రత్యుపకారంబు సేయ నోపుదు.
ఎఱ్ఱాప్రగ్గడభారతము.

మూ. కి మహ మేనం నపరిత్యభిజ్ఞాస్యా మీహ వ్యాసేన సహ ప్రకృత్యేచ్ఛతిమ యాపాలహితా,
పరశ్చేద మస్యదక్షిణాభిగ్రస్తాభి ర్గోభి రతిక్రమణాభిః కృతం తత్ర చాహం ప్రతివసామీతి. సం॥ భా॥



ఉ. ఏల యెఱుంగకుండెదవొ ♦ యేను మహాగుణభూషణున్ మహీ
పాలుని వాని వానిదయ ♦ వాసముసేయుచునుంటి నింగు నీ
కాలమునం దనేకశత♦కోటులు దక్షిణ లిచ్చి జన్నముల్
వేలకువేలు చేసి నిలి♦పెన్ మణియూపము లెన్ని యేనియున్.

ఉ. ఆతఁడు దక్షిణార్థముగ ♦ నర్థుల కిచ్చినగోగణంబు లీ
భూతలమందు మెట్టుటను ♦ భూరిఖురంబుల ద్రొస్సి ద్రొస్సి కా
దే తగి యూసరోసర ము♦దీరిత మయ్యెఁ దదాహ్వయంబునన్
బ్రీతికిఁ గారణం బతని♦పేరు స్మరించితి నేను ధన్యుఁడన్. శ్రీ॥ కృ॥ భా॥

ఉ. అక్కట నే నెఱుంగనె మ♦హాగుణభూషణు నమ్మహాత్ము న
న్నిక్కడఁ బెక్కుమారులు న♦నేక భయంబులఁ బొందకుండఁ గా
నక్కటికంబుతోడఁ దగ ♦ నాతఁడు గైకొని కాచెఁ గాద పెం
పెక్కినయన్నరేశ్వరుని ♦ నెన్నఁటికిన్ మఱవంగ వచ్చునే.

తే. అమ్మహాత్ముండు బహువిధ♦యజ్ఞదక్షి,ణార్థముగ విప్రవరులకు ♦ నర్థి నిచ్చు
గోగణంబుల గొరిజల ద్రొస్సి యయ్యెఁ,గాదె యూసరోవరము ప్ర♦జ గన్నుతముగ.
ఎఱ్ఱాప్రెగ్గడభారతము.

ఇట్లే గ్రంథమంతయు నాంధ్రీకరింపఁబడియున్నది. వలయువా రాయాఘట్టంబుల సవిమర్శంబుగం జూచుకొనునది. శ్రీకృష్ణభారతమునఁ గొన్ని సంబోధనపదములు మొదలగునవి లోపించిన లోపించును గాని మూలమునం గలసర్వవిషయములును వచ్చియున్న వని ఘంటాపథముగాఁ జెప్పవచ్చును.

మద్గ్రంథకర్తగా రుభయభాషాపాండిత్యము గలవారై పెక్కు గ్రంథములు చేసి యీభారతరచనకుం దొడంగిరి. వీరికవిత్వమందుఁ గొన్నిచోట్ల సంస్కృతపదభూయిష్ఠముగాను గొన్నిచోట్ల దేశీయపదభూయిష్ఠముగా నుండి మనోహరముగా నుండును వీరి—

సంస్కృతరచనలు.

మహాస్రగ్ధర. కనదుగ్రిగ్రాహనక్ర♦క్రమభయదమహా♦గర్తగంభీరనీరం
బును గల్లోలాగ్రినృత్య♦త్స్ఫురహుజలకణ♦ప్రోక్షితాభ్రంలిదభ్రి
స్తనితపాత్రియానిశ ప్రాప్తభువనవతన♦ద్విస్ఫుటధ్వానధామం
బనవద్యానంతమార్గం ♦ బయి భయకర మా♦నద్ధిఁ గన్గొంటి నంతన్. పుట 478

మ. యమదండప్రతిమానమై సకలలో♦కాత్యంతభీమంబునై
యమితోద్యోతమై మహోన్నతమునై ♦ హార్వోంను దండంబు దు
ర్దమకోద్దండములం దమర్చి నిజద♦ర్పం బేర్పడన్ భీముఁ డా
సమరప్రాంగణమందు గండుమిగిలెన్ ♦ సంప్రాప్తకాలాకృతిన్. పుట 282.

తెలుఁగురచనలు.

సీ. మేలైనమగటాల♦డాలు డీలింప జాళ్,మేనితో సామేని♦సానితోడ
వెన్నెల వెదఁజల్లు♦క్రొన్నెలనీక నల్లు,ప్రవ్వుతో మవ్వంపు♦నవ్వుతోడ

పల్లవఁ దలసల్లకల్లోల మా తెల్ల, వాకతో వార్త తోల్ కోకతోడఁ
బెమపల్క లోల్లనిసెన గొల్కు చల్లని, చూపుతో దొర లేనిరూపుతోడఁ 67 పుట

చ. కలఁగును విచ్చనార్చును వికారము నొందును గన్ను మోడ్చు లోఁ
దలఁచును దద్దఱిల్లును వితాకుపడున్ వెగడొందుఁ గుందు న
ర్మిలిఁ గొను సొక్కు గ్రుక్కిళులు మ్రింగును బొంగు నలంగుఁ గాని లో
గలవెత యేరికిం దెలుపఁగాఁ దలపోయఁడు కాంనిర్మితిన్.

పుట 361

ఉ. కన్నులు లేనివాకు నొకకన్నయి కన్నది కన్నయట్లునున్
విన్నది విన్నయట్లును బ్రవీణమతిం దెలియంగఁ జేయుచున్
నన్నిశలంబు వీడక ఘనం బగుభక్తి భజించుతమ్మునిన్
నిన్నెడఁబాసి నే నెటుఁగ నిద్రయు నన్నము నిన్ని నాళ్ళునున్. పుట 15

ఇట్లుం దందుఁ జూచుకొనునది. ఒకేసందర్భమున మనకృతికర్తయు నన్నయయు నెఱ్ఱనయు వ్రాసినపద్యములను బోల్చి చూచుకొనుట కిట నుదాహరించుచున్నాఁడను:—

సీ. మయవినిర్మితసభామధ్యరత్నమయాసనాసీనుఁ గరయో! కుశాసనంబు
హర్మ్యాంతరోన్నతహంసగరుత్తూలికాశయనుఁ గరయో! తృణశయనము
చందనాగురుదిగ్ధసర్వాంగసుందరమూర్తిఁ గరయో! నేలబూదిపూఁత
స్వచ్ఛదుకూలవస్త్రాచ్ఛాదితునఁ గరయో! తరువల్కలాజినధారణంబు
తే. కలిగి మృగములు తోడుగాఁ గాననాంతరములఁ దుంచలు దూఁడు లక్ష్మణుఁగ సుదర
పోషణము చేసికొనుచున్నపురుషు నిన్నుఁ, జూడ నాచిత్తమున శాంతి వీడె నయ్యొ.
శ్రీ. కృ. భా. పుట 45

సీ. విమలహర్మ్యంబుల విహరించువారలఁ, బ్రియమహార్హాసనశయనరతులఁ
జందనాగురులిప్తచారుసర్వాంగుల, నతనరనాథసేవితుల మిమ్ము
వనమునఁ గ్రుమ్మరువారిఁగాఁ గుశబృసీశయనాభిరతులఁగా నియతరూక్ష
భూరేణుధూసరీభూతవిగ్రహులఁగా, ద్రుతవన్యమృగనిషేవితులఁగాఁగ
ఆ. నిట్లు చూచి చూచి యే నెట్లు చిత్తోపశాంతి నేయుదాన సకలభోగ
విషయవిరతిఁ జేసి విధియును ధృతరాష్ట్రునట్లు మీకు నహితుఁ డయ్యె కొక్క.
నన్నయారణ్యపర్వము.

ఉ. ఆమహనీయమూర్తి ప్రణయంబున నన్నుఁ గవుంగిలించి నా
మోమున మోముఁ జేర్చి శిరముం జుబుకంబునుఁ బట్టి కేలితోఁ
గోమలశబ్దమున్ పలికెఁ గొంచెము యే నది పెంచె హర్ష మే
నే మని చెప్పువాఁడ నతఁ డే హృదయేశుఁ డటంచు నెంచెదన్. శ్రీ. కృ. భా. 318
ఉ. నన్నును గౌఁగిలించుకొని నాపదనంబునకున్ నిజాస్య మా
సన్నముఁ జేసి యొక్కమృదుశబ్దము సేసె మనోహరంబుగా
నెన్నఁడు నట్టిశబ్దము మునీశ్వర మున్ విని యే నెఱుంగ న
య్యన్నప్రబ్రహ్మచారిముఖమంబురుహంబునమంబు నూడఁగన్, నన్నయారణ్యపర్వము.



ఉ. ఎల్లిద మైరి నీ కిటు మహీదివిజోత్తము లేమి సెప్పవా
రెల్ల దవానలంబునకు నెత్తయి లోకము లెల్ల నేర్తు రో
పల్లవపాణి యింద్రుఁడును వారికి మ్రొక్కుచునుండు నెప్పుడో
చెల్ల మనుష్యులం దడవఁ జెల్లునె తెల్ల మెఱుంగ వింతయున్. శ్రీ. కృ. భా. 332 పుట.
ఉ. నీమగఁ డింతయొక్కువ మనీషులు భూసురు లంతతక్కువే
కోమలి యేల యిట్లు గడుఁగ్రొవ్వునఁ గావవు లోకవంద్యులన్
భూమిసురేంద్రులన్ దివిజపుంగవుఁ డాదిగ భక్తిఁ గొల్చు నో
నేమిటి కొక్కువారు గడు నెల్లిద మైరిటు నీకు విచ్చటన్. ఎఱ్ఱాప్రగ్గడ భారతము.
చ. ప్రజల నజస్రమున్ మనుచు వైన్యునిఁ జెప్పెడు నృపతుల్ మే
విజయమునొందెఁ గా దనుచు వీడ్వడఁ గౌశికువత్తు మాడె నే
వృజినము లంటనీక పృథివిం దగ నేలెడు రాజచంద్రుఁడే
నిజముగ ధాతయున్ భువనసేవకుఁ డింద్రుఁడు శుక్రుఁ డారయన్. శ్రీ. కృ. భా. 278
ఉ. ఆత్రి నిజంబు పల్కెఁ దగు వాతనివాక్యము ధర్మయుక్త మీ
ధాత్రి సమస్తమున్ బృహదుదగ్రభుజాగ్రమునందుఁ దాల్చున
క్షత్త్రియుఁ డెల్లవారలను గావను బ్రోవఁ బ్రభుండు గావునన్
శత్రువిషూదనుం డతఁడె శక్రుఁడు నీశ్వరుఁడున్ విధాతయున్. ఎఱ్ఱాప్రగడభారతము.

ఇక్కవిరాజు చక్కనిజాతీయములు లోకోక్తులును జొప్పించి పద్యము లొప్పుగా నల్లనేర్పు గలవారు. వీరికవిత్వమందు సంస్కృతాంధ్రములు రెండును సమత్వముం బొంది యుండు నని నాగపూడికుప్పుసామయ్య బి. యే. గా రాదిపర్వపీఠికయందు వ్రాసి యున్నారు. కాని సంస్కృతమునకన్న నాంధ్రమే మిన్న యై యుండు నని నాయభిప్రాయము. ఏది యెక్కువతక్కువలు పొందియున్నను గవిత్వము మిక్కిలిరసవత్తర మై యుండు ననుటకు సందియము లేదు.

శృంగారరసము.

చ. సరగున లేచి యాకవము సందిటఁ జేర్చెడు మోవిపానకం
బరయఁగ మోముఁ ద్రిప్పెడు ప్రియంబున నేమియొ పల్కరించెడున్
సురుఁగఁగ జూచెడుం గినిసి సోలెడు వ్రాలెడు నవ్వెడుం గడున్
విరహము నొందెడుం దెలివి వీడి యతండు దురంతచింత మై.

వీరరసము.

ఉ. ఒండొరు ముష్టిఘాతముల నుద్ధతి నూపుమ బాహుయుద్ధముం
గొండొకయింత సేసి కడుఁ గ్రుద్ధులు సత్వసమృద్ధు లై మహో
ద్దండపరాక్రమంబునను ధారుణి గ్రక్కదలంగ మెట్టుచుం
గొండయుఁ గొండయుం బలెను గూడుచు వీడుచుఁ బోరి రార్చుచున్.

కరుణరసము.

సీ. నినుఁ గాక వే ఱొక్కనెలఁతఁ బ్రేమింప నన్, పలుకు సత్యము సేయఁ దలఁపు మీకు!
చిక్కి వివర్ణ మై పొక్కుచుం బిలిచినఁ, బలుక వేటికి నాఱు వలలికాత్మ

యీాధవాధుని విడి యున్నకరణివోలె, వగచువన్నెల వోవనుమతీశ!
యీాఘోరవనములో నెందును వెదకియుఁ, జూడలే నైతి నిన్ను సుందరాంగ!
తే. వనులఁ బడిపోయె నైవధావనివిభుండు, వానిఁ గనుఁగొంటిరే యని వేని నడుగ
వేఁడు గనుఁగొంటి నని నాకు వేడ్కమీాఱ, మా ర్వలుకనుండునో యిట మానవేంద్ర.

పుట. 105



రౌద్రరసము.

స్ర. క్రుద్ధుం డై యిట్లు రక్షఃకులధరపవిరై ఘోరనారాచసారో
ద్బుద్ధుం డై యిద్ధశక్తిన్ బరఁగుదశముఖభ్రాత నీక్షించి రోషా
విద్ధాత్ముం డై ప్రహస్తాభిహితవిబుధవిద్వేషి దూషించి స్పర్ధన్
యుద్ధోర్విన్నిల్చి వెల్చక్ హుతవహుఁ డన నుజ్జృంభత లూగించె వాఁకన్. పుట 482

ఇట్లే యెల్లరసంబులు నిందు నెఱుంగం దగు

మఱియు మనకవిగారికి శబ్దాలంకారమునకన్న నర్థాలంకారమే ప్రియము. అం దుపమాద్యలంకారములందుకన్న స్వభావోక్త్యలంకారమందే మిక్కిలి ప్రియం బని తోఁచెడిని.

స్వభావోక్తి.

సీ. నాబిడ్డ రా యని వాతియొక్కతె వాని, నూఱడించుచుఁ బోయె నుగ్గుఁబాలు
నాతండ్రి రా యని నవలాయొకర్తుక, లలిమిాఱఁ దల రాసి లాలవోయు
నాయన్న రా యని నలినాక్షి యొకతుక,చిబుకంబు పుడుకుచుఁ జిచ్చిగొట్టు
నాయబ్బ రా యని ననఁబోఁడియొర్తుక, బోలలువాడు సుయ్యాలలూచి
తే. లేక లే కైననాని వాలేమలెల్లఁ, దొడరి తమతమకన్నపుత్రుండు గాఁగ
నెదఁ దలంచి పృథగ్భావ మింత లేక, పెంచి రచ్చెరువడ జనుల్ వెరిమ దోఁప.

పుట 198

సీ. నీలిచేలికలు పట్టీలుగ్గా వేసి కుట్టినబొంత మొలచుట్టుఁ దనరఁ జుట్టి
మోచేతులనుదాకఁ బోలు వగునడ్డాల,రవరని గులడొల్లరవికఁ దొడిగి
నులివెట్టు నెమిలికన్నులనెఱుల్ నవరాలు, మెడలపైఁ బడ జారుముడిని వైచి
కాళ్లఁ జేతుల గల్లు గల్లు మంచును మోయు, నిత్తడినగలెన్నియేని బెట్టి
తే. పూవపేరులు మెడనిండఁ బొందు పఱిచి, గవ్వపుర్రుత్రాడు నిలువెల్లఁ గలయఁ జుట్టి
లీలమైఁ గేల నొకకుంచెఁ గ్రాలఁ బట్టి, చలిమలకుమారి యెఱుకల సాని యయ్యె.

పుట. 64



ఉపమ.

శా. శ్వేతచ్ఛత్రపతాకచామరములం జెన్నొంది మిన్నంది ను
స్ఫీతం బై వసుధా ర్తరాష్ట్రనిముఖానేనాసమూహంబు వి
ద్యోతించెన్ శరదాగమంబున సముద్భూతప్రభం బొల్చి ని
ర్యాతం బై విడి కూడు మేఘసమితిం గ్రాల్చెన్నంగిచందంబునన్.

పుట. 413



ఉత్ప్రేక్ష.

ఉ. పారవవక్త్రనేత్రలు నిజప్రమదావనసౌధవీథులం
జేరి మనోరథంబులను జెల్వమునిమాఱఁగఁ దీర భారలై
శారదపూర్ణిమానిశల సారెకు వెన్నెలవర్తులాడుచున్
మారునిదీములో యనఁ గవం దగి రందము చంద మేర్పడన్. పుట. 289

ఇట్లే నానావిధాలంకారము లిందు మనము తెలిసికొనవచ్చును. మనభారతగ్రంథ కర్తగారికి శ్లేషయమకచిత్రాదులయం దంతప్రియము లేకున్న నిందు నందు నందు నవియుం జొన్పియే యున్నారు.

శ్లేషను.

సీ. సత్సంతతుల నిల్పు వైవాత్మకుఁడు సర్వ,చక్రంబులను నేలు సత్ప్రభుండు
దోషాకరుఁడు గాని యోషధీశుం డెప్డు, పన్నిగింపనికళాశస్తమూర్తి
యకలంకుఁ డైనమహావిధుం డెందు ని,శాటత్వ మొందని యత్రిరాజు
గురుగద మొందని కువలయమిత్రుండు, విషరాశిఁ బొడమని విశదకీర్తి
తే. యతఁ డనఁ బిత్రుపైతామహా మైనరాజ్య
మును దమమువోవఁ బాలించుచును ధరిత్రి
నఖిలధర్మపరాయణుఁ డగుచు నైష
ధావనీనాథచంద్రుండు దేవమిాఱు.

పుట 87

యమకము.

మ. కనిరెం గేకయనందినీసుతుఁ డటం గాకుత్స్థవంశాబ్ధిసో
ముని సీతాహృదయాభిరాముని దయాపూర్ణేద్ధవార్ధాముని
మునిలోకస్తుతనాముని త్రిభువనప్రోద్యద్యశఃకాముని
ఘనదేవారివిరాముని న్సజలమేఘశ్యాముని రాముని. పుట 454

మ. ఘనిచెన్ మంతుని బుద్ధిమంతుని జగద్వర్ణ్యప్రభావంతునిన్
మునిలోకాదృతశాంతుని త్రిభువనప్రోద్యద్యశఃకాంతునిన్
ఘనవృత్తాంతుని దాంతునిన్ మజనవత్ప్వాంతునిన్ శౌర్యవం
తుని వక్రాంతుని ధైర్యవిద్ధహిమవంతున్ శ్రీహనూమంతునిన్. పుట 465

మఱియు నిక్కవిరాజుకవిత్వంబునందు లోఁగడఁ జెప్పినసర్వవిషయంబులు ఋజువు చేయుచు నీయారణ్యపర్వమునుండి కొన్నివర్ణనాంశముల నుదాహరించి విరమించు చున్నాను.

వనవర్ణనము.

చ. మెలిగొని యొం డొకం డొరయ మిక్కిలిచిక్కగ నున్నమావితోఁ
పుల నలవోక మొత్తముగఁ బుల్గులుఁ గూయఁగఁ బూవుఁదేనియల్
జలజల రాలి నేలపయి జాల్కొన నెమ్మలి చూచి శారువు
బ్బు లుఱుముచుం గడుం గుకియుఁ బో యిపు డత్తటము నాడు నెత్తటిన్. పుట 42

శైలవర్ణనము.

మ. నిరతం బీగహనాంతరంబునను వర్ణింపంగ నొప్పుం దృణాం
కురముల్ మేయుచు నీళ్లఁ ద్రావుచు మెడల్ కొంచెంబు గాఁ గుంచి గ

వ్రాలఁగ నాడుచు నింతవింతవిహంగ ◆ బట్లంతరిక్షంబునన్
బరుగు లిడుచు గుంపులై హరిణముల్ ◆ భావింప సాధుస్థితిన్. పుట 42

మ. బెదరన్ జెవ్వడిఁ జాలుఁ జేరఁ గడలం ◆ బిట్టాడు మట్టాడు పెం
పొదలం దారయుఁ దృణంబు మేయు దివిపైఁ ◆ బొల్చున్ భువి న్నిల్చి లో
నొదుగుం బై కెదుగున్ మనోహరముగా ◆ నూగాడు దోగాడు నూ
ర్చుఁ దగం జేర్చుఁ గనున్ వినున్ ముదము వెంపంచు న్నించు విద్వేషమున్. పుట 458

—◆ ముసలివానివర్ణనము. ◆—

సీ. పల్లవారుణజటాపటలంబు పలితమై, యల్లుపూగుత్తులరీతిఁ దలప
ముదుతముడ్తల్ వడు మోముపై వెన్నెలల్, పెదఁజల్లి కనుఱెప్ప ◆ లదరుచుండ
నిట్టనీల్గెడుకాళ్ళు ◆ వట్టును గూఁడు నా, వంగినవడుము వీపు ల్బంగి క్రేల
మెదుకవాపన గొట్టి ◆ మెలికలుగొనుజన్నిదము లక్షమాలలఁ ◆ దగులుకొనఁగ

తే. వడిఁగ పదపదలాడెడిబడుగుటొడలి, నిలువఁ బెట్టఁగ నన దండ ◆ మలరఁ జేతఁ
బడుచు లేచుచు నొకవృద్ధబాడబుండు, వచ్చె నొకచెట్టుదరినుండి ◆ వడఁకికొనుచు. పుట 60

రథగమనవర్ణనము.

మ. దవులం బ్రక్కలఁ బొల్చువస్తువులు చెంతం బ్రక్కలం బొల్చువ
స్తువులున్ ముందుకు వెన్కకుం జలములం ◆ దొర్లాడి రాఁ బోఁ గనుం
గవకున్ దోఁపఁగ ముందు చూచినను వెన్కం జూడ సాధ్యంబుగా
కవిరా నా నరదంబు వాలె నొగి నానారణ్యముల్ దాఁటుచున్. పుట 121

భార్యను భర్త విడిపోవుట

ఉ. విడివడి కొంతదవ్వు చని ◆ వెండియు వచ్చి సభాస్థలంబునన్
మసఁతిని జూచి దుఃఖమున ◆ మానతి యొండొ యొకింతసేపుపై
బడలియు వెండి వచ్చియును ◆ వీఁగుమనం బది రెండుపాయలై
నడన నరేంద్రుఁ డుయ్యెలల యట్లనం దలపోయఁగ నయ్యో నయ్యెడన్. పుట 103

సముద్రవర్ణనము.

ఉ. సురపుల నవ్వునట్లు లలి ◆ నూల్కొనుగాలి జలించునట్లు పెం
దరగల నాడునట్లు పతంగస్వనసంగతిఁ బాడునట్లుఁ గం
దరముల భూధరంబులను ◆ దద్దయుఁ ద్రొక్కిలునట్లుఁ బొల్చుపు
ష్కరనిధి యొద్దకుం జనె నగస్త్యమునీంద్రుఁడు నేంద్రముఖ్యులై. పుట 164

గంగావతరణవర్ణనము.

సీ. చలలితకలహంసకలనాదమంజీర, రవకలితమహోన్నతరవగతియు
విమలపారదపూరవిశదఫేనోత్కర, వరశోత్తరదుకూలపసనధృతియు
పతితశరన్మేఘపంక్తిపాండిమభ్రాజ, మానమీనేక్షణముహితరుచియుఁ
బవనవేగోత్పలద్భంగచరంచరా, నికలసద్రవవచోనిభృతరుచియుఁ

తే. గలిగి నురుగుల నవ్వుచు ◆ లలిఁ గరళ్ళ, నాడుచును నుర్లఁ బాడుచు ◆ వేడుకలను
సాగనుత్తియ తెలుఁగువఁ ◆ జూడనొప్పె, డిగిరు నేలకు విబుధాక ◆ వగడు తేర. 171



వర్షవర్ణనము.

చ. పటుతరవజ్రజముల్ పడెడుభంగి నభంగురనిస్వనంబు నం
జిటచిటశబ్దముం గలుగఁ ◆ జిన్కులు నుమ్మలు మెర్పులు న్మహో
త్కటగతితోడ సాంద్రశరకంబులతో నురుధార లొప్పఁ బ్ర
స్ఫుటముగఁ బెద్దవృష్టి పడె ◆ బోరనఁ గుండలఁ బోయునట్లుగన్. పుట 218

వర్షర్తువర్ణనము.

మ. జలదధ్వానము మర్దలధ్వనులు గా ◆ శంపాలతల్ సుగ్గులూ
జ్జ్వలకీలమ్ములు గాఁ బ్రవర్షరతి భాస్వద్వాద్యజాలమ్ము గా
నలిఝిల్లీకులనాద మున్నతగతిన్ ◆ వ్యాపించుగీతమ్ము గా
నలిపెన్ నృత్యము కేకిలోక మెప్పుడున్ ◆ షడ్జంబునం బాడుచున్. పుట 287

మేఘవర్ణనము.

సీ. మెఱుపుదీఁగలతోడ ◆ మెలఁగుచు మదపుటేనుఁగులఁ బోలి నల్లనై ◆ కొన్ని కొన్ని
వనముపన కెనవచ్చి ◆ పచ్చనై హెచ్చి పింఛగులసమద్రభ నొప్పి ◆ కొన్ని కొన్ని
నగరవరంబులో ◆ నడగొండలో నాఁగ, ఘోరరూపము లయి ◆ కొన్ని కొన్ని
చిద్రుపలై విడి కూడి ◆ చిక్కనైయు క్కెక్కి, కూటువల్ గట్టనై ◆ కొన్ని కొన్ని

తే. చిమ్మచీకట్లు గ్రమ్మిన ◆ ట్లుమ్మలించి, ఘోరనిస్వనమున దెసల్ ◆ బూరటిల్ల
నాకసం బెల్లఁ గ్రిక్కిఱియంగ నగుచుఁ, గురిసె ధారాధరంబులు ◆ కుంభవృష్టి. పుట 288

మాధుర్యాదిగుణములు.

చ. అలసి వనంబున న్నిదుర నందినదాని పరాభవాదముం
దలఁపనిదాని సాధ్వి యగుదాని ప్రజాపతి యైనదాని నే
కలఁతకుఁ గానిదానిఁ గులకాంత నయో నలుఁ బోలి వీడిపోఁ
గలిగినవాని నొక్కరునిఁ ◆ గంటి వొకో యొటనేని బాహుకా. పుట 126

ఉ. క్రొత్తడి నేని నేఁ దపముఁ ◆ గొంత సొనర్చినదాననేని నా
చిత్తము పత్యనుర్గమునఁ ◆ జెన్నలరారెడునేని దానమున్
మెత్తునయేని వేలిమికి ◆ నిచ్చలుఁ జొత్తునయేని నేఁడు మా
యత్తకు మామకున్ విభున ◆ కార్తి సొసంగకయుండుఁ గావుతన్. పుట 516

ఇట్లే సర్వవిషయములు నిందుఁ బొందుపఱుపఁబడియుండెం గావునఁ జూచుకొనం దగు. “కాళిదాసమయూరాదికవుల కైనఁ గలవుతప్పులు” అని చెప్పుటచే నిం దెందే నొక యింతతప్పు చూపట్టినఁ జూపట్టుఁగాక. అది “ఏకో హి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీం దోః కిరణే ష్వివాంకః” అని కాళిదాసమహాకవి చెప్పినట్లు మహాగుణగణసమంచితంబై యమృతరసపూర మగుశ్రీశాస్త్రిగారిసరసకవితాప్రవాహమందుఁ బ్రదరేణువై యడంగి పరిగణింపఁ బడకుండునుగాక యని తలంచుచు మనగ్రంథకర్తగారిట్లే భారతమంత

యుం దెలిఁగించి జగదుపకారముఁ గావించి శాశ్వతకీర్తిం బడయుదురుగాక యని కోరుచు నిట్టిమహాప్రయత్నంబునకుం దొడంగిన వారి కాయురారోగ్యాదు లొసంగిరక్షించుఁ గాక యని పరమేశ్వరునిఁ బ్రార్థించుచు నింతటితో విరమించుచున్నాఁడ.

మ. చరితశబ్దమ్ములరసస్ఫురితముగా భావించి భావార్థముల్
స్తుతిపాత్రంబుగఁ జేసి భానురమతిన్ శోధించి మూలార్థముల్
శ్రుతిపేయామృతసారమో యన రుచుల్ చొప్పించి శ్రీకృష్ణభా
రతముం గూర్చినకృష్ణమూర్తికవిమూర్ధన్యుం బ్రశంసించెదన్.

సంపన్మడుంబ సింగరాచార్యులు.
శతావధాని.



# విషయసూచిక.

అ ష్ట మా శ్వా స ము .







న వ మా శ్వా స ము .

దశమాశ్వాసము.



ఏకాదశాశ్వాసము.







బాలాత్రిపురసుందర్యై నమః

# శ్రీకృష్ణభారతము

ఆరణ్యపర్వము—ప్రథమాశ్వాసము.



*తత్త్వప్రతిపాదక
భూతాత్ముం డగుచు భువనంబుల బహిరంత
ర్వ్యాప్తుఁ డయి పూర్ణుఁ డయి తగు
జ్యోతిర్మూర్తిని భజించి జోడిల్లెదను. 1

ఆరణ్యకపర్వము.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు పాండవులు వనవాసంబునకుం జని రని చెప్పిన విని జనమేజయుండు వైశంపాయనుం జూచి యిట్లనియె. 2

మ. పురుహూతప్రతిమానవైభవమునం బొల్పొందునప్పాండుభూ
వరపుత్త్రుల్ సిరి దూలఁ గాఱడవి నావాసంబు గావింపఁ బో
యిరి నాఁ జెప్పఁగ వింటి నప్పుడట వారేరీతిఁ బండ్రెండువ
త్సరముల్ దాఁటఁగఁ జాలిరో తెలుపు తత్సర్వం బఖర్వంబుగన్. 3

వ. అనిన వైశంపాయనుం డిట్లనియె నట్లు ధార్తరాష్ట్రులచే గరిపురంబునుండి వెడలింపంబడిన పాండవులు పత్నీసహితులై పురద్వారంబు దాఁటి యుత్తరాభిముఖులై చనుచుండి రప్పుడు. 4

తే. †ధౌమ్యముఖ్యులతో నట్లు తరలువారి
ననుసరించిరి యింద్రసేనాదిభృత్య

---

* జోహరు = నమస్కారములు.

† శ్లో. ఇంద్రసేనాదయశ్చైవ భృత్యాః పరిచతుర్దశ । రథైరనుయయుః శీఘ్రైః స్త్రియ ఆదాయ సర్వశః.

ఇట్లు మూలము. «ఇంద్రసేనాదు లయిన మూలభృత్యులు పదునాలుగురు రథంబులతోడ సుభద్రాభిమన్యుప్రతివింధ్యాదులం దోడ్కొని వారివెనుకొన యరిగిరి” అని నన్నయభారతము. ఇది చింత్యము.

† పరులు పదునాల్గురథములు ♦ సరవిఁ గొనుచు
ద్విరదగమనలు కొందఱు ♦ వెంట రాఁగ. 5

పౌరులు పాండవులవనవాసంబునకు దురపిల్లుట.

క. ‡అటు చనియెడుపార్థుల విని, కటకమునం గలుగుప్రజలు ♦ కడుఁ జింతిలుచున్
దిట చెడి భీష్మాదులపైఁ, గటకటఁబడి పలికి రొండొకం డిట్లు వగన్. 6

చ. అకటకటా! ఖలుం డనఁగ ♦ నైనసుయోధనుఁ డేది కర్ణుఁడున్
శకునియు దుస్ససేనుఁడును ♦ సాయ మొనర్పఁగ రాజ్యమేలుసీ
సుకమును ధర్మముం జెడును ♦ జూడఁగ నేమిటి కింకఁ బోద మిం
డ్లకు నాగి బొమ్మవెట్టి ప్రకటంబుగఁ బాండవు లున్నచోటికిన్. 7

ఆ. నీచుఁ డర్థలుబ్ధుఁ ♦ డాచారహీనుండు, ప్రకృతినిర్ఘృణుండు ♦ పాపవర్తి
దుష్టబుద్ధి యైనదుర్యోధనునిచెంత, మనికికన్నఁ గాన ♦ మనికి మేలు. 8

వ. అని పౌరు లెల్లరునుం దరలి ధర్మాచారపరాయణు లగుధర్మరాజాదులపాలికిం జని ప్రాంజలు లై. 9

ఉ. అంగద బ్రుంగఁ జేసి మము ♦ నందఱ నిం దిడి యొందఁ బోదు రో
మంగళమూర్తులార! మిము ♦ మాప్రభువర్యులఁ బాసి పాశికిన్
లొంగనిదుష్టరాజువలలోఁ బడి వేఁగఁగ లేము మేము మీ
సంగతిఁ గోరి మీకడ కొసంగఁగ వచ్చితి మిచ్చగింపుఁడీ. 10

ఆ. పరులు మి మ్మధర్మపరు లయి గెలిచిరి, నాఁగ విని కలంగి ♦ మీగుణములఁ
దలఁచికొనుచు మిమ్ముఁ ♦ గలయంగ వచ్చితి, మెడప కేలఁ దగుదు ♦ రీరు మమ్ము.

వ. అని మఱియును. 12

ఆ. మంచివారిఁ గూడ ♦ మంచి గుణంబులు, చెడ్డవారిఁ గూడఁ ♦ జెడ్డగుణము
లంటుఁ గాన దుష్టు ♦ నంటఁగఁ బోవక, శిష్టు నంటి యుంట ♦ చెల్లుఁ గాదె. 13

క. నేలయు నీళ్లును నూవులుఁ, జేలములును బూలతోడి చేరికవలనన్
మేలిమియు వలపు నొందెడు,పోలిక సజ్జనులచెల్మిఁ ♦ బొసఁగు సుగుణముల్. 14

ఆ. ఖలసమాగమంబువలనఁ గీ డగుఁ గాన, శమపరాయణుండు ♦ జనుఁడు సుస్వ
భావుఁ డైనవానిపజ్జ వసించి మే, లందు విగతపాపుఁ ♦ డగుచు నెందు. 15

ఆ. పుణ్యశీలు రైనపురుషులకడ నిరా,రంభుఁ డైనజనుఁడు ♦ ప్రబలి పుణ్య
భాజి యగుచు నలరుఁ ♦ బాపసమాగమం,బునను బాపి యగుచుఁ ♦ బొడవడంగు.

† పదవి = క్రమము. ‡ కటకము = రాజధాని.



క. జననమున విద్యఁ గర్మమునను నెవ్వరు విమలు లగుదు ♦ రలుఘొందుదురో
ఘను లగువారలసేవన్, జనుఁ డిహమునఁ బరమునందు ♦ సౌఖ్యము లందున్. 17

మ. ఖలులం జూచినఁ దాఁకినం బలికినం ♦ గాంక్షించిన న్నవ్వినన్
గలపుణ్యంబు నశించుఁ బాప మెదు రై ♦ కన్పట్టు ధర్మంబులున్
దొలఁగం బాఱు సుబుద్ధియుం జెడు సిరుల్ ♦ దూరం బగున్ దూఱు మి
క్కిలి యై భ్రష్టుఁ డగున్ జనుండు జడుఁ డై ♦ క్షీణించి క్షోణిస్థలిన్. 18

* ఉత్తమము లంచు లోకమం ♦ దొప్పుచున్న
గుణము లన్నియు మీయందుఁ ♦ గూడి యుంట
నుత్తమోత్తములరు మీర ♦ లుండ నెంచి
వచ్చినారము మీయొద్ద ♦ నిచ్చఁ జేసి. 19

ధర్మరాజు తమ్మనుసరించినపౌరులఁ గ్రమ్మరించుట.

వ. అని వినయంబు దోఁపఁ బలుకువారి నెల్ల నాదరించుచు నజాతశత్రుం డి ట్లనియె. 20

ఉ. లేనిగుణంబులం బలికి ♦ లేవడి నుండినమమ్ము మీర లెం
తేనియుఁ బెద్ద చేసి యిటు ♦ లెంచి నుతించితి రేము మీదయం
గానఁగ నౌట ధన్యులము ♦ కాని మిముల్ దగ వేఁడుచుంటి మీ
రీనెఱకాన నుండు మని ♦ యెంచకుఁడీ మముఁ బ్రోవ నెంచినన్. 21

ఉ. శాంతనవుండుఁ దండ్రియును ♦ క్షత్తయు మిత్రులుఁ గన్నతల్లియున్
దంతిపురంబునం గలరు ♦ తత్పరు లై దయచేసి మీరలున్
సంతత మంద యుండఁ దగు ♦ సారెకు వారలచింతఁ దీర్పుచున్
స్వాంతమునందు దీనఁ గడు ♦ సంతసమందెద మిట్లు చేసినన్. 22

వ. అని వారిం గ్రమ్మఱించుటయు వారునుం జేయునది లేక శోకించుచు నట్టకే మగిడి రంతఁ బాండవేయులును రథంబులతోఁ గదలి తద్దివసశేషంబున గంగాతీరంబునకుం జని యట నొక్కచోఁ బ్రమాణాఖ్యవటంబుకడ విశ్రమించి స్నానసంధ్యాద్యనుష్ఠానంబులు దీర్చికొని జలపానంబునంజేసి యారాత్రి గడవ నీదుచుండి రప్పుడు. 23

ఉ. కొందఱు విప్రవర్యు లటకుం జనుదెంచిరి సాగ్నిహోత్రు లై
పొం దెడఁబాయలేమి నృపపుంగవులం గడుఁ మెచ్చి శిష్యులున్
బందుగులున్ సహాయులును ♦ బత్నులుఁ గొల్వఁగ బ్రహ్మఘోషముల్
పొందుగ నల్లెడ న్వరిసి ♦ మోఁదియ నజ్రము శ్రోత్రపేయ మై. 24

వ. ఇ ట్లనుసరించి వచ్చినబ్రాహ్మణు లెల్ల హంసమధురస్వరంబుల యుధిష్ఠిరాదుల నాశ్వాసించుచు నారేయిం గడపి రంతఁ బ్రభాతంబునం గాల్యకరణీయంబులు నిర్వ

ర్తించి తమకన్న మున్న వనాంతరంబులకుం బోవఁ బయనం బై యున్నవారిం జూచి పాండవాగ్రజుం డి ట్లనియె. 25

మ.*హృతసర్వస్వుల మై ప్రభుత్వము చెడన్ ♦ హీనాతిహీనస్థితిన్
సతతంబున్ ఫలమూలముల్ మెసవుచున్ ♦ బల్పాములుం దేళ్లునున్
మితి లే కల్లెడ నిండ భీమ మగుని♦మ్మృత్యూపమారణ్యమం
దతివిక్లేశము నొందుమాకడను మీ ♦ కాయాసమై యొప్పదే. 26

క. విప్రులకుఁ బరిక్లేశము, విప్రియ మై సురల కైన ♦ వెత గలిగించున్
విప్రవరులార నాకు న,పప్రథ గాకుండ మగుడ♦వలయు న్మీరల్. 27

వ. అనిన విప్రు లి ట్లనిరి. 28

శా. మమ్మున్ భక్తుల వీడి పొమ్మనుట ధ♦ర్మంబే మహీవల్లభా
నెమ్మిం జూతురు భక్తులందు ద్విజుల ♦ స్వల్పం బ్గకుం భక్తి నీ
విమ్మాడ్కి న్వచియింప రా దనుచు భూ♦మీశుం డను న్నాదుచి
త్త మ్మెప్డున్ భయభక్తియుక్తులను సం♦ధానించెడిన్ విప్రులన్. 29

తే. ఆకు లలములు మెసవుచు ♦ నడవులందు, వనితయును భ్రాతలును నేను ♦వగచుచుండి
మీకు నలజడి గలిగింప♦లేక యిట్లు, పలుకుచుంటిని క్షమియింప♦వలయు నన్ను. 30

వ. అని వినయంబునం బలుకుచున్న ధర్మరాజుం జూచి బ్రాహ్మణులు వెండియును. 31

మ.†మము పోషింపఁగఁ జింత నీమనమున ♦ న్మానం దగు న్మేము మా
సముదాయంబున కై సభోజ్యమును ని♦చ్చన్ నిచ్చలుం దెచ్చుకొం
దుము మీ కెప్డును మంగళంబుగ సను♦ధ్యానంబు గావించుచుం
దు మెదన్ రమ్యకథల్ వినోద మొదవన్ ♦ దోడ్తోడ వాక్రుచ్చుచున్. 32

తే. అనుడు ధర్మజుఁ డిది యిట్టి ♦ దగును సందియము మిసుమంతయు లేదు మీ♦యంతవారి
తో వినోదింప నాకు సం♦తోష మైన, వనుల శ్రమపడుమిము జూచి ♦ మనఁగ లేను.

వ. అని బెట్టు నిట్టూర్చుచు నేలపైఁ గూలఁబడినవాని నూరార్చుచు నధ్యాత్మరతుం డును యోగసాంఖ్యకుశలుండు నగుశౌనకుం డనుద్విజుం డి ట్లనియె. 34

—— శౌనకుఁడు ధర్మజునకు ధర్మోపదేశము సేయుట. ——

క. భయశోకశతసహస్రము, లయమా మూఢునకు ననిశ ♦ మగుఁ గాని యతీం
ద్రియుఁ డగుపండితున కగునె, నయవిదుఁడవు నీకు నే మ♦నం గల రెవరున్. 35

* పాముంతేళ్లును = "బహువ్యాళసరీసృపం" అని మూలము.

† పోషించుట = సముపోహము.



తే. దోషములు చుట్టి శ్రేయముల్ ♦ దొలఁగఁ బెట్టి, జ్ఞాన మరికట్టి చెట్టలై ♦ కానఁబడెడు
కూరకర్మములను దగు♦ల్కొనఁగఁబోరు, బుద్ధిమంతు లై యున్నమీ♦బోటివారు.

క. తనవారికిఁ దన కాపద,లను జుట్టెడునట్టిపట్టు♦లన్ దుర్గములన్
ధనకృచ్ఛ్రములం దెలిసిన,జను లింతయు వగవ రెపుడు ♦ స్వాంతమునందున్. 37

వ. దుఃఖంబులు మనోదేహసముద్భవంబు లై జగత్త్రయంబును మర్దించుచుండె నట్టివానిం దొల్లి మహాత్ముం డగుజనకుం డాత్మతత్త్వావబోధకంబు లగుగీతార్థంబుల నెఱింగి తత్ప్రశమనోపాయంబు గావించుకొనియె సన్మార్గం బెఱింగించెద నాకర్ణింపుము. 38

తే. వ్యాధివలన ననిష్టసం♦స్పర్శమునను, శ్రమమువలన నిష్టవివర్జ♦నమున నాల్గు
గతుల శారీరదుఃఖముల్ ♦గలుగుఁ దత్ప్ర,శమనమును మున్న చేయంగ♦జను జనులకు.

క. ప్రతికారమ్మువలన సం,తత మవిచింతనమువలనఁ ♦ దగి వైద్యం డై
మతిమంతుఁడు తనదేహ,గతదుఃఖము లెల్లఁ దఱిగి ♦ క్రాలఁగ వలయున్. 40

శా.తప్తాయోమయపిండ మెట్లు ఘటసం♦స్థం బైననీరంబు ను
ష్ణాప్తిం దద్దఱిలంగఁ జేయునొ మనో♦వ్యాప్తాతిదుఃఖంబు దా
దృప్తం బై తను వట్లు గాల్చెడిఁ బ్రశాం♦తిం బూని దానిన్ సము
ద్దీప జ్జ్ఞానమున న్నశించుపగిదిన్ ♦ ధీరుం డొనర్పం దగున్. 41

ఉ. స్నేహ మనర్థమూల మగు ♦ స్నేహమునన్ భయశోకహర్షముల్
దేహికిఁ బుట్టి రాగమును ♦ ద్వేషమునుం బొదలింపఁ జేసి హృ
ద్దాహము గూర్చుఁ గాన సత♦తంబు జనుం డెడఁద న్విరాగి యై
స్నేహము సేయ కుండఁ దగు ♦ నెయ్యెరపట్ల ధనంబుపట్లనున్. 42

ఆ. జ్ఞాని లోకమందు ♦ సంసారమునయందు, మెలఁగుచుండి దాని♦వలన రాగ
మెడఁద గలుగ నీక ♦ యెసక మెసంగెను, వారి నున్నపద్మ♦పత్రమట్లు. 43

తే. రాగమునఁ గామ మగు దానఁ ♦ బ్రబలుఁ దృష్ణ,తృష్ణ జీర్ణింప దొడలు జీ♦ర్ణించెనేని
దృష్ణ ప్రాణాంతకామయం♦బింత తెలిసి,దానిఁ ద్యజియింప సుఖ మగు♦మానవులకు.

తే. ప్రాణికోట్లకు మృత్యుభ♦యంబువోలె, ధనికి రాజాగ్నిజలచోర♦జనభయంబు
గలిగి యుండును సతతంబుఁ ♦ గాన నభయ, మాసచేసినగుణికి ధ♦నాశ తగదు.

ఉ. అర్థ మనర్థహేతు వగు♦ నర్థమున న్మదసాధ్వసంబు లా
నర్థము లోభమోహముల ♦ కాస్పద మర్థము దుఃఖదాయకం
బర్థము శ్రేయముం దొలఁచు ♦ నర్థము పాపవివర్ధనంబు ధ
ర్మార్థహరంబు దానిని మ♦హాత్ములు మెచ్చఁగ నిచ్చగింతురే. 46

క. గడనన్ దుఃఖము మనువునఁ, గడుదుఃఖము నాశనమున ♦ ఘనతరదుఃఖం
బిసు నర్థ మనర్థకరం, బెడఁద నపేక్షింపవలవ ♦ దేరికి నైనన్. 47

సీ. ధరణిఁ బిపాస కంతము లేదు పరమసుఖంబు సంతోషంబు ♦ గాన నెవుడు
పండితుల్ సంతోషభరితు లై తనరారుచుండెద రేవెత ♦ లొందఁబోక
యస్థిరంబులు రూపయౌవనజీవిత్తైశ్వర్యాదు లట నిచ్చవడరు ఘనులు
వారి కాహేతువువలనఁ దల్లేశంబు, లేవియుఁ దగులంగఁ ♦ బోవు వినుము

తే, ధనము ధర్మార్థమున కని ♦ దానిఁ గూర్ప, నిచ్చగింతురు కొందఱుహృదయమందు
నాఫలముకన్నఁ గ్లేశంబ ♦ యధిక మకట, యమును త్రొక్కంగనేల కాల్ ♦ గడుగనేల.

తే. విను యుధిష్ఠిర నీ వెందు ♦ మనము సేయ, కెవుడు ధర్మంబునం దుండ ♦ నెంతువేని
ధనమునుండి విముక్తిచ్చఁ ♦ దగిలి యుండు, మనుచు వానికి ధర్మజుం ♦ డనియె నిట్లు.

—♦♦— ధర్మరా జతిథిపూజ పరమధర్మం బని నిర్ణయించుట. —♦♦—

తే. అరయ నాత్మోపభోగార్థ ♦ మర్థ మేను, లోభమునఁ జేసి వాంఛింప ♦ లోకవంద్య
విప్రభరణార్థ మాశింతు ♦ విత్త మకట, విప్రవిక్లేశ మాత్మకు ♦ వెతకుఁ గాదె. 50

క. ననుఁ బోలినగృహమేధుల, కనుయాయులఁ బ్రోచి మనుచు ♦ టది విహితము గా
వున నిపుడు నన్నుఁ గూడిన, మనుజులఁ బూజింప కెట్లు ♦ మనియెదఁ జెపుమా. 51

తే. ప్రియవచనములఁ దగ నాదరించి తృణము, భూమి యుదకం బాకిం తిడి ♦ పూజసేయ
వలయుఁ బ్రేమించి తనయింటవచ్చినట్టి, యతిథులకు లేదు నాక గృహస్థుఁ డెవుడు.

చ. తనయిలు సేరునర్థిఁ గని ♦ దవ్వులఁ దా నెదు రేగి తెచ్చి న
మ్మనమును దృష్టి వాకును సమంచితబుద్ధి నొసంగి యార్తుఁ డై
నను శయనంబు శ్రాంతుఁ డయినన్ సుఖదాసనముల్ బిపాసు వై
నను జలముల్ క్షుధార్తుఁ డయిన న్వరభోజన మీయఁగాఁ దగున్. 53

తే. అగ్నిహోత్ర మనడ్వాహ ♦ మతిథి జ్ఞాతి, పుత్త్రుఁడుఁ గళత్రమును జుట్ట ♦ మును భటుండు
పూజ సేయకయుండినఁ ♦ బూరుషునకు, నగ్గు సేయఁగ నెంతురు ♦ హృదయమందు. 54

తే. అతిథులకుఁ గాక తనకుఁ గా ♦ నన్నపాక, మొనరుపఁగ రాదు పశువులఁ ♦ దునుమ రాదు
దానఁ బాతక మయ్యెడుఁ ♦ గాన గేస్తు, వారల కిడి తాను మెసవంగ ♦ నొప్పు నెపుడు.

మ. *శ్వపచశ్వానపతత్రిదేవతలకున్ ♦ సాయంబునం బ్రొద్దులన్
నుపరామర్శము గాఁగఁ బెట్టుటయె పొందుల్ వైశ్వదేవంబు నా

* శ్వపచుఁడు = చండాలుఁడు; శ్వానము = కుక్క; పతత్రి = పక్షి.



*విపరీతార్థము లేనినామ మది పృథ్విం జేయుచుం గేస్తు వె
ల్లపుడుం దా విఘసామృతాశి యగుచున్ ♦ లక్షింపఁగా నొప్పెడిన్. 56

తే. అధ్వమున శ్రాంతుఁ డై వచ్చునతిథి నెవుడు, నెఱుఁగకుండినయే నెదు ♦ రేగి తెచ్చి
యర్ఘ్యపాద్యంబు లొసఁగుచు ♦ నన్న మిడిన, వానిపుణ్యఫలంబు సెప్పంగఁ దరమె.

వ. గృహస్థుఁ డై నవాని కతిథిపూజకన్నఁ బరం బైనధర్మంబు లే దనిన శౌనకుం డతని
కిట్లనియె. 58

క. అతిథుల కిడుచున్ విఘసము, మతి సేయుచు మోహరాగమాత్సర్యములన్
స్థితి చెడి విషయాసక్తిన్, క్షితి మెలఁగెడునతఁడు సుగతిఁ ♦ జేరం గలఁడే. 59

క. నరుఁ డింద్రియములచేఁ దన, పరువడి చెడ మూఢుఁ డగుచు ♦ భ్రాంతములై దు
ష్టరతిన్ బడునశ్వములన్, ధరణిన్ సారథి తెలియంగునన్ వధ్యుఁ డగున్. 60

సీ. ఇంద్రియంబులు విషయేచ్ఛఁ బట్టిన మనం, బావిషయంబుల ♦ నంటి యుండు
నద్దాన నౌత్సుక్య ♦ మై ప్రవృత్తి ప్రవర్ధమానమై మిగులఁ గామమునఁ గూర్చు
సంకల్పబీజ మై ♦ చనుకామమునఁ దెల్లి, జనుఁ డగ్నిఁ గాంక్షించి ♦ శలభ మట్టు
లంత నాహారవిహారమోహితుఁ డయి, యెఱుక లేకాత్మఁ దా ♦ నేవగించు

తే, నట్టిమూఢుండు సంసారమందుఁ జిక్కి, విడక చీమలు గోలెను ♦ వివిధయోను
లందుఁ బుట్టి చచ్చుచు నవిద్యావశమునఁ, దృష్ణ గొని చక్ర మట్టులు ♦ తిరుగుచుండు.

తే. బుధుఁడు ధర్మరతుండును ♦ మోక్షరతుఁడు, నై మెలంగుచు ధర్మమార్గానుసారి
యగుచు విషయేచ్ఛఁ దగులక ♦ తగినదారి, నంటి యుండిన సద్గతు ♦ లంది పొందు.

వ. ఇజ్యాధ్యయన దాన తప స్సత్య క్షమా దమా లోభంబు లెనిమిదియు ధర్మం
బులు నాఁబడి పితృయానపథస్థితికి సాధనంబు లగు సమ్యక్సంకల్పేంద్రియనిగ్రహ
వ్రతవిశేష గురుసేవ నాహార యోగాధ్యయ నాగమకర్మోపన్యాసంబు లెనిమిదియు
మోక్షసాధనంబు లై దేవయానస్థితికిఁ గారణంబు లగు వసురుద్రసాధ్యాదిత్యాశ్వ
లేతదష్టాంగయోగంబునం జేసి మహైశ్వర్యసంయుక్తు లైరి నీవును రాగద్వేషవినిర్ము
క్తుండ వై శమంబు నూని తపం బొనరించి యోగసిద్ధి వడసి బ్రాహ్మణోత్తముల భరి
యించి మనోరథంబు నెఱవేర్చుకొమ్మనిన యుధిష్ఠిరుండు భ్రాతృమధ్యగతుండై
పురోహితుం డైనధౌమ్యునిం జూచి యి ట్లనియె. 63

చ. ‡ అడవుల కేగునావెనుక ♦ నాఁగిన మానక బ్రాహ్మణోత్తముల్
వడిరి మహామహుల్ ఘనులు ♦ పండితవర్యులు వీరి నందఱన్

* విఘసము = భుక్తశేషము; అమృతము = యజ్ఞశేషము.
‡ వడు = శ్రమనొందు.

గమకొని ప్రోవ శక్తుఁడను • గాను గతార్థుఁడ నర్థి నెవ్వరున్
బెనుపఁగ నోప నట్టిచట • నేను బ్రవర్తిలఁ గ నెట్లొ చెప్పవే. 64

వ. అనిన ధర్మభృద్వరిష్ఠుం డగుధౌమ్యుం డొక్కింత ధ్యానించి విజ్ఞానం బభినయిం చుచు ని ట్లనియె. 65

తే. తొల్లిటను బుట్టి భూతము • లెల్ల క్షుధను, డ్రెళ్లుచుండుట గని సూర్యు•దేవుఁ డిచ్చఁ
దండ్రివోలెను గరుణించి • తగినవెఱవు, వన్ని యన్నంబు గల్పించి • వాని మనిచె. 66

వ. ఆకర్ణింపు మతఁ డుత్తరాయణగతుం డై తేజోరసంబులు సేకరించి దక్షిణాయనగతుం డై వాని నెల్ల మహీతలంబునం బెట్టి యోషధులం బుట్టించి పర్జన్యుం డై చంద్రకిర ణామృతంబులం దడిపి వానివలన షడ్రసాన్నంబు గల్పించి ప్రాణికోట్లం భరించెం గావున బ్రాణాధారం బగునన్నం బాదిత్యమయం బగుటం జేసి దివాకరుండు సర్వ భూతంబులకుం దండ్రి యయ్యె నీ వాతని శరణంబు నొందుము. 67

చ. విపులను గార్తవీర్యుఁడును • భీముఁడును న్నహుషుండు వైన్యుఁడున్
దప మొనరించి భూపతులు • దద్దయుఁ గాచిరి వాపి యాపదల్
నృపతుల కిట్లు లొప్ప ధర•ణీధవ నీవును నైష్ఠికుండవై
తపనునిఁ గొల్చి,యీద్విజుల • దన్పుము మన్పుము నాదుపన్పునన్. 68

క. అని ధౌమ్యుఁడు వెండియు ని, ట్లను నోధరణీశ సూర్యు • నారాధింపన్
జనుపేళ్లు నూటయెనిమిది, దనరెడు నని నలువ మున్ను • దా వచియించెన్. 69

క. అవి యెల్ల మహామంత్రము, లవుచుం బాఠకుల కాయు•రారోగ్యములన్
దవిలించు వాని నెల్లన్, బ్రవిమలమతిఁ దెలిసికొనుము • వచియింతు నిటన్. 70

వ.*సూర్యుఁ డర్యముఁడు భగుఁడు త్వష్ట పూష యర్కుఁడు సవిత రవి గభస్తిమంతు డజుఁడు కాలుఁడు మృత్యువు ధాత ప్రభాకరుఁడు పృథ్వి వారి తేజస్సు వాయు వాకాశము సోముఁడు బృహస్పతి శుక్రుఁడు బుధుఁ డంగారకుఁ డింద్రుఁడు వివ స్వంతుఁడు దీప్తాంశుఁడు శుచి శౌరి శనైశ్చరుఁడు బ్రహ్మ విష్ణువు రుద్రుఁడు స్కం దుఁడు వరుణుఁడు యముఁడు వైద్యుతుఁడు జాఠరుఁ డగ్ని యైంధనుఁడు తేజఃపతి ధర్మధ్వజుఁడు వేదకర్త వేదాంగుఁడు వేదవాహనుఁడు కృతము త్రేత ద్వాపరము కలి కళ కాష్ఠ ముహూర్తము క్షప క్షణము యామము సంవత్సరకరుఁ డశ్వత్థుఁడు కాల చక్రము విభావసుఁడు పూషుఁడు శాశ్వతుఁడు యోగి వ్యక్తావ్యక్తుఁడు సనాతనుఁడు లోకాధ్యక్షుఁడు ప్రజాధ్యక్షుఁడు విశ్వకర్మ తమోనుదుఁడు జీమూతుఁడు జీవనుఁడు

* ఈవచనము మొదలుకొని 88 వ పద్యమువఱకుం గలసూర్యస్తవము మొదలగుకథయంతయు నన్నయ భారతమందు వర్ణింపఁబడి యుండలేదు. ద్రౌపదికిఁ దామ్రపాత్ర మిచ్చినట్లును లేదు.



భూతాశ్రయుఁడు భూతపతి సర్వలోకనమస్కృతుండు స్రష్ట సంవర్తకుఁడు వహ్ని సర్వాది యలోలుపుఁ డనంతుఁడు కపిలుఁడు భానుఁడు కామదుఁడు సర్వతోము ఖుఁడు సర్వధాతునిషేచితుఁడు జయుఁడు విశాలుఁడు వరదుఁడు మనస్సు సుపర్ణుఁడు శీఘ్రగుఁడు ప్రాణధారణుఁడు ధన్వంతరి ధూమకేతు వాదిదేవుఁ డదితిసుతుఁడు ద్వాద శాత్ముఁ డరవిందాక్షుఁడు స్వర్గద్వారము ప్రజాద్వారము మోక్షద్వారము త్రివిష్టపము దేహకర్త శాంతాత్ముఁడు విశ్వాత్ముఁడు విశ్వతోముఖుఁడు చరాచరాత్ముఁడు సూక్ష్మాత్ముఁడు మైత్రేయుఁ డనునివి భాస్కరాష్టోత్తరశతనామంబులు. 71

మ. ఇవి సూర్యోదయమందు నిత్యము నరుం • డెంతేనియున్ భక్తి లోఁ
దవుల న్నిష్ఠఁ బఠించెనేని ధనముల్ • ధాన్యంబులుం దాగలున్
దవుమేధాధృతు లంది మానవుఁడు వి•న్నాణంబునం బొల్చి ధ
ర్మవిధిజ్ఞుం డయి దుఃఖముల్ విడివడన్ • మానొందు నెల్లప్పుడున్. 72

ధర్మరాజు సూర్యు నారాధించుట.

వ ఇట్లు మున్ను బ్రహ్మదేవుండు శక్రున కుపదేశించె నతండు నారదునకుం జెప్పె నతండు నాకుఁ బ్రసాదించె నేను నీ కిచ్చితి నని ధర్మజ్ఞుం డగుధౌమ్యుం డుపదేశించిన నంయ తాత్ముండును దృఢవ్రతుండు నగునయ్యుధిష్ఠిరుండు విశుద్ధాత్ముం డై జలస్పర్శనంబు చేసి పుష్పోపహారంబుల దివాకరు నర్చించి కంఠదఘ్నంబు లగుసలిలంబుల నిలిచి ప్రాణాయామపూర్వకంబుగా యోగం బనుసంధించి గురూపదేశక్రమంబున నష్టోత్తర శతనామస్తోత్రంబు గావించి మిత్రు నుద్దేశించి మఱియును. 73

ఆ. నీవ భూతయోని •, నీవ భూతాత్ముఁడ, వీవ లోకచక్షు • వీవ కర్మ
సాక్షి వీవ సర్వ•సాంఖ్యులకును గతి, వీవ యోగినేత • వీవ హరివి. 74

శా. ఈవే లోకము లుద్ధరించెదవు నీ•వే వాని వెల్గింపుచున్
బ్రావీణ్యంబున నేలుచుందువు నినున్ • బ్రత్యూషకాలంబులన్
దేవేంద్రాదులు సిద్ధసాధ్యవసువు•ల్దివ్యర్షులున్ యక్షులున్
దేవవ్రాతములు న్మహీసురులునున్ • సేవింతు రిష్టాప్తికిన్. 75

చ. కలిగినయెల్లజోతుల నొ•కండును బోలఁగ లేదు నిన్ను నీ
కలిమి న వన్నియు న్వెలుఁగుఁ • గావున వాని కధీశుఁ డైతి నీ
వెలుఁగులఁ గాదె రక్కసుల•నీవ మడంచెను విష్ణుచక్రమున్
సలిపెను విశ్వకర్మ మును • సర్వజగజ్జనరక్షకంబుగన్. 76

తే. నీమరీచులు మెసవుచు • నేమ మెసఁగ, వాలఖిల్యాదిమౌనులు • వాసి గాంచి
రీవ సర్వేశ్వరుండవు • దేవదేవ, నీవు గా కింతయును లేదు • నిక్క మెందు. 77

చ. అనఘ నిదాఘమందు భవ•దంశువు లెల్లెడ నుల్లసిల్లి య
ల్లన సకలౌషధీరసము•లం గొని దాఁచి ఘనంబుపేరిటన్
వెనుక దయారసంబు ప్రభ•వింపఁగఁ జెంపుగ వృష్టి నిచ్చి నే
లను దమియింపఁ జేసి ప్రజ•లన్ దగఁ బ్రోచెదునిన్నుఁ గొల్చెదన్. 78

ఉ. ఈ వొకయింత లేమి జగ • మెంతయు నంధమ యై నశించెడిన్
నీవిలసత్కరంబు ధర•ణిం బడకుండిన గంబలాదులున్
బావకదీప్తులున్ గలిగి • భాసిలుచుండిన శీతవాతమున్
దేవురువుట్టఁ జేసి ప్రజఁ • ద్రెంపక యుండునె లోకరక్షకా. 79

తే. నీవలనఁ గాదె దేవళ్లు • నిత్య మగ్ని,హోత్రముఖమున నాహార • మొందఁ గలుగు
టీవె బహ్మాదులకుఁ గాల • మేర్పడంగఁ, జేయు దాద్యంతరహితుఁడ • వోయి తండ్రి.

క. మనువులకును మనుపుత్త్రుల,కును మానవులకును లోక•కోటుల కెల్లన్
గనుఁగొన నీశుఁడ వీవే, నినుఁ దెలియఁగ నేరితరము • నీరజమిత్రా. 81

మ. లయకాలంబున ద్వాదశాత్ముఁడవు నా • లక్షింపఁగా నొప్పచున్
భయదోష్ణాంశువులన్ మహార్ణవము లెం•డం జేసి కోపోద్భవం
బయి జృంభించినకల్పవహ్ని మిగుల • న్వ్యాపింపఁగా భూతసం
చయయుక్తంబుల నెల్లలోకముల నేఁ•ర్చం జాలు దోభాస్కరా. 82

సీ. హంస వివస్వంతుఁ • డంశుమాలి సహస్ర,రశ్మి భానుండు మా•ర్తాండుఁ డనఁగ
నెసగునీ వింద్రుఁడ • వీవు ప్రజాపతి, వీవు రుద్రుండవు • నీవు హరివి
నీవు వహ్నివి నీవు • నిఖిలేశ్వరుండవు, నీవు శాశ్వతుఁడవు • నిన్నుఁ దెలిసి
కొలిచినవారికి • ఘోరాధులును వ్యాధు, లడఁగు సిరు లెవ్వంట • నంటి వచ్చు
తే, నాపదలతోడఁ బాపము•లంతరించుఁ, బుణ్యమును గీర్తియును వచ్చుఁ•బుత్త్రపౌత్త్ర
వృద్ధియు సుఖంబు లభియించుఁ•బృథివియందుఁ, బెద్దకాలము జీవించుఁ •బేర్మిగలుగు.

క. పాదోపాంతసమాశ్రితు,లై దేవరభృత్యవర్గ • మగుమాఠరదం
డాదుల సేవించెద నే, నీదయకుం బాత్రుఁడ నయి • నీరజమిత్రా. 84

చ. అతిథులనెల్లఁ బ్రోచుటకు • నన్నము నొందఁగఁ గోరి కోరికన్
యతనము చేసి యన్నపతి • వై తగునిన్ను భజించుచుంటి నో
యతివరవందనీయచర•ణా కరుణారస ముప్పతిల్ల నా
హిత మొనగూర్చి ప్రోవఁగద•వే యిదె నీకు నమస్కరించెదన్. 85

సూర్యుండు ప్రత్యక్షుండై వరం బొసంగుట.

వ. అని యనేకవిధంబులం బ్రార్థించినం బ్రసన్నుండై ప్రభాకరుండు పాండవేయునకు
దర్శనం బిచ్చి యి ట్లనియె. 86



మ. మది నీప్రార్థన కెంతయేనియును బ్రే•మం గూర్చి నే వచ్చితిన్
హృదయార్థంబుల నెల్లఁ దీర్చెదను గుం•తీపుత్త్ర నీ కింక నీ
పదిరెండేండ్లు మెసంగ నొక్క కొనఁగన్ • భక్తంబు సువ్యక్తమై
యొదవ న్నే వర మిచ్చెదన్ గొనుము నీ•యుల్లంబు రంజిల్లఁగన్. 87

ఆ. ఇదిగొ తామ్రపాత్ర • మిచ్చెద నిది యాజ్ఞ,సేనిచేత నుండె•నేని దుంప
లాకు లలము లెల్ల • నక్షయ్యము లగుచ,తుర్విధాన్నము లయి • తోఁప దొఁగు. 88

వ. *ఇదిమొదలు నీకుఁ బదునాలుగవయేట రాజ్యంబును లభియింపఁ గల దని పలికి భగ
వంతుం డగుభాస్కరుం డంతర్ధానంబు నొందె నంత గొంతేయుండు జలాంతరంబున
నుండి లేచి వచ్చి ధౌమ్యునిపాదమ్ముల కభివందనమ్ము చేసి తమ్ములం గౌఁగిలించు
కొని పాంచాలిం గారవించి తామ్రపిఠరం బామెచేతి కిచ్చెఁ దత్ప్రభావంబున. 89

తే. తనమహానసమం దొకిం•తగను సంస్కృ,తాన్నము చతుర్విధంబుల • నై క్షణమున
వృద్ధిఁ బొందె నక్షయ్యమై • వెలఁదిమిష్ట, యింతనంతల నడయూరు•నంతలోన. 90

వ. ఇ ట్లనుదినంబును సంసిద్ధం బైనశుద్ధాన్నంబున యుధిష్ఠిరుం డనేకశతసహస్రమహీ
సురవరులకుం బెట్టి తానును దనభ్రాతలు విఘసంబు భుజించుచుందురు ద్రౌప
దియు భుజించినవెనుక నన్నంబు క్షయం బగుచుండు నిదియ నియమవ్రతంబుగాఁ
జెల్లఁ బాండవేయు లావనంబునం గొన్నినా ళ్లుండి వెనుకం బురోహితకృతస్వస్త్య
యనులై బ్రహ్మబృందపరివృతులై కదలి కామ్యకవనంబునకుం జని రంత నిట నాం
బికేయుండు సుఖాసీనుండై విదురుం బిలిచి యి ట్లనియె. 91

విదురుండు ధృతరాష్ట్రుం బదరి పలుకుట.

చ. సముఁడవు సమ్మతుండవును • సర్వజనాళికి నీదుబుద్ధి శు
ద్ధము కవియుం బలెం బరమ•ధర్మము లెల్ల నెఱుంగు దీవు నా
కమరఁగఁ జెప్పవయ్య యిటు • లయ్యె నిఁకం బొనరింప నె ట్లగున్
మము భజియించు నెట్లు ప్రజ • మా కొనకీడును రాక యుండునే. 92

వ. అనిన విదురుం డి ట్లనియె. 93

మ. ధర్మమె లోకకారణము • ధర్మమె రాజ్యవివర్ధనంబునున్
ధర్మమె పుణ్యదాయకము • ధర్మమె మోక్షపథైకమూల మా
ధర్మము విప్రలబ్ధ మయి • తగ్గెను నీసభ దుష్టసంగతిన్
ధర్మము నిల్పు దేనియును • ధర్మజునిం బిలిపించి ప్రోవుమా. 94

* పిఠరము = పాత్రము.

మత్తకోకిలము. నీతి మాలిననీదుపుత్త్రుని ♦ నింద్యకృత్యచరిత్రులన్
బ్రీతిసేయుట వీడి వేసుకఁ ♦ బిల్చి ధర్మజుఁ బ్రోచినన్
జ్ఞాతిభేదము రాదు పోదు యశంబు ధర్మువు నిల్చు మున్
నీతనూజులు తక్కువారికి ♦ నీకు నెమ్మది గల్గెడిన్. 95

స్రగ్ధర. ఈరీతిం జేయవేని న్హృదయ మెఱియ నీ ♦ కెగ్గగున్ బంధునాశం
బై రాష్ట్రిం బెల్లఁ ద్రెళ్లున్ ♦ వాత మగుఁ బ్రజ యోంధాగ్రగణ్యుం డగణ్య
ప్రారంభప్రస్తుతుం డావదముడియు మహాబాధగాండీవచాప
స్ఫారాజిం దాసురేంద్రప్రభవుఁడు నరిరాట్ప్రాణముల్ నిల్పువారే. 96

చ. ఎఱుఁగుదు వింతయుం దొలుత ♦ నేను సుయోధను పుట్టినప్పుడే
యెఱుఁగఁగఁ జేసితిన్ గురుకులేశ్వర నావచనం బనిష్టమై
వఱలెను నీకు నిష్ఠయిన ♦ వానిఁగఁ దోచినయేని వానిరం
దొఱఁగి యజాతశాత్రవునిఁ ♦ దోడ్కొని వచ్చి యొసంగు ముర్వరన్. 97

క. ఘనుఁ డతఁడు రాజ్యపట్టము, గొని కురుదేశముల నేలుకొనుచున్న మహీ
జనులుం బార్థివులును మనకును వశ్యులు వైశ్యులట్లు ♦ కురుకులనాథా. 98

మ. అవమానంబు సహించి పాండుసుతులం ♦ బార్థించి నీయాత్మసం
భవులుం గర్ణుఁడు సౌబలేయుఁడును సేవావృత్తి జీవింప నో
నవినీతుం డగుదుస్ససేనుఁడును గ్రౌర్యం బంతయుం బో సభా
భవనంబందు వృకోదరున్ ద్రుపదజన్ ♦ బల్మాఱు ప్రార్థింప నో. 99

మత్తకోకిలము. నీవు నాయమనందనుం గడునేర్పునం గొని తెచ్చి సం
భావనం దగఁ గూర్చి రాజ్యము ♦ భావ మిచ్చి భజింప నో
నావరాత్మకుఁ డెగ్గు లెంచఁ డహర్నిశంబు దయాళుఁడై
తా వెలుంగెడు దీన నీకు నెంద న్ముదం బగు భూపతీ. 100

వ. అడిగితివి గాన నింతవట్టు చెప్పితి ననినం గనలి ధృతరాష్ట్రుం డతని కి ట్లనియె. 101

ఉ. పాండవపక్షపాతి వయి ♦ పల్కితి పల్కులి వెన్నియేని యీ
నిండినకొల్వుకూటమున ♦ నీనుడు లన్నియు మా కనిష్టముల్
పాండవు లుండ నైనగతి ♦ పండితనిశ్చయ మయ్యె ము న్నిటన్
వెండియుఁ దత్ప్రసంగమున ♦ నిల్వఁగఁ జేయుట నీకుఁ బాడియే. 102

ఉ. కన్నకుమారశేఖరునిఁ ♦ గా దని త్రోచి పరుం గ్రహించుమం
చు న్నయవాక్యము ల్దెలుపఁ ♦ జొచ్చితి చాలుఁ బుకే సుధీనిధీ



యెన్నఁడు నీవఱించినటు ♦ లేచిన నొల్లఁ బొనర్పనొల్లనీ
వున్నను బోయినన్ వరిదు ♦ పోయి యథేచ్ఛ మెలంగు మిం కిటన్. 103

విదురుండు ధృతరాష్ట్రుని విడిచి పాండవులకడకుఁ జనుట.

వ. అని గర్హించి పలుకుచు లేచి యంతర్గృహంబునకుం బోయె నిది కా దనుచు విదురుండును రథారూఢుండై తత్క్షణంబ కదలి కురుక్షేత్రంబుమీఁదుగా గంగాకూలం బు పట్టి పోవుచు సరస్వతీదృషద్వతీనర్మదలన్ సేవించుకొనుచుఁ బశ్చిమాభిముఖుం డై వనంబునుండి వనంబు దాఁటి సరస్వతీతీరంబున నున్న కామ్యకకాననంబునకుం జని యట బ్రాహ్మణపరివృతుండై కొమ్మం దమ్ములం గూడికొని యున్నధర్మనందనుం జూచి సమీపించునంతలోన. 104

చ. అరదము నెక్కి వచ్చెడుమహామహు నాతనిఁ జూచి దవ్వుల
న్గురువృషభుండు మారుతతనూజునిదిక్కు మొగంబు ద్రిప్పి నీ
వరసితె వచ్చెడి న్విదురుఁ ♦ డాసుబలాత్మజుపంపుఁజేసి యు
క్షురతికిఁ బిల్చునో మరల ♦ సాధ్వస మయ్యెడి నయ్యొ తమ్ముఁడా. 105

చ. పిలిచినఁ బోవకుండు టది ♦ పిన్నతనం బని పోతినేని సా
బలుఁడు బలాత్కరించి ననుఁ ♦ బాచిక లాడఁగఁ జేసి వెండియున్
గెలిచియు నుక్కివంబునను ♦ గేరుచుఁ గైకొను నింక నాయుధం
బులు కల వంచు నేనటుకుఁ ♦ బోవఁగలేను దురోదరార్థమై. 106

వ. అని యంతలోన లేచి తమ్ములతోడం గూడి పాండవాగ్రజుండు విదురున కెదురు వోయి తోడితెచ్చి యథోచితోపచితులం దనియఁ జేయుచు నాగమకారణం బడిగిన నతని కతం డి ట్లనియె. 107

మ. ధృతరాష్ట్రుం డొకనాఁడు న న్బిలిచి ప్రీతిం గూర్చి మ మ్మెప్పుడున్
మతిఁ బ్రేమింతువు కానఁ గార్యగతులన్ ♦ లగ్నాగతిం జెప్పు నా
హితవుం బథ్యము గాఁగఁ బల్కితిని నే ♦ ని ట్లంచు మే లెంచి భూ
పతి కప్పల్కు రుచింప కల్కఁ బెనిచెన్ ♦ భావంబునం దెంతయున్. 108

మ. *వరపథ్యాన్నము రోగి కింతయు రుచింపం బోనియ ట్లుత్తమే
తరయౌ కామిని శ్రోత్రియాలయమునం ♦ దళ్కొత్తన ట్లర్వదేం
డ్లరయం బుచ్చినభర్త కన్నియకు నిష్టావాప్తికిం గానియ
ట్లరుణాస్యుం డగువృద్ధరాజున కరుచ్యం బయ్యె నాపల్కులన్. 109

---

* ఇట్లు వ. భా. లో లేదు.

తే. నానుతులు ధృతరాష్ట్రుని♦మానసమున, నంట వయ్యెను దాయర♦పాటునందు
నిడినజలమట్లు తండ్రికి ♦ గొడుకులకును, జేటుకాలము వచ్చెను ♦ జెప్ప నేల. 110

క. కనలి ధృతరాష్ట్రుఁ డంతట, గని నను నీ కిష్ట మైన♦కడ కరుగు మికన్
నినుఁ గోరి నీదుసాయము, మనమున నర్థింప ననుచు ♦ మాత్సర్యమునన్. 111

క. నను విడనాడెం గావున, నినుఁ దెలుపఁగ వచ్చినాఁడ ♦ నృపవర నీకున్
వినిపింతు వినినయదియే, యని రోయక వినుము రాజ్ఞ♦యం బది తెలియన్. 112

తే. అరులవలన మహాక్లేశ ♦ మందుచున్నఁ, గాలముం గనిపట్టి లో♦ క్షమను బూని
యువలఁ బగఁ నగ్నివలెఁ గొంచె♦మైనదానిఁ, బెంచనే దా నొకఁడె పృథి♦వీధవుఁ డగు.

మ. ధన మున్నం దన దంచుఁ బంచుకొన కా♦ప్తశ్రేణితోఁ గూడి భో
జనముం జేయుచు వారి మీఁతఁ బరి♦ష్కారాదులం దుండినన్
దనదుఃఖమున నంశభాజు లగుచున్ ♦ దారుం బ్రవర్తింతు రం
దున భూపాలుఁ డశేషభూవలయమం♦దుం బేర్మిఁ బెంపొందెడున్. 114

తే. ఇట్లు నీవు ప్రవర్తింతు♦వేని నీకు, శ్రేయ మగు నన్నఁ బాండవ♦జ్యేష్ఠుఁ డీవు
చెప్పిన ట్లప్రమత్తతఁ ♦ జేయువాఁడ, దేశకాలాదులను బట్టి ♦ తెలిసికొనుచు. 115

వ. అని వానిరాక కలరుచున్నంత నట ధృతరాష్ట్రుండు పాండవులకడకు విదురుండు పోయియుండుట విని వానిప్రభావం బగ్గించుచుం గాఁగలపాండవాభివృద్ధిం దలంచి పరితపించుచు సభాద్వారంబునకు వచ్చి సకలపార్థివసమక్షంబున విదురస్మారమోహితుండై మహీతలంబునం బడి కొంతవడికి లబ్ధసంజ్ఞుండై లేచి సమీపోపస్థితుండై యున్నసంజయుం జూచి దుఃఖంచుచు ని ట్లనియె. 116

## ధృతరాష్ట్రుఁడు విదురుం బిలువ బంపుట.

మ. అనుజుం డాప్తుఁ డమాత్యుఁ డైనవిదురుం ♦ డస్మత్కృతిం బాసి పో
యె నయో తత్స్మరణంబునన్ హృదయ మెం♦తేఁ జింతమై వ్రీలు నా
తనిలేమిన్ జగమెల్ల లేనియటు లై ♦ తబ్బిబ్బగు న్నాకు నె
ప్డు నొకింతేనియు నప్రియంబు నలుపం♦బోవం డతం డారయన్. 117

ఉ. ఈసునఁజేసి దోసమున♦ కే నొడికట్టి మహానుభావునిన్
నాసచివాగ్రగణ్యుని మ♦నంబున రోసి సుదుష్టబుద్ధినై
దోసము లాడి పొమ్మనుచుఁ ♦ ద్రోసితి నయ్యొ నజీవుఁ డైన చో
నానయుదోషుఁ దెచ్చి కరు♦ణన్ బ్రతికింపవె నన్ను సంజయా. 118



వ. అనిన నట్ల యగుంగావుత మని నరయంబున సంజయుండు కామ్యకకాననంబునకుం జని *రౌరవాజినసంవీతుండును విదురసమేతుండును బ్రాహ్మణసహస్రసహాసీనుండును భ్రాతృమధ్యవిరాజితుండును నగుధర్మరాజుం జూచి పూజించి పూజితుండై విశ్రమించి కుశలం బడిగిన నతం డతనికిం దమకుశలంబును నాగమనకారణంబునుం జెప్పి విదురుదిక్కు మొగంబై యి ట్లనియె. 119

క. నీకై ధృతరాష్ట్రుం డెద, శోకించుచు నున్నవాఁడు ♦ సుమి సత్తమ నీ
వీకురువర్యులపంపుం, గైకొని రా నవధరింపు ♦ కరిపురమునకున్. 120

ఆ. నిన్నుఁ గానకున్న♦ నృపతి ప్రాణము నిల్పుకొనఁగఁ జాలఁ డీవు ♦ కినుక విడిచి
ప్రాణదానఫలము ♦ వడయుము కురురాజ్ఞి,యోగమునను బురికి ♦ వేగ వచ్చి. 121

క. అని సంజయుండు సెప్పిన, విని నిజజనవత్సలుండు ♦ విదురుఁడు కుంతీ
తనయాగ్రజునమతిఁ గొని, చనుదెంచెన్ హస్తిపురికి ♦ సంజయువెంటన్. 122

వ. అట్లు వచ్చినవిదురుం దెలిసికొని ధృతరాష్ట్రుం డతనిసంకంబునం జేర్చుకొని మూర్ధాఘ్రాణంబు చేయుచు ని ట్లనియె. 128

ఉ. కన్నులు లేనినాకు నొక♦క న్నయి కన్నది కన్నయట్లునన్
విన్నది విన్నయట్లునుఁ బ్ర♦వీణమతిం దెలియంగఁ జేయుచున్
న న్ననిశంబు వీడక ఘ♦నం బగుభక్తి భజించుతమ్ముని న్
ని న్నెడఁబాసి నే నెఱుఁగ ♦ నిద్రయు నన్నము నిన్నినాళ్ళులన్. 124

క. నాపుణ్యంబున వెండియుఁ, బ్రాపింపఁగఁ గంటి నిన్ను ♦ భరతర్షభ హా
హా పుణ్యదివస మియ్యది, నాపలికినపలుకు సైఁచి ♦ ననుఁ బ్రోవఁ దగున్. 125

వ. అనిన విదురుం డి ట్లనియె. 126

చ. పరమగురుండ వీ విటులు ♦ వల్కెదె నామది నోర్చి కాని యెం
డరయఁగ వచ్చునే కురుకు♦లాగ్రణి వ్యగ్రుఁడఁ గాక వచ్చితిన్
బురుషులు ధర్మమార్గమునఁ ♦ బోవుచు దీనులపట్ల నుండి ని
బ్బరికమునన్ వచింతు రట ♦ వారలు దోషులు నాఁగఁ బోలునే. 127

ఆ. భరతవంశదీప ♦ పాండుసుతుల్ నీదు,సుతులు నొక్కటెఱుఁగు♦మూవె నాకు
దీను లనెడుబుద్ధి ♦ మానసంబునఁ గల్గి, పాండురాజసుతుల♦పట్లఁ గూర్తు. 128

## దుర్యోధనాదులదురాలోచనము.

వ. అని యి ట్లన్నదమ్ము లిరువురు నన్యోన్యానునయంబులన్ ముదితులై యొప్పటియట

* రౌరవాజినము = దుప్పితోలు.

యుండి యది విని దుర్యోధనుండు పరికించి సౌబలేయకర్ణదుశ్శాసనులం బిలిచి యేకాంతనివిష్టుండై యి ట్లనియె. 129

సీ. విదురుండు వెండియు ♦ విచ్చేసె నతఁడు ♦ విద్వాంసుఁడు మహోగ్రవీర్యుఁడు లోక
విదుఁడు పాండవపక్ష ♦ విధి నుండి వేన ♦ వే చెప్పి మాతండ్రి ♦ వృత్తి మరల్చి
విదితముగాఁ బాండ ♦ వేయుల నిటకు ♦ వెసఁ దెచ్చు నని మనో ♦ వీధి నే నెంతు
నదమలమతులార ♦ శత్రులు వారు ♦ చనుదెంచి రేని నే ♦ సైఁపంగఁ జాల. 130

వ. శస్త్రవిషాగ్నిప్రవేశనోద్బంధనాదుల నిధనంబు నొందెదం గాని దాయాదులయాన్నత్యంబు విని నేను నాహితామాత్యవృద్ధాదులమోముఁ జూడ నోప ననిన వానికి శకుని యి ట్లనియె. 131

ఉ. బాలిశబుద్ధి నీ కిటులు ♦ పార్థివనందన పుట్ట నేటి కి
ట్లే లొనగూడుఁ బాండుసుతు ♦ లెప్పుడు తప్పరు సత్య మట్లు భూ
పాలసభాస్థలిన్ సమయ ♦ భారము పూనియు దాని దాటిపోఁ
జాలరు తండ్రి పిల్చినను ♦ సమ్మతి సేయరు రాఁగ నెమ్మదిన్. 132

తే. అట్లు కాకున్నఁ దండ్రివా ♦ క్యమునఁ జేసి, వత్తురేనియు వారు దు ♦ ర్వృత్తు లగుచు
మరల మన మండలము వారి ♦ మర్మ మరసి, పణము వెట్టించికొందము ♦ పాచికలను.

ఉ. నా విని దుస్ససేనుఁడు మ ♦ నంబున మెచ్చుచు మేలు మాతులా
నీవు వచించినట్టిది య ♦ నింద్యము నాకు హితంబు నీమతిం
బోవుదు మే మనం దపన ♦ పుత్త్రుఁడు మిత్త్రునిఁ జూచి రాజ నీ
భావుక మెల్లవారుఁ దల ♦ పం దగు నేకపథానుగాములై. 134

తే.*ఏను నాఁడె వెద క్విను ధీరు ♦ లైనవారు, కాలసంవిద మొనరింప ♦ కేల వత్తు
రయ్య మోహమున స్వత్తు ♦ రైన వారి, గెలుము మరల దురోదర ♦ మెలమిఁ జేసి. 135

వ. అని కర్ణుండు వలికిన సప్రహృష్టమనస్కుం డగుదుర్యోధనుండు శీఘ్రంబ పరాఙ్ముఖుం డయ్యె నంతఁ గర్ణుండు సన్నిహితుండై వానికన్నులం దుడుచుచు శకునిదుశ్శాసనాదు లాకర్ణింప నానిర్ణయంబు వినుం డని యమర్షంబున ఘూర్ణించి ధర్షించుచు ని ట్లనియె. 136

ఉ. కింకరపాణులై నృపతి ♦ కిం బ్రియముం బొనరింప నెల్లరున్
గంకటముల్ శరంబులును ♦ గార్ముకముల్ దగఁ దాల్చి యింతయుం
గొంకక తేరు లెక్కి చని ♦ కోనల నున్నపృథాతనూజులన్
సంకులసంగరంబునను ♦ జంపుద మంపుద మూర్ధ్వభూమికిన్. 137

* కాలసంవిదము = సమయము.



తే. మిత్త్రులును సేనలును లేక ♦ మినుకునట్టివనచరులఁ బారి గెల్చుట ♦ యెంత మనకు
మిపుడు శత్రులు శాంతితు ♦ రేని నిర్వ,వాయులై భార్తరాష్ట్రులు ♦ వ్యాలఁ గలరు. 138

వ. అని పలికిన వానిపలుకులకు వారెల్ల మే లని మెచ్చుచు సేనలం గూర్చుకొని యుద్ధసన్నద్ధులై వేలువేల రథంబు లెక్కి పాండవులం జంపఁ బయనంబై రప్పుడు దివ్యదృష్టి నది యంతయుం దెలిసి కృష్ణద్వైపాయనుండు వచ్చి వారి వారించి ధృతరాష్ట్రునిం జేరి యి ట్లనియె. 139

—●●◆ వ్యాసుండు ధృతరాష్ట్రునొద్దకు వచ్చుట. ◆●●—

ఉ. చెప్పెద నాలకింపు మిసి ♦ నీ భవదగ్రతనూజుఁ డింతయోఁ
ద ప్పరయంగ లేక కుప ♦ థంబున నుండి పృథాతనూజులన్
రొప్పి వనాళులం బడఁగ ♦ రోసముతో నిది నాకు నప్రియం
బిప్పుడు వారిఁ జంపుటకు ♦ నేగెడు నక్కట రాజ్యలుబ్ధుఁడై. 140

తే. వనులఁ దమపడ్డకష్టముల్ ♦ వారు మఱక, మూఁడుపదివర్షములు నిండి ♦ పోవునపుడు
క్రుద్ధులై కౌరవేయులు ♦ కుప్పలగుచుఁ, బడఁగ విసువక యుందురే ♦ కడిఁదివిషము.

క. పాపాత్ముం డగునీసుతుఁ, డాపగిదిం బాండుసుతుల ♦ నడకించియుఁ దాఁ
జూపోవ కిపుడు చంపఁగ, నీవగిదిం బయన మయ్యె ♦ నిది తగ వగునే. 142

శా. నేను న్నీవును ద్రోణుఁడుం గృపుఁడునున్ ♦ భీష్ముండునున్ క్షత్త్రయున్
జై నీక్షింపుచు నుండ నీప్రజల కిం ♦ తల్ వుట్ట నౌనే భవ
త్సూనుల్ క్రిందును మీఁదునుం గన కిటు ♦ ల్వాపట్టి యప్పార్థులం
గానం జంపఁగఁ బోయి చచ్చెద రయో ♦ కా దంచు వారింపవే. 143

చ. అని స్వజనంబులోఁ దగని ♦ దండున నౌ నయశం బధర్మమున్
ఘను లగుపాండవేయులను ♦ గాఱియవెట్టఁ దలంచునట్టినీ
జనుల నుపేక్షసేయకుము ♦ చయ్యనఁ బార్థులచెంతకున్ భవ
త్తనయునిఁ బుచ్చి మైత్రిఁ గొను ♦ దానఁ గృతార్థుఁడ వయ్యె దియ్యెడన్. 144

తే. అనుచు ధృతరాష్ట్రుఁ డిట్లను ♦ నయ్య నాకు, విదురునకును గృపద్రోణ ♦ భీష్ములకును
హితము కాదు దురోదర ♦ మిది దలంప, విధివశమ్మున నయ్యె నో ♦ వేదవేద్య. 145

క. ఎఱిఁగియుఁ బుత్త్రస్నేహం, బెఱుక చెడం జేయ బుద్ధి ♦ హీనుం డైనం
గఱకరి యైనం గొడుకుం, దొఱఁగఁగ శేనైతి నిట్లు ♦ దుఃఖింపంగన్. 146

వ. అనిన వ్యాసభట్టారకుండు వెండియు. 147

క. ధృతరాష్ట్ర నత్య మాడితి, క్షితిపైఁ బుత్త్రులకు మించి ♦ కించిత్సౌఖ్యం
బతిశయించునర్థ మెదియున్, మతి నరసినఁ గానరాదు ♦ మాకుం దెలియన్. 148

వ. ఏతదర్థావబోధంబుగ నింద్రసురభిసంవాదం బొక్కటం జెప్పెద నవధరింపుము. 149

క. ‡గోమాత సురభి యొకనాఁ, డామరుదధినాథుకడకు ♦ నరిగి మిగులఁ గ
న్ప్రేమించుచు నతఁ డి ట్లను, నేమీ కన్నీరు విడుతు ♦ వి ట్లది చెపుమా. 150

ఆ. అనిన సురభి యనియె ♦ నమరేంద్ర నాకన్న, కొడుకు గుఱిచి వగతు ♦ క్షుద్రుఁ డైన
కర్షకుండు దానిఁ ♦ గట్టి ప్రతోదంబు,వలనఁ గొట్టి తోఁక ♦ నులిమిపెట్టు. 151

వ. బలవంతం బైన బలీవర్దంబుతోఁ గాడికట్టుటంజేసి బలహీనం బైనయది ధురంబు
వహింపలేక దుఃఖించుచున్నయది దానికై నే నిట్లు శోకార్త నై వచ్చితి ననిన
నిందుఁ డిందు దయాసాంద్రుఁ డై యి ట్లనియె. 152

క. పుత్త్రసహస్రము నీకుఁగా, ధాత్రిస్థలిఁ గాడి మోచి ♦ దైన్యముపడఁగాఁ
బుత్త్రుని కొక్కని కిట్లీ, వాత్రముపడ నేల చెప్పుమా గోమాతా. 153

వ. అనిన గోమాత యి ట్లనియె. 154

మ. తమకుం గల్గినపుత్త్రు లందఱు సమత్వం బంది యుండ న్విందు దై
న్యమునం గుందెడివారిపట్లఁ గృప మెండౌఁ దల్లికిం దండ్రికిన్
సుమనోవల్లభ దాన నిట్లు వగతుం జుమ్మీ యన న్వజ్రి పా
ణముకన్నన్ సుతు లెచ్చ టంచుఁ దలఁచెన్ ♦ స్వాంతంబునం దెంతయున్. 155

సీ. అంత సంతోషితస్వాంతుఁ డై సురపతి, గోమాతఁ గరుణించి ♦ కొంతలోన
నింతింత యన రానియంతనీ ర్వర్షించి, కర్షకులకును వి ♦ ఘ్నం బొనర్చె
సురభి చెప్పినయట్లు ♦ సుతులలో దీనులపట్ల హెచ్చైనది ♦ కృపారసంబు
తనయ నీవును పాండుఁడును విదురుఁడు నాకు, నొకరూప యట్లు పుత్త్రికులు నైన
తే. నిప్పు డెట్లు జీవించెద ♦ రెట్లు వృద్ధిఁ బొందెద రటంచు దీనులై ♦ యున్నపార్థు
లనుగుఱించి తపించు నామనము నీకు, స్నేహమునఁ జేసి యింతగాఁ ♦ జెప్పుచుంటి.

క. నీకొడుకుల బ్రదు కెంచిన, నోకురుకులనాథ నీసుయోధనుఁడు మదిన్
గాఁక విడి విడనికమముం, గైకొనువిధమునను మెలపఁగా వలయుఁ జుమీ. 157

వ. అనుటయు ధృతరాష్ట్రుం డనును. 158

మ. ఇది నే నంత యెఱుంగుదున్ మనములో ♦ యీ రెట్లు బోధింతురో
విదురుండున్ ఘటసంభవుండుఁ గృపుఁడున్ ♦ భీష్ముండును న్నాకు నె
మ్మది బోధించిరి రిత్తవోయితి జగన్నాథా! మముం బ్రోచుకో
ని దయ న్మీరు దురాత్ము నాత్మభవునిన్ ♦ శిక్షించి రక్షింపరే. 159

‡ మరుదధినాథుఁడు = ఇంద్రుఁడు.



తే. అనుచుఁ బ్రార్థింప బాదరాయణుఁడు నేను, బోయి వచ్చెద మైత్రేయ ♦ మునివరుండు
పాండవేయులకడనుండి వచ్చు నిటకు, నిమ్ముఁ [illegible] నిచ్చమై ♦ మేదినీశ. 160

తే. అతఁడు నీకొలంబునకు ల ♦ గ్గౌ తెఱఁగున, నీదుసుతుని శాసించు ♦ నీవు వాని
నతనిచెప్పినగతిఁ జేయఁ ♦ డై నయేని, కనలి శపియించు నృపసుతుం ♦ డని తలఁపక.

వ. అని చెప్పి భగవంతుం డగుబాదరాయణుం డంతర్ధానంబు నొందె నంత. 162

మైత్రేయుండు వచ్చి దుర్యోధనుని శపించుట.

శా. పాత్రుల్ ఛాత్రులు వెంట నంటి కొలువన్ ♦ భాస్వద్వివస్వత్ప్రభన్
మైత్రేయుం డనుమానివర్యుఁ డరుదే ♦ ధాత్రీనాథుఁ డీక్షించి మైఁ
బుత్త్రుల్ గూడఁగ నర్ఘ్యపాద్యవిధులం ♦ బూజించి విశ్రాంతుఁ డై
మైత్రిం జూపెడుమౌనిదిక్కు మొగమై ♦ మోదొందఁగా ని ట్లనున్. 163

తే. మాకు మీరాక రాక లోకైకవంద్య, మీర లెందుండి వచ్చేసినారొ యింద
సౌఖ్యదం బయి పయనంబు ♦ సన్నుతింపఁ, బడియెనో నాకు నానతీయుఁడి కరుణ.

వ. అని యడిగిన మైత్రేయుండు ధృతరాష్ట్రునిం జూచి. 165

చ. * ఇలఁ గలయెల్లతీర్థముల ♦ నేఁ గన నెంచి పరిభ్రమించుచున్
లలిఁ గురుజాంగలంబుల కలంగముగా నయి కామ్యకంబు నా
నలరుతపోవనంబున జటాజినవల్కలధారులై మునీ
శులజత నున్నపాండవులఁ ♦ జూచి యిట న్నినుఁ జూడ వచ్చితిన్. 166

క. నావుడు ధృతరాష్ట్రుం డను, దేవళ్ళకు దీటువచ్చుధీరులు పాండు
క్ష్మావరవరతనయులు వా, రేపురు నటఁ గుశలు లగుచు ♦ నెన్నఁగుదురు గదా. 167

క. వారలు సమయము నడుపంగా రహిఁ దలపోయుచుండ్రుగా సౌభ్రాత్రి
ప్రారంభచ్ఛేదము మా, కౌరవకులమందుఁ గాదుగా మునినాథా. 168

క. అనవుడు మైత్రేయుం డను, జననాయక పాండుసుతులు ♦ సమయము దప్పన్
జనువారె వారిధర్మగతిని లోకం బెల్ల నెఱుఁగదే యన వలెనే. 169

చ. ‡అది యటు లుండ నిమ్ము మనుజాధిప నీతనుజాతు లెంతయున్
మది చెడి ద్యూతకార్యమున ♦ మానవిభూతి పొనంగఁ జేసి కోఁ
గదుకొని రంట వింటి నట ♦ గాదిలిబిడ్డలపాటుఁ జూచుచున్
నదిసుతుఁ డీవు న ట్లురక ♦ నట్టువ లాడుచునుంట పాడియే. 170

వ. నీయందు నాకు నెయ్యంబు మెండు గాన నిట్లు వచ్చి చెప్పుచుంటి దీనం జేసి నీకొడు
కుల కన్యోన్యవిగ్రహంబై నిగ్రహం బగు నిది యెఱింగి నీ విట్లు దొంగఁ జే ల్వాడి

* అలంగము = కోట. ‡ కదుకొను = అతిశయించు.

చిరట్లు చేసిరదిన విదురుడు యెక్కలి వచ్చు నని యంతం బోక చెంత నున్న దుర్యోధ
నుం జూచి నీవు బుద్ధిమంతుండవేని పాండవులం ద్వేషింపకుము దాన నీకును
లోకంబునకును లగ్గ యగు వినుము. 171

మత్తకోకిలము.*వారు మానవరూప మొందిన ♦ వ్యాఘ్రములు ల్పమరాటవీ
గ్రగారులై మొనఁ బద్ధద్విణ్మృగ ♦ కోటిఁ బట్టి వధింతు రా
వీరవర్యులు వజ్రకాయులు ♦ విశ్రమార్జితకీర్తు లి
ద్ధోరుతేజులు వారి మార్కొన ♦ నోవ రెంతటివేల్పులున్. 172

మ. తనబాహాబల మేర్పడన్ బకుని యుద్ధంబందు నిర్జించి మిం
చినయాద్ధత్యమునన్ హిడింబుని వడిన్ ♦ జెండాడి కిమ్మీరునిన్
గనుచుండంగ వధించి మించి జగతిం ♦ గన్పట్టునమ్మాగధున్
గొని భంజించినభీముతో నెదుర నుగ్రుం డైన నోపం డనిన్. 173

తే.‡వాసుదేవుఁడు సంబంధి ♦ వారలకును, స్యాలకులు సర్వపార్షతు ♦ లట్టివారి
జరయు మరణంబు గలిగిన ♦ సరులు గెలువఁ,గల రనుచుఁ జెప్పఁగొనుటది ♦ గగనసుమము.

వ. కావున నీవు మనుష్యవశంబునం బడక నామాట వినుము ధన్యుండ వయ్యెద వని
మైత్రేయుండు పలుకుచుండ దుర్యోధనుండు చెవ్వున నవ్వి నిజోరుతలంబు కరంబున
నప్పళించుచుఁ బాదాంగుష్ఠంబున నేల రాయుచు నేమియుం బలుక కవనతముఖుం
డై యుండె నప్పుడు. 175

చ. వినయము సూప కిట్లు పృథివిన్ లిఖియించెడువానిఁ జూచి య
మ్మునిపతి కోపదేవతకు ♦ మూర్తి యనంబడి వారి ముట్టి సె
ట్టనమున లేచి నీ విపు డిటం గరువంబున నున్నదానికిన్
బొనరిచినట్టిదానికిని ♦ బోల ఫలంబును బొందఁగా నగున్. 176

తే. నీకతంబున గల నగు ♦ లోక మెరియ, నందు బలవంతుఁ డైనవా ♦ తాత్మజుండు
ఘనగదాఘాతమునఁ జేసి ♦ కండఁగొన్న,నీతొడను భగ్నముగఁ జేయుఁ ♦ గాత మోరి.

వ. అని శపించి పలికిన నులికి ధృతరాష్ట్రుండు మైత్రేయుం బ్రార్థించి ప్రసన్నునిం జేసి
యిట్లు గాకుండ ననుగ్రహింపు మని వేఁడుటయు నతండును. 178

క. శమ మూననేని యీశాపము దాఁకదు వీని కట్లు ♦ వడ కీరితిన్
గ్రమ మతి గర్వించిన శాపము దాఁకక పోవ దనుచుఁ ♦ బలికినయంతన్. 179

వ. ధృతరాష్ట్రుం డతని ననునయించుచు భీమునిచేఁ గిమ్మీరుండు చచ్చినవిధం బెట్టిది
చెప్ప ననుగ్రహింపు మనుటయును. 180

* ద్విణ్మృగకోటి=శత్రువు లనుశేళ్లపిండు. ‡ పార్షతులు=ధృష్టద్యుమ్నాదులు.



చ. మునివరుఁ డిట్లు పల్కె నృపపుంగవ నే నదియింతయు నింక నీ
తనయుఁడు దుష్టు డానుడు లేదన్ గణియింపఁడు తచ్చరిత్రమున్
వినఁ దలఁతేని నీకు వినిపించెడు మీవిదురుండు సర్వమున్
జనియెద నే నటంచు నృప ♦ సన్నిధిఁ బాసె జను ల్భయంపఁగన్. 181

వ. దుర్యోధనుండును గిమ్మీరవధము విన నిచ్చగింప కవలతం జనియె నంత ధృత
రాష్ట్రుండు విదురుం జూచి. 182

—•—◆ కిమ్మీరవధపర్వము. ◆—•—

క. కిమ్మీరవధకథాక్రమ, మిమ్మెయి విన నిచ్చ వొడమె ♦ నెఱిఁగింపుము నా
కమ్మారుతికిని వానికి, నమ్మహి సంగమ మ దెట్టు ♦ లయ్యెం దొలుతన్. 183

వ. అని యడిగిన విదురుం డతిమానుషం బైనమనభీమసేనునివరాక్రమం బే విన్నతెఱం
గునం జెప్పెద నవధరింపుము. 182

సీ. ద్యూతనిర్జితు లగు ♦ భూతలేంద్రుని సుతుల్, పాండవు లిటనుండి ♦ బయలు వెడలి
మొగి మూఁడహోరాత్ర ♦ ములు సంతతమ్ముగ, నడచి కామ్యకకాన ♦ నమున కరిగి
మరునాఁడురాత్రి సా ♦ మరిగినవుడు రేఁగి, పురుషాదు లందందు ♦ దిరుగునవుడు
పిలువ నో యనుదిక్కు ♦ గలుగక చిమ్మచీఁ,కటి కంటి క డ్డయి ♦ క్రమ్మినవుడు

తే, గోపులును దాపసులు తేపు ♦ మాపు చొరక, దవులఁబడఁగ విసర్జించి ♦ తరలుదారిఁ
జొచ్చివిచ్చలవిడిఁ బోవఁ ♦ జొచ్చి రిచ్చ,వెంట భృత్యులు ద్విజులుఁ ద ♦ మ్మంటి రాఁగ.

ఉ. వారలదారి కడ్డపడె ♦ వారిదనాదనినాదితుండు దు
ర్వారకఠోరభూరిభుజ ♦ రంగదభంగగదాయుధుండు తీ
వ్రోరుతరప్రచారుఁడు భ ♦ యోజ్జనకాతికరాళవక్త్రుఁడు
గ్రారుణవర్తులానలస ♦ మాక్షుఁడు రాక్షసుఁ డొక్కఁ డుక్కునన్. 186

క. దీప్తోర్ధ్వశిరోరుహుఁ డతి,దృప్తుఁడు స్పష్టాష్టదంష్ట్రి ♦ డిచ్చాగమనుం
డాప్తోన్నతాసితాంగుఁడు, సప్తాశ్వద్యుతులు పర్వఁ ♦ జనుదెంచె వడిన్. 187

సీ.*తనఘోరనాదంబు ♦ నను వనాంతర మెల్ల, జల్లన మ్రోఁగించు ♦ చలమువానిఁ
దనభీమపాదాహ ♦ తిని మహీరుహముల, నిలఁ ద్రెళ్ళఁ జేయుమే ♦ బలమువానిఁ
దనభూరిసామర్థ్య ♦ మున దిశావలయంబు, మునుఁగ మాయం జేయు ♦ పౌఁపువానిఁ
దనముష్టిఘాతంబు ♦ నను పర్వతమ్ములైనఁ, బిండిపిండిగఁ జేయు ♦ బిరుదువానిఁ

తే, గొఱిఁ ద్రిప్పుచుఁ గుణపంబుఁ ♦ గొఱికికొనుచుఁ, గహకహధ్వనిసేయుచుఁ ♦ గడలునిండఁ
జెరఁగి వచ్చెడువాని నక్కు ♦ జనువానిఁ, బాండవేయులు వీక్షించి ♦ రండ నుండి.

* జల్లన=జల్లుమని శబ్దముగ.

వ. అంత వాఁడునుం దనమాయాబలంబునం గానరాక దూరంబునన కృష్ణాజినపరివృతు లగుపాండుతనయులం గని మైనాకంబువలె మార్గనిరోధి యయ్యె నప్పుడు. 189

చ. అది గని దుస్సనేనునిశ♦రాంగుళిఁ బ్రేస్సినవేణి బ్రేలఁ గా
నెద బెదరంగ రాజసతి ♦ యేనునగంబులమధ్యమందు నా
నదివలె సంచలించుచుఁ గ♦నంబడుసుం బతు లత్తలోదరిం
బొదివిరి యింద్రియంబులు స♦ముత్సుకతన్ విషయార్థముం బలెన్. 190

వ. అంత. 191

క. రక్షోఘ్నవివిధమంత్రము, లక్షీణప్రతిభ ధౌమ్యుఁ ♦ డడరించి వడిన్
రాక్షసమాయ హరించెన్, వీక్షించుచు నుండఁ బాండ♦వేయులు ద్విజులున్. 192

ఆ. అపుడు నష్టమాయుఁ ♦ డతిరోమవిస్ఫారి, తేక్షణుండు లోక♦భీషణుండు
కామమూర్తిధరుఁడు ♦ కాలకల్పుఁడు మహా, బలుఁడు వాఁడు చూడఁ♦బడియె నెదుట.

వ. అట్లు లోచనగోచరుం డైనరాక్షసు నీక్షించి దీర్ఘప్రజ్ఞుం డగుయుధిష్ఠిరుం డిట్లనియె.

ఆ. ఎవఁడ వెవనివాఁడ ♦ వేకార్య మొనరింతు, వెలుఁగఁ జెప్పు మనుడు ♦ నిట్టు లనియె
నసుర నే బకాసు♦రావరజుండఁ గి,మ్మీరుఁ డనఁగఁ బేర్మి ♦ మెఱయువాఁడ. 195

శా. ఏతత్కామ్యకనామకాననమునం ♦ దే నుండు నెల్లప్పుడున్
బ్రీతి న్వాచవి చేసికొందు నరులన్ ♦ రేపాడి మాపాడియున్
నాతో మార్కొన లేరు దేవవరు లై♦న న్మీర లెవ్వారొ నా
కై తోఁతెంచితి రే భుజించెదను వీఁ♦కం జంపి మి మ్మందఱన్. 196

వ. యుధిష్ఠిరుం డద్దురాత్మునిమాట విని తనగోత్రనామాదికం బెఱింగించుచు. 197

శా. *ఏ నీజానుగుఁ దాఁకుఁదెంచితిని యే♦ష్టేఁగాని పాండుక్షమా
జానిజ్యేష్ఠసుతుండ ధర్మజుఁడ నా♦సైదోడు లీనల్వురున్
నానాస్త్రజ్ఞులు భీమముఖ్యు లరికిన్ ♦ రాజ్యంబుఁ గోల్పోయి మే
మానందం బెడ మెట్ట వచ్చితి మర♦ణ్యాని న్వగల్ పేర్పడన్. 198

మహాస్రగ్ధర. ‡అనినం గిమ్మీరుఁ డెంతే ♦ నలరి యనియె హా♦హా మదీయేష్టదిష్టం
బునఁ గాదే పెద్దకాలం♦బునకు మనమునం ♦ బుట్టియున్నట్టికోర్కిన్
బొనరింపం జేసెకో నిం♦ప్పుడు తఱి యొదవెం ♦ జో మదీయాగ్రజన్మున్
దునిమెన్ భీముండు వానిం ♦ దునిమి పగను దీ♦ర్తు న్మదం బాత్మఁ గూర్తున్.

తే. †వేత్రకీయవనంబున ♦ విప్రుపగిది, నౌరసబలంబు లేక వి♦ద్యాబలంబు
కలిమిఁ జంపెను బకు నింతె ♦ కాక వీఁడు, సఖు హిడింబు వధించి త♦త్స్వస హరించె.

* అరణ్యాని = మహారణ్యము. ‡ దిష్టము = అదృష్టము. † స్వస = చెలియలు.



ఉ. అట్టిదురాత్ముఁ డిట్టినిసి♦యందు మదంతికవర్తి యయ్యె నే
బట్టి వధించి వీనిమెయిఁ ♦ బర్వినసత్తుటఁ దర్పణంబు లి
ప్పట్టునఁ జేసి భ్రాతృఋణ♦భారము వైరముతోడఁ దీర్చి నా
పొట్టయు నించుకొందుఁ బల♦ముం దిని మీరలు సూచుచుండఁగన్. 201

క. విపులప్రాణుని వీనిని, గృపలే కీసుమంతలోన ♦ గిట్టించి తదీ
యపలముఁ దిని నే ఘటజుం, డపు డరి నఱిగించుకొన్న♦యట్లు దలిర్తున్. 202

వ. అనిన యుధిష్ఠిరుం డిట్లు గాకుండుఁ గావుత మని భర్త్సించుచుం బలికె నంత భీమసేనుండును దశవ్యామోన్నతం బగునొక్కమహావృక్షంబు పెఱికికొని వచ్చి వానిం బ్రతిఘటించె నర్జునుండును నిమేషాంతరమాత్రంబున వజ్రనిష్పేషగౌరవం బైనగాండీవంబు గనయంబున గొనయం బెక్కించి మొక్కలీఁడై యుండె నపుడు పవనజుం డవరజు వారించి కిమ్మీరునిదిక్కుమొగం బై నిలు నిలు మని పెలుచం బలుకుచు. 203


భీమకిమ్మీరులద్వంద్వయుద్ధము.

ఉ. కచ్చ బిగించి కేలుదుగ ♦ గాటముగా నులివట్టి నెట్టనన్
మచ్చర మెచ్చ నొ ద్దఱచి ♦ మానక చెట్టొకచేతఁ బట్టి నిన్
బచ్చడి సేయువాఁడ నని ♦ పాఱి సురారిశిరంబుపై వడిన్
బెచ్చుపెరింగి వైచెను బ♦విం గిరిపై మఘవంతుఁడుం బలెన్. 204

తే. దానఁ జలియింప కింతయు♦దైత్యుఁ డెదిరి, నిలిచి చిచ్చుఱపిడుగట్లు ♦ వెలుఁగుచున్న
కొఱవి గిరగిరం ద్రిప్పుచుఁ ♦ గొట్టె భీము, నతఁడు కడకాల దానిపెం ♦ పడఁచివైచె.

శా. కిమ్మీరుం డొకవృక్షముం బెఱికి శ♦క్తిం గేల సంధించి తా
నమ్మై దండధరుండు నాఁ గనలి ప్ర♦త్యాలీఢముం గల్గ రం
గమ్మం దించుక నిల్చి పెల్చన మరు♦త్కాయోద్భవుం గొట్టె దీ
ర్ఘమ్మై ఘాతము దోఁప నాతఁ డఁడచెన్ ♦ రక్షఃపతిన్ దక్షుఁడై. 206

సీ. *ఉద్ధతులై వృక్ష♦యుద్ధంబునకుఁ బూని, కిమ్మీరమారుతుల్ ♦ కెంపు మీఱ
వాలిసుగ్రీవుల♦పోలిక నొండొరుల్, కొట్టుకొనిరి జగం ♦ బట్టె వడఁక
మత్తదంతావళ♦మస్తకపతితోత్ప,లములు నాఁ దునిసె వృ♦క్షములు రెండుఁ
దద్వనస్థలి వృక్ష♦తతు లెల్ల జర్ఝరీ,భూతంబు లయ్యెను ♦ ముంజమట్టు

తే. లిట్టొకముహూర్తమాత్రము ♦ వృక్షయుద్ధ, మైనయంత నరాశనుం ♦ డడరి ఱాల
విసరి వేసెను భీము నా♦వీరవరుఁడు, నిలిచెఁ గదలక ఱాలతాఁ♦కులకు నులికి. 207

* ముంజము = తృణవిశేషము.

వ. అయ్యవసరంబునఁ గిమ్మీరుండు మారుతేదిపరాక్రమంబునం బొయ్యవంటిగి స్వార్భానుండు భానునింబోలె భీమసేనుం బట్టుకొనినవతండును గంధుమింగిలి వానిం దిరిగి పట్టుకొనియె నంత వారిరువురును బ్రవృద్ధరోఋ లగుబలీవర్దంబులుంబలె డీకొని నఖదంష్ట్రాయుధంబులం జోరుశార్దూలంబులో యనం జేరి పోరినపోరు ఘోరంబయ్యె నయ్యెడ వృకోదరుండు దుర్యోధననికారంబును గృష్ణాపరిభవంబునుం దలంచుచు నతికోపించి సింగంబు మాతంగంబునుంబోలె భుజయుగంబునం బకానుజుం బట్టుకొని వట్టికె వేణుస్ఫోటోపమం బగుశబ్దంబు పుట్ట బిట్టు వైచి.

మ. తనుమధ్యంబు గ్రహించి రక్కసుని వాఁ ♦ త్రోద్భవుం డుక్కునన్
గొని పెల్చన్ విదిలించి పుచ్చె నపు డా ♦ క్రూరుండు చండానిలం
బున భూజంబు తెఱంగున న్నవసి పెం ♦ పుం దక్కి తా లూఁదలే
క నితాంతంబుఁ బరిభ్రమించెను భయో ♦ త్కంపంబు పెం పందఁగన్. 209

వ. అంత. 210

మ. సుపరిశ్రాంతునిగా నెఱింగి యసురన్ ♦ జూర్ణంబు గావింప నాఁ
గృప లేకాన్నృపసూతి యజ్ఞపశువున్ ♦ గిట్టింపఁగాఁ గట్టిన
ట్టు పగం జేతులఁ జుట్టి బిట్టుఱవఁ దో ♦ ర్దర్పోద్ధురం ద్రిప్పి నే
లపయిం ద్రెళ్లఁగ నేసె మేలని జనుల్ ♦ కైవారము ల్సేయఁగన్. 211

ఉ. కుత్తుకఁ బట్టి నుల్మిచు నకుంఠిత తేజము మీఱఁ బాండవుం
డత్తఱి జానుఘాతమున ♦ నాసుర వైరికటీతటంబునన్
దుత్తుమురై పడం బొడిచి ♦ దుర్మతి నీ విఁక బంధుదుఃఖమున్
జిత్తమునందుఁ బొందవు వసింపఁగఁ బోదువు గాన మీఁదికిన్. 212

తే. అని వచించుచుఁ గిమ్మీరు ♦ నట్టె పట్టి, నేలపైఁ గొట్టి చంపె నా ♦ గాలికొడుకు
ద్రౌపదియు నన్నదమ్ములు ♦ ధౌమ్యముఖ్యు,లలరిమిగులఁ బ్రశంసించి ♦ రతనినపుడు.

వ. అట్లు కిమ్మీరుం జంపి కామ్యకకాననంబు నిష్కంటకంబుఁ గావించి పాండవులందు నివాసంబుండి రని నేను బ్రాహ్మణులవలన వింటి నని విదురుండు సెప్పిన విని ధృతరాష్ట్రుండు కిమ్మీరవధశ్రవణంబున నార్తుండై వగచి నిట్టూర్పు నిగిడించె నంత. 214

అర్జునాభిగమనపర్వము.

—•◆ శ్రీకృష్ణుండు బంధువర్గముతోఁ బాండవులకడకు వచ్చుట. ◆•—

తరు. వనవాస మేగిన ♦ వారిని బాండు ♦ వరపుత్రకుల విని ♦ వగచి పాంచాల
తనయులు వృష్ణు లం ♦ ధకులును భోజ ♦ తతియుఁ గైకేయసం ♦ తతియునుఁ జేది



జననాథుఁడును గోలెఁ ♦ జనుతుత్రివరులు ♦ సతతంబు ధృతరాష్ట్ర ♦ సంతతిం దెగడి
మునివంద్యుఁడగుకృష్ణు ♦ మున్నిడుకొనుచు ♦ మొనసికామ్యకవన ♦ మ్మునకేగియచట.

వ. వా రందఱు ధర్మనందనుం గని పరివేష్టించియుండి రపు డఖిలనందనం బాచరించి విషణ్ణుండై దేవకీనందనుం డెల్లరు విన ని ట్లనియె. 216

ఉ. కష్టులు దుస్ససేనుఁడును ♦ గర్ణుఁడు సౌబలుఁడున్ సుయోధనుం
డిష్టులతోడ వారి నని ♦ నీల్గఁగ నేసి తదీయరక్తమున్
దుష్టిగ భూమిదేవతకుఁ ♦ ద్రొప్పలు దోరలు ద్రావఁ బెట్టి యీ
కష్టము దీఱఁ ధర్మజునిఁ ♦ గట్టుద మాకురురాజ్యపట్టమున్. 217

ఆ. నికృతి నడపి వీరి ♦ నిం బ్రవ్రజితులుగాఁ, జేసినట్టిపాప ♦ చిత్తు లయిన
వారిఁ జంపు టదియు ♦ వసుధ సనాతన,ధర్మ మనుచు మనము ♦ తలఁపవలయు.

వ. అని క్రుద్ధుండై యున్న జనార్దనుం జూచి పూజ్యుండు పురాణపురుషుం డప్రమేయుం డజుం డజితుం డవ్యయుండు సత్యుండు నిత్యుండు నగు నతనిం గీర్తించుచు నర్జునుం డి ట్లనియె. 219

—•◆ అర్జునుండు శ్రీకృష్ణుని స్తుతించుట. ◆•—

సీ. *గంధమాదనమందుఁ ♦ గందలం దిని తపించితి పదివేలేండ్లు ♦ వ్రతము పూని
పదివేలుఁ బదినూర్లు ♦ వర్షముల్ పుష్కరంబునఁ జేసి తప్పులం ♦ గొనితపంబు
బదరీవనమునందుఁ ♦ బవన మాహారించి, నూఱేండ్లు సల్పితి ♦ ఘోరతపము
పదియు రెండేండ్లు త ♦ ప మొనర్చితి సరస్వతికడఁ గృశీభూత ♦ దేహుఁడ వయి

తే. దివ్యవర్షసహస్రముల్ ♦ తెగి ప్రభాస,తీర్థమున నేకపాదస్థి ♦ తిని వహించి
పృథులతపమానితి జగత్ర్ప ♦ వృత్తి కొఱకు,నీవుపరమర్షి వనివ్యాసుఁ ♦ డెఱుఁగఁ జేసె.

శా. క్షేత్రజ్ఞుండవు సర్వభూతహితముం ♦ జేకూర నర్థించి మున్
సత్రంబుల్ శతకోటిదక్షిణలతో ♦ శాస్త్రోక్తవిధానంబునన్
ధాత్రిం జేసినయజ్ఞపూరుషుఁడ వో ♦ దాశార్హ నీ వీజగ
ద్ధాత్రిం బూని మెలంగునీశ్వరుఁడ వీ ♦ వాద్యుండ వన్నింటికిన్. 221

తే. ‡చైత్రరథమున శతసహ ♦ స్రములు స్వర్ణ
నిష్కములు దక్షిణ యొసంగి ♦ నియమముగను
నూఱుక్రతువు లొనర్చిన ♦ భూరికీర్తి
వీవు విష్ణుండ వీశుండ ♦ వింత నిజము. 222

* పుష్కరము = ఒక క్షేత్రము. అప్పులు = నీళ్లు.
‡ చైత్రరథము = కుబేరోద్యానము. నిష్కము = నూఱుటంకములు.

మ. నరరూపంబునఁ బుట్టి భూతలమునన్ ◆ భావాబలం బేర్పడన్
నరకుం దొట్టి సురారులం దునిమి విన్నాణంబున న్వజ్రికిన్
బరమేశత్వ మొసంగి ప్రోచితివి దేవా నీవ నారాయణా
ఖ్య రహిం గాంచిన దేవదేవుఁడవు ని ◆ న్నగ్గింప సామాన్యమే. 223

వ. నీవే బ్రహ్మయు, సోముండును, సూర్యుండును, ధర్ముండును, ధాతయు, యముండును, ననలుండును, వాయువును, వైశ్రవణుండును, రుద్రుండును, గాలుండును, నజుండును, స్రష్టయు, నాకాశంబును, బృథివియు, దిక్కులు, విదిక్కులు నై చరాచరగురుండవు నైన పురుషోత్తముండవు. 224

చ. అదితికిఁ బుత్త్రుఁడై పొడమి ◆ యాదవనందన నీవు వజ్రికిన్
ముద మొదఁ గూర్చుతమ్ముఁ డనఁ ◆ బొల్చి నిసుంగయి నింగి నేలయుం
ద్రిదివము నాక్రమించి నిజ ◆ తేజమునన్ రవితేజ మాయఁ బెం
పొదవ వెలింగి విష్ణు వన ◆ నొప్పెదు నిన్ను భజింతు నెంతయున్. 225

క. నీయవతారసహస్రము, లాయుగముల ధర్మలోప ◆ మగుతఱి నై వి
స్ఫాయత్తేజంబున దుష్టాయితనక్తంచరాళిఁ ◆ జంపఁగఁ దివురున్. 226

సీ. *నరక పాశ నిసుంద ◆ మురజాదులం జంపి, ప్రాగ్జ్యోతిషాధ్వమ్ము ◆ భద్రపఱిచి
శైబ్య జరాసంధ ◆ శతధన్వ శిశుపాల, ముఖ్యులఁ జంపి నృపులను గాచి
యసహాయశూరుండ ◆ వై రుక్మి నిర్జించి, భోజకన్య హరించి ◆ ముదము నించి
సాళ్వక శేరుమ ◆ త్సైభ గోపతి తాళ, కేత్వాదులను గూల్చి ◆ క్షితిని బ్రోచి
తే. సర్వసముఁడవై లోకైక ◆ సాక్షివైన, నీకుఁ బగయు మాత్సర్యము ◆ నృతము క్రుధయు
లేవు నినుఁ జేరి ఋషులెల్ల ◆ భావములను, నభయ మర్థించి వేఁడెద ◆ రాదిదేవ.

ఆ. యుగము గడచి చనఁగ ◆ నొగి భూతము లడంగ, జగములెల్ల నొక్క ◆ మొగినడంగి
నీదునాత్మలోన ◆ నిలువంగఁ జేసెదు, నిన్నెఱుంగఁజాల ◆ రెన్న నెవరు. 228

చ. ‡మరల యుగాది యైనపుడు ◆ మాధవ నీ దగునాభికిం జరా
చరగురు వై జనించినప్రజాపతినిన్ మధుకైటభాసురుల్
నెరిగొని చంపఁ బో నలుగు ◆ నీయలికంబునఁ బుట్టె శూలముం
గరమునఁ దాల్చి శంభుఁ డసఁ ◆ గం దిగకన్నులు నైదుమోములున్. 229

క. ఈరీతి నీకుఁ బుట్టిన, నీరజగర్భుండు భవుఁడు ◆ నీదునియోగం
బారసి చేయుచు నుండ్రని, నారదుఁ డెఱిఁగించె మున్ను ◆ నాకు మహాత్మా.

* ప్రాగ్జ్యోతిషము = మాగధునిపురము.
‡ నెరి = వక్రత. అలుగు = కోపముచేయు.



తే. *అనుచుఁ గృష్ణాత్ముఁ డగుకృష్ణుఁ ◆ డధికభక్తి
భరితుఁడై పల్కి మిన్నక ◆ ప్రాంజలి యయి
నిలిచి యున్నంతఁ గని కృష్ణుఁ ◆ డెలమి మీఱఁ
బలికె నాతని కిట్లని ◆ చెలిమిఁ జేసి. 231

మ. నరనారాయణనామధేయమును లెన్న న్మమ్ము దీపింతు రా
నరుఁ డీవై కురువంశమం దయితి నే ◆ నారాయణుండన్ ధరా
భరముం బాపఁగ నిట్లు వొల్చితిమి సౌభ్రాత్రం బెసంగం బర
స్పరముం గూర్తుము నీకు నాకు నొకలేశం బైన వే ఱుండునే. 232

శా. ‡నీవే నేనును నేను నీవె యగుటన్ ◆ నీ వైరి నా వైరి యా
నీ వేని న్మది నెంతు వాతనిన నే ◆ నెంతేని ప్రేమింతు నో
దేవేంద్రాత్మభవా యెఱుంగు మెద నీ ◆ దిష్టంబు నాదిష్టమే
నా వైరిం గలహింతు నే నిపు డిటన్ ◆ న్యాయప్రచారంబునన్. 233

వ. †అని పలుకుచున్నసమయంబునఁ బాంచాలి పఱతెంచి భాతృపరివృతుం డయియున్న పుండరీకాక్షు నిరీక్షించి యిట్లని విన్నవించె. 234

ద్రౌపది కృష్ణునితోఁ దనపరిభవంబు చెప్పి దుఃఖించుట.

సీ. §మును నీ ప్రజాసర్గ ◆ మునఁ బ్రజాపతి వని, యసితుండు దేవలుం ◆ డానతిచ్చె
యష్టవు యష్టవ్యుఁ ◆ డై నవిష్ణుఁడ వీవ, యని జామదగ్న్యుండు ◆ మును వచించె
సత్యంబువలన య ◆ జ్ఞస్వరూపుఁడ వైన, పురుషుండ వని కశ్య ◆ పుండు సెప్పె
సాధ్యాదిసురల కీ ◆ శ్వరుఁడవు భూతేశ్వ, రుండ వీ వని నార ◆ దుండు వలికె
తే. హరపితామహశక్రాది ◆ సురలఁ గూడి, బాలకునిరీతిఁ గ్రీడింతు ◆ లీల నీవు
సత్యమూర్తివి క్షమ నీకు ◆ నిత్యగుణ మ, టనుచుఁ జెప్పిరి సర్వజ్ఞు ◆ లైనఋషులు.

చ. ¶శిరమున నాకసం బెసఁగఁ ◆ జేయుచుఁ బాదముల న్వసుంధరం
బరఁగఁగఁ జేయుచుం బురుష ◆ భావమున న్వెలుఁగొందు నీ మహో
దరమున సర్వలోకములు ◆ దాఁగిలిమూఁతల నాడు నో వరా
త్పర నినుఁ గాని దింతయుఁ ద ◆ పస్వులునుం గనఁజాల రాత్మలన్. 236

లయగ్రాహి. ఈవ గతి లోకముల ◆ కీవ గతి వేల్పులకు ◆ నీవ గతి మానులకు ◆ నీవ గతి భాస్వ
ద్భావులకు నీదయకు ◆ దేవవరు లైనగిరి ◆ జావరముఖామరులు ◆ భావమున నెంత్రో

* కృష్ణుఁడు = అర్జునుఁడు, వాసుదేవుఁడు. ‡ దిష్టము = భాగధేయము.
† భ్రాత = ఈశబ్దము అన్నదములకును బావమఱఁదులకును జెల్లును. "శ్లో॥ పాంచాలీ పుండరీకాక్షమాసీనం భ్రాతృభిస్సహ" § యష్ట = యజ్ఞకర్త.
¶ దాఁగిలిమూఁత = కాలి రాడువాట, గుప్తక్రీడ.

దేవ సకలార్థములు • నీవ సకలేశ్వరులు • నీవ నినుఁ బోల్చుటకు • నేవలఁతి దైవముల్
భావమునఁ గొంతునని • వేవిధములన్ స్తుతులు తావినుచు చున్న యవి గావె పరమేశా.

వ. *అట్టిమహానుభావుండవు నీ వెఱుంగని దింతయు లే దయిన నాదుఃఖపరిహారం బంతయుఁ బ్రణయంబునం జేసి నీ కెఱింగించెద నాకర్ణింపు మని కంట నీరు వెట్టుకొనుచు ని ట్లనియె. 238

మ. ‡అకటా యే మని చెప్పుదాన జగదీశా నామనోదుఃఖముల్
సకలోర్వీశ్వరు లైన పాండవులకున్ • సత్పత్ని నై విష్టప
ప్రకరేశుం డన నైన నీకు సఖి నై • పాంచాలరాట్పుత్రి నై
యకలంకస్థితిఁ బొల్చునా కరులచే • నావల్లు గాఁ జెల్లునే. 239

మ. ఖలుఁ డాకౌరవపాంసనుండు మిగులన్ • గ్రౌర్యంబుతోడన్ రజ
స్వల నై యుండిననన్నుఁ గా దనక భీష్మద్రోణముఖ్యు ల్సభా
స్థలి నీక్షింపుచునుండఁ బట్టి తిగిచెన్ • దర్పాంధులై ధార్తరా
ష్ట్రులు నన్నుం గని నవ్వి రే మనుచు నాశోకంబు వాక్రుచ్చెదన్. 240

చ. పలువురు చూచుచుండ ననుఁ • బట్టి సభాస్థలి కీడ్చి తెచ్చి నా
నావలువను పీడ్చి దాసి యని • పల్కెను గుల్కుచు దున్ససేనుఁ డ
త్తులువ పరాభవింపఁ గని • దుఃఖము నొందుచు నాంధ్రదు నా నటన్
బొలిచిరి గాని నాపతులు • పూరుషులట్లు తలంపరా రయో. 241

తే. అరులచే నట్లు పడియెడు నబల నన్ను, నరసి బొమ్మలు నా నుండి • రప్పు డకట
భీమసేనుండు ఫాల్గునుం • డేమియందు, గుదెయుగాండివమునువీరు గొనఁగ నేలొ.

తే. పృథివిఁ బాంచాలపాండవ వృష్ణివరులు, బ్రదికియుండంగ నే నిట్లు • పరిభవంబు
పరులవలనను బొందుట • పాడి యగునె, గీవరక్షక యే మను దాన నింక.

తే. ఎట్టివాఁ డైనఁ బతి సతి • నేలవలయు, నేలఁబడి సతి ప్రజనేలు • నెపుడుఁ బ్రజయు
నాత్మ నేలు నాత్మను గను • సతివ కాన, జాయ నాఁబడుఁ బతిదానిఁ జనదె ప్రోవ.

వ. ఆర్తత్రాణపరాయణులు భూరికీర్తు లగునాభర్తలు వీరాధివీరు లని పేరందియు దుర్బలు లైన ధార్తరాష్ట్రుల కోడి వా రన్నంబున విషంబు పెట్టినను గృష్ణసర్పములం గఱపించినను ద్రాటం గట్టి నీటం బడఁద్రోచినను లక్కయింటం బెట్టి చిచ్చు పెట్టినను నధర్మద్యూతంబున రాజ్యం బొడిచికొని దాసులం జేసినను సభాస్థలంబున నేకవస్త్ర యగుననన్నుఁ బరాభవించినను జూచి సైచి విక్లేశంబు

* ప్రణయము = నెయ్యము.

‡ సఖి = మిత్రము. “ శ్లో॥ తవకృష్ణసఖీవిభో॥” అని మూలము. అవల్లు = ఉపద్రవములు.



నొందుచున్నవార కాని శరణం బన్నను నన్నుఁ గన్నెత్తి చూడకున్నవారు వీరు నాపరాభవం బెట్లు పరిహరింపంగల రే నిట్లయినం గాని నాకు నీయేవుర వలనం గ్రమంబున నైనప్రతివింధ్య శ్రుతసోమ శ్రుతకీర్తి శతానీక శ్రుతవర్మలనుపుత్రు లేవురును నీకుఁ బ్రద్యుమ్నునివంటివారు కావున వారి ననుగ్రహించి రక్షింపు మని బాష్పపూర్ణకంఠంబున గాద్గదికంబు వొడమ నీవు బంధుత్వంబునం గాని గౌరవంబునం గాని సఖ్యంబునం గాని ప్రభుత్వంబునం గాని నాపరాభవంబుఁ బరిహరింపు మని పరిపరివిధంబులం బ్రార్థించి పలవించుచుఁ బాణిపద్మంబున ముఖంబు గప్పుకొని దుఃఖంబునం జేసి మున్నీరై నకన్నీరు కరతలంబున నొత్తికొనుచు మాటిమాటికి నిట్టూర్పు నిగుడ్చుచున్న పాంచాలిం జూచి కృష్ణుం డి ట్లనియె.

చ. *గరితరొ నీదుకోపమునఁ • గౌరవు లెల్లరుఁ బార్థబాణజ
ర్ఝరితశరీరులై రుధిర సంప్లుతులై హతు లైనఁ దత్సతుల్
ధరఁ బడి దుఃఖముం దెదరు • తప్పదు నానుడి నింగి గూలినన్
బరియలువాఱినన్ ధర యుఁ పాంనిధు లన్నియు నింకిపోయినన్. 246

వ. నీపతుల కిట్టిసామర్థ్యంబు గలుగునట్లు చేసెద నీవు మహారాజ్ఞి వగుదు వింక నీశోకం బుడుగు మనినఁ బాంచాలి పాండవమధ్యముం జూచిన నతం డామెకి ట్లనియె. 247

మ. పొగులంబోవకు మింక నిట్టివగలం • బూఁబోఁడి నీచిత్త మీ
భగవంతుం డగువాసుదేవుఁడు జగద్భారాపనోదార్థ మి
జ్జగతిం బుట్టిన దేవదేవుఁ డనుచుం • జర్చింప దాఁకోక యితం
డగు నన్న ట్లగుఁ గాని వే ఱగునె కార్యం బెన్నఁడేఁ గానియున్. 248

వ. అంత ధృష్టద్యుమ్నుం డును. 249

తే. ‡ఘటజు నేనువధింతు శిఖండి కురుపితామహునిఁ జంపు భీముండు ధార్తరాష్ట్రుఁ
జీల్చు విజయుండు కర్ణునిఁ జెక్కువైచుఁ, గృష్ణనుడి శాంతి నొందు మో కృష్ణనీవు.

వ. ఇ ట్లందఱు నభిముఖులై పలుకుచున్న సమయంబున వాసుదేవుండు ధర్మజునకి ట్లనియె. 251

—••◆ శ్రీకృష్ణుండు ధర్మరాజుం బ్రశంసించుట. ◆••—

మ. †ఇటు పాటందఁగ నైతి వక్కట కటా • యే నప్డు ద్వారావతీ
కటకంబందు వసింతునేని పిలుపుం • గాంక్షింప కే తెంతు న

* బరియలు = బ్రద్దలు. ‡ కృష్ణ = ఈపేరు ద్రౌపదికిని గలదు.

† ద్వారావతి, ద్వారవతి, ద్వారక, అని రూపాంతరములు.

చ్చటి కేతెంచి దురోదరంబునను దో•షంబు ల్ప్రదర్శించి దు
ర్ఘట మైనం బహుళప్రయత్నమునఁ ద•త్కార్యంబు వారింతుఁ బో. 252

మ.*గురునిం ద్రోణుని బాహ్లికుం గృపుని నా•కుం దోడుగాఁ గొంచు న
క్కురురాజుం గని జూద మొప్పదని నీ•కుం దెచ్చు ము ప్పందునన్
నరనాథుండు నలుండు మున్ చెడె నన ♦ న్నామాట పథ్యంబుగా
నరయున్ రాజు సభాసదు ల్కితవులన్ ♦ హర్షింపకుం డ్రియ్యెడన్. 253

వ.‡స్త్రీదురోదరాఖేటనపానంబులు నాలుగును దుఃఖప్రదంబు లందు విశేషించి ద్యూతంబు మహానర్థోపేతంబుగాఁ బెద్దలవలనం బేర్కొనంబడియె దాన నేకాహంబునన మహార్థనాశనంబును వాక్పారుష్యాన్యోన్యవైరాదులుం గలుగు నని సభాస్తారు లెఱింగి యుందురు కావున సర్వప్రకారంబులఁ దేవనయుద్ధంబు గామియె సిద్ధం బగు నింతకు నే నట్టియెడ సౌభంబున నుండి యలబ్ధసన్నిధానుండ నగుటం జేసి యింతవ్యసనకారణం బయ్యె నియ్యెడ ద్వారావతికి వచ్చిన నేనిది యంతయు యుయుధానునివలన యథాక్రమంబున విని విచారించి నిన్నుఁ జూచిపో వచ్చితి ననిన యుధిష్ఠిరుం డతని కి ట్లనియె. 254

ఆ. జనుఁడు కర్మవశతఁ ♦ గొనుఁ గష్టసౌఖ్యముల్, వాసుదేవ నీవు ♦ వాసి యుంట
మాయభాగ్య మనుచు ♦ మదిఁదలంచెదఁగాల,గతికి నేమి సేయఁ ♦ గలము చెపుమ.

వ. అది య ట్లుండనిమ్ము. 256

క. మముఁ బాసి యన్నినా ళ్లో,యమలమతీ నీప్రవాస ♦ మకటకటా యే
క్రమమున నొప్పినదో చె,ప్పుము నా కన నతని కతఁడు ♦ మొగి ని ట్లనియెన్.

క. సౌభాఖ్యనగరపాలుఁడు, ప్రాభవనిధి సాళ్వభూమి•పతి న న్నెదురం
గా భూరిసేనతో నే, నాభూమికిఁ బోయియుంటి ♦ నాసమయమునన్. 258

వ. అనిన నాయుద్ధప్రకారం బాదినుండి వినవలతుం జెప్పు మనిన ధర్మరాజునకుఁ గృష్ణుండు వెండియును. 259

## సాళ్వసౌభవధోపాఖ్యానము.

మ.†దమఘోషాత్మజుఁ డీనుఁ జేసి భవదు•ద్యద్రాజసూయంబునన్
గ్రమముం దప్పి మెలంగుటన్ దునిమితిన్ ♦ గాదే మహారాజ! దా
న మదిం గ్రౌర్యము పెంచి సాళ్వుఁడు నను ♦ న్నావారినిం ద్రుంప ద
ర్పము మీఱం జనుదెంచె ద్వారవతి క•భ్యామర్దముం జేయఁగన్. 260

* కితవులు = జూదరులు. ‡ ఆఖేటనము = వేఁట. దేవనము = జూదము. సౌభము = సాళ్వునిపురము, (నన్నయభారతములో సౌంభక మని యున్నది.) † దమఘోషాత్మజుఁడు = శిశుపాలుఁడు. అభ్యామర్దము = యుద్ధము.



ఉ.*ఆయెడ నీముఖాయతన•మందు మెలంగితి నేను సాళ్వుఁ డ
త్యాయతసైన్యముం గొనుచు ♦ నప్పుడు కామగమై వెలుంగు వై
హాయస మైనసౌభనగ•రాధ్యముతో వడి దాడివచ్చి భ
ద్రాయిత మైననాదునగ•రంబును ముట్టడివెట్టె దిట్టయై. 261

మ. శిశుపాలానుజుఁ డైనసాళ్వుఁ డటు నా•సీమం బ్రవేశించి శా
శిశువుల్లోలెను నెల్లవారి కెలమిం ♦ జేకూర్చునుద్యానముల్
విశదాంభఃపరిపూర్ణపద్మలతికా•విఖ్యాతకాసారముల్
నశియింపంగ నొనర్చె న ద్దనుముయ•త్నం బెంతయే నొప్పఁగన్. 262

వ.‡అంత వాఁడును వీడని వైరంబున శిశుపాలకాలుం డైనబాలిశుం డెక్కడ వాని నొక్కుమ్మడి నుక్కుమడఁగించెద నని బీరంబులు వల్కుచు నానావిధసేనాసమేతుండును వైహాయసపురీవరవిరాజితుండును నానాస్త్రశస్త్రవిద్యావైభవుండును బరాక్రమైకజీవనుండు నైనను సపతాకంబును సతోరణంబును సయంత్రఖనకంబును సోపశల్యప్రతోలికంబును సాట్టాలకగోపురంబును సాలంఘ్యపరిఘాప్రాకారంబును సచక్రగ్రహణంబును సోల్కాపాతావబోధికంబును సభేరీపణవానకంబును సతోమరాంకుశంబును సశతఘ్నీకలాంగలంబును సపరశ్వథలోభచర్మంబును సతృణజలకాష్ఠధనధాన్యంబును సప్రహృష్టపుష్టవీరభటశతసహస్రంబును సాపారచతురంగబలంబును నైనమాద్వారవతీపురంబు భేదింప నేరక తత్పురప్రాకారబహిఃప్రదేశంబున సంతతోపద్రవంబు గలిగించుచు నవరోధించె నంత నాహుకరాజపరిపాలితు లగుగదసాంబోద్ధవోగ్రసేనచారుదేష్ణప్రద్యుమ్నప్రముఖయాదవకుమారులును భోజవృష్ణ్యంధకాదులును నవక్రపరాక్రమక్రమంబున విజృంభించి పరశుపట్టసముసలముద్గరగదాసితోమరభిండివాలకరవాలప్రముఖమహాయుధంబులతో సామజసమూహసాహాయ్యంబున విశాలసాలద్వారకవాటనిర్బంధనంబును బరిఘాప్రతిషేధంబునుం జేసి సర్వార్థసంపన్నం బైనపురీవరంబు సంరక్షించుకొనుచుఁ బ్రాకారోపరిభాగంబున నుండి శతసహస్రమహాశతఘ్నీవారంబులం బ్రయోగించుచు సాళ్వసేనాసమూహంబు సంహరింపం దొడం

* నగరాధ్యము = నగరరాజము. ‡ వైహాయసపురి = ఆకాశమందుఁ దిరుగుపురము. ఖనకము = ఎలుక, లేక త్రవ్వుసాధనము. ఆహుకుఁడు = వసుదేవపక్షుఁడు. పరిఘ = అగడ్త. శతఘ్ని = పిరంగి. ప్రదేశము = సమీపము. శిబిరము = డేరా. వరణము = కోట. (ఈవర్ణించుటవలనఁ బూర్వకాలమునందును గోటలయందుఁ బిరంగులును యంత్రఖనకంబులును ఆకాశవిమానములును జలయంత్రములును బాంబులును నానావిధాయుధంబులును గల వని తెలియుచున్నది.)

గుటయు సౌభకేశుం డగుసాళ్వుండు నది కాదని తనసేనల నెల్ల నల్లన మఱలించి తత్ప్రదేశంబున శ్మశానప్రాసాదచైత్యదేవాయతనవల్మీకవృక్షపాషాణంబులు లేనిసమప్రదేశంబున శిబిరసన్నివేశంబు చేసి నిబిడంబుగా నిలువరించి వాని నెల్ల విభాగించి శిబిరరక్షణపురమార్గావరోధనప్రభేదనాదులందు వేఱువేఱ నియోగించిన నవియు సర్వాయుధసమోపేతంబులును రథనాగాశ్వకలితంబులును బదాతిధ్వజసంకులంబులును దుష్టపుష్టబలోపేతంబులును వీరలక్షణలక్షితంబులును విచిత్రధ్వజకార్ముకంబులును నై దిట్టవడి ద్వారకాపురంబు ముట్టడించి మఱియు మఱియు వేధింపం జొచ్చె నాసందడికి సహింపఁజాలక వృష్ణినందను లందఱు నమందగతిం బొంది కవచంబులు తొడిగి వస్త్రాభరణాదులతోడం గార్ముకంబులు ధరియించి యుద్ధసన్నద్ధులై రథంబు లధిష్ఠించి చతురంగబలోపేతులై చిచ్చఱపిడుగులట్లు మండుచు వరణంబు వెడలివచ్చి పెచ్చుపెఱిగి యున్న సాళ్వసేనం దాఁకుదెంచి పరస్పరప్రహారవిహారసంహారవ్యాహారాదుల సంకుల సమరంబు గావించుచుండి రాసమయంబున. 263

—◆◆◆ సాంబాదులు సాళ్వసేనతో నెదుర్కొనుట. ◆◆◆—

ఉ. కార్ముకముం గ్రహించి రణ♦కౌశల మేర్పడి పేర్పడంగ నై
కర్మఠుఁ డైనసాంబుఁడు ని♦గాఢముగా నెదిరించి తచ్చమూ
ధర్మవిధిజ్ఞు బాహుబల♦దర్పితచిత్తుని క్షేమవృద్ధినిన్
మర్మము లుచ్చిపో నిశిత♦మార్గణము ల్పరఁగించి నొంచియున్. 264

చ. హరిహయుఁ డద్రిపైఁ గురియు♦నట్లు చమూపతిపై మహాభయం
కరుఁ డయి యంపవాన మొన♦కంబుగ జాంబవతీసుతుం డొగిన్
గురియుచు మేరువట్టు లొక♦కొంచెముగాని చలింప కాతఁ డి
త్వరుఁ డయి మాయఁ బూని శర♦వారముల న్నిగిడించె వానిపై. 265

ఆ. మాయ మాయవలన ♦ మాయమై పోవంగఁ, జేసి సాంబుఁ డపుడు ♦ చెన్నుమీఱ
వేనవేలు వాఁడి♦విశిఖంబు లాక్షేమ,వృద్ధిరథముఁ గప్ప ♦ విడిచె నపుడు. 266

వ. సాంబబాణపాతఘాతంబున నాక్షేమవృద్ధి వెఱచఱచి వెన్నిచ్చి పఱచె నంత వేగవంతుం డనుదైతేయుండును. 267

ఉ. జాంబవతీసుతుం గవిసి ♦ శాతశరంబుల సూతకేతురథ్యంబులతోడఁ దద్రథము ♦ ధారుణిఁ గ్రొళ్ళ నటంచు నేసి నాకం బవియంగ నార్చుచు న♦ఖండపరాక్రమ ముప్పతిల్ల నా
సాంబుఁడు కాలదండసదృ♦శం బగుపెన్గదఁ బూని త్రిప్పుచున్. 268



ఉ. వానిశిరము వగుల ♦ వైచిన హాఁడును, మొదలు తెగినయట్టి♦బూరువట్లు
పుడమిఁ గూలె నంతఁ ♦ గోటరియై సాంబుఁ, డరిబలంబు నొచ్చి ♦ దుర మొనర్చె.

ఆ. అంతఁ జారుదేష్ణుఁ ♦ డడరి వివింధ్యుఁ డన్,దానవాగ్రగణ్యుఁ ♦ దాఁకె వీఁక
వారి కవుసు వృత్ర♦వాసవులకుఁ బోలె, వారయుంగఁ బోరు ♦ ఘోర మయ్యె. 270

మ. ఘననాదంబుగ నార్చుచున్ దిశలు నా♦కాశంబును న్నిండ వా
రనయంబున్ మృగరాజులట్లు లని నే♦యం బూని రప్పట్టునం
దనలాస్త్రం బరివోసి యేసె నరిపై ♦ నాచారుదేష్ణుండు ర
మ్మనుచున్ బిల్చుచుఁ గాచుకొ మ్మనుచు శౌ♦ర్యం బొప్ప దీపించుచున్. 271

క. అనలాస్త్ర మట్లు వైవఁగఁ, గనుఁగొంతన విస్ఫులింగ♦కము లెగయ దివిన్
ఘనముగ మండుచుఁ దాఁకిన, దనుజుండు గతాసు వగుచు ♦ ధరపైఁ ద్రెళ్లెన్. 272

వ. ఇట్లవంధ్యపరాక్రమంబున వివింధ్యుం గూల్చిన వానికట్టెదుట నిలువఁ జాలక సాళ్వసేనాసమూహంబు సంక్షోభించె నప్పుడు కామగం బైనసౌభంబుతో సాళ్వుం డు సన్నద్ధుండై వచ్చి మహాయుద్ధంబు సేయుచు యాదవబలం బెల్లఁ జీకాకుపడ బాణవర్షంబు గురిసె నప్పుడు ప్రద్యుమ్నుండు వెఱచఱచి పఱచుతమబలంబుల నెల్ల నెలుం గెత్తి పిలుచుచు నిట్లనియె. 273

—◆◆◆ ప్రద్యుమ్నుండు సాళ్వు నెదిరించి మూర్ఛితుం డగుట. ◆◆◆—

చ. నిలుఁడు నిలుండు నేఁ గల న♦ని న్మొనకట్టుచుఁ బట్టి వీనినిన్
బిలుకుర నేసి నాదుభుజ♦విక్రమ మేర్పడ మీ కొకింతలో
పల వెఱ వాపుదున్ వెఱిగి ♦ పాఱకుఁ డోయదువీరులార మీ
కులయశముం దలంపుఁ డని ♦ కోపపరీవృతచిత్తవృత్తియై. 274

సీ. *కవచితహరియుక్త♦కాంచనస్యందన, మెక్కి మకరకేతు ♦ వెసఁగ నెత్తి
యుసుముతో లత్తెముఁ ♦ దొడి ఖడ్గధారియై, తూణము ల్బాణముల్ ♦ తొడరి తాల్చి
విద్యుల్లతికవోలె ♦ వెలుఁగుచాపముఁ బూని, వరతనుత్రాణంబు ♦ పరఁగఁ దొడిగి
గంధమాల్యాదులు ♦ గరిమమీఱ ధరించి, వాలునుం బలుకయుఁ ♦ గేల నిలిపి

తే. మాటికి నరాతికర్ణముల్ ♦ తూఁటుగట్ట, ఘట్టుగా ధనుష్టంకార ♦ మట్టిమెడఁ బొ
నర్చు చెటఁ జూడఁ దానయై ♦ పేర్చి రౌక్మి,ణేయుఁ డరిసేనఁ దాఁకి పె ♦ ల్లేయఁజొచ్చె.

క. ఒక్కొ మ్మేసినయట్టులు, మొక్కలుఁ డగుమరుఁడు బాణ♦ములపంక్తులు వే
లక్కజపడఁ బరపె న్వడి, నొక్కింతయుఁ జెక్కుచెదర ♦కుద్యచ్ఛక్తిన్. 276

* అత్తెము = హస్తకవచము. తొడి = తొడిగి. తూణము = అమ్ములపొది. రౌక్మిణేయుఁడు = రుక్మిణీపుత్రుఁడు.

ఉ.*కాంచనయష్టిపైఁ ధ్వజము♦ఖంబున వ్రేలుచు శత్రువాహినిన్
సంచరణంబొనర్చె ఘన♦నక్ర మనక్రపరాక్రమంబునన్
మించి సహస్రజంతుతతి ♦ మ్రింగుచుఁ బొంగుచు నెల్లవారికిన్
బెంచెను సాధ్వసం బెడఁద ♦ వింతగ నెంతయు నంతలోపలన్. 277

వ. ఇట్లు రవడించి మరుం డరాతుల నెల్ల నుఱుమి నుఱుమి దానం దనివోవ కంత సాళ్వు నెదిరించి నిలిచిన నతండును గ్రుద్ధుండై సౌభంబునుండి దిగి ప్రద్యుమ్నునిం దలపడియె నవుడు వా రిరువురకును బలివాసవులకుం బోలెఁ బ్రబలయుద్ధం బయ్యె నయ్యవసరంబున సాళ్వుండును. 278

సీ. మాయామయం బైన♦మణికాంచనరథం బధిష్ఠించి ప్రద్యుమ్నుఁ ♦ బ్రేళ్ళ నేసెఁ
గసలి ప్రద్యుమ్నుండు ♦ కడు వాఁడితూపుల, భుజవేగమున సాళ్వు ♦ ముంచి మించె
వాఁడును గాలాగ్ని♦వలెఁ బ్రజ్వరిల్లుచు, వేనవే లమ్ముల♦వానఁ గురిసె
నుగ్రుఁడై రౌక్మిణే♦యుఁడు మర్మభేది యౌ, దివ్యాస్త్రమున వానిఁ ♦ దిగిచి యేసె

తే. దాన సమ్మూర్ఛితుం డయి ♦ ధరణిఁ గూలె, సాళ్వరా జెల్లసేనలు ♦ సంభ్రమించి
పఱచె హాహారవము పర్వఁ ♦ బ్రధనభూమి, వృష్ణివీరునిబాణాగ్ని♦వేఁడి కులికి. 279

ఉ. అంత నొకింతలోఁ బడసి ♦ ప్రాణము లాదమఘోషనందనుం
డెంతయుఁ బంత ముప్పతిల ♦ నెప్పటియట్టులు లేచి మండుచున్
గంతునిజత్రుదేశమున ♦ గాఢతరంబుగ నేసి యమ్ము కా
లాంతకుఁడై దెస ల్మారయ ♦ నార్చెను సింహరవంబు దోఁపఁగన్ 280

ఉ.‡ఏటున మోహితుం డగుచు ♦ వృష్ణికుమారుఁడు నష్టసంజ్ఞుఁడై
మేటిరథంబుపైఁ బడియె ♦ మిమ్మట మైఁవెత న్నిజప్రజల్
మాటికి దుఃఖభారమున ♦ మానతిఁ బోవఁగ శత్రుసైన్యముల్
పాటునఁ దప్పి సంతసము ♦ పర్వఁగ గర్వముతోడ నార్వఁగన్. 281

వ. ఇట్లు మూర్ఛితుండై ప్రద్యుమ్నుండు పడుటయు. 282

తే. దారుకాత్మజుఁ డప్పు డు♦దారశక్తిఁ, బవనజవనాశ్వములఁ దోలి ♦ ప్రధనరంగ
మునకు వెలి గాఁగఁ దొలఁగించి ♦ తనరథంబు, నాతిదూరప్రదేశంబు♦నందు నిలిపె.

వ. అంతఁ గొంతవడికి లబ్ధసంజ్ఞుండును ధనుర్ధరుండు నై ప్రద్యుమ్నుండు సూతుం జూచి యిట్లనియె. 284

మ. అని వెన్నిచ్చి పరాఙ్ముఖుండ వగుచున్ ♦ హా సూతి నీ వేటికి
ట్లనుమానింపక వచ్చి తేమిపని చే♦యం జొచ్చి తాసాళ్వునిం

* నక్రము = మొసలి. ‡ మిమ్మటము = మిక్కుటము.



గని భీతిల్లితె వృష్ణివీరులకు నీ♦కర్మంబు ధర్మంబు గా
దనుచున్ దారుకనందనుండు పలికెన్ ♦ న్యాయానుబంధంబుగన్. 285

శా. ఓజానార్దన మోహముం భయము నా ♦ కుల్లంబునం బుట్టునే
రాజన్యాన్వయధర్మ మిట్టిద రథిన్ ♦ రక్షింప నౌ మూర్ఛవో
నాజిన్ సారథి సారథిన్ రథియు న♦న్యోన్యమ్మునున్ వారి కీ
యోజన్ ధర్మము చెల్లుచుండు నని నీ ♦ వూహింపు ముల్లంబునన్. 286

తే. కలన నేకాకి వీవు ర♦క్కసులు పెక్కు, రలసి తని సాళ్వునకు నిట్లు ♦ తొలఁగఁ దెచ్చి
తిని రథం బని పలికిన ♦ విని రమాకుమారుఁ డిట్లని వానికి ♦ మఱియు ననియె. 287

ఉ. మాకులమం దనిం బడిన♦మానిసి చంపును జచ్చుఁ గాని తా
నీకరణిం బరాఙ్ముఖత ♦ కెంచఁడు నే మరణింపకుండ నీ
వో కలనం దొలంచు టది ♦ యొప్పదు రాముఁడు కృష్ణసాత్యకుల్
నీ కిది యేమి వచ్చె నని ♦ నింద యొనర్చెద రేమి సేయుదున్. 288

—— సాళ్వుం డోడిపోవుట. ——

వ. *మఱియు నక్రూరసాంబచారుదేష్ణప్రభృత్యంధకవృష్ణిప్రవీరు లెల్లరు నిది మనకులంబునకుం గానిపని యని న న్నెల్లఁబోఁ దిట్టెద రేమి చెప్పుదు నింక నీప్రాణంబులతోడఁ బ్రయోజనంబు లేదు రథ్యంబుల మరలించి రథంబు రంగస్థలంబునకుం దోలు మనిన సూతపుత్రుండు నేను సాళ్వశరాభిహతుండనై మూర్ఛితుండ వగు నీచే రక్షింపంబడ నేర కిట్లు చేసితి నీ విపుడు మూర్ఛ దేఱితివి గాన దారుకపుత్రుండ నగునానై పుణ్యంబు సూడు మని పగ్గంబులు సడల్చి ప్రతోదంబున రథ్యంబుల కీలువ సూపుటయు నవియును సవ్యాపసవ్యచిత్రమండలగతుల నంతరిక్షచరంబులో యన నొప్పి మహీతలంబు ఖురపుటంబుల స్పృశించుచు నర్ధక్షణంబునఁ బరమాద్భుతప్రకారంబున సేనావారంబుల నొత్తుకొనుచు సాళ్వుం జేరఁబాఱిన నతండును. 289

తే. మూఁడునారాచముల సూత♦పుత్త్రు నేసి, యీసునను వాని నొప్పించి ♦ వాసి మీఱఁ
దఱియ వచ్చెడురుక్మిణీ♦తనయుమీఁదఁ, బెక్కు భల్లంబులను వైచి ♦ యుక్కు మిగిలె.

తే. వాని నన్నింటి రుక్మిణీ♦సూనుఁ డధ్వ,మధ్యమున నొండు రెండు గా ♦ మత్సరించి
త్రుంచి కరలాఘవముఁ జూపి ♦ తొట్రిలంగఁ, జేసెఁ జేయుచుఁ దగ మంద♦హాసమపుడు.

వ. అట్లు తనబాణంబులు నడుమన తునియ లయినం గని సాళ్వుండును. 292

ఉ. ఆసురమాయ నూని పర♦మాద్భుత మేర్పడ బాణవర్షమున్
భానురమూర్తిపైఁ గురిసి ♦ బాధతరాస్త్ర మొకండు పూని నో

* ప్రతోదము = గుఱ్ఱములఁ దోలుమునికోల. ఇలువ = వన్నె.

నేసిన వృష్ణివంశజుఁడు ♦ నేత్రముఁ జూపుచు బ్రహ్మమస్త్రముం
దీసి తదుగ్ర మార్గణ విడె ♦ దేవవిరోధిశిరోధిపైఁ బడన్. 293

తే. సౌభనాథుఁడు బ్రహ్మాస్త్ర♦శక్తివలనఁ, దూలి మూర్ఛిల్లి పడియె న♦క్కాలమందు
మఱియుఁ బ్రద్యుమ్నుఁ డొక్క స♦మర్పితాస్త్ర,శక్తి నడరించి వానిని ♦ జంప నెంచె.

వ. అట్టియెడ నాయస్త్రప్రయోగంబు గని హాహాకారంబులు సేయుచు నంతరిక్షంబునఁ గుబేరసునాసీరసహితు లగుదేవగణంబు లెల్లఁ దల్లడిల్ల నారదగంధర్వాదులం బుచ్చిన వారును మనోజవంబునఁ బ్రద్యుమ్నుపాలికి వచ్చి యి ట్లనిరి. 295

ఉ. వేయకు మిమ్మహాస్త్రమును ♦ వీనిపయి న్వీను నీ కసాధ్యుఁ డీ
మాయలమారి వీని కల♦మాధవుఁ డయ్యెడు మృత్యు విట్లు ము
న్నాయజుఁ డానతిచ్చె నటు ♦ లయ్యెడుఁ గావుత మోయదూద్వహా
పాయుము నీప్రయత్నము సు♦పర్వులపం పిది సేయు మియ్యెడన్. 296

—•◆ శ్రీకృష్ణుండు సాళ్వునిమీఁదికి దండెత్తుట. ◆•—

వ. అని నియోగించినఁ బ్రద్యుమ్నుండును దనయస్త్రం బుపసంహరించె నవుడు సాళ్వుండు లేచి యావనశరపీడితుండై ద్వారకానిరోధనం బుడిగి బలంబుల నెల్ల మరలించి సౌభం బెక్కి వియద్గమనంబునం జనియె నంత నేను నీరాజసూయాధ్వరంబై నవెనుకం జని గోపురంబులు విఱిగి తోరణంబులు తెగి తోఁటలు గూలి బాటలు చెడి నిష్ప్రకాశంబై సొంపుచెడి యున్న ద్వారకాపురంబు గని హార్దిక్యునివలనఁ దద్వృత్తాంతం బంతయు విని యాహుకానకదుందుభిప్రముఖవృష్ణివీరుల నెల్ల శశ్వత్ప్రకారంబుల నాశ్వాసించి మీ రప్రమత్తుల రై పురంబు రక్షించుకొను చుండుఁ డే నిప్పుడ పోయి సాళ్వుం జంపికాని పురప్రవేశంబు చేయ నని ప్రయాణభేరి వేయించి బ్రాహ్మణకృతస్వస్త్యయనుండనై శైబ్యసుగ్రీవమేఘపుష్పవలాహకయుక్తంబును దారుకసారథికంబు నగురథం బధిష్ఠించి పాంచజన్యంబుఁ బూరించి చతురంగబలంబులం గూడి పయనంబై కదలి నానావిధగిరివనప్రదేశంబు లతిక్రమించి మార్తికావతదేశంబుమీఁదుగా సౌభపురంబుఁ జేరునంతకు మున్న సాళ్వుండు సౌభంబుతో సాగరకుక్షిప్రదేశంబునకుఁ బోయె నని విని నేను వానిపిఱుందన చని. 297

ఉ. సాగరమధ్యమందుఁ దన♦సౌభపురంబును నిల్వరించి ర
క్షోగణసంయుతుం డగుచుఁ ♦ గ్రూరుఁడు సాళ్వుఁడు దానిమీఁద వి
చ్ఛాగతి నుండి దవ్వులను ♦ సైన్యముతోఁ జనుదెంచుచున్న నన్
డాఁ గని రమ్ము ర మ్మనుచు ♦ నవ్వుచుఁ బిల్చెను మాటిమాటికిన్. 298



ఆ. అంత నే నొకింత ♦ యంతికగతుఁడ నై, శార్ఙ్గ మెక్కువెట్టి ♦ శాతశరము
లలుక వానిమీఁద ♦ నడరించితిని వాఁడు, నడరి పూర్వవైర ♦ మది తలంచి. 299

శా. నాపై సూతునిపై హయంబులపయిన్ ♦ సైన్యప్రవారంబుపైఁ
గోపం బేర్పడ దొడ్డవాతిశరముల్ ♦ కోటానఁగోట్లేయుచో
నాపై వానిపదాతివర్గమును బా♦ణాసారముం గుప్పి య
ద్దీపించెం భయదప్రకార మగుచున్ ♦ దీండ్రించె నాలం బటన్ 300

మ. అసురక్షిప్తమహాస్త్రశస్త్రసముదా♦యం బిట్లు నాసేనలన్
ముసుఁగుం బెట్టినయట్టిపట్టునను ఖిన్ను న్నన్నునుం దెన్నుదున్
బ్రసమీక్షింపఁగ రామి నేనుఁ గిది వా♦ర్యం బిద్ది తే రిద్ది భృ
త్యసమూహం బిది యంచు నేర్పఱుపరా♦ దయ్యె న్మహీవల్లభా. 301

—•◆ శ్రీకృష్ణసాళ్వులమహాయుద్ధము. ◆•—

తే. అంత నే నల్కఁ జేసి బ♦హ్వాయుతశరము, లొనఁగ నద్విధి మంత్రించి ♦ యేసి కప్పఁ
దోలఁచి సౌభము రెండుక్రో♦సులు దోలంగఁ,దోలితిని జూపఱెల్ల న♦న్నోలి మెచ్చ.

మ. అటు లాశార్ఙ్గధనుర్విముక్తపటుబా♦ణౌఘంబు సౌభంబుపైఁ
బటులప్రక్రియఁ దాఁకి తన్నిలయులం ♦ జక్కాడ వా రందఱుం
ద్రుటిమాత్రన్ బడి రర్ణవాంతరమునం ♦ ద్రుంగ న్దలల్ కంఠముల్
కటిదేశంబు లురంబులుం గరములున్ ♦ గక్షంబులుం గుల్ఫలున్. 303

క. ఖండములై మొండెములై, మొండై పడినట్టిరిపుల♦మేనులు జలధిన్
నిండుకొని యున్న జంతువు, లండగొనక మ్రింగికొనియె ♦ నాకలి దీఱన్ 304

తే. అవల గోక్షీరకుందేందు♦ధవళ మైన,పాంచజన్యమ్ము ప్రాణమ్ము ♦ పట్టువఱిచి
పట్టి పూరించినాఁడ న♦ప్పట్టునందు, జగము లల్లాడెఁ బ్రళయాబ్ద♦శబ్ద మనుచు. 305

వ. దాన సహింపంజాలక సాళ్వుండు. 306

సీ. శాంబరిం బూని ప్రా♦సపరశ్వథగదాహ,లాదిశస్త్రములు నా♦మీఁదఁ బఱపి
సేను వానిన్ మాయ♦నే హరించుచు నుండి, గిరిశృంగముల నన్నుఁ ♦ దెరలఁగొట్టి
సుదినదుర్దినములు ♦ పొదల నుష్ణసుశీత,ముగ నిప్పలుం దుమ్ము ♦ మొగిని గురిసి
మాయావియై నన్ను ♦ నాయోధవరులను, శస్త్రాస్త్రసమితిచేఁ ♦ జాల నొంచి

తే. చదలు శతసూర్యశతచంద్ర♦శతసహస్ర,తారకం బయి వెలుఁగ నా♦తం డొనర్పఁ
బవలు రేయును దెలియని♦పగిది యయ్యె, నవుడు ప్రజ్ఞాస్త్ర మేసి నే ♦ నడరినాఁడ.

వ. అంత సాళ్వుం డంతరిక్షంబున కెగసి రాక్షసనాదంబు సేయుచు నతిపర్వంబు లగు

శతసహస్రశరంబులు రథరథ్యసూతకేతువులపై నేయుటయు వివశుండై దారుకుండు-
నన్నుం జూచి. 308

మ. నిలువం జాలను సాళ్వబాణములచే ♦ నిల్వెల్లఁ బెంజల్లెడన్
దలపించు న్ననుఁ జూడు మంచు వెతచే ♦ తం గుందుచు న్నేను మా
తలినిం బోనిమదీయసారథి మెయిం ♦ దర్శించితి న్మార్గణా
వలికిన్ వాచవి గానిచో నెచట నా♦వంతేని లే దారయన్. 309

క. శరవేదనకుం దాళక, కర మడరెడువానిమేను ♦ కనికరమున నేఁ
గరమున నిమిరితి జేవురు,ధరణీధరమట్లు చూడఁ ♦ దగియె నరేంద్రా. 310

వ. అట్టిసమయంబున ద్వారకాపురవరనిలయుం డగునొక్కపురుషుండు వచ్చి తా నా
హుకప్రేషితుండ నని చెప్పి యి ట్లనియె. 311

చ. పితృసఖుఁ డాహుకుండు నినుఁ ♦ బిల్వఁగఁ బుచ్చిన వచ్చినాఁడ నే
నతిబలశాలి సాళ్వుఁడు భ♦యంకరుఁడై వసుదేవుఁ జంప నీ
క్షితిఁ గలనేల చాలు నికఁ ♦ జెచ్చెర రమ్ము పురమ్ముఁ గావ నీ
హితులను బ్రోవ నో త్రిజగ♦దేకపరాక్రమ యో త్రివిక్రమా. 312

వ. అని పలికిన నులికిపడి నే నప్పలుకు లిదమిత్థ మని నిశ్చయింపఁ జాలక దుర్మనుండనై.

మ. బలదేవోద్ధవసాత్యకిప్రభృతు లా♦ద్వారావతిం బ్రాణముల్
గలవారై వసియింతురేని తలఁపం♦గా సాళ్వుఁ డేపాటి కొం
డలఁ జెండాడినవజ్రికైనఁ దరమే ♦ నాతండ్రినిం జంపఁ గొం
దలముం బొందెను డెంద మిందలియథా♦ర్థం బెట్టులై యుండునో. 314

వ. అని డోలాయమానమానసుండనై యుండునంత. 315

తరువోజ. త్రిదివంబునుండి క్రిం♦దికిఁ బడునట్టి♦దేవకల్పుఁడు యయా♦తికి దీటువచ్చి
చిదిసినభూష లు♦ష్ణీషంబు వీడఁ ♦ జేలము ల్వ్రాలముల్ ♦ చెన్నఱి వ్రేల
మది తూల నాసౌభ♦మధ్యంబునుండి ♦ మహితలంబునఁ బడు♦మాతండ్రిఁ జూచి
యిది యేమి యనుచు నే ♦ నెంతయుఁ జింత ♦ నెఱుకచెడ న్విమో♦హితుఁడనై యుంటి.

తే. శూలపాణులు పదుగురు ♦ చుట్టి పొదువ, వికృతరూపములతోఁ బత్తి♦విధము దోఁపఁ
గాలుసేతులు విడఁ జాఁచి ♦ నేలమోము,చేసి పడుతండ్రి నన్ను మూ♦ర్ఛితునిఁ జేసె.

తే. శార్ఙ్గము సుదర్శనము పాంచ♦జన్యనంద,కములు కౌమోదకియును నా♦కరముల విడి
పడియెఁ బుడమిపై నే మూర్ఛ♦పడినయపుడు, చెదరి నాసేన చచ్చిన ♦ ట్లుదరిపడియె.

వ. అంత నే నొక్కముహూర్తమాత్రంబున లబ్ధసంజ్ఞుండనై మాతండ్రిని సౌభసాళ్వదు-
లం గాన కిది యంతయు నాసురమాయ యని నిశ్చయించి మించి శరాసనంబు



గ్రహించి సౌభంబుపై నాశీవిషాకారంబు లూర్ధ్వగంబు లుగ్రంబు లగుశరంబులు
శతసహస్రంబులు ప్రయోగించినంత సౌభం బంతర్హితం బైన విస్మితుండనై యుంటి
నప్పుడు దానవాక్రోశధ్వానంబు దశదిశాక్రాంతంబై కల్పాంతవారివాహధ్వానంబు
వోలె భయంకరం బయ్యె నయ్యెడ. 319

ఆ. శబ్దభేదులైన♦జ్వలితాస్త్రములు పెక్కు, నారి దిగిచి యేసి♦నాఁడ నంత
శబ్ద ముడిగి పడిరి ♦ జర్జరితాంగులై, క్రూరు లెల్లఁ గుప్పఁ♦గూర లగుచు. 320

సీ. అంతఁ బ్రాగ్జ్యోతిషం♦బై సౌభ మొప్పి నా,కంటికి మోహంబు ♦ గప్పివుచ్చె
నాసాళ్వుఁడును దారు♦ణాకృతి లోకాంత,కరణుఁడై నామీఁదఁ ♦ గరుణ విడిచి
పాషాణభీషణ♦పర్వతపఙ్క్తులు, వర్షించునట్టులు ♦ వైచి కొట్టె
నుత్పాతములఁ బోలు♦తత్పాతముల నేను, నాసేనయును జాల ♦ నలిగితి మటఁ

ఆ. *బిదపఁ గొంతవడికి ♦ మది నెంచి సర్వపా,షాణభేదనంబు ♦ జంభభేది
కిష్ట మైనవజ్ర ♦ మెత్తి వైచితి దాన, గిరులు పొడవడంగి ♦ విరిసి పోయె. 321

వ. అయ్యార్తినుండి విముక్తులైననావా రెల్లరు మేఘజాలంబునుండి వెలువడినవేవెలుం
గు తెఱంగున నున్ననన్నుఁ గీర్తించి హర్షించుచుండి రపుడు దారుకుండు నన్నుం జూచి
యి ట్లనియె. 322

ఉ. శత్రునిబర్హణుండ వని ♦ శౌర్యముఁ జూప వి దేల వీనిపై
మైత్రిని వీఁడు మీఖలుఁడు ♦ మార్దవసాధ్యుఁడు గాఁ డుపేక్షకుం
భ్రాతృఁడు గాఁడు ద్వారవతి ♦ భస్మ మొనర్చినవాఁడు క్రూరుఁ డీ
శాత్రవుఁ గాలయాపనము ♦ సల్పక కూల్పు మనల్పకల్పనన్. 323

వ. అని నాసారథి బోధించిన నేను నది యథార్థతత్త్వం బని తలంచి దారుకా నీ వొక్క
ముహూర్తమాత్రం బిట్లు ప్రతీక్షించుచుండు మీసాళ్వసైన్యంబులును సౌభంబు
నెట్లుండునో తెలిసికొందువు గాక యని. 324

### సుదర్శనముచే సాళ్వుండును సౌభంబును దెగుట.

మ. అనలాస్త్రంబు సమంత్రకంబుగ రిపు♦ప్రాణాంతకం బౌవిధిన్
గొనయంబం దమరించి రాక్షసులు య♦క్షుల్ దైత్యులుం దానవుల్
గనుచుండ న్నశియింత్రుగాత మని దో♦ర్గర్వం బఖర్వంబుగాఁ
గొని నే వైచితి దాన భస్మ మగుచున్ ♦ గూలంగనై రెల్లరున్. 325

వ. అంతన పోక కాలాంతకయమోపమం బగుసుదర్శనచక్రం బవక్రవిక్రమంబున
నభిమంత్రించి సౌభంబుపైఁ బ్రయోగించితి నంత. 326

చ. అదియును భూనభోంతర మ ♦ దంతయు నిండి సురారిగుండియల్
చెదరఁగ మండుచున్ గదిసి ♦ చీల్చెను బెల్చన సౌభమధ్యమం

---

* వజ్రము=వజ్రబాణ మని యర్థము.

దదటున దారువుం గ్రకచమట్లు పురం బట రెండు వ్రయ్యలై
చిదియఁబడె న్మహేశ్వరునిచే వడి ముందు త్రిపురంబుచాడ్పునన్. 327

తే. పగలకుం ఘోరదర్శన మగుసుదర్శనము వడిం సౌభమును గూల్చి నాదుపంపు
వలన సాళ్వుని రెండుచెక్కలుగఁ జేసి, లలి మరల వచ్చి నాకే లలంకరించె. 328

వ. *అట్లు సాళ్వుండు తెగిన హతశేషు లగుదానవులు హాహాకారంబు సేయుచు నూడ
నిం బాడి రంత నేను నేలం బడి కాలుసౌభంబుచెంత నరదంబు నిలిపి పరమహర్షం
బునఁ బాంచజన్యంబుఁ బూరించి నిర్వర్తితకృత్యుండనై మరలి బలంబులతో
నావర్తంబులం బ్రవేశించితి నేతత్కారణంబునం జేసి నే నపుడు నీకడ లేకపోతి
దాన నింత వచ్చె నిపు డేమి సేయవచ్చు గతజలసేతుబంధనం బయ్యె నని చెప్పి పుండ
రీకాక్షుండు పాండవేయుల నాశ్వాసించి ధౌమ్యసమ్మానితుండై పాంచాలి నూఱార్చి
సుభద్రాభిమన్యులం దనరథం బెక్కించుకొని వీడ్కొని ద్వారకాపురంబునకుం జనియె
నంత ధృష్టద్యుమ్నుండును ద్రౌపదేయులం దోడ్కొని కాంపిల్యంబునకుం బోయెఁ
జేదిదేశాధీశుం డగు ధృష్టకేతుండును దనతోఁబుట్టువును వెంటఁ బెట్టుకొని శుక్తిమతీ
పురంబున కరిగెఁ గైకేయులును బాండవానుజ్ఞాతులై యథాగతకృతగమనులై రనం
తరమ్ము త మ్మనుసరించుకొని యున్నబ్రాహ్మణాదులం గూడి పాండవులు కామ్యక
వనంబునం గొంతకాలం బుండి కురుజాంగలవాసుల నెల్ల ననునయించుచు నెట్టకేలకు
వారివారిపొందుపట్ల కంపిపుచ్చి ఋత్విగ్బ్రాహ్మణపరివృతులై రథంబు లధిష్ఠించి ద్వై
తవనంబునకుం జని రని చెప్పిన విని శౌనకాదు లవ్వలివృత్తాంతంబుచెప్పు మని సూతు
నడుగుటయును. 329

—•●◆ ఆశ్వాసాంతము. ◆●•—

మ. కనుచుండన్ వడి బండికుండవలె నీకాలం బొగిం జొల్లిపో
వును నేఁ డున్నది రేపు లే దెవుఁడొ పెంపుం జెంద నౌ నన్నుఁ గా
దనుమానింపదు మృత్యు వోయిజగదీశా! నాదుప్రారంభముల్
గొనసాఁగం గరుణింపవే యెడఁద నీకుం భక్తిమై మ్రొక్కెదన్. 330

క. నిన్నుం గొలిచినవారికి, బన్నంబులు లే వటంచు భావించి మదిన్
సన్నుతి సేయుచు నుంటిన్, నన్నుం గృపతోఁ గనుంగొనం గదె దేవా! 331

గద్యము.

ఇది శ్రీమదఘనాతనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్త్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునం
దారణ్యపర్వంబునం బ్రథమాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.

* ఊడనిం బాడిరి = పడిరి.

శ్రీ

బాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

ఆరణ్యపర్వము—ద్వితీయాశ్వాసము.



ము క్తిలపురీశ్వర
సోమార్చితపాదపీఠ సుగుణగరిష్ఠా
సోమార్కానలతేజ
స్తోమాధారాంగ సకలశోభనలింగా. 1

—•●◆ పాండవులు ద్వైతవనంబున విడియుట. ◆●•—

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కి ట్లనియె నట్లు పాండవేయులు ద్వైతవనంబు
నం బ్రవేశించి యున్నసమయంబున యుధిష్ఠిరుండు తమ్ములం జూచి యి ట్లనియె.

మ. మన కీనాళ్లు వనంబునం గడప నిర్మాణం బగుం గర్మవా
సనకల్మిన్ వగవంగ నేమిటికి నిష్టప్రాప్తికిం దృష్టిఁ బొం
దిసచందంబున నుంద మిం దునికికిన్ దివ్యప్రదేశంబులున్
ఘనకూలంకషలున్ ఫలద్రుమములున్ గన్పట్టుటన్ బొల్పగున్. 3

వ. అనిన నర్జునుం డన్న కి ట్లనియె. 4

ఉ. ఈవు త్రికాలవేదివి మహీసురసత్తములుం ద్రిలోకసం
భావితులైననారదులు బ్రహ్మవిదుత్తరులైనవ్యాసులున్
సేవితులై నిరంతరము నీకు శుభంబులు గూర్చుచుండ్రు మా
కీవ గురుండ వీ వనినదే నిగమం బగుఁ గాదె చూడఁగన్. 5

తే. నీతలంచినయట్టులే ద్వైతవనము, పుష్పఫలవృక్షరమ్యము పుణ్యపురుష
సేవితము దివ్యశైవలినీవిరాజితము మనకు వాసయోగ్యము ధరణినాథ. 6

మ. మధురామోదఫలప్రసూనవిలసన్మాకందరంభాల్లికా
మధుజంబీరశిరీషకేసరశమీమందారవాసంతికా

మధుసారక్రముకాదివృక్షవిచర♦న్మత్తాన్యభృచ్చారికా
మధులిట్కీరపతంగకాదిఖగస♦మ్మర్దధ్వను ల్వింటివే. 7

చ. మెలిగాని యెంతోకొంత డారయ ♦ మిక్కిలి చిక్కగ నున్నమావితో
పుల నలవోక మొత్తముగఁ ♦ బుల్గులు గూయఁగఁ బూవుఁదేనియల్
జలజల రాలి నేలపయి ♦ జాల్కొన నెమ్మలు చూచి కారుమ
బ్బు లుఱుముచుం గడుం గురియుఁ ♦ బో యివు డీబమ నాను నేత్రతిన్. 8

చ.*కదుపులుగట్టు ధేనుకలు ♦ గండతలంబులనుండి మెండుగా
మదము స్రవింపఁ దుమ్మెదలు ♦ మాటికి జుమ్ము రుమంచు మూఁగ స
మ్మదమున నాడుచున్ గలభ♦ముల్ నడ నాఁగఁగ ఘీంకరించుచున్
మదకలముల్ దగు న్విపిన♦మధ్యమున న్నడగొండలో యనన్ 9

మ.‡నిగతం బీగహనాంతరంబునను వ♦ర్ణింపంగ నొప్పుం దృణాం
కురముల్ మేయుచు నీళ్లు ద్రావుచు మెడల్ ♦ కొంచెంబుగాఁ గుంచి గ
హ్వారిఁ గా లూఁదుచు నింతవింత విహగం♦బ ట్లంతరిక్షంబునన్
బరుగుల్ వాఱెను గుంపులై హరిణముల్ ♦ భావింప సాధుస్థితిన్. 10

క.†అదె భోగవతీతీరము, సదమలమతు లై నసిద్ధ♦సంయమిచంద్రుల్
విదితముగ నచట నుటజము, లొదవన్ దవీమున్నవార ♦ లుర్వీనాథా. 11

వ. అని యవ్వనంబుం బ్రశంసించిన విని ధర్మనందనుండు మనంబున హర్షించి యం
దొక్కలతావితానావనతవిశాలసాలంబు క్రిందఁ దమకు నివాసం బేర్పరించుకొని
తండ్రివలెం బురోహితుం డగుధౌమ్యుండు సకలతంత్రంబులు నడపుచుండ దేవ
పితృదేవకార్యంబులు నిర్వర్తించుచుఁ దమ్ముం జూడ వచ్చినవనౌకసులకును దమతో
నున్నబ్రాహ్మణప్రభృతులకును నిష్టమృష్టాన్నంబులఁ బరితుష్టిం గావించుచున్న
సమయంబున. 12

—••◆ పాండవులకడకు మార్కండేయుండు వచ్చిపోవుట. ◆••—

చ. జ్వలితహుతాశనుం డనఁగ ♦ సంభృతదీప్తుల దిక్తటంబులన్
వెలుఁగఁగఁ జేయుచున్ బ్రథిత♦వీర్యముతోఁ జనుదెంచెఁ బాండవే
యులకడకున్ మృకండుతన♦యుండు పురాణమునీంద్రుఁ డాహతా
ఖిలకలుషప్రచారుఁడు ప్ర♦కృష్టతపోవిభవాభిరాముఁ డై. 13

క. సురనరపూజితుఁ డగునా,పరమమునిం బాండుసుతులు ♦ భక్తిశ్రద్ధా
పరు లయి పూజించిరి కర, మరుదుగ ధౌమ్యోపదిష్ట ♦ మగుమార్గమునన్. 14

* ధేనుకలు = ఆఁడేనుఁగులు. కలభముల్ = ఏనుఁగుపిల్లలు. మదకలములు = మదపుటేనుఁగులు.
‡ గహ్వారి = భూమి. † ఉటజము = పర్ణశాల.



వ. అట్లు పూజితుం డై నమార్కండేయమునీశ్వరుండు యుధిష్ఠిరభీమసేనార్జుననకులసహ
దేవులం ద్రోవదిం జూచి మందహాసంబు గావించె దానంజేసి పాండవాగ్రజుండు
విమనస్కుండై యతని కి ట్లనియె. 15

చ. మునివర మమ్ముఁ గాంచి ముని♦ముఖ్యులు పీరు విచారయుక్తు లై
వనట వడంగ నీ విటులు ♦ వారక కోరికఁ జేసినోలె మో
మున నగవుల్ ప్రవర్తిలఁగ ♦ ముచ్చటలాడెద వేల జాలి నీ
మనమున లేకపోయెనొకొ ♦ మాదురవస్థ యెఱింగియుండియున్. 16

వ. అనిన మార్కండేయుం డి ట్లనియె. 17

తే. హర్షమునఁ జేసి నే నవ్వ♦నయ్య తేఁడ, నేఁడు నీయాపదను జూడ ♦ నాఁడు పితృని
దేశమున వని కేగిన♦దాశరథి మ,నంబునం దోఁప నగితిఁ గా♦లంబుగతికి. 18

మ.*పురుహూతప్రతిమానుఁ డారఘుకులాం♦భోరాశిచంద్రుండు మున్
ధరణీరాజ్యసుఖంబులం దొఱఁగి కాం♦తారమ్ములం దమ్ముఁడున్
దరుణీరత్నము వెంట నంటి నడువన్ ♦ దాతోక్తి నీరేడువ
త్సరముల్ కాఁపురముండె నే నరసితిన్ ♦ దత్కాలమం దాతనిన్. 19

వ. మఱియు నాభాగ భగీరథ భరతాలర్క ప్రభృతిభూపాలచంద్రు లీభూతలం బంతయు
జయించి పరిపాలించియు వనవాసాదుల విక్లేశంబులం బడియు విధిచోదితులై ధర్మ
పథంబునం బ్రవర్తించి పరంధామంబు నొంది రని నీవు నెఱుంగుదు వాకర్ణింపుము.

తే. విధివిహిత మైనవిధమున ♦ వివిధభూత,సంచయంబులు జన్మాను♦సారముగను
గర్మ మొనరించి ఫల మొందుఁ ♦ గాని తెలియ, వానికర్తృత్వ మింతయు ♦ నేని లేదు.

ఉ.‡మిత్రసమానతేజము న♦మేయపరాక్రమ మార్జవంబు స
త్పాత్రత గల్గి సత్యమున ♦ ధర్మమునన్ జనునీవుఁ దమ్ములున్
క్షేత్ర మరణ్యవాసమును ♦ జేసినపిమ్మట వోవఁ బిమ్మటన్
ధాత్రి సుఖంత్రు గావుత య♦థావిభవంబున రాజ్యసంపదన్. 22

—••◆ బకదాల్భ్యుండు ధర్మరాజుం బ్రశంసించుట. ◆••—

వ. అని మార్కండేయుండు తపస్విమధ్యంబునం బలికి ధౌమ్యసహితు లగుపాండవుల
నామంత్రించి యుత్తరదిశాభిముఖుండై చనియె నంత బకదాల్భ్యుం డనుమునీశ్వ
రుండు సంధ్యోపాసనాసీను లై నపాండవేయులను హోమవేళాప్రజ్వలితపావకు లైన
తపస్వివరులను ఋగ్యజుస్సామాథర్వణవేదాధ్యయనంబు సేయుఋషిపుత్త్రులనుం గాం
చి సంతసించుచు నజాతశత్రున కి ట్లనియె. 23

* తాతోక్తి = పితృవాక్యము. ‡ క్షేత్రము = భార్య. పిమ్మట = దుఃఖము, అనంతరము.

ఉ. భూతమహీసురవ్రజ ♦ ముఖ్య ముఖోదిత వేదనాదముల్
భూతలనాథచాపగుణ ♦ భూరివిరావము కాలహోమసం
జాతమహోత్తమారవము ♦ సంతతముం బొలుపొందుచుండ నీ
ద్వైతవనంబు పొల్పగు వి♦ధాతృలసద్భవనంబుచాడ్పునన్. 24

వ. రాజా! భార్గవులు నాంగిరసులు వాసిష్ఠులుఁ గాశ్యపులు నాగస్త్యులు నాత్రేయులు నగు బ్రాహ్మణోత్తము లనుదినంబును నిన్ననుసరించి నీచేత రక్షింపఁబడుచు నీకు శ్రేయంబు లొసంగుచుందురు. 25

చ. నృపతులు విప్రసంగతి న♦నింద్యచరిత్రులు పుణ్యగాత్రులై
విపినము వాయుసంగతిని ♦ జేర్చి దవానల మేర్చుచాడ్పునన్
రిపులను సంహరించి సుప♦రిష్కృతరాజ్యరమావిశాలురై
నిపుణమతిం బ్రవర్తిలఁగ ♦ నేర్తురు నిక్క మెఱుంగఁ జెప్పితిన్. 26

మ. మును వైరోచనుఁ డబ్బలీశ్వరుఁడు స♦మ్మోదంబునన్ విప్రులం
గొని తన్మైత్రికిఁ బాత్రుఁడై సకలది♦క్కూలంబులన్ రాజ్యశా
సన మొప్పంగ నొనర్చి పేర్చి తదని♦ష్టత్వంబునం జేసి పైఁ
దనసామ్రాజ్యము వోఁ జెడెన్ దెలియవే ♦ తద్వృత్తముల్ సత్తమా. 27

క. నరవర నీమన మెప్పుడు, ధరణీసురవరులయందుఁ ♦ దత్పరమై ని
ర్భరవృత్తి నొప్పఁ గావున, సిరియును సంపదయు నీకుఁ ♦ జేకుఱు నెపుడున్. 28

వ. అని ప్రశంసించుబకదాల్భ్యు నచటి బ్రాహ్మణు లెల్లరు నభినందించి పూజించి రంత ద్వైపాయన నారద హారీత స్థూలక ర్ణాగ్నివేశ జామదగ్న్య బృహదశ్వ శుక శౌనక సుహోత్ర హోత్రవాహన ప్రభృతి మునివరేణ్యులు ప్రతిదినమును వచ్చి పాండవుల నాశ్వాసించుచుండు రంత నొక్కసాయాహ్నంబున వారార్వురును గూరుచుండి దుఃఖపరాయణులై కథలు సెప్పుకొనుచున్న సమయంబునఁ బాంచాలి పాండవజ్యేష్ఠునిం జూచి యిట్లనియె. 29

### ద్రౌపదీధర్మరాజులసంవాదము.

చ. ఖలుఁ డగు ధార్తరాష్ట్రునకుఁ ♦ గాఱడవిం బడి దుఃఖ మొందుమిం
మ్ముల విని నప్పుడున్ గరుణ ♦ పుట్టదు పూ తలపోయ వానికిం
గల దిను మైమనం బిటులు ♦ గాకెటు లైనఁ బ్రభుత్వసంపదల్
బొల్చినవార లిట్లు వడ ♦ మోదము నొందఁగలండె చెప్పుమా. 30



ఉ. *నారలు గట్టి కూరల న♦నారతముం దిని దుఃఖభాజులై
ఘోరవనాంతరంబులను ♦ గ్రుమ్మరుమిమ్ములఁ జూచి కర్ణుఁడుం
గ్రూరుఁడు దుస్ససేనుఁడును ♦ గొబ్బి సుయోధనుఁ డాదురోదరా
కారుఁడుఁ గాక వే తెవఁడు ♦ కందొవ నీ ర్వడఁ గుంద కుండెడిన్. 31

సీ. మయవినిర్మితసభా♦మధ్యరత్నమయాస, నాసీనునఁ గయో కు♦శాసనంబు
హర్మ్యాంతరోన్నత♦హంసగరుత్తూలి, కాశయానునఁ గయో ♦ క్ష్మాశయనము
చందనాగురుదిగ్ధ♦సర్వాంగసుందర, మూర్తిఁ గయో నేల♦బూదిపూఁత
స్వచ్ఛదుకూలవ♦స్త్రాచ్ఛాదితునఁ గయో, తతవల్కలాజిన♦ధారణంబు
గీ. కలిగి మృగములు తోడుగాఁ ♦ గాననాంత, రముల దుంపలు దూఁడు లన్న ముగ నుదర
పోషణము చేసికొనుచున్న ♦ పురుషు నిన్నుఁ, జూడ నాచిత్తమున శాంతి ♦ వీడె నయ్యె.

ఉ. ‡వేలకొలంది మానులకు ♦ విప్రులకున్ గృహమందుఁ గోర్కికిన్
జాలఁగ రుక్మపాత్రములు ♦ సంస్కృత మన్నము భక్ష్యభోజ్యముల్
మే లగుశాకపాకములు ♦ మెక్కఁగఁ బెట్టెదు నీవు వారికిన్
బోలని భోజనం బిపుడు ♦ పొమ్మనలేకిటు పెట్టుచుంటివే. 33

శా. నీయాజ్ఞం దలఁ దాల్చి కౌరవులని♦ర్భిద్రప్రతాపంబునన్
మాయం జేయఁగ నున్న భీముఁ డడవిన్ ♦ మానేగ హీనస్థితిన్
బోయం బోలి వనాశనంబునను బెం♦పుం దక్కి యిట్లుండుటల్
న్యాయంబో యిది చూచి నీమనము సం♦తాపింపదో ధర్మజా. 34

సీ. అధిప నీరాజసూ♦యాధ్వరంబున నెల్ల, పార్థివులే నికిం ♦ బ్రజుతులైరొ
దేవదానవుల నే♦దివ్యైకరథునిశ, స్త్రము గెల్చి రణముల ♦ జయముఁ గనెనొ
వేగవంతము లేని♦శ్వేతాశ్వములు ప్రస, భము తేండ్ల నదిమి క♦ల్పములు గొనెనొ
ఖాండవం బగ్నికిఁ ♦ దిండిగా నేపీరు, నక్షయతూణముల్ ♦ భిక్ష యిడెనొ
తే. కార్తవీర్యార్జునుని వేయి♦కరములకును, దనకరద్వంద్వ ముద్దిగాఁ ♦ దగి పరాక్ర
మైకజీవనుఁ డైనయా♦లోకపూజ్యుఁ, డర్జునుం డిట్లు వని నుండ ♦ నర్హుఁ డగునె.

తే. తరుణులును ధర్మనీయాంగు ♦ లురుబలాఢ్యు
లుత్తములు కష్ట మన నెట్టి ♦ దో యెఱుఁగరు
నకులసహదేవు లిట్లు కా♦ననములందు
వనటఁ బడఁ జూచు చుంట నీ ♦ కొనరి యున్నె. 36

* దురోదరాకారుఁడు = శకుని యని తాత్పర్యము
‡ రుక్మము = బంగారు.

చ. ద్రుపదకులంబునం బొడమి ♦ దోర్బలశాలులఁ జెట్టవట్టి వి
ష్టపపతులై నవారలకుఁ ♦ జాలినబిడ్డలఁ గాంచి రాజ్ఞి నై
నృపసతు లెల్లఁ గొల్వఁ జను♦నే నిటు కానల నుండ నోర్చియుం
గృప యిసుమంత నీమదిని ♦ నిల్పఁ దలంపవుగా యమాత్మజా. 37

మ. క్షితి నిర్మన్యువు క్షత్రియుం డనుచు భా♦షింపంగ రా దీవు భూ
పతివై క్షత్రియవంశసంభవుఁడవై ♦ పాటింపఁ దేజంబు లే
కతిశాంతిం గొని యుంటి విల్లు తగునే ♦ ప్రాణేశ కాలంబులన్
బ్రతిఘుం బూననిభూపతిం బరిభవిం♦పం జూచు నేభూతముల్. 38

ఆ. క్షమయ పూన రాదు ♦ శత్రుసంహారంబు, తేజమునన చేసి ♦ తేజరిల్లు
నిట్లు కాకయున్న ♦ నిహమును బరమును, లేక చెడుదు వీవు ♦ లోకనాథ. 39

వ. ఈయర్థంబు తేటపడ నొక్క యితిహాసంబు గల దాకర్ణింపుము తొల్లి బలిచక్రవర్తి
పితామహుం డగు ప్రహ్లాదుం గని క్షమాతేజంబులలో నది శ్రేయోదాయకం బని
యడిగిన నతని కతం డి ట్లనియె. 40

క. అతిశాంతం బతితేజము, సతతము జనవతిఁ జేయఁ ♦ జన దద్దానన్
మితి లేనిదుఃఖసంచయ, మతుకుకొనుం గాన వినుమ ♦ నవు నవి రెండున్. 41

తరువోజ. *సతతంబు క్షమఁబూను♦జనునకు భృత్య♦చయనిరాకృతియును♦జనవంచనంబు
నతిధననాశనం ♦ బన్నపానాదు♦లందు నిష్ప్రచారం ♦ బగుఁ జువ్వె వాని
సతులును సుతులును ♦ సచివులు సఖులు ♦ సడుగులు వలుకుచు ♦ నడలింప నెంత్రు
క్షితితలంబున వాఁడు ♦ జీవచ్ఛవ మనఁ ♦ జెల్లి చెన్నఱి పోవు ♦ శీఘ్రకాలమున. 42

తరువోజ. ‡ఎప్రొద్దుఁ గోపంబు♦నే పూని యుండె ♦ నేని వాఁడు స్వతేజ ♦ మేర్పడ నెపుడు
భూపప్రజలను దండ♦ములపాలు చేసి ♦ భూతవిరోధియై ♦ పొడవడంగి చను
విప్రకృతుని వాని♦వేశ్మమం దున్న ♦ విమసర్పనమునిఁ గా ♦ వెఱను దలంచి
యేప్రాణమిత్రులు ♦ నెదఁ గరుణింప ♦ నెంచ రెట్లో చంప ♦ నెంతురు కాని. 43

క. కానం గాలోచితముగఁ, బూనం దగు క్షమయుఁ దేజ♦మును మానవుఁ డ
ద్దానన్ జనసమ్మతుఁడై, తా నిహపరముల సుఖంచుఁ ♦ దద్దయు నేర్మిన్. 44

వ. అని చెప్పె నని చెప్పి మఱియును. 45

సీ. అపరాధ మెంతయే ♦ నాచరించినయేని, పూర్వోపకారిని ♦ బ్రోవ వలయు
నుపకార మని చేయ ♦ నపకార మైనచో, క్షమియింప నొప్పు నా♦జనునిఁ బ్రేమ

---

* మూలప్రతులం దీసంవాదములోఁ గొన్నికొన్ని మార్పులు కలవు. సడుగులు = వక్రభాషణములు.

‡ విప్రకృతుఁడు = తిరస్కరింపఁబడినవాఁడు.



బుద్ధిపూర్వకముగాఁ ♦ బొనరింప కపరాధి, యైనచోఁ గావంగ ♦ నగును వానిఁ
జేయనై చేసి నేఁ ♦ జేసితిఁ దప్పు నన్, గాపాడు మనువానిఁ ♦ గావ నొను

తే. నొండొకం డైన నపకృతి ♦ నెందు గాఁ గొంకింత యైనను నిజబల♦హీన మైన
లోకభయ మైన శాంతియే ♦ చేకొనంగఁ, బోలు మే లానచేసిన♦పూరుషునకు. 46

వ. ఇట్లు గాక న్యథా ప్రవర్తించినవారిపట్లం దేజంబు నూపుటయ శ్రేయోదాయ
కంబు వినుము. 47

చ. వినువక నీకు నెగ్గు లవి ♦ వేలకు వేలు పొనర్చి దుష్టులై
యెద లెఱుఁగంగ లేక తమ♦యున్నతి కెంతయు విఱ్ఱవీఁగుచుం
బుడమికి వ్రేఁగుగా నగున♦పూర్వకిరాతుల ధార్తరాష్ట్రులన్
బొడవడఁగింపఁ దేజమును ♦ బూనుము మానుము శాంతి నియ్యెడన్. 48

వ. అనిన నజాతశత్రుం డి ట్లనియె. 49

ఉ. కోపము సత్యముం జెఱచుఁ ♦ గోపము తాపముఁ గల్గఁ జేసెడుం
గోపము వైరకారణము ♦ కోపము ధర్మమునుం దొలంచెడున్
గోపము సర్వకార్యముల♦కుం బ్రతిరోధకరంబు కోపమే
పాపము కోపి యైన జన♦వంచితుఁడై నరుఁ డందుఁ గష్టముల్. 50

తే. క్రోధి యగువాఁడు సతత మీ♦కుతలమందుఁ, బుట్టి చచ్చుచు నుండును ♦ బొడవడంగి
మఱియు నక్రోధునకు జ♦న్మంబు లేదు, గానఁ బెద్దలు క్రోధంబుఁ ♦ బూన రెపుడు.

ఉ. క్రుద్ధుఁడు పెద్దలం దెగడుఁ ♦ గ్రుద్ధుఁడు దేశికు నైనఁ జంపెడున్
గ్రుద్ధుఁడు ధర్మముం జెఱచుఁ ♦ గ్రుద్ధుఁ డెఱుంగఁడు మంచిచెడ్డలన్
గ్రుద్ధుఁ డవాచ్యము ల్వలుకుఁ ♦ గ్రుద్ధుఁ డకార్యము లాచరించెడున్
గ్రుద్ధుఁడు పాపియై పరఁగుఁ ♦ గ్రుద్ధుఁడు సర్వవినాశకుం డగున్. 52

క. కోపము గలిగినయేనిన్, బాపమునకు జంకఁ డింత ♦ స్వాంతమునందున్
దాపమున నాత్మహత్యయుఁ, గోపి పొనర్చెడిని గానఁ ♦ గోపము లగ్గే. 53

క. బలి యైన నలిగి మూఢుఁడు, బలహీనునిఁ జంపు లేక ♦ బలవంతులచే
బలమఱి చచ్చున్ ధీరుం, డలిగిన నలుగక సుఖంచు ♦ నఖిలజగములన్. 54

తే. ఎంత లావద లైన మ ♦ తేమి యైన, క్షమయ తాల్పంగ వలయు నే♦చక్కి నైన
దాన విజయంబు సిద్ధంబు ♦ మానవునకుఁ, గానఁ బెద్దలు క్షమ నెంత్రు♦ మాననమున.

క. క్షమవలనన్ సత్యము స,త్యమువలనన్ బుణ్య మవల ♦ నతిసౌఖ్య మగున్
క్షమ లేమి నసత్య మస,త్యమువలనం బాప మవల ♦ నతికష్ట మగున్. 56

క.* తనుఁ జంప నున్నవానిని, గినియక క్షమఁ బోలి క్షమను ♦ గెలిచినచోఁ
దనవిజయమె నిశ్చయ మై, పౌనర్భ మనుజులకుఁ గ్రోధ♦వశుల కని యగున్.

తే. పరమఘోరపిశాచము ♦ పట్టెనేని, తండ్రి కొడుకును గొడుకులు ♦ తండ్రి నాలు
మగని మగఁ డాలిఁ జంపును ♦ మత్సరమున, జనునిజన్మంబునకు సౌఖ్య♦ మనఁగ నేమి.

వ. ఈయర్థంబు కాశ్యపగీతలం దిట్లు వివరింపఁ బడియె వినుము. 59

క. క్షమ్మ వేదము క్షమ యజ్ఞము, క్షమ ధర్మము క్షమ శ్రుతంబు ♦ క్షమ సత్యంబున్
క్షమ శౌచము క్షమ సర్వము, క్షమికిన్ సద్గతులు సర్వ♦జగములఁ గలుగున్. 60

వ. దేవీ నీ వీకాశ్యపగీతావచనం బెఱింగి క్రోధం బుడిగి శమంబు పూని యుండుము.

ఆ. కురుపితామహుండు ♦ గురుఁడును విదురుండు, కృపుఁడు సంజయుండు♦కృష్ణుఁడు భగ
వానుఁ డైనయట్టి♦వ్యాసుండు లోనగు,పెద్ద లెల్ల శమమె ♦ పేర్కొందు. 62

వ. శమంబు సర్వరక్షకం బై సనాతనధర్మంబు కావున నే నీశమంబునంద యుండి
శ్రేయం బందెద నాసుయోధనుండు శమపరాఙ్ముఖుం డై తనకుం దనవారికిఁ
జేటు దెచ్చుకొను ననిన ద్రౌపది వెండియు. 63

క. పిత్రుపైతామహవృత్తిన్, వ్యతిరేకమనంబు నీకు ♦ వాలాయముగా
నతికించినధాతకు నే, నతి యొనరించెదను భక్తి ♦ నడపుచు నెడఁదన్. 64

చ. పుడమిని వేఱువేఱుగతిఁ ♦ బొందినకర్మము లాచరించుచున్
విడక ఫలంబులం బడయ ♦ నేర్చెదుఁ బూరుషుఁ డట్లు గాక తాఁ
గడుకొని ధర్మ మార్జవము ♦ క్షాంతియు శాంతియు నానృశంస్యమున్
నడపుచు నైష్ఠికుం డయి య♦నారతము న్నిరు లంద నేర్చునే. 65

తే. రాజ! ధర్మార్థమే నీదు♦రాజ్య మైన, జీవితం బైన నీకు నీ♦క్షితితలమున
ధర్మమే జీవితముకన్న ♦ దయిత మైన, దానికన్న నొండొకప్రియ♦తరము లేదు. 66

క. తమ్ములను నన్ను గురువుల, నిమ్మహిరాజ్యంబు విడువ ♦ నెంతువ కాకీ
వెమ్మెయిని ధర్మమార్గము, నెమ్మది విడఁ దలఁప వనుచు ♦ నే నెంతు మదిన్. 67

క. ధర్మప్రవర్తకుం డగు,ధర్మాత్ముని గాచుఁ గాని ♦ధర్మం బరయన్
ధర్మజ నిన్నుం గావదు, నిర్మలమతి నెఱిఁగి యిట్లు ♦ నే వచియింతున్. 68

తే. సదృశు లగునీదుతమ్ముల ♦ సాధ్వి నన్ను, నిట్లు కూటికి గుడ్డకు ♦హీనులుగను
సలుపుచున్నట్టినీ వెంత♦చక్రవర్తి, వైన శృంగము గలుగఁబో ♦ దరయ నీకు. 69

వ. తొల్లి యింద్రప్రస్థపురంబున నీకు నిత్యనైమిత్తికంబు లగునిష్టిపశుబంధాదులును దేవ
పితృదేవతర్పణంబులును యతివ్రతిసంయమీంద్రార్చనంబులును బ్రాహ్మణసమారాధ

* క్షమ = భూమి, ఓర్పు.



నంబులును యథోచితంబుగ నడచుచుండునవి నే నటఁ బరిచారిక నై యుండ నీయండ
నతిథు లెల్లరును రుక్మపాత్రంబుల భుజించి సుఖించుచుందు రిపు డీదస్యుసేవితం బగు
మహారణ్యంబున వనౌకసుల కెల్ల లోహభాజనంబు లొసంగితి వింక నీ కింట నీయ
నైన దేదియును లేదు రాజసూయాశ్వమేధ పుండరీకాదిమహాక్రతువు లొనర్చి
ధన్యుండవు వదాన్యుండవు సత్యవాది వైననీవు దుర్గోదరపరాయణుండ వై సర్వస్వ
మ్ము నోటువడి వనేచరుండ వై యి ట్లుంటం జేసి నామనంబు పరిపరివిధంబులం బరి
తపించుచున్నది వినుము. 70

సీ. సకలజగంబు లీ♦శ్వరవశంబున నుండు, సుఖదుఃఖములకు నీ♦శుండె కర్త
భూతంబులను దోలు♦బొమ్మలవలెఁ ద్రిప్పి, యాడించుచుండు న♦య్యమలమూర్తి
తంతుసంబద్ధశ♦కుంతంబు లన జనుల్, వానివలం జిక్కి ♦ వఱలుచుందు
రతనియధీన మీ♦యఖిలప్రపంచ మా,త్మకును స్వాతంత్ర్య మిం♦తయును లేదు

తే. జనుఁడు సుఖదుఃఖముల కనీ♦శ్వరుఁడు గాన, నీశ్వరప్రేరితుం డయి ♦ యెల్లప్రొద్దు
స్వర్గమో లేక నరకమో ♦ వడయు ధర్మ,మున నొడల్ హేతుమాత్రమ♦ పోల్చి చూడ.

క. మాయాప్రభావనిధి యగు,నాయీశుఁడు ప్రాణిచేతఁ ♦ బ్రాణిం గూల్చున్
దా యుక్తి వన్ని యినుమున,నే యినుముం గొట్టినట్టు ♦ లీభువనమునన్. 72

వ. ఈయాథార్థ్యంబు తత్త్వవేత్త లగుమునిసత్తము లెఱుంగుదు రజ్ఞులు నింతయు నెఱుం
గ కన్యథా తలంతురు. 73

ఉ. బాలకుఁ డాటబొమ్మలను ♦ బట్టి ప్రియంబునఁ ద్రిప్పి యాడున
ట్లాలరిబ్రహ్మ సజ్జనుల ♦ కాడుచుఁ గీడును దుర్జనాళికిన్
మేలు ఘటిల్లఁ జేయు నిట ♦ మీరును గ్రూరులు ధార్తరాష్ట్రులుం
బోలిచి చూడ నై రనుచుఁ ♦ బుద్ధిఁ దలంచుచు దూఱ నెంచెదన్. 74

తే. సుకృతదుష్కృతకర్మముల్ ♦సుజనదుర్జ,నులకుఁ బ్రతిబద్ధము లగు న♦నుచు వచింత్రు
కల్ల కర్మము కర్తను ♦ గలియఁ బోవ, దనఁ దగుం గర్మఠుని నిన్ను ♦ నరసి యరసి. 75

వ. అని పలికిన నజాతశత్రుండు ద్రుపదపుత్త్రి కి ట్లనియె. 76

శా. నాస్తిక్యంబు వచింపఁ జొచ్చితివి నీ ♦ వా నాఁ జమత్కారమే
ప్రస్తావార్హముగా గణింపఁబడు ని♦ష్పన్నన్ ఫలాన్వేషి నై
స్వస్తిం గోరుచుఁ గర్మమున్ సలుప నే ♦ సల్పంగ నౌ నంచు స
న్యస్తాత్మం గొని సల్పుదున్ ధనము నీ ♦ నౌ నంచు నిత్తుం గదే. 77

చ. కలిగినఁ గల్గకుండినను ♦ గర్మఫలం బది కాన నున్న యే
సలుపఁగ నౌ నటన్నవిధి ♦ సల్పుచు నుంటిని ధర్మ మాగమం

బుల విడ కార్యవృత్తమును బోలఁగఁ జూచుచుఁ జంచలాత్మ నేఁ
దెలుపుచునుంటి నామనము తెల్లము ధర్మమునంద నిల్చెసుమీ. 78

తే. ‡ధర్మవాణిజ్య మొనరించి ధర్మఫలము, పొంద నెంచినహీనుండు భూతలమున
ఫలము లేక చెడుఁ శంకగలిగి లేమ, ఫల మనుజఘన్యుఁడును గూలుఁ బాపగతుల.

తే. ధార్మికుండును గులజుండు తత్త్వవేత్త, శ్రోత్రియుం డనువీర లీధాత్రిఁ బిన్న
లైనఁ బెద్దల దీని కాదానువాఁడు, పుల్కసుం డగుఁ బాపి యై పొడవడంగి. 80

క. కనవే ప్రత్యక్షంబుగ, ఘనతప మొనరించి ధర్మకాముం డగుచున్
బొనరఁడె మార్కండేయుం, డనుముని చిరజీవి యగుచు నంబుజనేత్రా. 81

వ. మఱియు వ్యాస వసిష్ఠ మైత్రేయ నారద లోమశ శుక ప్రభృతిమహర్షు లెల్ల ధర్మా
చరణంబునం జేసి శాపానుగ్రహశక్తులై దేవతలకన్న మిన్నలై యుండుట కన్నులా
రం జూచుచుండియు నీ విట్లు శంకించుచు ధర్మంబు ధర్మశాస్త్రార్థంబును దూఱుట
మేర గా దీపాపంబునకుఁ బ్రాయశ్చిత్తంబు లే దని వెండియును. 82

చ. తెగడకు ధర్మకర్మముల దివ్యమహర్షులు వెట్టులోటు వా
రగు నని సువ్వె తత్పథమునందు మెలంగుచు దేవతుల్యులై
పొగడిత కెక్కి పూజ్యు లయి పొల్చిరి నీవును నీదుభ్రాత పెం
పుగ జనియించురీతి గనఁ బుణ్యఫలం బగుఁ గాదె కోమలీ. 83

గీ. స్వర్గమున కేగఁ దలఁచినవానిఁ నరయ, ధర్మమే దుఃఖవార్ధిని దాఁటఁ జేయు
నొండుదీవులవాణిజ్య మోపి చేయఁ, జనెడువానిని నావ నా వినవె యిట్లు.

వ. తప స్స్వాధ్యాయ బ్రహ్మచర్య దా నార్జ వాధ్వరంబు లఫలదంబు లైన మహామహు
లెల్ల వాని ననుష్ఠింపరు మనకు శిష్టాచారంబు నార్షంబును బ్రమాణంబులు గావున
నవి యెల్ల మనకు ననుష్ఠేయంబు లయ్యె నని నిస్సంశయంబుగ నెఱింగి నీనాస్తిక్య
బుద్ధి విడువు మనిన ద్రౌపది వెండియు ని ట్లనియె. 85

మ. అవమానింపను ధర్మకర్మముల నే నార్తిం బ్రలాపించితిన్
సవిమర్శాత్మ నెఱుంగు మిప్డు మరలన్ సంధింతు నవ్వాక్యముల్
భువిఁ గర్మంబు ఫలప్రదం బనుచు నెప్డుం జెప్ప నౌ నెల్లజం
తువులున్ సల్పఁ దలంపకే సలుపుచుండున్ నిత్యకర్మంబులన్. 86

తే. వత్సములు పాలు ద్రావు నాల్ వఱలుచెట్ల,నీడ సేవించుఁ జేపలు నీళ్ల నాడు
నెదియునుం గర్మముల నైన వృత్తి దీని, జంతువులు పొంది జీవించు సంతతంబు. 87

‡ జఘన్యుఁడు = దూఱఁదగినవాఁడు.



క. జంగమములలో మానవు, లింగితముం దెలిసి కర్మవృత్తిం గొని పెం
పుం గాంచి మించ నెంత్రు మ,హిం గలుగదు వృత్తి కర్మహీనం బైనన్. 88

వ. పిపీలికాదిబ్రహ్మపర్యంతముం గలజంతువు లెల్లం గర్మంబున నుత్తమాధమగతులం
బడసి ప్రవర్తిల్లుచుండు ననుట నిక్కంబ కాని కర్మంబు కర్మం బనుచు నిత్యంబునుం
గర్మదాసితుఁ డై జనుండు కార్యవివృద్ధిరక్షణోపాయంబులం జూడకున్నఁ గ్రమంబునం
గృశించిపోవుఁ గావున దైవంబుపై భారంబు వైచి హఠవాదంబు చేసి శఠుండు
గాక యథోచితంబుగ ధర్మకర్మంబులం దగిలి యుండ వలయు. 89

ఉ. దైవమె రక్షకం బనుచు దానివయిం దనకార్యభారమున్
గేవలమందుఁడై యిడి సుఖంపఁగ నుండినవాఁడు నీటిలోఁ
గా విడఁ బచ్చికుండవలెఁ గానఁగరాక నశించు నట్టులే
చేవ దొఱంగి నిత్యహతచిత్తుఁడు దృప్తుఁడు మత్తుఁడై చెడున్. 90

సీ. అప్రయత్నముగ నర్థాదు లకారణ,ప్రాప్తంబు లైనచో నది హఠంబు
తనదుకర్తృత్వ మింతయు లే దనుచు నమ్మ, నగునట్టియర్థ మయ్యది నుదిష్ట
మాత్మప్రభావ మిం సలరంగఁ బని చేసి, పడసినయర్థంబు పౌరుషంబు
ధర నిట్లు మూఁడువిధంబుల నైనయ,ర్థములెల్లఁ బూర్వకర్మములఫలమె

తే. ధాతయును దాను జేసినచేతవలనఁ, గ్రాలుచుండును దేహంబు కర్మములకుఁ
గారణం బీశ్వరుఁడు కర్మకారకత్వ,మునకుఁ బ్రేరేపఁ బొనరింత్రు జనులు కడఁగి. 91

తే. తిలలఁ దైలంబునుం దారువులను వహ్ని
గోవులం బాలుఁ గొనినట్లు కుశలమంది
జనుఁ డుపాయంబునను గర్మమునను సిద్ధి
వడసి యుత్సాహియై తాను బ్రదుకు నెపుడు. 92

క. విడువక యున్నం గర్మము, వడయు ఫలం బలసుఁ డగుచు పరకార్యమునం
బడక శయనించువానికిఁ, జెడు నిహముం బర మలక్ష్మి చేకుఱు నెపుడున్. 93

తే. నీవు కర్మమునందున నిలుతువేని, నేను నీతమ్ములును నిట్లు నెగులు గుడువఁ
బోవ కైశ్వర్యములనెల్లఁ బొంది సౌఖ్య,మున మెలంగక యుందుమే మనుజనాథ.

తే. కర్షకుఁడు లాంగలంబున క్ష్మాతలంబు, దున్ని బీజంబులం జల్లి మిన్నకుండు
ఘనునిదయ యైన ఫలియించుఁ గాక యున్నఁ, గాదు కర్మఫలం బిట్లు గలిగి యుండు.

వ. కావున నాగాముకులకుం దలంకక ధీరుండు దేశకాలానుసారంబుగఁ గార్యంబు
దెసవాఁడై కడంగి యప్రమత్తుండై యుండినఁ గర్మసిద్ధి యై శ్రేయంబు లందఁ
గలం డనుబృహస్పతిప్రోక్తం బగునీతిమార్గంబు తొల్లి మాతండ్రి కొక్క బ్రాహ్మ

ణుండు చెప్పుచుండ వింటి నని చెప్పిన భీమసేనుండు రోషారుణితాక్షుండై నిట్టూ
ర్పు నిగిడించుచు నన్న కిట్లనియె. 96

ధర్మజభీములసంవాదము.

మ. నరగాండీవగుణాన్వితం బయి మహౌ♦న్నత్యంబునుం గొన్ననీ
వరరాజ్యంబు హరింప శక్తుఁ డగునే ♦ వజ్రాయుధుండైన దుర్యో
దరముం బన్ని సుయోధనుండు నికృతిం ♦ దానిన్ హరించెన్ మృగే
శ్వరగుప్తం బగునామిషంబుఁ గనుమో♦నక్కచందంబునన్. 97

చ. నగవర రాజ్యవైభవము ♦ నాలిసపత్నులపాలు చేసి గ
హ్వరమున ధర్మలేశపరి♦వర్ధితమానసవృత్తిమై నిరం
తర మిటు కూడుగుడ్డలకుఁ ♦ దప్పి మహావ్యసనంబు నొందుటల్
పరమతపంబు నాఁ దలఁతె ♦ భారత నీ కిది ధర్మ మయ్యెనే. 98

క. ధర్మము ధర్మం బనుచు, న్నిర్మలచిత్తంబు చెడఁగ ♦ నీ విట్లరులన్
దుర్మతులఁ బ్రోచి మిత్రుల, ధర్మాత్ముల నేఁచి యుంట ♦ ధర్మమె చెపుమా. 99

ఉ. పేడితనంబునన్ సిరుల♦పెంపఱి యిట్టులు రిత్తవోతి మే
మాడ వనాళికి న్వెడలు♦నప్పుడె నీదగునాజ్ఞ యయ్యె నే
నూడిచిపుచ్చమే దొసఁగు ♦ లొక్కనిమేషమునంద నీ ప్రజల్
సూనులకుం దలంకుటలు ♦ సూచితివే కురువంశపుంగవా. 100

వ. నీ విట్లు తేజోహీనుండవై మృగచర్యం దగిలి వనంబునం బొగులుచుంట కృష్ణాభిమ
న్యార్జుననకులసహదేవసృంజయాదులకును నాకు నానందజనకంబు గాదు బలాఢ్యు
ల మగుమేము బలహీను లగుధార్తరాష్ట్రులకు లొంగి యిట్లుండుటకన్న మహా
హవంబునం బడి చచ్చుటయ పరమశ్రేయంబు దాన నుత్తమలోకావాప్తి యగు నని
మఱియును. 101

ఆ. సమయభంగమునను ♦ క్షమఁ బూని యిట్లున్న, మనల ధార్తరాష్ట్రు♦మనుజపశువు
లలఁతు లనుచుఁ దలఁతు ♦ రది నాకు మృత్యువు, కన్న దుఃఖకరము ♦ గాదె తెలియ.

చ. అది యటు గాన నోనరవ♦రా! ఋజుమార్గమున న్మెలంగుచున్
గదన మొనర్చి శాత్రవుల ♦ గం డడఁగించి మహీతలంబు స
మ్మదమునఁ బొంది యేలుద మ♦మర్త్యులు మెచ్చఁగఁ గాదయే ననిం
దుదిఁ గొని స్వర్గలోకమున ♦ దుఃఖము లేక సుఖింత మెప్పుడున్. 103

క. ‡మిత్రక్లేశంబునకై, ధాత్రిం బొడకట్టినట్టి♦ధర్మపథమునన్
క్షత్రియుఁడు మెలఁగి సుగతికిఁ, బాత్రుఁడు గాఁ డనుచుఁ దెలియఁ♦బడు సంహితలన్.

‡ సంహిత = శాస్త్రము.



తే. సుహృదులకుఁ గ్లేశ మగుధర్మ♦సూక్ష్మగతిని
దగులుకొని దానినే యోగ్య♦ముగఁ దలంచు
వాఁడు ధర్మతత్త్వ మెఱుంగు♦వాఁడు గాఁడు
లోకమిత్రుని తేజంబుఁ ♦ జీకువోలె. 105

తే. అర్థ మాత్మార్థముగఁ గూర్చి ♦ యది సుధర్మ, కామముల వెచ్చపెట్టని♦భూమిజనుఁడు
తత్ఫలము నొందనోపఁడు ♦ తథ్యముగను, గూలి కాలఁ గాచెడువాఁడు♦వోలె వింటె.

సీ. అర్థార్థియై ధర్మ ♦ మనఁ గామ మన నెఱుంగనివాఁ డఖిలభూత♦గర్హితుఁ డగు
ధర్మమం దుండి యర్థముఁ గామమును రోయు, వానికి జగమెల్లఁ ♦ బగఱ యగును
గామియై ధర్మార్థ♦కార్యహీనుం డైన, వాని మిత్రులు దూఱి ♦ వదలి పోదు
రర్థధర్మంబుల♦యందుఁ బండితులు ప్రి, యమిత్రులై వర్తింత్రు ♦ మహీతలమున

తే. నిరతమును గామమున నున్న♦నరుఁడు వెనుకఁ, జెఱుపునీ రెండిసప్పుడు ♦ చేపవోలె
నడఁగు నెన్నఁ ద్రివర్గ మ♦న్యోన్యసహాయ, చర్యమున మేఘజలధుల♦సరణి నొప్పు. 107

తే. అర్థ మొగినను గామార్థి♦యర్థమునను, ధర్మ మార్జించు నది మోక్ష♦దం బయి తగుఁ
గానఁ గామాదులను యథా♦కాలములను, బండితుఁడు పంచి సేవించుఁ ♦ బార్థివేంద్ర.

చ. తెలియును గాదె నీకు జగ♦తీవర ధర్మము నాఁగ దానమున్
సలలితయజ్ఞమున్ శ్రుతియు ♦ సాధుజనార్చన మార్జవంబు గా
కలరు నె ధర్మ మొండు జగ♦మం దది సేయ సమర్థుఁడే గుణం
బులు గలఁడేని నిర్ధనుఁడు ♦ పోల్పఁగ నర్థము ధర్మమూలమే. 109

తే. ధర్మమునకంటె నుత్తమ♦కర్మ మొండు, గలుగఁ బోవదు గావునఁ ♦ దెలియ దాని
కర్థసంగ్రహ మొనరింప ♦ నగును జూవె, నిజకులోచితవృత్తిమై ♦ నిలిచి జనుఁడు. 110

ఆ. భైక్ష్య మాచరించి ♦ బ్రాహ్మణుండును గృషి, సలిపి వైశ్యుఁ డొరులఁ♦గొలిచి శూద్రుఁ
డర్థసముదయంబు ♦ నార్జింప నో క్షత్రి, యునకు నందుఁ బేజ ♦ మొప్ప నెపుడు. 111

మ. పరధర్మంబులఁ జిక్కి స్వీయ మగుచున్ ♦ భాసిల్లుధర్మం బిటన్
బరివర్జించుట పాడి గాదు కురుభూ♦పగ్రామణీ నీ వుదా
రరతిం దేజము పూని నాబలము పా♦ర్థప్రస్తుతాస్త్రంబునన్
గరిమం దోఁపఁగ శత్రులం గెలిచి లో♦కం బెన్న భాసిల్లుమా. 112

ఉత్సాహము. క్షత్రియుండు ప్రజల నేలఁ ♦ గలుగుఫలముకన్న నీ
ధాత్రి ఫల మొకండు వొందఁ ♦ దాను గాఁడు గాన నీ
క్షత్రధర్మ ముజ్జగించి ♦ సర్వలోకవంద్య మా
పాత్రత చెడ నవ్వుటాల♦పాలు గాకు మగ్రజా. 113

తే. నృపుఁడు మెత్తనిచిత్తము♦నే గ్రహించి, మెలఁగుచుండిన భూతికిఁ ♦ దొలఁగుఁ గఱకు
గలిగి నికృతిమై శత్రుల ♦ గెలిచి రాజ్య, మనుభవించు వరాహ మా♦హారమట్లు.

ఉ. అన్నలు పూర్వజాతు లన ♦ కాదివిజారులఁ బట్టి దేవతల్
మిన్నక మోసచేసి కడ♦మిం గొని గెల్చిరి నీవు నట్లు వి
ద్వన్నుత! తొంటిబాస విడి ♦ వంచన మించఁగ దర్ప మేర్పడన్
గ్రన్నన శత్రులం దునిమి ♦ కౌరవరాజ్యరమన్ భరింపుమా. 115

క. బల మర్థమూల మర్థము, ఫలియింపఁగఁ గొంత విసువ♦వలయున్ దానిన్
బొలమునఁ గసుఫల మందం, దలఁచినకర్షకుఁడు విత్త♦నంబుల మాడ్కిన్. 116

మ. బలదర్పంబులు గల్గుశాత్రవునిఁ జం♦పం జూచుభూనాథుఁ డె
వ్వలనం గాని మెలంగి దోషములకుం ♦ బా ల్గాఁ డొకింతేనియేన్
గల దన్నన్ దురితంబు నవ్వలఁ దొలం♦గం జేసికో వచ్చు వి
ప్రులకుం బెట్టియు యజ్ఞముల్ సలిపియున్ ♦ భూదానముల్ సేసియున్. 117

క. బలహీను లైనఁ బదుగురు, కలసి మహాబలునిఁ గూల్పఁ ♦ గల రతిబలులన్
బలుకంగ నేల జంటీఁ,గలు జున్నుం దీయువానిఁ ♦ గారించుగతిన్. 118

ఉ. తాతలు తండ్రులుం బలెఁ బ్ర♦థం ధర యేలుట క్షత్రియాన్వయో
ద్భూతునకు న్విధాయకము ♦ భూరితపంబున నట్టియుత్తమం
బై తగులోకముం గొనఁగ ♦ నాతఁడు చాలఁ డటంచు శాస్త్రముల్
నీతి వచింపఁ గావునను ♦ నీవు నరేంద్రుఁడవై తలిర్చుమా. 119

ఆ. అన్నత మన నెఱుంగ♦నట్టిని న్నెల్లరు, మేలు మే లటంచు ♦ మెచ్చుకొండ్రు
దుష్టబుద్ధి యైన♦దుర్యోధనునిఁ దోలి, పృథివి నీవు గొంటి♦వేని రాజ. 120

తే. కుక్కతోలిత్తియం దున్న♦గోపయస్సు, పగిది వృషలునియం దున్న♦బ్రహ్మవాక్కు
వలె సుయోధనునందు భూ♦వలయరాజ్య, మున్న దని మాట లోకమం♦దున్న దధిప.

క. మన మి ట్లయితి మటంచున్, వనటంబడ లోక మెల్ల ♦ వసుధాధీశా
విను మిపుడ సేనలం గొని, చని శత్రులఁ ద్రుంప నదను ♦ సమకుఱి యుండెన్. 122

వ. కావున నీ విపు డాలస్యంబు సేయక బ్రాహ్మణకృతస్వస్త్యయనుండ వయి సర్వోపకరణసమన్వితం బయినరథం బధిరోహించి శస్త్రాస్త్రవిదు లగుతమ్ములును సృంజయ కేకయ పాంచాలాదిబంధువర్గంబులునుం దోడుగా దేవగణపరివృతుం డై వృత్రవధార్థం బరుగుదేవేంద్రునట్లు దీపించుచు నరిగి కరిపురంబుపై విడిసి గాండీవముక్త గార్ధ్వనాస్త్రంబుల రిపుల వినిర్జించి రాజ్యలక్ష్మిం గొను మనిన యుధిష్ఠిరుం డతనికి ట్లనియె. 123



మ. నిజమే పల్కితి మీకు నావలన నెం♦న్నో నావముల్ వచ్చె నో
కుజనధ్వంసక నీదుపల్కు లివి ము♦ల్కు లోపలె నన్నేర్చెదన్
విజితుండన్ బదు లాడఁ జాలఁ గలుషా♦న్వీతుండు మాయావి యై
వృజినం బిట్లు ఘటిల్లఁ జేసె నికృతి ♦ న్వల్గొందునక్షంబులన్. 124

తే. అకట వశ్యాత్ముఁ డగువాని♦నికృతి నోడి, దాస్యమునఁ బడి పోయెను♦తత్తని ద్రుపద
తనయ శరణమై మనకు న♦వ్వనటఁ దీర్చెఁ, బిదప నిటు వచ్చె నే మందు♦ విధిబలంబు.

వ. అప్పు డెల్లరు విన మనము పంద్రెండేండ్లు వనవాసంబును నొక్కయేఁడు జనపదంబున నజ్ఞాతవాసంబునుం జేయ సమయంబు చేసి రాజ్యలోభంబున నిట్లు ధర్మంబు తప్పు టుచితంబు గాదు ధర్మంబు తప్పి రాజ్యమేలుటకన్న నుత్తముం డగువానికి మరణంబ పరమోత్తమంబు. 126

చ. పరుసము లాడి యిట్లు నను ♦ బాధలఁ బెట్టెద వేటికో దురో
దర మొనరించునాఁడు మది ♦ దర్పము పేర్వడ నాభుజంబులన్
బరిఘముఁ బూని త్రెంపుటకు ♦ వచ్చితి నిన్ నరుఁ డాఁగెఁ గానిపోఁ
గురుపవరేణ్య యిప్పు డిటు ♦ పొందక యుందును గాదె దుఃఖముల్. 127

క. కురుసభఁ బాంచాలికి నగు, పరిభవమునఁ గుందునన్ను ♦ భరతర్షభ నీ
వుర కిట్లు చెంద నాడితి, వరయఁగ విష మట్టు లయ్యె ♦ నది నా కయయో. 128

చ. అది యటు లుండనిమ్ము సమ♦య మ్మది సెల్లక యుండ వేగపా
టొదవఁ జరించుటల్ మనకు ♦ నొప్పదు కాలము వేచి యుండ నొ
నదనున దున్ని బీజ మిసు♦నట్టికృషీవలుఁ బోలి నీవున్
బొదలుట పోలుఁ గాని యిటు ♦ పోలునె నీకుఁ బరాక్రమించుటల్. 129

తే. ఏచి పగ యనువృక్షంబు ♦ పూచి కాచి, నపుడు దాని మూలచ్ఛేద ♦ మాచరింపఁ
దొడరవలయునువీరుఁడం♦దునయశంబు, సిరియుఁ గొని శాత్రవులనొంచి♦ చెలఁగు నెపుడు.

వ. వృకోదరా నేను జచ్చినను బ్రదికినను ధర్మంబు తప్పువాఁడం గాను నాకు సత్యంబు కన్న రాజ్యంబును దారపుత్రయశోధనాదులును గళామాత్రం బైన నతిశయింప నేర వనిన భీమసేనుండు వెండియు ని ట్లనియె. 131

చ. బుడగవలెన్ క్షణార్థమునఁ ♦ బోవుశరీరము నమ్మి యెవ్వఁడో
కడుకొని వైరులం దునుమఁ ♦ గా నగు నంచుఁ దలంచుఁ దొప్ప దె
వ్వఁడు దెగునో యెఱుంగఁ గల♦పూరుషుఁ డాగతి వేచి యుండ నొ
నొడలు గలంతలో నరుల ♦ నొంపనివాఁడు నిరర్థకుండె పో. 132

తే. మృత్యుముఖమునఁ బడనున్న ♦ మే గలిగిన, నేను బదుమూఁడు వర్షముల్ ♦ మౌనసమున
వేచి యుండఁగ లేను లో ♦ నేచుచుండెఁ, గ్రోధసంతాప మగ్నికి ♦ గొలఁది మీఱి.

క. అరి నిర్జించెదుపట్లన్, దురితం బై నరక మయినఁ ♦ దుష్టిం గొని నే
సురలోక మట్లు దానిన్, బరిగణియించెదను లోన ♦ భద్రం బనుచున్. 134

వ. మఱియు నస్త్రవిద్వరిష్ఠుం డగుమన భీభత్సుండు నీయానం బడి గుహాంతరగతం బై నసింహంబువలె రోఁజుచుం బరితపించుచున్నవాఁడు నేనును నకులసహదేవులును మాతృదేవతయును ద్రౌపదీదేవియును నీహితం బెంచి మూఁగల మై యున్నవారము కేకయసృంజయాదిబంధువర్గం బెల్ల యుద్ధం బభిలషించుచున్నయది యల్పబలు లైననీచులు రాజ్యం బనుభవించుచుండ మహాబలుల మైన మన మిట్లు కానలపా లయి యుంట పాడి గాదు నీవు నీశీలదోషంబునం జేసి దయావిష్టుండ వై దుఃఖంబు సైఁచి యుంటి విట్టినీప్రవర్తనం బొరు లెవ్వరును మెచ్చునది కాదు నీబుద్ధి యర్థజ్ఞానంబు లేక కేవలానువాకజడం బై నశ్రోత్రియునిబుద్ధివలెఁ దత్త్వార్థం బెఱుంగ నేరకున్నయది దయ గలబ్రాహ్మణరూపుండవు నీవు క్షత్త్రంబునం దెట్లు పుట్టితివో తెలియకున్నయది వినుము. 135

చ. మనువు వచించె రాజనయ ♦ మార్గము దంతయు నీ వెఱుంగవే
ఘనతరశౌర్యసంపదలఁ ♦ గ్రాలఁగఁ జోలదె క్షత్రియుం డయో
మనమునఁ గార్యమున్ విడిచి ♦ మానవహీనుల ధార్తరాష్ట్రులన్
గని విని సైఁచి యుంటి విది ♦ కానిది గాదె నరేంద్రచంద్రమా. 136

వ. ఇదియుంగాక మఱియును. 137

తరువోజ. జననాథ మన మొక్క ♦ సంవత్సరంబు ♦ జనపదంబున డాఁగ ♦ సమయ మొనర్పఁ
జను నయో తృణముష్టి ♦ శైలరాజంబు ♦ సంఛన్న మగునట్లు ♦ సలుపంగఁ దగునె
దినమణితేజంబు ♦ దెసలఁ గాకుండఁ ♦ దెగి దోయిటను గప్పఁ ♦ దీరునె మనల
జను లెఱుంగక యుండరె ♦ శత్రుండు చాలి ♦ చారులచే మన ♦ జాడఁ దీయఁడె. 138

తరువోజ. పదుమూఁడుమాసముల్ ♦ పరఁగె నిప్పటికి ♦ వనవాస మీనెలల్ ♦ వర్షంబులుగను
మది గణింపఁగ వచ్చు ♦ మఱి సోమమునకు ♦ మాఱుగాఁ బూతిక ♦ మఖములఁ గొనరె
సదమలాత్మక మన ♦ సమయంబు దీఱఁ ♦ జనియెఁ గాదె యొక్క ♦ సాధుగోరాజ
పదరక్షణము చేసి ♦ పాపంబు వాప ♦ వచ్చు నన విన ♦ వచ్చును శ్రుతుల. 139

క. కావున నావచనము విని, భూవల్లభ క్షత్త్రధర్మ ♦ ముం దగఁ గనుచున్
భావించి శత్రువధమున, కై వెడలన్ నిశ్చయంబు ♦ గావింపఁ గదే. 140



వ. అని పలికిన విని యుధిష్ఠిరుండు నిట్టూర్పు నిగిడించుచు నించుక విచారించి కార్యంబు నిశ్చయించి భీమసేనుం దిలకించి నీవు చెప్పినట్టిది సత్యంబ కాని నేను మఱి యొక్కమాట చెప్పెద నాకర్ణింపు మని యి ట్లనియె. 141

ఆ. సాహసించి చేసి ♦ జనుఁడు పాపంబునఁ, బడును గానఁ జక్కఁ ♦ బడెడురీతి
నరసి చేయ నొప్పు ♦ నద్దాన నౌఁ గార్యసిద్ధి దైవ మగుచు ♦ చెంత నుండు. 142

మ. బలదర్పోత్థితబుద్ధి వై యిపుడు చా ♦ పల్యంబున న్నీవు కాఁ
గలకార్యం బరయంగ లేక యలుకం ♦ గైకొంటి వి ట్లొప్పనే
జలసంధుండు కృపుండు కర్ణుఁడును భీ ♦ ష్మద్రోణహార్దిక్యము
ఖ్యులు దుర్యోధనపక్షపాతు లని నీ ♦ వూహింపవో తమ్ముఁడా. 143

చ. ఇలఁ గలయెల్లపార్థివు ల ♦ హీనధనేశ్వరు లై సధార్తరా
ష్ట్రులవశమంద యుండి యని ♦ చొప్పడునప్పుడు పోటుబంటు లై
మెలఁగుచుఁ బోరి వారికయి ♦ మేనులయే నిడ నుండి రక్కటా
చలమున వారలం గెలువఁ ♦ జాలరు వేలుపులంతవారలున్. 144

మ. ససహాయుల్ రణశూరులున్ ఘను లరుల్ ♦ శస్త్రాస్త్రవిద్వాంసు లీ
వసహాయుండ వకోవిదుండ వని శ ♦ క్యంబే జయం బందు టీ
వ్యసనం బెప్పుడు నన్నుఁ బాయ దనుజ ♦ న్మా! దీన నాకంటి కొ
క్కసుమం తేనియుఁ గున్కు రా దిపుడు నీ ♦ కీయుద్యమం బొప్పనే. 145

వ. అనిన విని కోపఘూర్ణమానమానసుం డై యొం డేమియుం బలుక కూరకుండె నాసమయంబున. 146

వ్యాసుండు వచ్చి ధర్మరాజునకుఁ బ్రతిస్మృతి నుపదేశించిపోవుట.

శా. పాదాంతప్రచలత్పిశంగకజటా ♦ భారంబు కృష్ణాజిన
ప్రాదుర్భూతసితేతరాధికవిభా ♦ రాశిప్రకీర్ణంబు గా
నాదీవ్యచ్చపలాలతాంచితము కా ♦ లాబ్దంబు నాఁ జెప్ప నై
వేదవ్యాసమహామునీంద్రుఁడు దయ ♦ న్విచ్చేసె నచ్చోటికిన్. 147

వ. వచ్చి ధర్మరాజపూజితుం డై విశ్రమించి భీష్మద్రోణాదియోధవీరు లధికాస్త్రశస్త్రవిద్యావిశారదులు వారలతోఁ బోరుట యసాధ్యం బని వగచునీభయం బపనయింపఁగా వచ్చినాఁడ నాకడఁ బ్రతిస్మృతి యనునొకమహావిద్య గల దది యోగలబ్ధం బతిరహస్యంబు నీవు గ్రహించి దాని నేవింప నర్జునుం బంపు మతఁడు దానం జేసి దేవేంద్రాదీశ్వర సన్నిధానంబుఁ గల్పించుకొని మహేశ్వరునివలన దివ్యాస్త్రంబులు వడసి శత్రుసంహారం

బు గావించి నీవ్యసనం బపనయించు నతండు తొల్లి బదరికాశ్రమంబున నారాయణ మునిం గూడి బహుకాలతపంబు చేసి వాసిం గాంచిననరుం డనుపరమమునీశ్వరుం డని విధి విధానంబున నమ్మను వతని కుపదేశించి యంతర్ధానంబు నొందె నంత యుధిష్ఠిరుం డును దాని నారాధించుచు వ్యాసభట్టారకునివచనంబునం జేసి ద్వైతవనంబుననుండి సపరివారుండై మరల కామ్యకవనంబునకుఁ జనియె ననిన విని జనమేజయుండు వైశంపాయనుం జూచి. 149

తే. బాపురే యేమి చెప్పుదు ◆ బాదరాయణప్రదత్తప్రతిస్మృతి◆నామవిద్య
వడసి జపియించి తత్ప్రభా◆వమున దివ్యుఁ, డయ్యెఁ బ్రతిహతదుర్జనుం ◆ డర్జునుండు.

చ. అతఁడు సురాసురాదులకు ◆ నైన జయింపఁగరానివాఁడు వా
క్పతిముఖదేవతావితతి ◆ భావమున న్గనరానిదేవునిన్
శితిగళునిం బ్రమోదితునిఁ ◆ జేసి సమక్షమునం గొనె న్మహో
న్నతవిభవంబుఁ బాశుపత◆నామక మస్త్ర మనన్యలభ్యమున్. 150

క. ఆకథ వినుటకు మిక్కిలి, నాకు న్మదిఁ గౌతుకంబు ◆ నవనవ మగుచుం
బ్రాఁ కందె దాని నిప్పుడు, వాకొనఁ గరుణింపవయ్య ◆ పరమమునీంద్రా. 151

వ. అనిన నతం డతని కిట్లనియె నట్లు కామ్యకంబున కరిగినధర్మజుం డొక్కనాఁడు వివిక్తంబున విజయుం జేరఁ జీరి కరతలంబున నతనిశరీరంబు నిమురుచు సాంత్వపూర్వముగా ని ట్లనియె. 152

క. ద్రోణుఁడు భీష్ముఁడు గృపుఁడును, ద్రోణాయని కర్ణశల్య◆దుశ్శాసనులున్
బ్రాణము లెన్నరు సుతను,త్రాణకృపాణాస్త్రశస్త్ర◆తతి వారి కగున్. 153

వ. రాజసూయంబునాఁడు మనచేఁ బరాజితు లైనరాజు లెల్లరు నావలిదిక్కు చేరి ప్రాణంబు లాసుయోధనునకే సమర్పింతు మని యున్నవా రట్టి శక్తిమగల నందఱ నోర్చి దుర్యోధను నిర్జింపఁ గలవా రవల నుండ నోపుదురే యని మఱియును. 154

ఉ. వేదములుం బలెం దలఁప ◆ విప్రవరేణ్యుల కెందునున్ ధను
ర్వేదము భీష్మముఖ్యు లగు◆వీరుల కెల్లను దివ్యమంత్రసం
పాదిత మై మహత్తర మ◆పారము నై వశ మై మెలంగు మీ
రది గ్రహించి వారల జ◆యించుటకుం గడగట్టువారొకో. 155

వ. అఖండమహీమండలాఖండలుండును మహారథసహాయుండు నై యిపుడు గండుమిగిలి యున్నదుర్యోధను నోడించుట మన కసాధ్యంబ యైనను గృష్ణద్వైపాయనుం డట్టి వారి నెదుర్చుట కుపాయంబు నా కనుగ్రహించె నయ్యది సమర్థుండ వగునీకుం జెప్పెదఁ బరిగ్రహించి నీ వుత్తరాభిముఖుండవై పోయి భవాదుల నారాధింపుము



తత్ప్రభావంబున నధికతేజోనిధివై ధనుర్బాణతూణీరపాణివై ధర్మజానుజ్ఞాతుండై దానం గృతార్థుండ వయ్యెద వని ప్రతిస్మృతి నుపదేశించె నతండు నావిద్యం గ్రహించి వీతిహోత్రు నారాధించి ధౌమ్యాదులకుం బ్రదక్షిణనమస్కారంబు లర్పించి వారి యాశీర్వాదంబు లందుకొని ప్రయాణోన్ముఖుం డయ్యె నంతఁ బాంచాలి విజయుని కడ కరుగుదెంచి సమయోచితంబుగాఁ గొంత ప్రసంగించి. 156

తే. కొలువుకూటమున న్నన్నుఁ ◆ గ్రూరు లట్లు
చేయుచుండ సుయోధనుం ◆ డామెడఁ గని
యోసి పశువా యనుచుఁ బిల్చె ◆ నోహృదీశ
యది దహించుచునుండె నా◆హృదయ మకట. 157

మ. అవమానంబు సహింప లేనిన్నృపవం◆శాంభోధి జన్మించి నే
నవమానంబు సహించి యుంటిని గదా ◆ హర్షంబు వోఁ బేద య
ట్లవమానం బొనరించినట్టిరిపు సం◆హారంబు గావింప నా
కవునొక్కో పురుషుండనే నటులు చే◆యం జూడనే వల్లభా. 158

చ. ఇది యటు లుండ నిమ్ము హృద◆యేశ్వర శత్రుపరాభవాగ్ని మై
హృదయము బగ్గుబగ్గుమన ◆ నే నిటఁ గాఱియ నొందు చుందు నీ
విదె చనుదెంతు నన్నగతి ◆ నేగి భవాదులఁ దన్పి తత్కృపా
విదితమహాస్త్రశస్త్రబల◆వీరుఁడవై చనుదెమ్ము చెచ్చెరన్. 159

మ. ఇతరాసాధ్యకృతిం బ్రవర్తిలెదు నీ ◆ కింద్రాదిదిక్పాలురున్
క్షితియుం గాలియుఁ గీలియున్ జలములున్ ◆ దిక్కు ల్విదిక్కు ల్సురల్
సతతంబున్ సహకారులై దయ వెల ◆ ల్గాఁకుండఁ గాపాడుచున్
బ్రతిబంధం బెడలించి కార్యము ఘటిం◆పం జాతు రెల్లప్పుడున్ 160

అర్జునుఁడు తపింప నింద్రకీలంబునకుం బోవుట.

మ. అని దీవించి వియోగము న్సయిప లే◆క కృష్ణ యొక్కింతలోఁ
గనుల న్నిండిననీ రడంచుచును లోఁ ◆ గన్గొంచు సవ్యేశ నే
మనినం దప్పని పోయిర మ్మనుచు నే◆త్రాంతంబుల న్వీడుకో
ల్పినఁ బార్థుండు నుదగ్దిశాభిముఖుఁడై ◆ వెంచేసె నేకాకియై. 161

ఉ. వీడనియోగవిద్యయును ◆ విల్లును నమ్ములు నస్త్రశస్త్రముల్
తోడుగ మంచుపర్వతము◆త్రోవ వనంబులు నేళ్లు కొండలున్
వీడులు దాటి పోవుచును ◆ వీరుఁడు పాండవమధ్యముండు దా
నాడఁ గనుంగొనెన్ ధృతమ◆హామునిజాలము నింద్రకీలమున్. 162

వ. ఇట్లు కనుంగొని యప్పర్వతం బధిరోహించునంతలోన. 163

క. పోకుము పోకుము యోగ్రపాకారికుమార యనుచు ♦ బహుకలధ్వని యొం
డాకసమునుండి వీనుల, నాకర్ణింపంగ నయ్యె ♦ నర్జునున కటన్. 164

వ. అర్జునుండును దానికి విస్మయంబంది నలుగడలం బరికించుచుం బోవం బోవ ముందర. 165

సీ. పల్లవారుణజటా♦పటలంబు పలితమై, తెల్లపూగుత్తుల♦రీతిఁ దెలుప
ముడుతముడ్త ల్వడు♦మోముపై వెన్నెల, ల్వొదజల్లి కనుతెప్ప ♦ లదరుచుండ
నిట్టనీల్గెడుకాళ్లు ♦ నట్టును గూఁడు నా, వంగినమేను వి♦ల్వంగి వ్రేల
మెదుకవాసన గొట్టి ♦ మెలికలు వడుజన్ని,దము లక్షమాలలఁ ♦ దగులుకొనఁగ

తే. వడిగ వడవడలాడెడు♦బడుగుటొడలి, నిలువఁ బెట్టఁగ నన దండ.♦ మలరఁ జేతఁ
బడుచు లేచుచు నొకవృద్ధ♦బాడబుండు, వచ్చె నొకచెట్టుదరినుండి ♦ వడఁకికొనుచు.

వ. బ్రహ్మతేజోధికుం డగునావృద్ధబ్రాహ్మణుం బిలకించి విప్వాచ్ఛుండు నమస్కరించి తత్సమీపంబున కరుగుటయు నతండును. 167

ఉ. ఎక్కడివాఁడ వందము ♦ నింద్రకుమారుని గెల్వఁ జాలు దీ
వెక్కడినుండి యెక్కడికి ♦ నేగుచు నిక్కడి కేగుదెంచితో
నిక్కము దెల్పవయ్య మఱి ♦ నిన్నన ధర్మరతుండ వంచుఁ బెం
పెక్కినవాఁడ వంచు ధర♦ణీశ్వరవంశ్యుఁడ వంచుఁ దోఁచెడిన్. 168

మహాస్రగ్ధర. ఇది శాంతాత్ముల్మునీంద్రుల్ ♦ వృజినవిరహితుల్ ♦ వృద్ధభూమీసురేంద్రుల్
పొదలం గా నైనదేశం♦బు సుకృతఫలదం♦బుం గతోగ్రప్రచారం
బడిగానన్ లోకు లెవ్వా♦రసి గిసియును వి♦ల్లమ్ములున్ గిమ్ములున్ సం
పద లోలిం దాల్చి యుండం ♦ బరఁగరు చను మీ♦పట్టునం బాసి యోయీ. 169

ఉ. ఆయుధపాణివై యిఁక ర♦వంత మెలంగితివేని నిన్ను నీ
యాయుధకోటులం దృణము♦లట్లు గడించి తపోగ్నికీలల
న్బాయఁగఁ జేయుదుం ద్రిభువ♦నప్రథితప్రతిభావిశేషశా
పాయుధధారి నన్ దలఁప♦వా మనమందు నరేంద్రచంద్రమా. 170

వ. అని తర్జనభర్జనంబుల గర్జించుచుం బలికినఁ జలింపక కప్పురుహూతపుత్త్రుండు సామ్యంబునం గార్యంబు సాధింప వలయు నని ప్రార్థింపుము నతని కిట్లనియె. 171

ఉ. సాంద్రతపోవిభూషణ ప్ర♦శస్తవిశేషణ నిన్నుఁ గొల్తు నీ
విందృఁడవో యుపేంద్రుఁడవొ ♦ యేరొ యొకింత యెఱుంగ రాదు నే



నింద్రసుతుండ ధర్మజున ♦ కిం పొదఁగూర్చెదుతమ్ముఁగుఱ్ఱ దే
వేంద్రుని గాంచి శంభు నుతి♦యింపఁగ వచ్చితి నన్నుఁ బ్రోవవే. 172

క. శాపాయుధుఁడను గామిన్, గాపురుషులబారినుండి ♦ కాచికొనంగా
నాపజ్జ నాయుధాళిన్, దీపింపఁగఁ జేసికొంటి ♦ నేరమె చెపుమా. 173

వ. అని చలింపక ధైర్యంబునం బలికిన మెచ్చి సహస్రాక్షుండు ప్రత్యక్షుండై పుత్త్రా నీధైర్యం బెఱుంగ నిట్లు వచ్చితి నేమి కావలయు వరంబు వేఁడు మనుటయు. 174

క. పాదంబుల సాఁగిలి పడి, యోదేవాధీశ నన్ను ♦ నోమెద వేనిన్
నీదయ నాపై వచ్చిన, నే దివ్యాస్త్రముల నొంద ♦ నీవే వరమున్. 175

చ. అనవుడు నాతఁ డిట్లనియె ♦ నయ్యది యెంతటిమాట స్వర్గమో
ఘన మగుమోక్షమో సకల♦కామములో మఱి దేవతాత్వమో
కనుఁగొని వేఁడు మిత్తు నన♦గా నతఁ డాతనిఁ జూచి నమ్రుఁడై
యనియె న వెల్ల యేమిటికి ♦ నయ్యమహాస్త్రము లిమ్మ మియ్యెడన్. 176

చ. పరులొనరించుదుష్పరిభ♦వం బనునబ్ధి మునింగి నాసహో
దరులును గాంతయు న్వనులఁ ♦ దద్దయు శోకము నొందుచుండఁగా
నరసియు వారిఁ బెట్టి భవ♦దాజ్ఞ శిరంబునఁ బూని వచ్చినన్
దురితము రాదె లోకులును ♦ దూఱరె నన్ సురలోకనాయకా. 177

ఆ. *అనఁ బ్రసన్నుఁడై సు♦రాధీశుఁ డిట్లనుఁ, గరుణ నీదుధైర్య ♦ మరయఁ గోరి
యంటిఁ గాని కొడుక ♦ యంటు నంటును బాసి, వెడలు మనుట కంత♦వెఱ్ఱినోటు.

ద్విపద. పరమాస్త్రలాభంబు ♦ వడయ నిష్టంబు, పరఁగు నేని కుమార ♦ పరమేశు నీశు
గరళకంధరుఁ దపో♦గరిమ సేవింపు, మురువైభవంబు నీ ♦ కురక చేకూరు. 179

కైరాతపర్వము.

వ. అని సహస్రలోచనుండు లోచనాగోచరుం డగుటయు నర్జునుం డాకుధరశిఖరంబున వివిధకుసుమఫలభరితవృక్షవిరాజమానంబును నానాపక్షినిషేవితంబును నానామృగగణాకీర్ణంబును సిద్ధచారణసేవితంబును మనుష్యవర్జితంబు నగునొక్కవనాంతరంబునఁ గమలకల్హారకలహంససంకులపంకజాకరంబుపజ్జ నొకసమప్రదేశంబున జటావల్కలాజినధారియు జితేంద్రియుండు నై భూతశుద్ధిపూర్వకంబుగా వీరాసనాసీనుం డై విశ్రమించి ప్రాణాయామపూర్వంబుగా నింద్రియవ్యాపారంబు నిరోధించి నాసాగ్రవిన్యస్తలోచనుండై చలింప కంతరంగంబున నోంకారనినాదం బాలించుచుఁ బరమశివోపాసనంబు సేయుచుండె నయ్యవసరంబున. 180

* అంటునంటు = స్నేహబాంధవములపట్ల నిట్లు గోదావరిమండలమున వాడుదురు.

సీ. పవలు రేయును రెండు♦పర్యాయములు తిని, గురుతరంబుఁ దపించె ♦ గొన్నినాళ్లు
పవ లుండి రే యొక్క♦పర్యాయము భుజించి, గురుతరంబుఁ దపించెఁ ♦ గొన్నినాళ్లు
పట్టపగట నొక్క♦పర్యాయము భుజించి, గురుతరంబుఁ దపించెఁ ♦ గొన్నినాళ్లు
పవలు రేయును నొక్క♦పర్ణ మేఁ గుడువక, గురుతరంబుఁ దపించెఁ ♦ గొన్నినాళ్లు
తే. ఓలి రెండును మూఁడును ♦ నాలు గైదు
నాఱు నేడును నెనిమిది ♦ యాఱుమూఁడు
పదియు దినముల కొక్కొక♦పరి భుజించి
గురుతరంబుగఁ ♦ దపియించెఁ గొన్నినాళ్లు. 181
తే. ఆకలంబుల మెక్కియు ♦ నంబువులను, ద్రావియును గాలిఁ దినియు నం ♦ తేవి దినక
మానసంబునఁ దపియించె ♦ వానఁ దడిసి, యెండ నెండియు నివమున ♦ నెపుడుఁ జివికి.
వ. ఇ ట్లతిఘోరంబుగాఁ దపోదీక్షితుండై. 183
చ. జడధులు వట్టిపో నిఖల♦సాలములుం జెడిపో దవాగ్నితోఁ
దొడుసుగఁ గాయునెండలకుఁ ♦ దోడ్పడుచు న్వడగాలి గొట్టుచో
మిడమిడలాడువేసవిని ♦ మే న్గడు నాపదమస్తకంబుగా
నుడుకఁ గృశానుమధ్యమున ♦ నుండి తపించె నతండు మెండుగన్. 184
ఉ. ఉండినచోట నుండి మఱి ♦ యొండొకచోటికిఁ గాలు మెట్టి పో
కుండఁగఁ ద్రాఁచులం జదల ♦ నొత్తుగ వ్రేలఁగఁ గట్టినట్లు నీ
ర్కుండలఁ గ్రుమ్మరించునటు ♦ గొట్టెడువార్షికవాసరంబులం
బండల నుండి పెన్ బయట ♦ బాఢతపం బొనరించె నెంచఁగన్. 185
చ. చదలునఁ బుట్టి కోలువులి♦చందమునం బఱతెంచి మంచు భూ
వదమున నల్లెడం బ్రబలి ♦ పైఁ బడఁ బాఱును నట్టివారినే
వదవదలాడఁ జేయుహిమ♦వంతమునం దొగి గొంతుబంటిగా
నదులజలంబుల న్నిలిచి ♦ నాకపసూతి తగుం దపఃక్రియన్. 186
వ. ఇ ట్లధికసమాధినిష్ఠాగరిష్ఠుండై పాదాంగుష్ఠాగ్రంబున నిలిచి యూర్ధ్వబాహుండై పరమతపం బొనరించునాసమయంబున నందలిఋషులు విస్మయం బంది కైలాసంబున నున్నశివానునిపాలికిం జని ప్రణతులై యి ట్లనిరి. 187
ఉ. పాండవమధ్యముండు బహు♦భండనఖండితశత్రుమస్తకో
ద్దండపరాక్రముండు భుజ♦దండకిణాంకవిభూషణుండు ధూ
ర్తుండును గాఁగ మండుచుఁ ద♦రంబుఁ దపించెడు నిన్నుఁ గూర్చి త
చ్చండతపోగ్నిఁ దాళకయుండఁగొని ♦ సర్వజగజ్జనభీప్రదం బగున్. 188



క. వ్రతివైౖ యతితీవ్రమునన్, స్తుతియింపంబడుచు విడక ♦ సురుచిరశస్త్ర
ప్రతతిఁ దపించెడు దానన్, క్షితియెల్లఁ దలంకుచుండె ♦ గిరిజానాథా. 189
ఆ. అతనియభిమతంబు ♦ నరసి ప్రసాదించి, తత్తపోభరంబుఁ ♦ దాప ముడిపి
జగదుపప్లవంబు ♦ నరగ నివారించి, భక్తసమితిఁ బ్రోవు ♦ పరమపురుష. 190
క. అనినం బరమేశ్వరుఁ డో,మునులారా వానియిష్ట♦మును నెఱుఁగుదు నేఁ
జని వర మొసఁగి మనంబున, కనుమోద మొనర్తు మీర ♦ లరుగుఁడు వేడ్కన్. 191
వ. అని వారి నంపిపుచ్చి యప్పుడు పార్వతిం గని దేవీ భక్తునకు వరప్రదానంబు సేసి వత్తము నీవును ర మ్మనుటయు నాయమ్మ విస్మయమ్ము నొంది యిందుశేఖరున కి ట్లనియె. 192
ఉ. *పాండవుఁ డెవ్వఁ డాగతి న♦పారతపం బొనరింప నేల నా
తం డెటువంటిభక్తుఁడు వి♦ధాతృముఖుల్ గొనలేనినీమహా
ఖండకృపారసంబు గొనఁ ♦ గల్గెను గారణ మేమి కేలఁ గో
దండము నమ్ము లుంచుకొని ♦ తా వ్రతి గాఁ గత మేమి చెప్పవే. 193
వ. అనిన శంకరుం డి ట్లనియె. 194
చ. నరనారాయణు లన్మునీశ్వరులు ము ♦ న్న న్గూర్చి కేదారమం
దురునిష్ఠన్ బహుళాబ్దముల్ దపము నెం♦తో చేసినా రందులో
నరుఁ డాపాండవుఁ డై జనించె ఖలులన్ ♦ ఖండించి విశ్వంభరన్
బరిపాలింపఁగఁ గృష్ణనామధరుఁడై ♦ నారాయణుం డొప్పెడున్. 195
మ. కలకాలంబు ననుం గుఱించి తపముం ♦ గావించునప్పాండవుం
డిల దుష్టత్వమున న్మెలంగురిపులన్ ♦ హింసింప శస్త్రాస్త్రముల్
గలుగం జేసికొనంగ నివ్వ డిటు నన్ ♦ గాంక్షించు నాభక్తునిన్
దిలకింపం గరుణింప నేను గదవే ♦ దేవీ ప్రయాణంబునన్. 196
వ. అని చెప్పి యొప్పించి యప్పుడు. 197

ఈశ్వరుఁడు కిరాతవేషంబున నర్జునునొద్దకు వచ్చుట.

మ. ‡కలపం బద్దినసీలికోకతలపా♦గా పీలిపూఁదావళం
బులు సింగంబులచుంచు దండకడియం♦బు ల్లెడిలేదోలు కా
సెలు విం డ్లమ్ములు కత్తు లీఁటె లలరం♦జేకట్లు పెన్నెమ్మికుం
చెలుసుం దాల్చి కిరాతరా జగుచుఁ బో♦ల్చెన్ శంకరుం డత్తఱిన్. 198

* ఈపార్వతీపరమేశ్వరసంవాదము కొన్ని ప్రతులందు లేదు. ‡ పీలిపూఁదావు = పికిలిపిచ్చుక ఇట్లుగోదావరిమండలమున వాడుక.

సీ.*నీలిపీలికలు పట్టీలుగా వేసి కుట్టినబొంత మొలచుట్టుఁ ♦ దనరఁ జుట్టి
మోఁచేతులను దాఁకఁ ♦ బొలుపగునద్దాల,రవపని గల్వాల్ల♦రవిక తొడిగి
నులివట్టి నెమలికన్నులనెఱుల్ నవరాలు,మెడలపైఁ బడ జాఱు♦ముడిని వైచి
కాళ్లఁ జేతుల గల్లు♦గల్లుమంచును మ్రోయు,నిత్తడినగ లెన్ని♦యేని బెట్టి
తే, పూసపేరులు మెడనిండఁ ♦ బొందుపఱిచి, గవ్వపురిత్రాడు నిలువెల్లఁ ♦ గలయఁ జుట్టి
లీలమైఁ గేల నొకకుంచె ♦ గ్రాలఁ బట్టి, చలిమలకుమారి యెఱుకుల♦సాని యయ్యె.
వ. ఇట్లు పార్వతీపరమేశ్వరులు కిరాతవేషంబులు ధరించి వేటలాడు నెపంబునం బయలు
వెడలి తిరుగులాడుచుండి రంత. 200

చ.‡తడవిండ్లీఁటెలు కత్తు లమ్ములు వలల్ ♦ దాఁగొంచుఁ జెంచుల్ కడున్
దడముల్ గా వెనువెంటఁ జుట్టుకొని రాఁ ♦ దబ్బిబ్బు లార్పు ల్కడున్
దొడరం దోలుచు వాల్మీకంబులను నల్♦త్రోవల్ వనంబందుఁ బె
న్వడిగా మెట్టుచుఁ బోయి బోయ దఱిసెన్ ♦ బార్థాశ్రమం బయ్యెడన్. 201
సీ. పృథివిఁ గ్రక్కదలించి ♦ పెకలింపఁగాఁ జాలు, ఖురముల ఖరము లొ♦కుఱుచకాళ్లు
బ్రహ్మాండభాండంబు ♦ పగిలించి బద్దలు, గా లీలఁ గావించు♦కోలమోర
జగము లీరేడు నేర్చఁగఁ జాలుబల్మిదుం,గుఱుల రాల్చెడువాఁడి♦కోఱకోఱ
లాడింపఁ బుట్టుమ♦హానిలంబున గట్టు,చెట్టుల నెగిరించు♦పొట్టితోఁక
తే, మోఁకు దిరుగసిగళము మూఁ♦పురము భరము, తిర్యగాయతోదరము వి♦స్తీర్ణమురము
వెలుఁగ శౌర్యము మూర్తీభ♦వించె ననఁగఁ, దారి మూకుఁడు ఘోరభూ♦దారమయ్యె.
చ. పశుపతి బోధితుం డగుచు ♦ భాసిలి మూకుఁడు పందివ్రాలె నై
దశదిశల న్మెలంగుచును ♦ దా నటకుం జని ఘుర్ఘురించుచున్
దశనపురాపిడిం బొడము♦దట్టపుటగ్గికణమ్ముల న్వనిన్
విశద మొనంగఁ జేయుచును ♦ వే చనె నర్జునుఁ జేల్పునో యనన్. 203
ఉ. మోర బిగించికొంచుఁ దన♦ముందఱికిం బఱతెంచువందినిం
బోరనఁ జూచి పాండవుఁ డ♦పూర్వపురీతుల నొప్పుదానికిం
గారణ మూహచేయుటకుఁ ♦ గానక కాఁగలకార్య మవ్వలన్
దేరఁగఁ జూతు నంచుఁ గడు ♦ ధీరత నిల్చె ససంభ్రమంబునన్. 204
చ. కనలుచు గాండివంబును న♦ఖండజవంబున నెక్కువెట్టి పె
ల్చన మొరయించుచుం గుణము ♦ చయ్యన డాయఁగఁ బోయి పొమ్మటం

* గొల్లరవిక = పదులరవిక.
‡ తడవిండ్లు = తడకట్టతోఁ జేసినయమ్ములు, ఇవి వెదురువిండ్లకన్న జిగి గలవి.



చును నవలీఢపాదుఁ డయి ♦ చూచి శరం బరివోసి యేయఁ బోఁ
జని తగ డేయ కేయ కని ♦ సారెఁ గిరాతుఁడు పల్కుచుండినన్. 205
క. తనపై వచ్చెడుదానిం, గనలుచు నర్జునుఁడు వైచెఁ గనుఁగొని మాయా
వనచరుఁడు దాని వైచెం, గనుఁగొనలన్ భీషణాగ్ని♦కణములు దొరఁగన్. 206
చ. అరుదుగఁ గొండమీఁదను మ♦హాశిల లట్టిటు వడ్డయట్లుగా
నిరుపురిశాతబాణము ల♦హీనగతిం బఱతెంచి పందిపై
నిరుగడఁ గాఁడఁ దాఁకుడుఁ గి♦రీంద్రము చేవ దొఱంగి దిర్దిరం
దిరిగె నపాంపతిం దరువ ♦ నిల్చినమందరశైలమో యనన్. 207
సీ. ఇట్లు మూకాసురుం ♦ డిద్దఱచే శర,విద్ధుఁడై కిటిరూపు ♦ విడిచి చనియె
నవ్వచ్చుఁ డెంతయు ♦ విస్మితుండై తన,ముందట వర్తించు♦పురుషమూర్తిఁ
బటుచాపధరు మేరు♦పర్వతాకారు న,పారకిరాతబ♦లోరుతేజుఁ
గామినీసహితునిఁ ♦ గాంచి మానవగోచ,రము గానియివ్వని ♦ రమణిఁ గూడి
తే, క్రుమ్మరియె దేల మఱి నేను ♦ గొట్టినట్టి,సూకరము నేసి ధర్మంబు ♦ పోకడంచి
నాఁడ విప్పుడు నిగ్గాడ ♦ నానిశాత,బాణములపాలు చేసెదఁ ♦ బాఱ కున్న. 208
వ. అనిన మందహాసంబు సేయుచు మాయాభిల్లుండు కురుతల్లజున కిట్లనియె. 209
క. మూకాఁపురం బెనంగెడు, నీకాననమందు భీతి ♦ యింతయు లేకీ
వేకరణి మెలఁగఁ గలిగితి,వో కద సుకుమారమూర్తి ♦ వొంటిమెయి నిటన్. 210
క.నాపుడు నరుఁ డను నీగాం,డీవము దివ్యాశుగములు ♦ నిరతము తోడై
నావలన నుండ నొంటరి, నే వెఱతునె వని వసింప ♦ నెఱుకులఱేఁడా. 211
తే. అనిన మఱియుఁ గిరాతుఁ డి♦ట్లనియె మృగము
మున్ను నే నేసితిని దాని ♦ నన్న కీవు
నేసి ధర్మవిరోధంబు ♦ నేసి తంచుఁ
బలికి బింకము లాడెదు ♦ చలము మెఱయ. 212
క. బీరంబే కలదేనిన్,రా రణమొనరింపు మట్లు ♦ రాఁ జాలవ యే
దూరముగఁ బొమ్ము పోకీఁక, మూరాడినఁ బిండిపెట్టి ♦ మలిచెద నిన్నున్. 213

## కిరాతార్జునుల ద్వంద్వయుద్ధము.

వ. అని పలికినం బిఱువోక కిరీటి ప్రతిఘటించుటయుం బినాకి యంతఁ బోక వీకమెయి వాఁడిములుకు లాతనిమెయిం గాఁడ నేసి పోఁడిమి సూపుటయుం గనలి కవ్వడియును.
చ. వెదరక శత్రుపర్వతవి♦భేదనదక్షము లక్షయంబులై
పొదలెడువజ్రబాణము ల♦పూర్వవిధంబునఁ బెంచుచేనిపై

చిదుకఁగ నేసి యార్వ నవి ♦ చీరికినిం గొన కింతలో నతం
డుదరముఁ జేరఁ బ్రింగెను మ♦హాహాదధినీ ర్బడబాగ్ని చాడ్పునన్. 215

ఉ. తెట్టలు గట్టునట్టు కను♦తీక్ష్ణశరుం డమరేంద్రసూతియుం
గట్టలుకం బినాకిపయి ♦ గాఢతరోగ్రశరంబు లేసియున్
బిట్టదరించియుం బలము ♦ బీరము సూపియు మాయబోయ ని
ట్టట్టుఁ గదల్ప లేక కను ♦ నచ్చెరు వంచుఁ గలంగి నెమ్మదిన్. 216

శా. మాయామానుషరూపధారి యగునీ♦మాన్యప్రతాపోజ్జ్వలుం
డాయిందుప్రింజా యుపేంద్రుఁడో తలఁప నా♦యజ్ఞానమున్ బాప నన్
డాయ న్వచ్చినభూతనాయకుఁడొ కాఁ♦డా యన్యుఁ డెవ్వాఁడు నా
స్థాయచ్ఛాతశరాహతిం బడక ని♦శ్చాంచల్యుఁ డై యుండెడిన్. 217

సీ. నాయేయుబాణముల్ ♦ పోయెను నూరక, చవిటినేల నినుబీ♦జములు వోలె
నెఱు కేయునవి నాకు ♦ నెఱుఁకు లాడఁగఁ జేసి, పిసుగుల ట్లయి చాల ♦ వెగడు చూపు
దేవనివాస మీ♦గ్రావ మం చని విందు, మాయాకిరాతుఁ డీ♦మానధనుఁడు
దేవుఁడో దనుజుఁడో ♦. భావింపఁగా రాదు, న న్నేమి చేయఁ దా ♦ నున్నవాఁడొ

ఆ, యనుచుఁ గినుక వొడమ ♦ నశనికల్పము లైన, వాఁడిములుకుగములఁ ♦ గాఁడ నేసి
యిలను జదల దిశల ♦ నెచటఁ గన్గొన్నను, దనశరములె మెలఁగఁ ♦ దగ నొనర్చె. 213

మ. *అవి యెల్లం జని చెంచుమేనఁ బడి వ♦మ్మై పోవుటం జూచి గాం
డివముం బెం డయి యుంటఁ జూచి తనతూ♦ణీరంబునం దక్షయం
బవుచు న్వెల్గుపృషత్కసంఘము క్షయం ♦బై పోవుటం జూచి వా
సవసూనుండు భయాంతరంగుఁ డగుచున్ ♦ సంభ్రంబున న్సాల్వడెన్. 219

క. ఇది యేమియద్భుతంబో, కద ఖాండవవిపినదాహ♦కాలంబున నొ
ప్పిద మగుదయ వైశ్వానరుఁ, డొదవించినశక్తు లిట్టు లుర ♦ కేగె నయో. 220

వ. అని యలుక వొడమ. 221

చ. ‡శరధులు వట్టిపోవ శర♦సంహతిఁ గొట్టిన లొంగనట్టియా
నరుని మదీయకార్ముకము♦నం గడతేర్చెద నంచుఁ గొప్పునన్
బొరలఁబడ న్వడిం బొడిచి ♦ పొంపిరివోవఁగ నల్లెఁ జుట్టినన్
గిరిచరుఁ డాశరాసనముఁ ♦ గిక్కురుపెట్టి హరించె నింతలోన్. 222

తే. ధనువు వోఁ గిన్కనిం కిటఁ ♦ దఱుఁగుఁ బ్రభను
మనుచు శితఖడ్గమున వాని♦ఘనశిరమున

* సాల్వడు = బెండువడు. ‡ కిక్కురుపెట్టు = వంచించు.



మొత్తె నద్దాన ఖడ్గంబు ♦ తుత్తుము రయి
పడియె నిల నద్భుతము దోఁచఁ ♦ బార్థుఁ డంత. 223

క. వృక్షముల జాల నెఱుకున్, దక్షుండై మోఁద నవియుఁ ♦ దద్గాత్రమునం
దాక్షణమునంద యడఁగెన్, లక్షలు బిందువులు జలధి ♦ లయ మగురీతిన్ 224

చ. అలుకమెయిం బృథాతనయుఁ ♦ డంత మహేశ్వరుఁ దాఁకి పెంబొగ
ల్మ్రోలవఁగ ముష్టిఘాతమున ♦ మోఁదెను మోఁదిన నాతఁ డాతనిన్
బెలుచనఁ బట్టి కొట్టె నొక♦పెట్టున వారికి ముష్టియుద్ధముం
గలిగెను రోమహర్షణము♦గా నొకయింతటిలోన వింతగన్. 225

తే. ఉరమునం గొట్టె నర్జునుఁ ♦ డుగ్రునురము, నతఁడు నురవడి నటు చేసె ♦ నంత వారి
గాత్రముల నగ్గిమంటలు ♦ గాన నయ్యె, నఖిలభూతములకు భయం ♦ బావహిల్ల.

వ. అంత నమ్మాయాకిరాతుండు గండుమిగిలి పాండవమధ్యముం బట్టి పిండీకృతుం జేసి విడుచుటయు నతండు నిట్టూర్పు నిగిడించుచు నేలం బడి మూర్ఛవోయి ముహూర్తమాత్రంబున రుధిరాప్లుతాంగుండై లేచి నలుగడం జూచి దుఃఖించుచు నట మృణ్మయం బగుస్థండిలంబు గావించి దేవదేవుం డగుమహాదేవు నం దావాహనంబు సేసి గంధమాల్యాదుల నభ్యర్చించి రక్షింపు మని ప్రార్థించుచుఁ దనచే నర్పితం బైనగంధమాల్యాదికం బాబోయశిరంబునం దుంటఁ జూచి హర్షపులకితాంగుండై సంభ్రమించుచు వానిపాదపద్మములం బడినఁ బ్రీతుండై భూతనాథుం డాతని కిట్లనియె. 227

శా. ఓహో ఫాల్గున మెచ్చు వచ్చె మది నీ♦యుద్ధంబుసామర్థ్యమున్
బాహాశక్తియు శౌర్యమున్ ధృతియు నే♦వాఁడుం గొనంబోఁడు నం
దేహం బింతయు లేదు నీవు తొలుతం ♦ దేజస్వి వౌమాని వీ
దేహం బిప్పుడు కారణాంతరమునన్ ♦ దీపించె నీ కారయన్. 228

క. వేలుపులఁదొట్టి రిపులన్, లీలమెయిం గెలువఁ జాలు♦నిశితాస్త్రంబుల్
వే లవి నీకడ నున్నవి, నీలావున కెదు రెవండు ♦ నిఖిలజగములన్. 229

వ. నేను నీకుఁ బ్రీతుండ నైతి నారూపంబుఁ జూడు మని దివ్యదృష్టి నొసంగి యంత.

సీ. మే లైనమగజాల♦డాలు డీలింపఁ జాల్, మేనితో సామేని♦సానితోడ
వెన్నెల వెదజల్లు♦క్రొన్నెలసిక నల్లు, వువ్వుతో మువ్వంపు♦నవ్వుతోడ
నల్లనఁ దల నల్ల♦కల్లోల మాతెల్ల, వాఁకతో హస్తితో♦లొక్కతోడఁ
బెనుపల్కు లొల్లని♦నెన రొల్కు చల్లని, చూపుతో దొర లేని♦యాపుతోడ

తే. నిటలతటముల నంజలి • పుటి ఘటించు, వరపితామహాశక్రాది • సురలతోడ
నెమ్మి సేవించుప్రమథగణమ్ముతోడ, నెదుట సాక్షాత్కరించె సు • మేశ్వరుండు. 231

వ. ఇట్లు ప్రత్యక్షం బగుటయు నర్జునుండును. 232

—••◆ అర్జునుండు పరమేశ్వరుని స్తోత్రముచేయుట. ◆••—

క. కని భయము భక్తి సంతసమును వినయము విస్మయంబు • ముప్పిరిగొని య
మ్మనమునఁ బెనఁగొన సాష్టాంగనమస్కృతి సేసి యిట్లు • కడఁక నుతించెన్. 233

కల్పవల్లి. జయ సోమ నమో జయ రుద్ర నమో జయ జయ పశుపతి దేవ నమో
జయ త్ర్యంబక నమో జయ శంకర నమో జయ జయ ఖలసమిదగ్ని నమః
జయ భీమ నమో జయ శర్వ నమో జయ జయ శివతరశీల నమో
జయ దేవ నమో జయ భర్గ నమో జయ జయ మునివరపాల నమః. 234

కరిణి. పరమేశ్వర గిరిజేశ్వర సదనశ్వర వర సత్కరుణాకర గురుణా నుతకర ణామరశరణా
నిరుపాధికజనపోషక వరవేషక నిరతం, పరిపాలయ కుధరాలయ వరుణాలయశరధే.

తోటకము. అపరాధసహస్రసహస్రకరా నపి భక్తజనాన్ భవదంఘ్రినతి
ప్రవణా నవ సీదృశ మీశ్వర మాం కృపయా పరిపాలయ కృష్ణనుత. 236

దండకము. శ్రీమన్మహాదేవ దేవాధిదేవా భవోద్బంధహృన్మౌనిమానావనోద్యుక్త భావా పృథివ్యబ్వియద్వాయుతేజోమయాత్ముండ వై సచ్చిదానందరూపుండ వై సర్వపూర్ణుండ వై నిర్వికల్పుండ వై స్వప్రకాశంబున న్వెల్గుసర్వేశ్వరా సర్వపూర్వా సమస్తంబు నస్తంగతం బైన నేకాకివై లోకము ల్లోకఁ గావించి లోనైక్యముం జేయులోకేశ్వరా నీకుఁ గాకింతయు న్లేదు లోకంబులన్ బ్రహ్మవిష్ణ్వాదిరూపంబులం దాల్చి బ్రహ్మాండకోటు ల్వినిర్మించి రక్షింతు వీశా సురేశా భవద్దివ్యపూర్ణానుకంపాకటాక్షేక్షణంబుం గొనం గాదె బాణాసురుం డుత్తరుం డై వెలుంగొందుటల్ రాజరాజాఖ్యుఁ డై పొల్చుటల్ శ్రీమృకండ్వాత్మజుం డాపదల్ వాయుటల్ వేల్పు లల్పేతరక్ష్వేళదావాగ్నిదాహంబున న్మగ్గ కింపొందుట ల్గల్గెడిన్ నీమహత్త్వం బనంతంబు లోకత్రయాతీత మత్యద్భుతం బీవ సర్వేశ్వరేశుండ వెన్నంగ నీయట్టిదేవుండు లేఁ డెందు నిన్నెన్ని వర్ణింప బ్రహ్మాదులుం జాల రంచున్ శ్రుతు ల్మ్రొక్కెం జాటు నాకోటి తా మేటి యేపాటివాఁ డిట్లు ప్రత్యక్ష మై యుండుటల్ నాదు భాగ్యంబు నీదాసదాసానదాసు న్ననుం బ్రోచి రక్షింపు మో దేవతాచక్రవర్తీ మునీంద్రాంతరంగప్రవర్తీ నమస్తే నమస్తే నమః. 237



మ. *భవసింధుప్లవ పార్వతీధవ కవి • ప్రస్తూయమానోత్సవా
భవ గోసైంధవ దేవబాంధవ నమ • ద్భక్తాఘపాపాటవీ
దవ సర్వప్రభవ బద్ధమాధవ సుధాం • ధశ్శత్రుసంఘాతభై
రవ లోకప్రభవా జితాత్మభవ సం • రక్షించు నన్నో శివా. 238

శా. నీవే తల్లివి నీవె తండ్రి వనుజుల్ • నీవే సుహృద్బాంధవుల్
నీవే సర్వము నిన్న నమ్మితి నెదన్ • నీకంటె నొం డొక్కనిన్
నే వేఁడం బడరానిపాటులకు నై • నీచుండ నై వేగిరిన్
నీవాఁడం జుమి యెట్లు గాచెదవొ తం • డ్రీ సర్వలోకేశ్వరా. 239

వ. అని ప్రార్థించి మఱియును. 240

ఉ. నీవ జగత్త్రయంబునకు • నేతవు త్రాతవు సంవిధాతవు
న్నీవ దయామయుండవును • నే విని నిన్గన వచ్చి నీకు నీ
గ్రావమున న్వ్యతిక్రమము • గాఁ బచరించితిఁ దప్పు చేసితిన్
దేవ క్షమించి నన్నుఁ గరు • ణింపవె నింపవె పేర్మి పెంపునన్. 241

—••◆ ఈశ్వరుం డర్జునునకుఁ బాశుపతాస్త్ర మొసఁగుట. ◆••—

వ. అని ప్రార్థించినం బ్రసన్నుం డై పరమేశ్వరుండు పార్థుం గౌఁగిలించుకొని కేలు
కేలం గీలించి సాంత్వపూర్వంబుగా మఱియు ని ట్లనియె. 242

మ. నరనారాయణు లన్పురాణముని లా • నాఁ డాబదర్యాటవిన్
బరివర్తించి తపించి రేండ్లకొలఁదిన్ • భద్రంబుగా వారిలో
నరుఁ డీవై యిటు కౌరవాన్వయమునన్ • జన్మించితో భారతో
త్తర నాథక్షుఁడ వీవు నీకుఁ బురుడై • తక్కొక్కఁ డెవ్వండునున్. 243

తే. మున్ను శక్రాభిషేకంబు • పొసఁగినపుడు, గాండివం బనునిమ్మహా • కార్ముకమున
దానవుల నెల్లఁ దోలితి • పూని నీవు, దాని నిప్డు హరించితి • నేను మాయ. 244

వ. సత్యపరాక్రముండ వగునీకు నేను బ్రసన్నుండ నైతి నీయక్షయతూణంబులతో
గాండివంబు వెండియు నీచేతికి వచ్చు నింక నొక్కవరం బిచ్చెద నిష్టంబు వేఁడు మ
నినఁ బ్రాంజలి యై యతం డతని కి ట్లనియె. 245

తరువోజ. కరుణాలవాల భ • క్తజనాతిలోల • ఘనమతి వర మీయఁ • గా నెంతు వేని
పరికింప ఘోరంబు • పాశుపతంబు • పరమాస్త్ర మి మ్మది • బ్రహ్మశీర్షాఖ్యఁ
బరఁగి నీచేతఁ గ • ల్పమునందు విడువఁ • బడి జగంబుల నెల్ల • బడి సంహరించు
నరనిమిష మునందు • నని వింటి దాన • నరుల నేను జయింప • నర్థించినాఁడ. 246

---

* గోసైంధవ = వృషభవాహన.

వ. అప్పాశుపతం బను ప్రయుక్తం బైన దానినుండి శూలసహస్రంబులును గదాశతసహస్రంబులు నాశీవిషాకారఘోరశరాయుతశతసహస్రంబులునుం బుట్టు ననియు వింటి నే నమ్మహాస్త్రప్రభావంబునం జేసి భూతప్రేతపిశాచగరుడగంధర్వపన్నగయక్షరాక్షసాదుల నెల్లం దోలుటయె కాక కృపద్రోణభీష్మకర్ణాదుల జయించి కృతకృత్యుండ నగుదు ననిన భక్తజనవశంకరుం డగుశంకరుం డతని కిట్లనియె. 247

ఉ. *కోరితి నీ కొసంగెదను ♦ గొమ్మిదె పాశుపతాస్త్ర మోమహా
వీరవరేణ్య దీని భుజ♦విక్రమ మేర్పడఁ దాల్ప మోక్షసం
హారములుం బొనర్పఁగ స♦మర్థుఁడ వీవు కుబేరుఁ డింద్రుఁడున్
సూరతనూభవుండు వరు♦ణుండు నెఱుంగరు దీనితత్త్వమున్. 248

తే. అల్పచేతస్కు లగుజను♦లందు దీని, వైవ రా దట్లు వైచిన ♦ వడి జగంబు
నాశనము సేయు నిది నిర్జ♦రేశతనయ, దీనికి నసాధ్య మెందును ♦ గానఁబడదు. 249

వ. దీన నీ కిష్టార్థసిద్ధి యగు నని శుచి యై సమాహితుం డైన శ్వేతవాహనున కమ్మహామంత్రంబు ప్రయోగోపసంహారంబులతో నుపదేశించి పార్థా కృతార్థుండ వైతివి నీ వింక దేవలోకంబున కరిగి రమ్మని యాజ్ఞాపించి పార్వతీసహితుం డై శివుం డంతర్ధానంబునొందె నంత. 250

మ. హరదివ్యాస్త్రసమంచితుం డగునరుం ♦ డాదిత్యుచందంబునన్
వరతేజంబున వెల్గుచున్నఁ గని దే♦వవ్రాతముల్ భీతిలెన్
ధరణీచక్రము దిర్దిరం దిరిగెఁ ద♦త్కాలంబునన్ సాద్రిసా
గరమై దుందుభిశంఖనాదములు వే♦డ్కన్ మ్రోసె నాకంబునన్. 251

వ. అంతఁ బరమశివకరసంస్పర్శనంబున నపగతకల్మషుం డగునర్జునుం డత్యంతాద్భుతంబు నొంది తనడెందంబున. 252

ఉ. ధన్యుఁడ నే గృతార్థుఁడను ♦ ధారుణి నాదగుజన్మ మెన్న సా
మాన్యము గాదు సార్థక ము♦మాహృదయేశు మహేశునిన్ జగ
న్మాన్యు వదాన్యునిం గనుఁగొ♦న న్మఱి వానిపవిత్రదేహమున్
జన్యమునందు నంటుకొన ♦ సంభవ మయ్యెను నాకు నియ్యెడన్. 253

క. వరదుఁ డయి పాశుపతముం, గరుణించి యొసంగె నాకుఁ ♦ గఱకంఠుఁడు నే
దురమున నెట్టినపత్నుల, నరుదార జయింతు నింక ♦ నసహాయుఁడ నై. 254

వ. అని సంతసించుచున్నసమయంబున. 255

---

* సూరతనూభవుండు = సూర్యపుత్త్రుఁ డగుయముండు.



♦ ఇంద్రాదు లర్జునునకుఁ బ్రత్యక్షమగుట. ♦

సీ. *వైదూర్యవర్ణాభుఁ♦డై దెస ల్వెలిఁగించి, యాదోగణముతోడ ♦ నప్పతియును
జాంబూనదాంగుఁ డై ♦ జానొప్పపరిభ నొప్పి, యక్షగణంబుతో ♦ నర్థపతియు
నీలదేహము గ్రాలఁ ♦ గాలదండము పూని, పితృదేవతలతోడఁ ♦ బితృపతియును
ధవళద్యుతులు మీఱ ♦ దంతావళము నెక్కి, సురగణంబులతోడ ♦ సురపతియును
తే. గరుణతో నింద్రకీలభూ♦ధరమునందు, నభవు దర్శించి కృతకృత్యుఁ ♦ డైనపాక
శాసనాత్మజుఁ జూడంగ ♦ నాసఁ జేసి, యిచ్చఁ బెంపున విచ్చేసి ♦ రచ్చటికిని. 256

వ. ఇట్లు ప్రత్యక్షం బైనదిక్పాలురలో యముండు దక్షిణదిక్కునం బొడసూపి యర్జునున కిట్లనియె. 257

తే. లోకపాలుర మముఁ జూడు ♦ మో కుమార, వచ్చితిమి దివ్యదృష్టి నీ ♦ కిచ్చితి మివు
డీవు నరుఁ డనుఋషివి ము♦న్నీ వసుమతి, నజునియోగంబునన్ మర్త్యుఁ ♦ డైతివిట్లు.

వ. నీ వాహవంబున వసుసంభూతుం డగుకురుపితామహుని సూర్యాంశసంభవుం డగుకర్ణుని మఱియు దేవదానవాంశజు లగుభారద్వాజాదులం జయింపఁ గలవు నీకీర్తి యక్షయం బై జగంబుల నావరించు దేవదేవుని మెప్పునకుం బాత్రభూతుండ వైననీకు నే నప్రతివారణం బగుదండం బనుమహాస్త్రం బొసంగెదం గొను మని సమంత్రంబును సోపచారంబును సమోక్షవినివర్తనంబు నగుదాని వాని కిచ్చె నంత వరుణుండును బశ్చిమదిగ్గతుం డై యర్జునుం జూచి. 259

ఉ. ‡ప్రీతుఁడ నైతి నీ దయిన♦పేర్మికి నే వర మీయ వచ్చితిన్
భూతలనాథ విన్ము వరు♦ణుండను నాకడ వారుణంబు నా
ఖ్యాతివహించినట్టిపర♦మాస్త్ర మొకం డగు దానికి న్సమా
ఘాతమునం దెదిర్చి నిలఁ ♦ గల్గినభూతము లేదు చూడఁగన్. 260

వ. అది నీ కొసంగెదం గొను మని యనుగ్రహించె నంతఁ గుబేరుం డుత్తరదిగ్గతుం డై పార్థున కిట్లనియె. 261

ఉ. మెచ్చితి నీతపంబున క♦మేయపరాక్రమ నాదుపేరునన్
హెచ్చినయస్త్ర మిద్ది గొని ♦ యేసి హరుండు పురత్రయంబు మున్
చిచ్చునవోలెఁ గాల్చె విను ♦ నీవు సమర్థుఁడ విమ్మహాస్త్రమున్
బుచ్చుకొనంగ నిందు మని ♦ ముందరకుం జని యిచ్చె ముచ్చటన్. 262

వ. సవ్యసాచియు నంతర్ధాననామకం బగునక్కౌబేరాస్త్రంబు విధివిధంబునం బడసియున్నయప్పు డింద్రుండు ప్రాగ్గతుం డై మేఘదుందుభినిస్వనంబున ని ట్లనియె.

---

* అప్పతి = వరుణుఁడు; జాంబూనదము = బంగారము. ‡. సమాఘాతము = యుద్ధము.

చ. ఘనుఁ డగుదేవదేవుఁ డగు♦కాళగళుం గని తత్ప్రసాదముం
గొనినయి నీవు దేవుఁడ వ♦కుంఠితవిక్రమ దేవకార్య మొం
డొనరుప నుండెఁ గావున మ♦హోన్నతిలో నరుదెమ్ము స్వఃపుర
మ్మున కరదమ్ము మాతలిని ♦ బుచ్చెద నిచ్చెద నందు నస్త్రముల్. 264

వ. అని పలికిన ధనంజయుం డాలోకపాలుర నెల్లం జూచె నంత వారు నతని మన్నించి యథాగతకృతగమను లైరి పార్థుండును దేవరాజరథాగమనంబున కై ప్రతీక్షించుచుండె నంత. 265

ఇంద్రలోకాభిగమనపర్వము.

సీ.*చదల వారిదముల ♦ విదళించునదియో లె, వెడలి చీకట్లను ♦ విరియఁ జేసి
యుఱుములఁ బురుడించు♦నురురవంబున దశ,దిశలను బూరించి ♦ విశదగతుల
నసిచక్రతోమర♦ముసలగదాశక్తి,ముఖమహాయుధములఁ ♦ బొలుపు మిగిలి
గాలిఁ బోలినపది♦వేలగుఱ్ఱమ్ములు, పూని మోయుటఁ జేసి ♦ జాను మీఱి
ఆ. మాతలిప్రయుక్త ♦ మై తగి పఱతెంచు,కనకరథము నందు♦ఘనవినీల
వైజయంత మసిత♦వంశధ్వజంబును, గనులకఱవు దీఱఁ ♦ గాంచె నెదుట. 266

వ. కాంచి దేవరాజప్రేషితంబ కావలయు నని వితర్కించుచు నున్నసమయంబున రథంబు దిగి వచ్చి మాతలి యి ట్లనియె. 267

మ.పురుహూతాత్మజ! నిన్నుఁ దేర నిటకుం ♦ బుత్తెంచె న న్నప్పురం
దరుఁ డీదివ్యరథంబు నెక్కి దివికిన్ ♦ రా నొప్పు నీ విప్పు డ
చ్చరలు న్వేల్పులు సిద్ధులు న్మునులు ర♦క్షస్సంఘముల్ కిన్నరుల్
పరివేష్టించి నినుం గనుంగొనెదు మిం♦పన్ వేచి యున్నా రటన్. 268

వ. అనిన నర్జునుఁ డత్యంతాశ్చర్యమగ్నాంతరంగుం డై. 269

మ.†విశదప్రక్రియ భూరిదక్షిణల సు♦ర్వి న్రాజసూయాశ్వమే
ధశతంబు ల్వొనరించునట్టిరు తప♦స్తప్తాంగు లైనట్టిరున్
బ్రశమంబుం గొనునట్టిరుం గని స్పృశిం♦పన్ లేనియీదివ్యభా
వ్యశతాంగంబును జూడఁ గంటి నిట ధ♦న్యాత్ముండ నే నింకటన్. 270

వ. అని ప్రశంసించుకొనుచు మాతలిం జూచి. 271

---

* వైజయంతము = ఇంద్రుని టెక్కెము. ధ్వజము = టెక్కెపుఁగంబము. శ్లో॥ శక్రాపత్య స్మృతాః నీలం వైజయంతం మహాప్రభం ధ్వజ మిందీవరశ్యామం వంశం కనకభూషణం॥

† శతాంగము = రథము.



తే. మాతలీ నీవు తొలుదొల్త ♦ నేతదమర, రథ మధిష్ఠించి హయములఁ ♦ గ్రాలఁ జేయు
చుండు మే నిదె వచ్చెద ♦ నిందువేడ్క, నిత్యకృత్యంబులను దీర్చి ♦ నియమవృత్తి. 272

వ. అనిన మాతలి రథం బెక్కి తేజీలపగ్గంబులు సరిచేయుచుండె నంతఁ గౌంతేయుండును గంగాస్నానంబును బితృతర్పణంబును గావించి శుచి యై మందరాచలంబుం బురస్కరించుకొని యి ట్లని ప్రశంసించె. 273

చ. మునులకుఁ బుణ్యశీలురకుఁ ♦ బూజ్యులకున్ దివి కేగ నెంచున
జ్జనులకు నాశ్రయంబ వయి ♦ సౌఖ్య మొసంగుదు వద్రిరాజమా
నను దయఁ జూచి ప్రోచితి వ♦నారతమున్ సుతుఁ దండ్రిలాగునన్
నినుఁ బెడఁబాసి పోవ గమ♦నించితి నాదగుతప్పు సైఁపుమా. 274

శా.గోత్రాధీశ్వర నీదుసానువుల నీ♦కుంజంబుల న్నిచ్చలున్
బుత్రుం డయ్యెకడం బలె న్మెలఁగుచున్ ♦ బుణ్యప్రదేశంబులన్
ధాత్రీజంబుల రాలుపండ్లు దిని శు♦ద్ధక్షీరము ల్ద్రావి నే
నాత్రం బింతయు లేక నీకరుణ సౌ♦ఖ్యంబుంటి నిన్నాళ్లుగన్. 275

తే. పోయివచ్చెద నీకూర్మి ♦ నేమెడల న
డఁద మఱవకుండు మెలమితో♦డ గిరివర్య
యనుచు దాని నామంత్రించి ♦ యర్జునుండు
వలగొనుచుఁ బోయి వేల్పుతే ♦ రలర నెక్కె. 276

అర్జునుం డమరావతికిం బ్రయాణంబగుట.

వ. అంత ననంతప్రభాభాసమానం బగునాదివ్యరథం బూర్ధ్వపథంబు వట్టి సూర్యచంద్రాదిమండలంబులు దాఁటి పోవం బోవ ముందర ననేకశతసహస్రసంఖ్యాకదేవయానంబులు లోచనగోచరంబు లగుటయు నింద్రనందనుండు తారారూపంబు లై మిణుంగుఱుంబురువులవలె మెఱయునాదిత్యాదుల నవలోకించుచు నందు నందు గరుడగంధర్వకిన్నరసిద్ధసాధ్యగుహ్యకాదిలోకంబులం గాంచి విస్మయంబు నొంది మాతలిదిక్కు మొగం బైన నతం డతని కి ట్లనియె. 277

తే. పుడమిపై నున్నయప్పు డో♦భూరితేజ, మానికములట్లు కో ట్లయి ♦ కానఁబడెడు
చుక్క లవియెల్ల లోకముల్ ♦ చూతె యిందుఁ, గాఁపురంబుండ్రు సిద్ధాదు ♦ లేవు మీఱి. 278

వ. అని చెప్పుచు నాసిద్ధచారణాదిలోకంబులును మాంధాత్రాదిరాజలోకంబులును దాఁటి పోయి ముందరఁ బురద్వారంబున. 279

తే. శృంగములు గలకైలాస♦శిఖరి యనఁగ
మేనికాంతులఁ గడ లెల్ల ♦ మెఱయఁ జేయు

దాని నాల్గుదంతంబులఁ ♦ దనరుదానిఁ
గనియె నైరావణంబు నా♦ఘనభుజుండు. 280

వ. అంత. 281

సీ. ఆనందజనక మై ♦ జానొందుమందార,నగనమంచితనంద♦నంబు గలిగి
కోరినకోరికల్ ♦ కొఱవడనీ కిచ్చు,నాలమందలతోడ ♦ నతిశయిల్లి
కను ద్రిప్పినంత నే♦ఘను నైన మరులందఁ, జేయునచ్చరలతోఁ ♦ జెన్ను మీఱి
జరయును మృతియును ♦ జనులకు రాకుండ, నలిపెడునౌషధ♦శాల నొప్పి
తే, కనకమణిమయసౌధముల్ ♦ ఘనవరణము, గోపురంబులు మాడుగుల్ ♦ కుట్టిమములు
గలిగి సురసిద్ధమునులకుఁ ♦ గాఁపుర మయి, తనరునమరావతీపురి ♦ గనఁగ నయ్యె. 282

మ. అని వెన్నియుక పోరి యాల్గినఘనుల్ ♦ యాగంబుల న్వేల్పులఁ
దనియం జేసినయాయజూకులును స♦త్కార్యంబుల న్సంతతం
బును గావించినపుణ్యమూర్తులును బెం♦పుం గాంచి దేవళ్లతో
ననురూపంబుగ నొప్పుచుంటఁ గనెఁ గ♦న్నారఁగ న్నరుం డప్పురిన్. 283

వ. మఱియు నక్కూరవ్యవంశవర్ధనుం డశార్యకరణైకచిత్తులకు ననాహితాగ్నులకు నాహవోద్ధనపరాఙ్ముఖులకు నన్యాయపథప్రవర్తకులకు నాగమాచారహీనులకు నసత్యవాదులకు దానశూన్యులకుఁ బానప్రియులకు మాంసాదులకు హింసాపరులకుం జారరాని ద్రివిష్టపంబుం గాంచి సురగరుడోరగయక్షరాక్షసగణపణాయితుం డై చనునప్పుడు. 284

క. నానాఋతుసన్నుతవర,సూనామోదాంచితంబు ♦ శోభనపవనం
బానరు మన్నింపుచు నా,హ్వానము గావించె ననఁగ ♦ నల్లన వీచెన్. 285

తే. పారిజాతసుమంబుల♦సౌరభంబు, ఘ్రాణతర్పణ మొనరింప ♦ స్థాణువట్లు
మేను మఱచి చలింపక ♦ తా నరుండు, తేరిపైఁ జిత్రమో యనఁ ♦ దేజరిల్లె. 286

## ఇంద్రసభాప్రవేశము.

వ. ఇట్లాయావిశేషంబు లరసి యభినందించుచుఁ బురప్రవేశంబు చేసి యున్నవాని దేవర్షులెల్ల దివ్యవాదిత్రనిస్వనంబులు బోరుకలఁగ నెదురుకొని స్తుతించుచుం దీవించి పూజించి రవు డతండు రథావతరణంబు చేసి సిద్ధులు సాధ్యులు విశ్వేదేవులు మరుత్తులు నశ్వులు నాదిత్యులు వసువులు రుద్రులు బ్రహ్మర్షులు దిలీపప్రముఖరాజర్షులు హాహాహూహూప్రముఖగంధర్వులు తుంబురునారదులు లోనగువారి నెల్ల యథోచితంబుగఁ గలసి సంభావించి వారితో సుధర్మాభవనంబునకుం జని యక్కడ.



సీ. *కంకణఝణఝణ♦త్కారంబు లెసఁగ న,చ్చర లిరుగడ వీవఁ ♦ జామరములు
రంభోర్వశీప్రము♦ఖాంభోజముఖులు సం,రంభనాట్యారంభ♦ముం భజింప
నింబుగా సరసగా♦నంబు గా నారద,తుంబురుప్రభృతులు ♦ తొడరి పాడ
గరుడగంధర్వకి♦న్నరముఖ్యదేవతల్, ముప్పదిమూఁడుకో♦ట్లొప్పి కొలువ
తే, దురమునం డెగి వచ్చిన♦పురుషవరులు,మూఁగి చెంగట వసియింప ♦ మునులు వొగడఁ
బేర్మిఁ జింతామణీభద్ర♦పీఠమందు, నింద్రుఁ గొలువుండెఁ గన్నుల♦పండువుగను. 288

వ. అట్లు పేరోలగం బున్న దేవేంద్రునిసన్నిధానంబునకుం జని సవ్యసాచి సాష్టాంగనమస్కారంబు గావించుటయును. 289

మ. ఘనదంభోళికిణాంకితంబులు సుదీ♦ర్ఘంబు లువృత్తంబు లై
చనుహస్తంబులఁ గ్రుచ్చి యెత్తి సుతునిన్ ♦ సంక్రందనుం డత్తఱిం
దనకౌఁగింట నెసంగఁ జేసి మిగులం ♦ దాత్పర్య మొప్ప న్నిజా
సనమందు న్నిలువంగఁ జేసె మును సు♦త్సంగంబునం నిల్పియున్. 290

క. తనవేయికన్ను లప్పుడు, తనయునిపైఁ బఱవఁ జేసి ♦ తనువును హస్తం
బున నిమురుచు శతమన్యుఁడు, మనమున హర్షించె మిగుల ♦ మన్నించి సుతున్.

వ. అంత దేవేంద్రుననుమతంబున దేవత లావిజయున కర్ఘ్యపాద్యాదు లొసంగిరి గీతసామకుశలు లగుగంధర్వులు వేణువీణాదుల గానంబు గావించిరి ఘృతాచి మేనక రంభ పూర్వచిత్తి స్వయంప్రభ యూర్వశి మిశ్రకేశి దండగౌరి వరూథిని గోపాలి సహజన్య కుంభయోని ప్రజాగర చిత్రలేఖ చిత్రసేన మధుస్వన లోనగులోలలోచనలు నృత్యంబు గావించి రంత. 292

క. త్రిదశేశ్వరుండు కొండొక, సదమలసౌధమున సవ్య♦సాచి న్నిలిపెన్
మది హర్షించుచుఁ దా నర,పదివర్షము లట నరుండు ♦ ప్రస్తుతి కెక్కెన్. 293

వ. ఆలో శతమన్యుం డతనికి సప్రయోగోపసంహారంబుగా వజ్రాయుధంబుతో వాయవ్యాగ్నేయాదిమహాస్త్రంబు లిచ్చి తనకిష్టుం డగుచిత్రసేనునివలన నృలోకాతీతంబు లగుగీతవాదిత్రనృత్యంబులు శ్రేయోదాయకంబు లని చెప్పించె నర్జునుండును జిత్రసేనునితో గాంధర్వం బభ్యసించుచుండియు నన్నదమ్ములం దల్లినిం దలంచుకొనుచు శకునిదుశ్శాసనాదిదుర్జనవధామర్షి యై సుఖం బెఱుంగ కుండె నంత నింద్రుండు చిత్రసేనుం బిల్చి రహస్యంబున ని ట్లనియె. 294

ఆ. చిత్రసేన వింటె ♦ శ్వేతవాహనుచక్షు, పూర్వశిపయిఁ దగిలి ♦ యుండె ననుచు
నెఱుఁగ నయ్యెఁ గాన ♦ నీవు వోయి నెలంత, నతని కతుకఁ జేయు ♦ మయ్య యిపుడు.

* తొడరి = ప్రయత్నించి.

వ. అనినం గంధర్వరా జట్ల యగుం గావుత మని యూర్వశికడకుం జని స్మితపూర్వ కంబుగా ని ట్లనియె. 296

సీ. తెలిసితివే మన ♦ త్రిదశేంద్రునింటికి, నతిథియై వచ్చె న ♦ య్యర్జునుండు
సాంగవేదంబులు ♦ చదివినమేధావి, వర్చస్వి సత్యవా ♦ గర్చితుండు
నిజగుణంబులఁ జేసి ♦ త్రిజగంబుల నతండు, ప్రఖ్యాతుఁ డయ్యె నో ♦ పద్మనేత్ర
బలవిక్రమంబులఁ ♦ బ్రతిభ రూపంబున, వ్రతమున వానికి ♦ వాఁడె సాటి

తే. దేవతుల్యుండు దివ్యుఁ డా ♦ దేవరాజ,తనయుఁడును స్వర్గఫల మందఁ ♦ దగును గాన
నీవు సేవింపు పోఁబనం ♦ బెనఁగ వాని, వాసవునిశాసనం బిది ♦ భాసురాంగి. 297

వ. అనిన నూర్వశి యి ట్లనియె. 298

తే. నామనంబున నున్నట్ల ♦ నాకరాజ,శాసనం బయ్యెఁ గావున ♦ నదమలాత్మ
నీవు చెప్పినచొప్పున ♦ నేనుఁ జేయు,దాన విచ్చేయు మీ వని ♦ వాని నంపి. 299

ఊర్వశి యలంకరించుకొని యర్జునునొద్దకుఁ బోవుట.

సీ. కృతకృత్య యగుట నం ♦ కిత మైనగంధర్వ,వేషంబు భూషలు ♦ విడిచి వేడ్కఁ
బరిమళించెడుమంచి ♦ పన్నీరముల నాడి, గంధమాల్యాదులు ♦ గరిమఁ దాల్చి
కన్నాకురతనంపుఁ ♦ బొన్నుసొమ్ములు వెట్టి, ధవళదుకూలంబు ♦ తనరఁ గట్టి
చంద్రబింబ మనంగఁ ♦ జనునెమ్మొగమ్మునఁ, గస్తురితో బొట్టు ♦ కలిపి పెట్టి

తే. యందె లంతంత గల్లుగ ♦ ల్లనుచు మ్రోయఁ
జంద్రుఁ డుదయించి మించిన ♦ సమయమందు
మదకరేణువు వోలె న ♦ మ్మగువమిన్న
బయలువెడలెను ఫాల్గుని ♦ భవనమునకు. 300

క. వెన్నెలబయల న్నడుచుచు, నెన్నడు మసియాడ బొమలు ♦ నెఱి నెగుర జిగిన్
గన్నచెలి మోముదమ్మిన్, వెన్నెలతేని న్హసించు ♦ విధమున నొప్పెన్. 301

తే. *చెరివి పూ ల్కేశహస్తమం ♦ దరితి గొలుపు
లికుచకుచముల ఘుసృణంబు ♦ లీల నలఁది
జఘనతలమున సూక్ష్మవ ♦ స్త్రమ్ము పొదల
నప్పడంతుక కన నొప్పె ♦ నవ్వ డెనఁగి. 302

మ. స్తనభారంబున నమ్యమాన యగుచున్ ♦ దాటంకకాంతు ల్వెలుం
గ నటద్వల్గునితంబగౌరవమునన్ ♦ గాంచీలసత్కింకిణీ

* అరితి = ప్రేమము; కేశహస్తము = కొప్పు.



ధ్వనియు న్నూపురరావముం గలసి మ్రో ♦ వం గొంతపుష్పాసవం
బును సేవించుట సోలుచున్ జనెఁ బ్రజన్ ♦ మోహాబ్ధిఁ దేలించుచున్. 303

తే. మేఘవర్ణోత్తరీయము ♦ మేలిముసుఁగు, గా ధరించి నెలంత మే ♦ ఘమునఁ గప్పు
వడి నభంబున నెంతయు ♦ వాసి నొప్పు,చంద్రరేఖ తెఱంగునఁ ♦ జనఁగ సాగె. 304

వ. ఇట్లు వివిధవిలాసంబు లవధరించి సిద్ధచారణగంధర్వులకు దర్శనీయతమాకృతియై నడచి ధనంజయభవనద్వారంబుకడకుం జని ద్వారపాలకులవలనం దనరాక నరున కెఱింగించి తదనుమతంబున లోనికిం బ్రవేశించె నంత నక్కుంతీతనయుండు నత్యంతశంకితస్వాంతుండును లజ్జాసంవృతలోచనుండు నై భయభక్తిసంభ్రమంబులం బ్రత్యుత్థానాభివందనంబు లాచరించి యి ట్లనియె. 305

తే. పదము లొాదల సోఁక మ్రొ ♦ క్కెదను నీకు, నచ్చరల కెల్ల మిన్న వో ♦ యమ్మ నీవు
వీఁడు నీయాజ్ఞ మెలఁగెడు ♦ వాఁడు నాఁగ, నూర్వశి వచించెఁ జిత్రనే ♦ నోక్తరీతి. 306

చ. కురువర నీవు స్వర్గమున ♦ కుం జనుదెంచిననాఁడు వేల్పు లె
ల్లరు బలభేదిపంపునఁ జె ♦ లంగి మహోత్సవ మొం డొనర్చి ర
వ్వరసభ నాట పాటలు ప్ర ♦ వర్తిలుచున్నతఱిం ద్వదీక్షణ
స్ఫురణము నాపయిం బఱవఁ ♦ జొచ్చెను జొచ్చినకారణంబునన్. 307

చ. సురపతి తత్సభం జరపి ♦ చూపఱు వోయినవెన్క నీకుఁ గా
నరుదుగఁ జిత్రసేనుఁ డను ♦ నాతని నాకడ కంచి చెప్పినన్
సురుచిరమూర్తి వై ననినుఁ ♦ జూడఁగ వచ్చితి నీగుణంబులన్
మరుదొరబారి కగ్గ మయి ♦ మానఱి యుంటి నను గ్రహింపవే. 308

అర్జునుఁ డూర్వశిని నిరసించుట.

వ. అనిన నరుండు కరంబులఁ జెవులు మూసుకొని హరస్మరణంబు సేయుచు దాని కి ట్లనియె. 309

చ. *హరహర! యిట్టిపాతకము ♦ లాడఁగ నో రెటు లాడె నీవు నా
గురు వగుపాకశాసనున ♦ కుం బ్రియ వీవును గుంతి మాద్రియున్
సురజగదీశియుం దలఁచి ♦ చూడఁగ నా కొకరూప కాదె యో
సురుచిరగాత్రి నానుడుల ♦ నుంతయు నందియ మొంద నుండునే. 310

ఉ. పౌరవవంశమాత వని ♦ భామిని ని న్నటు దృష్టి సాఁచి నే
నారసితిన్ సభాస్థలము ♦ నందు మహోత్కలు సెప్ప వించు నా

* సురజగదీశి = శచి.

* కారణ మియ్యకార్యమునఁ ♦ గట్టఁగ రాదు జనిత్రి వోట నా
గారుణికత్వ మేర్పడఁగఁ ♦ గన్గొను మొందు దలంప కియ్యెడన్. 311

వ. అనిన నూర్వశి వెండియును. 312

తే.‡అచ్చరల మేము మ మ్మెవ్వ ♦ రైన నఁ దాలిఁ, గట్టి రై వనమునయందుఁ ♦ బెట్టుకొనరు
నను గురుస్థానమున నిల్ప ♦ కనవరతము, కామసంతప్త నేలు మో♦కౌరవేంద్ర. 313

వ. పూరువంశంబునం బొడమినపుత్త్రులు పౌత్త్రులుం బ్రపౌత్త్రులు నిపుడు తపస్వులై యిట వచ్చి నాతోడం గూడిమాడి సుఖింతు రిందు వ్యతిక్రమం బింతయును లేదు గావున నన్నుఁ దోసిపుచ్చక నామనోరథంబు సఫలంబు గావింపు మనిన నర్జునుండు వెండియును. 314

క. ఈవు జనిత్రివి నాకున్, నావంశంబునకుఁ గావు♦న స్నిపదరా
జీవములు శిరము సోఁకన్, భావించి భజింతు నమ్మ ♦ భక్తిన్ శ్రద్ధన్. 315

వ. ప్రసన్నుండ నగునాకు నీవు ప్రసన్న వై పుత్త్రుం డని యనుగ్రహించి విజయుం జేయు మనుటయు నయ్యచ్చర కోపఘూర్ణితనయనయుగళయుం గుటిలభ్రూకుటియు నై కటంబు లదర ధనంజయుం జూచి. 316

ఊర్వశి యర్జును నపుంసకుఁగా శపించుట.

ఉ. వాసవుపం పటం చిటులు ♦ వచ్చియు నచ్చిగురాకుబాకులన్
గోసి మరుండు వేఁచుటను ♦ గొ మ్మని వేఁడితి నీవు మూర్ఖ వై
దోసముగా నను న్వెడలఁ ♦ ద్రోచితి కావున నర్తకుండ వై
స్త్రీసమితిన్ బన న్వెడి వ♦సించి కృశింతువు గాక పేడివై. 317

వ. అని శపించి నిశ్వసించుచు నూర్వశి మగిడి నిజగృహంబునకుం జనియె నర్జునుండు నారజనీవృత్తం బంతయుఁ దత్తఱంబునఁ జిత్రసేనునకుం జెప్పెఁ జిత్రసేనుండు నది సుత్రామునకుం దెలియ విన్నవించిన నతండు పాండవునిం బిలువనంచి యిట్లనియె. 318

చ. తనయ భవచ్చరిత్ర మిది ♦ తాపసవర్యుల నైన దిద్దఁ జా
లును జుమి యిట్టినీదగున♦లోలత కెట్టిరు నబ్బ మొంది నిన్
మనమున మెత్తు రూర్వశి శ్ర♦మం బఱి యిచ్చెను శాప మద్దియున్
గనుఁగొన మేల యయ్యెడి నొ♦కానొకవెంటన దాని వింటివే. 319

క. పదుమూఁ డగువర్షంబునఁ, బొదలెడునజ్ఞాతవాస♦మున నది నీ కో
పదమలమతి పుంస్త్వం బిది, యొదవెడి వెండియును బౌరు♦షోచితరీతిన్. 320

* జనిత్రి = తల్లి. ‡ తాలి = మంగళసూత్రము.



ఆ. అనిన ఫాల్గునుండు ♦ నోఁ గాత మని శాప,చింత విడిచి యుండె ♦ నంతనమునఁ
జిత్రసేనుఁ గూడి ♦ సుత్రామభవనంబు,నందు నచ్చరువుల ♦ నరసికొనుచు. 321

క. విజితేంద్రియుఁడై మెలఁగిన,విజయునియీపూతచరిత ♦ విని రేని జనుల్
విజితేంద్రియులై పాపము,లజతం బడ కెవుడు సుఖము♦లం బడెద రొగిన్. 322

వ. అని మఱియు ని ట్లనియె నట్లర్జునుం డమరపురంబున సుఖంబున్న సమయంబున నొక్కనాఁడు లోమశుం డనుమునీశుండు త్రిదశేశునిం జూడ వచ్చి సుధర్మాభవనంబున నింద్రునితో నేకాసనాసీనుం డై యున్నసవ్యసాచిం జూచి క్షత్త్రియుం డగునీతం డెట్టిసుకర్మం బొనర్చెనో దేవస్థానంబు నొందఁ గలిగె నని శంకించుకొను చున్న నెఱింగి నముచినిషూదనుండు నవ్వుచు నతని కి ట్లనియె. 323

మ. నరనారాయణు లన్ పురాణపురుషుల్ ♦ నాపంపున న్మర్త్యులై
ధరణిం బుట్టిరి భూరిభార ముడుపం ♦ దర్కించి నవ్వారిలో
నరుఁ డీతండు మదంశసంజనితుఁ ♦ డీ♦నాకంబునం దస్త్రముల్
కర మర్థించికొనంగ వచ్చె బుష్షిలో♦కగ్రామణీ వింటివే. 324

క. పాతాళవాసు లై సుర,భీతావహకర్మ లగుచు ♦ బెచ్చిల్లినదు
ర్జాతుల దనుపుత్త్రకుల న్నివాతకవచులన్ వధించు♦వాఁ డితఁ డనిన్. 325

చ.*అఱువదివేలసాగరుల ♦ నట్టె కనుంగవ విచ్చినంతనే
గిఱికొన నీఱుగాఁ జలిపెఁ ♦ గేవలుఁడే కపిలుండు విష్ణుఁ డా
నెఱబిరు దావసుంధర జ♦నించి తలిర్చెను వాసుదేవుఁ డై
వఱలెడు దేవకార్యము ల♦వారిగ నాతని పేర్మి పెంపునన్. 326

తరువోజ. వినవయ్య మునివర ♦ విజయుఁ డీతండు ♦ వినివృత్తకార్యుఁ డై ♦ వెండియుమర్త్య
మున కేగు నాపంపుఁ ♦ బూని నీ వేగి ♦ పుడమిఁ గామ్యకవనం♦బున నున్నధర్మ
తనయునిఁ గని నీదు♦తమ్ముఁ డత్యున్న♦తము లస్త్రము లెఱింగి ♦ తడయక వచ్చు
నని భీష్మముఖ్యుల ♦ నరుల నిర్జించు ♦ నర్థసిద్ధియు నగు ♦ నని చెప్పి మఱియు. 327

వ. నావచనంబునం జేసి నీవు భ్రాతృసమేతుం డగునాతనిచేఁ దీర్థాటనంబు సేయింపు మద్దాన విగతపాపుం డై రాజ్యభోగంబు లనుభవించు నని మఱియును. 328

చ.‡ఇలఁ గలతీర్థరాజముల ♦ నెల్ల భజించెడుపట్ల నీవు నా
సలలితమూర్తి ధర్మజుని♦సాతున బొనట యై మెలంగు ము

* గిఱికొను = చుట్టుకొను.
‡ సాతు = పథికజనసమూహము.

త్కలుఁ డగునీతపోబలముఁ గల్మి మహాగిరిగహ్వరంబులన్
బలసినఘోరరాక్షసులఁ బోరఁ బడల్పడ కుండ నయ్యెడన్. 329

తే.*ఇట్లు జిష్ణుండు వల్కిన నెఱిఁగి కృష్ణుఁ, డమ్మహామునిఁ నర్థించి యనె నజాత
శత్రునకు మీరు తోడ్పడి సకలతీర్థ,రాజములఁ ద్రిప్పి రక్షింపుఁ డీ జతనున. 330

క. అనినన్ లోమశుఁ డట్లగు, నని వీడ్కొని వారి భూతలాభిముఖుం డై
చనుదెంచెఁ గామ్యకంబున, ఘనుఁ డగుకౌంతేయుఁ జూచు కౌతుక మడరన్. 331

అర్జునునస్త్రలాభంబు విని ధృతరాష్ట్రుఁడు దుఃఖించుట.

వ. అంత నిట ధృతరాష్ట్రుం డవ్విజయునిశక్రలోకగమనంబు కృష్ణద్వైపాయనునివలన
విని మనంబున దుఃఖించుచు సంజయుం బిలిచి యి ట్లనియె. 332

ఆ. వింటె సవ్యసాచి విక్రమంబునఁ జేసి, చేసినట్టి మేటిచేఁత యొక్కఁ
డకట మందబుద్ధి యైననాతనయుండు, తనకుఁ జేటు దెచ్చుకొను నిజంబు. 333

మ. నిశితాస్త్రంబుల నొప్పుపార్థు నెదురన్ లేఁ డొక్కఁ డేలోకమం
దశనిప్రాయుఁ డతండు గూల్చెడిని దైత్యస్థైర్యహేమాద్రులన్
బశుధర్మాంకితు లైనకౌరవులకు న్మాఱొడ్డుటం జెడ్డ కా
నశియించుం బ్రజ కాలకర్మ మిటు లుండం జేయ నే మయ్యెడిన్. 334

క. మనదుర్యోధనుచిత్తం,బున నయ్యె దురాశ కర్ణముఖ్యులు భీష్ముం
డును ద్రోణుండును గృపుఁడున్, దునుమఁగ లే రక్కిరీటి దుర మైనతఱిన్. 335

మ. త్రిదశేశప్రతిమానుఁ డర్జునుఁడు దోర్వీర్యంబునన్ ఖాండవం
బు దహించెన్ బలభేది నొడ్డి కడిమిం బొల్పొందురాజన్యులన్
గదనంబందు జయించి యగ్రజుని వేడ్కం జేసి చేయించె భ
ద్రద మై యొప్పఁగ రాజసూయ మతఁ డేతన్మాత్రుఁడే సంజయా. 336

తే. కుధరముల నెల్ల భిదురంబు గూల్చునట్లు, వేఁడివెల్గు జగంబుల వేఁచునట్లు
సవ్యసాచికరంబున సొరుమీఱు,కాండ మది ధార్తరాష్ట్రులఁ గాల్చివుచ్చు.

వ. అని విలపించుచున్నం గని సంజయుం డతని కి ట్లనియె. 338

క. కురురాజ నీదునుడు లివి, పరికింపఁగ సత్యపథముఁ బట్టినయవి నం
గరమునఁ బార్థుల నెదురన్, బురహరుఁడును జాలఁ డన్నఁ బోలుం జూడ్వే. 339

ఆ. ఏకవస్త్రఁ గృష్ణ నాకరణిం బట్టెఁ, దులువ దుస్ససేనుఁ డలరి కర్ణుఁ
డప్రశస్తగతుల నాడె నిన్నియుఁ బాండవులకుఁ గోపహేతువులు దలంప. 340

* కృష్ణుఁడు = అర్జునుఁడు; జతను = ప్రయత్నము.



మ. బలభిన్నందనుశౌర్యధైర్యములు సంభావింప నాశ్చర్యశా
ల్పుల కైనం గనరానివేలుపు మహాభూతాధినాథుండు ని
ష్కలుషాంతఃకరణంబునన్ గరుణ మైఁ గైరాతవేషంబునం
గెలనం బొల్చి రణం బొనర్చియు నొసంగె న్వాని కుగ్రాస్త్రమున్. 341

తే. లోకపాలురు నరునియాలోకపథము
నంది నానావిధాస్త్రముల్ పొంది పొసఁగ
నొసఁగి రాతఁడు సామాన్యుఁడోటు తెలియ
నాకమున కేగి యింద్రాసనస్థుఁ డయ్యె. 342

మ. మదనాగాయుతసత్త్వుఁ డుద్ధృతగదామాన్యప్రభావుండు నాఁ
డదయుం డై సభలోనఁ బల్కినటు లత్యంతోగ్రయుద్ధం బగున్
బదుమూఁడేఁడులవెన్కఁ గిన్క నవు డావాతాత్మజుం డుగ్రుఁ డై
గద నీపుత్రకు నూరుయుగ్మమును ద్రొక్కలేసియు నొక్కుమ్మడిన్. 343

వ. అనిన ధృతరాష్ట్రుండు నిట్టూర్పు నిగిడించుచు వెండియు. 344

ఉ.*మందుఁడు నాసుతుం డతనిమంత్రులు సౌబలకర్ణముఖ్యు లా
మందమతుల్ వచించినక్రమంబునఁ గార్యము సెల్లుచుండు నే
మందును దాన నింత లిటు లయ్యె బలాఢ్యులు వార లిందఱున్
మ్రందఁగఁ జేయ కుందు రని మానసమం దెటు శాంతి నొందెదన్. 345

ఉ. మంత్రియు రక్షకుం డగుచు మాధవుఁ డెప్పుడు వారిపక్ష మై
తంత్రము లాచరించెడిని దాన జయం బగు వారి కిక్కడన్
మంత్రులమంతనం బిటులు మానఁటి యున్నది గాన నింతయుం
దంత్రము లేనికారణమునన్ జెడిపోవఁగ నయ్యె సూతజా. 346

వ. మఱియు దారాపకర్షామర్షితు లగుధర్మజభీమార్జుననకులసహదేవులును పాంచాల
వృష్ణిభోజాంధకప్రవీరులును రామకృష్ణాభిరక్షితు లై రణంబున ధార్తరాష్ట్రుల నెల్ల
మరణంబు నొందింపక మాన రని మానసంబునం గుందునాకు రేలుం బవలు నిద్రా
హారంబులు లేకయున్న వేమి సేయువాఁడ వృద్ధుండ నగునామాట వీ రెవ్వరును
బాటించువారు కా రనిన సంజయుండు వెండియు. 347

చ. పలికెద వేల యిట్లు నరపాలవతంసమ నీ వుపేక్షయే
సలిపితి వెంతయే వినుము సర్వసమర్థుఁడ వీవు కా దనన్

* మ్రందు = చచ్చు.

గలుగునె యిట్టియక్రమము ◆ గాదిలిబిడ్డఁ డటంచు వానిపో
కల కెదు రాడవైతి వొక ◆ కాలమునందు ని కేటి కీవ్యథల్. 348

వ.*విను మట్లు ద్యూతనిర్జితులై పాండవులు కామ్యకంబున నున్నయప్పు డటకు యదువృష్ణిభోజాంధకపరివృతు లగురామకృష్ణులును ధృష్టద్యుమ్నపురోగము లగు పాంచాలరాజపుత్త్రులును విరాటధృష్టకేతుప్రభృతిరాజన్యులును వచ్చి కృష్ణాజినోత్తరీయు లగువారిం జూచి వగచుచుఁ గృష్ణదిక్కుమొగంబై సభాభవనంబున నిట్లు చేసిన దుర్యోధనాదు లెల్లరు రణంబున మరణంబు నొందఁగలరు కుందకు మని యొదార్చుచుండె నపుడు కృష్ణుండు నీతనయులచేతకుం గోపించి రాజసూయారంభంబున నంగ వంగ కళింగ పౌండ్రోడ్ర చోళ ద్రావి డాంధ్ర కోసల కాశ్మీర కేకయ బర్బర సింహళ మాళవాదిదేశాధీశ్వరులను సాగరానూపకాదులను శక యవన కిరాత మ్లేచ్ఛ పల్లవ దరదాదిపశ్చిమరాష్ట్రజులను హార హూణ చీన తుషార సైంధవ జాగుడ రమటాదులను జయించి యింద్రప్రస్థపురంబున వైభవం బెసంగించి నట్లు బలరామసహితుండ నగునేను భీమార్జుననకులసహదేవాక్రూరగదసాంబప్రద్యుమ్నధృష్టద్యుమ్నాద్యతిరథమహారథులం గూడి సపుత్త్రమిత్త్రబాంధవంబుగా దుర్యోధనదుశ్శాసనకర్ణసౌబలప్రభృతుల రణంబున మరణంబు నొందించి తదుత్తమాంగ మాంసమస్తిష్కాదుల వృకకంకగృధ్రగోమాయ్వాదుల కశనంబును దదుధిరంబున భూదేవి కాప్యాయనంబును గావించి హాస్తినపురంబున మహావైభవం బెసంగ ధర్మరాజు రాజ్యపట్టభద్రుం గావించెద నని యెల్లరు వినఁ బ్రతిజ్ఞాపూర్వకంబుగం బలికె ననియు దాని కందఱు మహానందంబునం బొంది రనియు లోనగునసేకప్రసంగంబులు వింటి నని మఱియును. 349

మ. బలభద్రుండును గృష్ణసాత్యకులునుం ◆ బ్రద్యుమ్నుఁడు న్సాంబుఁడుఁ
బలభిన్నందనుఁడుఁ వృకోదరుఁడును ◆ న్మాద్రేయులుం ద్రౌపదే
యులు పాంచాలురు కేకయాత్మజులు మా◆త్స్యుల్గూడి రా నాజిలో
నిలువంజాలునె జీవితార్థి యగుచుఁ ◆ దేవేంద్రునట్టింటునుఁ. 350

చ. అనవుడు నాంబికేయుఁ డను ◆ నప్పుడు చెప్పితి నీవు క్షత్త్రయుఁ
డును లగుభీష్మముఖ్యులును ◆ గౌతములు న్విని నే నొకింతయుం
బొనరుపఁ జాల నైతిఁ గురు◆ముఖ్యుల కియ్యది యంతకాలమే
యనఁ దగు దైవనిర్మితి యొ◆కప్పటి కేనియుఁ దప్పునే కటా. 351

* వృకము = తోఁడేలు; కంకము = రాబందుఁ గనుపక్షివిశేషము; గృధ్రము = గద్ద;
గోమాయువు = నక్క.



వ. అని ధృతరాష్ట్రుండు సంజయునితోఁ దనమనోవ్యథ యంతయు నెఱింగించి దుఃఖించె ననిన విని జనమేజయుండు వైశంపాయనుం జూచి పార్థుం డస్త్రార్థం బరిగినవెనుక యుధిష్ఠిరప్రభృతు లెట్లు ప్రవర్తించి రని యడిగె ననిన విని నైమిశారణ్యవాసులావృత్తాంతంబు విన మాకునుం గుతూహలం బగుచున్నయది చెప్పు మని సూతు నడుగుటయును. 352

—●●◆ ఆశ్వాసాంతము. ◆●●—

చ. అరనిముసంబునం జెడెను◆నట్టిశరీరము నమ్మి నెమ్మదిఁ
దురితము నాశ చెట్ట లయి ◆ తోఁచెడుకర్జము లెన్ని యేని సం
బరమునఁ జేసి వాసి చెడ ◆ భాసిలున ట్లిటు లుంటి నోపరా
త్పర! కరుణించి నన్ను సుప◆థంబున నిల్పి ననుగ్రహింపవే. 353

క. ఇల సత్కార్యములందుం, దలసూపెడు నంతరాయ◆తతు లని మతిలోఁ
దలఁకుదుఁ గొనసాఁగింపవె, తలక ట్టగునాదుకృతిని ◆ దైవలలామా. 354

గద్యము.

ఇది శ్రీమదఘనాతనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్త్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునం
దారణ్యపర్వంబునం ద్వితీయాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీ

బాలాత్రిపురసుందర్యైనమః.

# శ్రీకృష్ణభారతము

## ఆరణ్యపర్వము—తృతీయాశ్వాసము.



క. శ్రీమన్మార్కండేయ
స్వామివరక్షేత్రవాస ♦ సత్కవిరాజ
స్తోమస్తుతోన్నతోన్నత
ధామా! సుగుణాభిరామ! ♦ దైవలలామా! 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులం జూచి వైశంపాయనుండు చెప్పినచొప్పునం
జెప్పెద వినుం డని యిట్లనియె. 2

నలోపాఖ్యానపర్వము.

ఉ. అర్జునుఁ డస్త్రము ల్వడయ ♦ నన్నలఁ దమ్ముల వీడిపో ద్విష
ద్దుర్జయు లైనపాండవులు ♦ ద్రోవదితో నలకామ్యకంబునన్
భూర్జతరుప్రదేశముల ♦ భూసురబృందముఁ గూడి యుండి ర
ద్యార్జవ మేర్పడంగ విగ♦తామయులై మునివేషధారులై. 3

ఆ. వేలకొలఁది బ్రహ్మ♦వేత్తలు బ్రాహ్మణుల్, సాగ్నిహోత్రు లైన♦స్నాతకులును
దాపసోత్తములును ♦ దమ్ము రేవును మాపు, ననుసరింపఁ బ్రోచి ♦ రరసి వారి. 4

వ. *అక్కామ్యకవనంబునఁ బ్రత్యహంబును దూర్పునకు ధర్మజుండును దక్షిణంబునకు
భీముండును బశ్చిమంబునకు నకులుండు నుత్తరంబునకు సహదేవుండునుం బోయి
రురుకృష్ణసారాదిపవిత్రమృగంబులం జంపి తెచ్చి ద్రౌపది కిచ్చిన నామెయు వాని
నెల్ల నల్లన వండి బ్రాహ్మణులకును భర్తలకునుం బెట్టి తానుం దినుచుండు నిట్లు
వారి కం దైదేండ్లు కడచిన వెనుక నొక్కనాఁ డొక్కవివిక్తం బగుశాద్వలంబున ధనం
జయవియోగాసహమానమానసు లై దుఃఖించుచుఁ బాండవులు పాంచాలీసహితు

* శాద్వలము=పచ్చికపట్టు.



లై విశ్రమించి రప్పుడు భీమసేనుండు కంట నీరు వెట్టుకొనుచు ధర్మరాజుం జూచి
యిట్లనియె. 5

భీముఁ డన్నతోఁ దనవిచారమును వెల్లడించుట.

చ. ఎవనిభుజాబలంబు మన ♦ కెల్లర కాశ్రయ మై తలిర్చునో
యెవనిపయిన్ నిరంతరము ♦ నిందఱుఁ బ్రాణము లుంచుకొందుమో
ప్రవిమలతేజుఁ డానరుఁడు ♦ పాశుపతాస్త్రముఁ దేరఁ బోయె రాఁ
డవధియుఁ బెద్ద యయ్యె నకటా యెటు లుండెనొ తమ్ముఁ డగ్రజా. 6

ఉ. ఎవ్వనిబాహువీర్యమున ♦ నెల్లవిపక్షులఁ దున్మి రాజ్యమున్
ద్రివ్వనిపేర్మిఁ గొందు మని ♦ తెల్పుచు నుందుమొ ప్రాణతుల్యుఁ డా
కవ్వడి నష్టుఁ డైన బ్రదు♦కం గలమే మన మట్టి సోమకుం
డవ్వసుదేవనందనుఁడు ♦ నాతనితమ్ముఁడు నెల్లచుట్టలున్. 7

వ. అని మఱియు నమర్షంబున. 8

తరువోజ. ధరణి రాజ్యము గాక ♦ తలపోయ క్షాత్ర♦ధర్మ మడవిఁ దల♦దాఁచుటగాదు
ధరణీశ యిది సనా♦తన మగుఁ గానఁ ♦ దడయక పార్థునిఁ ♦ దడవి తో తెచ్చి
మురమర్దనునిఁ బిల్చి ♦ మూఁకలఁ గూర్చి ♦ పోయి దుర్యోధన♦ముఖ్యులఁ గూల్చి
పరిశమితారి నై ♦ పరఁగెద నిందుఁ ♦ బాపం బొకింతయు ♦ భావింపఁ జనదు. 9

తే. పాపమేయేని యధ్వర♦పంక్తివలనఁ, బాపుకొందము స్వర్గంపు♦ఫలము వడయ
నికృతిచే నైకృతికుఁ జంప ♦ నెపము గా దటనుచుఁ జెప్పిరి ధర్మజ్ఞు ♦ లైనమునులు.

వ. ఇదియుం గాక కృచ్ఛంబుల నొక్కయహోరాత్రంబు సంవత్సరతుల్యం బని వేదంబ
ఘోషించు నది ప్రమాణం బైనయెడల మన కిప్పటి కెన్నియో సమయవత్సరంబు
లతిక్రమించె నని నిశ్చయించి ధార్తరాష్ట్రులతోడ యుద్ధంబునకు సిద్ధం బగుట
పరమధర్మం బట్లు గాక పదుమూఁడేండ్లపిమ్మటన యందుమే నజ్ఞాతవాసవత్సరం బది
గడవ నీఁదు టరిది మృత్యుముఖోపమం బగునందు మనసన్న యొరుల కెఱుంగ
నయ్యెనేని మరల వనవాసంబు నజ్ఞాతవాసంబుఁ జేయ నగు దైవవశంబునం జేసి
యెట్టు లైన నీసమయంబుఁ దుద ముట్టించితిమయే నెఱింగి దురాత్ముం డగు
దుర్యోధనుండు నిన్ను మరల దురోదరంబునకుం బురికొల్పి వనంబులకుం బుచ్చు
నదియె మనకు యావజ్జీవవ్రతంబట్టిద యగుఁ గావున నీయాజ్ఞ యయ్యెనేని నే నేగి
కక్షస్థాపితం బగునాశ్రయాశుని తెఱంగున సుయోధనుం బరిమార్చి వత్తు నని సం
రంభించినం గని యుధిష్ఠిరుండు తమ్మునిఁ దనసమ్ముఖమ్మునకుఁ దిగిచికొని మూర్ధా
ఘ్రాణంబు చేసి యిట్లనియె. 11

ఉ. నందియు మేల నీ వనిన ♦ చందమునన్ ధృతరాష్ట్రనందనుల్
బ్రమ్మదగఁ బోరఁ జాలుదు వ ♦ మానుషవిక్రమ మేర్పడంగ ము
న్నుందుగ నిట్లు గాదు పదు ♦ మూఁ డగునేఁడులు వోవు నంత సం
క్రందననందనుం గలసి ♦ కార్య మొనర్తువుగాక తమ్ముఁడా. 12

ఆ. వేగిరింప కివుడు ♦ వేళ గా దలుకకు, నన్నృతమాడఁ దలఁప ♦ నయ్య నేను
సమయమధ్యమందు ♦ సంగరం బది పాప, హేతు వగును గాన ♦ నిట్లు వలదు. 13

—●●◆ ధర్మరాజుకడకు బృహదశ్వుం డనుముని వచ్చుట. ◆●●—

వ. అని ధర్మతనయుండు తమ్మునిం బలుకుచున్నసమయంబున మహాభాగుం డగుబృహదశ్వుం డనుమహాముని దర్శనం బిచ్చిన నతం డతనికి విధివిధానంబున మధుపర్కం బొసంగి పూజించి విశ్రమించి యున్నవానిం జూచి యిట్లనియె. 14

చ. నికృతి సెలంగఁ గౌరవులు ♦ నేరనిన న్నటఁ బిల్చి జూదమున్
శకునికృతంబుగా నడపి ♦ నాధనరాజ్యముల న్హరించి వం
చకు లయి నాసతిన్ పరభ ♦ నంబుగ నీడ్చి సభాస్థలంబునన్
బ్రకటనుదుఃఖమొంద వన ♦ వాస మొనర్పఁగఁ జేసి రక్కటా. 15

చ. *అడవుల నాకలంబు లశ ♦ నార్థముగాఁ గొని వల్కలంబులన్
దొడిగి కడిందిఁ గుందుచును ♦ దోడులతోడ వసించుచుండఁ గ
వ్వడి తపియింప నుత్తరము ♦ వట్టి చనెం దడ వయ్యె నన్నఁ డా
తఁడు చనుదెంచి మా కెడ ముదం బొనరించునొ తోఁప దియ్యెడన్. 16

వ. అని మఱియును. 17

క. శ్రీ విడిచి సకలసుఖములఁ, బో విడిచి మృగాళిఁ గూడి ♦ పొలుగఁ గాఱడవిన్
మావలెఁ గుతిలం గుడిచిన, భూవరు లెవ రైనఁ గలరె ♦ మును మునినాథా. 18

వ. అనిన బృహదశ్వుం డిట్లనియె. 19

ఉ. దేవసదృక్షు లై బహుల ♦ తేజమునం జనుభ్రాతృవర్యులున్
బావనచిత్త యైనసతి ♦ బ్రహ్మసమానులు బ్రాహ్మణోత్తముల్
భూవర నీకుఁ దోడుపడ ♦ భూరిరథంబులతో భటాళితో
నీ వరుదెంచి యుంటివి వ ♦ నిన్ విభవం బది విస్తరిల్లఁగన్. 20

చ. అరయఁగఁ బెద్ద గా దిది న ♦ రాధిప తొల్లి నలుండు నా మహీ
వరుఁడు దురోదరంబునను ♦ వైభవ మంతియు నోడి కాంతతో

---

* కడింది = ఆపద; ఎడ = ఎడ; హృదయము.



గురుతరకాననంబులను ♦ గ్రుమ్మరె ముమ్మర మైనకస్తి కా
కరుఁ డయి యొక్కరుండ యయి ♦ కారుమొకంబులలోపనీడ యై. 21

ఆ. అనిన ధర్మతనయుఁ ♦ డమ్మునిఁ గని యిట్లు, వడిననలమహీశు ♦ కడిఁదిచరిత
వినఁగ వలతుఁ దెలుప ♦ వే మునివర యన, నాతఁ డతని కిట్టు ♦ లనియెఁ బ్రీతి. 22

—●●◆ నలోపాఖ్యానప్రారంభము. ◆●●—

ఆ. నిషధదేశమందు ♦ నెఱి మీఱుతేజున, వీరసేనుఁ డనెడు ♦ ధారుణీంద్రుఁ
డొప్పు నతనిపుత్రుఁ ♦ డుత్తమోత్తమగుణ, యుతుఁడు నలుఁ డనంగ ♦ నున్నతుండు. 23

సుగంధి. శూరుఁ డశ్వకోవిదుండు ♦ శోభనాంగుఁ డుత్తమా
చారసంయుతుండు సాధు ♦ సమ్మతుండు సత్యవా
క్సారభూషణుండు నిత్య ♦ కర్మఠుండు భూమిభృ
ద్వారవందితుండు భూరి ♦ వాహినీశుఁ డారయన్. 24

సీ. *సత్సంతతుల నిల్పు ♦ జైవాతృకుఁడు సర్వ, చక్రంబులను నేలు ♦ సత్ప్రభుండు
దోషాకరుఁడు గాని ♦ యోషధీశుం డెప్డు, సన్నుతింపనికళా ♦ శస్తమూర్తి
యకలంకుఁ డైనమ ♦ హావిధుం డెందు ని, శాటత్వ మొందని ♦ యట్టిరాజు
గురుగద మొందని ♦ కువలయమిత్రుండు, విషరాశిఁ బొడమని ♦ విశదకీర్తి

తే. యతఁ డనఁ బితృపైతామహ ♦ మైనరాజ్య, మును దమము వ్రావఁ బాలింపు ♦ చును ధరిత్రి
నఖిలధర్మపరాయణుం ♦ డగుచు నైష, ధావనీనాథచంద్రుండు ♦ తేవమీఱె. 2

ఉ. పాఁడియుఁ బంటయుం గలిగి ♦ బల్సిరులం దులఁ దూఁగుచుండునా
తేఁడు జగంబునం దగుత ♦ ఱిం గురియు న్నెల మూఁడువాన లే
గోడును లేక భూప్రజకుఁ ♦ గోరుసుఖంబులు దొప్పదోఁగఁగాఁ
బాడిగ రాజ్య మేలుచును ♦ భాసిలుచుండె మహీతలంబునన్. 26

వ. అట్టి సమయంబున విదర్భాపురంబున భీముం డనురాజేంద్రుం డొక్కండు దేవేంద్ర వైభవంబునం దీపించుచు. 27

చ. అతఁ డనపత్యుఁ డై దమనుఁ ♦ డన్ముని దర్శన మీయ వానిన్
సతియును దాను భక్తి మెయి ♦ సంతతమును భజియించి మ్రొక్క న

---

* సత్సంతతులు = సజ్జనసమూహములు, నక్షత్రపంక్తులు. జైవాతృకుఁడు = ఆయుష్మంతుఁడు, చంద్రుఁడు. సత్ప్రభుఁడు = మంచిరాజు, నక్షత్రరాజు. దోషాకరుఁడు = పాపములకు స్థానము, రాత్రినిజేయువాఁడు. మహావిధుఁడు = గొప్పవిధానముగలవాఁడు, విధునామము గలవాఁడు. నిశాటత్వము = రాక్షసత్వము, రాత్రిఁ దిరుగుధర్మము. రాజు = ప్రభువు, చంద్రుఁడు. కువలయము = భూవలయము, కలువ. విషరాశి = విషసమూహము, సముద్రము. తమము = అజ్ఞానము, చీఁకటి.

య్యతియుఁ బ్రసన్నుఁ డై వ్రతము లానతి యిచ్చి వరంబొసంగె నా
వ్రతమహిమంబునన్ దమనవాక్పతిభాస్వదనుగ్రహంబునన్. 28

క. దమయంతి యనెడుకూఁతురు, దముఁడును దాంతుండు వెనుక దమనుం డనునా
మము లలరఁ బొదలుకొడుకులుఁ, గ్రమమున నుదయించి రెల్లప్రజలు నుతింపన్.

వ. వారిలోఁ గన్యారత్న మగుదమయంతి శుక్లపక్షక్షపాకరరేఖయుంబోలె దినదినప్రవర్ధమాన యై. 30

చ.*నలలితకాంతి రూపము యశంబు గుణంబును నాభిజాత్యమున్
గలిగి త్రిలోకసుందరి యనం దగి యౌవన మన్విభూషణం
బలరుమణీవిభూషల కనంతవిలాస మొసంగ దేవక
న్యల కగునార్వ రిష్టసఖు లాశచినింబలెఁ గొల్వ నొప్పుచున్. 31

మ.‡వఱలం జేసినభూషలం దొడిగి భాస్వద్రూపసంపన్న యై
మెఱుఁగుందీఁగ తెఱంగున న్మెఱయుచు న్మేటిల్లి త న్వేలుపుం
దెఱవల్ నాగవధూటులు న్నరసతుల్ తేజంబునం బోల రన్
నెఱి మీఱున్ దమయంతి దివ్యులకు నేని న్మోహముం గూర్చుచున్. 32

వ. అప్పుడు. 33

తే. నలుఁడు నవమోహనాంగుఁ డున్నతుఁ డని దమ
యంతి నవమోహనాంగి దివ్యాంగన యని
జనులుమెచ్చిరి దమయంతినరన నలుని
నలునిచెంగట దమయంతి నలరఁ బొగడి. 34

వ. దానంజేసి వారి కన్యోన్యానురాగం బంకురించి మించి కామోద్దీపకం బయ్యె నంత.

చ. నలుఁ డెవుడు న్విదర్భపురనాథసుతం గనకున్న విన్నయ
ట్లెలమిఁ దదీయవిగ్రహమునే హృదయంబున నిల్పి లోనిచూ
పుల మునిరాజు బ్రహ్మమును బోలెను గాంచుచు నొండు గాన కు
జ్జ్వలమదనానలంబునకు సైఁపఁగ లేక విరాళిఁ దూలుచున్. 36

వ. పురసమీపంబునందలి ప్రమదావనంబున కొక్కనాఁ డొక్కరుండ చని. 37

ఉద్యానవనంబున నలున కొకరాజహంస దర్శన మిచ్చుట.

ఉ.†చంచలనేత్రపొందు విడఁ జాలక డెందమునందు గట్టి ద
క్కించుకొనం దలంచుచు నకించనుఁడుంబలె దానిసౌష్ఠవం

* అభిజాత్యము = మంచికులమందుఁ బుట్టుట.
‡ మేటిల్లు = అతిశయించు.
† అకించనుఁడు = దరిద్రుఁడు, దీనుఁడు.
సఖీలసద్గతిన్ = దమయంతియొక్క పూఁబోణులగు సఖులచేత.



బెంచుచు సంతసించుచు నొకించుక కన్గవ విచ్చినంత రా
యంచలపిండు కట్టెదుట నై కనిపించె సఖీలసద్గతిన్. 38

ద్విపద.*కని రేఁగుదమయంతి గదె యంచు వాని,వెనువెంటఁ బడి పట్టవిడనట్టితీరు
ననుఁ బ్రాఁతి చరవంజి నడయాడునందుఁ, గనువందు వగునొక్క కలహంసఁ బట్టె.

ఉ. పట్టినఁ గీచు కీచు మని పల్మఱుఁ గూయుచు ఱెక్కడోయి యి
ట్టట్టు విదుర్చుచున్ నృపతిహస్తయుగంబున గోళ్ల గిచ్చుచున్
గట్టిగ ముక్కులం గఱచి కండలు దీయుచు రాజహంస లో
దిట్ట చెడంగ నిట్లనియె దేవర చూపెడునట్టివాకులన్. 40

చ. నృపవర నీ కొకప్పటికి నెగ్గు దలంచి యెఱుంగఁ జిత్తమం
దెపుడును సాధువృత్తి వసియించెద బిడ్డలు నెత్తుగ్రుడ్డు లా
లవగతచిత్త తల్లి బసు గందఱ కొక్కఁడఁ బోషకుండ నే
నుపకృతి నీ కొనర్తు విను మూరక యిట్లు వధింప నేటికిన్. 41

క. నావుడు నివ్వెఱపడి నల,భూవరుఁ డారాజహంస ముద్దిడికొని తాఁ
బో విడిచె నదియు వెండియు, జీవించినయట్లు తలఁచెఁ జిత్తమునందున్. 42

వ. అట్లు విముక్తిం గాంచినరాయంచ యించుక యెడ గలుగ నిలిచి మనుష్యకరసంమర్దంబున నైనయలయుట దీఱఁ బంచపుటంబున మే నెల్ల నిమురుకొని నేదదేఱి మఱియు నతని కడ కరుదెంచి యిట్లనియె. 43

చ. నను బ్రదికించినట్టికరుణాఢ్యుఁడ వో నలరాజ నీకుఁ బ్రీ
తిని గలిగించు ప్రత్యుపకృతిం బొనరింపఁగ లే న యైన నీ
మనమున నెప్పుడు న్విడని మచ్చిన మచ్చట గూర్చుచున్నమా
నిని దమయంతికిం దెలిపి నిన్ను వరించెడునట్లు చేసెదన్. 44

క. నీనుగుణకీర్తనంబునఁ,జేసి సతీతిలక మామె చిత్తమునం దో
భానురమూర్తి నినుఁ గా,కేసరుని జూనువనట్టు లేఁ బొనరింతున్. 45

తరువోజ. అని పల్కి నరనాథు నంతరంగంబు హర్షామృతంబున నలరంగఁ జేసి
కనుఁగవ ననుమతిఁ గాంచి రాయంచ కమ్ముదంబున హంసగణముతో లేచి
జనపతి వీడ్కొని జవనంబు మీఱఁ జనె నాకసము పట్టి జను లెల్లఁ దమ్ముఁ
గని నిద్ద మగునట్టికబరీభరమునఁ గట్టుకుందము లని కడు నిచ్చ మెచ్చ. 46

వ. అట్లు చని చని వివిధదేశంబు లతిక్రమించి హంసరాజమ్ము తనపరివారమ్ముతో విదర్భాపురమ్మునకుం జనె. 47

* చరవంజి = కమ్మకొను.

క. అలిజనంబులతో భూపాలాత్మజ మెలఁగుచుండఁ బ్రమదావనమం
దాలోన నవతరించెం, జోలింపఁగ నచటివారిపుణ్యం బనఁగన్. 48

ఉ. *అమ్మహిళామతల్లులు ప్రియమ్మున నంచలపింఛఁ జూచి చి
త్రమ్మున నమ్మచెల్ల యని తద్గరిమంబున కిచ్చ మెచ్చి హ
ర్షమ్మున నొంటొరుం గడచి సత్వర మేర్పడ వాని నల్గడం
గ్రుమ్మరి పట్టి రొక్కొకరు కోరిక లీరిక లెత్త నత్తఱిన్. 49

ఆ. నలుఁడు పట్టి పిడిచినకలహంస విదర్భరాజపుత్త్రి చెంతఁ దేజరిల్ల
దాని నామె పట్టెఁ బడవు సేయక పూని, మనమునందుఁ గోర్కి కొనలుసాఁగ. 50

రాజహంస దమయంతికి దర్శనమిచ్చుట.

వ. అంత నారాజహంస మనుష్యవాక్యమ్ముల దమయంతి కిట్లనియె. 51

చ. †నలుఁ డనుభూతలేశ్వరుఁ డనంగుఁడు రూపమునన్ దివాకరుం
డలఘుతర ప్రతాపమున నాకపురీశుఁడు వైభవంబునన్
జ్వలనుఁడు తేజునన్ ఘనుఁడు చాగమునన్ సురసన్నిభుండు నాఁ
డెలియఁగ నయ్యెడిన్ నిషధదేశమునందు లతాంగి వింటివే. 52

ఆ. అతని కీవు భార్య వగుదేని నీరూపు, నీదుపుట్టుగడయు నెలఁతమిన్న
సార్థకమ్ము లగును సాధ్వీమతల్లి నీ, వతని కీడు వత్తు వన్నిగతుల. 53

ఉ. చూచితి నెల్లవేల్పులను జూచితి మానవలోకజన్ములం
జూచితి భోగివర్యులను జూచితి నెల్లజగంబు లెందునన్
జూచియెఱుంగ నట్టినృపసోముని నైషధనాముఁ డాతఁడే
రాచకొలంపుమానికము రాజముఖీ తగు నీకు నన్నిటన్. 54

వ. అని ప్రశంసించిన నంతరంగంబున సంతసించుచు దమయంతి హంసం జూచి యి
ట్లనియె. 55

ఆ. ‡నలుని నాకు నెఱుఁగఁ దెలిపిన తెఱఁగున, నలున కీవు నన్నుఁ దెలియఁ జెప్పి
మరులుకొనఁగఁ జేయ మఱి మఱి ప్రార్థింతు, నండజేంద్ర నిన్ను నర్థిఁ జేసి. 56

క. అనవుడు హంసం బట్లగు, నని వీడ్కొని నిషధపురికి నరిగి సమస్తం
బును నలునిఁ దెలియఁ బలుకుచుఁ, జనె నిచ్చన్ బంధుజనము చనుదే వెంటన్.

క. నలుఁడును దమయంతియు నాకలహంసము పలికినట్టికారణమున మి
క్కిలి యైనమనసిజార్తిం, బలుగతులం బరితపించి బడలి రిరువురున్. 58

* మహిళామతల్లులు = స్త్రీరత్నములు. † ఘనుఁడు = మేఘుఁడు; చాగము = ఈవి.
‡ అర్థిఁజేసి = కోరికచేత.



చ. మనసిజతాపసంక్షుభితమానసులై దమయంతియు న్నలుం
డును విరహంబు సైఁపక కృశుం గను వందుచు నందనంబులన్
ఘనఘనసారపాంసుకశిలాంతవితర్దులఁ బుష్పశయ్యల
న్వనజదళంబులన్ నిలిచి నాళ్లు పుచ్చిరి వెచ్చ నూర్చుచున్. 59

వ. అంత దమయంతియు. 60

సీ. రాయంచ వచియించి పోయినయది గోలె, నన్యస్థచిత్త యై యనుదినంబుఁ
జింతాజ్వరంబునఁ జన్ను విడి వివర్ణవదన యై నిట్టూర్పు వదలి వదలి
దిక్కు లరయు చూర్ధ్వదృష్టి యై ధ్యానించి, కన్నుల నశ్రువుల్ గాఱ నేడ్చి
తినక త్రావక కంటఁ గనక రేలుఁ బవల్లుఁ, గునుకక పలుకక వనటఁ గుంది

తే. శయ్యఁ బొరలుచు బెదరుచు సారె సారె, కుహూ యనుచు నుబిలిచిన ట్లో యటంచుఁ
బలవరించుచు నున్మత్తవలె మెలఁగుచుఁ, గరము విరహజ్వరార్తి యై పరితపించె.

వ. అట్లున్న దమయంతిం దిలకించి తత్తఱపడి చెలికత్తె లావృత్తాంతం బంతయు భీమ
భూపాలున కెఱింగించిన నతండు సంప్రాప్తయౌవన యగుతనకూఁతుం దలంచి కా
ర్యం బెట్లు సమకూరునో యని చింతించి. 62

భీమరాజు దమయంతీస్వయంవరంబు ప్రకటించుట.

చ. కొమరితకున్ స్వయంవరము కోరిక లీరిక లెత్తఁ జేయ డెం
దమునఁ దలంచి భూతలమునం గలరాజుల నెల్లఁ బిల్వ వా
రమితచమూసమేతు లయి హస్తిరథాశ్వరవంబు మ్రోసి ది
క్సముదయ మెల్ల నిండఁ గొనఁగాఁ జనుదెంచి రొగి న్విదర్భకున్. 63

క. వచ్చినవారల నెల్లం, బొచ్చెము లేకుండ భీమభూపాలుఁడు దా
నిచ్చ మెయి నాదరించుచు, నిచ్చె న్వారలకు విడిద లెసకం బెసఁగన్. 64

తరువోజ. *అక్కాలమునయందు సమరమునీంద్రు లైనపర్వతనారదాఖ్యులు వార
లిక్కాశ్యపీతల మెల్లఁ గ్రుమ్మరి మహేంద్రలోకమునకు నేగిన నింద్రుఁ
డక్కఱఁ బూజించి యడఁకువం గుశల మడిగిన నారదుం డనియె నో దేవ
మక్కువఁ గని యెల్లమాగాణములు గ్రమమున వచ్చితి మనామయులమై యిటకు.

తే. అనిన విని పాకశాసనుం డనఘ ధర్మమున మహీపాలనము సేయుపురుషవరులు
యోధు లై శస్త్రనిధనంబు నొంది యిటకు, నతిథు లై రారి దేమి నా కానతిమ్ము.

చ. అనవుడు నారదుం డనియె నయ్య బుధేశ్వర భూతలంబునన్
దనరు విదర్భరాజసుత దానిస్వయంవర మొప్ప నిప్పు డం

* అక్కఱ = కోర్కి.

దున ధరణీంద్రు లెల్లరును • దోరపురాసిరితోడ నప్పురం
బునకు గమించుచుండి రెదఁ • బో రనుమాట తలంప కింపునన్. 67

ఆ. ఉర్విఁ గలుగుసర్వ•యోషిజ్జనమునందు, రత్నభూత యగుచు • నూత్నయౌవ
నమున నొప్పుచున్న•నలివేణి దమయంతి, వాంఛ సేయునట్టి•వాఁ డెవండు. 68

క. అని పలుకుచున్న సమయంబున నటకున్ లోకపాల•ముఖ్యులు వేడ్కం
జనుదెంచి నారదోక్తము, విని వారుం దనరి రిచ్చ • వెలఁదుకఁ జూడన్. 69

వ. అంత నాలోకపాలు రెల్లరు నిజగణంబులతో నింద్రుం బురస్కరించుకొని సహ
వాహనవర్యు లై భూతలంబునకుం బయనం బై రప్పుడు. 70

చ. నలుఁడును రాజులెల్లరు ఘ•నం బగుపేర్మి విదర్భ కేగుటల్
తెలిసి మనంబునం దలరి • తీఁగనికోరికఁ దానును స్మరో
జ్జ్వలవిభవంబునం దరలి • వచ్చె మహం బరయ న్నరాకృతిన్
వెలసినమన్మథుం డనఁగ • వేనుక గూర్చుచు నెల్లవారికిన్. 71

వ. లోకపాలురును మార్తాండుని తెఱంగున వెలుంగుచుం బోవుచున్న నైషధు నమ్మార్గ
మధ్యంబునం గాంచి తద్రూపలావణ్యసంపదకు విస్మితులును విగతసంకల్పులును నై
విమానంబులు నింగి నిలువం బెట్టి ధరణీతలంబున కవతరించి నలుని సన్నిధానంబు
గాంచి పలుకరించి యి ట్లనిరి. 72

నలుఁడు దేవదూతయై దమయంతికడకుఁ బోవుట.

క. ఓసత్యవ్రత నిషధేశా సాయము మాకుఁ జేయుమా దూతుఁడ వై
నా సార్ద్రహృదయుఁ డై నేఁ, జేసెద నని ప్రతిన సేసి • చెచ్చెర నలుఁడున్. 73

తే. అంజలి ఘటించి యోయయ్య•లార మీర, లెవ్వ రే మీకు దూత నై • యేమికార్య
మాచరింపఁగ వలయు య•థార్థగతుల, నానతిం డన దేవేంద్రుఁ • డనియె నిట్లు. 74

శా. *ఏ నింద్రుండ నితండు వహ్ని వరుణుం • డీతం డితం డంతకుం
డో నిర్దుష్టచరిత్ర మే మవనిపై • నొప్పారు వైదర్భి కై
కో నేతెంచితి మీవు దానికడ మా•కోర్కి న్నివేదించి మా
లో నేయొక్కరినో వరించు నటు లీ•లోఁ జెప్పి యొప్పింపవే. 75

మ. †అనినం బ్రాంజలి యై నలుం డను మహా•త్మా నన్ను నేకార్థయు
క్తునిఁ బంపం దగునయ్య యుత్సుకుఁడ నేఁ • గోర్కిం బ్రవర్తింతు నా
వనితం బొందఁగ దానిచెంత నెటు చె•ప్పన్నేర్తు నన్వ్యర్థ మ
త్యనుకంపాంచితచిత్తు లై సయిచి న • న్నాలింపుఁడీ యొక్కెడన్. 76

* వైదర్భి = విదర్భరాజపుత్రి. † ఆలింపుఁడు = ఆదరింపుఁడు.



వ. అనిన నింద్రాదిదేవత లాతనిం జూచి. 77

తే. తొలుతఁ జేయుదు నని నీవు • పలికి యిట్లు, చేయఁజాల నటం చని • చెన్నుదఱుఁగ
నిపుడు పలుకంగఁ దగువయ్య • నృపలలామ, పలికి బొంకుటకన్నఁ బా•పంబు గలదె.

వ. ఏది యె ట్లయినం గాని దేవకార్యంబు దీనిం దీర్పక తప్ప దిప్పుడ పొ మ్మనిన నమ్మను
జేశ్వరుండు సమ్మతించి సురక్షితమ్ము లైనరాజవేశ్మమ్ము లే నెట్లు ప్రవేశింతు ననుట
యు దేవేంద్రుండు నీవు మానుషాకారంబున నొరులకంటం బడకుండ నందుఁ బ్రవేశింప
నోపుదువు పొ మ్మనుడు నతండు నాఁగాత మని కదలి యొక్కరుండ దమయంతీ
నివేశంబున కతిరయంబునం జని యచ్చట. 79

మ. *కనియెన్ భీమసుతన్ సఖీజనసమా•క్రాంత న్నితాంతాంగసం
జనితాభాజ్వలితావరోధను ఘనాం•చత్కేశపాశన్ లస
త్తనుమధ్య న్విభవాభిశోభితముఖన్ • దన్వంగి లోకైకశో
భననేత్రన్ వరవర్ణినిం దరుణి వి•భ్రాజద్దుకూలావృతన్. 80

క. కామశరం బన నగునక్కోమలిఁ గనినంతమాత్రఁ • గువలయపతికిన్
గామార్తి వొడమి పొడు గై, సామాన్యము గాక కూర్చె • సంతాపంబున్. 81

వ. అంత శుద్ధాంతకాంతాజనం బంతయు నమ్మహీకాంతుం జూచి సంభ్రాంతం బై
లేచి విస్మయంబడుచు నతని మనంబులం బూజించి. 82

మ. అపురా రూప మయారె కాంతి బళిరే • హావంబు మేల్మేలు వై
భవ మయ్యారె విలాస మమ్మక చెలా • భాగ్యం బితం డెవ్వఁడో
దివిషద్వర్యుఁడొ యక్షవల్లభుఁడొ కో • దేదీప్యమానప్రభన్
గవియ న్వచ్చెడు నంచు సిగ్గునను బం•కల్కిం జాల కున్నంతటన్. 83

ఉ. నవ్వుమొగంబునం జెలఁగు•నైషధునిం గని విస్మితాత్మ యై
నవ్వుమొగంబు దోఁప నృప•నందిని పల్కె మనోహరాంగ నీ
వెవ్వరివాఁడ విక్కడకు • నేటికి వచ్చితి వుగ్రశాసనుం
డివ్వసుధేశ్వరుండు పుర • మెట్టులు సొచ్చితి చెప్పు మంతయున్. 84

వ. అని యడిగిన నలుం డామెకి ట్లనియె. 85

క. నలుఁ డనువాఁడం గలికీ, తెలియుమి నను దేవదూత • దేవతలు నినున్
వలచి చనుదెంచి రింద్ర, జ్వలనాంతకవరుణు లనెడు•వారలు వింటే. 86

వ. నీకై నేను వారిచేఁ బ్రేషితుండ నైతి నీ వం దిచ్చవచ్చినవాని వరింపు మేను
దత్ప్రభావంబునం జేసి యొరులకంటం బడకుండ నిట నిరాటంకంబుగా రాఁ గలిగితి

* అవరోధము = అంతఃపురము, శోభనము = సుందరము.

ననిన వైదర్భి వానిం దనమనఃప్రియునిగా నిర్ణయించుకొని లోకపాలురకు నమస్కా-
రంబు చేసి యిట్లనియె. 87

మ. కలహంసం బది ప్రస్తుతించుట మొదల్ ♦ గా నిన్ను చిత్తమ్మునం
దలఁతు న్నాదగువాక్కు కాయమును మే♦ధాశక్తులున్ యుక్తులున్
గలసర్వస్వము నీవయి న్నిలిపి నిన్ ♦ గాంక్షించి యుంటి న్మహీ
తలనాథాగ్రణి బాసచేసెద యథా♦ర్థం బంచు నీయంతయున్. 88

శా. *సీకై కాదె స్వయంవరం బనుమిష ♦ న్నిర్మించి రాజేంద్రులన్
లోకంబందలివారి నెల్ల నిట రా♦లోచించి రాఁ బంచె రా
జోకందర్పసమానరూప నిఁక నీ♦వో నన్నుఁ గా దంటివే
నీకాయంబుఁ ద్యజింతు రజ్జువిషవ♦హ్నిక్షీరమార్గంబులన్. 89

వ. అనిన నలుండు వెండియు. 90

ఉ. వీరలు లోకపాలు రగు♦వేల్పులు నిన్ను భజించుచుండ నో
వారిజనేత్ర పాత్ర లగు♦వారిపదంబులధూళిఁ బోలఁగా
నేరనిమర్త్యు నన్ దడవ ♦ నీ కగునే విబుధాళి కప్రియం
బౌరఁ బొనర్చువారలకు ♦ నావడి యౌ భువనత్రయంబునన్. 91

ఆ. ‡నన్నుఁ గావు మనిన ♦ నామాట విని వరిం,పుముసురోత్తములను♦బొందు మెపుడు
వాడనట్టిపూల♦వలపును విరజోంశు,కములపొలుపు భూష♦ణములబలుపు. 92

సీ. పుడమి యంతయు నొక్క♦ముద్దగాఁ జేసి వ్రే,ల్మిడి ద్రింగఁ జాలిన♦మేటివహ్ని
తనగదాదండంబు♦నను భూతకోటుల, గడగడలాడించు♦ఘనుఁడు యముఁడు
దంభోళిఁ జేకొని ♦ దైత్యదానవులను, మర్దించి మించు జం♦భద్విషుండు
వల్లెత్రాటం గట్టి ♦ యెల్లప్రాణంబుల, నెగిచి భంగించెడు♦మగఁడు వరుణుఁ
తే. †డిట్టి జేజేలవిక్రమం ♦ బెంచి నీవు, వారి వరియింపకుంటివేని ♦ వారిజాక్షి
మీఁదుమిక్కిలి వచ్చెడు ♦ మిత్రవాక్య,మాదరింపుమునింపుమా♦మోద మెడఁద.

వ. అని పలికిన దమయంతి బాష్పపూరితనయనయుగళ యై నలునిం జూచి. 94

క. దేవళ్లకు జోహారిడి, యోవల్లభ నిను వరింతు ♦ నొండొక్కని నే
నేవరునవాని నై నన్, భావించి వరింప నిజము ♦ పలికెద నిచటన్. 95

---

* రాజా = ఇట భీమరా జని యూహించునది; క్షీరము = నీళ్లు; 'నీరక్షీరాంబుకంబరం' అని యమరము.
‡ వలపు = పరిమళము; పొలుపు = ఒప్పు; బలుపు = పుష్టి; విరజోంశుకములు = శుభ్రవస్త్రములు; శ్లో. విర జాంశుక వాసాంసి దివ్యాశ్చిత్రాస్స్రజస్తథా॥ వం. భా.
† మీఁదుమిక్కిలి వచ్చును = ఉపద్రవము వచ్చును; (ఇట్లు గోదావరిమండలమున వాడుదురు.)



వ. అని విన్నవించి. 96

ఆ. మగువ కేలుదోయి ♦ మొగిచి మేను చలింప, నిలిచియున్నఁ జూచి ♦ నలుఁడు మాత
నగుచు నేఁ బరార్థ ♦ మరుదెంచి స్వార్థమ్ము, సలుపుకొంట ధర్మ♦సరణి యగునె.

వ. అనిన నొక్కింత చింతించి దమయంతి బాష్పావిలవచన యై వెండియు. 98

ఉ. *కంటి నుపాయ మొక్కఁడు జ♦గన్నుత చెప్పెద విన్ము నీవును
బంటవలంతిసాములు సు♦పర్వవరేణ్యులు వచ్చి యుండ మా
యింట స్వయంవరంబునకు ♦ నెల్లరసన్నిధి ని న్వరింతు నే
నంటదు దాన దోష మిసు♦మంతయు నీకు నెఱుంగఁ బోలెదున్. 99

వ. అని నిరపాయం బగునుపాయంబు సెప్పిన నప్పురుషోత్తముండు దమయంతి
నీడ్కొని లోకపాలుర పాలికిం బోయి పొడసూపిన వారు నీ వెట్లు పోయి వచ్చితి
వేమి వృత్తాంత మని యడుగుటయు నతండు వారి కి ట్లనియె. 100

మ. ‡భవదాజ్ఞం గొని పోయి యంతిపురి నా♦భైమి న్విలోకించి నేఁ
దవురీతి న్మిముఁ దెల్పితిన్ బొగడుచున్ ♦ దన్వంగి న న్నాక యు
త్సవమం దెవ్వరిని న్వరింప ననుచున్ ♦ సత్యంబు వాక్రుచ్చె నో
దివిషన్నాయకులార వేఱిమి రవం♦తే లేదు నావాకులన్ 101

వ. అని చెప్పి వారియనుజ్ఞం గొని చనియె ననంతరంబ. 102

—◆ దమయంతీస్వయంవరోత్సవము. ◆—

సీ. అట భీముఁ డొక్కపు♦ణ్యాదినంబున స్వయం,వర మని చాటింప ♦ నరవరేణ్యు
లందఱు నానావి♦ధాలంకృతులు గ్రాలఁ, గౌతూహలమ్మునఁ ♦ గదలి పోయి
కనకమణిస్తంభ♦కలితరంగస్థలిఁ, గైసేసి రట ననుక్రమము దోఁప
నవు డందుఁ గలఱేండ్ల♦యాననంబులు దివి, నక్షత్రపంక్తులు ♦ నాఁ దలిర్చె
తే. నంత దమయంతి నిజదేహ♦కాంతి నృపుల,చూపులంగొట్టిమనములఁ♦జూఱలాడ
మెట్టుచు స్వచ్ఛ నచ్చటి ♦ కట్టెదుట, మెఱుపుఁదీవ తెఱంగున ♦ మెఱసి మెఱసి

క. బంగారుబొమ్మపోలెన్, రంగారెడుదానిమేన ♦ రాజులదృష్టుల్
సంగమము నొంద కదలని,భంగిం దీపించె నపుడు ♦ బహుచిత్రముగన్. 104

వ. అంత. 105

మ. ఇతఁ డీపేరఁ బ్రసిద్ధికెక్కిననృపుం ♦ డీతం డితం డంచు భూ
పతులం బెక్కురఁ బేరుకొంచును జెలుల్ ♦ భాషించునవ్వేళ రా

---

* పంటవలంతి = భూమి. ‡ ఉత్సవము = స్వయంవరోత్సవము; వేఱిమి = భేదము.

సుత తుల్యాకృతి నెప్పు నేవు రచటన్ ♦ జూపట్టఁగాఁ జూచి లో
పతిసందేహము నొందె నం దెఱుఁగ లే ♦ కా నైషధోర్వీశ్వరున్. 106

క. ఎవనిం గనినను నలుఁ డని, ధవళాక్షి మనంబులోనఁ ♦ దలపోయుచుఁ గా
దవు నని తర్కించుచుఁ గడు, నెవు లంచెను నేర్పరింప ♦ నేరక నలునిన్. 107

ఉ. కా దనరాదు మాయ యిది ♦ కల్పన చేసిరి వేల్పు లక్కటా
నాదుమనోహరుం డయిన ♦ నైషధుఁ గన్గొను టెట్లు గల్గునో
పేదకు దీనికిం దొలుతఁ ♦ బెద్దలు చెప్పిన దేవచిహ్న మిం
దేదియు లేదు భూమిపయి ♦ నిందఱు నిల్చిరి కేమి సేయుదున్. 108

వ. అని మిగుల వగలం బొగులుచు దమయంతి నితాంతచింతాసమాక్రాంతాంతరంగ
యై తన కత్తఱి నమరోత్తముల శరణం బని ప్రాంజలి యై నమస్కరించి యి
ట్లనియె. 109

ఉ. అంచ వచించిపోయినది ♦ యాదిగ నెవ్వని నే హృదీశుఁగా
నెంచుచు నుంటినో మఱియు ♦ నెవ్వనిఁ గొల్వఁగ నీస్వయంవరం
బంచిత మయ్యె నో వ్రతము ♦ లన్నియు నెవ్వనికై పొనర్తునో
సంచితపుణ్యు నాతని బ్రసన్నుల రై సురలార చూపరే. 110

క. అని కరుణ వొడమ పరిదేవన మొనరించెడు శశాంకవదనం గని స
మ్మనమున ననురాగమ్మును, గొని వేల్పులు పోఁచి రంతఁ ♦ గొంతటిలోనన్

ఉ. ఏవురిలోన నల్వురు మహీతల మంటక తెప్ప వాల్పఁగాఁ
బోవక చెమ్మటం బడక ♦ పొల్చి రొకండు మహీతలస్థుఁ డై
పూవులు వాడఁ జెమ్మటలు ♦ పుట్ట నిమేషసమేతుఁ డయ్యె నా
లో వనజాక్షి నైషధులలో గుఱుతించె యథార్థనైషధున్. 112

ఆ. నలునిఁ దెలిసినంత ♦ నలినాయతాక్షి చే,లాంచలంబు వట్టి ♦ కొంచ కపుడు
ధర్మవిధివిధంబు ♦ దనరంగ వరియించి, యతనియఱుత నైచె ♦ నలరుదండ.

తే. అంతఁ దూర్యారవంబు దివ్యర్షి సాధు,వాదరవమును విప్రుల వేదరవము
నృపవరహాహారవంబు బంధువులనమ్ము,దారవంబును గలసి మిన్నందె మ్రోసె.

ఉ. నైషధుఁ డంతరంగమున ♦ నాతుకచేతకుఁ బ్రీతి కెంతొ సం
తోషము నొంది గారవముతో నుపలాలన మాచరించి వా
గ్భూషణుఁ డై యను న్నను బుభుప్రభు లెంచ వరించుదాన ని
ర్దోషమతిం గ్రహించితిని ♦ దోయరుహానన ధర్మపత్నిగన్. 115



క. ఎందనుక నాదుగాత్రము,నందుం బ్రాణంబు లుండు ♦ నందనుక మహా
నందమునం బొందుచు ని, న్నెందుం బ్రేమించి యుండు ♦ నిందునిభాస్యా. 116

వ. అని శపథంబు వట్టి నట్టియెడం గృతాంజలి యై వైదర్భియు వీరసేనార్భకుండు
పలికినట్టు సందర్భశుద్ధిగం బలికె నట్లు పరస్పరప్రేమానుబంధబంధురు లై తమ్ము
శరణమ్ము వేఁడుచున్న జాయాపతులం దిలకించి సంతసించుచు నింద్రాదిబృందార
కులు వారియెడం బ్రసన్ను లై రప్పు డింద్రుం డారాజేంద్రునియజ్ఞంబునం బ్ర
త్యక్షదర్శనం బిచ్చి హవిర్భాగంబు లందుకొనుచు నుత్తమగతిఁ బ్రసాదించుటకు
నగ్నిభట్టారకుండు వానివాంఛించినకడం బొడకట్టి నిజతేజం బొసంగుచుండుట
కును ధర్ముండు వానికన్నరసం బనుగ్రహించి ధర్మంబునంద నిలుపుటకు నపాం
పతి వానికోరినపట్ల జలంబులు నిష్టగంధాఢ్యంబు లగుమాల్యంబులు నిచ్చుటకు
నొడంబడి వరప్రదానంబు చేసి స్వర్గమునకు నిర్గమించి రపు డెల్లపార్థివులును
వారిదాంపత్యంబున కత్యంతానందంబునం బొంది మెచ్చుచు ననుపంబడి యథా
గతకృతగమను లై రనంతరంబ. 117

నలుఁడు దమయంతిం బెండ్లియాడుట.

ఉ. *ప్రీతమనస్కుఁ డై యపుడు ♦ భీమనృపాలుఁడు పుణ్యలగ్నమం
దాతతవైభవం బెసఁగ ♦ నాత్మజకు న్నిషధాధినేతకున్
గాతుకకార్య మైనతుదఁ ♦ గాంచనవేదికపై వివాహముం
జేతము రంజిల న్వలయఁ ♦ జేసె సుహృజ్జనసమ్మతంబుగన్. 118

తరువోజ. †నలుఁ డంతఁ గొన్నిదినమ్ములవ్విట నలితాయతాక్షితో నలువొప్పనుండి
తుల లేని వేడుకతోఁ దొప్పదోఁగి ♦ తుఱఁగలించుచుఁ దనదుమఱుదారు బలసి
కొలువ మామయనుజ్ఞ ♦ గొని స్వపురమునకుం జని శచితోడఁ గూడి దేవేంద్రుఁ
డలరునట్టుల దమయంతితోఁ గూడి ♦ యతివైభవంబున ♦ నలరారె నపుడు.

చ. ‡రవివలెఁ దేజున న్వెలిఁగి ♦ రాష్ట్రము లేలుచుఁ జక్రవర్తి యై
మివిలి యయాతివోలె హయమేధముఁ దొట్టిమహాధ్వరంబులన్
దవిలి పొనర్చి భూతలమునం బ్రతి గానక యింద్రసేనుఁ డన్
దవుసుతు నింద్రసేన యనఁ ♦ దన్కసుతం గని యొప్పఁ బెంపునన్. 120

మత్త. ¶వీరసేనతనూజుఁ డట్లు భువిం బ్రకాశిలు నంత ముం
ధారుణీస్థలినుండి పోయెడుదారి వాసవముఖ్యబృం

* కౌతుకకార్యము = వ్యాయంవరోత్సవము. † తుఱఁగలించు = ప్రకాశించు. దుమఱుదారు = సేన.
‡ మివులు = అతిశయించు; తన్కు = ప్రకాశించు; ¶ అరదంబు = ఉత్సాహము.

దారకు ల్పనుచెంచునక్కలి • ద్వాపరంబును గాంచి యీ
ఘోరమంబున వోదు తెక్కడి • కానతిం డని పల్కుడున్. 121

తరలము. కలి సుపర్వులఁ గాంచి యిట్లనుఁ • గాశ్యపిన్ దమయంతి యన్
కలికిమిన్నస్వయంవరం బగుఁ • గాన దాన న్వరియించు న
ప్పొలఁతి యంచుఁ గుతూహలమ్మునఁ • బోవుచుంటి నన న్సుప
ర్వులు హసించుచు నింతము న్నది • పోయె నయ్య నివృత్తమై. 122

వ. ఆవైదర్భి యొరుల నెవ్వరి వరింప కస్మత్సన్నిధానంబునన నైషధుం డనువాని వరించె ననినం గోపసమన్వితుం డై కలి యిట్లనియె. 123

తే. వేలుపులచెంతఁ గా దన • కాలతాంగి, మానవుని భర్తఁగాఁ గొనెఁ • గానదాని
కొప్పఁ జూడి శిక్ష విధియింప • నిప్పు డనిన, లోకపాలకు లిట్లని • రా కలిఁ గని.

క. తగ దిట్లాడకు మా చెలి, తగినగతిన్ మాయనుజ్ఞ • దాఁ గొని నలునిన్
దగిలి వరియించె నేచెలి, సుగుణోత్తరు వానిఁ బొందఁ • జూడ చెవుమా.

మ. శ్రుతులున్ శాస్త్రములుం బురాణములు సం • శోధించి బోధాంచితో
న్నతధర్మంబు లెఱింగి సత్యమును జ్ఞా • నంబున్ దపశ్శౌచముల్
ధృతియు న్శాంతియు దాంతియుం దమము కీ • ర్తిస్ఫూర్తియుం గల్గి సు
వ్రతుఁ డై వేల్పుల కీడువచ్చుఘనుఁ డా • రాయందు సామాన్యుఁడే. 126

క. అట్టిగుణోత్తరు నుత్తము, నెట్టిఁడు నేఁ దిట్ట నెంచు • నే దనుఁ దానే
తిట్టుకొనునట్టి డాతఁడు, కట్టిఁడి యై నరకకూప • గతుఁ డగు వింటే. 127

వ. అని పలికి దిక్పాలురు దివంబునకుం జని రంతఁ గలియు ద్వాపరంబుం గని యిట్లనియె. 128

ఆ.*చంప నెల్ల నలుని • సామ్రాజ్య మెడలించి, భైమితోడి పొందు • పాయఁ జేసి
వనట గూర్తు నీవు • ఘనతరాక్షముల వ[illegible] సాయ మెంచి • చేయవలయు.

వ. అని సమయంబు చేసి కలి ద్వాపరమ్ముతో [illegible] కరిగి చార భవనరంబు గాన కంతరం బరయుచుం బం[illegible]లుండె నంత. 130

కలిసమావేశమున నలుఁడు జూద[illegible]

ఉ. [illegible]కాల్కడిచేసి కాళ్లు గడుగ న్మఱవుం గొని సాధ్వి సంధ్యకై
కేల్పొగిచె న్నల్లుం డపుడు • క్రేవల నున్న కలీశ్వరుండు పో
కా ల్కని రేఁగి నైషధుని • కాయమునం జొరఁబాఱి పోరకన్
జాల్కుఁడు పుష్కరాహ్వయుని • చక్కి కిఁ బోయి యిట్లనున్. 131

* భైమి = భీమపుత్రి, దమయంతి. అక్షములు = పాచికలు. [illegible]



ఆ. కలిని నేను రాజ • నలుని వంచింపఁ దలంచినాఁడ నీవు • మించి వాని
తోడ జూద మాడి • తులలేనితద్రాజ్య, మొడిసికొనుము తోడు • పడుదు నేను

సీ. అని కలి ప్రేరేచి • యపుడ వృషం బయి, యనుసరించెను వాని • యాలఁ జేరి
యతఁ డాతనిం గూడి • యరిగి నలుం గని, పిలిచె దురోదర • మెలమి నలుప
నలుఁడు జూదం బాడఁ • బిలువంగఁ బడి పోవ, కుంట కా దని దాని • కొప్పుకొనియె
నికృతిఁ బుష్కరుఁ డొడ్డి • నిలిచి పాచికలను, దొరలించె ఫలకమం • దురువేగమునఁ

తే. గలిసమావిష్టుఁ డగుట న • న్నలుఁడు మొనసి, తనకుఁ గలసర్వధనములు • త్తమములొడ్డి
యోడె నాప్తులు వారింప • నుడుగ కాడి, చలముగొని యాడుచున్న పు • ష్కరునితోడ.

వ. ఇట్లనేకమాసంబులు విడువక చలంబున జూదమాడునలు నుడువం జాలక ప్రకృతిప్రధానవర్గం బది యంతయు సూతముఖంబున దమయంతి కెఱిఁగించిన నామె దుఃఖించుచు వచ్చి దుర్వ్యసనాసక్తుం డగు నైషధుం గాంచి నిన్నుఁ జూచువారై పౌరు లెల్లరు వచ్చి ద్వారదేశంబుకడ వేచియున్నవా రీదురోదరం బుడిగి వారి నాదరింపు మని గద్గదస్వరంబునం బలికినఁ గలిసమావిష్టుఁ డగునతండు ప్రత్యుత్తరం బిడ కాడుచుండె నది విని చేయునది లేక శోకించుచుఁ బ్రకృతివర్గంబు నిర్గమించిన నామె యున్మత్తుని తెఱంగున నొడ లెఱుంగక యోడినకొలంది వేడుక పీడక మత్సరంబు పెచ్చుపెఱుగ మఱియు మఱియు నొడ్డి యాడుచున్నప్రాణేశ్వరుం జూచి పాచికలు పరాఙ్ముఖంబు లగుట పరికించి తమ కపజయకాలం బని తలంచి పరిదేవనంబు సేయుచు నంతఃపురంబునకుం జని బృహచ్ఛయన యనుపరిచారికం బుచ్చి మంత్రులకుం జెప్పి వార్ష్ణేయుం డనుసారథిం బిలువంబంచి లాలించుచు వాని కిట్లనియె. 134

ఉ. సూత యెఱుంగుదే కద వి • శుద్ధచరిత్రుఁడు నైషధావనీ
నేత నిజప్రభావ మది • నీ అయిపోవ నె టున్నవాఁడో నా
కీతఱి సందియంబ యగు • నే మనుదాన నె ట్లెట్లు మాఱునో
ద్యూతము మానకుండె నయ • యో సుహృదుల్ తగ దంచుఁ జెప్పినన్. 135

వ.*ఇది యంతయుఁ గాలమాహాత్మ్యంబ కాని మ్మా రాజదయితమ్ము లగునశ్వరాజమ్ములం బూన్చినరథమ్ము పై ఘూదార్ధకుల నిడికొని కుండినవగరంబునం గలబంధుజనులకడ విడిచి నీవు [illegible] యుండు మట్లు [illegible] నీయిచ్చవచ్చినచోటికిం బోయి యుండు మనిన నతండు 136

* దయితములు = ప్రియములు. దారకులు = బిడ్డలు.

తే. మంత్రులకుఁ జాని నెఱిఁగించి ♦ మఱియు వారి, యనుమతిం గొని దారబిడ్డ ♦ లను రథంబు
మీఁద నిడికొని చని భీమ ♦ భూధయితున, కప్పనము చేసె నంతయు ♦ నానతిచ్చి.

తే. పిదప నాతఁడు దుఃఖంబు ♦ పెచ్చు పెఱుఁగ
నట వసింపక తిరుగుచు ♦ నందు నిందుఁ
జని యయోధ్యలో ఋతుపర్ణు ♦ సారథి యయి
బ్రతికి యుండినదానన ♦ భృతికి నిలిచె. 138

వ. ఇటఁ బుష్కరుండును. 139

ఉ. మోసము సేసి జూదమున ♦ మోదము హెచ్చ నలావనీశునిం
ద్రోసి సమస్తసంపదల ♦ తో మహిరాజ్యము నాహరించి పె
న్గాస మెసంగ నిట్లనియె ♦ నయ్య పణం బిడ నుండె నేని నీ
వీసమయంబునం దిడి న ♦ హింపుము హస్తమునందుఁ బాచికల్. 140

తే. గెలిచికొంటేఁ గదయ్య నీ ♦ కలధనంబు, లెల్ల దమయంతి యొక్కతి ♦ యే విశిష్ట
యగుచుఁ గానంగఁబడు దాని ♦ నలర నొడ్డి, యాడు మిష్టంబ యేని నా ♦ నవనివిభుఁడు.

వ. హృదయవిదారకంబు లగువానివచనంబులకు మనంబునం గనలియుఁ జేయునది
లేమిం జేసి మాఱు పలుకక తనమేనిపైఁ గలసర్వవిభూషణంబులుం దీసివైచి
యేకవస్త్రధరుం డై శోకించుచుం దొలంగి పోయె దమయంతియు నిరస్తభూ
షయు నేకవస్త్రయు నై పతి ననుసరించె నంత. 142

—♦ నలుఁడు దమయంతితో నడవి కరుగుట. ♦—

తే. నలుఁడు దమయంతితోఁ బేద ♦ వలెఁ బురంబు, వెలిఁ ద్రిరాత్రములుండెన ♦ వ్వేళఁ బుష్క
రుండు చాటించె నలుపాలి ♦ కొండెవండు, చనిన శిక్షింతు నని యుగ్ర ♦ శాసనంబు.

శా. దానంజేసి యెవండు నాతనికి స ♦ త్కారంబు గావింపఁ బోఁ
డానాళ్లు పురోపకంఠమున నీ ♦ ళ్లాహారమై యొప్ప ధా
త్రీనాథుండు క్షుధార్తుఁ డై నవసి యెం ♦ తే గందమూలాదులే
నానో యంచుఁ జరించె నల్లడ నర ♦ ణ్యంబందు దైన్యంబునన్. 144

చ. తిరుగుచు నైషధేశుఁ డొక ♦ దిక్కున బంగరువన్నె ఱెక్కలం
బరఁగినపక్షిసంఘములఁ ♦ బాఱఁ గనుంగొని మెచ్చి నా కిటన్
దొరకెను భక్ష్యమందునను ♦ దొడ్డధనం బగు నంచు నెంచి స
త్వరముగఁ బట్టుకోఁ దలఁచి ♦ వైచెను గట్టినచీర వానిపై. 145

మ. అవి యప్పట్టముతోడఁ బై కెగసి దుః ♦ ఖాక్రాంతుఁ డై దీనుఁ డై
భువి నున్నట్టిదిగంబరు న్నలుని సం ♦ బోధించుచు న్మేము నీ



దవుసర్వస్వము గొన్న పాచికల మి ♦ ట్లాచ్ఛాదనంబు న్హరిం
చువగన్ వచ్చితి మంచుఁ బల్కి చనుడున్ ♦ క్షోణీతలాధీశుఁడున్. 146

వ. దీనవదనుం డై దుఃఖించుచు దమయంతిదిక్కు మొగం బై. 147

చ. *గరితరో! దయ్యపుంజెయిది ♦ గంటివె పాచిక లంట పక్షు లి
వ్వరున నధోంశుకంబు గొని ♦ పాఱె నరో యిఁక నేమి సేయుదున్
సిరి చెడియున్ననే నిటులు ♦ జీవనయాత్ర పొనర్తు నార్తుఁడన్
గురుతరదుఃఖపంకమునఁ ♦ గూలితి సోలితి నాలితో నిటన్. 148

వ. అని మఱియును. 149

తే. సుదతి విను నాహితోక్తు లీ ♦ య్యది విదర్భ, కిది యవంతికిఁ గోసల ♦ కిద్ది దక్షి
ణాపథంబున కిద్ది విం ♦ ధ్యమున కిద్ది, తెఱువు లివి యన్నియును వీనిఁ ♦ దెలిసి కొనుము.

వ. అని మాటికి నార్తుం డై పలికిన నులికిపడి దమయంతి డగ్గుత్తిక వెట్టి పతి కిట్లనియె.

చ. అకట కటా మదీయహృద ♦ యం బిది చీల్చెడునట్లు యయ్యె నీ
వికృతవచఃప్రసంగతుల ♦ వేగితిఁ గూటికి కాక యిట్లు గు
డ్డకుఁ జెడి కాననంబున బ ♦ డల్పడుని న్నిటు పాసి పోవ మా
మకమన మిచ్చగించునె శ్ర ♦ మం బని యెంచునె జీవితేశ్వరా. 152

తే. †వనములం దుండి శ్రాంతుఁడై ♦ వనటఁ గుందు, పతిని బాయక యుండిన ♦ సతి తదీయ
విక్లమం బెల్లఁ బోకార్చి ♦ విరతిఁ గూర్చుఁ, దలఁప సతికన్నఁ జుట్టంబు ♦ గలదె పతికి.

క. విను మఖిలదుఃఖరోగా, ర్తునకుం బరమౌషధంబు ♦ సుతమతి యగుచుం
జనుభార్య యని వచించిరి, మునితుల్యులు వైద్యు లెల్ల ♦ మును జననాథా. 154

వ. అని పలికిన నలుం డిట్లనియె. 155

తే. తన్వి నీమాట తథ్యంబు ♦ ధరణిలోన, నార్తుఁ డై యున్నవానికి ♦ నాలుఁ బోలు
మిత్ర మౌషధమును లేవు ♦ మేను విడిన, విడుతునే కాని విడుతునే ♦ వెలఁది నిన్ను.

ఉ. నా దమయంతి యిట్లనియె ♦ నాథ నను న్విడనాడు నిచ్చ లో
లే దను దేని మార్గముల ♦ లెక్క వచింపఁగ నేటి కట్లు కా
దేదియొ కల్గెఁ గావునని ♦ యిట్లు గణించితి నంచు లోన నెం
తో దయివారుచున్నయది ♦ దుఃఖ మకారణజాయమాన మై. 157

క. అది గాక నాదుబంధుల, సదనంబున కరుగు మనెడి ♦ సద్భావమయే
సదమలమతి యిరువుర మరు,గుద మట మాతండ్రి యరసి ♦ కొను మనల దయన్.

---

* దయ్యపుంజెయిది = దైవకృత్యము. † విక్లమము = ఆయాసము.

తరువోజ. అనిన నలుండను ♦ నతివ నారాజ్య♦మలవిదర్భునిరాజ్య ♦ మరయ నొక్కటియ
యనఁ దగుఁ గాని ము ♦ న్నుచటికి నే మ♦హావిభవంబున ♦ నరిగియు నిప్డు
ధనవిహీనుండ నై ♦ దైన్యంబుతో ము♦దం బఱి పోయి త♦ద్బంధుజనాళిఁ
గనుఁగొన నోప నో♦శమలాయతాక్షి ♦ కరము చింతిలకు మి♦క్కరణిఁ జిత్తమున.

వ. *అని నలుండు వైదర్భి నాశ్వాసించి పలుకుచు దానికట్టినపుట్టంబున సగంబు దానును గట్టుకొనియె నట్లు వారేకవస్త్రసంవీతులును క్షుత్పిపాసాపరిశ్రాంతులు నై యిట్టట్టు మెట్టుచు నమ్మహారణ్యంబున నొక్కచో నొక్కసభం గని యందుఁ బరాగపటలపరీవృతాంగులై కడుంగడుఁ బలవించుచు ధరణీతలంబునం బండి నిద్రవోయి రంతఁ గొంతవడికి దుఃఖోన్మథితచిత్తుం డగుట నారాజసత్తముండు గాఢనిద్రావశంబునం బడి యొడ లెఱుంగక శయనించి యున్న ప్రాణేశ్వరిం గాంచి రాజ్యాపహరణసుహృత్త్యాగవనవాసాదులం దలంచుకొని చింతించుచుఁ దనమనంబున. 160

నలుఁడు దమయంతిం బెడఁబాసిపోవుట.

ఉ. అక్కట నాకుఁ గూర్చుపర♦మామలగాత్రి నరేంద్రపుత్త్రి తా
నిక్కరణి న్వగం బొగులు ♦ నెంతయుఁ జింతలు దీనిఁ గూడి నే
నిక్కడ నుండ నోప మఱి ♦ యెక్కడికేనియుఁ బోవ నోప నే
చక్కి మెలంగువాఁడ సతి♦జాడ గనుంగొన దుఃఖ మయ్యెడిన్. 161

క. స్వజనత్యాగము మేలో, నిజమరణము మేలొ యెట్లు ♦ నేఁ జేసినచో
వృజినంబు లేకయుండునొ, నిజ మారయ లేక యుంటి ♦ నెమ్మనమందున్. 162

చ. నను విడనాడెనేని యెల♦నాఁగ నిజాప్తులఁ జేరు నట్టులే
నను విడనాడకుండిన వ♦నంబులఁ జెన్వగ లందు నిక్కువం
బని బహురీతుల న్మనము♦నందు విచారము చేసి చేసి దీ
నిని విడుటొప్పునంచ తఁడు ♦ నిశ్చయముం బొనరించెఁ బిమ్మటన్. 163

తే. కలిసమావిష్టుఁ డగునతం ♦ డలరుఁబోఁడి, విడిచి పోవఁగ నమకట్టి ♦ వెలఁదిమిన్న
కట్టుపుట్టమ తనకును ♦ గట్టుపుట్ట, మగుట నడిమికి ఖండింప ♦ నాత్మ నెంచి. 164

వ. *దమయంతి మేలుకొనకుండ నే నెట్లీవస్త్రావకర్తనంబు సేయుదునో యని సభాభవనంబు నలుగడం బరికించి యొక్కచో నొక్కయొఱలేనిఖడ్గంబు పడియుండం దాని నందుకొని తద్ధారాగ్రంబున వస్త్రార్ధం బుత్తరించి నివృత్తవ్యాదయుండై వెడలి కొండొకచని మగిడివచ్చి నిద్రించుదానిం జూచి శోకించుచు. 165

* సభ యేమి యనఁగా నరణ్యమార్గమందు బాటసారులకుఁగా నందందు ధర్మశాలలు కట్టుదు రనియుఁ నట్టిదియే యిది యనియు నూహింప నగు.



తే. ఎండకన్నును వానకె ♦ న్నెఱుఁగకుండ, నంతిపురముల నుండునీ♦యతివమిన్న
యిట్లనాథవలె న్నిరు ♦ లెడల నేల, నొదె లెఱుంగక నిద్రించు♦చుండె నకట. 166

చ. చినిఁగినచీర మేల్కొని న♦చేడియకంటఁ బడంగ వెంగమై
దనమది నెంత చింతిలునొ ♦ తామరసేక్షణ నన్నుఁ గాన కీ
వ్వనమున నెట్టు లుండునొకొ ♦ వాచవి కాదొ మృగాళి కియ్యెడన్
గనుఁగొనునాకు నశ్రువులు ♦ కాలువఁగట్టఁగ సాగెనయ్యయో. 167

వ. అక్కొమఱియు నిట్లు ఘోరారణ్యంబునం బడియున్న దీని నాదిత్యులు నశ్వులు విశ్వేదేవతలు మరుద్గణంబు లేప్రొద్దు రక్షించుచుండురుగాత మని దీవించి దేవరించుచుఁ గలిసమావృతజ్ఞానుండై నైషధుండు. 168

చ. విడివడి కొంతదవ్వు చని ♦ వెండియు వచ్చి సభాస్థలంబునన్
పడఁతిని జూచి దుఃఖమున ♦ మానక యుండి యొకింతసేపు పై
వెడలియు వెండి వచ్చియును ♦ వీఁగుమనం బది రెంటిపాయలై
నడవ నరేంద్రుఁ డుయ్యెల య♦నం దలపోయఁగ నయ్యె నయ్యెడన్. 169

వ. ఎట్టకేలకుం గల్యపకృష్టుం డగుటం జేసి తెంపుచేసికొని నలుండు దైన్యంబు దోఁపనున్న దమయంతి నాశూన్యవనంబునం దిగవిడిచి చనియె నంత దమయంతి కొంతవడికి మేలుకొని నలుగడం గలయఁ బరికించి మగనిం గానక శోకవ్యాకులితచిత్తయై మిగుల వగల్లం బొగులుచు నుచ్చస్వరంబున. 170

దమయంతి దుఃఖించుచు నేకాకి యై వనంబులఁ గ్రుమ్మరుట.

సీ. హా నాథ హా నాథ ♦ హా జీవితేశ్వర, ననుఁ బాసి పోవుట ♦ న్యాయ మటవె
నాబహిఃప్రాణమా ♦ నను విడనాడి పో, నెట్లు కాళ్లాడెనో ♦ యెఱుఁగఁ జెపుమ
నినుఁ బాసి యే నొక్క ♦ నిమిషమాత్రం బైన, నెమ్మినఁ బ్రాణముల్ ♦ నిలుపఁ జాల
విడువ నోడకు మని ♦ నుడివి సత్యం బది, పోకార్చితే యిట్లు ♦ పూజ్యచరిత

ఆ. నిదురవోవునన్ను ♦ నెఱి మీఱి ఘోరాటవిని మృగాళిఁ బడఁగ ♦ విడిచి పోతి
వకట నష్ట నైతి ♦ నతిభీతి కైతిఁ బ్రచ్చితి నయో యిఁక నేమి ♦ సేయుదాన. 171

క. బలవన్మరణము తగ దని, పలికిరి మునివరులు డాన ♦ ప్రాణములు విడన్
దలఁచియుఁ దలఁకితి లేకున్న లలి న్విడకుండుదాన ♦ నాకాయంబున్. 172

మ. †పరిహాసంబునఁ జేసి మాటికిని న♦న్బాటించి వీక్షించుచున్
సరసన్ గుల్మములందు డాఁగి పగలన్ ♦ వర్తింతువో కాని నా

† గుల్మములు = పొదలు.

కరయఁగ రాని భయంబు దుఃఖమును హె ♦ చ్చయ్యెఁగ భరింపంగ లే
నరవిందేక్షణ దర్శనం బొసఁగి న ♦ న్నాలించి పాలింపవే. 178

తే. లోకపాలురకడ నీవు ♦ నాకుఁ గూర్చి, వాకొనినవారు లెల్ల లో ♦ కైకనాథ
సత్యములు గాఁగఁ జేయ నీ ♦ స్వాంతమందుఁ, దలఁపుమిపుడెంత యేనియు ♦ దయదలిర్ప.

తే. ఇట్లు పడునన్ను నౌదార్య ♦ మేని వచ్చి, నాకు శోకింప నీతయు ♦ నీకయి కడు
నాగిలి శోకింతు నాఁకటఁ దగిలి నన్నుఁ, గూడ కెటు పఱవింతువో ♦ క్కో యటంచు.

వ. అని శోకార్తయై విలపించుచు నిలువ నోప కిలం బడుచు లేచుచు నిట్టట్టు మెట్టుచు నిట్టూర్పు పుచ్చుచు నార్చుచు నేడ్చుచు నలయుచు సొలయుచు దిక్కులు సూచుచు నదరుచు బెదరుచు సంచలించుచు తమ కట్టెయిక్కట్టు దెచ్చిపెట్టినకట్టిఁడులం దిట్టుచు బిట్టు ప్రలాపించుచు శార్దూలాదిదుష్టసత్త్వసేవితం బగునమ్మహారణ్యంబున నిందు నందుఁ బతి నన్వేషించుచు నున్మత్తవలె సంచలించుచుండె నాసమయంబున.

తే. ఒడ లెఱుంగక తొట్రుపా ♦ టడర వచ్చి, తనదుచెంగట మెట్టెడు ♦ దాని నరసి
సరభసంబునఁ బట్టె క్షు ♦ ద్భరము మెండు,కొన మహాకాయ మగునొక ♦ కొండచిలువ.

వ. అట్లు తన్నుఁ బట్టుకొనినం బట్టు తప్పించుకొన నేర కాపువ్వుంబోఁడి కరం బాక్రోశించుచు. 178

ఉ. ‡దిక్కిసుమంత లేక యిటు ♦ దేవురుగొట్టన మెట్టుచున్నన
న్నిక్కడ ముక్కలీఁ డగుచు ♦ నీపెనుఁబాము గ్రసించె నక్కటా
యెక్కడి కేగినాఁడవో హృ ♦ దీశ్వర నన్విడి నేగి యయ్యొ నీ
వక్కటికంబునం గదియ ♦ నై హృదయేశ్వరి నన్నుఁ గావవే. 179

తరువోజ. †అని వగచుచునున్న ♦ యవసరమందు ♦ నటకుమృగవ్యాధుఁ ♦ డరుదెంచి యొకఁడు
ఘనభుజంగముముఖ ♦ గహ్వరమందుఁ ♦ గ్రాలెడుదమయంతిఁ ♦ గని వేగిరించి
తనచేసురియ నోటి ♦ దరినుండి వ్రయ్యఁ ♦ దఱిగి దాసరిపాముఁ ♦ దడయక చంపి
వనజాక్షి వెడలించి ♦ వనముల సర్ప ♦ వదనస్థితం బైన ♦ వర్ష్మంబు గడిగి. 180

వ. వన్యంబు లాహారంబుగా నొసంగి దమయంతి నూఱడించి యిట్లనియె. 181

దమయంతిశాపంబునఁ గిరాతుండు చచ్చుట.

ఉ. ఎవ్వతె వీవు ఘోరవన ♦ మివ్వన నెవ్వగఁ జేరఁ గల్గి తీ
వివ్వెఱ కేమి కారణము ♦ నీరజలోచన చెప్పు మన్న నా
యవ్వ నిజప్రవృత్తి మది ♦ యంతయుఁ దా మృదులస్వరంబుతో
నవ్వనచారికిం దెలియ ♦ నానతియిచ్చె యథాక్రమంబునన్. 182

‡ దేవురుగొట్టు = దీనురాలు; ముక్కలీఁడు = ముష్కరుఁడు. † దాసరిపాము = కొండచిలువ.



తే. అట్లు చెప్పిన విని మృగ ♦ వ్యాధుఁ డర్ధ,వస్త్రసంవీతఁ బీనసం ♦ వర్తులస్త
నాఢ్య సుశ్రోణిఁ జంద్రని ♦ భాస్య సుంద,రాంగిఁ గని కామశరవిద్ధుఁ ♦ డై తపించి. 183

వ. మృదుమధురవచనంబుల నామె ననునయించి తనమనోరథం బెఱిఁగించి చెనకం జూచుటయు నంతలో నగ్నిశిఖయుంబోలె నంట శక్యంబు గాక వెలుంగుచు నమ్మహాపతివ్రత మహామర్షంబున. 184

తే. నైషధునిఁ గాక యొరుని మ ♦ నంబునందుఁ, దలఁప కుండినదాననై ♦ నిలుతునేని
తోన మృగజీవనుఁడు వీఁడు ♦ మేనువిడుచుఁ,గాక దుర్బుద్ధిఁ గొనియున్న ♦ కారణమున.

క. అని పలికినంతమాత్రం,బున దావానలవిదగ్ధ ♦ భూరుహమువలెం
దనువునఁ బొగ లెగయఁగ న,వ్వనచరుఁడు గతాసు వగుచు ♦ వసుధం బడియెన్. 186

వ. అంత నాదమయంతి సింహశార్దూలాదిదుష్టసత్త్వసమేతంబును నానావిధపక్షిగణాకీర్ణంబును మ్లేచ్ఛతస్కరసేవితంబును సాలవేణుధరాశ్వత్థతిందుకార్జునాదివివిధవృక్షసంఛన్నంబును ధాతుశతసద్ధభూధరాంచితంబును మహోన్నతనికుంజపుంజరంజితంబును నదీనదసరస్తటాకవాపీకూపశతసహస్రశోభితంబును పిశాచోరగరాక్షససమూహసమావృతంబును నగునమ్మహావనంబు భర్తృవ్యసనపీడితయై ప్రవేశించి భయం బిసుమంతయు నంతరంగంబునం దొరయనీయక నిజాధినాథు నన్వేషించుచు శరీరపారవశ్యంబున నగపడినవాని నెల్ల నడిగికొనుచుం బోయి పోయి యొక్కచో నొక్కశిలాతలం బాశ్రయించి మగని నుద్దేశించి దుఃఖించుచు. 187

ఉ. ఎక్కడి కేగితో యిహృ ♦ దయేశ్వర నన్విడనాడి యివ్వనిన్
మిక్కిలి జన్నము ల్సలిపి ♦ మిథ్య వహించుట నీకుఁ బాడి గా
దక్కట నాసమక్షమున ♦ నాసురవర్యులు వించునుండ నీ
వక్కటికంబున న్నుడివి ♦ నట్టినుడుల్ స్మరియింప నొప్పదే. 188

క. ధర సాంగోపాంగసవి,స్తరవేదచతుష్టయంబుఁ ♦ జదువుటకంటెన్
వర మొక్కసత్యవాక్యము, పరిపాలించుట యటంచుఁ ♦ బలికిరి మౌనుల్. 189

చ. పిలిచినఁ బల్కవే మయయొ ♦ భీషణమై వివృతాస్యమై మహో
జ్జ్వలగతి మృత్యువో యనఁగ ♦ వచ్చి భుజించెడు నన్మృగేంద్ర మోఁ
కలిగొని యుండె నీదయకుఁ ♦ గాఁ గలదానన యేని నీవు నా
వెలలెడుప్రాణము న్నిలుప ♦ వే పఱతెంచి నరేంద్రచంద్రమా. 190

సీ. నినుఁ గాక వేఱొక్క ♦ నెలఁతఁ బ్రేమింప న,న్పలుకు సత్యము సేయఁ ♦ దలఁపు మీశ
చిక్కి వివర్ణనై ♦ పొక్కుచుం బిలిచినఁ, బలుక వేటికి మాఱు ♦ సలలితాత్మ

యూథనాథుని విడి ♦ యున్నకరిణివోలె, వగచున న్నేలవో ♦ వసుమతీశ
యాఘోరవనములో ♦ నెందును వెదకియుఁ, జూడ లే నైతి నిన్ ♦ సుందరాంగ
తే.*వనులఁ బడి పోయె నైషధా♦వనివిభుండు,వానిఁ గనుఁగొంటిరే యని ♦ వేని నడుగ
వేఁడు గనుఁగొంటి నని నాకు♦వేడ్క మీఱ, మార్వలుకనుండునో యిట ♦ మానవేంద్ర.

వ. అని ప్రలపించుచుం గదలిపోవునామె కమ్మార్గమధ్యంబునఁ జతుర్దంష్ట్రింబును మహోగ్రంబు నగునొక్కవ్యాఘ్రం బెదురుపడి లోచనగోచరం బగుడు వగవ కామె నిశ్శంకంబుగా దానిచెంతకుఁ జని యిట్లనియె. 192

ఉ. నీవు మృగాధినాథుఁడవు ♦ నీకు నరణ్యమునం బ్రభుత్వ మోఁ
గావున వేఁడుచుంటి నను ♦ గావుము నేను విదర్భరాట్పుత్రిన్
దేవసముండు నైషధుఁ డ♦నింద్యచరిత్రుఁడు నామనఃప్రియుం
డీవనిఁ దప్పిపోయె నట♦నేఁ బొడగంటివ యోవనేశ్వరా. 193

క. నలుజాడఁ దెలిసితేనియుఁ, దెలిపి ననుం బ్రోవు మట్లు ♦ తెలియనిచో నో
పులిరాజ నీదునోటన్, నిలువం జేకొనుము నన్ను ♦ నెగు లిది తీఱన్. 194

క. అని యంతఁ బోవ కట నొక,ధునిఁ గని దమయంతి చింత♦తో నోస్రోత
స్విని నన్నుఁ దేర్పవేనియు, నినుఁ జేరెద నింతలోన ♦ నే దెగువమెయిన్. 195

వ. అని మఱియు నానాధాతుసమాకీర్ణంబును బహుశృంగసమంచితంబును వివిధమృగవిహంగమసంకులంబును దరుగుల్మలతావితానవిరాజితంబు నగుశిలోచ్చయంబుఁ గని దాని నుద్దేశించి యి ట్లనియె. 196

సీ. భూధరేశ్వర నే న♦మోవాక మొనరించి, సేవింతు నను దయఁ ♦ జిత్తగింపు
మే రాజపుత్రిక ♦ భూరమణుం డైన,నానాథుఁ డెంతయే ♦ నలువు మీఱి
తేజమైఁ గావించె ♦ రాజసూయాశ్వమే,ధాధ్వరములు సుర ♦ లచ్చెరువడ
నిషధేశ్వరుం డయి ♦ నెఱి గన్నవీరసే,నుం డెన్న నాశ్వాసు♦రుండు సువ్వ
తే. దైవబల మింత తప్పట ♦ ధరణి వీడి, వనులఁ బడి భర్తఁ గానక ♦ వనటఁ గుందు
చుంటి నలచక్రవర్తిని ♦ గంటివేని, తెలియ నానతియిచ్చి నన్ ♦ దేర్పు మిపుడు.

దమయంతి పరిభ్రమించుచు నొకచోఁ గొందఱుఋషులం గాంచుట.

వ. అని యర్థించి పలికి వైదర్భి నిర్భయంబున నుత్తరదిశాభిముఖయై మూఁడహోరాత్రంబులు నడిచి ముందట నొక్కతాపసారణ్యంబున. 198

ఉ.‡ఆకు లలంబులుం జలము ♦ లాశుగముం దమ కెల్లవేళలం
ద్రాఁకలి దీర్పఁగోఁ దగిన♦యట్టివ యై చనఁ గృత్తివాసులై

* వేఁడు = ఎన్నఁడు. ‡ ఆశుగము = గాలి; కృత్తివాసులు = తోలు దాల్చినవారు.



వీకఁ దపం బొనర్చుచును ♦ వెల్గుమునీంద్రులపావనాశ్రమం
బాకమలాయతాక్షి గనె ♦ నచ్చట నచ్చెరువాటు దోఁపఁగన్. 199

వ. అందు వసిష్ఠవామదేవాత్రిభృగునదృశు లగుమహామునికులాధ్యక్షులం గాంచి సమీపించి నమస్కరించి వినయవినమితోత్తమాంగయై నిలిచియున్నం గని మునివర్యులు స్వాగతంబులు వలుకుచుఁ గూర్చుండం జేసి యథోచితాపచితుల నామెం బూజించి యి ట్లనిరి. 200

చ. ఎవతెవు తల్లి నీ విటకు ♦ నేటికి వచ్చితి నీతనుద్యుతుల్
దివి భువి నిండె మాదృశుల♦దృష్టులకు న్మిఱుమిట్లు గొల్పెఁ జె
ప్పవె వనదేవివో తలఁపఁ ♦ బర్వతదేవివొ లేక వారిదే
వివొ తలపోయ మాహృదయ♦వీథుల విస్మయ మావహిల్లెడిన్. 201

ఉ. నా నలపత్ని మానుల ఘ♦నం బగుభక్తి భజించి యి ట్లనున్
నే నిపు డీరు పల్కినటు ♦ నిక్కము దేవతఁ గాను మానవిం
గాని వినుండు చెప్పెద న♦ఖండపరాక్రమశాలియై జగ
న్మాన్యుఁడు నైన నైషధుఁడు ♦ మామకజీవితనాథుఁ డారయన్. 202

ఆ.*అతఁడు దేవనమున ♦ నఖిలరాజ్యముఁ గోలు,పోయి నన్నుఁ గూడి ♦ పొలములందు
మెలఁగ వచ్చి యిపుడు ♦ తొలఁగి పోయెను వాని,వలను వెదకుచుంటి ♦ వగచి వగచి.

మానిని. ఓమునినాయకులార భవద్వన ♦ ముత్తముఁ డానృపసత్తముఁ డెం
తే ముద మావహిలం గనునిచ్చమె♦యిం జనుదెంచెనొకో కరుణా
భూముల రై వచియింపుఁడు మ్రొక్కెదఁ ♦ బుణ్యచరిత్రు నలుం గన కే
నీమెయి కొన్నిదినంబులలో విడి ♦ యిం పొడఁగూరుతు నాత్మ కొగిన్. 204

వ. అని ప్రలపించుదమయంతిం జూచి తాపసోత్తము లి ట్లనిరి. 205

ఉ. రాఁ గలకాల మెంతయు వ♦రం బయి యొప్పును మీకు మాతపో
యోగమునం గ్రహించితి మ♦యోగ్యనిషాదనుఁ డానలుండు ప్ర
జ్ఞాగరిమన్ రిపుం దఱిమి ♦ సౌఖ్యగతి న్నిజరాజ్యమందు నీ
లోఁ గన నయ్యెడున్ సకల♦లోకనుతంబుగఁ దొంటివైఖరిన్. 206

తే. అనుచు దమయంతినిం బల్కి ♦ మునివరేణ్యు,లరయుచుండ నంతర్హితు ♦ లైరి వారు
సాగ్నిహోత్రవరాశ్రము ♦ లగుచు నమ్మ,హామహత్వము గని విస్మితాత్మయగుచు.

క. దమయంతి తనమనంబున, నమితాశ్చర్యంబు నొంది ♦ హా హా యిది ని
క్కముగాఁ గల యగుఁ గాదే, నమలాశ్రమ మేది పూజ్య ♦ లగుమును లేరీ. 208

* దేవనము = జూదము.

వ.*అని చింతాకులస్వాంత యై దమయంతి కొండొకచోటికిం జని యట నొకపుష్పితా శోకానోకహంబుం గని శోకించుచు. 209

చ. వనముల మెట్టుట న్మిగుల ♦ వాడినవాఁ డొకచీరలోసగం
బునె మొలఁ జుట్టఁ బెట్టుకొని ♦ పోయెడివాఁడు మహామనోవ్యథన్
గనుఁగవ నశ్రుబిందువులు ♦ గ్రమ్మఁ జరించెడువాఁడు నేఁడు ని
న్గనుఁగొన రాఁడుగా తెలిపి ♦ నావెతఁ దీర్పవె వృక్షరాజమా. 210

దమయంతి వనంబులో నొక్కచనుపం గాంచుట.

వ.†అని వలగొని కదలి యనేకపర్వతంబులు ననేకవనంబులు ననేకసరిద్వరంబులు దాఁటి పోయి పోయి ముందట హస్త్యశ్వరథసంకులం బగునొక్కసార్థంబుఁ గని సమీపించిన నందలిజనంబు ధూళిధూసరితశిరోరుహయు నేకవస్త్రార్ధసంవృతయుఁ గృశీభూత శరీరయు వివర్ణయు నై పిచ్చిదానిమచ్చున వచ్చునచ్చిగురుఁబోఁడిం గని. 211

ఉ. కొందఱు పాఱి రార్తు లయి ♦ కొందఱు చింతిలి రెంతయేనియుం
గొందఱు భీతులై పడిరి ♦ కొందఱు పొందిరి ద్వేషభావముం
గొందఱు నిందచేసి రెదఁ ♦ గొందఱు చేతులు తట్టి రార్చుచుం
గొందఱు కేరుచు న్నగిరి ♦ కొందఱు పిల్చిరి గారవంబునన్. 212

తే. ఏమి రోయుచు నుంటి వో ♦ యింతి నీ వెవర్తు వేటికి వచ్చి తీ ♦ వాసిదాన
వరయ మానిసివా? విపి ♦ నాధిదేవతవ? నిజము సెప్పు మనిరి కొం ♦ దఱు భజించి.

మ. మఱియుం గొందఱు భక్తితత్పరత నా ♦ మానాన్యాకృతిం జూచి య
క్కఱ దీరన్ వినుతించి నీ వమరివో ♦ గంధర్వివో యక్షివో
నెఱి మీఱ న్వెలుఁగొందుచుంటివి నినున్ ♦ సేవింతు మే మెప్పుడున్
జెఱుపుం జేయకయుండ మాచనువ ర ♦ క్షింపంగదే తల్లిగో. 214

వ.‡అని యందఱు నన్నిచందంబులం బడి ప్రవర్తించుచుండ భర్తృవ్యసనపీడిత యగున బ్బాల బాలవృద్ధాదిసమృద్ధం బగుసార్థంబును సార్థవాహులం జూచి మెల్లన ని ట్లనియె. 215

ఉ. మానవి నే నలుం డనెడు ♦ మానవనాథునిపత్ని భీమభూ
జానికి నాత్మజన్ వినుఁడు ♦ సార్థజనేశ్వరులార! నావిభుం
డైనయతండు రాజ్యవిభ ♦ వాదికము న్విడి వచ్చి న న్నిటం
గానలపాలు చేసి చనెఁ ♦ గాంచితిరే నెఱిఁగింపుఁడీ దయన్. 216

* అనోకహము = వృక్షము. † సార్థంబు = బిడారు, చమరు.
‡ సార్థవాహుఁడు = వర్తకుఁడు



తే. అనుడు శుచి యనుసార్థవా ♦ హాధినాథుఁ, డామె కి ట్లను నలు నివ్వ ♦ నాంతరమునఁ
గాన నెప్పుడుఁ గాంతు సిం ♦ గములఁ బులుల, నెలుఁగులం గారుదున్నల ♦ నేనుఁగులను.

క. నినుఁ గాక యొక్కమానిసిఁ, గనుఁగొన నిక్కానలోనఁ ♦ గటికిపిశాచం
బని జడియుమమ్ము దీనుల, మనుచున్ యక్షేశ్వరుండు ♦ మణిభద్రుఁ డీకన్. 218

తే. అనుడు నాబిడ మీబిడా ♦ రరుగు నెచటి, కని సుబాహునిచేదిరా ♦ జ్యమున కనుచుఁ
దెలిసి భర్తృలాలస యయి ♦ తలఁపు దెలిపి, యనుమతిం గొని వారితో ♦ నరిగెఁ దాను.

చ. చనుపయిఁ గొన్నినా ళ్లడవి ♦ చక్కిఁ బ్రయాణము చేసి యొక్కచో
వనజసుగంధబంధురము ♦ స్వాదుసుశీతలవారిపూర మై
ఘనతర మైనచె ర్వొకఁడు ♦ గాంచి బడల్పడి యుంట దానికిన్
వెనుకటిదిక్కున న్విడిసె ♦ వేడ్క మెయిన్ శుచినామునానతిన్. 220

ఉ. అంతట నర్ధరాత్రసమ ♦ యంబున సార్థము నిద్రవోయి వి
శ్రాంతి వహించి యుండ నట ♦ సాంద్రతమంబున కెత్తువచ్చి దు
ర్దాంతదురంతవేగమున ♦ దంతిసమూహము దప్పిఁ జెంది త
త్ప్రాంతమునుండి వచ్చె మద ♦ ధార లవారిగఁ గాఱుచుండఁగన్. 221

తే.*ఇట్లు పఱతెంచి వన్యమ ♦ దేభయూథ, మట మెలంగెడు గ్రామ్యగ ♦ జాళిఁ జూచి
ఘీంకరించుచుఁ బైఁబడి ♦ క్రేళ్ళుదాఁటి, వడివడిగఁ దాఁకి కసుఁ జందు ♦ వందు చేసె.

క. కరిఘటలు కరుల నరులన్, బరిజనులం బశుల శిశుల ♦ బహుళోష్ట్రములన్
బరిపరివిధములఁ గూల్చినఁ, బర పై పె ల్లెగసె నడరి ♦ భయదారవముల్. 223

వ. అప్పుడు. 224

మ.‡పదసమ్మర్దితు లై కరాభిహతు లై ♦ బాఢోగ్రదంతస్ఫుట
త్పదహస్తోరుకపాలఫాలశిరు లై ♦ పంచత్వముం బొంది ర
ప్పదమందుం గలవారు కొందఱు విప ♦ త్పాథోధిమగ్నాత్ము లై
మదధారాపరిషిక్తభూతలమహా ♦ మాతంగజాతోద్ధతిన్. 225

తే. సాధ్వసంబున నగురభ ♦ సమునఁ జేసి, పఱచి చెట్లెక్కి కొ లూఁదఁ ♦ బడమిఁ బుడమి
గొరగి చచ్చిరి కొంద ఱొం ♦ డొరులఁ దాఁకి, కొనుట నఱచుచుఁ ద్రెళ్ళిరి ♦ కొంద ఱవని.

వ. ఇట్లాబిడా రంతయు నంత మైనం గని దమయంతి చింతాకులస్వాంత యై తనదురదృష్టంబునకుఁ బరిపరివిధంబులం బరిదేవనంబు సేయుచుండ నమ్మహాపద్ప్రవంబునం బడక తప్పినకొందఱు. 227

* క్రేళ్లుదాఁటి = ఎగిరిపడి.
‡ మాతంగము = ఏనుఁగు.

సీ. బంధుజనంబును ♦ బహుధనంబును నేల,పా లయ్యె నయ్యయో ♦ బంధులార
తననాథు మణిభద్రు ♦ మనము పూజింపక, వనముఁ జొఱుట నిట్టి♦వనట వచ్చెఁ
దొలుదొల్త విఘ్నక♦ర్తలకు మ్రొక్కనితప్పు, గురుతరమై యిట్లు ♦ పరిణమించెఁ
గదలునప్పుడు మన♦గ్రహచారమునకుఁ దో, డపశకునములు మెం ♦ డయ్యె నేము
ఆ. రాచదాన నని పి♦శాచి యియ్యది వచ్చె, వచ్చినపుడె బీతు ♦ పెచ్చుపెఱిగె
నింతపాపమునకు ♦ నిదియ దీనిని మొత్తి, మిత్తి కిత్త మిపుడ ♦ మిడుక మిడుక.
వ. అంత దమయంతియు. 228
ఉ. దైవము క్రూరకర్మ మయి ♦ దాపర మయ్యె నయో తలంపఁగాఁ
జావఁ దలంచినట్టినను ♦ జంపక బంధులతో సుఖంబునం
బోవఁగ నున్నసార్థజన♦పుంగవులం గొని చంపె నింక నే
నేవిధి నెత్తిపైఁ బడిన♦నీవిపదంబుధి నీఁదుదాననో. 229
మ. ఎద నే నెవ్వరికిం దలంప నశుభం ♦ బీజన్మమం దెప్పుడే
నిది జన్మాంతరసంచితాఘఫల మిం♦తే కాసిచో నిట్టు లా
పదపై నాపద వచ్చునే కరులు చం♦పన్ రాఁ గూల్చెఁ గా కింత నా
కు దయం జూపిన నాత్మహత్యకును నేఁ ♦ గూడం గదా దైవమా. 230
తే. భర్తృరాజ్యాపహారణంబు ♦ బంధుజనప,రాజయము పతిపుత్త్రవి♦రహము గహన
వాస మురగగ్రహణము నీ♦వరుస వచ్చె, నాథు లే మందు హతవిధి ♦ కక్కట కట.
ఉ. విన్నటినాఁటినుండియును ♦ వేరునకే నినుమంతపాప మే
నెన్నఁడుఁ జేసియుండ నిది ♦ యింతయు సత్య మటంచు బాస నే
నెన్ని పొనర్తుఁ గాని త్రిద♦శేంద్రుల రోసి స్వయంవరంబునం
దు న్నలుని న్వరించినది ♦ దోసమ మై యిటు లయ్యెనో కటా. 232

దమయంతి సుబాహుపురంబుఁ జేరుట.

వ. అని పలవించుచు మించుఁబోఁడి మఱునాఁ డరుణోదయంబున హతశేషులతోఁ గదలి కతిపయప్రయాణంబులఁ జేదిపురంబునకుం జని సాయంసమయంబున. 233
ఉ.* గ్రాసము లేక గాసిపడి ♦ కౌనఁ గృశించి విముక్తకేశి యై
మాసినచీర గట్టుకొని ♦ మానతి వెంబరవిత్తువోలె నై
వేసర కాకతాయ లగు♦వేగురుకుఱ్ఱలు వెంబడింపఁగా
నాసకి రాచకొంకి తఱి♦యం జనుదెంచెఁ జలాచలాంగి యై. 234

* గ్రాసము = తిండి. రాచకొంకి = రాజధాని.



వ. అట్లు వచ్చుదమయంతిం జూచి ప్రాసాదగత యగురాజమాత ధాత్రిం బిలిచి యిట్లనియె. 235
మ. పురవీథిం జన మాఁగ వేఁగుచు నదే ♦ పూఁబోఁడి దుఃఖించుచున్
శరణు న్వేఁడుచు వచ్చుచున్నయది యు♦న్మత్తాకృతిం గ్రాలునిం
దిరయో నాఁ జనునీమెకల్మి నగళుల్ ♦ దీపించు నీ వేగి య
ప్పరివేష్టించినమూఁకఁ దోలి యిట కా♦పద్మాక్షిఁ దె మ్మర్మిలిన్. 236
వ. అని దానిచే దమయంతి నంతిపురంబునం గలతనప్రాసాదరాజంబునకుం దెప్పించి యిట్లనియె. 237
చ. సుగ మనుమాట లే కిటులు ♦ సోలియు జాలి మెలంగుసీ వహో
మొగులమఱుంగున న్మెఱుఁగు♦పోల్కిఁ గనంబడు దేరిదానవో
మగువ మనుష్యకాంతలకు ♦ మా నగునిట్టిసురూప ముండునే
తగు దొకదేవకాంత వన ♦ దాఁపక చెప్పుము నీసువృత్తమున్. 238
తే.* అనుడు వైదర్భి యిట్లను ♦ నమ్మ నేను, మానవిం గట్టువాల్గాతి ♦ మనెడునట్టి
దాన మగనాల గుణనిధి ♦ యైనవాఁడు,మగనికి న్నీడవలె నేను ♦ దగిలి యుందు.
వ. దైవోపహతుం డైననామగండు ద్యూతనిర్జితుండై వనంబులం బడిన నేను వాని నాశ్వాసించుచు ననుసరించి యుండ క్షుత్పిపాసాపరుం డగుట విమనస్కుం డగు నతం డొకనాఁ డొకమఱచి నిద్రించునన్ను విడిచి నడచి పోయె నే నాయేకవస్త్రార్ధధరు నాప్రాణప్రియు నన్వేషించుచుఁ గందమూలంబు లాహరించుచుఁ బ్రొద్దువోయినకడ నిద్రవోవుచు శార్దూలాదిదుష్టసత్వసమూహంబు సహాయంబుగా వనంబులం బడి వనటం బడితి నని కన్నీరు మున్నీ రయి పాఱ నార్తస్వరంబున నేడ్చుదమయంతి నూరార్చి రాజమాత వెండియు. 240
తే. నీపయిం బ్రేమ నా కయ్యె ♦ నెలఁత మిన్న, నీవు నాకడ నుండుము ♦ నీమగండు
నిందు నందును దిరిగి తా ♦ నిందు వచ్చుఁ, బురుషులం బుత్తు రాఁకున్న ♦ నరసి తేర.
తరువోజ. ‡అనిన వైదర్భి యి♦ట్లనియె నాసమయ♦మరయుమొంగిళులంట♦నంఘ్రిధావనము
పొనరింప నెపు డన్య♦పురుషులతోడ ♦ ముచ్చటింపను దుష్ట♦బుద్ధి నేఁ డైనఁ
గని కోర వానిని ♦ గసలి దండింపఁ♦గాఁ దగు నీకు నా♦కాంతుని రోయు
సనఘునిఁ గాంతు ని ♦ ట్లయిన నే నిచట ♦ నాఁగెదఁ గాకున్న ♦ నరిగెద నొంటు.
వ. అనుటయు రాజమాత నీవు నీవ్రతంబు లెల్ల సెల్ల నాకడ నుండు మేను నీ యిష్టప్రకారంబునం బ్రవర్తించెద నని తనకూఁతు సునంద యనుదానిం బిలిచి. 243

* గట్టువాలు = సైరంధ్రి. ‡ అంఘ్రిధావనము = కాళ్లు గడుగుట.

తే. దేవరూపిణి సైరంధ్రి ♦ దీనిఁ జూడు, మీఁదు జోడైన దగుటచే ♦ నిదియు నీవు
సఖులరై మోద మొందుఁడు ♦ సతత మనుచు, నామెతోడ సునంద తా ♦ ననఁగియుండె.

క. చెలికత్తెలు పూజింపఁగ, నలుదేవి సునందఁ గూడి ♦ నగళులయందున్
మెలఁగుచు నెట్టిసుఖంబును, దలఁపక నివసించె సువ్ర ♦ తపరాయణయై. 245

వ. అట నలుండును. 246

నలుఁడు కర్కోటకదష్టుం డగుట.

మ. *తరుణీరత్నముఁ బాసి కాఱడవిఁ జి ♦ త్తభ్రాంతిచే మెట్టుచుం
దరుగుల్మవ్రతతీవితానముల ను ♦ ద్యజ్జ్వాలలం గాల్చుచున్
సురమార్గంబున విస్ఫులింగములతో ♦ జొబ్బిల్లి త్రైలోక్యభీ
కరమై మండుదవానలంబుఁ గనియెం ♦ గట్టావడి న్ముందటన్. 247

క. కని రిచ్చపాటు దోఁపఁగ, జననాథుఁడు నిలిచియున్న ♦ సమయమునందున్
విన వచ్చె నతని కోనల, నన్నుఁ గన రమ్మనెడునార్త ♦ నాదం బరుదై. 248

ఉ. సారెకు నార్తనాద మది ♦ జానుగులం బడ నైషధుండు శోం
కారహితాత్ముఁడై యనల ♦ గర్భమునం జొఱఁ బాఱి భోరనం
గారునఁ జుట్ట చుట్టుకొని ♦ కాయ మపాయముగాఁ జలించి పో
నేరనినాగరాజు నొక ♦ నిం గని యోడకు మంచుఁ బల్కుచున్. 249

వ. తఱియ వచ్చిననాదమయంతీపతిం గని నమస్కరించి నాగరాజి ట్లనియె. 250

ఆ. ‡గహ్వరీశ నేను ♦ కర్కోటకుం డను, వాఁడ దేవమౌని ♦ వర్యుఁడైన
నారదునకు నెగ్గు ♦ నడపినకతన నాతఁడు శపించె నన్ను ♦ నెడఁదఁ గనలి. 251

వ. దానం జేసి నే నిట్లచలంబుం బోలె జలింప లేకున్నవాఁడ నీ డీయుపద్రవంబు గడవంగ నన్ను మఱొకచోటికిం గొనిపొమ్ము నేను నీకు సఖుండనై శ్రేయంబు సేయ నోపుదు నని యంగుష్ఠమాత్రగాత్రుం డగుటయు నలుండును. 252

సీ. కనికరంబున వానిఁ ♦ గరములఁ గైకొని, భయవర్జితం బైన ♦ బయలునందు
విడువ నెంచుటయు నాఁ ♦ డనువఁ డెడఁగి పల్కె, నడుగు లెన్నుకొనుచు ♦ నడువుమయ్య
నీ కట శ్రేయంబు ♦ చేకూరఁ జేసెద, నన నలుం డట్లెన్ను ♦ కొనుచు నడచె
ననుడు సర్పము దశ ♦ మపదంబున న్వాని, కాయంబుపై వడిఁ ♦ గాటు వైచెఁ

తే. గాటు వైచినమాత్ర న ♦ మ్మేటిమగఁడు, వికృతరూపము బొందిన ♦ విస్మితుఁ డయి
కొడికి కనుచుండునంతఁ గ ♦ ర్కోటకుండు, నాత్మరూపము గైకొని ♦ యనియె నిట్లు.

* సురమార్గము = ఆకాశము; విస్ఫులింగములు = మిడుఁగురులు. ‡ గహ్వరీశుఁడు = రాజు.



క. నిను నారు లెఱిఁగిన నెగ్గగు; నని నీరూపంబు వికృతి ♦ నందఁగఁ జేసి ని
ట్లొనరించినాఁడ వగవకు, జననాయక దీన లగ్గు ♦ సమకుఱు నీకున్. 254

సీ. ‡విను మెంతదనుక నీ ♦ తనువున నావిషం, బమరంగ నుండెడు ♦ నంతదనుకఁ
గలుగదు విషజంతు ♦ కలితభయంబును, యక్షరాక్షసపిశా ♦ చాదిభయము
విగ్రహంబుల శత్రు ♦ విజయంబుఁ గలిగెడు, జగమెల్ల నీకు వ ♦ శంబ యగును
బ్రహ్మబంధులు నిన్నుఁ ♦ బరిభవింపఁగ లేరు, దుఃఖభారం బెల్లఁ ♦ దొలఁగిపోవు

తే. బాహుకుం డను పేరున ♦ బరఁగి నీ వి, చటన కల దయోధ్యాపుర ♦ మటఁ జని ఋతు
పర్ణుఁ డనుపేరి నిక్ష్వాకు ♦ వంశభవుని, నాశ్రయింపుము నీ కిష్టుఁ ♦ డగు నతండు.

క. నీ కక్షహృదయ మిచ్చును, నా కువలయనాథుఁ డీవు ♦ నశ్వహృదయముం
జేకొన నాతని కిచ్చెద, వా కుంభినిపతి శుభంబు ♦ లొందెడు నిన్నున్. 256

వ. అవల నీకుఁ బుత్రమిత్రకళత్రసంగమంబును రాజ్యప్రాప్తియు నగు నీవు నీరూపంబు వొందం దలంచునాఁ డీవస్త్రంబును ధరించి నన్ను స్మరింపు మపుడ నీరూపంబు నీకు వచ్చు నని పలుకుచుఁ దనకడ నున్నదివ్యవాసోయుగం బతని కిచ్చి కర్కోటకుం డంతర్ధానంబు నొందె నంత నలుండును గదలి పదిదినంబుల కయోధ్యాపురంబునకుం జని ఋతుపర్ణుం గని యి ట్లనియె. 257

నలుఁడు ఋతుపర్ణ నాశ్రయించుట.

ఉ. బాహుకనామధేయుఁడను ♦ భార్గవతల్లజ వింటె నన్ను నే
వాహనశిక్షయందుఁ గడు ♦ వాసి మెలంగుదు సూతకృత్యమం
దేహరవాదియు న్నవతో ♦ కించుకయుం గొన రాఁడు నాకు సం
దేహము లేదు శిల్పములఁ ♦ దేఱినవాఁడ ననున్ భరింపుమా. 258

తే. అనుడు ఋతుపర్ణుఁ డను నోయి ♦ హయచయంబుఁ, దిద్ద నేర్తువయేని నా ♦ యొద్ద నుండు
మెను సూర్వరపాల నీ ♦ కిత్తు జీత, మశ్వయూథాధినాథుఁడ ♦ వగుము నీవు. 259

వ. ఈ వార్ష్ణేయజీవలులు నీకు సహకారు లగుచుండు రనిన నలుండు వల్లె యని ఋతుపర్ణునగరంబున నుండి కరంబు చింతాజ్వరసంతప్తచిత్తుండై దమయంతిం దలంచుకొని.

ఉ. అక్కట క్షుత్పిపాస[illegible]నై కను దట్టియరణ్యమందు నీ
వెక్కడి కేగితో మది [illegible]
దిక్కును మొక్క లేద[illegible] ♦ [illegible]
బొక్కుచునుంటివో [illegible] 261

‡ విగ్రహంబు = యుద్ధము. బ్రహ్మబంధులు = దూఱఁబడువారు. [illegible]

వ. అని ప్రతిసాయంసమయంబునందును నీపద్యంబు పఠించి పలవించుచున్న బాహుకుం జూచి యొక్కనాఁడు జీవలుండు నీ వెవ్వతికై వగచుచుంటి వనిన నతం డతని కిట్లనియె. 262

శా. మందప్రజ్ఞుఁ డొకండు ముగ్ధసతి ♦ మాసేదఁ గారోకానలో
నిం దగుడుం జరియించుచు న్విధివశ ♦ హెచ్చిల్లుమోహంబునన్
గుండెల్ డెందము డింద నిట్టు లది నా♦కున్ జ్ఞప్తికి న్వచ్చుటల్
సందేహింపక యివ్వ డత్తెఱఁగు లో♦ జర్చింతు నోజీవలా.

వ.‡ అని ప్రకారించి చెప్పి నలుం డాదమయంతికై పరితపించుచు నట నజ్ఞాతవాసంబు నడె నిట విదర్భేశ్వరుండును. 264

తే. కూఁతు నల్లుండు రాజ్యముఁ ♦ గోలుపోయి, వనులఁ బడి రని విని కుంది ♦ వారి రోయ
ద్విజవరులఁ బుచ్చె ధరఁ గల్గు ♦ దేశములకుఁ, బుష్కలంబుగ విత్తంబు ♦ మొత్త మిచ్చి.

వ. మఱియు నలదమయంతులజాడఁ జెప్పినవారికి వేయిగోవులును గనివచ్చినవారికి బదివేలగోవులును దోడితెచ్చినవారికి నగరసమ్మితంబు లగుకొన్ని గ్రామంబులు నిచ్చెద నని యనుపుటయును. 266

మ. ధరణీదేవకులావతంసములు మోదం బొప్ప విశ్వంభరన్
బురముల్ రాష్ట్రములున్ మహావనములున్ ♦ భూధ్రంబులున్ భూరిని
ర్ఝరిణుల్ దొట్టిసమస్తభూములును సం♦రంభంబున న్మెట్టి రా
వరకీర్తి న్నిషధాధినాథుని నలు ♦ న్వైదర్భినిన్ రోయుచున్. 267

సుదేవుఁ డనుబ్రాహ్మణుండు చేదిపురంబున దమయంతి నెఱుంగుట.

తే. అంతట సుదేవుఁ డనుద్విజుం ♦ డందు నిందు, నరయుచుం జేదిపురమున ♦ కరుగుదెంచి
రాచనగరునఁ బుణ్యాహ♦వాచనంబు, చేయఁబడుచుంట విని తానుఁ ♦ జేరి యచట.

వ. అంతిపురంబున సునందాసహిత యై యప్రతిమరూపసంపన్న యయ్యు ధూమజాలనిబద్ధం బై బృహద్భానుప్రభయుం బోలి మలిన యై కృశాంగి యై యున్న దమయంతిం జూచి తొల్లి చూచియున్నవాఁడ కాన దానిశుభలక్షణంబు లెల్లఁ బరీక్షించి కృతార్థుండ నైతి నని సంతసించుచు. 269

శా. రాకాచంద్రనిభాననప్రభఁ దమిస్రంబుం దొలంగించుచున్
నాకస్త్రీంగవకు న్మనంబునకు నానందంబు సంధించు నీ
లోకైకద్యుమ్నపవిత్రగాత్రి గరిమన్ ♦ లోకోత్తరం బై విద
ర్భాకాంతుం డగుభీమభూపతికిఁ బో♦ల్పన్ గర్భవాసం బగున్. 270

‡ ప్రకారించి—కప్పితప్పి.



వ. ఇప్పరమపతివ్రతావతంసం బిప్పుడు పతివిరహంబునం బరితపించునది యై జలోద్ధృతం బైనమృణాళియుం బోలె శుష్కస్రోతం బైననదియుం బోలె నీలాభ్రసంవృతం బైనచంద్రరేఖయుం బోలె శోభింపనేరక కృశాంగియు భోగవిహీనయుఁ బాంసుపటలచ్ఛన్నయు మలినవస్త్రధారిణియు దుఃఖస్వరూపిణియు నై భర్తృసందర్శనాపేక్షం జేసి దేహంబు ధరియించియున్న దని నిశ్చయించి. 271

చ. సతికి విభూషణంబు పతి ♦ సాధ్వి విభూషణ మెన్న భర్తకున్
బతి విడి పత్ని పత్ని విడి ♦ భర్తయునుం బ్రదుకంగ లే రిలన్
బతిఁ బెడఁబాయుట న్వగచు♦భామిని దీనిఁ గనుంగొనంగ నా
మతియుఁ దపించుచున్న దిఁక ♦ మానినిబంధులఁ జెప్ప నేటికిన్. 272

ఉ. ఎన్నఁడు గల్గునో వగ పి♦దేగుట లెన్నఁడు సౌఖ్య మబ్బునో
యెన్నఁడు వీరు రోహిణియు ♦ నిందుఁడునుంబలెఁ గూడి యుందురో
యెన్నఁడు రాజ్యమందు సుఖ♦యించెదువీరలఁ జూడఁ గందునో
యెన్నఁడు భీముడుం బ్రజయు ♦ నింతియు నెంతయు సంతసింతురో. 273

వ. దుఃఖార్త యై ధ్యానతత్పర యగుసీపూర్ణచంద్రముఖి నే నిపు డాశ్వాసింతుం గాక యని సుదేవుండు దమయంతిం దఱియ వచ్చి. 274

మానిని. నేను సుదేవుఁడ నాఁబడువాఁడను ♦ నీసయిదోడున కిష్టుఁడ నో
మానిని నీపితృనాజ్ఞను వచ్చితి ♦ మక్కువతో నిను రోయఁగ నీ
స్థానమునం గనుఁగొంటిని నీ దగు♦తల్లియుఁ దండ్రియు సోదరులున్
సూనులు సేమమునం గల రచ్చట ♦ శోక మొకం డగు నీకతనన్. 275

క. నిను రోయ బ్రాహ్మణోత్తము,లను నూర్లుగఁ బుచ్చె భూత♦లమునఁ దిరుగ నీ
జనకుం డం దొకఁడను నేఁ, గనుఁగొంటి న్నిన్ను మంచి♦కాలం బగుటన్. 276

వ. అనిన వాని నానవాలుపట్టి తనబంధువర్గంబులయు సుహృదులయుఁ గుశలం బడిగి బాష్పపూరితనయనయుగళ యై గోడున నేడువ సాగె నంత. 277

క. కన్నీ రురలఁగ నేడ్చెడు,నన్నారి సునంద చూచి ♦ యతిరభసమునన్
దన్నుం గన్నజనిత్రికి, నున్నట్లు వచించెఁ బోయి ♦ యుదిలకొని మదిన్. 278

రాజమాత దమయంతి నెఱింగి గారవించుట.

తే. చేదిపతిమాత యవుడు చెం♦చ్చెర గమించి, భైమి వసియించు చోటి కా♦భూమిసురుని
జేర రమ్మని పిలిచి పూ♦జించి పలికె, వినయవినమితగాత్రి యై ♦ వెలఁది జూపి.

తరళము. అనఘ యెవ్వనికూఁతు రెవ్వని♦యాలు బంధుల భర్త నెం
దునను బాసె నటే వెఱింగితి ♦ తోయజాననవృత్తమున్

విన్నగి నిన్ను డిం దెంతయు విస్మయంబున నా సుపర్ణిహితుండై
సునందను బ్రాహ్మణవర్యుఁ డాయమ ♦ గాంచి యిట్లనియెం దర్శనా. 280

తరువోజ. అతివరో విను విదర్భాధీశుఁ డనఘుఁ ♦ డగుభీమపుత్త్రి యీయమ వీరసేన
సుతుండు నలుం డనుక్షోణీశుపత్ని ♦ సుఖి దమయంతి యనఁ ♦ సుధతి విభుండు
హృతరాజ్యుఁ డై వని ♦ కేగినఁ దాను ♦ నేగె నాతనివెంట ♦ నిది భీముఁ డెల్లెఁగి
క్షితిసురులను బుచ్చె ♦ క్షితియెల్ల రోయఁ ♦ జెప్పి నే నిట వచ్చి ♦ చెలి దీనిఁ గంటి.

వ. ‡దీనిభ్రూమధ్యంబున మేఘచ్ఛన్నం బైనచంద్రబింబంబువలె మలినసంవృతం బై పద్మ సంకాశం బై శుభలక్షణలక్షితం బగుపిప్పువుం దిలకించి రాజపుత్త్రిగా నిర్ణయించు కొంటి నని మఱియును. 282

చ. సిరి గలపుట్టుమచ్చ యిది ♦ చేయఁబడె న్విధిచేత దీని కీ
ధరణితలంబునం గలుగు ♦ తామరసేక్షణ లెవ్వరేనియుం
బురు డనరాదు లచ్చి యనఁ ♦ బోలును రూపున నీమె ధూళిధూ
సరితశరీర యై నివురుచాటున నిప్పువలె న్వెలింగెడిన్. 283

వ. అనిన సునందయు రాజమాతయు నానందంబున దమయంతి నొసటం గలమలినంబు వోఁ దుడిచి పరిశోధించి యంబరంబునఁ జంద్రబింబంబువోలె నున్నపిప్పువుం గని కనినంత దానిం గౌఁగిలించుకొని రవుడు రాజమాత కంట నీరు వెట్టికొనుచు. 284

ఉ. †కూఁతుర వైతి వీ విపుడు ♦ కోమలి నేనును నీదుతల్లియున్
గూఁతుల మాదశార్ణములకుం బతి యైనసుదామనామభూ
నేత కతండు భీమునకు ♦ నీజననిన్ నను వీరబాహువి
ఖ్యాతమహీతలేశునకు ♦ నాంద్రముగఁ జేకొన నిచ్చె ముచ్చటన్ 285

క. నిను నేఁ బుట్టినయప్పుడ, కనుఁగొంటి దశార్ణమందు ♦ గాదిలిబిడ్డా
వీను నీపితృగృహ మెట్టిది, యన వచ్చునొ యిదియు నట్టి ♦ దన వచ్చుఁ జుమీ. 286

వ. నా యైశ్వర్యం బంతయు నీ యైశ్వర్యంబ యని కరం బాశ్వాసించుచున్నంత దమయంతియు నత్యంతప్రహృష్టాంతరంగ యై తల్లికి సాష్టాంగనమస్కారంబు గావించి చెల్లెలిం గౌఁగిలించుకొని. 287

చ. చెలియల నన్నెఱుంగకయ ♦ చేసితి వీవు మహోపచారముల్
చెలిమియు నాపయిం గలదు ♦ చెప్పెడి దేమిఁక సర్వసౌఖ్యముల్
గలిగెను నాకు నీకడ నొకానొకనేగియు లేక యెప్పుడుం
దలఁచెద నిన్ను నీదయను ♦ నాతను వుండిననంతకాలమున్. 288

‡ పిప్పువు = పుట్టుమచ్చ. † దశార్ణములు = దేశములు.



వే. తనీ తల్లిం జూచి. 289

క. ఎడఁబాటు సైఁప విడిచితి, బుడుతలఁ దడ వయ్యెఁ జూడ ♦ బుద్ధి దనికెడిన్
విడిచి పోవ మిము న్నైనన్, వడలెద నీయాజ్ఞ యైనఁ ♦ బితృగృహమునకున్.

వ. అనిన వల్లె యని రాజమాత రాజానుమతంబు వడసి కతిపయసేనాసమేతంబుగా నొక్కచతురంతయానంబున నామె నునిచి విదర్భ కంపివుచ్చుటయును. 291

దమయంతి విదర్భ కరుగుట.

చ. కతిపయవాసరంబులకుఁ ♦ గాంచనగంధి విదర్భ కేగి తా
సుతులను దల్లిదండ్రులను ♦ జుట్టల నందఱఁ జూచి వారిచేఁ
గుతుకముతోడఁ జూడఁబడి ♦ కొంత తనరానివియోగదుఃఖమున్
మతిఁ గొని సద్వ్రతంబులను ♦ మానక చేయుచునుండె మెండుగన్. 292

క. కలికి నిజదేహసౌఖ్యంబులకు న్వాలి యగుచు నలునిఁ బొందఁ దలఁచుచున్
మలినార్ధవస్త్రము న్విడ, కలయక గురుదేవపూజ ♦ లవు డొనరించెన్. 293

క. తనయింట వచ్చి యుండిన, తనయం గని భీమరాజు ♦ తద్దయుఁ బ్రీతిం
గొని యిచ్చె సుదేవునకున్, ధనములు ధాన్యములు గోశతంబులు భక్తిన్. 294

వ. అంత నా దమయంతి తల్లి కేకాంతంబున ని ట్లనియె. 295

చ. ‡నను బ్రదికించునిష్టము మనంబున నీ కగునేని తల్లిరో
వినిచెద విన్ము నావిభుని ♦ వీరవరేణ్యుని నైషధేశ్వరున్
గనుఁగొని తేరఁ బుచ్చు మని ♦ కాళులపైఁ బడ లేవనెత్తియుం
గనులను వేఁడినీ రురలఁగాఁ బ్రతి వల్కఁగ లేక రాజ్ఞియున్. 296

క. వగఁ బొగిలె నయ్యవస్థన్, నగరునఁ గలభామినీజనము గని మిగులన్
బొగిలెన్ హాహారవ మవు, డగుడెంచెన్ రాజభవన ♦ మది నిండుకొనన్. 297

వ. ఆవృత్తాంతం బంతయు భీముండు భార్యవలన విని జామాత నన్వేషింప సమర్థు లగు బ్రాహ్మణులను నియోగించుటయు వారిం గాంచి వైదర్భి యి ట్లనియె. 298

అలసగతి. †నలుఁ డిపుడు మాఱుదల ♦ నల్వతి మెలంగన్
దెలియుట యసాధ్య మగు ♦ దేవతలకేనిన్
లలితగతి మీ రిల మెలంగుచు నభాంత
స్థలముల వచింపుఁ డటు ♦ సారెకును దీరన్. 299

‡ బ్రతి = మాట.
† మాఱుదల = మాఱుట. నల్వతి = ఒప్పిదము విడిచి. తీరు = చక్కఁబడు.

తరువోజ.*జూదరి నీ విట్లు ♦ శోచనీయముగ ♦ శ్రుతివిహితార్థంబు ♦ చులుకన మీఱి
నా దగువస్త్రంబు ♦ నడిమికిఁ జించి ♦ నడ డస్సి నిదురించు♦నను వని వీడి
పోఁ దగునే భార్యఁ ♦ బ్రోవ భర్తకును ♦ బోలును గాదె యీ♦బుద్ధి యెట్లబ్బె
నీదుధర్మజ్ఞత ♦ నీదువంశంబు ♦ నేఁడైనఁ దలఁచిన ♦ న్నిటఁ బ్రోవ రావె. 300

వ. అని మీ రెల్లకడలం బలుకునది దీని మీ కెవండు దీనుండై వగచుచు నతిప్రయత్నంబునఁ బ్రతివచనం బిచ్చునో యతం డెట్టిరూపంబున నున్నను సంశయింపక మీ రెఱింగి నా కెఱింగించునది యని పంచినఁ బని పూని చని బ్రాహ్మణు లెల్లరాష్ట్రంబులు నెల్లపురంబులు నెల్లగ్రామంబులు నెల్లఘోషంబులు నెల్లయాశ్రయంబులుం దిరిగి తిరిగి దమయంతిపలుకు లెల్లకడలం బలికి నలు నెఱుంగ నోడి మగిడివచ్చి రంతఁ గొంతకాలంబునకుఁ బర్ణాదుం డనుద్విజుండు వచ్చి దమయంతిం దర్శించి. 301

పర్ణాదుండు దమయంతికి నలునిజాడ నెఱింగించుట.

ఉ.‡చేవులు మావులు న్నడచి ♦ తెక్కలు గల్గినయట్లు పోయి నే
నీవుడమిం గలట్టివను ♦ లేఱులు పల్లెలు పట్టణంబులుం
జూపులఁగట్టి మెట్టుచును ♦ సోబనపుంగళ నొప్పునయ్యయో
ధ్యాపురి కేగి నీపలుకు ♦ లన్నియుఁ బల్కితి నోలగంబునన్. 302

వ.†అది విని విననియట్లు ఋతుపర్ణుండు లోనగువా రేరును మాఱు పలుక కున్నంత హ్రస్వబాహుండును గురూపియు శీఘ్రయానకుశలుండును సూదక్రియానిపుణుండును సూతుండు నగునొక్కపురుషుండు బాహుకనామధేయుండు నన్ను విజనంబునం బిలిచి కుశలం బడిగి నిట్టూర్పు నిగిడించి దుఃఖించుచు. 303

చ.¶పురుషులయందుఁ దప్పయినఁ ♦ బొల్తుక సైఁచినయేని పుణ్యపుం
దెరువునఁ బోవు నీలువునఁ ♦ దేరినవారిటు లల్గ రెవ్వరున్
సిరి చెడి రాజ్యహీనుఁ డయి ♦ సిల్గుల కై క్షుధ నొంది మందుఁడై
దురపిలువాఁడు భార్య నటు ♦ త్రోచిన దోషముఁ గాఁడు చూడఁగన్. 304

ఆ. అనుచుఁ బలికి పోయె ♦ నతఁ డంత నే నిట్లు, విని వచింప వచ్చి♦తిని ప్రమాణ
బుద్ధి యయ్యె నేవి ♦ భూమీశునకుఁ జెప్పి, పోలినట్లు సేయఁ ♦ బోలు నీకు. 305

వ. అని చెప్పినఁ బర్ణాదునకు దమయంతి వేనవేలు ధనం బిచ్చి యంపిపుచ్చి తల్లికడకుం జని తద్వృత్తాంతం బంతయుం జెప్పి యిప్పుడొక్కయుపాయంబుఁ గంటి నది మాతం

* శోచనీయముగ = దుఃఖముగ. ‡ చూపులఁగట్టి = దృష్టులయందు నిల్పి.
† సూదక్రియ = వంటకము. విజనంబు = రహస్యము. ¶ శీలంవు = పాతివ్రత్యము



డ్రికిం జెప్పిన నొప్పంను గావున నతం డెఱుంగకుండ నీసన్నిధానంబున సుదేవు నయోధ్యకుం బుచ్చెద నాతండు నన్నుఁ దెచ్చినట్లు నలుం దేర నోపు నని తదనుజ్ఞ వడసి సుదేవు రాఁ బనిచి యి ట్లనియె. 306

చ.‡బ్రదికెనొ చచ్చెనో నలుని♦పల్కు వినంబడరామి భీముఁ డం
గద దమయంతికి న్మతియు ♦ గారవ మార స్వయంవరోత్సవం
బాదవఁగఁ జేయ నెంచె నరు♦ణోదయమం దగు నెల్లి దాని కే
గుదురు నరేంద్రు లంద ఱట♦కుం బ్రియమేనియు నీవు నేగుమా. 307

వ. అని నీ వయోధ్యాపురంబునం గలఋతుపర్ణునకుం జెప్పి రమ్మనిన సమ్మతించి సుదేవుండు నట్లు సత్వరంబునం జని చెప్పిన ఋతుపర్ణుండు బాహుకుం గని యి ట్లనియె. 308

ఋతుపర్ణుండు దమయంతీస్వయంవరార్థము పయనంబగుట.

చ. అరుగఁ దలంచినాఁడ దమ♦యంతిస్వయంవర మారయన్ మహో
త్తర మది నేఁడ పో నగు వి♦దర్భకు నెట్లొనగూడునో యనన్
దురపిలి బాహుకుండు మదిఁ ♦ ద్రొట్రిలుచున్ సతి యిట్లొనర్పఁగా
దొరకొనునే యి దెల్ల నను♦ దోకొనిపోవనుపాయ మేమొకో. 309

చ. ఖలుఁడు మహోఘమున్ సలిపెఁ ♦ గా దన కంచుఁ బరిత్యజించి చం
చల మగుస్త్రీస్వభావమున ♦ సాధ్వియ యైనను గామతప్త యై
తలఁచెను యిట్లు మార్గ్మగనిఁ ♦ దామరసేక్షణ గాంచబిడ్డలన్
సలుపునె దోషకార్య మిట ♦ సత్య మసత్య మెఱుంగఁ బోలదో. 310

వ. అని కార్యంబు నిశ్చయించుకొని బాహుకుండు కృతాంజలి యై ఋతుపర్ణున కి ట్లనియె. 311

తే.†తెలిసితిని రాజ నీపల్కు ♦ తెలవి నొక్క
పగట నేను విదర్భకుఁ ♦ బఱపఁ నేతు
నరద మిటు చూపు మనుచు లా♦యమున కపుడ
యేగి నడఁ దీరుహాయముల ♦ నేటి తెచ్చె. 312

తే.§అవి పృథుప్రోథములు మహా♦హనువులు కుల,శీలసంపన్నములు గురు♦శిక్షితములు
వరదశావర్త కలితముల్ ♦ వాతరంహములు లవలక్షణవర్జిత♦ములు తలంప. 313

‡ అంగద = ఉత్సాహము. † నేతు = నేర్తు. లాయము = అశ్వశాల.
§ ప్రోథము = ముట్టె.

క. ‡వానిన్ గనినంత నొడయుండు, మానసమునఁ గోప మూని • మహిఁ జల్పబల
ప్రాణము లియ్యవి మహదధ్వాన మ్మెటు నడవ నోపుఁ • దగ వివి యనుచున్. 314
తే. ఒకటి నుదుటను రెండు మ • స్తకమునందుఁ, బార్శ్వముల రెండురెండు న • పార్శ్వములను
వక్షమున రెండు ప్రోథము • పై నొకండు, సుడులు గల్గినగుఱ్ఱంబు • వడి మెలంగు. 315
క. ఇవియ సలక్షణవాహము, లవు నేడ విదర్భ కరుగు • నైనను నీ కో
యవనీశ యేవి నచ్చిన, నవియే నేఁ దెచ్చి కూర్తు • నానతి యిమ్మదే. 316
వ. అనిన ఋతుపర్ణుం డతని మెచ్చి నీవు హయతత్త్వజ్ఞుండవు నీకుఁ జోలినట్లు సేయు మనిన నతం డాహయచతుష్టయం బరదంబునకుం బూన్చిన నృపుం డధిరోహించుటయును. 317
ఉ. †మోఁకతిలంగ నశ్వములు • భూమిపయిం బడ వష్టు బాహుకుం
డాఁక దొలంగఁ బగ్గముల • నట్టిటు నొత్తుచు నిల్వ నూపుచున్
వీఁక గొనంగఁ జేసి తన • వెన్నడి సూతుని నిల్పి భే యనన్
నాకపథంబు ముట్టి జవ • నంబునఁ బాఱె నెగిరి రథాశ్వముల్. 318
తే. వాయువేగంబునం బాఱు • వాహనముల
నరసి ఋతుపర్ణుఁ డెంతయు • స్వాంతమందు
విస్మయము నొంది ముద మంది • వేయిగతులఁ
బొగడుచును మెచ్చె బాహుకుఁ • దగిలి తగిలి. 319
వ. §అంత వార్ష్ణేయుండు నావాహసంగ్రహణంబు గని రథఘోషంబు విని బాహుకుని హయజ్ఞతకు మెచ్చుచుఁ దనమనంబున. 320
సీ. ¶ఈతండు నిర్జర • నేతసారథి యైన, మాతలియో లేక • మాన్యుఁ డైన
శాలిహోత్రుండో కాక • జగదేకవీరుఁడై, నలువు మీఱెడునట్టి • నైషధుండో
కేవలనరుఁ డైన • మావులశాస్త్రమి, ట్లెఱుఁగున బాహుకుం • [illegible]
నలలక్షణంబు లీ • నరునందుఁ జూపట్టు, వయసు విద్యయు బుద్ధి • వఱలు సమత
తే. ఘనులు దైవోపహతు లయి • జనుల లెఱుంగ
కుండఁ బ్రచ్ఛన్నవృత్తిమై • నుందు రిట్లు
వికృతరూపముతో నున్న • వీని యరుదు
భేదభావ మొకింతయు • లేదు నాకు. 321

‡ అధ్వానము = దారి. † [illegible]
§ వాహాసంగ్రహణము = గుఱ్ఱములను గ్రహించుట. ¶ మావులు = గుఱ్ఱములు [illegible]



వ. అని నలసారథి తనమనంబునం దలంచుచుండె నప్పుడు. 322
మ. దవులం బ్రక్కలఁ బొల్చువస్తువులు చెం • తం బ్రక్కల • బొల్చువ
స్తువులున్ ముందుకు వెన్కకుం బొలములం • దొల్లాడి రా పోఁ గనం
గవచుం దోఁపఁగ ముందు చూచినది వెం • న్కం జూడ సాధ్యంబు గా
కవురా నా నరదంబు వాఱె నెగి నా • నారణ్యము ల్దాఁటుచున్. 323
వ. ఇట్లు వాయువేగంబున నేగుచున్నప్పు డయోధ్యాధినాథుండు బాహుకుం జూచి నాయుత్తరీయంబు పైనుండి జాఱిపడియె దాని నీవార్ష్ణేయుండు పోయి తెచ్చునంతకు హయంబుల నాఁగఁబట్టు మనిన నతం డతని కిట్లనియె. 324
క. ‡నీపటము వడినచోటిట, కోపరివృఢ తెలియ నొక్క • యోజనదూరం
బేపగిదిఁ దేర శక్యం, బో పలుకుము నాఁగ మెచ్చె • నుర్వీపుఁ డెడఁదన్. 325
వ. †అంతలో నానాదేశంబు లతిక్రమించి పోవుచుండ నొక్కచో నొక్కఫలవంతం బైనవిభీతకవృక్షంబు లోచనగోచరం బైన ఋతుపర్ణుండు బాహుకుదిక్కు మొగం బై. 326

బాహుకుం దక్షహృదయముం బరీక్షించుట.

ఉ. §అందఱు నన్నియుం దెలియ • నట్టిరు గా రొకరుండుఁ దక్కఁగన్
గొందఱు కొన్నియే యెఱిఁగి • కొందురు నాకును లెక్కలందుఁ బెం
పొందు వివేక మే నరసి • యుండినమాత్రన యెట్టిసంఖ్యయుం
బొందుగఁ జెప్ప నేరుతు న • పూర్వ మటంచు జనుల్ నుతింపఁగన్. 327
వ. ఈతాండ్రవృక్షంబునం గలపర్ణఫలంబుల లెక్క చెప్పెద వినుము రాలినపర్ణంబులు నూటయొక్కటి ఫలంబులునూఱు శాఖాంతరంబులం గూడిన యీరెండుశాఖలందు నైదుకోట్లు పర్ణంబులు రెండువేలతొంబదియైదు ఫలంబులు నున్న వని చెప్పిన విస్మయంపడి బాహుకుండు రథంబు నిలిపి రాజుదిక్కు మొగం బై యిట్లనియె. 328
మ. ఇది ప్రత్యక్షము చేసికోఁగ మన మె • య్యెం దేవ నే నెన్నివ
చ్చెద నెక్కించుకలోన రస్మలను వా • ర్ష్ణేయుం డిటం బట్టు నా
మొదితుం డయ్యు నరేంద్రుఁ డిందుఁ దడయం • బో ల్పొందఁబో దన్న నె
మ్మది నౌత్సుక్యము పాయరాని దగుటం • బ్రార్థించుచున్ మాటికిన్. 329

‡ పరివృఢుఁడు = ప్రభువు. † విభీతకవృక్షము = తాండ్రచెట్టు.
§ ఒకరుండు = ఒక్కటి.

తే. బాహుకుం డను క్షణమాత్రి ♦ వత్తు నీవు, నంత దనుకఁ బ్రతీక్షింపు ♦ మట్లు గాద
యేని వార్ష్ణేయసారథి ♦ వై నడుపుము, దారి చక్కని దింతలోఁ ♦ జేరుకొందు.

వ. ‡అనిన భాంగాసురి ప్రసన్నుండై నాకు నీవ సారథివి నిన్ను విడిచి నేఁ బోవు వాఁడఁ గాను విదర్భకుం బ్రొద్దుండఁ బోవఁ గలవాఁడ వేని నీసందియంబు దీర్చు కొని రమ్మనిన నతండు రథావతరణంబు సేసి చని విభీతకంబు నురలం ద్రోచి పండ్లెన్ని చెప్పినయన్ని యున్న విస్మితుండై. 331

చ. ఇదిపరమాద్భుతంబు ధర♦ణీశ్వర నీ విటు చెప్ప నేర్చితో
మది కిసుమంత తోఁచ దతి♦మానుష మం చనవచ్చె నాఁగ ని
య్యది నెగడొందు నక్షహృద♦యం బనునుత్తమవిద్య దీనినిన్
హృదయము నం దలంచునరుఁ ♦ డెన్నడు దోషము లంట కొప్పెడిన్. 332

వ. అనిన బాహుకుం డేను నీ కశ్వహృదయం బిచ్చెద నాకు నీ వక్షహృదయం బి మ్మని యడిగిన ఋతుపర్ణుం డశ్వహృదయం బపేక్షించి దాని వలసినప్పుడ కొను వాఁడై వాని కక్షహృదయం బుపదేశించెఁ దత్ప్రభావంబున. 333

సీ. నలునాశ్రయించిన♦కలి యప్డు వానిదేహమునుండి కర్కోట♦కాహివిషముఁ
గ్రక్కుచు వెలి వచ్చి ♦ కానంగఁబడుటయు, నలుఁడు శపింప లోఁ♦ దలఁచెఁ గనలి
తలఁకి భీతుం డయి ♦ కలి కరంబులు మోడ్చి, నను గావు మయ్య యో♦నరవరేణ్య
దమయంతిశాపంబు ♦ తగిలి నే నీలోన, నహివిషంబునఁ గాల♦నైతి నిపుడు

తే. జగముల న్నిన్నుఁ గీర్తించు♦జనుల కెపుడుఁ
గాని నావలన భయంబు ♦ గలుగఁ బోవ
దన నలుఁడు నల్క విడి కలి ♦ కాజ్ఞ యొసఁగె
నతఁడు నవ్విభీతకవృక్ష ♦ మాశ్రయించె. 334

వ. దానం జేసి విభీతకం బప్రశస్తం బయ్యె నంత నలుండు విగతజ్వరుం డయ్యు వికృతరూపుండై వచ్చి రథం బెక్కి రథ్యంబుల కలువ సూపుటయు నవి విహంగంబుల తెఱంగున నెగసి నిమేషమాత్రంబున విదర్భాపురంబు సేరం జనియె నంత సాయాహ్నంబున ఋతుపర్ణుండు భీమరాజానుజ్ఞాతుం డై నిజరథఘోషం బెల్ల దిక్కులం బర్వఁ బురప్రవేశంబు చేసె నంత. 335

ఋతుపర్ణుండు బాహుకునితో విదర్భఁ జేరుట.

క. ఆరథనిర్ఘోషము విని, సారెకు వారిధులు గదల ♦ సకిలించు చటన్
జేరిన నలునశ్వంబులు, మోరలు పై కెత్తి చూచె ♦ మురిపెం బెసఁగన్. 336

‡ భాంగాసురి = ఋతుపర్ణుఁడు.



తే. హర్మ్యములయందు కేలల ♦ నలరుచున్న
నెమ్ములును వారణమ్ములు ♦ నెమ్మి గదుర
నాడ ఘీంకార మొనరించె ♦ నన్నలురథ
రవము విని మేఘరవ మను♦భ్రాంతి గదుర. 337

చ. ‡నలుఁడు నలుం డటం చొగి న♦నారతముం జపియించు భైమి యా
నలరథఘోషముల్ విని మ♦నంబున నెంతయు నంతసించుచున్
నలుఁడ యితండు కానవలె ♦ నా దిటు లొప్ప రథంబుఁ దోలు నే
తెలియుదుఁ గాక యం చపుడు ♦ తేటిన మోహభరంబు పెంపునన్. 338

ఆ. నామనోహరుండు ♦ ననుఁ జూడ రాఁడేని, దవహుతాశనమునఁ ♦ దనువుఁ జేర్చి
విరహతాప మెల్ల ♦ విరిసిపోవఁగ నెట్టి, కీడుఁ గనక యుండుఁ ♦ గీర్తిఁ గందు. 339

వ. ఇట్లు పరిదేవనంబు సేయుచు దమయంతి ప్రాసాదోపరిభాగంబునకుం జని తేరిపై నెక్కి వచ్చువారిం జూచుచుండె నపుడు బాహుకవార్ష్ణేయులు దిగిన వెనుక ఋతుపర్ణుండు రథావతరణంబు సేసి భీమరాజుం దఱియ వచ్చిన నతం డతని నతిగౌరవంబున నెదు రేగి తోడితెచ్చి పూజించి స్వాగతంబు వలుకుచు నాగమనకారణం బడిగిన ఋతుపర్ణుం డటస్వయంవరం బనుమాట వినక విస్మితుండై.

క. వచ్చితిని నిన్నుఁ గనుఁగొని, ముచ్చట దీరంగ నాడి♦పో నరవర నా
మెచ్చి యను భీముఁ డిటు దయ, వచ్చుట నే ధన్యతముఁడ ♦ వసుధానాథా. 341

వ. అని ప్రీతిపూర్వంబుగాఁ బ్రియవచనంబు లాడి వాని నొక్క దివ్యభవనంబున నధివసింపం జేసె బాహుకుం డారథంబు రథశాలకుం గొనిపోయి రథ్యంబులకుఁ జేయం గలయుపచారంబులం జేసి రథసమీపంబున విశ్రమించె దమయంతి యు నట్లు వచ్చినముగ్గురిలో బాహుకుం డెవండో యెఱుంగఁ జాలక. 342

క. నలరథఘోషమువోలెం, దెలియంబడె ఘోష మిపుడు ♦ తెలియంబడఁ డా
నలుఁ డిందుఁ గుఱుచచేతులు, గలవికృతాంగుండు నలుఁడు ♦ గావలయునొకో.

వ. అని కేశిని యనుదూతిం బిలిచి. 344

దమయంతి నలునికడకుఁ గేశిని యనుదూతిం బుచ్చుట.

తరలము. †కుఱుచచేతులతోడఁ దేరికిఁ ♦ గూయిగా శయనించె నా
పొఱుడువాఁడు నలుండొకో యని ♦ పోలఁ దోఁచెడి నోసి నీ

‡ నాడు = ఘోషము.

† కూయి = రక్షణము. పొఱడు = గూను. అఱగొఱ = న్యూనత.

వఱఁగొఱల్గొన కేగి మెత్తఁగ • న్నాడి వేడుక నిక్కఁవం
బెఱఁగిరమ్మపు డిచ్చ హెచ్చెడి • నింద యుండినయట్లుగన్. 345

వ. అని పుచ్చి తాను తనమేడపై నుండి చూచుచుండెఁ గేశినియుం జని బాహుకుం
గని కుశలం బడిగి మా దేవి వినఁ గోరుచున్నయది నీ విందుల కేల వచ్చితివి
నిజంబు సెప్పు మనుటయును నతండును. 346

మ.‡ధరణీశుం డగుభీముఁ డాత్మభవకుం • దాల్మిన్ ద్వితీయస్వయం
వరముం జేయఁగ నెంచె నెల్లి యగు న•న్వాక్యం బయోధ్యాపురీ
శ్వరుఁ డాబ్రహ్మముఖంబునన్ విని మహా•శ్చర్యన్ వచ్చె నిం డెంతయే
న్ధర నీనాఁటన దాఁటి నే నతనివెం•టన్ వచ్చితిన్ సాదినై. 347

వ. అని మఱలో మూఁడవవాఁ డెవ్వండు నీ వెవ్వండ వెందుల కీఋతుపర్ణు నాశ్రి
యించి యుంటి రని యడిగిన కేశిని కతండు వెండియు. 348

తే. అతఁడు వార్ష్ణేయుఁ డనుసూతుఁ • డతివ నలుని
సారథి నలుండు నష్టుఁడై • చనుడు వచ్చి
చేరె భాంగాసురి న్నేను • వారువముల
దిద్ద వండ నయ్యేలిక•యొద్ద నుంటి. 349

వ. అనుడుఁ గేశిని వార్ష్ణేయుండు నలుండు నష్టుండైన తెఱం గెఱుంగునో యను
టయు బాహుకుండును. 350

తే.నలునిబిడ్డల నిటఁ బెట్టి • వెడలి పోయె, నాతఁ డేమి యెఱుంగు నె•ట్లన్య లెఱుఁగఁ
జాలుదురు రూపు చెడి గూఢ•చారి యైన, వాని వాఁ డెఱుంగునువాని•వనిత యెఱుఁగు.

వ.అనుటయుఁ గేశిని యిట్లనియె నట్లయోధ్యాపురంబునకుఁ దొల్లి పర్ణాదుండు వచ్చి.

తరువోజ. సుందరీ నీ విట్లు • శోచనీయముగ • క్షితివిహితార్థంబు•చులుకన మాఱి
నా దగువస్త్రంబు • నడిమికిఁ జించి • నడ డస్సి నిదురించు•నను వని వీడి
పోఁ దగునే భార్యఁ • బ్రోవ భర్తకును • బోలును కాదె యీ•బుద్ధి యె ట్లబ్బె
నీదుధర్మజ్ఞత • నీదువంశంబు • నేఁ డైనఁ దలఁచి న • న్నెఱిఁ బ్రోవ రావె. 353

వ. అని చదివినప్పుడు నీయిచ్చినప్రతివచనంబు మరల మా దమయంతి నీవలన విన
నభిలషించుచున్న దనిన నతండు వ్యథితహృదయుండు నస్రుపూర్ణలోచనుండు
నై దుఃఖం బెఱుకపడ నీక గద్గదస్వరంబు పెట్టుకొని. 354

‡ ఎంతయేన్ధర = ఎంతో భూమి.



చ.‡పురుషునియందుఁ దప్పయినఁ • బొల్తుక సైఁచినయేని పుణ్యపుం
దెరువునఁ బోవు నీలువునఁ • దేఱినవారిట నల్ల రెప్పుడున్
సిరి చెడి రాజ్యహీనుఁ డయి • సిల్గులకై క్షుధ నొంది మందుఁడై
దురపిలువాఁడు భార్య నటు • ద్రోచిన దోషుఁడు గాఁడు చూడఁగన్. 355

వ. అని పలికితి నని కంట నీరు పెట్టుకొనియె నది యంతయుం గేశిని దమయంతి
కెఱింగించిన నామె వాని నలునిగా శంకించి వెండియుం బోయి రమ్మనిన నది
పోయి వచ్చి. 356

కేశిని నలు నెఱిఁగివచ్చి దమయంతికిం జెప్పుట.

క. అతిమానుష మత్యద్భుత, మతిచిత్ర మదృష్టపూర్వ • మశ్రుతపూర్వం
బతనిచరిత్రము గన నా, కతఁ డాకవే ల్పనుచుఁ బోల్ప • నయ్యెన్ వింటే. 357

సీ.†పృథివీపతికి వండి • పెట్టంగఁ బాకవ,పలలంబు రా నల్ల•బానసీఁడు
మనమునఁ దలఁచిన•మాత్రన జలములు, నిండారి కడవల • నిండుకొనియెఁ
దృణముష్టి గొని సవి•తృనకుఁ జూపుడు దానఁ,బ్రభవించి యనలంబు•ప్రజ్వలించెఁ
బ్రొయ్యిలోఁ బెట్టిన • నెయ్యెడ కేనియుఁ, గాలవు వానికిఁ • గాలుసేతు
తే. లహహ వానికరద్వయ•మందు వాడి, వత్తలయ్యును బూ లెంత•వడికి నైనఁ
దావి పీడవు చెడ వొఱడు•దారిఁ బడవు, వానిమాహాత్మ్య మెంతన•వలయునమ్మ

వ. అనిన దమయంతి దానిచే బాహుకుండు వండినవేఁడినంజుళ్లు తెప్పించుకొని
తిని నలుం డని నిశ్చయించి వానికడకుఁ దనబిడ్డలం బుచ్చుటయును. 359

చ. కొడుకును గూఁతునుం దిగిచి • గ్రుచ్చి కవుంగిటఁ జేర్చి శీర్షముం
బుడుకుచు ముద్దు పెట్టుకొని • మోమున మోము గదించి యంకమం
దిడుకొని బాష్పబిందువుల • నెంతయు వింతగ వారిమేనులం
దడుపుచు మే గగుర్పొడువ • నైషధుఁ డొప్పె వికారమేర్పడన్. 360

వ. అంతలో వారిం దనతొడనుండి డింపి కేశినిం జూచి పిం డిడ్డలు నాబిడ్డలం
బోలి యుండుటం జేసి యిట్లు చేసితి నీవు నాకడ కిట్లు పలుమాఱు వచ్చిన జను
లొండు తెఱంగునఁ దలంతు రింక రా వలవదు పొమ్మనుటయు నది మగిడి వచ్చి
సర్వంబును దమయంతికి నివేదించిన నామె తల్లికడకుం జని. 361

చ. జనని పరీక్షఁ జేసితిని • సర్వవిధంబుల బాహుకుండు స
జ్జననుతుఁ డైన నైషధుఁడు • సందియ మెందును లేదు గాని రూ

‡ సిల్గు = ఉపద్రవము. † పాకవపలలము = లేడిమాంసము; బానసీఁడు = వంటలవాఁడు.

ఘను నిసుమంత యుండ నది ♦ పోలఁ గనుంగొన నెంతుఁ గావ నా
తనిఁ బిలిపింతువో యిటుకుఁ ♦ దా నయి నే నటు పోవుదాన నో. 362
తే. అనుమతి యొసంగు మనుడు నా♦యమ విదర్భ
పతికిఁ దత్సర్వ మెఱిఁగింప ♦ నతఁడు దనరి
నలుని రావించె దమయంతి ♦ మలఁగుచోటి
కపుడు తనుఁ గాంచి దుఃఖించు♦నతనిఁ గాంచి. 363
వ. ‡దుఃఖించుచు నాఁటిమలినవస్త్రంబ కట్టుకొని జటిల యై యున్న దమయంతి యి
ట్లనియె. 364

దమయంతి తనచెంతకు నలుని రావించి పరిదేవనంబు సేయుట.

చ. అలసి వనంబున న్నిదుర ♦ నందినదానిఁ బరాపవాదముం
దలఁపనిదాని సాధ్వి యగు♦దానిఁ బతివ్రత యైనదాని నే
కలఁతకుఁ గానిదానిఁ గుల♦కాంత నయో నలుఁ బోలి వీడిపోఁ
గలిగినవాని నెక్కరునిఁ ♦ గంటిరొకో యొట నేని బాహుకా. 365
క. దేవతలం గాదనుచున్, నే వరియించితిని వాని♦నే దైవముగా
భావించితి నిట్టినను౦, బో విడుచుట ధర్మ మగునె ♦ పో వాని కిలన్. 366
మహాస్రగ్ధర. †అనుచుం గన్నీళ్లు లేల్లై ♦ యటఁ బఱవఁగ దుఃఖార్త యై యున్న పత్నిం
గని శోకవ్యాకులుం డై ♦ కలుషరహితుఁ డ♦క్కార్కవంశ్యేంద్రుండు దా ని
ట్లనియెం గాంతామణీ నే ♦ నలకలినిహతిన్ ♦ హావడిం బొంది నిన్న
ట్లనురాగం బేగ దుష్కా♦ర్య మనక విడఁగా ♦ నై వగం గుంద నైతిన్. 367
వ. కలిదోషవిముక్తుండ నైన నే నిపు డిట నీద్వితీయస్వయంవరంబు ప్రవర్తిల్లుట
జేసి మీరాజేంద్రునితో నిన్నుఁ జూడ వచ్చితి నా కొండు ప్రయోజనంబు లేదు
వినుము. 368
క. అనురక్తు నను వ్రతు జన,వినుతుం బతి విడిచి సుదతి ♦ వేఱొకపతినిం
గోన నెంచి కోర్కికిం దగఁ, జను టనురూపంబె చెపుమ ♦ జలజాతాక్షీ. 369
వ. అనిన నెఱచఱచి దమయంతి ప్రాంజలి యై. 370
సీ. §ఇందు నాతప్పని ♦ యెంతే వేల్పుల రోసి, నిను వరించితి నన్ను ♦ నీ వెఱుఁగవె
భవదభిగమనార్థ ♦ మవనీసురులు కడ,లకు నేగి నానుడు ♦ ల్పలికి రందుఁ

‡ జటిల = జడలుగలది.
† హావడి = ఉపద్రవము. § అభిగమనము = పొందు. కడలు = దిక్కులు.



బర్ణాదుఁ డెఱిఁగె నీ ♦ ప్రతివచనం బిడ్డ, కతన నయోధ్య నొక్క విధమునను
నినుఁ జేరఁగ నుపాయ♦మని స్వయంవరము నే, నెనఁగించితినిదం డ్రి ♦ యెఱుఁగకుండ
ఆ. నీవు గాక యొకరుఁ ♦ డేకాహ్నమున నూఱు, యోజనములదారి ♦ వాజుల నడ
పుటకు నోపఁ డనుచు♦ మూర్త మెల్లియయొప్ప, ననుచుఁ దెలుపుమంటి♦నవనినాథ.
క. త్రికరణశుద్ధిగఁ బలికితి, నకలంకమనస్క రాల ♦ నని నే నిటఁ దా
వకపదము లంటి చేసెద, సకలజగం బెఱుఁగ బాస ♦ సదమలహృదయా. 372
చ. ‡తగ దన కే నొకిం తయినఁ ♦ దప్పొనరించితినేని రేపవల్
జగములలోపలన్ వెలుప♦ల న్వెలుఁగొందెడు చంద్రసూర్యులున్
మృగహయుఁడు న్ననుం గినిసి ♦ మిత్తికి నిత్తురు గాక కానిచోఁ
దగవరు లై యథార్థమును ♦ దాఁపక తారు వచింత్రు గావుతన్. 373
వ. అని పలుకుచున్న సమయంబున నంతరిక్షంబుననుండి వాయుభట్టారకుం డెల్లరు
విన ని ట్లనియె. 374
మ. నిషధాధీశ నిజంబు వల్కెద నిట ♦ న్నీ దేవి యేయింతక
ల్మషముం బొందె యెఱుంగ దే మెపుడుఁ బో♦లం గాంచుచున్నార మీ
విషవర్షంబులు మహాఁడు ని న్నిటకు రా♦వింపంగ నీతీరునన్
మిష గల్పించె నశంకితాత్ముఁ డయి దీ♦నిం బొందుమీ పొందుగన్. 375
మాలిని. †సురలు విరులవానల్ ♦ సోన లై కుప్పతిల్లం
గురిసిరి ధర యెల్లన్ ♦ దుందుభిధ్వాన మొప్పెన్
విరిసెఁ జదలు కాంతిన్ ♦ నిర్మలం బై శివం బై
నరవి గుబులుకొంచుం ♦ జల్లగా గాలి వీచెన్. 376

నలుఁడు నిజరూపంబున దమయంతిం గలయుట.

సీ. అంత నయ్యద్భుత ♦ మంతయు నారసి, నలుఁ డంతరంగము♦నం దనర్చి
దమయంతిఁ బ్రేమించి ♦ తలఁచెఁ గర్కోటకు, నతనియిచ్చినవస్త్ర ♦ మది ధరింపఁ
దత్ప్రభావంబునఁ ♦ దనతొంటిరూపంబు, నలరాజునకు వచ్చె ♦ నలువు మీఱ
నైజదేహచ్ఛవిఁ ♦ దేజిల్లుపతిఁ గాంచి, తగఁ గౌఁగిలించె వి♦దర్భతనయ
తే. నలుఁడు నాసతి నక్కున ♦ నలరఁ జేసి
కొడుకునుం గూఁతుఁ బ్రీతి మై ♦ గ్రుచ్చి యెత్తె

‡ మృగహయుఁడు = వాయువు.
† కుప్పతిల్లు = కుప్పవడు. విరిసె = వికసించె.

‡ ఘుగువ మగనియురమ్ముపై ♦ మొగముఁ జేర్చి
యూర్చ నతఁడును వగ దక్కి ♦ కూర్చి పేర్చె. 377

వ. అంత నానలదమయంతులవృత్తాంతం బంతయు విదర్భేశ్వరుండు విని వచ్చి సంజాతసస్యయై యబ్దవారి నాప్యాయిత యైనభూతధాత్రియుం బోలెఁ బతిం గూడి వ్యపగతతాపయై శీతాంశునిం గూడినత్రియామయుంబోలె వెలుంగుచున్నకూఁతుం గాంచి సంతసించి తన కభివాదనంబు సేయువారి నభినందించి యాశీర్వదించి దేవాయతనంబులం బూజలు సేయించి పురం బలంకరింపం బంచి పరమోత్సవంబునం బొందె నంత. 378

శా. ఆవైదర్భియు నైషధుండు నవు డ♦న్యోన్యానురాగంబునన్
భావం బొప్పఁగ నాఁటిరేయి విలస♦త్పల్యంకభాగంబుపై
శేవం బొల్చి వనంబునం దమకుఁ బా♦టింపంగ నైనట్టిపా
ట్లావేళ న్వచియించికొంచు మిగులన్ ♦ హర్షించి రుత్కంఠమై. 379

ఆ. నాలుగేండ్ల కట్టు ♦ లాలు మగండును, గలసికొనినయట్టి♦కారణమునఁ
గదిసి వారు సర్వ♦కామార్థసిద్ధులు, గలిగి ముదము వొంది ♦ రెలమి నపుడు. 380

వ. అంతఁ బ్రభాతం బగుటయు. 381

తే. †గోముఖశ్రీలు మేలుమ్రు♦గ్గులును దోర
ణములు ధ్వజములు నల్గడ ♦ నలువు మీఱఁ
జేసి ప్రోలెల్ల మిగులఁ గై♦సేసి పౌరు
లెల్ల హృష్టాంతరంగులై ♦ యొసఁగి రపుడు. 382

మ. ఋతుపర్ణుం డది యంతయున్ విని నలు ♦ న్వీక్షించి విశ్వంభరా
పతి వీ వక్కట బాహుకుం డనఁగ నై ♦ ప్రచ్ఛన్నవృత్తిన్ వసిం
చితి నాచెంతను నీచకార్యములు నీ♦చే నేను జేయించితిన్
క్షితినాథాగ్రణి తప్పు సైఁచి దయ న ♦ న్వీక్షించి రక్షింపవే. 383

తే. అనుడు నలుఁ డిట్లనియె నో మ♦హామహీశ, నాకు సంబంధి వీవు నే ♦ నీకడఁ గడు
నొప్పి యుంటిని నాయింట ♦ నుండినట్లు, తప్పుచేసితి నను టిది ♦ యొప్పు నయ్య. 384

వ. అని నలుండు వాని నాదరించి పూజించి వాని కశ్వహృదయం బిచ్చి పుచ్చుటయు నతండును సత్కృతుండై వారి వీడ్కొని యొండొక్కసూతుం దోడ్కొని నిజపురం

‡ ఊర్చె = ఊపిరి విడిచె. కూర్చి = ప్రేమించి. పేర్చె = అతిశయించె.

† గోముఖము = అలుకుట.



బునకుం జనియె నంత నైషధుండును నక్కుండినగరంబున నొక్కమాసం బుండి భీమరాజు నామంత్రించి యొక్కరథంబును బదియాఱుగజంబులును నేఁబదిహయంబులును నాఱునూర్లపదాతులును గలస్వల్పబలంబుఁ దోడుకొని త్వరత్వరప్రయాణంబులఁ గదలి చని పుష్కరుం గని యి ట్లనియె. 385

—♦♦◆ నలుఁడు పునర్ద్యూతంబునఁ బుష్కరుం గెలిచి రాజ్యంబు సాధించుట. ◆♦♦—

తరువోజ. వినుము పుష్కరనాకు♦విత్తంబయగుచు♦వెలసియుండె విదర్భ♦విషయాధినాథు
తనయఁ బణం బిడఁ ♦ దలఁచితి దానిఁ ♦ దగ నీవు పణ మిడు ♦ ధారుణీరాజ్య
మును జూదమాడఁగ ♦ బుద్ధియే లేక ♦ మొనసి నాతో నాల♦మున కేని రమ్ము
మనము పోరుద మండు ♦ మడిసినవాని♦మహిరాజ్య మొగ్గిన♦మానిసి నుందు.

తే. ‡అని నలుఁడు వల్కఁ బుష్కరుఁ♦డాలమైన,మొప్ప మగు జూద మొప్పనే♦ముస్న వీని
నోడిచియుంటి జయం బగుఁ♦బడతినొంద,వచ్చునని లోన నెంతయు♦మెచ్చుకొనుచు.

ఉత్సాహము. *నలునిఁ గాంచి యిట్లు వల్కె ♦ నాకు దేవనంబునం
గలదు ప్రీతి గాన నాడఁ ♦ గడఁగు మేన గెల్చినన్
నెలఁతమిన్న నాది యగును ♦ నీవు గెల్చితేని నా
కలరురాజ్య మెల్ల నీది ♦ యగును జుమ్ము నావుడున్. 388

సుగంధి †వీరసేనసూతి బాహు♦వీర్యగర్వయుక్తుఁడై
పోర లావు చాలనట్టి♦బుద్ధిహీను వానినిన్
జేరి వారిజాక్షిఁ గొమ్ము ♦ చిట్టకమ్ము గా నటం
చారటమ్ము దీఱఁ బిల్చి ♦ యాడి గెల్చె ♦ వేల్మిడిన్. 389

వ. ఇ ట్లక్రమంబున జూదంబునం గెలిచి వానిం జూచి నవ్వుచు ని ట్లనియె. 390

పద్మనాభము. §ని న్నిట్టు లోడించితి న్గాన రాజ్యంబు ♦ నేఁ గైకొనం గల్గె నీ కింక భైమిన్
గ న్నెత్తి చూడంగ నాడంగ శక్యంబు ♦ గా దయ్యె దాసుండ వై తీవు మాకున్
ము న్నన్ను జూదంబునం గెల్చితంచున్ బ్ర♦మోదంబునన్ గర్వముం గొందు విం తే
నెన్నంగ లే వక్కలీంద్రప్రశక్తిన్ ర♦హిన్ దూలి పో నైషధుం డయ్యె నంచున్. 391

మత్త. ¶ఈవు నాపినతండ్రిపుత్త్రుఁడ ♦ వింత కెక్కువ నీకు నే
నేవిధంబున నెగ్గు సేయఁగ ♦ నెంతు రాజకులాధమా
పోవు మెచ్చటికే శరీరముఁ ♦ బ్రోచికో నగువిత్తమున్
జేవలంతిగఁ గొమ్ము సంగతిఁ ♦ జెల్మి నింపితి నీపయిన్. 392

వ. అని సత్కరించి వాని నంపి పుచ్చి నలుం డనల్పవైభవంబునఁ బురప్రవేశంబు చేసి పౌరుల నాశ్వాసించి పరమోత్సవం బెసంగఁ బూజ్యసామ్రాజ్యంబు గొని దమయంతిం బిలువనంపుటయు. 393

‡ మెంచ్చము = ప్రమాదము (ఇది మాండలికము). * దేవనము = జూదము.

† చిట్టకము = లీల. ఆరటము = పరితాపము. §పద్మనాభవృత్తమునకు 7 తగణములు 2 గురువులును 18 వ యక్షరము యతిస్థానము. ¶ చేవలంతి = అధీనము.

స్రగ్ధర. ‡ప్రీతిన్ భీముండు కూఁతుం ♦ బ్రియసుతసహితం ♦ బిల్చి నీప్రాణనాథుం
జేతన్మాత్రంబులో నాఁకృపణు గెలిచి ని ♦ న్నింతలో రాఁగఁ బంచెన్
జేతోమోదంబుతో నీచెలువునిఁ గనుఁగోఁ ♦ జెల్లుఁ బొమ్మంచు లోక
ఖ్యాతం బౌరీతిఁ బుచ్చెన్ ♦ గను ధన మిడి సత్కారముం జేసి వేడ్కన్. 394

దోదకము. కొడుకును గూఁతును ♦ గోర్కి దలిర్పం, గడుకొని వెంబడిగాఁ జను దేరన్
గడు విభవంబునఁ ♦ గ్రాలుచు నంతన్, బడఁతి ప్రియంబున ♦ భర్తను జేరన్.

వ. ఇట్లు వచ్చినధర్మపత్నిం గూడి నైషధేశ్వరుండు దేవేంద్రవైభవంబునం దేజరిల్లుచు విధిదృష్టవిధానంబున వివిధయజ్ఞంబు లొనరించి జంబూద్వీపంబునం దలితరాజ్యం బేలుచు సుఖంబుండె నట్లు నీవు నీదుఃఖం బెల్లఁ జల్లార రాజ్యంబు వడసి సకలబంధుపరివృతుండ వై సుఖంపఁ గలవు పరిదేవనంబు సేయకుండు మని బృహదశ్వుండు వెండియును. 396

క. నలరాజున్ దమయంతిన్, గలితయశుఁ దగుఋతుపర్ణుఁ ♦ గర్కోటకునిన్
దలఁచినవారల కెప్పుడుఁ, గలికల్మషనాశనంబు ♦ గాఁ గల దరయన్. 397

ఉ. †ఈయితిహాసమున్ వినిరయేని పఠించిరయేని నిచ్చలున్
వ్రాయక యొల్లకుం దెలియఁ ♦ బల్కిరయేని సమస్తదోషముల్
వాయు శుభంబు డాయుఁ ♦ గలిబాధ లవన్నియు మాయు రోగముల్
పాయవనున్ బ్రశస్తియు నపారయశంబును గల్గు నిద్ధరన్. 398

వ. అని బృహదశ్వుండు ప్రహృష్టమనస్కుం డయి ప్రార్థించినధర్మజున కక్షహృదయం బెఱింగించి యశ్వశిరస్తీర్థంబునకు యథేచ్ఛం జనియె నని చెప్పిన నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు సెప్పు మని సూతు నడుగుటయును. 399

ఆశ్వాసాంతము.

చ. §కొడుకులుఁ గూఁతులున్ సతియుఁ ♦ గూరుచుచుట్టలు నెట్టివారునుం
గడుకొని మానవుం డెసఁగు ♦ కాలమునం గడు నాదరించుచున్
విడువరు కాలు వంగుతఱి ♦ వేఁడును జూడఁగఁ బోఁడు గాన నే
నెడఁద భజింతు నిన్నొకని ♦ నే నను నోముఁగ నుండు మీశ్వరా. 400

గద్యము.

ఇది శ్రీమదధునాతనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్త్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునం
దారణ్యపర్వంబునం దృతీయాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.

‡ సుతసహితన్ = సుతతో సుతునితోఁ గూడికొన్నయది. (ఇట నేకశేషసమాసము).
† పాయవడు = తొలఁగు. § రోగాదులచేత శరీరస్థితి చెడియున్నతఱి వగునవస్థ కీలోకము "కాలు వంగియున్నప్పుడు" అని వాడుదురు.

శ్రీ

బాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

ఆరణ్యపర్వము—చతుర్థాశ్వాసము.



దేవీనవరాత్ర
ప్రాదుర్భూతప్రభావ♦పరతత్త్వనమ
ర్యాదీప్యమానవిభవా
మోదున్ శ్రీచంద్రమౌళిఁ ♦ బ్రోవుము దేవా. 1

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాదిమహామునుల కి ట్లనియె నట్లు బృహదశ్వుండు చనినవెనుకఁ బాండవు లెట్లు ప్రవర్తించి రని జనమేజయుం డడిగిన వైశంపాయనుం డి ట్లనియె. 2

పాండవు లర్జును రాకం గోరి పరితపించుట.

చ. అనిలము మెక్కుచున్ జలము ♦ లానుచు నొక్కమహావనంబునన్
ఘనుఁ డమరేంద్రనందనుఁ డ♦ఖండతపం బొనరించుచుండె నం
చనుగతు లైనతైర్థికు లమరముఖ్యులు సెప్ప వించు నా
తనికయి చింత చేసె నట ♦ ధర్మతనూజుఁడు భ్రాతృయుక్తుఁ డై. 3

వ. ఆసమయంబునఁ బాంచాలి పతులచెంతకుం జని యి ట్లనియె. 4

చ. ‡అకట కటా ధనంజయుఁ డ♦వాప్తసమిద్విజయుండు పోయె నిం
తకుఁ జను దేఁడు నాళ్లరిగెఁ ♦ దద్విరహంబు సహింప నోప నే
నిఁక జలదాసితాంగుఁడు న♦హీనగుణుం డగువానిలేమిఁ గా
మ్యక మిది రిత్తవోలెఁ గన ♦ నయ్యెఁ గురూద్వహులార కంటిరే. 5

వ. అనిన భీమసేనుం డి ట్లనియె. 6

చ. పరిఘలఁ బోలుబాహువుల ♦ భాసిలుచుండెడుతమ్ముఁ గుఱ్ఱఁ డా
పురుషవరేణ్యుఁ డర్జునుఁడు ♦ పోయిన దాదిగఁ గామ్యకంబు భా

‡ అవాప్తసమిద్విజయుండు = పొందఁబడినయుద్ధములందలివిజయము గలవాఁడు.

స్కరరహితాంబరంబువలెఁ ♦ గౌతుక మీయదు దిక్కు లెల్ల దు
ర్భరతిమిరావృతంబు లయి ♦ క్రాలనియట్టులు తోఁచుచుండెడిన్. 7

వ. అంతఁ జింతాకులస్వాంతుం డై నకులుం డిట్లనియె. 8

మ. దురమందుం బ్రతి లేనివీరుఁ డగుచుం ♦ దోర్దర్పమున దగ్ధ్వాభిమిఁ ది
తిరికల్మాషహయంబులం గొని కడుం ♦ దీపించి తా నస్న న
ద్ధ్వారమందు న్వెలుఁగొందఁ జేసినమహా♦దక్షుం డతం డొందుచోఁ
బరివర్తింపఁగ నిందు నుండుటకు నా♦భావంబు గా దయ్యెడిన్. 9

వ. అనిన సహదేవుం డిట్లనియె. 10

ఉ. ‡ఆహవమందు యాదవుల ♦ నందఱ నొక్కసుమంతలోన సం
దేహము లేనిచిత్తమునఁ ♦ దెల్లఁగ నేయుచు నాసుభద్ర ను
త్సాహముతోడఁ దెచ్చినవి♦శాలయశస్కుని వానిఁ బాసి నే
నీహ యొనర్ప నెంతప్రియ♦మేనియు నీవనమందు నుండఁగన్. 11

పాండవులకడకు నారదుండు వచ్చుట.

వ. ఇట్లు ధనంజయోత్సుకు లై యున్నవారిపలుకులు విని పాండవజ్యేష్ఠుండు విమన
స్కుం డై యుండ కొండొకవడికి సూర్యాగ్నిసదృశతేజంబున వెలుంగుచు వచ్చు
చున్ననారదుం గని తమ్ములతో నెదు రేగి తోడితెచ్చి పూజించిన నతండు వారి
నాశ్వాసించి నేను నీకడఁ బ్రసన్నుండ నైతి నన్నేమి యడిగెద రడుగుం డనిన ధర్మ
నందనుం డమ్మునిసంక్రందనున కభివందనంబు చేసి యిట్లనియె. 12

క. నీవు ప్రసన్నుఁడ వైనన్, భూవలయమునందు కాదు ♦ ముల్లోకములన్
దేవర్లు దేవమునులును, భావింపఁ బ్రసన్ను లనుచుఁ ♦ బలుకఁగ వచ్చున్. 13

వ. భ్రాతృసహితుండ నగునే ననుగ్రాహ్యుండ నైతి నాసందియంబు దీర్పుమని వెండియు.

తే. తీర్థతత్పరుఁ డై ధరి♦త్రీతలమును, వలగొనినవానికి ఫలంబు ♦ గలుగు నెద్ది
తెలుప వేఁడెద ననుటయు ♦ దేవమౌని, తెలియ వినుమని యిట్లని ♦ పలికెఁ గరుణ.

మ. మునులం గూడి సురాపగాతటమునన్ ♦ మున్నొక్కనాఁ డొక్కచో
ఘనుఁ డాభీష్ముఁడు పైతృకవ్రతము వే♦డ్కం బూని యుండంగ స
న్మునివర్యుండు పులస్త్యుఁ డచ్చటికి స♦మ్మోదమ్మున న్వచ్చె వ
చ్చినవాని న్నను నీవుఁబోలె నడిగెన్ ♦ సేవించి భీష్ముండునున్. 16

వ. అతం డతనికిఁ జెప్పినతెఱంగున నం జెప్పెద వినుము. 17

‡ ఈహ = కోరిక.



సీ. ఇంద్రియనియమంబు ♦ నిద్ధవ్రతము విద్య, దయయుఁ గీర్తియుఁ గల♦ధన్యతములు
కపటంబు విడి ప్రతి♦గ్రహ మెఱుంగక యహం, కారదూరగు లైన♦ధీరవరులు
పాపమార్గములందుఁ ♦ బడక కోపము లేక, సత్యంబు విడువని♦సాధుమతులు
సకలభూతములందు ♦ సమబుద్ధి గలిగి శౌ, చాచారమున నొప్పు♦నలఘుగుణులు

తే. సతతసంతుష్టు లై యుండు♦సుతచరితులు
సర్వతీర్థఫలంబును ♦ సర్వయజ్ఞ
ఫలమునుం బొంది యిం దందుఁ ♦ బ్రస్తుతింపఁ
బడుచు నుందురు వింటివే ♦ పార్థివేంద్ర. 18

మ. ధనహీను లొనరింపఁ జాల రధిక♦ద్రవ్యప్రసాధ్యంబు లై
వినుతిం గాంచినసప్తతంతువిధు లు♦ర్విన్ సర్వసాధ్యంబు లై
తనరుం దీర్థము లుత్తమంబు లగుతీ♦ర్థంబు ల్గనం బోక కాం
చన మొక్కించుక దాన మీక ఘనుఁ డున్ ♦ జన్మించు నిర్పేద యై. 19

వ. తీర్థాభిగమనం బగ్నిష్టోమాతిరాత్రాదులకన్న నధికఫలప్రదంబు నే నిటఁ గొన్నితీర్థం
బు లభివర్ణించెద నాకర్ణింపుము. 20

నారదుండు ధర్మరాజునకుఁ దీర్థయాత్రాఫలంబు సెప్పుట.

సీ. కలదు మర్త్యమునఁ బు♦ష్కరనామతీర్థవ, ర్యము త్రిజగద్విశ్రు♦తము వినుతము
పొదలుఁ ద్రిసంధ్యలఁ ♦ బదికోట్లవేలతీ, ర్థము లందుఁ బుణ్యప్ర♦దంబు లగుచు
నట వసింతురు సాధ్యు ♦ లాదిత్యులును రుద్రు, లచ్చరల్ గంధర్వు ♦ లవిరతంబు
పరమర్షులును సురా♦సురు లందుఁ దపియించి, సిద్ధి నొందిరి పుణ్య♦శీలు రగుచు

తే. నమ్మహాతీర్థమున నుండు ♦ నబ్జభవుఁ డ
విరతమును సన్నిహితుఁ డయి ♦ సురలఁ గూడి
దాని మదిలోనఁ దలచిన♦మానవుండు
విగతపాపుఁ డై తగునాక♦పృష్ఠమందు.

తే. అందు జలమాడి పితృదేవ♦తార్చనం బొ, నర్చునాతఁడు పేర్మిఁ ద♦నర్చి వాజి
మేధమునకన్నఁ బదిరెట్లు ♦ మించినట్టి, ఫలము నొంది జగత్త్రయ♦ప్రణుతుఁ డగును.

దండకము. ఆపుష్కరారణ్యమం దొక్కనాఁడేని యుం గందమూలంబులం బెట్టియేన
న్మహీదేవు సేవించిన న్వాజిమేధంబు గావింపఁగా నౌఫలం బబ్బెడుం గార్తికం
బం దటం దీర్థమాడంగ నూతేండ్లు వైశ్వానరుం గొల్వఁగా నైన పెం పంది
యేజాతివాఁడేఁ బునర్జన్మముల్ లేక వెల్గొందుఁ బంద్రెండువర్షంబు లచ్చోఁ దపం
బుఁడినం బ్రహ్మలోకాప్తి యౌ దానిచెంతం ద్రిశృంగంబులం జుట్టి పంద్రెం

డునా ళ్లిన్న జంబూలనన్మార్గమం బైదునా ళ్లున్న సోమాసి యైనట్టి డా నంతఁ దండూలికానామసిద్ధాశ్రమం బొం డగుం దాని సేవించినం దాపము ల్వాయు నాపై నగస్త్యాఖ్యకాసారమందుం ద్రిరాత్రంబు లర్చాపరుం డై నరుం డుండి కౌమారసుస్థానముం బొందుఁ గణ్వాశ్రమంబుకా సుధర్మాంచితారణ్యముం జొచ్చునంతకా సమస్తాఘము ల్వాయఁ జేయుకా యయాతీంద్రపాతస్థలంబుకా మహాకాళముం గోటితీర్థంబు నీక్షించి సేవించి పూతుం డగుకా రుద్రనామాతి భాస్వద్వటంబందు రుద్రుకా సమర్చింప దేవప్రసాదంబునం గోసహస్రంబు లీనా ఫలం బై గణాధీశ్వరత్వం బగుకా నర్మదం దర్పణంబుల్ పితృప్రీతిగాఁ జేసి యూసింధుతీర్థంబులం గ్రుంకి చర్మణ్వతికా రంతిదేవాభ్యనుజ్ఞాతుఁ డై కొల్చి స్వర్లోకముం గాంచు మీఁదకా వసిష్ఠాశ్రమం బందు నొండొక్కరే యుండినం బుణ్యవంతుం డగుకా బింగతీర్థంబునం దాడి పూతుం డగుకా వహ్నిసాయుజ్యత్వ. తిం బొల్చి పెం పౌ ప్రభాసాఖ్యతీర్థంబునం దాడి దివ్యాధ్వరోక్త ప్రభావంబునం బొల్చు వాణీనదీసంగమందుం జలంబాడినకా స్వర్గలోకాప్తి యౌ శౌరి దుర్వాసునిం బ్రోచునచ్చోట స్నానంబు గావించునేఁ డైన గోదానపుణ్యంబునం బోవు ద్వారావతిం బొల్చు పిండారకంబందుఁ బద్మంబులం బోనిముద్రల్ త్రిశూలాంకముల్ చూచుచుం దాన మాడంగ నీశానుసాన్నిధ్య మబ్బుకా మహాసింధుసంగంబునకా దేవపూజారతుం డైనచో వారుణం బైనలోకం బగుకా శంకుకర్ణేశ్వరుం గొల్చినకా వాజిమేధంబుకన్నకా ఫలం బున్నతం బౌ దమిప్రస్తుతాభిఖ్య నొప్పారుతీర్థంబునకా దేవదేవార్చితుం డైనకాత్యాయనీవల్లభుం గొల్వ జన్మాదిసంప్రాప్తపాపౌఘ మెల్లం బటాపంచ లై పోవు నం దచ్యుతుం డాదికాలంబునకా దైత్యులం ద్రుంచి తత్కల్మషం బెల్లఁ బోకార్చె నామీఁద వస్వాద్యధారాఖ్య నాతీర్థమం దాడినకా దైర్ఘికుం డెప్పుడుకా విష్ణుసాయుజ్యముం బొందు సింధూత్తమాఖ్యకా ఘనం బైనతీర్థంబు సేవించి బహ్వర్థయుక్తుం డగుకా భద్రతుంగంబు వీక్షించినకా బ్రహ్మలోకం బగుకా శక్రపుత్రీసుతీర్థంబు స్వర్గప్రదం బయ్యెడికా రేణుకాతీర్థ మంహోపహం బవ్వలం బంచతీర్థంబు నాఁగన్నదంబుల్ మదిం గొల్చినం బంచయజ్ఞంబులం జేయుపుణ్యం బొసంగు న్మనీంద్రాంచితం బైనభీమానదిం గ్రుంకి దేవీసుతుం డై జనుం డొప్పు శ్రీకుండమం దావిధాతం దగకా మ్రొక్కి భద్రంబులం బొంది భక్తుండు దీపించెడికా. 23

తే. అవల విమలాఖ్యతీర్థ మౌ • నందుఁ బైఁడి, చేఁపలును వెండిచేఁపలు • చెలఁగుచుండు
నచట జలమాడి మానవుం • డమరలోక, మందు నఖలపాపంబుల • నడఁచి నై చి-



తే. అలరుఁ గాశ్మీరములఁ దక్ష • కాహిభవన, మది వితస్తాఖ్య నొప్పారు • నందు స్నాన
మాచరించిన వాజపే • యాధ్వరఫల, మంది పొందు నరుం డుచ్ఛ • మైనగతిని. 25

చ. బడబ యనంగ దీర్థ మది • ప్రస్తుతి కెక్కు ధరాతలంబునం
బడమటిసంజయం దచట • వారి స్పృశించి పితృప్రియంబుగా
నిడి జ్వలనంబునం జరు వ • హీనగతిం భజియించెనేని మ
ర్త్యుఁడు బహురాజసూయఫల • మొంది శుభంబుల నెల్లఁ బొందెడుకా 26

వ. తొల్లి గరుడ గంధర్వ కిన్నర యక్ష రాక్షస విద్యాధర గుహ్యక సిద్ధసాధ్యాదిదేవయోను లెల్ల బ్రహ్మం బురస్కరించుకొని యట వేయేండ్లు నియమవ్రతంబున నొక్కచరువుం జేసి యేడేనువేదబుక్కుల నొక్కమొగి స్తుతించుచు విష్ణు నారాధించి యష్టైశ్వర్యంబులతో నిష్టార్థసిద్ధిం బడసి రది మొద లది సప్తచరుసంజ్ఞికం బై ఫలప్రదం బయ్యె నవలరుద్రపదం బది సేవించినవారు మహాదేవప్రసాదంబున నశ్వమేధఫలంబు వడయుదు రంత మణిమంతంబు నొంది యట నొక్కరే యున్న నగ్నిష్టోమఫలం బగు నవల దేవికాతీర్థం బటఁ ద్రిశూలపాణి నర్చించి చరువు నివేదించిన యజ్ఞఫలంబు వడయం గలుగు నర్ధయోజనవిస్తారంబును బంచయోజనాయతంబు నగునద్దేవికాతీర్థంబు నంటి కామాఖ్యరుద్రతీర్థంబును యజనయాజనబ్రహ్మవాలుకాదితీర్థంబులు నగు నవి సిద్ధిప్రదంబు లటమీఁద బ్రహ్మాదిదేవతలు పరమర్షిసమేతు లై తొల్లి దీర్ఘసత్రంబు గావించినకారణంబున నైనదీర్ఘసత్రస్థానంబు సమీక్షణమాత్రంబున రాజసూయాశ్వమేధఫలం బొసంగు నంత వినశనం బనుతీర్థంబుగల దట నంతర్హిత యై సరస్వతి మేరుపృష్ఠంబునం బోవుచుఁ జమసోద్భేద శివోద్భేద నాగోద్భేదంబులఁ గానంబడు నందుఁ జమసోద్భేదంబున నగ్నిష్టోమఫలంబును శివోద్భేదంబున గోసహస్రఫలంబును నాగోద్భేదంబున నాగలోకావాసఫలంబును స్నాతల కగు మఱియు నాసరస్వతియందు శశయానతీర్థంబున శశిరూపప్రతిచ్ఛన్నంబు లై పుష్కరంబు లొక్కవత్సరం బుండు నచటిస్నానదానాదికం బక్షయఫలప్రదంబు కుమారకోటితీర్థంబునఁ బితృదేవార్చనపరుం డై నరుండు స్నానంబు చేసి గోసహస్రఫలం బంది కులం బుద్ధరించు ననంతరంబ. 27

ఆ. తనరు రుద్రకోటి • యనుతీర్థ మట మున్ను, నేను నే నటంచుఁ • బూని మౌని
కోటి రుద్రుఁ గొల్వఁ • గూడ వారలకోర్కి, దీర శివుఁడు కోటి • తీరు లయ్యె. 28

వ. అచటిస్నానం బశ్వమేధఫలప్రదం బవ్వల సరస్వతీసాగరసంగమం బట బ్రహ్మాదిదేవతలును దివ్యర్షులును జైత్రశుక్లచతుర్దశీదినంబున వచ్చి కేశవు నారాధించి పోవుచుందు రది ఋషీంద్రసత్రస్థానం బగునత్తీర్థంబు గోసహస్రఫలప్రదంబు. 29

క. అవలఁ గురుక్షేత్రం బను ప్రవిమలస్థలము దనరుఁ • బరికించినమా
త్ర వెసం బాపంబుల నెల్ల వినాశన మాచరించి • లక్షింపఁగ నై. 30

తే. ఏఁ గురుక్షేత్ర మరయంగ • నేఁగువాఁడ
నేఁ గురుక్షేత్రమున నుందు • నెల్లకాల
మనుచు భాషించు నెవ్వఁ డా • జనుఁడు దురిత
దూరుఁ డై యొప్పు నెప్పుడు • దోసఁగు లేక. 31

వ. సరస్వతీనదికి దక్షిణంబుగను దృషద్వతీనది కుత్తరంబుగను రామహ్రదంబులకును మచక్రుకమునకును మధ్యమంబుగను దరంతుకారంతుకంబుల కంతర్గతంబుగను నెసంగుధర్మక్షేత్రం బగునాకురుక్షేత్రంబు పితామహున కుత్తరవేది యై బ్రహ్మవేది యనం బొల్చి మహర్షిసేవితం బయ్యె నందు. 32

ఉ. వాయుసమీరితంబు లగు • పాంసువులైనను బాపకర్మునిం
బాయఁగఁ జేయు దుర్గతి క • పారమహత్త్వము గూడ నచ్చోటన్
బాయక బ్రహ్మముఖ్యులు ని • వాసముసేయుచు నుందు రిచ్చమై
నేయెడ నైన దాని మది • నెంచినమాత్ర మహాఫలం బగున్. 33

తే. అందు మంకణకుం డను • ద్వారపాలు, సరసి మ్రొక్కిన గోసహ • స్రాతిఫలము
నందు నరుఁడు విష్ణుస్థాన • మరసి జలము, లాడి హరిఁ గొల్వ విష్ణులో • కాప్తి యగును.

వ. అంతఁ బారిప్లవం బనుతీర్థం బాడి యగ్నిష్టోమాతిరాత్రఫలంబును బృథివీతీర్థం బాడి గోసహస్రఫలంబును శాలూకినీతీర్థం బాడి భూదానఫలంబును దశాశ్వమేధతీర్థం బాడి దశాశ్వమేధఫలంబును సర్పదేవీతీర్థం బాడి జ్యోతిష్టోమఫలంబును దరంతుకనామద్వారపాలుం గొలిచి గోసహస్రదానఫలంబును బంచనదంబునఁ గోటితీర్థం బాడి హయమేధఫలంబును బొందఁ గలుగు నశ్వితీర్థం బాడి తైర్థికుండు రూపవంతుం డగు వరాహతీర్థం బాడి వరాహరూపుం డగుపుండరీకాక్షు నర్చించి పాపవిముక్తుం డగు జయంతియందు సోమతీర్థం బాడి రాజసూయఫలంబు వడయు నేకహంసతీర్థం బాడి గోసహస్రదానఫలంబు నొందుఁ బుండరీకంబు కృతశౌచతీర్థం బాడి శుచి యగు శైవం బగుముంజవటంబున నొక్కనాఁ డుపవసించి గాణపత్యంబు గాంచు యక్షిణీతీర్థం బాడి సర్వకామంబులం బొందుఁ గురుక్షేత్రం బిట్లు ప్రదక్షిణించి పుష్కరంబుల స్నానంబు గావించి జమదగ్నిరామకృతపంచహ్రదంబుల నాడి పితృతర్పణంబు గావించి రాము నర్చించి కృతకృత్యుం డై వాజిమేధఫలంబు వడయు నవ్వల వంశమూలకం బనుతీర్థం బాడి వంశోద్ధారకుం డగుఁ గాయశోధనతీర్థం



బాడి కాయశుద్ధిం బొందు వైకుంఠుండు లోకంబు లుద్ధరించినకతన నైనలోకోద్ధారతీర్థంబు సేవించి నిజలోకంబు నుద్ధరించు శ్రీతీర్థం బాడి శ్రీమంతుం డగుఁ గపిలాతీర్థం బాడి కపిలగోసహస్రదానఫలం బందు సూర్యతీర్థం బాడి సూర్యలోకంబు నొందు గోభవనతీర్థం బాడి గోసహస్రఫలంబు వడయు శంఖినీతీర్థం బాడి సుందరవంతుం డగు నటఁ దరండకనామద్వారపాలు సేవించి సరస్వతియందు యక్షేంద్రతీర్థం బాడి లక్ష్మీకటాక్షపాత్రుం డగు బ్రహ్మావర్తం బనుతీర్థం బాడి బ్రహ్మలోకంబు వడయు నంబుమతియందు సుతీర్థం బాడి పితృలోకం బందుఁ గాశీశ్వరతీర్థం బాడి సర్వవ్యాధివిముక్తుం డగు మాతృతీర్థం బాడి ప్రజావంతుండును ధనవంతుండును నగు శీతవనంబున నీతాశనుండై పూతుం డగు లోమాపహతీర్థం బాడి పరమగతిం బడయు మృగవ్యాధవిద్ధంబు లైనమృగంబులు తగం జొచ్చి మానుషత్వంబు నొందినకతన మానుషంబు నాఁబరఁగుతీర్థంబున స్నాతుం డై పూతుం డగు మానుషతీర్థంబునకుఁ బూర్వదిగ్భాగంబునఁ గ్రోశమాత్రదూరంబున నాపగ యనునది గల దందుఁ దీర్థం బాడి యొక్కవిప్రునకు శ్యామాకభోజనంబు వెట్టి కోటివిప్రులకుం బెట్టినఫలంబు నందు నవల బ్రహ్మోదుంబరం బను బ్రహ్మస్థానంబునం గలసప్తర్షికుండంబులం జలం బాడి కపిలునికేదారంబున బ్రహ్మ నర్చించి విశుద్ధాత్ముం డై బ్రహ్మలోకంబు నందు సరకం బనుతీర్థం బాడి కృష్ణపక్షచతుర్దశినాఁడు సర్వేశ్వరుఁ బూజించి సర్వకామంబులం బొందు రుద్రకోటితీర్థకూపహ్రదంబులు గలరుద్రకోటియందు నిలాస్పదం బనుతీర్థం బాడి వాజపేయఫలంబు నందుఁ గిందానకింజప్యంబు లనుతీర్థంబు లాడిన దానజపఫలంబు లక్షయంబు లగుఁ గలశీతీర్థం బాడిన యజ్ఞఫలం బగు నారదునియంబాజన్మతీర్థంబునఁ బ్రాణత్యాగంబు చేసిన సర్వోత్తమలోకంబు లగు శుక్లపక్షదశమీదినంబునఁ బుండరీకతీర్థం బాడినఁ బుండరీకఫలం బగు వైతరణీస్నానం బొనరించి శూలపాణిం బూజించినఁ బాపవిముక్తి యగు నవల ఫలకీవనంబున దృషద్వతీనదిం జలం బాడి జ్యోతిష్టోమాతిరాత్రఫలంబును సర్వదేవతీర్థం బాడి గోసహస్రఫలంబును బాణిఘాతతీర్థం బాడి యగ్నిష్టోమఫలంబునుం బొందఁ గలుగు వ్యాసకృతం బై సర్వతీర్థమిశ్రితం బైనమిశ్రకతీర్థం బాడి సర్వతీర్థస్నానఫలంబు నందు వ్యాసవనంబున మనోజవతీర్థం బాడి గోసహస్రఫలంబు నందు మధువటి యందు దేవీతీర్థం బాడి విగతకల్మషుం డగుఁ గౌశికీదృషద్వతీసంగమంబున స్నాతుండై నియతాహారుండై ముక్తిం బడయుఁ దొల్లి వ్యాసుండు పుత్రశోకాభితప్తుం డై దేహత్యాగంబు సేయ నున్నసమయంబున దేవతలు ప్రత్యా

ష్టుండై వాని ననుగ్రహించుటంజేసి వ్యాసస్థలి నాఁబడు నటఁ జని గోసహస్రఫలం బందుఁ గిందత్తం బనుకూపంబునఁ దిలప్రస్థం బిడి పితృఋణవిముక్తుం డగు సహాస్నదినతీర్థంబు లాడి సూర్యలోకంబు వడయు నంత గంగానదిం గలమృగధూమతీర్థం బాడి దేవారాధనంబు గావించి మహాఫలంబు వడయు దేవీతీర్థం బాడియు విష్ణుపదంబున జలంబాడియు విష్ణులోకంబు నొందుఁ గులంపునం బనుతీర్థం బాడినఁ గులంబు పావనం బగుఁ బవనహ్రదం బనుమరుత్తీర్థం బాడి వాయులోకంబు నందు నమరహ్రదంబున జలం బాడి యమరుం డగు శాలిహోత్రునిశాలిసూర్యంబున నభిషిక్తుండై గోసహస్రఫలం బందు సరస్వతిం గలశ్రీకుంజతీర్థం బాడి జ్యోతిష్టోమాతిరాత్రఫలం బందు నవ్వల. 35

ఉ. నైమిశనామకాననము♦నన్ దగుమానివరేణ్యు లెల్లరున్
భూమిఁ గలట్టితీర్థములు ♦ పోయి భజించుచు నక్కురుస్థలిన్
బ్రామి వడిన్ గమించెదుస♦రస్వతిఁ గుంజ మొనర్చి రద్దియే
నైమిశకుంజ మై తనరె ♦ స్నాతలపాతకముల్ హరించుచున్. 36

ఆ.*అవల బ్రహ్మతీర్థ ♦ మలరు వర్ణావరు
లచట జలము లాడి♦నంత బ్రాహ్మ
ణుండఁ గలరు బ్రాహ్మ♦ణోత్తముల్ బహ్మలో
కాప్తి నెసఁగుచుందు ♦ రందు మునిఁగి. 37

వ. అంత ననంతఫలప్రదంబు లైనకన్యాతీర్థసోమతీర్థంబుల కవ్వల సప్తసారస్వతతీర్థం బగు దానిమహత్వంబు వినుము. 38

మంకణకునివృత్తాంతము.

ఉ. మంకణకుండు నాఁగ నొక♦మాన్యచరిత్రుఁడు తొల్లి చేతిలోఁ
గొంకక దర్భతోఁ బొడుచు♦కో నట శాకరసంబు గాఱుటన్
బింకముతోడ నవ్వుచును ♦ బెట్టుగ నట్టువ మాడె నట్టిచో
నంకిలి లేక భూతము లి♦వన్నియు నట్టువ మాడె బెట్టుగన్ 39

తే. అట్లు తేజోవిమోహిత ♦ మై చరాచ
రాంచితజగంబు నట్టువ ♦ మాడుచున్నఁ
గని భయంపడి సురలును ♦ మునులుఁ గదలి
చని మహాదేవునకుఁ జేసి♦కొనిరి మనవి. 40

వ. అతనినృత్యం బుడిగి లోకోపద్రవశాంతి గావింపు మని ప్రార్థించినం బరమేశ్వరుండు సురలోకహితార్థి యై మంకణకునిచెంతకుం జని యి ట్లనియె. 41

* వర్ణావరులు = తక్కువవర్ణములవారు.



చ. మునివర యేమి యి ట్లుడిగి♦పోనివిధంబున నాడుచుంటి వీ
ఘన మగుసంతసంబునకుఁ ♦ గారణ మేమి యన న్మునీశ్వరుం
డనుఁ గనవే మదీయకర♦మం దిటు శాకరసంబు లూఱుటన్
గనుఁగొని హర్షమందుచును ♦ నట్టువ మాడెద నిత్తెఱంగునన్. 42

క. అనిన మహాదేవుం డా,తని మోహితుఁ జేసి యద్భు♦తంపమదు ని నే
నినుఁ గాంచి యంచు వ్రేలం, బెనువ్రేలున మీటికొనియె ♦ విస్మయ మొదవన్. 43

వ. దానంజేసి యయ్యంగుష్ఠాగ్రంబున హిమసన్నిభం బగుభస్మంబు సంభవించె దానిం జూచి వ్రీడితుం డై మంకణకుండు మాయామునిపాదంబుల సాఁగిలఁబడి యి ట్లనియె. 44

ఉ. నీవు చరాచరంబులకు ♦ నేతవు త్రాతవు సంవిధాతవున్
నీవు సమస్తలోకముల ♦ నిల్పుదు కల్పుదు వగ్గిమంటలో
నీవు మహేశ్వరుండ వెద ♦ నిన్ను నెఱుంగఁగఁ జాల రెవ్వరున్
దేవ మహానుభావ యిదె ♦ నీకు నమస్కృతు లాచరించెదన్. 45

క. నాదుతపం బక్షర మై, భూదివములు ప్రోయునట్లు ♦ పొసగింపవె నా
నా దేవదేవుఁ డి ట్లను, భూదేవ ననుగ్రహించి ♦ ముద మెదఁ బొదలన్. 46

ఉ. నీతప మక్షయం బగుచు ♦ నింపు జగత్త్రయమందుఁ బొంది నే
నేతఱి నిన్నుఁ గూడి వసి♦యించెద నిం దగు నట్టితీర్థ మ
త్యాతతపుణ్యగణ్య మగు♦నట్లు పొసర్చెద స్నానమాత్రనే
పాతకజాలముల్ దులిచి♦వైవఁగఁ జాలువరం బొసంగెదన్. 47

వ. అని చెప్పి రుద్రుం డంతర్ధానంబు నొందె దానంజేసి సప్తసారస్వతతీర్థంబు సర్వోత్కృష్టం బయ్యె నవల నౌశనసతీర్థం బగు నందలి స్నానపానంబులు మహాపాతకోపపాతకహారంబులు కపాలమోచనతీర్థంబు సర్వపాపప్రమోచనంబు వహ్నితీర్థంబు కులోద్ధారకంబు విశ్వామిత్రతీర్థంబు బ్రాహ్మ్యప్రదంబు బ్రహ్మయోనితీర్థంబు బ్రహ్మలోకావాప్తికరంబు పృథూదకతీర్థంబు జ్ఞానాజ్ఞానకృతదోషహరంబు మధుస్రవతీర్థంబు మలాపహంబు దర్భిమునినిర్మితంబును జతుస్సముద్రగర్భితంబు నగునర్థకీలతీర్థంబు సర్వార్థసిద్ధిదంబు శతసహస్రం బనుసాహస్రతీర్థంబు గోసహస్రఫలప్రదంబు రేణుకాతీర్థంబు పితృప్రీతికరంబు విమోచనతీర్థంబు ప్రతిగ్రహదోషహరంబు పంచవటీతీర్థంబు గమనమాత్రసిద్ధిదాయకంబు వారుణ మ్మగు తైజసతీర్థంబు తేజోదాయకంబు కురుతీర్థంబు బ్రహ్మలోక

ప్రదంబు స్వర్గద్వారతీర్థంబు స్వర్గలోకప్రదంబు నరకతీర్థంబు నరకదుఃఖహరంబు.

క. హరుఁడును హరియును గౌరియు, నిరతము తత్తీర్థమందు ◆ నివసించి సమ
ద్వరజనముక్తిదు లై వెలసిరి దేవేంద్రాదిదేవ◆సేవితు లగుచున్. 49

వ. స్వస్తిపురంబుఁ జుట్టివచ్చిన గోసహస్రఫలం బగుఁ బావనతీర్థంబునఁ బితృతర్పణంబు చేసిన నగ్నిష్టోమఫలం బగు సార్ధత్రికోటితీర్థసమేతం బగుగంగాహ్రదంబునందలికూపంబున జలం బాడిన స్వర్గలోకప్రాప్తి యగు నాపగాతీర్థం బాడిన గాణపత్యం బగు స్థాణువటతీర్థంబున స్నానంబు గావించిన రుద్రలోకం బగు బదరీపాచనంబునందలివసిష్ఠాశ్రమంబున మూఁడురాత్రు లుపవసించి బదరీఫలంబు భక్షించిన మహాఫలం బగు నింద్రమార్గంబున నొక్కయహోరాత్రం బుపవసించిన నింద్రలోకం బగు నేకరాత్రతీర్థంబున నేకరాత్రంబున్న బ్రహ్మలోకం బగు నాదిత్యాశ్రమంబున నాదిత్యుం బూజించిన నాదిత్యలోకం బగు సోమతీర్థం బాడిన సోమలోకం బగు దధీచతీర్థం బాడిన వాజిమేధఫలం బగు సారస్వతతీర్థం బాడిన సారస్వత గతి యగుఁ గన్యాశ్రమంబున మూఁడునాళ్లున్నఁ గన్యాశతప్రాప్తియగు సన్నిహతీతీర్థంబునఁ బిత్ర్యమావాస్యయందును విశేషించి సూర్యోపరాగంబునందును దీర్థశ్రాద్ధంబు గావించిన నశ్వమేధఫలం బగు నచక్రునామద్వారపాలుం దర్శించి కోటితీర్థం బాడినఁ గోటిసువర్ణనిష్కలాభం బగు గంగాహ్రదతీర్థం బాడిన రాజసూయఫలం బగు ధర్ముండు తపించుటం జేసి ధర్మతీర్థంబు నాఁబడుతీర్థంబున జలం బాడినఁ గులోద్ధరణం బగు జ్ఞానపావనతీర్థం బాడిన మునిలోకం బగు సౌగంధికవనంబుఁ జొచ్చిన సర్వపాపవిముక్తి యగుఁ బ్లక్షాదేవీతీర్థంబున వల్మీకనిస్సృతం బగుజలం బాడిన నశ్వమేధఫలం బగు నీశానాధ్యుషితతీర్థం బాడినఁ గపిలాసహస్రదానఫలం బగుఁ ద్రిశూలఖాతతీర్థంబున స్నానంబు చేసిన గణపతిత్వం బగు శాంభవీతీర్థం బాడి త్రిరాత్రోపవాసంబు చేసి శాకంబు భక్షించినఁ బండ్రెండేండ్లు శాకాహారంబు చేయుచుఁ దపించినఫలం బగు సువర్ణతీర్థం బాడి యటఁ దొల్లి విష్ణుదేవుండు పూజించినరుద్రదేవుం బూజించిన నశ్వమేధఫలం బగు ననంతరంబ. 50

సీ. ధూమావతికిఁ బోయి ◆ నేమంబుతో మూఁడునాళ్లున్నఁ గోరిక ◆ లెల్లఁ దీరు
దేవీరథావర్త◆దేశం బధిష్ఠింప, నుత్తమోత్తమగతు ◆ లొందఁ గలుగు
ధారాజలం బాడి ◆ తరలి మహాగిరి, వలగొని మ్రొక్కిన ◆ ఫల మనంత
మనల గంగాద్వార◆మం దలకోటితీ,ర్థముల నాడినఁ ◆ మహార్థము లభింపు



తే. నంత సప్తగంగాజల◆మందు మునిఁగి, యర్థకలితకుశావర్త◆మందు దేవ
తర్పణంబు లొనర్చినఁ ◆ దైర్థికుండు, పుణ్యలోకంబులను బొందుఁ ◆ బూజ్యుఁ డగుచు.

క. అవలఁ గనస్వలతీర్థం, బవు నట నభిషిక్తుఁ డయి మ◆హాధ్వరఫలముల్
దవులుం గపిలావటమునఁ, బ్రవిమలమతి నుపవసించి ◆ వ్రతి సుకృతి యగున్. 52

ఆ. కపిలతీర్థ మాడి ◆ కపిలగోదానఫ,లమ్ము వడయు లలిత◆కమ్మునందుఁ
దీర్థమాడి దుర్గ◆తికిఁ గాక తైర్థికుం, డశ్వమేధఫలము ◆ నంది పొందు. 53

క. గంగాయమునాసంగము,నం గను నియమమున నాడి ◆ నరుఁ డఘము దొలం
గం గాంచు వాజిమేధము,నం గలఫల మెల్ల నొక్క◆నాఁటన తెలియన్. 54

వ. అంత సుగంధతీర్థంబును రుద్రావర్తతీర్థంబును గంగాసరస్వతీసంగమతీర్థంబును భద్రకర్ణేశ్వరక్షేత్రంబును గుంజామ్రకక్షేత్రంబును నరుంధతీవటంబును సాముద్రకంబును బ్రహ్మావర్తక్షేత్రంబును యమునాప్రభవతీర్థంబును దర్వీసంక్రమణతీర్థంబును సింధుప్రభవతీర్థంబును వేదీతీర్థంబును ఋషికుల్యాతీర్థంబును వాసిష్ఠీతీర్థంబును భృగుతుంగంబును వీరప్రమోక్షతీర్థంబును విద్యాతీర్థంబును మహాశ్రమంబును మహాలయంబును వేతసికాతీర్థంబును సుందరికాతీర్థంబును బ్రాహ్మణీతీర్థంబును నైమిశక్షేత్రంబును గంగోద్భేదతీర్థంబును సరస్వతీతీర్థంబును బాహుదాతీర్థంబును క్షీరవతీతీర్థంబును విమలాశోకతీర్థంబును గోప్రతారతీర్థంబును గోమతియందు రామతీర్థంబును శతసాహస్రకతీర్థంబును భర్తృస్థానంబును గోటితీర్థంబును స్నానదానోపోషవ్రతంబుల నగ్నిష్టోమాతిరాత్రఫలం బొసంగుచుండు నవ్వల వారాణసీక్షేత్రంబు. 55

మ. వరణాసీనదిమధ్యమం దయినయ◆వ్వారాణసీక్షేత్రము
ర్వర ముక్తిప్రదమై తనర్చు నచటన్ ◆ వాసించు విశ్వేశ్వరుం
డరు దై దర్శనమాత్ర భక్తులకు ని◆స్తారప్రదుండై మహే
శ్వరితో మాధవుతోఁ గుమారకులతో ◆ సర్వామరశ్రేణితోన్. 56

ఉ. *అయ్యవిముక్తమందుఁ దను ◆ వల్లన వీడినమానవాళికిన్
జయ్యన మోక్ష మబ్బు నని ◆ సంయమిచంద్రులు పల్కుచుండ్రు వే
వ్రయ్య లగున్ క్షణార్ధమున ◆ వచ్చినభక్తులపాపజాలముల్
బ్రుయ్యు సమస్తదుఃఖములు ◆ భూతలమం దది పుణ్యభూమి యౌ. 57

వ. అట గంగానదిం గలమణికర్ణికాదితీర్థంబులు భుక్తిముక్తిప్రదంబులు కపిలాహ్రదస్నానం బశ్వమేధఫలప్రదంబు మార్కండేయతీర్థంబు మోక్షప్రదంబు గోమతీగంగా

* బ్రుయ్యు = నశించు.

సంగమతీర్థంబు జ్యోతిష్టోమఫలప్రదంబు గయాక్షేత్రంబు గమనమాత్రపాపహారం
బం దక్షయవటంబునఁ బిండప్రదానం బక్షయఫలదంబు మహానదీస్నానంబు పితృప్రీతి
కరంబు ధర్మారణ్యోపశోభితం బగుబ్రహ్మసరంబు బ్రహ్మలోకప్రదం బచటం గల
యూపప్రదక్షిణంబు వాజపేయఫలప్రదంబు ధేనుకక్షేత్రంబునఁ దిలధేనుకాదానంబు
సోమలోకప్రదంబు వినుము. 58

తే. కపిలధేనువు తనవత్సఁ ◆ గలసి వచ్చి, యచటఁ బర్వతమున నడ◆యాడె మున్ను
దానఁ బదచిహ్నములు నేఁడుఁ ◆ గానఁబడును, వానిఁ ద్రోనిజలం బంట◆వ్యాధు లుడుగు.

ద్విపదము. అవల రుద్రవటంబు◆నందు భస్మమున, శివుచెంత స్నానంబు ◆ చేసి నరుండు
విదితముగా నొందు ◆ వివిధఫలముల, నుదయపర్వతమున ◆ నుదితార్కు నెఱిఁగి
సావిత్రిపదమున ◆ సావిత్రిఁ గొలిచి, పావనమూర్తి యై ◆ పరఁగి యం దున్న
దివతియోనిద్వార◆దేశంబు సొచ్చి, దివ్యుఁ డౌ జన్మంబు◆తెరువునఁ బోక
ఫల్గుతీర్థం బాడఁ ◆ బరమార్థసిద్ధి, గల్గుఁ గోనుం దీర్థ◆కాముండు ముఖ్య
ముగను ధర్మప్రస్థ◆మునఁ గూపవారిఁ, దగ నభిషిక్తుఁడై ◆ తఱుగుఁ బాపముల
మునిమతంగాశ్రమ◆మున ధర్మమూర్తిఁ, గనివాజిమేధయా◆గఫలంబు నొందు
నంత బ్రహ్మస్థాన ◆ మగు నందు బ్రహ్మ, శాంతుఁడై సేవించి ◆ సర్వార్థసిద్ధి
వడయు రాజగృహాఖ్య ◆ వఱలుస్థలంబు,కడ యక్షిణిం గొల్చి ◆ కలుషంబు డుల్చి
మణినాగమున కేగి ◆ మహిమఁ జెన్నొంది, ఫణివిషం బెక్కని◆పద్ధతి నొప్పఁ
బిదప గౌతమవని ◆ వెలయునహల్యహ్రదమున నీ రాని ◆ యజ్ఞఫలంబుఁ
బొంది జనకకూప◆మున జలం బాడి, యిందిరేశునిఁ బొంది ◆ యింపొందు జనుఁడు
వినశనస్థానంబు ◆ వెసఁ జనఁ జంద్ర,మునిలోకమునయందుఁ ◆ బొందు లభించు
గండకి సేవింపఁ ◆ గలిగెడు నర్కు,నంద నుండెడుగతి ◆ యవల విశల్య
యనునది నీరాడి ◆ యమరలోకంబుఁ, గాను మీఁదఁ గంపనా◆కూలంకషాంబు
వుల నాడి పూతుఁడై ◆ పోయి స్వర్గమున, నలరుచుండెడుఁ బెక్కు ◆ లగువత్సరములు
మాహేశ్వరీధార ◆ మనుజుండు పొంది, మాహేశ్వరస్థాన◆మహితుఁ డౌ నంత
దేవపుష్కరిణిలోఁ ◆ దీర్థంబు లాడి, దేవలోకమునందు ◆ దీపించు నెపుడు
సోమపదంబును ◆ జొచ్చి నీరాడి, సోమఫలం బందు ◆ శుద్ధుఁడై నరుఁడు
కోటితీర్థము లెందుఁ ◆ గొమరొందు నట్టి,కోటితీర్థం బాడి ◆ కుల ముద్ధరించు
నవల సాలగ్రామ ◆ మనుహరిక్షేత్ర, మపు నందు హరిఁ గొల్చి◆యమరత్వ మొందు
నటఁ గూపమునఁ జతు◆రబ్ధులుం గలవు, మఱుమాయ మగుఁ బాప◆మందుల మచట
జాతిస్మరం బను◆సత్తీర్థ మాడి, జాతిస్మరత్వంబు ◆ జనుఁ డందుఁ బిదప



మాహేశ్వరపురంబు ◆ మహి నొప్పు నందు, నీహామైహరుఁ గొల్చి◆యాప్తార్థముల
నొందు వామన మన◆నొప్పుక్షేత్రమ్ము,నందువామనుఁ గొల్చి◆యఘములఁ బాయుఁ
గౌశికాశ్రమమందుఁ ◆ గౌశికి నాడి, లేశ మైనను నేగి ◆ లేక మెలంగుఁ
జంపకారణ్యంబు ◆ సనినమాత్రమున, సంపత్సమృద్ధి యౌ ◆ జనుల కెవ్వేళ. 60

క. కన్యాసంవేద్యం బను,ధన్యం బగుతీర్థ మలరుఁ ◆ దత్తీర్థమునం
గన్యాదానము చేసిన,మాన్యులు గైకొం డ్రనంత◆మహిమోన్నతులన్. 61

క. *నిర్వీరతీర్థ మాడిన, నుర్వీజను లమరలోక ◆ మొందెద రచటం
బర్వి వసిష్ఠాశ్రమమున్, సర్వస్తోమములఫలము ◆ సమకుఱఁ జేయున్. 62

సీ. దేవకూటంబున ◆ దివ మొందు వసియించి, వాజిమేధఫలంబు ◆ నడయు జనుఁడు
కౌశికహ్రదమునఁ ◆ గడు నిష్ఠ నొకమాస, మున్నఁ బాపము లెల్ల ◆ నోసరిల్లు
వీరాశ్రమంబున ◆ వెలయుకుమారు నర్చించి విద్వాంసుఁ డై ◆ చెన్ను మీఱు
నగ్నిధారాతీర్థ ◆ మాడి మహాదేవు, సేవించిరే నర్థ◆సిద్ధి యగును

తే. శైలరాజసమాన మై ◆ శాలునప్పు,శౌమహాసరోవరంబు నం◆ద్గానఁ బ్రస
వించెడుకుమారధారను◆ర్వీసురుండు,బ్రహ్మహత్యాఘమును బాసి◆పరఁగు నెపుడు.

వ. అంత గౌరీశిఖరంబునందలిస్తనకుండంబులును దామ్రారుణకుండంబులును నంది
నీకూపంబును గాళికాసంగమంబును గుంభకర్ణాశ్రమంబును గోకాముఖంబును
నందాతీర్థంబును ఋషభద్వీపంబును క్రౌంచనిషూదకంబును సరస్వతీతీర్థంబును
నౌద్దాలకంబును ధర్మతీర్థంబును భాగీరథియందుఁ జంపాతీర్థంబును దండావ
ర్తనంబున లలితికాతీర్థంబును సంవేద్యతీర్థంబును లౌహిత్యతీర్థంబును గరతో
యాతీర్థంబును గంగాసాగరసంగమంబును నవతరణతీర్థంబును విరజతీర్థంబును
శోణజ్యోతిరథ్యాసంగమంబును వంశగుల్మతీర్థంబును ఋషభతీర్థంబును బదరికా
తీర్థంబును దండాఖ్యతీర్థంబును లపేటికాతీర్థంబును మహేంద్రంబున జమదగ్ని
రామతీర్థంబును మతంగకేదారతీర్థంబును శ్రీపర్వతంబున నదీతీర్థంబును దేవ
హ్రదతీర్థంబును ఋషభపర్వతంబును గావేరీతీర్థంబును సముద్రతీరంబునఁ
గన్యాతీర్థంబును గోకర్ణంబును గాయత్రీస్థానంబును సంవర్తవాపీతీర్థంబును
గోదావరీతీర్థంబున వేణాసంగమతీర్థంబును వరదాసంగమతీర్థంబును బ్రహ్మ
స్థానంబును గుశప్లవనతీర్థంబును గృష్ణవేణీజలోద్భవం బగుదేవహ్రదారణ్యంబును
జాతిస్మరహ్రదంబును సర్వహ్రదంబును బయోష్ణీతీర్థంబును దండకారణ్యం

* స్తోమము = యజ్ఞము.

బును శరభంగాశ్రమంబును జామదగ్న్యనిషేవితం బగుశూర్పారకంబును సప్తగోదావరంబును దేవపథంబును దండకారణ్యంబును మేధావికతీర్థంబును గాలంజరపర్వతంబును దేవహ్రదంబును జిత్రకూటపర్వతంబును మందాకినీతీర్థంబును భర్తృస్థానంబును గోటితీర్థంబును శృంగబేరపురంబును ముంజవటంబును మహాపాతకోపపాతకహరంబులు ననంతఫలప్రదంబు లవలఁ దీర్థరాజంబనాఁబడుప్రయాగతీర్థంబు. 64

—ప్రయాగతీర్థమాహాత్మ్యము.—

తే. హరిపితామహశక్రాదు • లఖిలసురలు, సనకముఖమునివర్యులు • సాగరములు
నదులు నదములు సాధ్యులు • నాగముఖ్యు, లధివసించెద • రెపుడు ప్రయాగమందు.

తే. అచట మూఁడగ్నికుండము • లందు గంగ
పాఱు నచ్చోట మిక్కిలి • ఫలము గలదు
యమున గంగతోఁ గలసిన • యట్టిచోటు
భూజఘన మంద్రు మును • లందుఁ బుణ్య మంద్రు. 66

వ. ఆప్రయాగంబు ప్రతిష్ఠానం బనియు జఘనతీర్థం బనియుఁ దీర్థరాజం బనియు వ్యవహరింపంబడు నందు వేదంబులు యజ్ఞంబులును మూర్తిమంతంబులై యుండు దేవతల కది యజనభూమి యయ్యె నందు నఱువదికోట్లపదివేలతీర్థంబులు సాన్నిధ్యంబు చేసియుండు నచటిస్నానదానాదికం బక్షయపుణ్యప్రదంబు తత్తీర్థకీర్తనంబును దురితహరంబు పిదప భోగవతీతీర్థం బందు జలం బాడిన నశ్వమేధఫలం బగుఁ బిమ్మట హంసప్రపతనతీర్థం బది పరమపావనంబు దశాశ్వమేధతీర్థం బుత్తమోత్తమంబు కురుక్షేత్రసమం బగుగంగానది మోక్షప్రదంబు ప్రయాగతుల్యం బగుకనఖలంబు సర్వోత్తమంబు. 67

ఆ. చేయరానిపనులు • చేసినవాఁడైన, గంగ నాడెనేని • గడియలోన
వానిపాప మెల్లఁ • గానంగ రాక వేఁ, గాలుఁ జిదుకు లగ్నిఁ • గాలునట్లు. 68

తరళము. కృతయుగంబున నొప్పుపుణ్యము • కీర్తితం బగుఁ ద్రేతయం
దతులితం బయి పుష్కరంబున • ద్వాపరంబున నక్కురు
క్షితి నెసంగుఁ గలిం దలంప వ•సించు గాంగజలంబులన్
మతిఁ దలంపఁగ గంగఁ బోలిన•మాన్యతీర్థము లే దిలన్. 69

ఆ. తపము పుష్కరమునఁ • దనరు దానము మహా,లయమునం దెసఁగు మ•లయమునందు
నగ్నిపూజ యొప్పు • నలభృగుతుంగమం, దనశనవ్రతంబు • పొనరు నెపుడు. 70



తే. మహిఁగురుక్షేత్రమునయందు • మగధయందు, జాహ్నవింబుష్కరమునందు • జలకమాడి
జనుఁడు కుల ముద్ధరించుఁ ద•త్స్మరణ మఘహ, రమ్ము తద్వీక్షణము పుణ్య • దమ్ము తలఁప.

క. ఎందనుక గాంగతోయము,లం దెవ్వనియెమ్ము లుండు • నందనుక మహా
నందమున స్వర్గలోకము,నందున్ సుఖయించుచుండు • నాతఁడు ఘనుఁడై. 72

తే. గంగఁ బోలినతీర్థంబు • గలుగ దెచట, విష్ణునిం బోలుదేవుండు • వెలయఁ డెందు
బ్రాహ్మణుని బోలుమనుజుండు • పరఁగఁబోఁడ, ననుచు భగవంతుఁడగుబ్రహ్మ • యానతిచ్చె.

వ. అని చెప్పి మఱియును. 74

స్రగ్ధర. ఈతీర్థాఖ్యాన మెల్లన్ • హృదయగతముగా • నెవ్వరే నాలకింపన్
జేతోమోదంబులోఁ బ్ర•స్తిమితముఁ గొని సు•క్షేత్రమందుం బఠింపన్
బూతాత్ము ల్వారు పుణ్యం•బున నిహసుఖముల్ • పొంది మే న్వాసినంతన్
బ్రీతిన్ స్వర్గంబునందున్ • దివిజసమితితోఁ • గ్రీడలం గాంతు రెప్డున్. 75

ఉ. నీవును దీర్థసేవనము • నెమ్మి నొనర్పుము నీకు దాన నా
దేవసమప్రభావము ప్రతీపకులోత్తమ నీదుపూర్వులున్
బోవుదు రుత్తమంపుగతిఁ • బొందఁగఁ బాపములం ద్యజించి నీ
వావల వాసవాంచితుఁడవై • వసులోకము నొందు దారయన్. 76

వ. అని తొల్లి పులస్త్యుండు భీష్మునకుం జెప్పి చనిన నతండు తీర్థాటనంబు గావించి కృతార్థుం డయ్యె దేవా! నీవును మహామునిసమేతుండవై తీర్థయాత్రలు సేవింపు మిదె లోమశుం డనుమునీంద్రుండు నీకు దర్శనం బిచ్చు నతండు నేను నీమునిముఖ్యులు నిన్ననుసరించువారము నీవునుం గృతార్థుండ వయ్యెద వని మఱియును. 77

మ. పురుకుత్సుండుఁ బురూరవుండు నలుఁడున్ • బూరుండు వైన్యుండు రం
తి రఘుక్ష్మావరుఁడున్ భగీరథుఁడు సాం•దీపుండు నిక్ష్వాకుఁడున్
భరతుండున్ నహుషుండు రాముఁడును నా•భాగుండు గోలె న్మహో
త్తరు లారాజులువోలె నీ వనమునం • దళ్కొత్తు మెల్లప్పుడున్. 78

వ. అని బోధించి నారదుం డంతర్ధానంబు నొందె నంత యుధిష్ఠిరుండును భ్రాతృజనమధ్యగతుండై నారదోక్తంబు చింతించుచుఁ బితామహసముం డగు ధౌమ్యుం జూచి యి ట్లనియె. 79

—ధౌమ్యుఁడు ధర్మరాజునకుఁ గొన్నితీర్థంబులు చెప్పుట.—

చ. అనఘుఁడు సత్యవిక్రముఁ డ•హస్కరతేజుఁడు ఫాల్గునుండు నా
పనుపునఁ జేసి శాత్రవులఁ • బట్టి వధింపఁగఁ జాలునట్టితే
జున వెలుఁగొందునస్త్రముల•సొంపు గ్రహింప వనాంతరంబులన్
ఘనతప మాచరించుటకుఁ•గాఁ జనెఁ గాదె మునీంద్రచంద్రమా. 80

మ. నరనారాయణు లాదిమాను లనుచుఁ ♦ వాక్రుచ్చు నానారదుం
డరుదారన్ వివిధాస్త్రముల్ వడసి ది♦వ్యప్రాభవం బేర్పడన్
దురమందున్ మనజిష్ణుఁ డస్త్రవిదు లై ♦ దోస్సార మేపారఁగాఁ
బరివర్తించునదీసుతప్రముఖులన్ ♦ బ్రత్యర్థులం దున్మెడున్. 81

తే. అచ్యుతానిలానిశధూత ♦ మస్త్రకాంతి,యుతము శ్వేతవాజిబలాక ♦ ముగ్రగాండి
వేంద్రచాపకలిత మర్జు♦నేద్ధమేఘు, మధికశరధారఁ గర్ణాగ్ని ♦ నార్పివైచు. 82

శా. నాకుం గూర్చెమతమ్ముఁకుఱ్ఱ ఘనుఁడై ♦ నానాస్త్రముల్ పొంది రా
నేకాలంబునఁ జూడఁ గందుమొకో మే ♦ మెల్లన్ మునీంద్రోత్తమా
లోకప్రస్తుతసన్నుతప్రతిభు నా♦లోకోత్తరుం బాసి నే
నీకామ్యాటవి నుండఁ జాల నటకే ♦ నేగ న్మనం బయ్యెడిన్. 83

ఆ. వాసయోగ్య మైన ♦ వన మేదియే నొక్కఁ, డాన తిమ్ము ఫాల్గు♦నాంబుదాగ
మనము నభిలషించి♦మది బ్రతీక్షించుచుఁ, గొంతకాల మందుఁ ♦ గుదిరి యుందు. 84

వ. అనిన ధౌమ్యుండు ధర్మపుత్రుం జూచి శ్రవణమాత్రఁ బాపాపహంబు లగుపుణ్యక్షేత్రంబులు పెక్కులు గల వందుఁ దూర్పున నైమిశంబును గోమతీతీర్థంబును వివస్వంతువిశ్వామిత్రంబును బ్రహ్మసరంబును గయాశిరంబును నక్షయవటంబును ఫల్గునీనదియుఁ బాంచాలంబుల నుత్పలావనంబును గంగాయమునాసంగమంబును బ్రయాగతీర్థంబును నగస్త్యాశ్రమంబును నగస్త్యపర్వతంబును గాలంజరపర్వతంబును హిరణ్యబిందుతీర్థంబును బ్రహ్మశాలాక్షేత్రంబును మంగళీయంబును గేదారంబును మతంగాశ్రమంబును గుండోదపర్వతంబును దేవవనంబును బాహుదానదియు నందానదియును దక్షిణంబున గోదావరీనదియును గృష్ణవేణీనదియును భీమరథీనదియును బయోష్ణీనదియును మాతరవనంబును గణ్వాశ్రమంబును నశోకతీర్థంబును వారుణతీర్థంబును దామ్రపర్ణీనదియును గోకర్ణతీర్థంబును వైదూర్యపర్వతంబును సురాష్ట్రదేశంబునఁ జమసోద్భేదంబును నుదధియందుఁ బ్రభాసతీర్థంబును బిండారకతీర్థంబును ద్వారావతీక్షేత్రంబును బశ్చిమంబున నవంతియందు నర్మదానదియును జ్యవనాశ్రమంబును జంబూమార్గంబును గేతుమాలానదియును మేధ్యానదియును గంగాద్వారంబును సైంధవారణ్యంబును బితామహసరోవరంబును వైఖానసాశ్రమంబును నుత్తరంబున యమునాసరస్వతీసంగమంబును శరభంగాశ్రమంబును దృషద్వతీనదియును న్యగ్రోధతీర్థంబును దాల్భ్యాశ్రమంబును విశాఖయూపక్షేత్రంబును గనఖలంబును భృగుతుంగంబును విశాలక్షేత్రంబును బదరీవనంబును లోనగుమహాస్థలంబులు భక్తిముక్తిప్రదంబులై భూలోకకీర్తితంబు లవి నీకానందసంధాయకంబు లగు వినుము. 85



ధర్మరాజుకడకు లోమశుండు వచ్చి యింద్రసందేశం బెఱింగించుట.

మ. అని భాషించుచు నున్నకాలమున లో♦కాతీతవిద్యామహా
త్వనిధానం బగులోమశుం డనుమునీం♦ద్రశ్రేష్ఠుఁ డచ్చోటికిన్
జను దేఁ గాంచి మహీసురాంచితుఁడు వి♦జ్ఞానైకచిత్తుండు పాం
డునిపుత్రుం డెదు రేగి తెచ్చి కొలిచెన్ ♦ మోదంబు రా నాదటన్. 86

వ. అట్లు కొలిచి తనచెంత విశ్రమించి యున్నలోమశుం గాంచి సంతసించుచు మీ రెందుండి యిందు వచ్చితి రానతిం డనిన నతం డతని కి ట్లనియె. 87

క. లోకముల నెల్ల మెట్టుచు, లోకేశ! యదృచ్ఛ నింద్ర♦లోకంబున కా
లోకనకౌతుకమునఁ జని, లోకేశ్వరుఁ డింద్రుపూజ♦లుం గొని యంతన్. 88

శా. శక్రార్ధాసనసంస్థితిన్ సకలవి♦శ్వప్రస్తుతోజోబలా
వక్రప్రాభవభూషితుం డగుచు శో♦వం బొల్చుమీతమ్మునిం
జక్రాస్త్రప్రియు నర్జునిం గని మహా♦శ్చర్యంబునం బొందుచున్
శక్రుం డప్పుడు న న్నెఱుంగఁ బలికెన్ ♦ దత్సర్వవృత్తాంతమున్. 89

వ. అంత నే నతనివచనంబునం జేసి నిన్నుఁ జూడ వచ్చితి నీకుఁ బ్రియంబు సెప్పెద నవహితుండ వగు మని యి ట్లనియె. 90

సీ. నరవర నీపంపు♦నం జని పార్థుండు, తపమున మెప్పించి ♦ కృపఁ దలిర్చు
పరమేశ్వరువలనఁ ♦ బాశుపతం బను,నమృతోత్థితాస్త్రము ♦ నలర నొంది
దిగధీశ్వరులపొంత ♦ దివ్యాస్త్రములు పెక్కు, లనితరసాధ్యము ♦ లంది మఱియు
నృత్యగీతంబులు ♦ నేర్చి విశ్వావసు,పుత్రునిచెంత వా♦దిత్ర మెఱిఁగి

తే. దివ్యుఁడై దేవపదమునఁ ♦ దేజరిల్లు,చున్నవాఁ డింతలో వచ్చు ♦ నిన్నులవున
కేరికి నశక్య మై కను ♦ ఘోర మైన,దేవకార్య మొకం డది ♦ తీర్చివచ్చి. 91

చ.* ఎఱుఁగుదు నేను నీమన మ♦హీనపరాక్రముఁ డైనకర్ణు నే
డ్తెఱకుఁ దలంకు దెప్పుడుఁ గ♦డిందిమగం డని సంశయించుచున్
నెఱి గలఁ డిప్పు డర్జునుఁ డ♦ని న్నరలంతల నోర్చుఁ గర్ణుఁ డ
క్కఱకరి కారయం బురుసు ♦ గాఁడు పదాఱవపాలికేనియున్. 92

క. చింతల విడి నీ విప్పుడు, సంతసమున భ్రాతృవరుల♦సంగతి గలుగన్
సంతతము తీర్థయాత్రా,నంతఫలము నందఁ దలఁపు♦మా కురునాథా. 93

వ. ఇది యింద్రునిసందేశం బవుడు నీతమ్ముండును. 94

* కఱకరి = సమర్థుఁడు.

మ. ననుఁ బూజించి వచించె నీహరినుడి న్వాక్రుచ్ఛి మాయన్నకున్
ఘనతీర్థంబుల సేవసేయుమది వేడ్కం గట్టు మప్పట్టునం
జను మీవు న్నెనువెంటఁ బాయక భవత్సంగంబు సిద్ధించినన్
గన నేబాధలుఁ గల్గఁబో వవరికింగానీ మునీంద్రోత్తమా. 95

ఆ‡ తీర్థపాద నీవు తీర్థయాత్రాచణశీలుఁ డైన భ్రాతచేతఁ జెప్పి
యందు నందు గోసహస్రదానములు చేయింపఁ గడఁగు మయ్య యింపు మీఱ.

చ. అని వచియించి పుచ్చె వసుధాధిప నే నిరుమాఱు మున్నిలం
గనఁ దగునట్టితీర్థములఁ గంటిని వెండియు నిన్నుఁ గూడి క
న్గొనియెద నేభయంబునను గూడఁగ నీయక పుణ్యతీర్థముల్
గనుఁగొన దుర్లభంబ యగుఁ గట్టిఁడిమూఁకల కెట్టులేనియున్. 97

తే. మును యయాతిభగీరథమనుగదాదిపార్థివోత్తము లెల్లరు భవ్యతీర్థ
యాత్రఁ బొనరించి కృతకృత్యు లైరి ధరిత్రిఁ గీర్తి గాంచిరి నీ వట్లు కీర్తి గనుము.

వ. అనిన యుధిష్ఠిరుం డతని కి ట్లనియె. 99

## ధర్మజుఁడు తీర్థయాత్రలు సేయ నెంచుట.

శా. నాసంతోష మదింత యంచుఁ దెలుప న్శక్యంబు గా దిత్తఱిన్
గా నంతే, దొర లేనికూర్మిఁ దలఁపుం గావించి దేవేంద్రుఁడే
యీసందేశము చేసె నింత కధికం బేప్రాభవం బౌ మునీం
ద్రా సైదో డమరేంద్రుచెంత సుఖముంట న్నెంటి ధన్యాత్ముఁడన్. 100

ఉ. నన్నుఁ దలంచి వాసవుఁడు నా కుపదేశము చేసినట్టితీ
ర్థోన్నతసేవ సేయ ఫల మొప్పు నటంచు వచించె ధౌమ్యుఁడున్
మున్నటు సేయు బుద్ధియును బుట్టెను యున్నది నాకు నియ్యెడన్
నిన్నుఁ బురస్కరించుకొని నేఁ జరితార్థుఁడ నై తనర్చెదన్. 101

వ. అని తీర్థగమనోన్ముఖుం డగునజాతశత్రుం గని లోమశుండు వెండియును. 102

క. మనతోడ నింతమూఁకయుఁ జనుదే గమనంబు స్వైరసరణిం బడ దో
మనుజేంద్ర కొంత విడుచుట తనరెడు నని తెల్ప ధర్మతనయుం డంతన్. 103

వ. తమవెంట నంటి యున్నబ్రాహ్మణప్రభృతులం బిలిచి యి ట్లనియె. 104

తరువోజ. అనిశంబు భక్ష్యభోజ్యాదుల మృష్ట మాశించి భిక్షాశనార్థు లైనట్టి
జనులు మాతోఁ బథశ్రమమును బొందఁజాలరు ధృతరాష్ట్రచక్రికిఁ గాని

‡ తీర్థపాదుఁడు = ఆచార్యుఁడు, గురువు.



ఘనుఁడు పాంచాలునికడ కేగి కాని కదలి పోవుఁడు యథాకాలసంప్రాప్త
మున మే న్నిలువఁ గస్తిఁ బొందఁగ నైన పురుషులు రం డెల్లభూములు దిరు

వ. అనిన నందుఁ గలకొందఱు నాగపురంబునకుం జని ధృతరాష్ట్రసత్కృతు లై రంతం
గతిపయజనపరివృతుం డగుపృథానందనుండు లోమశుం గూడి కామ్యకంబున
మూఁడునా ళ్లుండి ప్రస్థితుండు గానున్నయెడ నచటివిప్రు లతనిం గని యి ట్లనిరి. 106

చ. నరవర మీరు భూతలమునం గలతీర్థము లెల్ల నాడఁ గా
నరిగెద రట్టె! శూరు లగునట్టిరు మీవెనువెంటఁ గాక యే
కరణి మృగాకులంబులు నగమ్యము లై చనుతీర్థభూములం
దిరుగఁగ నేతు మే మనుమతిం దయసేయుము మాకు రాకరున్. 107

క. ఘను లగుమీతో లోమశమునితోఁ జని తీర్థఫలముఁ బొంద మనం బౌ
మనుజేంద్రచంద్ర మమ్ముం గొనిపొమ్ము శుభమ్ము నీ కగుం దలపోయన్. 108

తే. భరతుఁడును నహుషుఁడు లోమపాదకార్తవీర్యులును గొన్నలోకముల్ విశ్రుతముగ
నీవునుం గొనఁ గల విల నెసఁగునట్టిపుణ్యతీర్థంబులం దాడి పూరువంశ్య. 109

వ. నారదుండును ధౌమ్యుండును లోమశుండును జెప్పినప్రభాసాదితీర్థంబులును మ
హేంద్రాద్రిపర్వతంబులును గంగాదినదులును బ్లక్షాదివనస్పతులును నీవెంటన వచ్చి
చూడ నెంచితిమి నీచిత్తంబున బ్రాహ్మణభక్తి యగునేని మా కాడక మారాక కను
మతింపు మని ప్రార్థించిన నతండు హర్షాశ్రుపరిప్లుతుండై వారి కొడంబడి ప్రయా
ణోన్ముఖుం డై యున్నయెడఁ బారాశర్యపర్వతనారదులు వచ్చి పూజితు లై ధర్మరా
జాదులం జూచి శారీరనియమంబులు మానుష వ్రతంబులు మనోబుద్ధినియమంబులు
దైవవ్రతంబు లట్టిపరమపవిత్రంబు లైన దైవమానుషవ్రతంబు లాచరించుచుఁ
దీర్థసేవం గావింపుఁడు దాన మహాఫలం బగు నని చెప్పిన వారు మునికృతస్వస్త్య
యను లై మార్గశీర్షమాసావసానంబునఁ జీరాజినజటాధరు లై కవచంబులు దొడిగి
కార్ముకంబులు ధరియించి యింద్రసేనాదులం గూడి ప్రాగ్దిశాభిముఖు లై కదలి చని
రంత ధర్మజుండు లోమశుం గాంచి యి ట్లనియె. 110

## ధర్మరాజు తీర్థయాత్రలు సేవించుట.

చ. విడువక ధర్మమార్గమున వ్రేలెడునే నొరు లెవ్వరేనియున్
బడయనియట్టికష్టములపా లయి యుంటి నధర్మవర్తు లై
కడు దురితంబులన్ సలుపుకష్టులు దిష్టముకల్మిఁ దుష్టిమైఁ
గడిమి నెలంగుచుండి రిటఁ గారణము న్వచియింప వేఁడెదన్. 111

వ. అనిన లోమశుం డతని కి ట్లనియె. 112

చ. వగవకు మీం దధర్మమున • వర్ధిలి కాపురుషుండు భద్రముల్
దగుల సపత్నులం గెలిచి • తా మొదలంటఁ జెడుం దుదన్ ధ్రువం
బుగ భువి ధర్మమార్గమునఁ • బోయెడునుత్తముఁ డార్తిఁ గుందియున్
మొగి నొగుఁ లేగ సౌఖ్యమును • బొంది ప్రవర్ధిలు నంత నెంతయున్. 113

క. మును దేవయుగంబున నేఁ, గనుఁగొంటి దురాత్ములైన • క్రవ్యాదులు తో
ర్తలను హెచ్చి కుంది రుత్తము,లన విబుధులు కుంది హెచ్చి • రరయుచు నుండన్. 114

వ. తొల్లి ధర్మశీలు రగు దేవతలు దివ్యతీర్థంబులు సేవించి పాపంబులం బాఱఁ దోలి శ్రేయంబు లందిరి తీర్థసేవాపరాఙ్ముఖు లగు దైత్యదానవు లధర్మవర్తులై దర్పంబును దర్పంబున మానంబును మానంబునఁ గ్రోధంబును గ్రోధంబున లజ్జాత్యాగంబునుం గలుగ హీనవృత్తులై క్రియాహీనులై రి దానంజేసి తుష్టియుం బుష్టియు క్షమయు లక్ష్మియు ధర్మంబునుం జెడ వారిం గలియు నలక్ష్మియు నాశ్రయించి నాశనంబు గలిగించె న ట్లధర్మపరాయణు లగుధార్తరాష్ట్రులు చిరకాలంబునన విలయంబు నొందఁగల రీవు ధార్మికుండవు తమ్ములం గూడి నిర్మలచిత్తంబున నిఖిలతీర్థంబులం దాడి మహాత్ముల దర్శించి సత్కర్మము లాచరించి సత్యసంధుండ వై నృగశిబిగయాశీనరభగీరథపూరుపురూరవోముచికుం దేక్ష్వాకుమాంధాతృమరుత్తప్రభృతులం బోలి పుణ్యయశోధనాభివృద్ధిం బ్రవర్తిల్లుదు వని చెప్పిన నెల్లరు సంతసిల్లి రంతఁ బాండవు లందందు విశ్రమించుచు నైమిశారణ్యంబునకుం జని గోమతీతీర్థం బాడి కన్యాతీర్థంబునఁ గృతావగాహులై గోతీర్థంబున నభిషిక్తులై కాలకోటిం బితృతర్పణంబులు సేసి విషప్రస్తనగంబున విశ్రమించి బాహుదానదిం గ్రుంకులిడి దేవయజనం బైన ప్రయాగంబునం బ్రవర్తించి గంగాయమునాసంగమంబున నఘమర్షణస్నానంబు గావించి వేదవిప్రులకు గోభూహిరణ్యాదిదానంబులు సేసి బ్రహ్మవేదికిం జని తపించి వన్యహవిస్సున బ్రాహ్మణభోజనం బొనరించి గయోర్వీభూధరంబున కరిగి గయాశిరంబునఁ బిండంబు వెట్టి వానీరమాలినీనదిం దీర్థం బాడి బ్రహ్మసరోవరంబుకడ నక్షయవటంబు క్రిందఁ జాతుర్మాస్యాధ్వరంబు నిర్వర్తించుచున్నప్పుడు పుణ్యకథాశ్రవణకుతూహలాయత్తచిత్తుఁ డగుధర్మపుత్త్రుం గని కౌమారవ్రతస్థుం డగుశమఠుం డనువిప్రుం డి ట్లనియె. 115

గయాక్షేత్రప్రభావము.

సీ. వినుము ధర్మతనూజ • ఘనుఁ డమూర్తరజస్తనయుఁడు గయుం డను • నృపవరుండు
మున్నిట నొకజన్న • మును జేసె జగ మెన్నఁ, దలపోయ నది బహు • దక్షిణాన్న



మందు నూర్లును వేలు • నన్నపర్వతములు, ఘృతకుల్యలు దధిస • రిద్వరములు
వేనవే ల్వ్యంజనా • నూనసముద్రపఙ్క్తి,వాహానసహస్రముల్ • వఱలుచుండఁ

తే. *ప్రత్యహముఁ గోటులకొలంది • బ్రాహ్మణులును, నన్యులును నిష్టమృష్టాన్న మనుభవించి
రాసవనదక్షిణాకాల • మందు బ్రహ్మ,ఘోషముదయించి దివి మ్రోసెఁ • గొనరికొనరి.

చ. జను లొక పెద్దగాథగ న • జస్రము గానము సేయుచుందు రా
జనపతిజన్నమందుఁ బ్రజ • సావడ నోపమి శిష్ట మన్న మ
య్యనువున నిర్వదే నగము • హాద్రులుగాఁ గన నయ్యె నయ్యెడన్
జను లెవ రట్టియజ్ఞము నొ • నర్చినమాటయు లేదు నేటికిన్. 117

చ. భువిఁ బహువర్షబిందువులఁ • బ్రోవులుగా నగుసైకతాల్పరే
ణువుల విహాయసంబునఁ గ • నుంగొన నుండినతారకంబులం
గవిలియ లెక్క వ్రాయ నగుఁ • గాని జగత్త్రయగేయ మైనయా
సవమున నైనదక్షిణల • సంఖ్య వచింపఁగఁ జాల రెవ్వరున్. 118

వ. ఇట్టిమహాయజ్ఞంబు లెన్ని యేని గయుం డీసరోవరంబుకడం జేసి చరితార్థుం డయ్యె నని తత్తీర్థప్రభావం బగ్గించె నంతఁ గౌంతేయుం డటఁ గొంతకాలం బుండి ప్రస్థితుండై యగస్త్యాశ్రమంబునకుం జని లోమశుం గని యి ట్లనియె. 119

తే. ఘనుఁ డగస్త్యుఁడు వాతాపి • యనెడుదైత్యు, నేల కూలిచె నమ్మౌని • కేల కోప
మొదవ మోసెత్తె నెఱిఁగింప • వే మునిప్ర,భావ మంతయు నా నిట్లు • పలికె నతఁడు.

అగస్త్యుఁడు లోపాముద్రం బెండ్లియాడి వాతపిం జంపినకథ.

మ. కల దుర్విన్మణిమత్యభిఖ్య నసముం • గైకొన్న పీ డందు ని
ల్వలుఁ డన్ దైత్యకులోద్భవుం డెనఁగు నా • వాతాపినామానుజుం
డెలమిం గూడఁగఁ దా నొకప్పు డొకవి • ప్రేంద్రుం గనం బోయి వే
ల్పులతోనిం బురుడించుపుత్త్రు నొకనిం • బూర్ణప్రభావంబునన్. 121

క. తన కిమ్మని ప్రార్థించిన, మునివరుఁ డిది తగదు నీకుఁ • బో పొమ్మనుడుం
గనలి మది నాఁడు సుతగా, మునివరులం జంప వాఁడు • మొదలిడి రొ నృపా. 122

మ. అతిమాయుం డయి కామరూపధరుఁడై • హర్షించువాతాపి నా
యతపాపుం డగునిల్వలుం డజముగా • నప్పట్టునం జేసి ని
ర్గతశంకుం డయి చంపి వండి పల మా • రం బెట్టు భిక్షార్థి యై
క్షితిదేవోత్తముఁ డేగుదే నతనికిం • గేస్తుండు నా నొప్పచున్. 123

* బ్రహ్మఘోషము = వేదఘోషము.

చ. కుడిచి మహీసురుం డనఁగు♦కొంతటిలో నసురుండు మాయమై
నడరుచుఁ దమ్మునిం బిలువ ♦ నాతఁడు వెండియు దేహధారి యై
వడి వడి బ్రాహ్మణోదరము ♦ వ్రచ్చి మొగి న్వెలి వచ్చి నవ్వు ని
వ్వటువున నిల్వలుండు ముని♦వర్యులఁ గూల్చుచు నుండె నెంతయున్. 124

వ. అక్కాలంబున నెందేని చనువాఁ డగస్త్యుం డనుమునీంద్రుం డొక్కగర్తంబున నధోముఖు లై వ్రేలుచున్నపితృదేవతలం జూచి మీ రెవ్వ రేల యిట్లు భయకంపితు లై యున్నవా రని యడిగిన వారును. 125

చ. పితరుల మేము నీ విటులు ♦ పెండిలియాడక పత్యహీనతన్
క్షితిఁ దిరుగాడుచుండుటను♦జేసి యధోగతిపాలు గాఁగ నీ
గతి వెత లొందుచుంటి మెదఁ ♦ గారుణికత్వముతోడ నీ విలన్
సుతులను గంటివేని గత♦శోకుల మయ్యెద మున్నతస్థితిన్. 126

తే. అన నగస్త్యుండు తా నిట్టు ♦ లనియె మీరు, చెప్పిన ట్లను జేసెదఁ ♦ జింత విడువుఁ
డనుచు వారల వీడ్కొని ♦ చని తదర్థ,చింతనం జేయఁగాఁ జొచ్చెఁ ♦ జిత్తమందు.

వ.† తనకును దన ప్రసవంబునకు ననురూప యగుదాని నెందునుం బడయఁ జాలక నిజతపశ్శక్తిం జేసి చిత్తంబున నొక్కకన్యామణిం జేసి దానిం బుత్రార్థి యై తపంబు సేయు విదర్భరాజున కనుగ్రహించె నంతఁ గొంతకాలంబునకుఁ దనకు మెఱుపుందీవ తెఱంగున మెఱయుచుం బుట్టినకన్యం జూచి వైదర్భుండు హర్షించుచు జాతకర్మాదిసత్క్రియ లాచరించి లోపాముద్ర యని పేరుపెట్టిన నామె శుక్లపక్షక్షపాకరరేఖా వైఖరిం దినదిన ప్రవర్ధమాన యై. 128

ఉ. నూర్వురుకన్నియ ల్మఱియు ♦ నూర్వురు దాసులు సేవ సేయ నా
పార్వణచంద్రబింబముఖి ♦ భాసిలుచుండె నపూర్వరత్న మై
యుర్వర నట్టికాలమున ♦ నొక్కరుఁ డేని వరింపఁ డయ్యె నా
సర్వజగన్నుతుం డయిన♦సన్మునిభీతి మతిం గలంచుటన్. 129

ఆ. అవ్విదర్భరాజు ♦ జవ్వని దాని వి,వాహయోగ్య గాఁగ ♦ వయసు కతన
నిశ్చయించి వేని♦నిం దెచ్చి కూర్చెద, దీని కంచు వగచె ♦ మానసమున. 130

వ. అంత నగస్త్యుండు గార్హస్థ్యంబు నొంద నెంచి వైదర్భుపాలికిం జనుదెంచి పుత్రకారణంబునం జేసి వరించితి నీపుత్రి నాకు ధర్మపత్నిగ నొసంగు మనుడు నతండు ప్రతిపాదనప్రత్యాఖ్యానంబుల కసమర్థుం డై. 131

† ప్రసవము = సంతానము.



చ. తనసతిచింతకుం జని ధృ♦తవ్రతుఁ డమ్ముని వచ్చి కన్య ని
మ్మనుట యెఱుంగఁ జెప్పి వని ♦ నాకలము ల్దినువాని కిట్టి లీ
మున నగు నీయకుండిన న♦మర్షసమేతుఁ డతండు శాపవ
హ్నిని దహియించి పుచ్చుడి నిఁ ♦ కెట్లని చింతిలు చున్న యంతటన్. 132

వ. లోపాముద్ర వచ్చి తండ్రికి నమస్కరించి యిట్లనియె. 133

తే. వగవకుము తండ్రి ననుఁ గూర్చి♦జగదభినుతుఁ, డగు నగస్త్యున కిమ్ము న♦న్నుడువు నాతఁ
డలరి విధిపూర్వముగ నిచ్చె ♦ నాత్మజాత, నమ్మునీంద్రుని కెంతయు ♦ హర్ష మెసఁగ.

వ. అతండును గృహ్యోక్తక్రమంబున లోపాముద్ర వివాహం బై దానికి వనవాసోచిత వల్కలాజినంబులు ధరింపం జేసి సమానవ్రతచర్య యగుసహధర్మిణిం దోడ్కొని గంగాద్వారంబునకుం జని పరమతపం బొనరించుచుండె నంత నొక్కనాఁడు. 135

క. జలకముల నాడి శుచి యై, పులు గడిగినముత్తెమట్లు ♦ పొలఁతుక చెంతన్
మెలఁగం గని మోహితుఁ డై , సలలితమతిఁ గలియఁ బిలిచె ♦ సంయమి దానిన్.

వ. లోపాముద్రయుం బ్రాంజలి యై ప్రణయపూర్వకంబుగా నతని కిట్లనియె. 137

స్రగ్ధర. సంతానాపేక్షతోడన్ ♦ సతిఁ బతి గలియున్ ♦ సమ్మతిం జూపు టొప్పన్
సంతోషం బయ్యెఁ గానీ ♦ సలలితగతి నా♦స్వాంతమం దిట్లగున్ భూ
కాంతుం డాతండ్రి యింటన్ ♦ ఘనవిభవమునం ♦ గ్రాలున ట్లిందుఁ గ్రాలన్
గాంతాలంకారవస్త్రో♦త్కరము తొడికొనం ♦ గాంక్ష యయ్యె న్మునీంద్రా. 138

క. హృదయేశ్వర నదమలమణి,సదనంబుల నిన్నుఁ బొంద ♦ నంతన మగు నా
కిది గాక నారచీరలుఁ, బొదలును బుట్టలును మదికి ♦ మోదం బిడునే. 139

సీ. అనిన నగస్త్యుఁ డి ♦ ట్లనియె సతీ ముని,వరులకు ధనము ని♦ప్పచ్చరంబు
నావుడు సతి మహాని♦నాథులకుఁ దపోధ,నం బగు దాన స♦ర్వంబు గలదు
నా నతం డది యట్ల ♦ కాని తపోవ్యయం, బగుఁ గాన దాని కే ♦ ననుమతింప
ననుడు నాయమ ఋతు ♦ వల్పావశిష్టకా,లమున నొ సెట్లొ ధ♦నము గ్రహింపు

తే. మీను నాచెప్పినట్టుల ♦ కాని వేఱు,మార్గమున నిన్నుఁ గూడంగ ♦ మదిఁ దలంప
ధర్మలోపము గాకుండఁ ♦ దగినరీతి, వసువు గ్రహియించి నాకోర్కి ♦ వలయుఁ దీర్ప.

వ. అనినఁ గుంభసంభవుం డట్ల యగుంగాక యని శ్రుతర్వాణుం డనురాజుకడకుం జని వానిచేతం బూజితుం డై తనవచ్చినపని యెఱింగించి నీయితరకార్యంబులకు భంగంబు వాటిల్లకుండ నా కింతయర్థం బొసంగుదే యని వానియాయవ్యయంబులు సమంబు లగుట యెఱింగి వానిం గూడి బ్రధ్నశ్వుం డనువానిపాలికిం బోయి

యటం దొంటియు ట్లయిన వానినిం దోడ్కొని పురుకుత్సపుత్త్రుం డగుత్రసదశ్వుని చెంత కరిగి యందు నట్ల యగుటంజేసి ధనార్జనోపాయంబు గానక యిల్వలుండు ధనాఢ్యుం డని విని వారి మువ్వురిం దోడ్కొని మణిమతీపురంబునకుం జనుటయు నిల్వలుం డల్లంతదవ్వుల నెదు రేగి వారిం దోడితెచ్చి యర్ఘ్యపాద్యంబు లిచ్చి ఛాగం బైనవాతాపి సంస్కరించి యాతిథ్యంబు గావించిన నెఱింగి రాజర్షులు విషణ్ణహృదయు లై మహర్షిం జూచి. 141

ఉ. తమ్ముని వండి పెట్టెడిని ♦ దైత్యకులాపశదుండు వాఁడు దే
హమ్ము ధరించి వచ్చుఁ బయి ♦ కంత భుజించినవాఁడు చచ్చు మో
స మ్మగు నిచ్చట న్మనము ♦ సాపడ నుంటిమయేని నా విషా
దమ్ము వినుండు నే మొసవెందం బలలాశి నటంచుఁ బల్కుచున్. 142

తే. కుంభసంభవుఁ డాకచోటఁ ♦ గూరుచుండి
తనకు నిల్వలుఁ డిడినవాం♦తాపిమాంస
మంతయును మెక్కి దైత్యుఁ డం♦య్యనుజుఁ బిల్చు
సమయమునఁ ద్రేఁపె నుదరంబు ♦ నిమురుకొనుచు. 143

ఆ.*మేఘగర్జవోలె ♦ మితి లేనినవ్వడి, వాఁడమఁ గ్రిందివాయు ♦ వడరె మునికి
నవుడు పిలిచె నిల్వం♦లాసురుం డనుజు వెల్వడు మటంచు సారె ♦ కడరువడిని. 144

వ. అగస్త్యుండు నవ్వుచు. 145

శా. జీర్ణం బయ్యె భవత్సహోదరుఁడు నాం♦చే నింక నేవంకఁ దాఁ
దూర్ణప్రక్రియ నిర్గమింప నగు నా ♦ దుఃఖించుచుం దానవుం
డర్ణోరాశి తెఱంగునం గనుల నీ ♦ రావిర్భవింపంగ సం
పూర్ణభ్రాంతిని సంభ్రమించుచుఁ మదిన్ ♦ మోదంబు వో నంతటన్. 146

వ. ప్రాంజలి యై మీ రేప్రయోజనంబున వచ్చితి రానతిం డనిన నగస్త్యుండు మేము నీవు ధనేశ్వరుండ వని విని ధనార్థుల మై వచ్చితి మనుటయు నతండు మీ కెంత కావలయు నడుగుం డిచ్చెద ననిన మునీశ్వరుండును. 147

క. పదివే లగ్దాణంబులు, పదివే లావులును రాజం♦వరు లొక్కొకని కి
ర్వదివే లగ్దాణము లి,ర్వదివే లావులును నాకు ♦ వలయు నిడంగన్. 148

వ. మఱియు నాకు నొక్కహిరణ్మయం బగురథంబునుం గావలయు ననిన నతండు వ్యథితుం డయ్యును వా రడిగినధనంబును గోధనంబును విరావసురావంబు లనునశ్వం

* నవ్వడి = ఉలివు, ధ్వని.



బులం బూన్చినకనకరథంబు నొసంగిన వారు నల్వు రారథంబు నెదమధనం బంతయు నిడికొని వాని నీడ్కొని గోవులం దోడ్కొని ఘటోద్భవాశ్రమంబునకు వచ్చి రంత రాజేంద్రు లరిగినవెనుక మునీంద్రుండు లోపాముద్రకుఁ దన తెచ్చినధనం బంతయు నిచ్చిన నానచ్చరిత్రయు. 149

క. మునినాథ కోరినట్టులు, పొసరించి మనోరథంబు ♦ పూరించితి నా
కొసరింపు మింక యొకతే,వన వీర్యనమంచిత మ్మం♦పత్య మ్మనుచున్ 150

వ. అతండు ప్రీతుం డై. 151

సీ. వలతొ వేపురఁ బుత్రం♦కుల నొక్కఁడొకఁడుప,దుగురఁబోల్సుతులనూం♦ఱుగురవలతొ
యొకఁ డొక్కనూటికి ♦ నొసరియుండెడునట్టి,కొడుకులఁ బదుగురఁ ♦ బడయ వలతొ
వేవురకును జాలి ♦ విఖ్యాతిఁ గొనియెడు,తనయు నొండొక్కనిఁ ♦ గనఁగ వలతొ
వచియింపు మనవుడు ♦ వనజాయతాక్షి తా, మది ముద మందుచుం♦మగని కెఱఁగి

తే, వేగురం బోలునొక్కని ♦ వీర్యవంతు, విద్వదగ్రేసరుని లోకం♦విదితకీర్తిఁ
బుత్త్రుఁ బడయంగ వలతు నోం♦భూరితేజ, వేవు రయ్యు నేఫల మవిం♦వేకు లైన. 152

తే. అనిననాఁ గాతమనియగం♦స్త్యమునివరుఁడు,తగినసుతుఁ డుద్భవించెడుఁ♦దరుణి యనుచు
నామెఁ గలిసి గర్భాధాన ♦ మాచరించి, తప మొనర్పఁగఁ జనె వనాం♦తరములకును.

వ. అంత లోపాముద్ర తా నేడేండ్లు గర్భంబు దాల్చి జ్వలదగ్నిప్రభాభాసమానుం డగుదృఢస్యుం డనుసర్భకుం గనియె నతండు వేదవేదాంగవేత్తయు మహాపండితుండు నై పరమతపంబు గావించెఁ గాలక్రమంబున నతనికిం దేజోవంతుం డగునొక్కపుత్త్రుండు పుట్టె బాల్యంబునందె తండ్రినివేశనంబున నిధ్మభారంబు వహించుటం జేసి యిధ్మవాహుం డనం బేరు వడసె ని ట్లయినపుత్త్రపౌత్త్రివర్గంబువలన నగస్త్యుని పితృదేవత లుత్తమలోకం బంది రానాఁడుగోలె నిట నగస్త్యాశ్రమంబు విఖ్యాతం బయ్యె నని చెప్పుచు లోమశుండు భృగుతీర్థంబునకు వారిం దోడ్కొని చని. 154

తే. ఇచట రాముఁడు రామాపం♦హృతము తేజ, మందె జలమాడి వెండియు ♦ నవనినాథ
యీవు తమ్ములు నిట నాడిం♦రేని మరల, నపహృతం బగురాజ్యంబు ♦ నందఁ గలరు.

వ. అనిన ధర్మసూనుం డందు స్నానదానాదికంబు గావించి రాముం డేల పరిహృతతేజుం డయ్యె నెఱింగింపు మనిన లోమశుండు వెండియు. 156

భార్గవరామతీర్థప్రశంస.

మ. భృగువంశంబున రేణుకాతనయుఁ డై ♦ పేర్మిన్ రుచీకాత్మజుం
డగురాముండు ధనుర్ధరుం డగుచు వీం♦ర్యం బొప్ప ముయ్యేడుమా

ర్గుణ నెందుం గలరాజులం దునిమి శాంతుండో యనం బొల్చె ని
జ్జగతి న్మున్ను జనార్దనాంశభవుఁ డై • శశ్వత్ప్రభావుండు నై. 157

ఉ. రావణు సంహరించుటకు • రాక్షసలోకవిపక్షుఁ డై వనిం
ద్రావరజుం డయోధ్యపుర•మందు రఘూత్తమవంశసంభవుం
డై వెలుఁగొందె రాముఁ డన • నై వసుధాత్మజ కాత్మవల్లభుం
డై వసుధేశ్వరేశ్వరుఁడు • నై త్రిజగజ్జనవందనీయుఁ డై. 158

ఉ. భార్గవరాముఁ డట్లవని • భాసిలురాఘవరాముఁ జూడ నై
సర్గికవిక్రమక్రమము మించంగ నరాతినిబర్హణక్రియా
నర్గళసాధనంబును ఘనం బగుకార్ముకముం ధరించి త
ద్దోర్గతసార మారయఁ బ్రతుష్టమతిం జనె నయ్యయోధ్యకుం. 159

క. చనుదెంచుపరశురాముని, విని దశరథమనుజవిభుఁడు • వినయముతోడం
ముని నెదురుకొని భజింపఁగ, దనపుత్త్రుని రామచంద్రుఁ • దడయక పుచ్చెం. 160

ఉ. వచ్చెపురాముభద్రుఁ గని • వైరినిషూదనుఁ డుద్యతాస్త్రుఁ డా
సచ్చరితుండు భార్గవుఁడు • చాపముఁ జూపుచు నవ్వె దీని నీ
వెచ్చినశక్తి నెక్కుడుదు•వే కనుఁగొందు ననం రఘూద్వహుం
డచ్చల మూని మేల మిటు • లాడఁగఁ జెల్లున నీకు భార్గవా. 161

తే. అధముఁడను గాను నేను నీ•యవనియందు, వాసికెక్కినయిక్ష్వాకు•వంశమందుఁ
బుట్టి క్షత్త్రియధర్మంబుఁ • బూనినట్టి,వాఁడ నావిక్రమం బేల • వలయుఁ దెలుప.

వ. అని పలుకుచున్నరఘురాముం గని భృగురాముం డీప్రసంగంబున కేమి చూత
మిదె మోపెట్టు మని విల్లు చూపుటయు. 163

చ. కనలి రఘూద్వహుం డతని•కైవస మైనమహాశరాసనం
బును గొని ప్రేల్మిడిం గొనయ•ముం గనయంబునఁ గూర్చి శింజినీ
ధ్వని దెస లెల్ల మ్రోసెనువి•ధంబునఁ జేసిన నెల్లభూతముల్
గనుకనిఁ దల్లడిల్లె లయ•కాలపతద్భవహాలాశనిభ్రమం 164

వ. అప్పుడు దశరథరాముండు జమదగ్నిరాముం జూచి. 165

మ. విలు మోపెట్టితి నోమహామహ యికం • న్వే తేమి సేఁ జేయఁగాఁ
గలుగుం దెల్పవె నా భృగూద్వహుఁడు వేండ్కం దివ్యబాణం బొకం
డలరం జేతికి నిచ్చి నారి వడిఁ గర్ణాంతంబుగా లాగి నీ
బల మగ్గింప జగంబు లేయు మనుచుం • భాషించె భాషించుచుం .66



వ. అనినం గుపితుం డై రాఘవుండు నీవు దర్పపూర్ణుండవు నీకు క్షత్త్రియులకన్న మిన్న
యగుతేజంబు గలదు పితామహప్రసాదంబునం జేసి నన్ను ట్లధిక్షేపించుచుంటి
వే నెట్టిండనో చూడు మని దివ్యదృష్టి నొసంగిన భార్గవుండును రామునిశరీరంబున
నాదిత్యులు వసువులు రుద్రులు సిద్ధులు సాధ్యులు యక్షులు రాక్షసులు మరుద్గ
ణంబులు పితృదేవతలు నక్షత్రంబులు గ్రహంబులు నదులు తీర్థంబులు సముద్రం
బులు పర్వతంబులు మహర్షులు వేదంబులు వేదాంగంబులు నధ్వరంబులు లోనగు
ప్రపంచం బెల్లఁ జూచి విస్మితుం డై యుండె నంత. 167

క. భగవంతుఁడు రఘురాముఁడు, తెగ లాగి శరంబు వాని•దెస వైచుటయుం
బగబగ మండుచు నుల్కలు, మొగి రాల్చుచు రాముఁ గదిసె•మ్రోయుచు నదియుం.

వ. *నిర్ఘాతపాతసదృశం బగునమ్మహానిర్ఘోషంబున భూతలం బెల్లఁ గంపించె భార్గవుం
డును విహ్వలుం డై తేజోహీనుం డై ప్రత్యాగతప్రాణుండై విష్ణుతేజంబునకు నమ
స్కరించి తదనుజ్ఞం గొని మహేంద్రపర్వతంబునకుం జని యొక్కపరివత్సరంబు
తపంబుండి పితృదేవతోపదేశంబునం జేసి భృగుమహర్షి తపించినబిందుసరంబునందలి
దీప్తోదం బనునితీర్థంబునఁ గృతావగాహుం డై వెండియుం దేజస్వి యయ్యె నని
చెప్పిన యుధిష్ఠిరుం డగస్త్యప్రభావంబు మఱియుం జెప్పుమనిన లోమశుం డిట్లనియె.

వృత్రాసురువిదాడి కోడి వేల్పులు దధీచు నాశ్రయించుట.

చ. †కలరు మహీస్థలిం గృతయుగంబున దానవు లైనకాలకే
యులు రణకర్కశుల్ ప్రహరణోద్ధతలోకు లొగిం గణంబు లై
వెలసి మహోన్నతుం డయినవృత్త్రునిఁ జేరి సమాశ్రయించి ది
క్కులు గలయంగఁ గ్రుమ్మరుచు • ఘోరగతిం బ్రజలం గలంచుచుం. 170

వ. ఇంద్రాదిబృందారకబృందంబులును మునికదంబంబులును స్తిమితంబున కంతరా
యంబుగా మెలంగం దొడంగిన వా రెల్లఁ బురందరపురోగము లై పరమేష్ఠిపరి
సరంబునకుం జని ప్రాంజలు లై విన్నవించి ప్రార్థించిన నతండును. 171

తరళము. ‡తెలిసె నంతయుఁ గాలకేయులు • దేవకల్పు లనల్పతే
జులు తలంపఁగ వారి కేడ్గడ • చుమ్మె వృత్త్రుఁడు వానినిం
బిలుకుమార్చునుపాయము న్మను • పేర్మి నారయ నొప్పు మీ
రలు దధీచు భజింపఁ బొండు ధ•రాతలంబున కాతఁడుం. 172

తే. ఘనుఁడుధర్మాత్ముఁడునుదాత • మునికులాధి,నాథుఁడుతపస్వివర్యుఁడు•సాధులోక
సన్నుతుఁడువానినెమ్మన• నున్న యట్టి,యెమ్ములన్నియునమ్ము లై • యొసక మెసఁగు.

* నిర్ఘాతము = పిడుగు. † గణంబులు = గుంపులు. ‡ ఏడ్గడ = రక్షకము.

తే.*వానికోలెమ్మ పవి యనఁ ♦ బడుచు నరుల,నడఁపఁ దగునట్టిసాధన ♦ మై తలిర్పఁ
గాఁపకరణార్థులై పోయి ♦ వానిశల్య,ములుగొనుఁడుదానవ్వృత్రుని ♦ మొత్తఁగలరు.
వ. అని బోధించినం బరమానందభరితులై దేవ ల్లెల్లరుం బితామహుని వీడ్కొని సరస్వతీతీరంబున నున్నదధీచాశ్రమంబునకుం జని కదియును. 175
చ. సలలితపత్త్రపుష్పఫల♦సన్నుతభూజసమావృతంబు కో
కిలకలనాదనాదితము ♦ కీరకులాకులమాన సేష్టవా
క్కలిత మళీరవాంచితము ♦ కాంచనవర్ణమృగీకదంబసం
కులము కరేణుబద్ధమద♦కుంజరరంజిత మై తపర్చెదుర్. 176
చ. మలయుచు నీరుమోసి నవ♦మాసము లేగిన మేఁత కేగి నాఁ
డిలు మఱి చేరలేక యొక♦యిఱ్ఱిమెలంతుక తద్వనంబునం
బులిపొదరింట నీనుటయు ♦ మోదమునం బసిపిల్లతల్లి యై
పులి గడుపారఁ బాల్గుడుపు ♦ మూర్కొనుచుం దగ లేడిపిల్లకున్. 177
చ. ఘనమతిఁ బత్త్రపుష్పఫల♦కాండములన్ శివపూజ నమ్మహా
ముని యొనరించుదాఁకఁ బిక♦ము ల్చిగురాకుల మెల్లఁబో వళుల్
మును కుసుమంబులం దిరుగఁ♦బోవు వెసం జని చిల్క లెట్టి పం
డ్లను గనఁబోవు హంసలు కొ♦లంకుల నాడఁగఁబోవు తద్వనిన్. 178
వ. అట్టిత్రివిష్టపసమప్రఖ్యం బగునాశ్రమంబున నలుగడ లరయుచుం బోయి పోయి దివాకరసమప్రభాభాసమానుం డగుదధీచమహామునిపాలికిం బోయి నమస్కరించుటయు. 179
చ. తనకడ కేగుదెంచుసుర♦తల్లజులం గడు దవ్వుదవ్వులన్
గని మునికుంజరుం డెదురు♦గాఁ జని తోడ్కొనివచ్చి వేడుకం
దనరెడుభద్రపీఠికలఁ ♦ దార్చి సతీయుతుఁ డై విధిక్రమం
బున గృహకృత్యము ల్సలఁగఁ ♦ బూజ లొనర్చెను వేఱువేఱుగన్. 180
క. పూజితులై భద్రాసన,రాజితులై యమరునమర♦రాజులఁ గని య
వ్యాజవినయమతిఁ గుశలం, బాజటిరా జడిగి యుఁడుగ ♦ కానందమునన్ 181
ఉ. ఎట్టితపంబు తొల్లి చను♦నేభవమం దొనరింతునోటు మీ
యట్టిమహానుభావు లమ♦రాధ్యులు దర్శన మీయఁ గల్గె నా
యట్టియలంతి కిట్టు లహా♦హా యిఁకఁ దత్ఫల మేమి సెప్ప నే
పుట్టుకొలంబులో నిపుడు ♦ పూతుఁడ నైతి భవత్పదార్చనన్. 182

* కోలెమ్మ = వెన్నెముక,కశేరుక.



వ. అని వినయంబునం బలుకుమునిం గని మనంబుల సంతసించుచు నింద్రాదులు తమవచ్చినకార్యం బెఱింగించి యిట్లనిరి. 183
చ. వితరణలుప్తకల్పపృథి♦వీరుహ నీమెయిఁ బొల్చుశల్యశ
స్త్రతతుల శత్రునాశ మతి♦సత్వర మౌ నని విందు మందునన్
యతి వధ మెంతయేని యఘ ♦ మంచును జంకక మేను వేఁడ వ
చ్చితి మిటు లుండునే భువి ని♦నీ యని రోయక దాన మీయవే. 184
వ. అని వేఁడుటయు నమ్ముని నెమ్మనమ్మున సంతసించుచు నమ్మతించి వినమ్రులై దీనాలాపంబు లిచ్చెడువియచ్చరులం జూచి కరుణించి దివ్యుల రగుమీహితంబు గోరి మీకై ప్రాణంబు లిచ్చుటకన్న ఫలం బొండొకండు లేదు భవదర్థంబు నం జేసి కృతార్థుండ నయ్యెద నని చెప్పుచు నప్పుడ యోగానుసంధానంబునం జేసి వాయునిరోధనంబు గావించె నంతఁ బ్రాణంబులు బ్రహ్మరంధ్రంబు వగిలించుకొని తన్మార్గంబున నూర్ధ్వంబునకు నిర్గమించి బ్రహ్మైక్యంబు నొందె బృందారకులును బరాసు వగుదధీచునికళేబరంబు ఖండించి పితామహోక్తక్రమంబునఁ దదస్థు లెల్ల సంగ్రహించి త్వష్టవలన వాని మహాయుధంబులు గావించుకొని వృత్రునిం గెలువ దాడి వెడలి రయ్యవసరంబున. 185

ఇంద్రుఁడు వజ్రాయుధంబున వృత్రాసురుని సంహరించుట.

మత్త. కాలదండము కేలఁ బూనిన♦కాలకోటులఁ బోలునా
కాలకేయులు కాలకాలులు ♦ ఖడ్గహస్తులు చుట్టునన్
శైలరాజములట్లు కాచుచు ♦ సర్వసైన్యసమేతులై
త్రాల వృత్రుఁడు శత్రుసాధ్యుఁడు ♦ గాక భాసిలె నత్తఱిన్. 186
ఉ. వేల్పులు దాఁకి దానవుల ♦ విక్రమ మేర్పడ నాకసంబునం
బొల్పుగ నిల్చి పోరి రటఁ ♦ బూర్వసుపర్వులు నొడ్డి మార్కొనం
దెల్పఁగరాక నింగియును ♦ నేలయు నిండఁగ బాణసంచయం
బల్పము గానిభంగిఁ దుము♦లావహ మయ్యె భయంకరంబుగన్. 187
క. పిఱుతివియక యిఱువాగ,త్తఱి మొనసి దురం బొనర్పఁ ♦ దలలున్ మొలలున్
బిఱుఁదులు కాల్సేతులు వడి, నఱుకుడు వడి పడిరి క్రింద ♦ నలుగడఁ జెదరన్.188
వ. అయ్యవసరంబున. 189
మ.*దవదగ్ధాద్రులువోలె హాటకతను♦త్రప్రాప్తిఁ గాలేయు లా
హవభూమిన్ విహరించుచున్ విశిఖవ♦హ్న్యాసారము న్నించుచున్

* దవము = కార్చిచ్చు.

జవసత్వంబులు సూపుచుఁ ద్రిదశులన్ ♦ శౌర్యంబునం దాఁకి నొం
చి వడిం జూచిన వారు వారి రరులన్ ♦ జేరంగలే కార్తులై. 190

ఉ. ఆగతిఁ బాకశాసనుఁ డ♦హంకృతి దూలఁగ వారిబారికిన్
భీతునఁ బాఱునిర్జరులఁ ♦ బెచ్చినపేర్మి వెలుంగుశత్రులన్
బ్రీతి దొలంగి చూచి మది ♦ బెగ్గిలి దిగ్గునఁ బోయి శౌరి క
త్యాతతభక్తి మ్రొక్కి శర♦ణార్థులఁ గావు మటంచు వేఁడుడున్. 191

ఆ. వనజనాభుఁ డతని♦వనట దీర్పఁగ నెంచి, వానియందుఁ దనయ♦నూనతేజ
మావహిల్లఁ జేసి ♦ దేవవైరుల నెల్లఁ, గూల్పఁ బుద్ధి కరుణఁ ♦ గూర్చె నపుడు.

వ. అట్లు విష్ణ్వనుగృహీతుం డగుజిష్ణుండు బలపరాక్రమవర్ధిష్ణుం డై మరల సురలం బురికొల్పుకొని కల్పాంతదావదహనుం డన మండుచువృత్రునిపై కుఱుకుటయును.

మ. బలదర్పస్థితుఁ డయ్యె శత్రుఁ డని తా ♦ భావించి వృత్రుండు మే
ల్బళి కే యంచును మేలమాడి యఱచెన్ ♦ బహ్వారవం బేర్పడన్
గలఁగం బాఱినదాన భూమియును ది♦క్చక్రంబు వ్యోమంబునున్
జలియించెం జగ మెల్ల బెండుపడి రొ♦ర్లన్ సంత్రస్తులై రాసురల్. 194

తే. అపుడు పరమోన్నతం బగు♦నారవంబు, విని ఘనం బగుసాధ్వస♦మున మునింగి
త్వరితుఁడై చేతఁదనరారు♦వజ్ర మెత్తి, విడిచె వృత్రాసురునిమీఁద ♦ జడను పడుచు.

క. శతకోటి దాఁకి వృత్రుని, క్షితిపైఁ బడ వేసె నంతఁ ♦ జెచ్చెర వాఁడున్
మృతుఁడై పడి మందరగిరి,గతిఁ బడ దేవతలు మునులు ♦ కడు ముద మందన్.

సీ. ‡అట్లు పడినవాని ♦ నరసి దేవేంద్రుండు, భయమోహితుం డయి♦ బడలుపడుచు
నశనిప్రయోగంబు ♦ నసురపాతంబును, నిజ మని తలఁపక ♦ గజిబిజి పడి
కను వడి నట నొక్క♦కడ నున్నసరసునఁ, జొరఁబాఱి యెంతయు ♦ సొమ్మసిల్లి
బెగడు మానిచి వాని ♦ వేల్పు లనునయించి, పురికొల్పి కవిసిరి ♦ దుర మొనర్ప

తే. వృత్రు మొత్తినదాన నా♦శత్రువర్గ, ముత్తలపడి తత్తఱమున ♦ నొత్తగిల్లి
కలఁతపడి కాందిశీక మై ♦ కాల్కొ లందిఁ, బఱచె నఱచుచు నెంతయు ♦ విఱిగివిఱిగి.

కాలకేయాదులభయంబున దేవతలు విష్ణుదేవు శరణుసొచ్చుట.

వ. అంత నక్కాలేయాదిదైత్యదానవసమూహంబు భయార్తం బై తిమితిమింగిలనక్రసమాకులం బై యప్రమేయం బగుమకరాలయంబునం జొచ్చి యచ్చట వియచ్చరాదిశాత్రవలోకదుర్గం బగుమహాదుర్గంబు నిర్మించుకొని నిరుపద్రవంబుగ నివాసంబుండి కాలక్రమంబునఁ ద్రైలోక్యవినాశనంబు సేయునది యై నానావిధో

‡అశని=వజ్రము.



పాయంబు లారయుచుం బవళ్లెల్ల సముద్రగర్భంబునం దడంగి యుండి రే లెల్ల జగంబులం బడి హింసింపం దొడంగి విద్యాతపోబలసంపన్ను లగువిప్రులకారణంబునం జేసి లోకంబు లనపాయంబు లగుచున్నయవి గావున మొట్టమొదల ట్టివిప్రులం బట్టి గిట్టింత మంత నంతయు నంతంబు నొందు నని దుర్మంత్రంబు సేసి వసిష్ఠాశ్రమంబున వాయువారిపర్ణాశను లైనవారి నూటతొంబదియేన్వురఁ దాపసోత్తములను జవనాశ్రమంబున ఫలమూలాశను లైనవారి నూర్వురమహామునీంద్రులను భరద్వాజాశ్రమంబున నీహారాశను లైనవారి నిర్వదుండ్ర నియతబ్రహ్మచారులను భక్షించి యిట్లాశ్రమంబున నాశ్రమంబు లెల్ల మెట్టి యెల్లవారినిఁ బట్టి భక్షించుచు నెరికిం గానరాక మహోపద్రవంబు గావించుచుండె నట్టియెడ నఖిలాశ్రమంబులును బ్రభాతంబునఁ దలలు లేక కాళ్ళు లేక కనువులు లేక మాంసమస్తిష్కాదులు లేక తుండెంబు లై మొండెంబు లై పడియున్నశవశతంబులును భగ్నంబు లైనస్రుక్స్రువంబులును మూత్రపురీషభూయిష్ఠంబు లైనవహ్న్యగారంబులును నష్టయజ్ఞోత్సవక్రియాకలాపంబులై శూన్యంబు లైనయుటజంబులును గలిగి నిరుత్సాహజనకంబు లై కానంబడ జగజ్జను లెల్లరు దల్లడిల్లుచు నాత్మత్రాణపరాయణు లై దెసలం బాఱియు గుహలం దూఱియు నిర్ఝరులం జేరియుఁ బారంబు గానక భయకంపితాత్ము లై పరితపించుచుండి రయ్యవసరంబున నింద్రాదిదేవత లాజగదుపప్లవంబునకుఁ గారణంబును నివారణోపాయంబు నెఱుంగ నేరక మిగుల వగలం బొగులుచు క్షేమంకరాగ్రగణ్యుండును నిఖిలలోకశరణ్యుండును నగునారాయణదేవుశరణంబు వేఁడుట మన కిపుడు కర్తవ్యం బని సర్వభావంబుల నిశ్చయించి యకుంఠవైభవాకరం బగువికుంఠపురవరంబునకుం జని వైకుంఠుం బొడగాంచి నమస్కరించి. 198

శా. దేవా నీవ చరాచరాంచితము లై ♦ దీపించులోకంబులన్
బ్రోవన్ ద్రుంపఁ సృజింప నేత వగుచుం ♦ బాల్పొందుచున్నాఁడ వీ
వే విశ్వంబును నీవె విశ్వపతి వీ♦వే కర్తవున్ భోక్తవున్
నీవే సర్వము నిన్నెఱుంగ రెవరున్ ♦ నిర్ణిద్రతేజోనిధీ. 199

సీ. *పెనుచేప వై తొలి♦మినుకు తెక్కలి కాని, రక్కసిఁ బెన్నీట ♦ రాచి తీవు
తాఁబేల వై నీటఁ ♦ దరికొండ మునుఁగ కుం,డఁగ నెత్తి వీఁపునఁ ♦ దాఁపి తీవు
పోత్రి వై పాతాళ♦మునఁ దూఱి బంగరు,కంటిసోఁకునిఁ జావ ♦ గెంటి తీవు
నరసింహమూర్తి వై ♦ పరఁగి భక్తులఁ బ్రోవ, నరభోజిఁ ద్రేల్మిడి ♦ నఱకి తీవు

*తొలిమినుకుతెక్కలికాఁడు-సోమకాసురుఁడు; బంగరుకంటిసోఁకుని-హిరణ్యాక్షుని; పోత్రి-వరాహము.

తే. వడుగవై యబ్బలీంద్రు న◆క్కడఁచి తీవు, యజ్ఞమూర్తివై జృంభుని ◆ నడిచి తీవు
మఱియు నెన్నియేనాపదల ◆ మాన్పి జగము, సారెకును బ్రోచితివి నీవు ◆ సారసాక్ష.
వ. నీవు చతుర్విధజంతుజాలంబులం బరిరక్షించు పరమేశ్వరుండవు నీ ప్రసాదంబున కీజగత్త్రయంబు పాత్రంబు మావిన్నపం బాలకింపుము. 201
చ. ‡జగములకి ట్లుపప్లవము ◆ సంభవమయ్యె నదింతనంగ రా
దగు భయమెంతయేనియు మ◆హామునివర్యుల నేరొకాని రే
ల్తగిలి వధించి పోవుదురు ◆ తామరసేక్షణ దానిమూల మి
ట్లగు నని విన్నవించుటకు ◆ నైతి మొకింతయుఁ గాక యుండెనున్. 202
క. క్షీణంబైనం బ్రాహ్మ్యము, క్షీణం బగుఁ బృథివి దానఁ◆జేసి త్రిదివమున్
క్షీణం బగు నన్నియు న,క్షీణము లగునట్లు కరుణఁ ◆ జేయవె దేవా. 203
వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై దేవదేవుండు దేవతల కిట్లనియె. 204
చ. తెలిసె నదంతయు న్వినుఁడు ◆ దేవతలార యెఱుంగఁ జెప్పెదన్
గల రిలఁ గాలకేయు లనఁ◆గాఁ జనుక్రూరులు వారు వృత్రునిం
దొలుత సమాశ్రయించుకొని ◆ త్రుళ్ళుదు రిప్పుడు వానిలేమికిం
దలఁకుచు నబ్ధిమధ్యమున ◆ దాఁగి జగంబుల నొంతు రిగ్గతిన్. 205
తే. వారి వధియింపఁ బోల దె◆వ్వారి కైనఁ, గంధి నీరెల్ల వట్టినఁ◆గాని దాని
కీరు యత్నము గావింపుఁ◆డింతలోనఁ, గలఁ డగస్త్యుఁడు నా మహా◆తిలకుఁడొకఁడు.
క. అతఁడు గాక మఱొక్కం, డాతతజలరాశి వట్టు◆నట్లుగఁ జేయం
జాతు నను వాఁడు లేఁ డా,భూతలమున కతని వేఁడ ◆ బొం డీరు వడిన్. 207
వ. అని చెప్పిన నప్పురుషోత్తము న్వీడ్కొని వేడ్కమెయి జేజే లెల్లరు నగస్త్యాశ్రమంబునకుఁ జని నమ్మహాత్ముం డగు మైత్రావరుణిం గని వినయంబున నిట్లనిరి. 208
సీ. ఎవ్వాఁడు వాతాపి ◆ నిల్వలానుజు మ్రింగి, నిష్కంటకము చేసె ◆ నిఖలధరణి
నెవ్వాఁడు దివినుండి ◆ నిల నల్లనహుషునిఁ, బడ ద్రొబ్బి సన్ముని◆ప్రతతిఁ గాచె
నెవ్వాఁడు బ్రహ్మాండ ◆ మెరియంగఁ బెరిఁగిన,వింధ్యాద్రి నడఁగించి ◆ వినుతిఁ గాంచె
నెవ్వాఁడు రుద్రాంశ ◆ మెనక మెసఁగఁ గుంభ,మునఁ బుట్టి జగములఁ ◆ బ్రోది సేసె
తే. నట్టినిన్నుఁ దపోధను ◆ సకల లోక,బృందవందనీయపదార◆విందు నిందు
మకుటసదృశప్రభావుని ◆ మహితకీర్తిఁ, బ్రస్తుతింతుము భక్తిసం◆భరితుల మయి.
వ. అని దేవత లగస్త్యుం బ్రశంసించిరి. 210

‡ వలి = వలను.



అగస్త్యుఁడు వింధ్యగర్వ మడంచుట.

చ. అన విని ధర్మజుండు విన◆యమ్మున లోమశమౌనిఁ గాంచి యో
మునివర వింధ్యభూధరము ◆ ము న్నొకనాఁటి కదేల వర్ధిలెన్
ఘనుఁ డగుకుంభజుండు గిరి◆గర్వ మదేటి కడంచెఁ జెప్పవే
యనవుడు నమ్మహర్షి విను ◆ మంచుఁ గురూద్వహుతోడ నిట్లనున్. 211
ఉ. పర్విన వేడ్కతో నవుడు ◆ భాస్కరమూర్తి ప్రదక్షిణంబుగాఁ
బర్వతరాజమై వసుధ ◆ భాసిలు మేరువుఁ జుట్టి వచ్చుచో
నవ్వనగోత్రమత్త్వమునఁ ◆ జాలి తలిర్చెద నే నటంచు లో
గర్వితుఁడైన వింధ్యుఁ డొక◆కాలమునందు దినేంద్రు నిట్లనున్. 212
క. ననుఁ జూడ వేల మేరువు, ఘన మనియో ప్రహరిదిరుగఁ ◆ గడఁగెద వెపుడున్
జన దట్లు ననుఁ బ్రదక్షిణ, మొనరింపుము నేఁడుగోలె ◆ నో దిననాథా. 213
ఆ. అనిన సూర్యుఁ డనియె ◆ నచలేంద్ర నేను నా,యంత నిట్లు తిరుగ ◆ నఖలజగము
లరసి చేయువేల్పు◆నాజ్ఞ నీమార్గముఁ, బట్టి తిరుగుదు నని ◆ పలుకుటయును. 214
ఉ. అయ్యెడ నయ్యహార్యము మ◆హాక్రుధ మేరువు మాఱు పెట్టి యొ
య్యొయ్యన ధ్రువమండలము ◆ నున్నతిఁ జెచ్చుపెరింగి రాయుచున్
నెయ్యము తియ్యము న్విడిచి ◆ నేర్పును గీర్పును జూడఁబోక తాఁ
జయ్యన నడ్డె సూర్యునకుఁ ◆ జంద్రునకుం గలమార్గ మంతయున్. 215
సీ. అఖిలాండకోటి బ్ర◆హ్మాండంబు లెల్ల న,క్కొండ విచ్చెను బచ్చి◆కుండ లనఁగ
సూర్యచంద్రాగ్నులు ◆ సొరిది తేపునుమాపు, నను మదారులు కట్టు◆వడియె మిగుల
నొకచో నెపుడుఁ జెమ్మ ◆ లూర గాఢతమంబు,నొకచో నెరియు నెండ◆యును గనుండె
సత్కర్మములు వోయె ◆ స్వాహాస్వధావష, ట్కారంబు లనుమాట ◆ గలుగ దయ్యె
తే. లోకములు నాల్గు పదియుఁ జీ◆కాకు పడియె, నన్నపానము లేరికి ◆ నబ్బ వయ్యె
సురనరోరగముఖజంతు◆వరచయంబు, లునురు లూఁపుట మంత్రించు◆నోజఁ బడియె.
వ. ఇట్లకాండప్రళయంబో యన బ్రహ్మాండం బెల్ల నిండి యక్కొండ జగదుపప్లవంబు గావించు టెఱింగి దేవత లెల్ల రేకీభూతులై వింధ్యశైలంబుపాలికిం జని ప్రార్థించియు ఫలంబు గానక కుంభసంభవుం డొక్కరుండు దక్క నొండొక్కండీ కార్యంబు దీర్ప నోపం డతనిం బ్రార్థింపఁ బోయిన కిదు డవశ్యకర్తవ్యం బని గీష్పతిపురస్సరంబుగా నగస్త్యాశ్రమంబునకుఁ బోయి వింధ్యగర్వం బెఱిఁగించి యీ మహోపద్రవం బుడుపు మని వేఁడిన నతం డనుమతించి సురలం బంచి భార్యా-

శిష్యసహితుండై కదలి కతిపయప్రయాణంబుల మేరుభానుస్పర్ధాభివృద్ధి నవంధ్యగర్వ
దుర్విదగ్ధం బగువింధ్యంబున కరుగుదెంచుటయును. 217

చ. గురువరుఁ డేగుదెంచె నని ♦ కోరిక లీరిక లెత్త నమ్మహా
గిరికులసత్తముం డవని ♦ క్రింద కడంకువ లోడ నమ్రుఁడై
పరమదయానమగ్ర పరి ♦ పాలయ మా మని యర్ఘ్యపాద్యముల్
గురుమతి నిచ్చి భక్తి మది ♦ లోఁ గడు హెచ్చ నుతించు చున్నచోన్. 218

క. ఆశ్వాసింపుచు నగ, స్త్యేశ్వరుఁ డవ్వింధ్యశిఖరి ♦ కి ట్లని పల్కెన్
శశ్వత్ప్రతాపకీర్తుల, శాశ్వతసుఖ మనుభవింతె ♦ ఛాత్రవరేణ్యా. 219

వ. అంతేవాసివతంసమా మేము లోపాముద్రాసహితుల మై తీర్థయాత్రాచణశీలుర మై
పోవుచున్నవారము వృద్ధులము గాన మాకుఁ బోఁ దెరువు సూపి మేము మరలి
వచ్చువఱ కిట్ల యుండు మని చెప్పి యొప్పించి మైత్రావరుణి దక్షిణమార్గంబు పట్టి
చని మగిడి రాఁ డయ్యె వింధ్యుండును గురువచనంబున కొండాడక దరిద్రగత
మనోరథంబువలె నిజమనోరథంబు విరథం బగుడు మేరువుపైఁ గలమత్సరం బుడిగించు
కొని పుడమి నడంగి యుండె నపుడు సూర్యచంద్రులకు స్వతస్సిద్ధశుద్ధగమనంబు
సిద్ధించె నిది వింధ్యగర్వనిర్వాపనంబు విను మట్లు వేఁడుడు మీ రేమి వచ్చితి రెఱింగిం
పుం డనిన దేవత లగస్త్యుం జూచి. 220

అగస్త్యుండు సముద్రోదకంబు ద్రావుట.

మత్తకోకిల. *కాలకేయులు లోకపాలికిఁ ♦ గల్గఁ జేయుచుపప్లవం
బోలిఁ జెప్పి మునీంద్రచంద్ర మ ♦ హోదధిం గలయట్టికీ
లాల మంతయు పట్టిపోయెదు ♦ లాగునం దయఁ జూచి లో
కాళి దాపుర మై ఘనం బగు ♦ నావడిం దొలఁగింపవే. 221

క. నీలావున జల మింకుడుఁ, గాలేయులఁ బట్టి మేము ♦ కడతేర్తు మనన్
లీలమెయి నట్ల యగు నో, వేలువులారా భయంబు ♦ విడువుం డింకన్. 222

వ. అని వారి నూఱడం బలికి కుంభసంభవుండు సురగరుడోరగయక్షరాక్షససిద్ధసాధ్య
సమేతుం డై కదలి. 223

చ. †నురువుల నవ్వునట్లు లలి ♦ నూల్కొనుగాలిఁ జలించునట్లుఁ జెం
దరఁగల నాడునట్లు సత ♦ తస్వనసంగతిఁ బాడునట్లుఁ గం
దరముల భూధరంబులను ♦ దద్దయుఁ దొట్రిలునట్లుఁ బొల్చుపు
ష్కరనిధియొద్దకుం జనె న ♦ గస్త్యమునీంద్రుఁడు సేంద్రముఖ్యుఁ డై. 224

* కీలాలము = జలము; ఉపప్లవము = ఉపద్రవము; దాపురము = ప్రాప్తి. † పుష్కరనిధి = సముద్రము.



శా. †నీర్వామిం గనినంత సంతసమునం ♦ దీపించి మౌనీంద్రుఁ డో
గీర్వాణోత్తములార శక్త్రమున శ ♦ క్తిం గల్గి మీ రుండుఁ డే
గర్వం బేర్పడ నింతలోన జలధిం ♦ గ్రోఁగింతుఁ బొం డంచు నా
సర్వాంభశ్చయ మొక్కగ్రుక్కమెయి నెం ♦ చం గోలె లీలాగతిన్. 225

వ. అనంతరంబ. 226

ఉ. ‡వట్టినకంధిమధ్యమున ♦ వాసి చెడం బడి కాలకేయు ల
ప్పట్టునఁ జేపలట్టులు ప్ర ♦ భావము దూలఁగఁ దేలగిల్లి చూ
పట్టుడు శౌర్యధుర్యులు సు ♦ పర్వులు పైఁ బడఁ బాఱి ధీరు లై
పట్టసముద్గరాదులను ♦ బట్టి వధించిరి వారి వ్రేల్మిడిన్. 227

తే. అపుడు హతశేషు లగుకొంద ♦ ఱాతురపడి, నేలఁ బెకలించుకొంచుఁ బా ♦ తాళమునకుఁ
బాఱి తలఁదాచుకొని రంత ♦ భయముఁ దక్కి, సుర లగస్త్యునిఁ గీర్తించి ♦ పరఁగ ననిరి.

ఉ. §నీకరుణాకటాక్షమున ♦ నెంజిలి వాసితి మెల్లలోకముల్
చేకొనె సౌఖ్యసంపదలు ♦ చెప్పనదే మిఁక నీసమర్థతన్
లోకగురూ భజించెదము ♦ లో నిడికొన్నజలంబు లెల్ల ర
త్నాకరమందు నిండియుఁ బ్రి ♦ యంబున నింప ననుగ్రహింపవే. 229

సీ. అన మునిపుంగవుం ♦ డనియె నాకడుపున, మున్నీరు జీర్ణ మై ♦ పోయె మున్న
మఱియొండుయత్న మీ ♦ రెఱిఁగి కావింపుఁడు, నీట నీసముద్రంబు ♦ నిండునట్లు
నా విబుధులు విష ♦ ణ్ణస్వాంతు లై వాని, వీడ్కొని పరమేష్ఠి ♦ వీటి కేగి
ప్రాంజలు లై సాగ ♦ రము నిండు గతి మాకు, నానతీయవె యన ♦ నబ్జభవుఁడు
తే, వారలం జూచి సురలార ♦ వగవ వలవ, దవలఁ గాలాంతరంబున ♦ నర్ణవంబు
ప్రకృతిధర్మ మొందును భగీ ♦ రథుఁ డనంగ, వాసి గాంచినరాజన్య ♦ వరునివలన. 230

వ. అని పితామహుం డానతిచ్చిన వియచ్చరులు యథాగతకృతగమను లై కాలయో
గంబుఁ బ్రతీక్షించుచుండి రనిన ధర్మతనయుం డెట్లు భగీరథుండు సముద్రంబు
పూరించె నెఱింగింపు మనిన నతం డతని కావృత్తాంతం బంతయు సవిస్తరంబుగా
ని ట్లనియె. 231

సగరచక్రవర్తిచరిత్రము.

మ. కలఁ డిక్ష్వాకుకులంబున న్సగరుఁ డ ♦ క్ష్మానాథచంద్రుం డ్రకం
డలఘుప్రాభవుఁ డుద్ధతోన్నతబలుం ♦ డైశ్వర్యధుర్యుండు ని

† నీర్వామి = సముద్రము. ‡ వట్టిన = శూన్యమయిన; తేలగిల్లు = పైకిఁ దేలు. § నెంజిలి = మనోవ్యథ.

స్థులతేజోమహితుం డతం డధికుం డై ♦ క్షోణీస్థలిన్ హైహయా
దుల నిర్జించి స్వరాజ్య మేలె నమరేం♦ద్రుండో యనం దొల్లిటన్. 283

తే. రూపయౌవనసంపన్న ♦ లై పరంగిన, వారి వైదర్భి శైబ్య య♦న్వారి నిర్వ
రను సతులుగాం బడసి పుత్త్ర♦లనుబడయక, గతులులే వని తపియించి♦మతి నతండు. 

వ. పుత్త్రకాముం డై కళత్త్రంబులతోఁ గైలాసంబున కరిగి. 284

మ. *ఘనుం డామానవనాథుం డందుం దపముం ♦ గావించి కావించి కాం
చె నుమానాథు రమాధినాథదయితున్ ♦ శ్రీకంఠునిన్ శూలపా
ణి నిభార్ద్రాజినవాసు వాసవనుతు ♦ న్నిర్నిద్రతేజోనిధిన్
మునిలోకార్చితపాదపీఠు నభవున్ ♦ భూతేశ్వరు న్శాశ్వతున్. 285

క. కనికరముం జూపు శంకరుం, గని తానుం బత్ను లవుడు ♦ కాళులం బడుచున్
మనుజేంద్రుం డవుడు వేఁడెం, దనయుల నిమ్మనుచు నతనిం ♦ దాత్పర్యమునన్.

సీ. ‡కరుణించి శివుం డొక్క♦గరిత కర్వదివేవు, రొకతెకు నొక్కరుం ♦ డుదయ మగుదు
రం దఱువదివేగు ♦ రాత్మజు లొకకాల, మంద కాలక్షయ ♦ మందం గలరు
కడమయొక్కండు వంశ♦కర్త యై భర్త యై, ధరణిం బాలించెడు ♦ ధరణినాథ
యనుచు నంతర్ధాన♦మును బొందె హరుం డంత, నగరుండు సతులతో♦మగిడెం బురికిం

తే. †బిదప గుర్విణులై సతుల్ ♦ పొదలి రందు, మొదల వైదర్భికి నలాబు ♦ వుదయమయ్యె
నవల శైబ్యకు వరసుతుం ♦డయ్యె నొకండు, వగవు నంతన మొకపరి ♦ దగులుకొనంగ.

చ. ¶వదరది కాదటంచు నృప♦వర్యుండు దానిం బరిత్యజింపంగా
మదిం దలపోసె నప్పు డొక♦మాత్త్రము గానిరవంబు పెంపునన్
జదలు వచించెం గూడ దిటు ♦ సాహస మిందలిగింజ లుమ్మతోం
బొదలినకుండలం దిడుము ♦ పుట్టెద రర్వదివేలు పుత్త్రకుల్. 288

వ. అంత నయ్యిలాధినాథుం డయ్యాకసంబు చెప్పిన ట్లయ్యలాబుబీజంబు లెల్ల నేఱి వేఱువేఱ సోపస్వేదఘృతభాండంబులం బెట్టి వాని నన్నింటి నందఱుదాదు లను క్షణం బేమఱ కుండునట్లు చేసి రక్షించుచుండె నంతం గొంతకాలంబున కాబీజంబులనుండి షష్టిసహస్రసంఖ్యాకు లగుసాగరులు పుట్టి వారు రుద్రప్రభావంబునం జేసి రౌద్రమూర్తులు క్రూరకార్యప్రవర్తులు నై ప్రవర్ధిల్లి. 289

* ఇభార్ద్రాజినవాసుండు = ఏనుంగుపచ్చితోలు వస్త్రముగా ధరించిన వాఁడు.
‡ కాలక్షయము = యమమందిరము. † గర్భిణి = గర్భవతి; అలాబువు = సొరకాయ.
¶ వదరు = సొరకాయ; ఉమ్మ = ఊష్మము.



సీ. ఇంద్రలోకముం జేరి ♦ యింద్రునిం దూలించి, యగ్నిలోకముం ♦ జేరి యగ్నిం దోలి
యమలోకమును జేరి ♦ యముని వినిర్జించి, నిరృతిలోకముం జేరి ♦ నిరృతి నొంచి
వరుణలోకముం జేరి ♦ వరుణునిం గరుణించి, పవనలోకముం జేరి ♦ పవను నోడిచి
ధనదలోకముం జేరి ♦ ధనదుని నోడించి, శివలోకమును జేరి ♦ శివునిం గేరి

తే. మఱియునుం గలలోకముల్ ♦ మచ్చరంబు, పెచ్చు పెఱుగంగం దిరుగుచు♦వెచ్చి కండ
కావరంబున నేరికిం ♦ గాక లోక, కంటకు లయి వర్తించిరి ♦ గండు మిగిలి. 240

ఉ. సాగరు లట్లు లోకముల ♦ సారెకుం గాఱియవెట్టు చుండం దా
మేగతిం దాళలేక సుర ♦ లేగి పితామహుతోడం జెప్పి ర
య్యాగడ మంతయుం దెలియు♦నట్లుగ నాతండు వేల్పులార మీ
రేగుడు వార చత్తురు సుం♦డీ తమచేసినదాన నింతలోన్. 241

వ. మీరు విచారంబుం దక్కి యుండుం డని పలికిన దేవ ళ్లెల్లరు తల్లడం బుడిగి నిజనివాసంబులకుం జని రంత నట. 242

సగరపుత్త్రులు కపిలకోపానలంబున దగ్ధు లగుట.

సీ. సగరుండు హయమేధ♦సవనదీక్షితుం డై త, దీయాశ్వరాజముం ♦ దిరుగ విడిచె
విడిచిన నఱువది♦వేగురు సాగరుల్, వెనువెంటం గాచుచు ♦ వెడలి రవుడు
ధర యెల్ల మెట్టుచుం ♦ దురగ మయ్యది జల, హీనార్ణవమున న♦దృశ్య మయ్యెం
దెలిపి తండ్రికి దాని♦తెఱం గెల్ల వారలు, తదనుమతిం దెసల్ ♦ వెదకి వెదకి

ఆ. మరలం దండ్రి కడకు ♦ నరుదెంచి జగములం, దెల్లకడలు రోసి ♦ యెందు నేని
హయముం గాని లేక ♦ హయహర్తనే గాని, యెఱుంగం జాల మైతి ♦ మేము తండ్రి.

వ. అనిన సగరుండు గినిసి మీరు మరల వారువంబు నరయం బొండు పొడగానకుండం బురమ్మునకు రాకుండుం డనిన సాగరులు వల్లె యని చని మహీతలం బెల్ల గాలించి గాలించి. 244

తే. విసివి వేసారి చింతిలి ♦ వింటివాకు, వలనం బుడమిని త్రొచ్చి యా♦కలికి మన్ను
మెసవుచు రసాతలము నేరి ♦ మెలంగ నచటం, గపిలుచెంగట నవనప్తిం ♦ గాంచి కసలి.

ఉ. *పట్టితి మద్దిరయ్య మన♦ప్రజ్ఞ ప్రకాశిల నేఁడు జన్నపుం
దట్టువదొంగ వీఁడె జడ♦దారి తెఱంగున నాట్యమాడెడుం
బట్టుండు కొట్టుం డంచుం దన♦పజ్జకు రాం గని మౌని తెప్పల
ట్టట్టుం గదల్చి చూచునవుం♦డే బసుమం బయి రెల్లసాగరుల్. 246

* తట్టువ = గుఱ్ఱము.

వ. అంత నక్కడ. 247

తే. నేటఁ జేపట వత్తు రన్మాట విడిచి, సగరుఁ డేగినపుత్త్రులం జాడ వినక
శోకదందహ్యమానుఁడై సురమునీంద్రు,నుసుల నంత విని మఱింత యడలునొంది.

వ. అంత సగరుండు తనతనయు లఱువదివేవురుం గపిలుకోపానలంబున భస్మావశేషు లగుటయు నసమంజుం డను శైబ్యాపుత్త్రుం డసమంజసుం డై పౌరబాలకులం గట్టి నదిం బడవేయుకతన నన్యదేశప్రాపితుం డై నష్టుం డగుటయుఁ దాను యజ్ఞదీక్షితుం డగుటయు నెఱింగి యజ్ఞంబు పూర్ణం బగుట కుపాయంబు గానక తనమనుమం డసమంజసపుత్త్రుం డంశుమంతుం డనువానిం బిలిచి కార్యం బెఱింగించి యి ట్లనియె.

ఉ. పుత్త్రులపోకకు న్వగపు పుట్టక పోవదు గాని జన్న మీ
ధాత్రిం బొనర్తు నంట వితథం బయి పోకకుఁ జాలఁ గుందుదుఁ
బౌత్త్రక నారకవ్యథలం బా లయి పోవక యుండ నాకిలన్
బాత్త్రతఁ గల్గఁ జేయుటకుఁ బాల్పడు మశ్వముఁ దెచ్చి చెచ్చెరన్. 250

క. ఇపుడు కుమార మఖాశ్వము, కపిలునికడ నుండె నీవు కడకఁ జని మునిం
గృప పుట్ట వేఁడి తెమ్మన, నపగతభయుఁ డగుచు నాతఁ డచటికిఁ బోయెన్. 251

తే. పోయి పితరులబసుమంపుఁ బ్రోవులకడ, విమలవిజ్ఞాననిష్ఠాప్రవిష్టుఁ డైన
కపిలసంయమితల్లజుఁ గాంచి యెడఁద, భక్తి మీఱఁగ ని ట్లని ప్రస్తుతించె. 252

అంశుమంతుండు కపిలుని వేఁడి మఖాశ్వముఁ దెచ్చి సగరున కిచ్చుట.

మ. పరమాత్ముండవు లోకరక్షకుఁడ వెవ్వారు న్నినుం బోల్పఁ జా
లరు వేదంబులు నిన్ స్తుతించుటకు నల్పత్వంబునుం బొందు నీ
శ్వరుఁడు బ్రహ్మయు విష్ణు వింద్రుఁడును సర్వంబు న్భవద్రూప మీ
పురుశక్తిం జరియించుచుండుదు దయాంభో దైవచూడామణీ. 253

క. సిరి వేఁడ నామొఁ బ్రోవఁగ, హరి వై వర్తింతు విప్ర యజ్ఞానంబున్
ధరఁ బాపఁగ నిట్లు మునీశ్వరుఁడవు నై వెలసి తీవు సర్వజ్ఞనిధీ. 254

క. ‡మునిమాత్రుండవె నీ వో, ఘనతరకరుణాప్రభావ కపిలమునీంద్రా
కను ద్రిప్పినంతలోన భువనముల భువనములుగ సలుపం గల వీశా. 255

శా. §సత్త్రార్వంబును గొన్నచోరుఁ డని నిన్ జర్చింతు రే యట్టి మ
త్త్వితజ్ఞానము సైఁపు నంయమివరా పేర్కొందుఁ బైతామహ
తంత్రత్వప్రతిపాదకానఘమఖాశ్వం బిచ్చి రక్షింపు మా
ర్తత్రాణప్రతినక్తభూరికరుణాధౌరేయ మౌనీశ్వరా. 256

‡ భువనములు = జగత్తులు, నీళ్లు. § అర్వము = గుఱ్ఱము; పేర్కొందున్ = స్తుతింతును.



క. అని వేఁడుకుమారునిఁ గని, మునిచంద్రుం డెడఁదఁ బొదలి పుత్త్రీ యిదె కొ
మ్మని మఖపశువు నొసంగినఁ, దనపితరులగతి కతండు దారియు నడిగెన్. 257

తరువోజ. అడిగినం గపిలుఁ డయ్యంశుమంతునకు ననియె నోవత్స నీ వనఘుఁడ వరయ
నెడఁద నీకోరిక తవియునీ దీర్చ నే నుంటి నీచేత నిపుడు నీతాత
పుడమిఁ గృతార్థుఁడై పాలిచె నీతండ్రిం బుత్త్రవంతుం డయ్యెం బొమ్ము నీయయ్య
లడరి స్వర్గమునకు నరిగి సుఖింతు రవల నీపౌత్త్రకృత్యతాతికృత్యమున. 258

వ. *నీ విప్పు డీహయరత్నంబుఁ గొనిపోయి సగరున కొసంగి సవనంబు గడచనం జేయింపు మనిన నతం డతని కభివందనం బాచరించి నిజరాజధానికిం జని సగరున కానర్వ వృత్తాంతంబు నెఱింగించి కత్తలాని నివేదించుటయు నతం డప్పౌత్త్రు నభినందించి గారవించి హయమేధసమాప్తిం గావించి సముద్రుం దనపుత్త్రునిఁ గా నంగీకరించి పౌత్త్రుం గూడి విస్మృతపుత్త్రశోకుం డై పాకశాసనుం బోలి చిరకాలంబు లోకపాలనంబు గావించి పౌత్త్రునందు భూభారం బుంచి స్వర్గంబునకు నిర్గమించె నంత నయ్యంశుమంతుండును బెద్దకాలంబు నేల యేలి తనపుత్త్రుం డగుదిలీపునందు రాజ్యంబు వెట్టి చనియె దిలీపుఁడును మహీపుఁ డై తనపితామహులమృతికి వగచి వారి కూర్ధ్వగతులు గలుగ గంగావతరణప్రయత్నంబు చేసియుం జేయఁ జాలక భగీరథుం డనుతనతనయునిఁ బూజ్యసామ్రాజ్యంబునం దభిషిక్తుం జేసి తపోవనం బాశ్రయించి సిద్ధిం గాంచె నంత. 259

భగీరథుండు తపంబు చేసి భూమికి గంగను దెచ్చుట.

చ. ఘనుఁడు భగీరథుం డతఁ డఖండబలంబునఁ జక్రవర్తి యై
పొనరి జగజ్జనప్రియత భూతల మేలుచుఁ గాపిలాగ్నికిన్
దనపిత లెల్ల నీఱగుటఁ దా విని వారమరాధివాసమున్
గొనుటకు దారి లేమికిని గొంచెముగానివిచార మొందుచున్. 260

ఆ. ‡అఖిలరాజ్యభార మాత్మధీసచివుల,యందుఁ బెట్టి పితల కమలగతులు
గలుగఁజేయఁ బూని కదలి తుషారాద్రి,కడకుఁ జనియె నతఁడు కడఁకతోడ.

వ. అయ్యద్రిరాజంబును. 263

సీ. బహువిధధాతుప్రభాభాసమానోన్నతోన్నతశృంగసముత్థితంబు
గరుడగంధర్వకిన్నరసురమిథునసేవితశిలాతలజగద్విశ్రుతంబు
నవిరతశార్దూలహర్యక్షరవపూరితానేకఘనకందరాంచితంబు
శుకశారికాకేకిపికకోకముఖవిహంగమసంకులాగమసముచితంబు

* కత్తలాని = గుఱ్ఱము. ‡ ధీసచివులు = మంత్రులు. తుషారాద్రి = హిమవత్పర్వతము.

తే. హంససారసకలితప♦ద్మాకరంబు, దివ్యవారిప్రపూర్ణన♦దీవరంబు
సుందరోన్నతబహులతా♦మందిరంబు, వర్ణనీయం బగుఁ హిమ♦వన్నగంబు. 168

వ. భగీరథుం డాహిమాలయభూధరంబున నిలిచి కందమూలాంబుభక్షుం డై నియమవ్రతంబున గంగాదేవి నంతరంగంబునం దిడుకొని వేయుపరివత్సరంబులు ఘోరతపంబు గావించె నంత గంగయుఁ బ్రత్యక్షం బై యభీష్టం బేమి యడుగు మనిన నతండు వినయంబునం బ్రార్థించి యిట్లనియె. 264

చ. ‡కపిలుఁడు మత్పితామహులఁ ♦ గన్గొనినంతన కాల్చెఁ బుచ్చె లోఁ
గృప యిసుమంత లేక యిటు ♦ కిత్తిని మిత్తికి నైనవారికిన్
సుపథము లేదు నీజలము ♦సోఁకనియంతకుఁ గానఁ దల్లిరో
యివు డరుదెంచి సాగరుల ♦ నీవు కృతార్థులఁ జేయు వేఁడెదన్. 265

ఆ. అనిన గంగ యనియె ♦ నౌఁ గాని నేవ్యోమ,పథమునుండి క్రిందఁ ♦ బడెడునపుడు
నాదువేగ మోర్వ♦రా దెరికేఁగాని, కాలకంఠునకు నొ♦కనికిఁ గాక. 266

క. నీ వతని మెప్పు వడయం, గావింపుము తప మతండు ♦ కరుణాళుం డై
నీవాంఛితంబు దీరన్, నావేగము సైఁచి తాల్చు ♦ నను శిరమందున్. 267

వ. అని గంగాదేవి యానతిచ్చిన భగీరథుండు కైలాసభూధరంబునకుం జని. 268

తే. అందుపీఠాననాసీనుఁ♦డగుచువార్చి, యతఁడు నియతాత్ముఁడై యుండి♦యధికతపము
శివుని మది నుంచి పెక్కేండ్లు♦ సేసె నతఁడు, పొలిచెఁ దన చెంత నెమ్మేను♦పులకరింప.

చ. పొలిచినభూతనాథునకు ♦ మ్రొక్కి హసాదు మహాత్మ మానులుం
దెలియఁగ లేరు పో యనిన ♦ నే నొకబాలుఁడ మోహితాత్ముఁడన్
దెలిసి నుతింపఁ జాలఁగల♦ నే సచరాచరజంతుకోటి లో
నిలిపిననిన్ను నన్నుఁ గరు♦ణింపు దయాకర చంద్రశేఖరా. 270

చ. †అని వినయంబు దోఁపఁ గొని♦యాడుభగీరథుఁ జూచి శంకరుం
డనియెఁ గుమార నీమనము♦నం దగుకోర్కి యెఱుంగుదుం బొన
ర్తును బొద మంచు మంచుమల♦ క్రొవ్వకుఁ దోడ్కొనివచ్చి వాని నీ
ధునిఁ దలఁ దాల్తు నే నిపుడు ♦ తొట్రిలకుండఁ గ వేఁడుకొమ్మిఁకన్. 271

వ. అనిన నమ్మహారథుండు సురనదిం బ్రార్థించిన నదియును. 272

ఉ. రంగదభంగతుంగకత♦రంగపరంపరఁ గప్పి దిక్కులన్
నింగి నెనంగఁ బొంగి వడి ♦ నేలఁ బడెం బడుచుండ శంభుఁ డ

‡ కిత్తి = అగ్ని. † మల = పర్వతము. ధుని = నది.



‡ గ్గంగ జటాకలాపమున ♦ గారవ మారఁగఁ దాల్చె నంత నా
సంగతి నేఱు ధారుణికి ♦ జాఱె సుపర్వులు సూచుచుండఁగన్. 273

క. మీనగ్రాహసమాకుల,మై నాకనదీవతంస ♦ మానిటలాక్ష
శ్రీనిలయజటాజూట,స్థానముపైఁ దారహార♦సరణిం దాల్చెన్. 274

సీ. సలలితకలహంస♦కలనాదమంజీర,రవకలితమహోన్న♦తవరగతియు
విమలసారతుషార♦విశదఫేనోత్కర,పరమోత్తరదుకూల♦వసనధృతియు
సతతపరిస్ఫుట♦చ్ఛంపాప్రభాభ్రాజ,మానమీనేక్షణ♦మహితరుచియుఁ
బవనవేగోచ్చల♦ద్భృంగపరంపరా,నీలసద్రవవచో♦విభృతరుతియుఁ

తే. †గలిగి నురుఁగుల నవ్వుచు ♦ లలిఁ గరళ్ళ,నాడుచును సుళ్ళఁ బాడుచు♦ వేడుకమెయి
సొగసుకత్తియ తెఱఁగునఁ ♦ జూడ నొప్పి, డిగియె నేలకు వినువాఁక ♦ వెగడు లేక.

వ. ఇట్లు త్రిపథగామిని యై ధరణి కవతరించినదివిజగంగ భగీరథుం దిలకించి నే నే మార్గంబున నిర్గమింప నగుం జెప్పు మనిన నతండు సాగరప్లావనార్థంబు విజయం చేయు మని తనమనోరథం బెఱింగించిన సంతసించుచు నవ్వు డాగంగాదేవి శైవజటాజూటంబునుండి హిమవచ్ఛిఖరాగ్రంబునం బడి భగీరథుని వెంట నంటి భరతవర్షమధ్యమార్గంబున సాగరబిలంబు సేరి తద్భస్మరాసులం బాతి వారికిఁ బుణ్యగతు లొసంగి పారావారంబు జలపూరంబు నా నెసంగం జేసి భాగీరథి యనం బేరువొంది జగత్త్రయంబు పవిత్రంబుఁ గావించె నంత భగీరథుండును భక్తిభరితాంతరంగుం డై దానిం దనకన్నకన్నియగా నెన్నుకొనుచు నందుఁ బితృదేవతలకుం దిలోదకంబు లిచ్చి పరిపూర్ణమనోరథుం డయ్యె నిది భాగీరథ్యవతరణప్రకారం బని చెప్పుటయును. 276

హేమకూటమహిమాభివర్ణనము.

క. విని ధర్మతనయుఁ డప్పుడు, మనమున హర్షించి నిజస♦మాజముతోడన్
జని నంద నపరనందన్, గని తీర్థములాడె భక్తి ♦ గడలుకొనంగన్. 277

తరువోజ. §అట హేమకూటాద్రి♦యం దుపలములు♦హాళహాళిఁబడు సైఁప♦నై తిగానట్లు
పటుతరవర్షంబుఁ ♦ బవనంబు గురియుఁ ♦బవలు రేయును వహ్ని ♦ ప్రజ్వలియించు
స్ఫుటముగా స్వాధ్యాయ♦సురుచిరస్వరము♦శ్రోత్రపేయంబగుఁ♦జూడరా దెదియుఁ
గటుకున మక్షికల్ ♦ కఱచుఁ దపంబుఁ ♦ గావింపనీ కందుఁ ♦ గలవింత లిట్లు. 278

‡ సంగతి = చేరిక. ఏఱు = నది.
† కరళ్లు = తరంగములు. వెగడు = తడబాటు. సుళ్ళు = ఆవర్తములు.
§ ఉపలములు = శిలలు. హాళహాళి = త్వర. కటుకున = కఱచుటయందు ధ్వన్యనుకరణము.

వ. పాండురాజపుత్త్రుం డట్టిపరమాద్భుతంబు లెల్లం గని యిది యెట్టిది చెప్పు మనిన లోమశుం డి ట్లనియె. 279

సీ. ‡ము న్నీ ఋషభకూటమున ఋషభుం డను, ఋషివృషభుం డొక్కఁ డెనసి యెసఁగు
బహుశతవర్షముల్ వయసు మీఱినవాఁడు, కోపనుం డెంతయుఁ గోసిపలుకుఁ
బలుక వచ్చినవారిపై ఁ జాలు రువ్వుచు, నో ర్మాయుఁ డని తిట్టుఁ గూర్మి లేక
సడి సేయకుండఁగ వడి గాలి మబ్బును, బిలిచి మ్రోయించు నిత్తలమునందు

తే. నిట్టి మునికృత్యము లెఱింగి యెల్లవేల్పు, లిచటి నంచావదికి వచ్చి యితనిఁ జూచి
దీని దుర్గము చేసిరి పూని కొండ, లిందుఁ జుట్టును సంధించి రెన్ని యేని. 280

చ. అది మొద లిమ్మహాస్థలమునం దడు గానఁగ లేరు మర్త్యులె
వ్వదమునఁ గాని మేను సుతపంబునఁ జేసి తపింప కున్నచో
నిది కనరానిచోటు పృథివీశ్వర నీ విట నైష్ఠికుండ వై
పొదలుము నీకు మే లగుఁ బుణ్యతపోజపదానసంగతిన్. 281

తే. ఇచట దేవఋషు లిన్ని యేని యజ్ఞముల నొనర్చిరి తచ్చిహ్నములె యిపుడును
గనఁబడుం దూర్వ్యలివికుశాకారములయి, త్స్మరుహము లివి యూపప్రకారములయి.

వ. ఇందలితీర్థస్నానంబు మహాపాతకోపపాతకహరంబు నీవు నీతమ్ములుం గొమ్మయు నిందు స్నానంబు గావింపుఁ డనిన నతం డట్ల కాక యని కృతావగాహుం డయ్యె నంత వారిం గూడి పోవుచు లోమశుం డిది విశ్వామిత్త్రాశ్రమం బిది కౌశికీనది యిది ఋష్యశృంగాశ్రమం బని మఱియును. 283

లోమశుండు ఋష్యశృంగునిచరిత్రము చెప్పుట.

చ. †అవని విభాండకుం డను మహాముని సోమునిపుత్త్రుఁ డై మృగీ
భవుఁ డయి ఋష్యశృంగుఁ డనఁ బ్రస్తుతి కెక్కినవాఁడు రోమపా
దవిషయమందుఁ బేర్వడసి తా నలరాజసుతన్ ద్వితీయఁ గాఁ
దవిలి మహాద్భుతక్రియకుఁ దానక మై విలసిల్లెఁ దొల్లిటన్. 284

తరలము. అనిన ధర్మజుఁ డిట్లు పల్కె మహామునీశ్వర లేటికిన్
మునికుమారుఁడు ఋష్యశృంగుఁడు పుట్టు టెట్టిది రాజక
న్యను గ్రహించుట యెట్టి దాతఁ డొనర్చినట్టిది విస్మయం
బనఁగ నెట్టిదొ తన్మహాత్త్వ మదంతయు న్వివరింపుమా. 285

వ. అనిన లోమశుండు. 286

‡ కోసిపలుకు = కోయునట్లు మాటలాడు ననుట కిట్లు వ్యవహరింతురు.
† ద్వితీయ = భార్య; విషయము = దేశము.



తే. ‡కశ్యపాన్వయజాతుఁ డై ఖ్యాతి గనిన
మునివరుఁడు విభాండకుఁ డను ఘనుఁ డెసంగు
బాలుఁ డయ్యును స్థవిరుఁ డై బ్రహ్మచర్య
మునఁ దపించుచు నొకహ్రదంబున వసించె. 287

వ. ఇట్లు పెద్దకాలంబు పరిశ్రాంతుం డై తపంబు సేయువాని కొక్కనాఁ డూర్వశీదర్శనంబునం జేసి రేతఃపాతం బయ్యె నయ్యమోఘవీర్యం బుదకంబులం గలసిన దానిం దృషిత యగు నొక్క లేటిబోటి ద్రావి గర్భిణి యై యర్భకుం గనియె నదియు.

ఆ. దేవకన్య యగుచు దీపించునది బ్రహ్మ, శాసనమున నట్లు జగతిఁ బుట్టి
మునిని గాంచి శాపమోక్ష మొందె నతండె, ఋష్యశృంగుఁ డనఁగ నెసఁగువాఁడు.

ఉ. ఆమునియుత్తమాంగమునయం దొకశృంగము పుట్టఁ బుట్టిన
ట్టే మహిత ప్రభావమున నీధరణీస్థలి ఋష్యశృంగుఁ డన్
నామము నొందె నాతఁడు వనంబును దండ్రిని గాక యొండొకం
డేమియుఁ గానఁ డెఱుంగక మహిం బ్రచురించెను బ్రహ్మచర్యమున్. 290

శా. †ఆకాలంబున రోమపాదుఁ డను విఖ్యాతాఖ్యుఁ డోజోజితో
ర్వీకాంతుం డమలుండు పఙ్క్తిరథధాత్రీనాథమిత్త్రుండు సు
శ్లోకుం డాతఁ డెదన్ బురోహితునకుం జూపోవ కెగ్గాడుటన్
గాకృత్యం బని వాని రోసి రలుకం గావించి విప్రోత్తముల్. 291

తే. దానఁ జేసి యనావృష్టి తద్ధరిత్రి, నయ్యెఁ బ్రజ లెల్లఁ బీడితు లైరి రాజు
కరము చింతించి బ్రాహ్మణవరులఁ గొలిచి, కరుణ వడసి వచించె నిక్కరణి నపుడు.

క. §కురియింపఁడు పర్జన్యుఁడు, ధరణి న్వర్షం బి దేమి తహతహ యయ్యా
ధరణిసురులార దీనికిఁ, బరిశాంతి వచించి నన్ గృపం గనుఁగొనుఁడీ. 293

చ. ¶అనుడుఁ బ్రసన్ను లై నృపతి కా ద్విజు లిట్లని రీవు దృప్తుఁ డై
ఘనులకు వేదవిప్రులకుఁ గా నపచారము చేయు నిన్ను వా
రనక పరిత్యజించి రది యయ్యె నుపప్లవకారణం బికన్
వినయము గల్గి వారలను వేఁడుము దాన శుభంబు గల్గెడిన్. 294

చ. కలఁ డిల ఋష్యశృంగుఁ డనఁగాఁ బుడమి కెక్కినవాఁడు పోఁడిమిం
గలిగినవాఁడు శాంతుఁడు వికారవిదూరుఁ డరణ్యవాసనుం

‡ స్థవిరుఁడు—పెద్ద. † కాకృత్యము—తప్పుపని. § తహతహ—వ్యసనము.
¶ దృప్తుఁడు—దర్పించినవాఁడు. అనక—ఏమియు ననక. (మాటాడక యని యర్థము.)

దలరెడునట్టివాఁ డెపుడు ♦ నన్నెడు పున్నె మెఱుంగఁ జేరి పై
బలుగఁడు కాఁడు లాడఁడు మ♦హాత్ముఁ డతండు మహీపురందరా. 295

సుగంధి.‡అతపస్వివర్యుఁ డున్న♦యట్టిభూతలంబునన్
దీతిబాధ లుండఁబో వ ♦ వెప్డుఁ బాడిపంట లాఁ
బ్రీతితోడ వాని నిందుఁ ♦ బిల్వ నంపు వచ్చెనే
నాతఁడి స్మహీతలంబు♦నందు వాన లయ్యెడిన్. 296

వ.†అని చెప్పిన నమ్మహీవల్లభుం డప్పుడ తనతప్పులకు నిష్కృతిం జెప్పకొని బ్రాహ్మణవచనంబునం జేసి బుద్ధిమంతు లైనమంత్రులతో మంతనంబుండి సర్వలోకవశ్యౌషధాభిఖ్య లగు వేశ్యాముఖ్యలం బిలువనంచి మీరు మీనేర్పు పెంపునఁ బ్రవర్తించి ఋష్యశృంగు నిటం దెచ్చునది యనిన వారు మునిశాపభయసంత్రస్త లై పలుకఁ జాలకుండి రపు డొకముదుసలిజంత నన్నుఁ బుచ్చుము నేఁ గార్యంబు సాధించుకొని వచ్చెద ననిన మహీకాంతుండు దానికిఁ బనదనం బిచ్చి యంపిపుచ్చె నదియు రూపయౌవనసంపన్న లగుచేడెలం గూడుకొని వేడుక మీఱ వారితో నొక్కనావ నెక్కి పయనంబై చని నానాపుష్పఫలసమంచితభూరుహసంచయంబులును నానామనోహరగుల్మజాలంబులును గలిగి మిగుల రమణీయం బై పరమాద్భుతదర్శనం బగునాకాశ్యపాశ్రమంబు లోచనగోచరం బగుటయు దానికింతసమీపతీరంబున నావం గట్టి విభాండకుం డెడసినజాడం గని వేశ్యమాత తనకూఁతు శృంగారవతి ననునయించి పంచె నిపుణ యగునదియు నొయారంబు మీఱ ఋష్యశృంగునిపాలికిం జేర నరిగి యి ట్లనియె. 297

—•—♦ రోమపాదునిపంపున వేశ్య ఋష్యశృంగుని వంచించుట. ♦—•—

చ. కుశలమె తాపసోత్తములకుం దప మొప్పనె మీవని న్సమి
త్కుశఫలకందమూలములకుం గఱ వెప్పుడు లేకయుండునే
పశుపతితుల్యు లై చనుభ♦వజ్జనకుల్ ప్రియ మంది యుందురే
విశదగతిన్ ఋషిత్వ జడివి ♦ వేడుక నాడుచు నీ వెలర్తువే. 298

వ. నిన్నుం గని నీతోఁ గొంత ప్రసంగించిపోవ వచ్చితి ననిన ఋష్యశృంగుం డయ్యంగనామణిం గని నివ్వెఱంపడి యి ట్లనియె. 299

ఉ. అక్కట జ్యోతిపోలె దెస ♦ లన్నియు వెల్గఁగఁ జేయుచుంటి వీ
వెక్కడవాఁడ వాహ్వాయ మ ♦ దేమి వచింపు మహాత్మ నీవు నా



మొక్కఁగ నైనవాఁడ వని ♦ బుద్ధి యగుం గొను మర్ఘ్యపాద్యముల్
చొక్కపుటిట్టితో లిదిగో ♦ చూడుము వేడుక విశ్రమింపుమా. 300

తే. అనిన వేశ్య వచించు నో♦యయ్య యిటకు, మూఁడుయోజనములదూర♦మున మదీయ
పావనాశ్రమ మగు నందు ♦ భక్తి నతిథి,పూజ సేయుదునే వాని♦పూజ గొందు.

వ. అట్లు కాకున్నం బెఱచోట నే జలోపస్పర్శనంబు సేయ నిది నావ్రతంబు దీనికి నీ వనుమతించితేని నన్నుం గ్రుచ్చుకొని నాతో వచ్చునది యనుడు నతండు నొఁ గాతమని పక్వంబు లగుకొన్నికారుమక భల్లాత కామల కింగుద ధన్వప్రియాళు ప్రముఖఫలంబులు వెట్టిన నవి ముట్టియు ముట్ట కది తన తెచ్చినభక్ష్యభోజ్యపేయంబులును సుగంధపుష్పమాల్యంబులును విచిత్రవస్త్రంబులును వాని కిచ్చి ముచ్చటలు హెచ్చ వానిచెంత బంతు లాడి నృత్యం బాడి పాడి నవ్వుచు నవ్వనచారి మాటిమాటికి నంగాంగసంయోగంబుగా నాలింగనంబు చేసికొని మోహపరవశుం జేసి లీలావలోకనంబులం దేలించి తేలించి నా కగ్నికార్యంబునకు వేళ యగుచున్నయది పోయివచ్చెద నని మెల్లనఁ జనియె నంత ఋష్యశృంగుండును. 302

సీ.‡మత్తుఁ డై మోహిత♦చిత్తుఁ డై పెల్లాటకత్తె వో యినదిక్కు ♦ హత్తి చూచుఁ
జూచి కన్దొవ మూసి ♦ చూచు లో నేచిన,చూపున బ్రహ్మంబుఁ ♦ జూచురీతి
రీతియు నీతియు ♦ ఖ్యాతియుం జెడ నాతి,బ్రాఁతిమై నెంచి లోఁ ♦ బ్రీతిఁ బొందుఁ
బొందు విడువలేని♦చందంబునం గుందు, మందుఁ డై యూర్పు న♦మందగతిని

తే. గతి నెఱుంగక నింగిఁ జూ ♦ పతుకఁ జేయుఁ, జేయునది లేక కన్నీళ్ళు ♦ పాయ విడుచు
విడిచినను వీడనట్టిపా ♦ టడర డిందు, డెందమున మోసకత్తియ♦చందమునకు. 303

తే. ఇట్లు విమనస్కుఁ డై యతఁ ♦ డెంతయేని,చింత నొందుచు నుండెను♦నంతలోన
నాతపక్లిన్నగాత్రుఁ డై ♦ యరుణనేత్రుఁ, డై విభాండకుం డరుదెంచె ♦ నడవినుండి.

వ. ఇ ట్లరుగుదెంచి. 305

చ.†ఎదిరినిఁ ద న్నెఱుంగ కొక♦యిక్క వసించి వివేకశూన్యుఁ డై
మది నదియో తలంచుచుఁ గ్ర♦మం బఱి యున్ననిజాత్మజన్మునిన్
గదియఁగ వచ్చి తండ్రి యను ♦ గాదిలిబిడ్డ యి దేమి యిట్లు నీ
వదనున నగ్ని వేల్వ కెద ♦ నాఱడి నొందుచు నుంటి చెప్పుమా. 306

క.§పాలార్చితి స్రుక్స్రువముల, వేలిమిపడ్డయును ♦ బిడ్డ వేర్పడ కొకఁ డై
క్రాలెడిని నగ్ని వేల్వం, బా లెక్కడినుండి నేఁడు ♦ వచ్చెన్ జెపుమా. 307

‡ తీతిబాధలు = అతివృష్టి, అనావృష్టి, మూషికములు, మిడుతలు, చిలుకలు, రాజులుచెంతనుండుట.
† నిష్కృతి = ప్రాయశ్చిత్తము. పనదనము = గొప్పపారితోషికము.

‡ పెల్లాటకత్తె = వేశ్య. బ్రాఁతి = ప్రేమ; పొందు = స్నేహము. † . ఇక్క — స్థానము.
§ పాలార్చు = ఉపేక్షించు; వేలిమిపడ్డ = హోమధేనువు; వేర్పడక = తెలుపక.

క.*ఎవ్వండే నిట వచ్చెనొ, యెవ్వగ రా నెద్దియేని • నీ కని చనెనో
యివ్వగ పేటికిఁ దండ్రీ, త్రెవ్వక యుండంగ నాకుఁ • దెలుపుము దానిన్. 808

వ. అనిన ఋష్యశృంగుండు తండ్రి కిట్లనియె. 809

—ఋష్యశృంగుఁడు తెలుంగక వేశ్య నభివర్ణించుట.—

మ.‡అహహా! యే మని చెప్పవాఁడ మునినా•థా నేఁడు నా చెంతకున్
బహుతేజోంచితమూర్తి యొక్కఁ డను వా•ప్పన్ వచ్చి పోయె న్మహా
మహుఁ డాతండు మహాతపస్వి సుమనో•మాన్యుండు ధన్యుండు వి
జ్ఞహితుం డంబుజపత్రనేత్రుఁడు తప•స్తప్తోన్నమద్గాత్రుఁడున్. 810

మ. పొడుగుం బొట్టియుఁ గానిమేను కనకం•బు న్మేలమాడుం గడున్
గడిమిం దేఁటులఁ బాఱఁ దోలు నెఱికల్ • గంజంబుఁ గాదాడు మో
మొనుగుల్ దమ్ములఁ దమ్ము లంచు నుడువున్ • హా హా మహోదారు సా
జడదారిం గనకున్నఁ గన్నుఁగవకున్ • సాఫల్య మెం దుండునే. 811

ఉ.†పుత్తడిజన్నిదంబు లగుఁ • బొమ్మవి కంఠమునందు వ్రేలెడున్
గుత్తుకక్రిందిభాగమున • గుండ్రనిపిండము లొప్పు రెండు పెన్
గుత్తపుగుత్తులో యనఁ గ•నుంగొన నై జడ లెల్ల మొల్ల మై
మొత్తము గాఁగ నల్లఁబడె • మోహనమూర్తికి వాని కారయన్. 812

సీ.§చీరాంతరమునుండి • చెన్ను మీఱఁగఁ దోఁచు, జాళువామొలనూలు • జఘనమందు
వేదిమధ్యమువోలె • విస్మయం బొదవించు, సూక్ష్మమై మధ్యంబు • చూడ నొప్పె
హంసకూజితముల • నద్భుతదర్శనీయము లేమొకో మోఁయు • నంఘ్రులందు
నక్షమాలలువోలె • హస్తయుగంబున, గలుగల్లు మనునవి • గ్రాలుచుండు

తే. వానికట్టినపుట్టంబు• గానవచ్చు, నింపుపున్న మజాబిల్లి•నిగ్గు లెసఁగఁ.
గొసరి కొసరి పుంస్కోకిల • గోల్పునట్లు,రుచ్యముగ మాటలాడు నా•రుచిరమూర్తి.

క. వన మెల్ల గుబులుకొన నా,మునిపుత్రునిమేనితావి • పోలింపఁగ నా
మని మలయసమీరముతోఁ,కున మల్లియనుండి గుబులు•కొను తావిబలెన్. 814

* త్రెవ్వకయుండఁగ = తెగకుండఁగ;అనఁగా నడుమ విడువక సంపూర్ణముగాఁ జెప్పు మని యభిప్రాయము. ‡ ఇం దున్నమద్గాత్రుఁ డనుటచే వన్నె తొంగి యని స్ఫురించెడిని.

† ఇందుఁ బుత్తడిజన్నిదంబు లనఁగా స్వర్ణహారము లనియు, గుండ్రనిపిండము లనఁగా లికుచకుచంబు లనియు. § ఇందు హంసకూజితముల నద్భుతదర్శనీయము లనఁగా పందియ లనియు,హస్తయుగళంబుల గల్లుగల్లు మనునవి కంకణంబు లనియుఁ దెలియం దగు.



తే.*జనక వానిలలాటదే•శంబునందు, రెండు తెలుఁగుల నగు జటా•మండలంబు
కలిపి సింగారముగ వెన్కఁ • గట్టఁబడియె, స్వర్ణచక్రాంకితంబుగా • సలిపి మెలపి. 815

చ.‡మునిసుతుఁ డాతఁ డొక్కఫల•మున్ దనదక్షిణపాణిఁ బట్టి మే
దినిఁ బడఁ గొట్టి మీఁదికయి • తేఱినదాని సువృత్తచిత్రమై
తనరెడుదాని మాటికిని • దా నఱచేతన మొత్తు చెట్లు వ్రా
లిన నతఁ డట్లు వ్రాలుచుఁ జ•లించె మరుచ్చలితోర్వజంబు నాన్. 816

ఉ. వానిమనోహరాకృతియు • వానివిలాసము వానిహాసమున్
వానిలసత్ప్రకారమును • వానివిహారము వానిచెయ్వులున్
మానసమున్ హరించె నను•మానము లే దతఁ డొక్కదేవతా
సూనుఁడు గాని యొక్కమునిసూనుఁడు గాఁడు తలంచి చూడఁగన్. 817

ఉ.†ఆమహనీయమూర్తి ప్రణయంబున నన్నుఁ గవుంగిలించి నా
మోమున మోముఁ జేర్చి శిర•మున్ జిబుకంబును బట్టి మోవితోఁ
గోమలశబ్దమున్ సలిపెఁ • గొంచెమయే నది పెంచె హర్షమే
నే మని చెప్పవాఁడ నతఁ•డే హృదయేశుఁ డటంచు నెంచెదన్. 818

తే.¶నే నొసంగినఫలము లా•మానిసూతి, తనకు వ్రత మంచు మెసవఁడు • దా నొసంగె
నాకుఫలములు జలములు • లోకమందు, వానిఁ బోలిన వెందును • గానరావు. 819

చ.‖ఫలములమీఁదితో లొలువఁ • బట్టదు తన్మధురం బెఱుంగఁగాఁ
గలఁడె సుధాంధసుం డయినఁ • గమ్మనితియ్యనితజ్జలంబులున్
జులుకన జిహ్వపై నిడఁగఁ • జూచినమాత్రన లేచివచ్చుఁ బ్రా
ణులకు గతించుప్రాణములు • నూత్నవికాసముతోడ నెండియున్. 820

క. మిలమిలని మెఱయుపూవులు, లలి దండలనుండి విచ్చి • లఘుగతుల నిటన్
గలయంగఁ జల్లె వాసన, పొల మెల్లం గుబులుకొనియెఁ•బో విడకుండన్. 821

క.%ఇటు పలుదెఱఁగుల నాతం, డిట నామదిఁ జూఱలాడి • యెటకేఁ దాఁ జెం
దటకున నాతనిగతి కేఁ, గటకటపడుచుంటి వింటె • కరుణావార్ధీ. 822

* ఇందు లలాటదేశంబునందు రెండు తెఱంగులజటామండలం బనఁగా సీమంత మనియుఁ జక్రాంకితంబుగా సలిపి యనఁగా జడబిళ్లలు కట్టుకొనియె ననియు నూహింపఁ దగు.

‡ ఇందు ఫల మనఁగా బంతి యనియు దానితో నాడుచున్న దనియు నెఱుంగునది.

† ఇందు మోవితోఁ గోమలశబ్దమున్ సలిపె ననఁగా "చుచ్చు" అని ముద్దుపెట్టుకొనునప్పుడు చేయు ధ్వన్యనుకరణ మనియు;

¶ ఇందు నాకుఫలములు జలము లనఁగాఁ గజాయములును పానకంబు లనియు నభిప్రాయము.

‖ ఒలువంబట్టదు = ఒలువనక్కఱలేదు, % కటకటపడు = బాధపడు.

ఆ. అమ్మునీంద్రపుత్రు నాశ్రమంబున కేను, బోయి వానితోఁ దపోవిధాన
మెపుడుఁ దీర్చుచుంట కెంచితి నాతనిఁ, గానకున్న మిత్త్రిఁ గానవచ్చు. 323

వ. అని పలికిన విభాండకుండు కొడుకుం జూచి తండ్రీ తపస్విజనతపోవిఘ్నం బాచరింప నిట్లు పెక్కుతెఱంగుల రక్కసు లుక్కుమిగిలి సంచరించుచుందు రట్టివారి మముబోంట్లనుసరింప రాదు వారిమధురాహారమాల్యాదులును దోషభూయిష్ఠంబు లగుటంజేసి వర్జనీయంబు లని వారించియు వాఁ డెప్పు డెచ్చటికిఁ బోవునో యని వాని నన్వేషించుచు మూఁడహోరాత్రంబు లెడఁబాయ కుండి యా మఱునాఁ డెప్పటియట్ల ఫలంబులు దేరఁ బోలంబున కరిగె నప్పుడు. 324

తే. మెఱపు మెఱసినచందాన మెఱసి తెఱవ
వెండియు మునీంద్రునుటజంపుదండ కరుగు
దెంచుటయు ఋష్యశృంగుఁ డామించుఁబోఁడిఁ
గాంచి మోహించి మది సంభ్రమించి పలికె. 325

చ. నిను విడనాడి నే నిలువనేర నొకండ మునీంద్రపుత్త్ర ని
న్ననుకొని వత్తు నీవనికి నేఁడు నను గొనిపొమ్ము వేగ నా
జనకుఁడు రాకమున్న యని సారెకుఁ బల్కినఁ గుల్కుమోమునన్
వనిత మునిం గ్రహించుకొని నావకుఁ జేర్చె నుపాయసంగతిన్. 326

వ. *నావయుం గతిపయప్రయాణంబుల నంగదేశంబునకుం జని నావ్యాశ్రమవనంబుచెంత నాశ్రయించె నంత. 327

చ. ‡ఘనుఁ డగుఋష్యశృంగుఁడు జగన్నుతుఁ డవ్విషయంబు సేరినం
తన జలదంబు లెల్లెడలఁ దద్దయుఁ గ్రమ్మి మహాంబుధారలన్
ఘనతరవర్షముం గురిసెఁ గాలువ లై నదు లై సరస్సు లై
ఘనరస మంతయుం ధరణిఁ గప్పి తమింపఁగఁ జేసె నెంతయున్. 328

తే. ఋష్యశృంగునిరాక పృథ్వీశ్వరుండు, విని ముదంపడి తోడ్తెచ్చి వినయమునను
బూజ గావించి తనయంతిపురమునందు, నిలుపుకొని నేర్పు పెంపునఁ జెలిమి నేసి.

ఆ. కన్నకూఁతు శాంత యన్నకన్నియ నిచ్చి, పెండ్లి చేసి మిగులఁ బ్రీతితోడ
నరణ మిచ్చె భూషణాంబరరత్నశయ్యాసనార్థతతుల నతులితముగ. 330

వ. మఱియు విభాండకక్రోధప్రతీకారార్థంబుగా నతని కనేకగోశతసహస్రంబుల నిచ్చి మార్గమధ్యంబునం దెడ నెడ గోష్ఠంబులును వానిం బాలింప గోపకులను నియమించి విభాండకుండు వచ్చిన నివి యెల్ల మీపుత్త్రునిగోరత్నంబు

* నావ్యాశ్రమము = నావ లుండుచోటుకడ నున్నవనముపేరు. ‡ ఘనరసము = వాననీరు.



†లనియు మేము మీలెంకల మనియుం జెప్పునది యని వారికిం జెప్పి యొప్పించి పుచ్చె నట విభాండకుండును గందమూలఫలాదులం గొని నిజాశ్రమంబునకు వచ్చి పుత్త్రుం గానక యెల్లకడ లన్వేషించుచు నది యంతయు రోమపాదకృతంబు గా శంకించి హుంకరించుచు నంగదేశంబునకు వచ్చి యనేకగోగణపరివృతం బైనయొక్కఘోషంబు దఱియం జేరి గోపపూజితుం డై యట నారాత్రి విశ్రమించి యివి యెవ్వనిగోవు లని యడిగిన గోపాలకు లతని కిట్లనిరి.

విభాండకుఁడు ఋష్యశృంగుని వెదకుచు వచ్చుట.

మ. ఇవి నీపుత్త్రునియాలమంద లివి గా కెన్నేనియుం గల్గు ని
ట్టివియు న్వీనికి మించినట్టివియుఁ దుష్టిం బుష్టినిం గూర్చుచున్
భువనాతీతతపోధనా వినుము నీపుత్త్రుండు దా నంగరా
డ్భవనంబందు మహావిభూతి పొదలన్ భాసిల్లుఁ దా నల్లుఁ డై. 332

సీ. *అన విని హర్షించి మునిరాజు మనమునఁ, గలకోప మంతయుఁ దొలఁగఁ ద్రోచి
వడివడి నడ నేగి వసుమతీశుని రోమ,పాదునిఁ గని తత్సపర్య లంది
శాంతాసమేతుఁ డై సంతతానందుఁ డై, చనుకుమారునిఁ గాంచి సంతసించి
ఘోషముల్ గ్రామముల్ కొడుకునకొసఁగిన, వియ్యమున్గని దయాన్వితుఁడగుచుఁ

ఆ. గొడుకు పుట్టుదన[illegible] కొడుకు సం దుండంగ, నాన తిచ్చి చనియె నంత ఋష్య
శృంగుఁ డవల శాంతకుం గని పుత్త్రునిఁ, దండ్రికడకుఁ జనియెఁ దన్వితోడ.

వ. శాంతస్వభావ యగునాశాంతయు నాశాంతవిశ్రాంతానంతకీర్తి యై చంద్రునకు రోహిణియు వసిష్ఠున కరుంధతియు నగస్త్యునకు లోపాముద్రయు నలునకు దమయంతియు నింద్రునకు శచియు ముద్గలునకు నింద్రసేనయుం బలె ననువర్తిని యై పతికిఁ బరిచర్య సేయుచుండె నని చెప్పిన భ్రాతృజనసహితుం డగుయుధిష్ఠిరుం డాహ్రదంబునఁ దీర్థం బాడి కృతకృత్యుం డై లోమశుం గూడి కదలి కౌశికిం గలతీర్థంబు లానుపూర్వ్యంబునం గని సాగరంబునకుం జని గంగాసంగమంబున నేనూఱునదులు కలసినచోఁ గృతస్నానుం డై సముద్రతీరంబు వట్టి కళింగదేశంబునం జనుచున్నప్పుడు లోమశుం డిట్లనియె. 334

సీ. ఇది కళింగవిషయ మిది వైతరణి యను,నది దీనియుత్తరపదమునందు
వైవస్వతుఁడు తొల్లి వరమునులును పెక్కు,సవనంబు లొనరించి రవిరళగతి
నపు డొక్కమఖమున హరుఁడు నా కిది భాగ,మగు నని హరియించె నప్పశువును
మునులు వాని నుతించి కొని తెచ్చి పశువు హ,విర్భాగ మొసఁగిరి వృషహాయునకు

† లెంక = భృత్యుఁడు; ఘోషము = గొల్లపల్లె. * వియ్యము = వియ్యంకుఁడు.

తే. నిమ్మహాగాధఁ దలఁచుచుఁ ♦ జెవ్వఁడేని, యిందు నీరాడెనే వాఁడుఁ♦బొంది పొసఁగి
దేవయానంబునం బోవు ♦ దివికి దివ్యచక్షు వై వింటివే దీని ♦ త్యాత్మతేంద్ర. 335
వ. అనిన యుధిష్ఠిరుండు సానుజుండై యందు స్నానంబును బితృతర్పణంబునుం
గావించి లోమశుం గాంచి యిట్లనియె. 336
మ. మునిలోకేశ్వర నీప్రసాదమున నిం♦పొంద్యాపగం గ్రుంకుటన్
గన నయ్యెన్ సకలప్రపంచము లొగిన్ ♦ వైఖానసోక్తస్మృతి
స్వన మాలింపఁగ నయ్యె ధన్యుఁడను నా♦వంశంబునుం బూత మ
య్యె ననన్ లోమశమౌని ధర్మసుతుని ♦ న్వీక్షించి తా నిట్లనున్. 337
తే. తనరు మున్నాఋషులయో♦జనములందు, విమలవైఖానసావాస ♦ మమలమూర్తి
వాలకించితి వారియ♦ధ్యయనరవము, నీవు దివ్యుఁడ వారయ ♦ నృపవరేణ్య. 338
మ. అని కీర్తించుచు వారితో నరిగి లో♦కారాధ్యుఁ డాలోమశుం
డనఘున్ ధర్మజుఁ బల్కె నీవనమునం ♦ దావిశ్వకర్ముండు మున్
తనరం జన్నము చేసి దక్షిణగ నీ♦ధాత్రీతలం బంతయున్
ఘనుఁ డాకశ్యపమౌని కిచ్చె మునులున్ ♦ బర్హిర్ముఖుల్ మెచ్చఁగన్. 339
ఆ. *దాన నలిగి భూమి ♦ ధాతతో నను నిట్లు, నను మనుష్యున కిడ ♦ న్యాయ మగునె
నీప్రదాన మిది గ♦ణింప వ్యర్థం బగు, నని రసాతలమున ♦ కరిగె నంత. 340
వ. ‡కశ్యపుండు ననునయించి ప్రార్థించిన నది ప్రసన్నయై మరల నిట జలంబుల
నుండి వేదీరూపంబున వచ్చి వానికి దర్శనం బిచ్చె నిదియ యవ్వేది సామాన్య
మానవులు తాఁకిన నిది నీట మునుంగు నని చెప్పి చూపి దీనిపై నీ వధిష్ఠించి భవ
సాగరంబు తరించి భద్రంబుం బొందు మేను నీకు స్వస్త్యయనంబు సెప్పుచు
ననుసరించి వచ్చెద నని. 341
క. విశ్వపర విశ్వగుప్తుఁడ, విశ్వేశ్వర నిన్ భజింతు ♦ వినయముతోడన్
శశ్వత్సాన్నిధ్యం బిడు, మీశ్వర లవణాంబురాశి ♦ నీసమయమునన్. 342
వ. అని ప్రార్థించుచు నీ వీవేది నెక్కు మనిన నతం డట్ల చేసి చరితార్థుం డై
కదలి మహేంద్రాచలమునకుం జని యట నొకయహోరాత్రంబు నివసించి
యందుఁ గలభృగ్వంగిరఃప్రభృతిమహామునివర్యులకు యథోచితోపచారాపచి
తులం గావించి కృతాంజలియై వారిలోఁ బరశురామశిష్యుం డకృతవ్రణుం డను
నొక్క మహామునిం గని యిట్లనియె. 343

* రసాతలమున కరిగె = భూదేవి పాతాళమునకుం బోయె నని మూలము.

‡ స్వస్త్యయనంబు = స్వస్తిపుణ్యాహవాచనాదికము.



చ. యతివరుఁ డైనరాముఁడు మ♦హాత్ములు సాత్త్వికులైనమీకు నీ
క్షితితలమందు దర్శనము ♦ సేయఁగ నెప్డు ప్రసన్నుఁ డౌను నే
నతని పదాంబుజంబులను ♦ నౌదలఁ జేర్చి నమస్కరించి భా
షితము లెసంగఁ జేసికొనఁ ♦ జిత్తము గల్గె మునీంద్రచంద్రమా. 344
వ. అనిన నకృతవ్రణుం డిట్లనియె. 345

అకృతవ్రణుఁడు ధర్మరాజునకుఁ బరశురామచరిత్రము చెప్పుట.

తే. నీవయిన్ రామునకుఁ బ్రీతి ♦ నే నెఱుఁగుదు, నింతలో నీకు దర్శన ♦ మిచ్చు నష్ట
మినిఁ జతుర్దశి నాతని ♦ మునులు గాంతు, రెల్లి వచ్చుఁ జతుర్దశి♦ యెల్లముగను. 346
తరళము. అనుడు ధర్మజుఁ డిట్లు వల్కె మ♦హాత్మ నీవెనువెంట నే
నును భృగూద్వహుఁ జూడ వత్తు న♦నుం గృతార్థునిఁ జేయు మా
తనిచరిత్రము నాలకింప ము♦దం బగున్ వచియింపు మున్
తనరురాజుల నెల్ల నేకత♦న న్వధించె నతం డిలన్. 347
క. అన నకృతవ్రణుఁ డాతనిఁ, గని యిట్లను జామదగ్న్య♦ఘనచరితంబున్
వినిపింతు వినినయట్టులు, విను మవహితమతి వయి పృథి♦వీతలనాథా. 348
సీ. హైహయవంశమం ♦ దవతరించెను మున్ను, కార్తవీర్యుం డన ♦ ఘనుఁ డొకండు
ధరణి దత్తాత్రేయ♦దత్తవరప్రసా,దమునఁ గాంచనవిమా♦నమును బడసి
యతఁడు మహైశ్వర్య♦యుతుఁ డయి వరవీర్య,గతుఁ డయి జగములం ♦ దతిశయించి
సురసిద్ధసాధ్యకి♦న్నరయక్షరక్షఃప్ర,ముఖుల సంగరములఁ ♦ బొడిచి గెలిచె
తే. వరబలంబును దశశత♦కరచయంబు
నమరయానము నప్రతి♦హతగమనము
జనసమృద్ధియు వీర్య మై♦శ్వర్యసిద్ధి
గలిగి యుంటయె యితకుఁ ♦ గారణంబు. 349
ఆ. ఇట్లు భూతపీడ ♦ నెసఁగఁ జేయుచునుండ, వేల్పు లేగి విష్ణు ♦ వినిచి పలుక
నతఁడు లోకహితము ♦ నాచరింపఁగ నెంచి, బదరికాటవికిని ♦ గదలి వచ్చె. 350
వ. అక్కాలంబునఁ గాన్యకుబ్జదేశాధీశుం డై నగాధి యనురాజేంద్రునికి రూపలావణ్యని
ర్జితదేవకన్య యగునొక్కకన్యారత్నంబు గలదు సత్యవతి నాఁబడుదాని భృగుపుత్త్రుం
డగుఋచీకుం డనువాఁడు వరించి గాధి కెఱింగించిన నతం డొక్కకర్ణంబు నల్లనై తక్కి
నమే నంతయుం దెల్లనై వర్ణనీయంబు లగువేయిమహాహయంబులు నా కుంకువ యి
చ్చితేని నాకూఁతు నీ కిచ్చి పెండ్లి సేయుదు నిది మాకులోచితధర్మం బనిన ఋచీకుం
డట్ల యగుం గాత మని వరుణుపాలికిం జని తనయభిమతం బెఱింగించి తురంగ

మంబులం దెచ్చి గాధి కిచ్చి సత్యవతిం బరిగ్రహించి పరిణయంబు చేసికొని దానితో
నిష్టోపభోగంబు లనుభవించుచు సుఖంబుండె నంత. 351

తే. వరుణలోకమునుండి య♦శ్వములు ధరణి, కరుగుదెంచినతలమునం ♦ దశ్వతీర్థ
మనఁగ దీర్థము లోకవి♦ఖ్యాత మయ్యె, నందు జలమాడి నరుఁ డందు ♦ నర్థసిద్ధి.

వ. అంతఁ గొంతకాలంబునకు. 353

చ. తనసుతుఁ డట్లు గాధిసుతఁ ♦ దన్విగఁ గైకొని వైభవంబునన్
దనరుచునుండె నంచు విని ♦ తద్దయుఁ బ్రేముడిఁ గాన్యకుబ్జమున్
జని భృగు విచ్చ పెంపునను ♦ సత్యవతీసహితున్ ఋచీకునిం
గని ముద మందెఁ దద్వినయ♦కల్పితపూజల నాదరించుచున్. 354

తరళము. పిదపఁ గోడలిఁ గాంచి యిట్లను ♦ బిడ్డ నీ దగుభక్తికిన్
ముదము నొందితి నీకు నే వర♦ముం బ్రియంబుగ నిచ్చెదన్
మదికి నేది హితంబొ దానిని ♦ మాటు వెట్టక చెప్పు నా
సుదతి నాకును నాదుతల్లికి ♦ సూనులం గరుణింపవే. 355

వ. అని ప్రార్థించినం బ్రసన్నుం డై భృగుండు కోడలిం జూచి తల్లీ! నీవును నీతల్లియు
ఋతుస్నాత లై పుంసవనదీక్షం జేసి నీ వుదుంబరంబు నామె యశ్వత్థంబును నాలింగ
నంబు చేసికొని యీచరుద్వయంబు పుచ్చుకొని భక్షింపుఁడు దీన మీకు సంతాన
ప్రాప్తి యగు నే నిది విశ్వప్రయత్నంబు చేసి తిరిగి తెచ్చి యుంచితి నని చెప్పి
చనుటయు నయ్యిరువురును వృక్షాలింగనచరుభక్షణంబుల విపర్యాసంబు చేసి రంత.

చ. భృగుఁ డది దివ్యదృష్టిఁ గని ♦ ప్రీతిమెయిం జనుదెంచి వెండియున్
మగువ విపర్యయం బగుచు ♦ మార్గము తప్పెను నీకు విప్రుఁ డై
తగియును క్షత్రవృత్తి కగుఁ ♦ దల్లికి క్షత్రియుఁ డయ్యు విప్రధ
ర్మగుఁ డగు నాఁగ సత్యవతి ♦ మామఁ బ్రసన్నునిఁ జేసి మ్రొక్కుచున్. 357

ఆ. క్షత్రవృత్తి నాదు♦పుత్త్రునకుం గాక, పౌత్త్రునకు లభించు♦పగిది సేయు
మనుచు నతనివలన ♦ నట్లుగా వర మంది, వెనుక నీరుమోసి ♦ తనయుఁ గాంచె.

చ. అతఁడు జగంబునందు జమ♦దగ్ని యనం జని వేదశాస్త్రముల్
స్తుతమతి నేర్చి చాపమున ♦ సూరియు ధీరుఁడు నై మహాముని
ప్రతతిని సత్ప్రవర్తనము♦పట్టున మించి ప్రసేనజిత్సుతన్
సతిఁ గ్రహించి రేణుక యనం జనుదానిని గూడి వేడుకన్. 359

వ. ఆశ్రమవాసుం డై ఘోరతపంబు చేసి యతండు కాలక్రమంబున రుమణ్వ త్సుషేణ
వసు విశ్వావసు రాము లనునేవురుపుత్త్రులం బడసి సంసారంబు సాగించుచుండె నంత



నొక్కనాఁడు కొడుకు లెల్ల ఫలంబులు దేరం జనిన రేణుక స్నానార్థం బరిగి
యొక్కసరోవరంబున భార్యాసహితుం డై జలక్రీడం దేలుమార్తికావతదేశాధీశుం
డగుచిత్రరథుం డనువానిం గాంచి యించుక మనంబు సంచలింప నుటజంబు సేరు
టయుం దానిమనోవికారం బెఱింగి జమదగ్ని ప్రళయాగ్నికల్పుం డై ధిక్కృద్ధంబున
దెసలు మ్రోయ గర్జించుచు నంత వచ్చినమొదటికొడుకుల నల్వురం గాంచి
యనుక్రమంబున మీరు దీనిఁ జంపుం డని నియోగించియు మాతృస్నేహంబున
మాఱు పలుకక విచేతసు లై యున్నవారి నెల్ల నలిగి మృగపక్షిసదృశు లై జడు లై
పొం డని తిట్టి యట్టియెడఁ గట్టిమటం బొడకట్టినరాముం జూచి. 360

శా.* తండ్రీ! తల్లి యటంచు నెమ్మనమునం ♦ దక్కింప కింతేని నా
తీండ్రంబుం దలపోసి దీని నిచటం ♦ దీవ్రాసి ఖండించి నీ
తండ్రిం దేర్పుము నాఁగఁ గొం కరయ కా♦ధైర్యాద్రి రౌద్రంబునన్
గండ్రించెన్ జననిన్ బరశ్వథమునన్ ♦ గన్నోమ్మునయ్యంతలోన్. 361

ఆ. అంత నలుక వీడి ♦ శాంతుఁ డై జమదగ్ని, కొడుకు నరసి నాదు♦నుడి నెసంగ
మేలుచేతఁ జేసి ♦ మిసిమి గంటివి మెచ్చి,నాఁడ వరము లిచ్చు♦వాఁడ నీకు. 362

వ. అభీష్టంబు లెఱింగింపు మనిన రాముండు సంతసించుచు. 363

తే.‡మాత పాపంబునకుఁగాక ♦ మరల బ్రదుకు,నట్లుతోఁబుట్టువులుశాప ♦ మట్టెతొలఁగఁ
బ్రకృతి నొందెడునట్లును ♦ బ్రధనములను, దనకు విజయంబు దీర్ఘాయు ♦ వొనరునట్లు.

క. కరుణింపు మనుచు వేడినఁ, గర మరుదుగఁ గోరినట్లు ♦ కావుత మనుచున్
వర మొసఁగె మునికుమారున, కరయం దాపసులశక్తి ♦ కడ్డము గలదే. 365

వ. అట్లు భార్యాపుత్రసమేతుం డై జమదగ్ని యెప్పటియట్లు గార్హస్థ్యధర్మంబు నెరవేర్చు
చు నున్నంతఁ గొండొకకాలంబున రామాదిపుత్రు లాశ్రమంబున లేనిసమయంబున.

ఉ. వేయికరంబు లింపెసఁగ ♦ వేఁడివెలుంగు తెఱంగుఁ దోఁప న
త్యాయతశౌర్యసంపదల ♦ నర్జునుఁ డవ్వని కేగుదేర లోఁ
బాయనికూర్మి వాని కల♦భార్గవుఁ డర్చ యొనర్చె దాని కా
రాయఁడు మెచ్చఁ డయ్యె నెద ♦ రాజ్యమదం బది విస్తరిల్లఁగన్. 367

తే. మునికి నవమానముగ వాని♦పూజ గొనక, హోమధేనువు వత్సము ♦ నొడిసి పట్టి
యలుక నాశ్రమానోకహ♦ములను గూల్చి,పోయె నాతఁడు క్రూరుఁ డై ♦పురముఁ జేర.

వ. అంత నాగతుం డై నరాముం జూచి జమదగ్ని యిట్లనియె. 369

* కొంకు = సందేహించుట; గండ్రించెన్ = ఖండించెను; పరశ్వథము = గండ్రగొడ్డలి.
‡ అట్టె = క్షణములో.

పరశురాముఁడు కార్తవీర్యుం జంపుట.

శా. *రామా వింటివె కార్తవీర్యుఁ డిటకుం • గ్రౌర్యంబున న్వచ్చి యా
రామం బంతయు వీటఁబుచ్చి సవనో • స్రావత్సముం గొట్టి తా
నీమైఁ బోయె ననంగ మండిపడి యెం • తేఁ గ్రోధ మేపార నా
రాముం డాశుగతిం బిఱుంద సని దో • ర్దర్పంబు దీపింపఁగన్. 370

మ. ‡ కులిశకూరనిశాతసాయకములం • గోదండముల్ ద్రుంచి చే
తులు ఖండించి శిరంబులుం దునిమి సం • ధుల్ త్రెవ్వఁగాఁ జేసి సూ
తులఁ జానేసి రథంబుల న్విఱిచి త • ద్ఘోటంబులం గూల్చి సం
కులయుద్ధం బొనరించి చించె నరులం • గోటానఁగోట్లన్ వడిన్. 371

చ. పరశువు చేతఁ బూని చని • బాహుబలంబును శౌర్య మేర్పడన్
గురుతర తేజుఁ డాఘనుఁ డ • కుంఠితవీర్యునిఁ గార్తవీర్యునిం
బరిపరిరీతులం గలిసి • బాహుసహస్రముతో శిరంబునుం
ధరఁ బడఁ జేసి చేసెను గృ • తాంతునియింటికిఁ గ్రొత్తవిందుగన్. 372

ఆ. పగఱ నట్లు తెగువ • భంజించి భార్గవ, రాముఁ డపుడు మరలె • రమణ మెఱయ
నంతఁ గార్తవీర్యు • నాత్మజుల్ పగవట్టి, యుక్కు మిగిలి వచ్చి • రొక్క మొగిని. 373

వ. ఇట్లు జమదగ్న్యాశ్రమంబున కశ్రమంబున వచ్చి రాముం డులేమి నెఱింగి. 374

మ. † సమదాటోపముతోఁ దపోవనము ను • త్సారించి కారించి యు
త్తములన్ సత్తముఁడై యొకానొకకడం • దల్కొత్తువాచంయమిన్
జమదగ్ని న్వడిఁ బట్టి చంపి రదయన్ • హారామ హారామ యం
చమితార్తిన్ బలవించుచున్ శరణు లే • కత్యంతముం గుందఁగన్. 375

వ. అంత. 376

చ. వనములనుండి భార్గవుఁడు • వన్యఫలాదులఁ గొంచువచ్చి చ
చ్చినతనతండ్రినిన్ ధరణిఁ • జెన్నఱి కూలి కృశించుతల్లినిం
గనుఁగొని యిట్లు రాఁ జనునె • గాదిలితండ్రికి నక్కటక్కటా
ముని యని చూడ కేఖలుఁడు • పోలనికార్యము నిట్లు చేసెనో. 377

వ. అని దుఃఖితాత్ముండై కరంబు నిర్వేదించి తండ్రి కగ్నిసంస్కారాదిప్రేతకార్యంబు లెల్లం దీర్చి యది కార్తవీర్యాత్మజులు చేసినఘాతుకకార్యంబుగా నెఱింగి. 378

* వీటఁబుచ్చి = నష్టముచేసి; సవనోస్రావత్సము = యజ్ఞధేనువత్సము; ‡ కులిశము = వజ్రము.
† ఉత్సారించి = కదలించి; కారించి = బాధించి.



పరశురాముఁడు క్షత్రియుల నెల్ల సంహరించుట.

మ. ప్రభుగర్వంబున దుర్విదగ్ధు లగుచున్ • రాజాధముల్ మూర్ఖులై
విభవం బేర్పడ విఱ్ఱవీఁగుచును స • ద్విప్రాళికిం గీడు రా
నభయస్వాంతత సంచరించెదరు క • ట్టా చెట్టల న్వారలన్
శుభసంధానముగా వసుంధరకు నే • శోధించి వేధించెదన్. 379

వ. *అని కృతప్రతిజ్ఞుం డగుభృగురాముం డతిక్రుద్ధుం డై శస్త్రంబు ధరియించి కాలమూర్తి యనం బరఁగి కార్తవీర్యాత్మజులం దొట్టిసమస్తక్షత్రసంఘంబుల ముయ్యేడువారంబులు శోధించి శోధించి వధించి క్షితితలం బెల్ల నిఃక్షత్రంబు గావించి శమంతపంచకంబున నేనురుధిరహ్రదంబులు గావించి యందుఁ బితృతర్పణంబు లాచరించి నిజపితృదేవత లగుఋచీకాదులవలన నభీష్టవరంబులు వడసి యథావిధి విహితాధ్వరుం డై ఋత్విజుల కీభూభాగం బెల్ల నొసంగి కశ్యపునకుఁ బదిబారలనిడివియుఁ దొమ్మిదిబారలతనర్పునుం గలయీస్వర్ణవేదికయు నొసంగె నంతఁ గశ్యపానుమతంబున బ్రాహ్మణు లావేది విభాగించుకొని యనుభవించి రంత నిరర్గళప్రచారుం డగునాభార్గవుండు నీమహేంద్రశైలంబున కరుగుదెంచి నివసించి యున్నవాఁ డని మఱియును. 380

క. ఈకారణమున క్షత్రియ, లోకంబులు రాముపగకు • లో నయ్యె జగం
బాకగణి గెలిచె నాతం, డోకురువర వింటె రాము • నుత్తమచరితన్. 381

వ. అని చెప్పిన నప్పాండవాగ్రజుండు మునిగణపరివృతుం డై చతుర్దశిదినంబునఁ దానుం దమ్ములుం ద్రౌపదియు రామదర్శనంబు గావించి పూజించి కృతకృత్యుం డై మఱునాఁ డరుణోదయంబునం దరలి దక్షిణాభిముఖుం డై సముద్రతీరంబునం గలతీర్థంబులు సేవించుచుం జని చని. 382

ఉ. త్ర్యంబకసంభవం బగుచు • సంచితమై ధరణీతలంబు పూ
తంబుగఁ జేయుచుం గదలి • దక్షిణదిఙ్ముఖ మయ్యుఁ బ్రాక్సము
ద్రంబునఁ జేరఁ బాఱి విబు • ధప్రకరేడితదివ్యతీర్థభూ
తం బయి యొప్పుగౌతమిని • ధర్మతనూజుఁడు గాంచి భక్తితోన్. 383

క. స్నానము సంధ్యయు జపముల్, దానంబును దర్పణంబు • ధర్మజుఁ డచటన్
మానుగఁ జేసియు భక్తిన్, బూని మదిన్ మ్రొక్కె గంగఁ • బుణ్యాత్మంగన్.

శా. ‡శైవాగ్రీయజటానవస్కరమహా • స్థానంబునం బొల్చి వే
ధోవిద్ధోరుకమండలూదరమునం • దు న్నిల్చి విష్ణ్వంఘ్రి రా

* వారంబులు = మాఱులు. ‡ అనవస్కరము = శోధితము. వీధ్రము = పవిత్రము.

జీవంబందుఁ దలిర్చి భూమిగత వై ♦ చెన్నారునో గౌతమీ
దేవీ సేవ లొనర్తు దీనుని ననుం ♦ దీపింపఁగాఁ జేయవే. 385

వ. అని ప్రస్తుతించి ప్రస్థితుండై ధర్మజుండు సముద్రతీరంబు వట్టి పోవుచు ద్రవిడదేశంబున నగస్త్యతీర్థనారీతీర్థంబులం గృతావగాహుం డై యటఁ దొల్లి యర్జునుండు చేసిన దానవ్రతాదికంబు విని సంతసించి ప్రశంసించుచుఁ దాను నాయాతీర్థంబుల గోసహస్రదానంబులు చేసి పరిపూర్ణకాముండై శూర్పారకం బనుతీర్థంబున కనతిదూరంబునఁ బరశురామవేదిం గని యందుఁ గొంతకాలంబు తపంబుండి యనంతరంబ వసువైవస్వతాదిత్యధనేశ్వరహరిహరాదిపుణ్యాయతనంబులం గని యందందు సువర్ణరత్నదానంబు లనేకంబులు గావించి మరల శూర్పారకంబునకు వచ్చి యటనుండి ప్రభాసతీర్థంబునకుం జని స్నానదానపితృతర్పణంబులు గావించి యటఁ బండ్రెండుదినంబులు జలవాయుభక్షుండై పంచాగ్నిమధ్యంబునఁ బరమతపంబు గావించె నయ్యవసరంబున.

ఉ. భూమిఁ గలట్టితీర్థములఁ ♦ బుణ్యచరిత్రుఁడు ధర్మపుత్త్రుఁ డి
చ్ఛామతి నాడి వచ్చి ముని♦సన్నుత మైనప్రభాసతీర్థమం
దామెయి నున్నవాఁ డని భ♦టాళి వచింపఁగ ద్వారకాపురిన్
రాముఁడు కృష్ణుఁడుం విని క♦రంబు ముదంపడి దర్శనార్థు లై. 387

—•◆ ప్రభాసతీర్థంబునఁ గృష్ణాదులు పాండవులం గలియ వచ్చి సంభాషించుట. ◆•—

వ. బంధుమిత్త్రపరివారపరివృతులై ప్రభాసతీర్థంబునకు వచ్చి భూతలశయను లై మలదిగ్ధాంగు లై యున్నపాండవేయులం బాంచాలిం జూచి నితాంతమ్ము నిర్వేదించి రపుడు ధర్మపుత్త్రుండు వృష్ణికులోత్తముల నెల్లం బూజించి వారిచేఁ బూజితుం డై. తమవనవాసక్లేశంబును విజయుం డస్త్రప్రాప్తి యై చని స్వర్గంబున నుండుటయు నెఱింగించి యంతఁ గుందేందుసమప్రభుం డగుబలదేవుండు వాసుదేవప్రభృతులు విన నిట్లనియె.

మ. అకటా ధర్మజుఁ డిట్లు చీరవసనుం ♦ డై కుందుఁ గాంతారమం
దకలంకప్రతిభన్ సుయోధనుఁడు రా♦జ్యం బేలుఁ బోలింప ధ
ర్మకృతుల్ వ్యర్థము లయ్యధర్మకృతులే ♦ ప్రాప్తిప్రధానంబు లం
చెకసక్కెంబులు పల్కు కాల మిపు డ♦య్యెం జెప్పఁగా నేటికిన్. 389

తే. కితవదుర్యోధనునివృద్ధి♦కిని యుధిష్ఠిరునివిహీనతకును జనుల్ ♦ మనమునందు
వగచి దీని కేమి పౌనర్భ♦వలయు ననుచు, నరయుచున్నారు ప్రతికృతి ♦ నహరహంబు.

సీ.*కొడుకుమాటలఁ దీపిఁ ♦ గుటిలుఁడై చీకు రాజ్యమునుండి వీరల ♦ నడిచె వెడలఁ
దప్పు చేసితి నని ♦ తనలోన నొకనాఁటి, కైనఁ దలంపఁ డ♦య్యధమనృపతి

* చీకు = గ్రుడ్డి యగుధృతరాష్ట్రుఁడు.



యది కాదు నాక భీ♦ష్మాదులు వా రెట్లు, వీరిఁ బాసి సుఖింపఁ ♦ గోరి రకట
పుత్త్రప్రతిము లైన♦పూరుముఖ్యుల విడి, ద్రోణాదు లుంట లోఁ ♦ దొడరు వింత

ఆ. సత్యసంధు లైన♦తన్మజానిపుత్త్రులు, వీరు వీరి కిట్లు ధారుణీప్ర
భుత్వ మెడల నడవిఁ ♦ బులులతో మెలఁగ వి,ధాత వ్రాయఁ బోలుఁ ♦ దగవు మాలి.

సీ. పరబలాంబుధిఁ జొరఁ ♦ బాఱి మంథాద్రి నా, మథియించిపుచ్చు నే♦మానధనుఁడు
తనపేరు విన్నమా♦త్రన మూర్ఛ మ్రాత్రము పడంగ, నరిసేన నేమేటి ♦ యదిమివైచు
నవలీలఁ బ్రాచ్యుల ♦ నని నోర్చి యేధీరుఁ, డరిగాఁపులు గ నిల్చె ♦ నురుబలమున
బకహిడింబాదులఁ ♦ బరిమార్చి వ్రేల్మిడి, నిలఁ గాచె బలిమి నే♦యేకవీరుఁ

తే. డతఁడు లోకైకవినుతశౌ♦ర్యాంచితుండు, నిర్జితారాతి నిర్జర♦దుర్జయుండు
భీమసేనుఁ డివ్విధమునఁ ♦ బేదవోలెఁ, గూర లశనంబు గా నిట్లు ♦ కుంద నయ్యె. 392

వ. మఱియుఁ బశ్చిమదిగ్విజయంబు చేసిననకులుండును దక్షిణదిగ్విజయంబు చేసినసహదేవుండును సవనాగ్నిసంజాతయై రాజసూతి యగుద్రౌపదియును నలంతులువోలె వనవాసకృశీభూతాంగులై నవసి యుండ నెవ్వండు చూడ నోపు నని విచారించుచున్నబలరామునకు సాత్యకి యిట్లనియె. 393

చ. వగచి ఫలంబు లే దిపుడు ♦ వల్కినయట్లు సుయోధనాదులన్
దగిలి రణంబులో గెలిచి ♦ ధర్మతనూజుని రాజుగా నొన
ర్పఁగ మది సేయు మగ్రజ నృ♦పప్రవరాత్మజు లీపృథాసుతుల్
వగఁ గొని యిట్లు కాఱడవి ♦ వాసము సేయఁగఁ జూడఁ బాడియే. 394

శా.*ఖద్యోతప్రతిమానతేజు లగుసీ♦కొం తేయు లిట్లార్తు లై
సద్యస్కాలమునం దనాథులవలెన్ ♦ శంకింపఁగా నై రయో
విద్యావంతులు వీర్యవంతు లగుచు ♦ న్వల్గొందుమీ రందఱున్
బ్రద్యుమ్నాదులఁ గూడి పోరి కరుగన్ ♦ త్రైలోక్యమే నోపునే. 395

సీ.‡బలరామ భవదీయ♦బాహాలసల్లాంగ,లము పెల్లగింపఁ జా♦లదె ధరిత్రి
దేవకీనందన♦దివ్యశార్ఙ్గజ్యాని,నాదము పగులింప♦దే దివంబు
శంబరాంతకశాత♦సాయకసముదాయ,పావకం బేర్చ నో♦పదె జగంబు
జాంబవతీపుత్త్ర♦చాపవినిర్ముక్త,శరము లింకింపవే ♦ సాగరముల

* ఖద్యోతుఁడు = సూర్యుఁడు.
‡ శంబరాంతకుఁడు = ప్రద్యుమ్నుఁడు. జాంబవతీపుత్రుఁడు = సాంబుఁడు; మొక్కవోయ = భంగపడిన.

తే. మఱియుఁ దక్కినవృష్ణికు•మారు లెల్ల, మొక్కవో రుక్కుతున్కలు • పోర నీవు
నేను గృష్ణుండు వీరును • నేక మగుచుఁ, గ్రూరదుర్యోధనాదులఁ • గూల్త మిపుడు.

శా. *భీష్మద్రోణ కృపాంగరాజ ముఖధ•న్విశ్రేష్ఠభూయిష్ఠ మై
భీష్మం బై నిజవాహినీచయ మనిన్ • బేర్పొందు నంచెంచు నా
యుష్మంతుం డయి యుండలే కరి తదీ•యోద్రేక మొక్కింతలో
గ్రీష్మబ్రధ్నుల మై యడంత మిల నా•ర్తి న్వీడి వర్తింపఁగన్. 397

వ. ధర్మభృద్వరిష్ఠుం డగునీయుధిష్ఠిరుండు తన వ్రతంబు దీర్చివచ్చునంతకు నభిమానధన్యుం డగునభిమన్యుం డీనేల యేలుచుండుఁ గావుత మని పలుకుచున్నసమయంబున వాసుదేవుండు బలదేవుం జూచి యి ట్లనియె. 398

మ. ‡ఇది యొప్పన్ యదువంశభూషణ ఖలుం • డేప్రొద్దు గర్వంబునన్
బాదలున్ మెత్తనఁ దీరఁ డెట్లయిన నె•వ్వండుం గత్తినే కట్ట నె
మ్మది నూహించు సుయోధనుం డనిమొనన్ • మర్దించియే రాజ్యమున్
సదయాత్ముం డగుధర్మసూతి గొన నౌ • శంకింపఁగా నేటికిన్. 399

ఆ. ధర్మతత్పరుండు • ధర్మజుం డెప్పుడు, స్వార్జితంబు గాని•యట్టిరాజ్య
మొల్లఁ డవలఁ దమ్ము • లెల్లను దోషుగా, ననికిఁ గడఁగు నరుల • నడఁప నవుడు.

ఆ. మనము మనబలంబు•లును గేకయులుఁ జేది,పతియుద్రుపదసుతులుఁ•బాండుసుతులు
గలసి పోరి కౌర•వుల నెల్లఁ దెల్లంబు,గా వధింప నొప్పుఁ • జేవ మెఱయ. 401

వ. అనిన ధర్మనందనుండు రామకృష్ణసాత్యకులం జూచి యి ట్లనియె. 402

చ. †గుణనిధులార మీనుడుల•కుం గొఱ లెప్పుడుఁ గావు చెప్పిన
ట్లణఁచి విపక్షులన్ ఫలము • నందఁగఁ జాలుదు రైన నేను నా
ఫణితికిఁ దప్పుగాఁ బ్రతిన • పాలన సేయక యెట్లు చాలుదున్
రణమున మీరు మీప్రజలు • నా కయి నిల్తురు గాత మవ్వలన్. 403

వ. అని సాత్యకిదిక్కు మొగం బై. 404

ఆ. నామనం బెఱుంగు • నలినాక్షుఁ డాతని,మన మెఱుఁగుదు నేను • మన కతండు
దైవ మతనిమాట • తప్పనియది యట్లు, మనకుఁ జేయ నొప్పె•డిని గదయ్య.

వ. అని యందఱం గలయం బరికించి. 406

క. బందుగులరు మీరద్భుత,మిం దై విం దైనకతన • నే ధన్యుఁడ నై
తిం దయఁ జూడఁడు మను మి, మ్మందఱఁ జూచెదను గాత • మవల సుఖగతిన్.

* గ్రీష్మబ్రధ్నులు = వేసంగిసూర్యులు.
‡ మెత్తన = మృదుత్వము. † ఫణితి = వాక్యపద్ధతి.



వ. *అని వారి నామంత్రించిన వారు వారి నామంత్రించి నిజనివాసంబులకుం జని రని చెప్పిన విని నైమిశారణ్యనివాసు లవ్వలివృత్తాంతంబు సెప్పు మని సూతు నడుగుటయును. 408

ఆశ్వాసాంతము.

చ. †తలఁచిన నోకిలింత యగు•దట్టపువిట్టునఁ గొట్టుకొంచుఁ బ్రే
గులు నరము లొప్పర త్తనదు•కుత్తుకను న్మఱి యెల్లమేనికిన్
దళముగఁ జుట్టఁ బెట్టుకొన • దారి యొకింతయు లేక జంతు వు
త్తలపడు నట్లు నా కిఁకను • డాకొనఁ జేయకు లోకరక్షకా. 409

క. నీకున్ సేవ యొనర్చెద,నాకున్ దుష్కృతులగతులు • నారకబాధల్
గాకుండఁ జేయు మెప్పుడు, నీకాళులదూళి నగుచు • నిలిచెద నిశా. 410

గద్యము.

ఇది శ్రీమదధునాతనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్త్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునం
దారణ్యపర్వంబునం జతుర్థాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.



* ఆమంత్రించి = వీడుకోలుకాలమందు చుట్టములు లోనగువారిని ఆలింగనాదులచే సంతోషపఱిచి యనుజ్ఞపడయుట. † ఓకిలింత = రోఁత; విట్టు = మలము; ఉత్తలపడు = పరితాపపడు; డాకొను = సమీపించు; ప్రాప్తించు.

శ్రీ

బాలాత్రిపురసుందర్యైనమః.

# శ్రీకృష్ణభారతము

ఆరణ్యపర్వము—పంచమాశ్వాసము.



కాశికమునిగోత్ర
ప్రాకటజననాంచితోర్వ♦రాదేవనుతా
ప్రాకామ్యాదిసమావృత
‡ లోకావనదక్ష సర్వ♦లోకాధ్యక్షా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కి ట్లనియె నట్లు వార్ష్ణేయులు చనినవెనుకఁ బాండవులు విదర్భరాజోపచితం బై సోమలతావిమిశ్రతోయం బై పుణ్యతీర్థం బైన పయోష్ణికిం బోయి యున్నంత లోమశుం డి ట్లనియె. 2

సీ. గయుఁ డనురాజర్షి ♦ కలఁడు తొల్లి యతండు, సప్తాశ్వమేధముల్ ♦ సలిపె నిచట
నమ్మహాధ్వరముల ♦ నపరంజితోఁ జేయఁ, జూడంగ నొప్పెను ♦ స్రుక్స్రువములు
చమసచషాలయూ♦పములు స్థాలులు పాత్ర, లాదిగా వస్తువు ♦ లన్నియు నట
వాసవప్రభృతిదే♦వతలు దమంతఁ దా, మెలమి యూపంబుల ♦ నిలిపి రపుడు

తే. దేవతలు భూమిదేవతల్ ♦ తృప్తు లగుచు, మెచ్చిరి సదస్యులకు నాతఁ ♦ డిచ్చినట్టి
దక్షిణలసంఖ్య యిం తని ♦ తలఁప నైనఁ, దరము గా దన్న లెక్కింపఁ♦దరమె మనకు.

వ. మఱియు నధూర్త్తరజసునితనయుం డగునాగయుం డిందు విశ్వకర్మనిర్మితంబు లై హిరణ్మయంబు లైనయనేకశతసహస్రగోగణంబులు భూసురోత్తముల కొసంగి సురలోకసుఖంబులం బడసె. నిచటఁ బ్రజాపతిప్రభృతు లనేకయజ్ఞంబులు చేసి కృతకృత్యు లై రి నీవు నీపయోష్ణియందు భ్రాతృసహితుండ వై జలం బాడి విధూతపాపుండ వగు మనిన నతం డట్లు కావించి లోమశాదులం గూడి చని వైదూర్యపర్వతంబుఁ గని నర్మదానదిం గృతావగాహుం డై తత్తద్విశేషంబు లెల్ల విని కని సంతసించుచుండ లోమశుం డిది త్రేతాద్వాపరసంధి యిట సర్వపాపప్రశాంతి యగు నిది శర్యాతియజ్ఞప్రదేశం బిందు భార్గవుం డైనచ్యవనుం డనువాఁడు మహేంద్రుని గలిగి నాస

‡ లోకము = భువనము, జనము.



త్యుల సోమపీథులం జేసి సుకన్య యను రాజపుత్త్రిం బరిణయం బయ్యె నది యంతయుం జెప్పెద నవహితుండ వయి విను మని యి ట్లనియె. 4

—— చ్యవనోపాఖ్యానము. ——

మ. భృగుపుత్త్రుండు పవిత్రగాత్రుఁడు మహా♦ర్షిస్తోత్రపాత్రుండు ముక్
డెగువం జేసెఁ దపంబు నీవరసర♦స్తీరంబునం దీరి ప
క్కఁగు వేలెం డ్లొకచక్కి నుండి యచలుం ♦ డై మీఁద నానాఁటఁ జీ
మగముల్ పుట్టలు పెట్టి దానిపయిఁ గ్ర♦మ్మం బ్రాఁకెఁ బెందీవలుల్. 5

క. తను వంతయు వల్మీకంబునఁ గప్ప మనుష్యుఁ డనుచుఁ ♦ బోల్పఁగ రా క
న్మునితల్లజుండు నిష్ఠన్, ఘనతప మొనరించె నట్టి♦కాలమునందున్. 6

తే. ఘనుఁడు శర్యాతి యనురాజు ♦ తనచతుస్సహస్ర కాంతాజనంబుతో ♦ హాళి నీస
రోవరంబున విహరించి ♦ పోవ వచ్చి, వేడ్కతో నిందుఁ బొందుగ ♦ విడిసి యుండె.

వ. అయ్యవసరంబున. 8

మ. అలరాజేంద్రునికన్యకామణి సుక♦న్యానామకన్యాలలా
మ లలిం దెచ్చెలిపిండుతోఁ దిరుగుచున్ ♦ మానొప్పచున్నట్టివృ
క్షలతామందిరకందరంబు లరయం♦గా మెట్టుచు న్వచ్చె న
ర్మిలిమై నాడుచుఁ బాడుచుం జ్యవనవ♦ల్మీకాంతికక్షోణికిన్. 9

తే. *దివ్యభూషణభూషిత♦దేహ యగుచు, దెసలు వెలిఁగించుచును వచ్చు ♦ తెఱవఁ గాంచి
చలితమానసుఁ డై ముని ♦ క్షామకంఠ, మలరఁ బిల్చెఁ దపోబల♦కలితుఁ డగుచు.

వ. సుకన్యయు నాస్వరం బెద్దియో తెలియం జాలక వల్మీకంబుపై మెఱయుచున్న చ్యవనచక్షుస్సులం జూచి యిది యేమియో యని విచారించియుం గౌతుకంబునం జేసి కంటకాగ్రంబున వానిపైఁ బొడిచె దాన నతండు విగతనయనుం డై కోపించి శర్యాతిసైన్యంబునకు మూత్రపురీషనిరోధంబు గా శపించె నంత నది యంతయు శర్యాతి విని యేమహామహునకైన నెట్టియపచారంబు గావించిరో యని వారి వారి నడిగి కారణం బెఱయఁ జాలక జాలిం బడి యున్నతఱి సుకన్య తండ్రికడకు వచ్చి యడఁకువం జూపి యి ట్లనియె. 11

క. మిసుఁగుఱుఁబురుఁగుల తెఱఁగునఁ, గసు వడి నొకపుట్టమీఁదు♦గా మెఱయుచు నే
వడి నామెఱుఁగులమీఁదం, బొడిచితి నపచార మిదియ ♦ పో తలపోయన్.

తే. అని వచించిన ధరణీంద్రుఁ ♦ డాక్షణమునఁ, బుట్టకడ కేగి భార్గవుం ♦ బోలఁ జూచి
మొఱఁగి మొఱఁగక నాకూఁతు♦రెగ్గుచేసె, సైఁచి రక్షింపవే మమ్ము♦సంయమీంద్ర.

* క్షామకంఠము = ఈరెలుంగు, మందస్వరము.

మ.*అని ప్రార్థించిన నమ్మునీంద్రుఁ డను శ♦ర్యాతీ భవత్పుత్త్రి యా
వనగర్వంబునఁ గన్ను గాన కిటు నా♦వాసిం దొలంగించె గా
వున దీనిన్ సతిఁ గాఁగఁ గొన్నపుడ పో♦వున్ గోపమున్ శాపమున్
బొనరింపం గలవే బొనర్ప మఱు లే♦మో యంటివే బొ మ్మికన్. 14

—•◆ చ్యవనుఁడు సుకన్యం బెండ్లియాడుట. ◆•—

వ. అని యడిగిన వయోవృద్ధుం డని విచారింపక శర్యాతి తనకూఁతు తపస్వివరే ణ్యున కిచ్చి నిజసేనానిరోధం బుడిగించికొని పురంబునకుం జనియె నంత. 15

మ.‡చ్యవను న్వానిని జీవితేశ్వరునిగా ♦ స్వాంతంబునం దెంచుచున్
నృవరేంద్రాత్మజ భక్తితత్పరతమై ♦ నిత్యం బుపాసింపుచున్
సవిమర్శంబుగ నగ్నులం గొలుచుచున్ ♦ స్వాధ్యాయభృద్విప్రులన్
దివిషద్వర్యుల సన్నుతింపుచుఁ గడున్ ♦ దీపించె నేప్రొద్దునున్. 16

ఆ. అంతఁ గొంతకాల ♦ మరిగినయప్పుడు, వేల్పువెజ్జు లటకు ♦ వేడ్క వచ్చి
జలకమాడి పోవు♦జలజాక్షి నీక్షించి, రమరకన్యఁ బోని♦యట్టిదాని. 17

ఉ.†కాంచి తదంచితద్యుతికిఁ ♦ గౌతుక మందుచు మెచ్చి వచ్చి యో
చంచలనేత్రి గాత్రరుచి ♦ సర్వదిశల్ వెలిఁగించుచుంటి నీ
వెంచఁగ నేరిదాన వగు ♦ దెవ్వనిపంపుఁ బొనర్చుచుంటివో
క్రొంచక మాకు వాకొనుము ♦ కోరిక లీరిక లెత్త నిత్తఱిన్. 18

తరు.§అనిన సుకన్య యి ♦ ట్లనియె నోదివ్యులార! నే శర్యాతి ♦ యనురాజుపుత్త్రి
ననఘుఁడు భృగుపుత్త్రుఁ ♦ డగుచ్యవనునకు,నను:గుఁబత్ని సుకన్య♦యనుదాన ననుచుఁ
దనయుదంతము సవి♦స్తరముగాఁ దెల్పఁ, దగ నవ్వ దస్రులు ♦ త మ్మొఱింగించి
వనితాశిరోమణి♦వలనుమోమగుచు, వగఁ దోఁప నిట్లని ♦ పలికిరి మఱియు. 19

ఉ.¶కన్నులకిఁ గాళ్లు సాఁచుకొని ♦ కాఱియ నొందుచు నున్నవాని కీ
వేటికి నాలు గావలయు♦నిక్కము వచ్చెను గన్నతండ్రి తా
నేటికిఁ బ్రేవులందు దయ ♦ యింతయునేనియు లేక యిచ్చె నో
బోటికొ నిన్ను విన్న వగ ♦ పుట్టక పోవునె యెట్టివారికిన్. 20

* ఏమోయంటివే = అనఁగాఁ జేయలే నంటివేని యని యభిప్రాయము.
‡ స్వాధ్యాయభృద్విప్రులు = వేదవిదు లగుబ్రాహ్మణులు.
† క్రొంచక = సంశయింపక. § దస్రులు = అశ్వినీదేవతలు. వలనుమోమగుచు = దిక్కుమొగమగుచు అనఁగాఁ జూచి యని యభిప్రాయము. ¶ ఇక్కము = ఇఱుకటము.



తే.*మెఱుపుఁదీవకెత్తెంగున ♦ మెఱయుచుంటి, వేఁకులాడుచు నివ్వని ♦ దెఱపమిన్న
నిన్నుఁ బోలినదాని నే♦ మెన్నఁడేని, కని యెఱుంగము దేవలో♦కముల నైన. 21

క. బంగారుబొమ్మ వగు దో, యంగన నీయంగకంబు♦లందు విభూషల్
రంగారవనుచు నేమో, బంగారము ముట్ట కిట్లు ♦ భాసిలు దహహా. 22

మహాస్రగ్ధర. మలపంకచ్ఛన్నమై ని♦ర్మల మనఁబడ కీ♦మాద్రిఁ గైకోక భూషల్
వెలిఁగించు న్నీదుమే నో♦వెలఁదుక కడలన్ ♦ వేసవే లేల వల్కల్
విలసద్రత్నంబ వీ వి♦వ్విధమున నడవిన్ ♦ వెన్నెలం బోలి వృద్ధున్
బలితాంగుం జేఁకు భోగ♦ప్రతిహతమతినిం ♦ బట్టి యుండంగఁ జన్నే. 23

మ. అనమర్థుం డగువానిఁ బాసి జలజా♦స్యా నీవు వేఱొక్కనిన్
బ్రసమీక్షించి వరించి నీసొగసు నీ♦పాయంబు నీకాయమున్
బ్రసవాస్త్రప్రతిపాదకంబు లగుచున్ ♦ భాసిల్లుచందంబునన్
బొనఁగం జేకొనంగఁ జూడు మనుచున్ ♦ మోదంబునం బల్కుడున్. 24

ఆ. అసుకన్య కవల ♦ కనియె నోయయులార, చ్యవనునంద నాకుఁ ♦ దవిలెఁ బ్రీతి
మీర లిట్లు తలఁప ♦ మేర గా దనుడు నా,సత్యు లిట్టు లనిరి ♦ సతికి మఱియు. 25

—•◆ అశ్వినీదేవతలు చ్యవనునకుఁ గన్ను లిచ్చి రూపవంతుం జేయుట. ◆•—

సీ. వనితరో మేము దే♦వభిషగ్వరులము నీ,పతి నవరూపసం♦పన్నుఁ డగుచు
నలరఁ జేయుదు మేము ♦ నతఁడును మువ్వర, మగుదు మం దొకని నీ ♦ కగును బొంద
ననుడు నాయమ చని ♦ వినిపించి పతికిఁ ద,దనుమతిఁ గొని వచ్చి ♦ యశ్వులఁ గని
మీనొడివినయట్లు♦గా నొనరింపుఁడు, నాఁ గవల్ వెండియు ♦ నాతిఁ గాంచి

తే.‡తరుణి నీమగఁ డీసరో♦వరమునందుఁ
జొచ్చునది యన్న రూపుపై ♦ నిచ్చఁ జేసి
చ్యవనుఁ డటు చేసె దస్రులున్ ♦ జలములందుఁ
మునిఁగి తేలిరి మునితోడ ♦ మూర్తమునకు. 26

మ.†పదుచుంబ్రాయము సోయగంబు గలుగన్ ♦ భాసిల్లి తుల్యాకృతిన్
జడజాతేక్షణచెంతఁ జేరి ముగురు ♦ న్మాలోన నొండొక్కనిన్
దడయం బోక వరింపు మంచుఁ బలుకం ♦ దన్వంగి వొంగారుచున్
వడి నాభార్గవుని న్వరించెను మనో♦వాక్కాయకర్మంబులన్. 27

* వేఁకులాడు = ప్రాఁకులాడు.
‡ మూర్తము = పండ్రెండుగడియలకాలము, లేక రెండుగడియలకాలము.
† జడజాతము = జలజాతము, పద్మము.

వ. ఇట్లు రూపయౌవనసంపన్నుం డైనచ్యవనుండు పరమహర్షంబున నాసత్యులం గని నే
మిాకృతనఁ గన్నులు గలిగి రూపవంతుండ నైతిఁ గావున మిమ్ము దేవేంద్రుండు సూచు
చుండ సోమపీథులం జేయుదుం బొం డని యంపివుచ్చె నంత శర్యాతి జామాత
జరాపరిత్యాగంబు విని సంతసించుచుం జనుదెంచి రతిమన్మథులం బోనిసుకన్యాచ్యవ
నులం జూచి ధన్యుండ నైతి నని సంతసించుచుండె నవుడు మునీంద్రుండు రాజేం
ద్రుం బూజించి యి ట్లనియె. 28

మ. *నినుఁ జేయించెద నొక్కయజ్ఞ మిట మా◆నిశ్రేష్ఠు లగ్గింపఁ ద
ద్ఘనసంభారము లెల్లఁ గూర్పు మనుడున్ ♦ ధాత్రీతలాధీశ్వరుం
డనుమానింపక సర్వవస్తువులు నీ◆హామాత్రి నిర్మించి య
ల్లునకుం జెప్పిన నాతఁ డొ ననుచు నా◆లో యాజకుం డై తగన్. 29

క. ‡సవన ముఁ జేయించుచు నా,చ్యవనుం డశ్వులకు సోమ ♦ మర్పించెడుచో
దివిషన్నాథుఁడు వొడగని, కవిసి గ్రహాగ్రహణ ముడిగి ♦ కడకం బలికెన్. 30

శా. ఈనాసత్యులు వైద్యులై వఱలుటన్ ♦ హీనక్రియారంభు లై
గానం బొల్చిరి గాన సోమముఁ గొనం◆గా వీరు గా రర్హు ల
ద్దానం జెప్పచునుంటి నాఁ, జ్యవనుఁ డిం◆ద్రా వెజ్జులై వేల్పులన్
జానొందం బొనరించునట్టిఘను లెం◆న్న న్వీరు సామాన్యులే. 31

క. ఈవున్ దేవత లెట్లో, భావింపఁగ వీరు నట్లె ♦ ప్రస్తుతి కెక్కం
గా వలయు నధ్వరంబులఁ, బావనసోమార్హు లగుచుఁ ♦ బాకవిరోధీ. 32

వ. అనిన నింద్రుండు వెండియును. 33

—•—♦ చ్యవనుఁ డశ్వినుల సోమపీథులం జేయుట. ♦—•—

క. మందు లొసంగుచు వేల్పుల, కెందుం బని సేయునట్టి ♦ రే కాని కవల్
పొందంగఁ దగరు సోమము,లందున్ భాగంబు నాఁగ ♦ నాతఁడు మఱియున్. 34

క. చెప్పినద చెప్పుచుంటివి, తప్పదు న న్నజరుఁ జేసి ♦ దయఁ జూచినయీ
యొప్పులకుప్పలు సోమం, బివ్వడ కొనఁ గల రటంచు ♦ నింద్రుఁ డెగడుచున్. 35

తే. గ్రహము గ్రహియించి దస్రులఁ ♦ గడిమి సోమ,పీథులం జేయ నుండిన ♦ భిదురపాణి
వల దుడుగు మంచు నుడుగని◆వానిమీఁద, వైవ నుంకించె దంభోళి ♦ వడిగ వడిగ.

మ. తనపై వైవఁగ వజ్ర మెత్తినమరు◆త్కాంతుం బ్రతీక్షించి సం
జనితామర్షములో భృగూద్వహుఁడు తం◆జ్జంభారిదో స్తంభమున్

* ఈహామాత్ర = ఇచ్ఛామాత్ర; క్షణములో ననుట.
‡ గ్రహాగ్రహణము = దేవతల కిచ్చుటకుఁ బాత్రలలో సోమమును గ్రహించుట.



*స్తనదంభోళియుతంబుగా నవుడు సం◆స్తంభించి కృత్యార్థి యై
కనదగ్నిప్రభ వేల్చె మంత్రముల నా◆గర్వాంధునిం గూల్పఁగన్. 37

ఆ. అనలరాశినుండి ♦ మునితపోబలమునఁ, బొడమెఁ గృత్యవలన ♦ భూరిపర్వ
తోపమానకాయుఁ◆డుగ్రకర్ముఁడు మదుఁ, డనఁగ నసురుఁ డొకరుఁ ◆డతిజవుండు.

సీ. †వానిదేహం బింత ♦ యా ననుచును సురా,సురుల కైన గణింపఁ ♦ దరము గాదు
వానిబాహువులు ప◆ర్వతసన్నిభంబులు, నయుతమహాయోజ◆నాయతములు
వానిదంష్ట్రిలు నాల్గు ♦ వజ్రనిభంబులై, శతయోజనోన్నత◆స్థితి వహించు
వానిదంతంబులు ♦ వాఁడియై దశయోజ,నాయామమున నొప్పు◆నాయసములు

తే. వానివక్త్రిము లయకాల◆వహ్నిసమము
వానికన్నులు విలయవి◆వస్వదిందు
సదృశములు వానిమైచాయ ♦ సాంద్రతమము
వాఁడు కల్పాంతకుఁడు ఘోర◆వర్తనుండు. 39

వ. ఇట్లతిశయించి రోదోంతరాళం బెల్ల నిండఁ బెరిఁగి యొక్కహనువు భూమి
యందును వేఱొక్కహను వాకాశమందునుం గాఁ దనవదనకుహరంబు తెఱచి
కహాకహధ్వని సేయుచు విద్యుల్లోలం బగునిజజిహ్వాగ్రంబున వక్త్రంబు నాకి
కొనుచు వ్యాత్తాననుండును ఘోరదృష్టియు నై జగంబు లెల్ల నొక్కపెట్ట మ్రింగు
గునో యన బెట్టార్చుచుఁ దనపైకి లంఘించువానిం జూచి వెఱచఱచి సం
స్తంభితభుజుం డగుదేవేంద్రుండు సంభ్రమించి చ్యవనునిచెంతకుం బఱచివచ్చి గడ
గడ వడంకుచు ని ట్లనియె. 40

తే. నేఁడు మొదలుగ నశ్వులం ♦ గూడ సోమ,పీథు లగుదురు నీపేర్మి ♦ పృథ్విఁ దనరు
నీసుకన్యయుఁ దంఢ్రియు ♦ నెసఁగుచుండు, రీయుపద్రవ ముడిగింప◆వే మునీంద్ర.

వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై మునీంద్రుండు తనక్రోధం బుడిగి సురేంద్రుని
విముక్తుం జేసి జగంబుల నిండి యున్నమదుని స్త్రీ పాన మృగ యాక్షంబు లాశ్ర
యించియుండ నియమించి నాసత్యుల కింద్రాదులతో సోమపానంబు లభించు
నట్లు చేసి సుకన్యాసహితుం డై సుఖంబుండె నిది యాభార్గవునిసరోవరంబు
దీనియందుఁ గృతావగాహు లగువా రారోగ్యవంతు లగుదురు నీ వనుజసహితుం
డవయి జలం బాడి పితృదేవతర్పణంబులు గావింపు మని వారిచే నట్లు గావింపించి
లోమశుండు పాండవులం గూడి సికతాక్షం బనుసైంధవారణ్యంబునకుం జని యం
దుఁ గుల్యాలదర్శనంబు చేయించి పుష్కరంబుల జలోపస్పర్శనంబు చేసి శివమం

* స్తంభించి = కదలకుండఁ జేసి.　　† అయుతము = పదివేలు.

త్రంబు జపింపం జేసి యవ్వల నార్చీకపర్వతంబునకుం జని విశ్రమించి ధర్మరాజుం
గాంచి యిట్లనియె. 42

సీ. ‡ఇది దేవముఖ్యుల • పద మిందు వేల్పుల, బహువిధచైత్యముల్ • పరఁగుచుండు
నిది చంద్రమస్తీర్థ • మిట వాలఖిల్యులు, మూఁడుశృంగంబులఁ • గూడి యుంద్రు
శంతనుప్రభృతు లీ • చెంతఁ దపించిరి, పితృదేవతల కిది • ప్రీతికరము
నరుఁడు నారాయణుం • డరయ మున్నిచ్చోట, ననిశంబుఁ దపియించి • రుగ్రభంగి
తే. నిచట యమునాస్రవంతి యిం • పెసఁగుచోట
మున్ను కృష్ణుఁడు తపియించె • మునులు పెక్కు-
చరువులం జేసి భక్షించి • చనిరి భాగ
లమ్మునం దిట్టిపుణ్యస్థ • లమ్ము లేదు. 43

వ. అని యించుక చని. 44

క. ఇది యమునానది మున్ని,ప్పదమున మాంధాత యనునృ • పాలుఁడు మఖముం
బొదలం బొనరిచె నవ్వుడు, మది నలరి యుధిష్ఠిరుండు • పూనికి ననియెన్. 45

క. †ఆరాజేంద్రుని చరితం, బారడమున వినఁగ వలతు • నంతయు నాకున్
గోరిక దీరం జెప్పుము, నా రమణం జెప్పె మౌని • నాథుం డంతన్. 46

## మాంధాతృచరిత్రము.

మ. యువనాశ్వుం డను కాశ్యపీశ్వరుఁడు ము • న్నొప్పారు నిక్ష్వాకువం
శవరుం డై యతఁ డశ్వమేధకసహ • స్రం బెన్నఁగాఁ జేసి వి
శ్వవిదుం డై వినుతింప నొప్పి సుతులన్ • వాలాయమును బొంద లే
క వగం గుందుచు మంత్రివర్యులపయిం • గల్పించి సామ్రాజ్యమున్. 47

ఆ. ఆత్మవంతుఁ డైన • యతఁ డాత్మ వత్తఱి, శాస్త్రదృష్టవిధిని • జతనుపఱిచి
ప్రీతితోడ నేగి • భృగ్వాశ్రమమునకు, భృగుకుమారు నాశ్ర•యించి కొలిచె. 48

వ. అమ్మహర్షియుం బరమహర్షంబున నాసుద్యుమ్ననందను నాదరించి వానిచేఁ బుత్రకామేష్టిం జేయించి దానియందు మంత్రపూతవారిపూరితం బగు నొక్క కలశంబు గల్పించి పుత్రప్రదం బగునద్దాని రాజపత్నీప్రాశనోపయోగ్యంబు గావించి వేదీమధ్యంబునం దుంచె నపు డెల్లఋత్విజులును రాత్రి జాగరణపరిశ్రాంతు లగుటం జేసి గాఢనిద్రాపరవశు లై యుండ నుపవాసఖిన్నుం డగునారాజేంద్రుండు పిపాసాభరంబున శుష్కకంఠహృదయుం డై పానీయార్థం బాక్రోశించియుఁ

‡ చైత్యములు = ఆలయములు; చరువు = హవ్యము.
† ఆరడము = ఉత్సాహము. రమణ = ప్రీతి.



దనకుఁ బ్రతిస్వరం బేరికిని వినరామిఁ బ్రతివచనంబు గాన కందు నలుగడఁ బరిభ్రమించుచు. 49

చ. *కలశము వేదిమధ్యమునఁ • గన్గొని కన్గవ పండువట్లు గాఁ
బెలఁగుచు దానిలో వలచు • శీతలపూతజలంబు లెల్ల మి
క్కిలి దగ గొన్న పెంగడుపు • గిజ్జున నిండఁగఁ ద్రావె నంతలో
మెలఁకువఁ గాంచి ఋత్విజులు • మించినదానికి బుద్ధి నెంచుచున్. 50

ఉ. ‡ఎవ్వరు గ్రోలి రీజలము • లీకలశం బెటు శూన్య మయ్యె మీ
రెవ్వరు తప్పు చేసితి రిఁ • కేటికి దాఁపఁగఁ జెప్పుఁ డన్న లో
నివ్వెఱఁ గొందుచున్ నృపతి • నే నిది గానక చేసినాఁడ నీ
యవ్వ దొలంగఁ జేయుఁడు కొ • ఱల్వడనీయక సంవిధానమున్. 51

తరు. †భృగుపుత్రుఁ డంతటఁ • బృథివీతలేంద్రుఁ, బిలిచి యిట్లనిపల్కెఁ • బ్రీతిపూర్వముగ
జగతీశ నీ కొక్క • సత్తనయుం డెసంగ సంకల్పించి • జలము మంత్రించి
తగుతపశ్శక్తి నీ • దారకు నీయ, దాఁచి యుంచితి మది • త్రావితి వీవు
తగనికార్యం బయ్యె • దైవకృతంబు, దప్పింప నేరికిం • దరము గా దన్న. 52

తే. దీన నీ కింద్రసదృశుఁ డై • తేజరిల్లు, పుత్రుఁ డుదరంబునం బుట్టి • పొదలుగల్లు
గర్భధారణఖేదంబు • గలుగకుండ, నిష్టి పరిపూర్తి గావింతు • మింతలోన. 53

వ. ¶అంతఁ గృతకృత్యుం డై యువనాశ్వుండు నిజపురంబునకుం జని యున్నంత వర్షశతంబు పరిపూర్ణం బైన వెనుక నొక్కనాఁడు వానివామపార్శ్వంబు భేదించుకొని సూర్యప్రభాభాసమానుం డగు నొక్కసూనుండు తండ్రిప్రాణంబున కపాయంబు గాకుండఁ బరమాద్భుతంబుగ వెలువడి వచ్చె నాసమయంబున దేవగణపరివృతుం డై దేవేంద్రుండు వచ్చి వానినోట నమృతమయం బగు తనజుట్టనవ్రేలు వెట్టి కుడుపుచు “అయం మాం ధాస్యతి” యనుటం జేసి వేల్పు లాతని మాంధాత యని పిలిచి చని రంతఁ దత్ప్రదేశిన్యాస్వాదనంబున నతండు దినదినప్రవర్ధమానుండును త్రయోదశహస్తపరిమాణకాయుండు నై. 54

శా. %వేదంబుల్ మఱి శాస్త్రముల్ మఱి ధను • ర్వేదంబులున్ ధ్యానమా
త్రాదేశంబున నేర్చి శస్త్రమున ది • వ్యప్రాభవం బంది యిం
ద్రాదిప్రస్తుత ముగ్ర మాజగవనా • మాంచన్మహేష్వాసమున్
ఖేదాసాధ్యతనుత్రముం బడసి ని • ర్భీతిం బ్రవర్తిల్లుచున్. 55

* వలచు = పరిమళించు. ‡ సంవిధానము = యజ్ఞకర్మము. † దార = భార్య.
¶ అయం మాం ధాస్యతి = ఇతఁడు నన్నుఁ ద్రాగును; ప్రదేశిని = తర్జని.
% తనుత్రము = కవచము. ఇష్వాసము = అమ్ములపొది.

సీ. ‡ఇంద్రాభిషిక్తుఁడై ♦ యుద్ధధర్మంబున, ముల్లోకములు గెల్చి ♦ పూజ్యుఁ డగుచు
నప్రతిహతచక్ర ♦ మన్నిదిక్కులఁ బర్వ, వసుపూర్ణముగఁ జేసి ♦ వసుధ యెల్ల
బహువిధాధ్వరములు ♦ పాటించి చేసి ది, క్కతతులు నిండఁగఁ జై ♦ త్యములు నిలిపి
పద్మసహస్రసం ♦ ప్రస్తుతగోదాన, ములు విప్రముఖ్యుల ♦ కలర నిచ్చి
తే. ప్రజల నిజశాసనంబునఁ ♦ బరఁగఁ జేసి, పరుల నిర్జించి కప్పముల్ ♦ కరము వెంచి
వాసవార్ధాసనస్థుఁ డై ♦ వాసి గాంచి, మించె మాంధాత లోకము ♦ ల్మెచ్చ లనంగ. 56
తే. †అపు డనావృష్టి పండ్రెండు ♦ హాయనములు
గలుగ మాంధాత యింద్రుతోఁ ♦ గల నొనర్చి
వారిదంబుల మర్దించి ♦ వానఁ గురిసి
తనదుగాంధారదేశముల్ ♦ తనియఁ జేసె. 57
క. ¶ఇది మాంధాతృచరిత్రం, బదె కను మారాజు దేవ ♦ యజనము మఱి యి
ప్పదమున సోమకుఁ డధ్వర, ము దగం గావించి పడసెఁ ♦ బుత్త్రశతంబున్. 58
వ. అనిన ధర్మజుం డాసోమకునివృత్తాంతంబు చెప్పు మనిన లోమశుం డిట్లనియె.

సోమకుం డను రాజర్షి చరిత్రము.

చ. %కలఁ డిల సోమకుం డన నొ ♦ కానొకభూపతి వాని కన్నిటన్
దుల యన వచ్చునట్టిపొలఁ ♦ తుల్ శతసంఖ్య నెసంగుచుండినన్
గలుగక కన్గె జంతుఁ డనఁ ♦ గా నొకపుత్త్రుఁడు వార్ధకంబునన్
గలుకులు వార లందఱును ♦ గన్నటు కాంచుచు నుండి రాసుతున్. 60
సీ. ‖నాబిడ్డ రా యని ♦ నాతి యొక్కతె వాని, నూఱడించుచుఁ బోయు ♦ నుగ్గుఁ బాలు
నాతండ్రి రా యని ♦ నవలా యొకర్తుక, లలి మీఱఁ దల రాసి ♦ లాల వోయు
నాయన్న రా యని ♦ నలినాక్షి యొకతుక, చిబుకంబు పుడుకుచుఁ ♦ జిచ్చిగొట్టు
నాయబ్బ రా యని ♦ ననఁబోఁడి యొకర్తుక, జోలలు పాడు ను ♦ య్యాల లూఁచి
తే. లేక లేక కై నవాని నా ♦ లేమ లెల్లఁ, దొడరి తమతమకన్న పు ♦ త్త్రుండు గాఁగ
నెదఁ దలంచి పృథగ్భావ ♦ మింత లేక, పెంచి రచ్చెరువడ జనుల్ ♦ పెరిమ దోఁప.
వ. ఇ ట్లెల్లవారికి నల్లారుముద్దుగాఁ గడుఁ గడు గారాబంబునం బెంచుచున్నప్పుడు.
మ. ఒకనాఁ డం జిఱుచీమ గుట్టుటయు లో ♦ నోర్వంగ లే కింతయున్
వికృతస్వానముతోడ నేడ్చెఁ గొడు కా ♦ వేళన్ భయస్వాంత లై

‡ చైత్యములు = యజ్ఞశాలలు లేక యూపస్తంభములు; పద్మము = అర్బుదమునకుఁ బైనగుసంఖ్యావిశేషము.
† అపుడు = రాజ్యమేలుచున్నప్పు డని తెలియునది. హాయనము = సంవత్సరము.
¶ దేవయజనము = యజ్ఞశాలాప్రదేశము. % కలుకులు = స్త్రీలు.
‖ లాల = జలము, "అపిల్లకులాలపోయుఁడు" ఇట్లిట పాడుదురు.



*తెకతేరం బఱతెంచి వానిజననుల్ ♦ దీనాతిదీనధ్వనుల్
కకుబంతంబులు మ్రోయ నేడ్చి రచటన్ ♦ గాఢప్రచారంబుగన్. 63
స్వాగతము. ఆర్తనాద మది ♦ యారసి భూపుం, డార్తుఁ డై కడు భ ♦ యంపడి దుఃఖ
స్ఫూర్తి వచ్చి విని ♦ పుత్త్రునివార్తన్, వర్తిలెన్ వగకు ♦ వాసము గాఁగన్. 64
వ. అంతఁ గొంతవడికి సభాస్థలంబునకుం బోయి యమాత్యపరివృతుం డై ఋత్విజుం గాంచి యిట్లనియె. 65
చ. కొడుకులు లేకయుండిన నొ ♦ కొండు కుమారుఁడు గల్గి యుండినన్
బుడమి సమానధర్మమును ♦ బొందినచందముఁ దోఁపఁ జేయు నా
పడఁతులు నూర్వు రందఱకు ♦ బాలకుఁ డొక్కఁడు చాలఁ డందునన్
గొడుకుల నూర్వురం బడయఁ ♦ గోరితి నావుడు ఋత్విజుం డనున్. 66
ఉ. మానవనాథ నూర్వురఁ గు ♦ మారుల నొందఁగ నీకు నిష్ట మా
నేని తదాప్తికిం గల దొ ♦ కించుకసాధన మద్ది సేయ నీ
మానస మొప్పియున్న నను ♦ మానము మానుము సిద్ధిదాయకం
బా నియమంబున న్నిలుపు ♦ మన్న నృపాలుఁడు సంతసంబునన్. 67
క. చేయంగా నై యున్నం, జేయఁగ రాకున్నఁ గాని ♦ చేసెద దానిన్
జేయింపు మెద్ది చేసిన, నీయర్థము సఫల మగుచు ♦ నెసక మెసఁగునో. 68
వ. అనిన ఋత్విజుండు వెండియు. 69
తే. మదిఁ దలంకక జంతువు ♦ మఖపశువుగ, నల్పి వేల్చినఁ దద్వపా ♦ కలితధూమ
ములయ నీసతీశతమున ♦ కలరుసుతశతము సముద్భవ మగు మహీ ♦ తలసనాథ.
వ. అం దీజంతుం డగ్రజుం డై సువర్ణపార్శ్వుం డగు నని పుత్త్రకాముం డగుసోమకు నంగీకరింపం జేసి. 71
సీ. ‡తల్లు లెల్లరు గోల్లు ♦ గొల్లున నార్తస్వ ♦ రమున నాక్రోశించు ♦ సమయమందుఁ
దిగిచి పుత్త్రకుని ఋ ♦ త్విజుఁ డాగి విశసించి, విధివిధంబున వప ♦ విఱిచి వేల్చె
నావాసనం జేసి ♦ దేవీశతము నీరు, మోసి పుత్త్రశతంబు ♦ వాసిఁ గనియె
నందగ్రజుం డగు ♦ నతఁడు జంతుఁడు తొంటి, య ట్లందఱకు నిష్టుఁ ♦ డయ్యె నపుడు
తే. యాజకుఁడు దెగి నారక ♦ వ్యథలఁ గుందె, నవల సోమకుఁడును దివి ♦ కరుగుచు గురు
నరసి నీ విట్టులుం డేమి ♦ యన నతఁ డను, నిట్లు నీఋత్విజుం డౌట ♦ కిది ఫలంబు.

* తెకతేరన్ = వ్యర్థముగా.
‡ విఱిచి = తెంపి. నీరుమోసి = గర్భముదాల్చి.

వ. అని సకరుణంబుగం బలికిన సోమకుండు సమవర్తి పలికిం జని నాయాజకుం డగ్నితప్తుం డగుచున్నవాఁడు నాకుఁ గా వాని కిట్లు వచ్చెఁ గావున వానికిఁ గా నే నిందుఁ బ్రవేశించెద వాని విడిచిపుచ్చు మనిన నతండును. 74

తే. కర్మఫల మెప్పుడేనియుఁ ♦ గర్త నొందు, నొంద దితరుల నీ కిది ♦ యొప్పఁ బుణ్య
ఫలము లన రాజ నే వీనిఁ ♦ దొలఁగి పోవ, నిరయ మందేని వీనితో ♦ నిలిచి యుండు.

వ. ఎందును బుణ్యాపుణ్యఫలంబులు మా కిర్వురకును సమంబు లనిన యముం డట్లయేని నీవును వీనితో నీఫలం బనుభవించి వెనుక నాఫలం బనుభవింపు మనిన నతం డట్లచేసి పరిక్షీణపాపుం డై ఋత్విజునితో నుత్తమలోకంబు లొందె నిది వానిపుణ్యాశ్రమంబు దీనియెదుటం దొల్లి ప్రజాపతి యిష్టాకృత మనుసహస్రవార్షికసత్రయాగంబు గావించె నిం దాఋరాత్రు లున్నవారు విగతపాపు లయ్యెద రీయమునాప్రాంతంబున నాభాగుం డగుసంబరీషుం డధ్వరంబు చేసి విప్రులకు దశపద్మసంఖ్యాసముచితధనం బొసంగి సిద్ధిఁ బొందె నహుషాత్మజుం డగుయయాతియు దేవేంద్రుని ద్వేషించి యిట నొకమహాయజ్ఞంబు గావించె నిదె చూడు మాయజ్ఞాగ్నిచిత్రప్రదేశంబు పుణ్యప్రదం బై చూపట్టు నివి రామహ్రదంబు లిది నారాయణాశ్రమం బిది యర్చీకపుత్రపదం బిది కురుక్షేత్రద్వారం బిది ప్లక్షావతరణం బనుయమునాతీర్థం బిందుఁ దొల్లిమహర్షులు సారస్వతయాగంబు చేసి రిది భరతునిహయమేధయజ్ఞవాటం బిది సంవర్తపాలితం బగుమరుత్తుసత్త్రాయతనం బిందు జలంబాడి సర్వలోకంబులుం జూడ నగు ననిన ధర్మజుం డట్ల చేసి లోమశుం జూచి యి ట్లనియె. 75

మ. ఇట నే నుండియ యెల్లలోకములపెం ♦ పీక్షించితిన్ దక్షుఁ డై
పటుతేజంబున వాసవాంతికమునన్ ♦ భాసిల్లునాతమ్ముఁ డ
క్కటికం జేర్పడ నామకన్నుఁగవకుం ♦ గన్పట్టు నిప్పట్ల నిం
తటిచోద్యంబులు చూడఁ గంటిని మహా♦త్మా! నేను ధన్యాత్ముఁడన్. 76

వ. అనిన లోమశుండు వెండియు నిది సరస్వతీతీర్థం బిది పంచయోజనవిస్తీర్ణం బగుబ్రహ్మయజ్ఞవేది యిందు మరణించి మర్త్యు లమర్త్యు లగుదు రిది కురుక్షేత్రం బిటఁ దొల్లి దక్షుం డధ్వరంబు చేసి దక్షుం డయ్యె నిది వినశనతీర్థం బిది నిషాదద్వారం బిది చమసోద్భేదం బిది సముద్రతీర్థం బిం దగస్త్యుండు లోపాముద్రం బెండ్లియాడె నిది ప్రభాసతీర్థం బిది విష్ణుపదతీర్థం బిది విపాశానది యిందు వసిష్ఠుండు తనమేను పాశంబులం గట్టుకొని పడి విపాశుం డై మరణంబునకుం దప్పె నిది కాశ్మీరమండలం బిందుఁ దొల్లి మహర్షులకును నాహుషకాశ్యపాగ్నులకును పెద్దసంవాదంబు జరిగె నిది మానససరోవరద్వారం బీపర్వతమధ్యంబునం బరశురాముం డొక్కవర్షంబు పనిఁ బూని



హంసద్వారంబు గావించె నీసరోవరంబునం జైత్రమాసంబున శంకరుండు భక్తజనవశంకరుం డగు నిట వసిష్ఠుం డరుంధతీసహితుం డై నివసించె నిది భృగుతుంగం బనుపర్వతం బిది వితస్తానది యాశీనరుండు శిబి యనువాఁ డీప్రదేశంబున నధ్వరంబులు చేసి వాసవునికన్న మిన్న యయ్యె నమ్మహాత్ముని పవిత్రచరిత్రంబు విను మని వెండియును. 77

——శిబిచక్రవర్తి డేగకుఁ దనమేనిమాంసమును గోసి యిచ్చినకథ.——

చ. *అతని నెఱుంగఁ గోరి త్రిద♦శాధిపుఁ డగ్నియు డేగ గువ్వ యై
జతనము మీఱ మానిజన♦సంభృత మై నుత మైనతన్మఖా
యతనముఁ జేర వచ్చిరి భ♦యంబున నప్పుడు డేగ తాఁకునన్
మతి బెగడొంది గువ్వ నర♦నాయకునంకము సొచ్చెఁ జొచ్చినన్. 78

క. తనమఱువున భయకంపము,లను గొని శరణార్థి యగుచు ♦ లా వఱి యున్నం
గని భూనేత కపోతం,బున కభయం బొసఁగెఁ గరుణ ♦ పుట్టినబుద్ధిన్. 79

వ. అపుడు కపోతమ్ము నగిచికొనివచ్చిన శ్యేనం బారాజుం గాంచి యి ట్లనియె. 80

మ. నిను ధర్మాత్మునిఁగా వచింతురు జనుల్ ♦ నే నెంతయే నాఁకటన్
వనటం బొందుచు నుండ నా కయిన దై♦వప్రాప్త మాహారమున్
గొననీకుండఁగ నిట్లు నేయుటలు నీ♦కుం బోలునే దీనఁ బో
యెను గాదే భవదీయధర్మగతు లో♦పృథ్వీతలాధీశ్వరా. 81

వ. అనిన శిబి యి ట్లనియె. 82

క. ‡నీవలని భయంబున నిది, యేవలనన్ రక్షణంబు నె♦ఱుఁగక త్రస్తం
బై వచ్చి శరణుఁ జొచ్చెను, నావలనన్ దనదుజీవ♦నము నిల్పుకొనన్. 83

శా. †ఈయభ్యాగతు నీద్విజోత్తముని నీ♦హృద్దాహసంతప్తునిన్
నీయీమాటల మోసపోయి విడువ♦న్నే నింతయే నెంతునే
నాయందుం బడి జీవితార్థి యగుచున్ ♦ సంభ్రాంత మాదీనునిం
బాయం జూచుటయే యధర్మ మనుచున్ ♦ భావింతుఁ బక్షీశ్వరా. 84

క. గోవుల ద్విజులం జంపిన, నేవిధ మగుపాప మగునొ ♦ యిల శరణార్థిన్
బోవంగ విడిచినవానికి, నావిధ మై యధికపాప ♦ మగు నన రె బుధుల్. 85

వ. అనిన శ్యేనంబు వెండియు. 86

* జతనము = ప్రయత్నము. ‡ త్రస్తము — భయపడినది.
† అభ్యాగతుఁడు = భోజనమునకు వచ్చినయతిథి.
ద్విజోత్తముని = పక్షిశ్రేష్ఠుని, బ్రాహ్మణు నని భావార్థము. హృద్దాహము = హృదయతాపము.

శా. ఆహారంబున భూతముల్ గలుగు నా♦హారంబునం బెర్గు నెం
దాహారంబున నెప్పుడున్ బ్రదుకు నా♦హారంబు లే కెవ్వియున్
దేహంబున్ ధరియింప లేవరయ ధా♦త్రీనాథ వేయేటి కి
న్నాహారంబును బొందకున్నఁ జెడు నా♦ప్రాణమ్ము లొక్కింతలోన్. 87

తే. నాదుతను వేఁగఁ బుత్రదా♦రాదికంబు, నేఁగు నిక్కపోతమునకై ♦ యిన్నిప్రాణ
ములను గూల్పఁ దగదు ధర్మ♦మునకుఁ జేటు, దెచ్చుధర్మ మధర్మమే ♦ తెలిసికొనిన.

వ. ధర్మాధర్మనిశ్చయంబు సేయునప్పుడు గౌరవలాఘవంబు లరసి ప్రవర్తించుట ధర్మజ్ఞులకు ధర్మువు కావున నీ విట ధర్మనిశ్చయంబు చేసి సర్వసమ్మతుండ వయి ప్రవర్తింపు మనిన నౌశీనరుండును. 89

సీ.*విహగోత్తమా చక్క ♦ వివరించి పలికితి, గుణనిధి వైనతా♦ర్క్ష్యుఁడవొ నీవు
నీ వెఱుఁగనిధర్మ ♦ మేవలనం గల్గఁ, బో దని తలఁచెద ♦ బుద్ధియందు
శరణుఁ జొచ్చినవానిఁ ♦ బరిహరించుట లెస్స, ధర్మమార్గం బని ♦ తలఁచితో టు
నీయత్న మిది భుక్తి♦కే యేని మఱియొక్క,గతిఁ గూర్చుకొనఁగ శ♦క్యంబు సువ్వె

తే. వలయునే నీకుఁ బెట్టెంతు ♦ వలసినంత,మృగవరాహమహిషవృష♦మృదులమాంస
మది భుజింపు మాఁకలి దీఱ ♦ ననుచు సాళువము మహారాజునకు నిట్లు♦పలికె మఱియు.

శా.‡లేళ్లన్ దుప్పుల బత్తెలన్ వృషములన్ ♦ లేముల్ తటస్థించి మై
డ్రెళ్లం బోయినఁగాని నేను మెసఁగన్, ♦ దేవాహితాహార మై
చెల్లున్ మా కిది దీని వీసు మనుసీ♦చెర్యిన్ వృథా వాదునే
సల్లాపంబు లివేల చాలు నిఁక న♦జ్ఞానంబునం గాకుమా. 91

క. సారం బెఱుఁగక కదళీ,భూరుహమున నెక్కి ధర్మ♦పుంబథము సెడం
గా రహిఁ దూలం బడకుము, కోరితి నాకోర్కి దీరఁ ♦ గువ్వ న్విడుమీ. 92

వ. అనిన రాజి ట్లనియె. 93

శా.†నారాజ్యంబు సమృద్ధమై తనరు నె♦న్నన్ ఖేచరగ్రామణీ
కోరం గోరిక లెల్లఁ గూరుతును నీ♦కుం గూర్చి వెన్నంటి రా
నీరాపుల్ వడి నన్నుఁ గావు మనుచున్ ♦ జీవార్థి యై నాయెడ
న్జేర న్వచ్చినదీనిఁ గాక యెది యే♦నిం గాని యర్థింపవే. 94

చ.§అనిన శశాదనం బనియె ♦ నయ్య కపోతము నీఁదిప్రేముడిన్
మనమున వీడవేని నిజ♦మాంస మొసంగుము దీనియెత్తునం

* తార్క్ష్యుఁడు=గరుత్మంతుఁడు. సాళువము = డేగ. ‡ అహితము = చేయఁబడినది.
† ఖేచరగ్రామణి = విహగశ్రేష్ఠము, దేవతాశ్రేష్ఠ మని ధ్వని. § శశాదనము = డేగ.



బొనరఁగఁ దూఁచి తృప్తిపడి ♦ పోయెద నన్న మహీమహేంద్రుఁ డి
ట్లనియె ననుగ్రహించితి మ♦దంగపలంబు గ్రహింపు మిచ్చెదన్. 95

తరు.*అని నృపుఁ డసిపుత్రి ♦ నాత్మాంగకముల, నగుమాంసమును గోసి♦యప్పు డత్రాసు
నను బెట్టి తూఁచినం♦తన కపోతంబు,నకుఁ దక్క వగుటయు ♦ నరపతి మరలఁ
డనమేనిపలల మం♦తయుఁ దీసి యిడియు, దానికిఁ దుల గామిఁ ♦ దలఁక కతండు
తనుఁగొన నెందును ♦ గానక పలము, ఘనమతిఁ దా నెక్కెఁ ♦ గడఁకఁ దరాసు.

ఆ. తలఁక కట్లు సేఁత ♦ కలరి మెచ్చుచు డేగ, పలుకు నేను దేవ♦పతి నితండు
ఘనకపోతరూప♦మున నున్నవాఁ డగ్ని, యనుచుఁ గరుణచేసి ♦ యంతలోన. 97

వ. వారు వానికిఁ దమనిజరూపంబులు సూపి మేము నిన్ను విని నీధర్మగుణం బరయ వచ్చితిమి నీచేత సకలభువనసంస్తవనీయంబు నీకీర్తి ప్రపంచంబు గలంతకాలంబు నిత్యంబై వెలుంగుచుండు నీకు నుత్తమలోకంబులును గల వని పలుకుచు నంతర్ధానంబు నొంది రుశీనరుండును దేవప్రసాదంబున విభ్రాజమానదేహుం డై ధర్మపరిపాలనంబు సేయుచుఁ గొంతకాలంబునకుఁ ద్రివిష్టపంబునకుం జని సుఖోపవిష్టుం డయ్యె నియ్యది మహాత్మ్యుం డగునమ్మహారాజు దేవయజనం బిది యుద్దాలశ్వేతకేతునిదివ్యాశ్రమం బిందు సరస్వతి మనుష్యరూపంబున శ్వేతకేతునకుం బ్రత్యక్షం బయ్యె మఱియు నియ్యెడ శ్వేతకేతునిభాగినేయుం డగునష్టావక్రుండు తల్లియుదరంబున నుండి మహావిద్యల నెల్ల నేర్చి మేనమామతో జనకునికడ వాదంబున వంది యనువాని నోడించె ననిన నజాతశత్రుం డతనిప్రభావంబు సెప్పు మనిన లోమశుం డతని కి ట్లనియె. 98

లోమశుం డష్టావక్రునిచరిత్ర చెప్పుట.

తే.‡శ్వేతకేతునితండ్రి యై ♦ చెన్నుమీఱు, ననఘుఁ డుద్దాలకుం డను♦మునివరుండు
శిష్యులకు వేదవిద్యలఁ ♦ జెప్పునపుడు, చేరెను గహోళుఁ డనియెడు♦శిష్యుఁ డొకఁడు.

వ. అట్లు వచ్చి కహోళుం డాతని నాశ్రయించి పెద్దకాలం బాచార్యవశానువర్తి యై పరిచర్య సేయుచు నధ్యయనంబు చేసి ఘనుం డయ్యె నాచార్యుం డగునుద్దాలకుండును వానిశ్రుతంబునకు మెచ్చి తనకూఁతు సుజాత యనుదాని వాని కిచ్చి వివాహంబు చేసె నంత. 100

పంచచామరము.సుజాతయుం గహోళుఁ గూడి ♦ సొంపు మీఱఁ గాఁపురం
బుఁ జేయుచున్ ధరించె గర్భ♦మున్ మునీంద్రుఁ డెన్న నా
ద్విజుండు శిష్యవర్గమందు ♦ విద్య సెప్పుచుండ న
య్యజాతుఁ డంబకుక్షి నుండి ♦ యెల్ల నేర్చె విద్యలన్. 101

* అసిపుత్రి = చురకత్తి, పలలము, పలము = మాంసము. తరాసు = త్రాసు.
‡ నన్నయభారతములోఁ గహోళునకు సేకపాదుఁ డని పడి యున్నది. ఇది చింత్యము.

వ. అతం డొక్కనాఁ డువరతాధ్యాపకుం డగుతండ్రికిం దెలియున ట్లల్లన ని ట్లనియె.

చ. గడియవిరామ మన్నయది ♦ గల్గఁగ నీయక రేపవళ్లును
న్విడువక వేదపాఠ మిటు ♦ వీరికిఁ జెప్పెదు నుంట లొప్పనే
జడ మగు బుద్ధి దీన నిట ♦ సన్మునిచంద్రమ నే నెనంగుచున్
జెడనిభవత్ప్రసాదమునఁ ♦ జేసి గ్రహించితి నెల్లవిద్యలన్. 103

వ. అని గర్భస్థుం డగుసర్భకుండు శిష్యమధ్యంబునఁ దన్నుపాలంభించి పలికినం గనలి కహోళుం డుదరంబున నుండి నీవు వక్రంబుగాఁ బలికితివి కావున నష్టవక్రుండ వయి పుట్టు మని శాపం బొసంగె నంత సుజాత ప్రవర్ధమానగర్భ యై యొక్కనాఁడు ధనహీనుం డైనతనపతిం గాంచి ధనం బపేక్షించి యి ట్లనియె. 104

క. పదియవమాసము వచ్చెను, హృదయేశ్వర ధనము లేక ♦ యేవిధమున నా
పద దీని నిస్తరింపఁగ, నొదవెడు నిర్వేద మీ వ♦యో తెలియంగన్. 105

తే. అనుడు విత్తార్థి యై కహో♦ళాహ్వయుండు, జనకభూపాలుపాలికిఁ ♦ జని వివాద
నిపుణుఁ డై యున్నవందితో ♦ నపుడు కదిసి, వాదమున నోడి నిగృహీతుఁ♦ డై తలంకి.

వ.* అంభోనిమజ్జితుం డై యుండె నిట సుజాత కష్టావక్రుండు నుద్దాలకపత్నికి శ్వేతకేతుండునుం బుట్టి రవ్వు డుద్దాలకుండు జామాత కై ననికారప్రకారం బంతయు సూతముఖంబున విని సుజాతకుం జెప్పి యిది యెవ్వరికిం జెప్ప కుండు మనిన నామెయు నామంత్రంబు రక్షించుచుండె నంత నష్టవక్రుండు దినదినప్రవర్ధమానుం డై.

తే. తనకు నుద్దాలకుఁడు తండ్రి♦ యనుచు శ్వేత, కేతుఁ డగ్రజుఁ డనుచు సం♦ప్రీతిఁ దలఁచు
చుండె ని ట్లుండునంతఁ బం♦డ్రెండువత్స,రములు కడచనున ద్దొక♦సమయమందు.

మ. జనకోత్సంగమునందుఁ బొందుపడున♦ష్టావక్రు నీక్షించి సం
జనితక్రోధుఁడు శ్వేతకేతుఁ డతనిన్ ♦ జై వట్టి ధర్షించుచున్
జను మిం దుండఁగ నేల నీజనకునుత్సంగంబు గా దంచుఁ ద్రో
చిన దుఃఖించుచు నాతఁ డమ్మ కడకున్ ♦ శీఘ్రంబునం బోయియున్. 109

తే. తల్లి నాతండ్రి యెట కేగెఁ ♦ దెల్లముగను, జెప్పు మనుటయు నాయమ ♦ చెప్ప కున్నఁ
గొనుకు నెపియించునో♦యని జడిసి చెప్పె, వాసివృత్తాంత మంతయు ♦ వరుసగాను.

వ. అష్టావక్రుండు నట్లు తల్లివలనఁ దత్త్వం బంతయు నెఱింగి శ్వేతకేతుం జేరఁ బిలిచి యి ట్లనియె. 111

అష్టావక్రుఁడు జనకునికడ వందితో వాదించి యోడించుట.

చ. జనకునియజ్ఞవాటమున ♦ సంతతభూసురవేదవాదముల్
చనునఁట మంచిభోజన మొ♦సంగుదు రంట ధనార్జనంబునున్

* అష్టవక్రుఁడు, అష్టావక్రుఁడు అని రెండురూపములును గలవు.



బొనరుప వచ్చునంట చనఁ ♦ బోలదొకో మన కందు మాతులా
యనుటయు శ్వేతకేతుఁ డిది ♦ యౌ నని సమ్మతము న్వచించుచున్. 112

వ. అంత నమ్మాతులభాగినేయు లిర్వురును జనకరాజపురంబునకుం జని రవ్వుడు ద్వారపాలుండు వారి నాఁగి యి ట్లనియె. 113

ఆ. బాలు రిందుఁ జనఁగఁ ♦ బోలదు వృద్ధులు, విప్రవరులు గాక ♦ విప్రబాలు
రార! మీరు నిలువుఁ ♦ డనుడు నష్టావక్రుఁ, డలుక వొడమ నిట్టు♦లనుచుఁ బలికె.

తే. అంధులును వృద్ధులును స్త్రీలు♦నధికభార,వాహులును బ్రాహ్మణులు లేని♦వట్ల దారి
నడ్డు లేక ప్రవర్తింప ♦ నగును బ్రాహ్మ,ణులకు నడ్డు లే దె ద్దేరఁ ♦ దొలఁగవలయు.

క. కులవిద్య లెఱిఁగి పేర్మిన్, వెలుఁ గొందెడుచిఱుత యైన ♦ వృద్ధుం డన నొ
ప్పల నరసినంతమాత్రం, దలపోయఁగఁ జనునె వానిఁ ♦ దగ వృద్ధనుచున్. 116

ఉ. బాలుర మైన నేర్చితిమి ♦ బాధతరంబుగ విద్య లేమిటన్
బోలనిపోకల న్మెలఁగఁ ♦ బోయెడువందిని వాదమందు మే
ల్మే లన గెల్వ వచ్చితిమి ♦ మీపతిభువర్యునితోడఁ జెప్పి ద్వాః
పాలక మా కొసంగుము నృ♦పాలసభాభవనప్రవేశమున్. 117

వ. అనిన దౌవారికుండు ప్రణమిల్లి బ్రాహ్మణుల కింద్రుండును బ్రణమిల్లుచుండు మీరు మాణవకు లని మి మ్మవమానింప నోడుదు నగ్ని యింత యైనం దాహశక్తిం బూన కుండునే మీ కిటఁ బ్రవేశంబు గలుగఁ బ్రయత్నించెద నని రాజానుమతంబు వడసి వారికిఁ దత్సభాప్రవేశంబు గలిగించె నంత నష్టావక్రుండు జనకమహారాజుసన్నిధానంబు గల్పించుకొని యి ట్లనియె. 118

చ. జనక కులంబునందుఁ గడు ♦ సన్నుతి కెక్కితి చక్రవర్తి వై
ఘనుఁడవు సర్వసంపదలు ♦ గల్గి యయాతివిధంబునన్ జగ
జ్జను లలరంగ జన్నము లొ♦సంగఁ బొనర్చెదు నీసమక్షమం
దనఘుఁడు వంది వాదమున ♦ నాధ్యుఁడు గల్గుట వించు వచ్చితిన్. 119

తే. వంది యెక్కండ్ర విప్రుల ♦ వాదమందు, నిగ్రహించి జలంబుల ♦ నాగ్రహమునఁ
ద్రోచు ననుచు బ్రహ్మాద్వైత♦ మాచతురుని,కడ నిరూపించి గెలువఁ దఁ♦గడఁగియుటకు.

వ. వచ్చినాఁడ వంది యెచ్చట నుండె వాదించి వాని నిపుడ సూర్యుండు చుక్కలం బోలె నిస్తేజస్కుం జేసెద ననిన జనకుండు వాని కి ట్లనియె. 121

చ. బుధుఁ డీవు వందిబల♦ముం జలముం దెలియంగ లేక దుం
దుడుకునఁ బల్కుచుంటి విటు ♦ తోఁచియుఁ దోఁపక యెందఱేని ముం

వడి వడి వచ్చి వాదమున ♦ వానికడ న్నిల లేక తేజముల్
విడి రవికాంతిరిక్క లన ♦ వీఁగి వికావిక లైరి వింటివే. 122

వ. అనిన నష్టావక్రుండు. 123

తే. వంది నాయట్టివానితో ♦ వాదు గొనక, తగుదు నే నని తనుఁ దాన ♦ పొగడుకొనుచు
సింహ మనుకొంటివో నన్నుఁ ♦ జేరి చక్రి,ములు విఱుగఁ గూలుబండినాఁ ♦ బోవకున్న.

వ. అనిన జనకుఁ డష్టావక్రుం జూచి త్రింశదవాంతరాంశములును ద్వాదశాంశమ్ములును జతుర్వింశతిపర్వంబులును త్రిషష్టిశతారంబులునుం గలచక్రం బెఱింగినవాఁడె విద్వద్గోచరుం డనిన నష్టావక్రుం డిరువదినాలుగుపర్వంబులు నాఱునాభులును బం డెండునేములును మున్నూటయఱువదియరములునుం గలిగి సదాగతి యగుకాల చక్రంబు నిన్ను రక్షించుఁ గావుత మనిన రాజేంద్రుండు వెండియును. 125

చ. అనిశముఁ గూడియుం బడబ ♦ ల ట్లివి యెవ్వనిఁ గూడి గర్భముం
గనుఁగొనఁ దాల్చి యెవ్వనిని ♦ గాంచెను నావుడుఁ బూర్వ ముత్తరం
బనునరణిద్వయం బనిలుఁ ♦ డంటసిలంగ జనించునగ్నిహో
త్రునివలనం భయం బెపుడుఁ ♦ దోఁవక యుండుత నీకు నెప్పుడున్. 126

వ. అనిన జనకుండు. 127

సీ. ఏది నిద్రించియు ♦ నెపుడుఁ గన్ మూయ దెయ్యది పుట్టి చైతన్య ♦ మందకుండు
దేనికి హృదయంబు ♦ గానరా దయ్యెడు, నేది వేగంబున ♦ వృద్ధిఁ బొందు
ననుడు నష్టావక్రుఁ ♦ డనుఁ జేప నిద్రించియును గన్ను మూయదు ♦ వనములందు
గ్రుడ్డు పుట్టియును గై ♦ కొనదు చైతన్యము, నశ్మరూపము హృద ♦ యమునఁ గాదు

తే. వేగమునఁ జేసి నిమ్నగ ♦ వృద్ధిఁ బొందు, ననుచుఁ జెప్పిన సంతృప్తుఁ ♦ డై జనకుఁడు
కొండికవు గావు నీవు వృ ♦ ద్ధుండ వరయ, వేల్పవగు దయ్య నీవాఁడు ♦ వేదసముఁడు.

వ. నీకుఁ బ్రవేశం బొసంగితి నితండే వంది యని చెప్పిన నతం డతనిం జూచి. 129

సీ. వాదిమానీ! రమ్ము ♦ వాదింప మండెడు,జ్వలనుఁ బోల్ నాకడఁ ♦ జక్క నిలుము
బడబానలం బబ్ధి ♦ పగిది ని న్నుడికింతు, వ్యాఘ్రంబు ప్రేలితో ♦ నంటి తీవు
పాదాహతం బైన ♦ పాముపగిది నిన్నుఁ, బట్టి నీయేపు మాం ♦ పఁ గలఁ జిమ్మి
యొడ్డెద నీవు నా ♦ తోడ డీకొని గర్వ,దుర్విదగ్ధుండ వై ♦ తొడరు టరయఁ

తే. విడికిటను గొండఁ దాఁకిన ♦ విధము గాదె, గోళ్లతోఁ గూడి పిడికిలి ♦ త్రెళ్లఁ గాని
కొండ ద్రెళ్లఁ బో దట్లు నా ♦ కుం గొఱంత, రాదు నేర్పరివే రమ్ము ♦ వాదమునకు.

వ. అని యాసభాభవనంబునం దెలుంగు రాల్పడం బలుకుచు నోయి వంది నేను బ్రశ్నింతు నుత్తరం బిమ్ము కాదేని నీవు ప్రశ్నింపు మే నుత్తరం బిత్తు ననినం గినిసి వంది యి ట్లనియె. 131



మ. ఒకఁడే సూర్యుఁడు సర్వదేశములయం ♦ దొప్పించు వైశ్వానరుం
డొకఁడే పెక్కగుచోట్లఁ దేజమునఁ బెం ♦ పొందు న్మహావీరుఁ డై
యొకఁడే యింద్రుఁడు శత్రులం దునుముఁ దా ♦ నొక్కండె కాలుండు పై
తృకనాథుం డయి లోకమం దెనఁగుఁ గాం ♦ దే బాలలోకాగ్రణీ. 132

వ. అంత నష్టావక్రుండు. 133

మ. ఇరువురు వాసవజ్వలను ♦ లిరువురు నారదపర్వతాఖ్యులన్
బరగిన దేవమానులు సు ♦ పర్వులరోగము లెల్లఁ బావు వా
రిరువురు వైజ్ఞమానికము ♦ లిరువురు జంపతు లిట్లు ధాతచే
సర్వము నిర్వ రిర్వురుగ ♦ సల్పఁబడెం జుమి వాదిశేఖరా. 134

క. వంది యి ట్లనియె. 135

తే. కిరణములు మూఁడు గుణములు ♦ గలవు మూఁడు
సవనములు మూఁడు లింగముల్ ♦ చనును మూఁడు
భువనములు మూఁడు జ్యోతిస్సు ♦ లవును మూఁడు
సకలజను లిట్లు చెప్పిద ♦ రకలుషమతి. 136

వ. అష్టావక్రుండు. 137

క. నాలుగువర్ణంబు లగుచున్, నాలుగు శ్రుతు లగును దెసలు ♦ నా ల్గగుఁ దెలియన్
నాలుగు కాళ్ళన్ గోవులు, మే లందుచు నుండు నట్లు ♦ మీదని యందున్. 138

వ. వంది యి ట్లనియె. 139

తే. పంచపావకములు పంచ ♦ పదము పఙ్క్తి, పంచపంచేంద్రియంబులు ♦ పంచపాశ
యజ్ఞములు పంచచూడముల్ ♦ పంచనదులు,గలవెపుడుమాణవకనీకుఁ ♦ దెలియదోయి.

వ. అష్టావక్రుం డి ట్లనియె. 141

తే. షడృతువులును షట్కాత్రములు ♦ షడ్రుచులును,షడ్వికదకాలములు షట్ప్ర ♦ శస్తకృత్తి
కలు షడింద్రియములు షట్ప్ర ♦ కారదుర్గాంచితాధానములు గల ♦ వెంచి చూడ.

వ. అనిన వందియు. 143

తే. సప్తకులపర్వతంబులు ♦ సప్తసాగ,రములు సప్తర్షులున్ సప్త ♦ విమలపూజ
నములు సప్తతంత్రీప్రథి ♦ తములు వీణ, లరయ సప్తవాసరములు ♦ పరఁగుచుండు. 144

వ. అనిన నష్టావక్రుండు. 145

క. ఎనమండ్రు వసువు లలరుదు, రెనిమినిపాదములశరభ ♦ మెత్తఱి సింహం
బును జంపున్ శతమానం, బెనిమిదిశాణముల నొప్పు ♦ నెఱుఁగుదె వందీ. 146

వ. వంది మఱియును. 147

తే. తెలియఁ బితలకు నవసామి ♦ ధేను లెనఁగు, బృహతికి నవాక్షరంబులు ♦ వెలయు లెక్క
నై లబిలునకు నవనిధు ♦ లలరు యోగ,ములకు నవవిధముల మేలు ♦ గలుగు వింటె.

వ. అష్టావక్రుండు వెండియు. 149

క. పదిదిక్కు లెన్నఁగుచుండును, బదినెలల స్త్రీరుమోయుఁ • బడతి ధరిత్రిన్
బదియవతారము లెత్తెను, సదయుఁడు నారాయణుండు • చర్చింపంగన్. 150

వ. వంది వెండియు. 151

క. ఏకాదశరుద్రులు తా, రేకాలముఁ దనరుచుందు • రేకాదశియున్
వాకొనఁబడును వికారము, లేకాదశసంఖ్యఁ బ్రాణి • కెప్పుడుఁ గలుగున్. 152

వ. అష్టావక్రుండు. 153

క. పదిరెండునెలలు వర్షము, పదిరెం డగుసక్కరములు • పరఁగున్ జగతిన్
బదిరెండు సూర్యమూర్తులు, పదిరెండుదినంబులందుఁ • బ్రాకృతమఖ మా. 154

వ. అనిన వంది మఱియుం ద్రయోదశీతిథి సుప్రశస్తం బనియు నీవిశ్వంభర త్రయోదశద్వీపంబు గల దనియు నొక్కశ్లోకార్ధంబునం జెప్పి యుత్తరార్ధంబు స్ఫురింప కూరకున్న నష్టావక్రుండు సంసారకేళి త్రయోదశదినంబు నతిజగతిచ్ఛందము త్రయోదశాక్షరంబులం బొందు ననియుం జెప్పి దానిం బూరించి పలికిన మాఱు పలుకక ధ్యానపరవశుండై మొగంబు వాంచి యున్నవందిం గాంచి సభాసదు లెల్లరుం గోలాహలంబు గావించి ప్రాంజలు లై యష్టావక్రుం బూజించి రపు డష్టావక్రుండు. 155

తే. వాదమున నోడి తొల్లిట • వందిచేత, సలిలమజ్జితు లైనసజ్జను లిపుడు విముక్తు లగునట్లు వందియుఁ • బొడవడంగి, సలిలమజ్జితుఁ డగునట్లు • సలుప వలయు.

తే. అనుటయును వంది యి ట్లను • నాత్మజుండ, వరుణునకు నేను ద్వాదశ•వార్షికంబు సత్రయాగంబు సేయు నా•జనకుఁ డటకు,మజ్జితులు పోయి యుండిరి•మాన్యు లగుచు.

తే. వరుణపూజితు లై నట్టి•వార లెల్ల, మరల వత్తు రష్టావక్రు • నరయ నిపుడు సందర్భమున మున్గి నేను నా•జనకుఁ జూడఁ,జనుదు నని పల్కుచున్ వంది•మునిఁగె నీట.

వ. అంత నొక్కముహూర్తమాత్రంబున వరుణపూజితు లై నకహోళప్రభృతు లాజనకరాజనమక్షంబునఁ బ్రత్యక్షం బై రపుడు కహోళుండు కొడుకునకు మెచ్చుచు రాజుం జూచి. 159

చ. తనయులఁ గాంచఁగాఁ జను లెం•దం దలపోయుట లిట్టిసౌఖ్యముల్
గొనుట కటంచు నెంచఁగఁ ద•గుం గదె నాకు నశక్య మైనయు
ప్పనిఁ బొనరించె నాకొడుకుఁ • బండితమానికిఁ బండితుండు దు
ర్జనునకు సజ్జనుండును ధ•రం బ్రభవించెడ రెట్టిచిత్రమో. 160

తే. *చాఁగు నీయాగ మెంతయు • సన్నుతంబు, సామగానంబు మిక్కిలి • సౌరుమీఱె సురలు సంప్రీతి నొందిరి • సోమునినను, భద్ర మగుఁ గాత నీకు నో•పార్థివేంద్ర. 161

* చాఁగు = వర్ధిల్లు లేక ప్రశంసార్థకము.



క. అంతట నష్టావక్రుఁడు, సంతసమునఁ దండ్రికడకుఁ • జని భయభక్తుల్
స్వాంతమునఁ బెనఁగొనం బ్రాం,జాంతికమున వ్రాలి మ్రొక్కి • యర్చించెఁ దగన్

ఆ. తండ్రి నట్లు కొలిచి • తమవలాలనములఁ, దనిసి విప్రపూజ•లను గ్రహించి జనకునాజ్ఞ వడసి • జనకునితో మేన,మామతోడఁ జనియె • మాతకడకు. 168

వ. అట్లు కృతకృత్యుం డయినయష్టావక్రునికారణంబున విముక్తిం గాంచినకహోళుండు సంతసించుచు వాని సమంగానది జలంబాడ నియమించిన నతం డట్లు గావించి సమాంగుం డయ్యె దానం జేసి నదియు సమంగ యనం బొలిచె నిందు స్నానదానాదికంబు సకలకిల్బిషాపహారం బిందుఁ దొల్లి భరతుం డభిషిక్తుం డై నచ్చోఁ గర్దమిలం బనుతీర్థం బయ్యె నింద్రుండు వృత్రాసురుని సంహరించి యలక్ష్మినిస్సరణార్థమిటఁ గృతస్నానుం డై పాపవిముక్తుం డయ్యె నిది వినశనం బనుమైనాకకుక్షి యిం దదితి పుత్రార్థిని యై తపంబు గావించె నివి కనఖలపర్వతంబు లలక్ష్మినిస్సరణంబు లిది గంగానది యిట సనత్కుమారుండు మున్ను తపించి సిద్ధిఁ బొందె నిది భృగుతుంగపర్వతం బిది పుణ్యాఖ్యహ్రదం బిది యుష్ణీగంగ యిది శిష్టాశ్రమం బిది రైభ్యాశ్రమం బిందు భారద్వాజుం డవక్రీతుం డనువాఁడు నిజగర్వంబున నశించె ననిన ధర్మజుం డావృత్తాంతం బంతయు సవిస్తరంబుగాఁ జెప్పు మనిన లోమశుం డతని కిట్లనియె.

అవక్రీతునిచరిత్రము.

సీ. కల రివ్వనంబునం • దొలుత భరద్వాజ,రైభ్యు లన్వారు మిత్రంబు లగుచు
రైభ్యున కిర్వు ర•ర్వావసువు పరావ,సువు నా నెనఁగుసుతుల్ • శుద్ధమతులు
ఘనుఁ డాభరద్వాజ•మునికవక్రీతుఁ డన్,సుతి కార మందిన•కొడు కొకండు
వాఁడు సాపత్యుఁ డై • వఱలురైభ్యునికీర్తి, విని లోన సైఁపక • వెగడు గుడిచి

తే, యాతఁడు సమిద్ధపంచాగ్ను•లందు నిలిచి, తపము గావించెఁ దత్తప•స్తప్తుఁ డగుచు నింద్రుఁ డరుదెంచి నీ వేల•యిట్టిఘోర,తప మొనర్చుచు నుంటివో•చెపుమనుటయు.

వ. అవక్రీతుం డి ట్లనియె. 166

తే. చదువకయ నాకు వేదముల్ • శాస్త్రములును, సర్వవిజ్ఞానములు గల్గఁ•సరణి నొందఁ దలఁచి తపియించుచుంటి ని•ట్లలఘుకీర్తి, యన నవక్రీతునకు నింద్రుఁ•డనియె మఱియు.

క. ఇది దారి కాదు విద్యలు, సదమలమతి సంగ్రహింప • సంయమివర్యా
చదువు మొకగురునితో నీ, వది మార్గ మటంచు నుడివి • యరిగెన్ దివికిన్. 168

వ. అవక్రీతుండు నుఘగక మఱియుం దపించె నపుడు దేవేంద్రుండు వెండియు లోచనగోచరుం డయి యీయాయశకార్యార్థసమారంభం బేల చేసె దుమగు మనిన నతం డతని కి ట్లనియె. 169

చ. ఉడుగు మటంచు మాటికి నయో వచియించెదు దేవరాజ నే
నుడుగుట కిచ్చగింపఁ దప ♦ ముల్లమునం గలకోర్కి దీర్పవే
గడఁగి యొకొక్కయంగకముగా నొడ లెల్లను గోసి వేల్తు ని
య్యెడ రెమునగ్నిమధ్యమున నయ్యెఁ దని పల్కిన వాసవుం డనున్. 170

వ. వానినిశ్చయం బుడిగించుట కుపాయంబు గాన కంతర్ధానం బై యంతలోన శతవర్ష
వృద్ధబ్రాహ్మణుం డై వడవడ వడంకికొనుచు నట నవక్రీతు నెదుట సేతుబంధనంబు సేయు
వాఁడుం బోలె గంగాప్రవాహంబున గుప్పిళ్లతో నిసుము చల్లుచుండె నవక్రీతుండు
ను వానిం జూచి నవ్వి యి ట్లనియె. 171

అవక్రీతుండు తపంబు చేసి విద్యలం బడయుట.

సీ.*అధికప్రయత్నమిం యిది యేమిపనిఁ బొనర్చుచు నుంటి నావుడు ♦ సురవిభుండు
తరణబాధ యడంగి ♦ తగుమార్గ మేర్పడ, గంగపై సేతువు ♦ గట్టు చుంటి
ననుడు నవక్రీతుఁ ♦ డవు నవు నది నీత్రరము గా దుడుగు ప్రవాహ మిది తలఁప
నన నింద్రుఁ డను నీసమారంభమునకును, నానసమారంభమునకును సరియ

తే. నా నవక్రీతుఁ డనియె నయ్యనూన మైన,నాసమారంభమును వ్యర్థ ♦ మైన నను నని
వలుకుచుంటివి కా దట్లు ♦ ఫలము విందు, ననుచు నుగ్రతపం బూనె ♦ నధికనిష్ఠ.

వ. అంత సహస్రాక్షుండు ప్రత్యక్షుం డై వాఁడు కోరినవరం బిచ్చి చనియె నంత నవక్రీతుండు
వేదవేదాంగవేత్త యై తండ్రికడకుం జని నాకు వేదశాస్త్రాదిసమస్తవిద్యలుం గరతలా
మలకంబు లయ్యె నని గర్వించి పలికిన నైనపక భరద్వాజుం డి ట్లనియె. 178

క. వరముల నొందితి ననుచున్, గరువం బిటు సేయరాదు ♦ ఘనుఁ డై యున్నన్
గరివించి చెన నశించును, బురుషుం డీగాథ వినుము ♦ బుద్ధిం దెలియన్. 174

సీ. పుత్రశోకార్తుఁ డై ♦ మున్ను బాలధి యను,తపసి వేల్పులఁ గూర్చి ♦ తపము చేసి
తన కమర్త్యుం డైన తనయుండు గలుగుట, కర్థించి పలికిన ♦ నమరవరులు
మర్త్యు లమర్త్యులై ♦ మాఱంగఁ బోరు నిమిత్తాయు వగుపుత్రుఁ ♦ డిత్తఱి నగు
నన బాలధియు నద్రు ♦ లగునంతదనుక దీర్ఘాయువై నాసుతుం ♦ డలరవలయు

తే.‡ననుడు న ట్లవుం గావుత ♦ మనుచు వేల్పు,లరిగి రంతట మేధావి ♦ యనెడికొడుకు
వాని కుదయించి క్రోధనుం డై నిరతము,వరజుఁ డగుటను దర్పించి ♦ వాఁడు మెలఁగె.

వ. అట్లు దేవదత్తవరగర్వదుర్విదగ్ధుం డగువాఁ డొక్కనాఁడు ధనుషాక్షుం డనుమునికులాధ్య
క్షునికడ నపక్రమంబునం బ్రవర్తించిన నతండు కనలి వాని వరనిమిత్తం బెఱింగి
మహిషంబులం జేసి మహీధ్రంబుల నెల్ల నున్మూలించి వానిఁ బరలోకంబునకుం బుచ్చెఁ

* తరణబాధ = దాఁటుకష్టి. ‡ వరజుఁడు = వరమువలనఁ బుట్టినవాఁడు.



గావున నీవు వరగర్వంబునం బొందఁబోవక మహావీర్యవంతుం డైన రైభ్యుని వానిపు
త్రులం గలహింప కుండునది యనిన నవక్రీతుం డట్ల యగుం గావుత మీవు దీనికిం
బరితపింప కుండు ననిరైభ్యుండు నాకు నిన్నుంబోనితండ్రివంటివాఁ డని తనతండ్రి నుప
శమింపం జేసి నిర్భయుం డై మహామునిజనసమూహంబున కప్రియంబుగా నఖిలప్ర
దేశంబులం బరిభ్రమించుచు నొక్కనాఁడు రైభ్యాశ్రమంబునకుం జని. 176

అవక్రీతుఁడు రైభ్యునికోపంబునం దెగుట.

చ. చిగిరించి పూచి కాచి కడుఁ ♦ జెన్నలరారెడువృక్షపఙ్క్తులన్
దగిలి నిరంతరంబును వసంతప్రియనాదసమంచితార్థ మై
సొగసుల కెల్ల నిల్లగుచు ♦ సొంపెసలారెడువనంబునన్
మొగిఁ గనియెం బరావసునిముద్దియ రైభ్యునిముద్దుఁగోడలిన్. 177

చ.*కని మదనజ్వరార్తుఁ డయి ♦ కానఁగ లేక భవిష్యదర్థమున్
మునిభయముం దలంపక నయనుం దగఁ బొందుము సుందరీ యనన్
వనరుహనేత్ర వానివలనన్ జలియించుచు శాపభీతి నీ
మన మగునట్లు యా ననుచు ♦ మామకడం జని చెప్పె నంతయున్. 178

వ. ఇట్లు చెప్పి దుఃఖించుమానవతి నూరార్చి రైభ్యుం డవక్రీతునిదుశ్చేష్టితంబునకుఁ
గనలి క్రోధానలదందహ్యమానమానసుం డై. 179

క. జడ పెఱికి యొకఁడు వహ్నిం, గడుకొని వేల్చును దానఁ ♦ గడు సౌందర్యం
బడరంగఁ దనదుకోడలి,బెడగుం బురుడించు నొక్క ♦ వెలఁదుక వొడమెన్. 180

క.‡మఱియొక్కజడను గినుకన్, బెఱికి హుతాశనునియందు ♦ వేల్చును నంతన్
గఱకరి యై యొకరాక్షసుఁ, డఱచుచు నుదయించె శూలహస్తుం డగుచున్.

తే.†ఇట్లు పొడమినవా రిర్వు ♦ రేమి సేయ,వలయు మే మెఱిఁగింపవే ♦ వాజ్మహాస్త్ర
యనుడు రైభ్యుఁ డవక్రీతు ♦ నడిచివుచ్చుఁ, డీరు నా నట్ల యగు నని ♦ యేఁగి రంత.

సీ.¶మునుమున్న కృత్యాఖ్యఁ ♦ బొనరునచ్చెలి యవక్రీతునికడ కేగి ♦ ప్రీతిఁ జూపి
వానిచేతం బొల్చుదానిఁ గమండలు,వును హరించెను మోహమునను ముంచి
దాన నుచ్ఛిష్టుఁ డై ♦ తబ్బిబ్బువడువాని, శూలాస్త్రుఁ డగుసోఁకు ♦ లీలఁ దాఁకెఁ
జంప వచ్చెడివానిఁ జూడఁ గనుంగొని, మునిసూతి భీతిలో ♦ మునిఁగి పఱచెఁ

తే. బఱచి పఱచి సరోవరాంభస్సులందు, మునిఁగి మన నెంచి యెందు జీవనము లేమి
వెఱచి పిత్రగ్నిగారము ♦ వెసఁ జొరంగఁ, బోయె నిట్టూర్పు మిన్నులముట్టికొనఁగ.

* భవిష్యదర్థమున్ = రాఁబోవుదానిని. ‡ గఱకరి = కౄరుఁడు. † వాజ్మహాస్త్ర = శాపాయుధ. ¶ సోఁకు = రాక్షసుఁడు. పిత్రగ్నిగారము = తండ్రియగ్నిహోత్రశాల.

క.*వోరీ బాలువాని నట నా,శరణద్వారమునఁ గాచు♦చరణజుఁ డుధుం
డురయంగ లేమి నాఁగెఁ, బరికింపఁగ విధివిధంబు ♦ బలవంత మయో. 184

ఆ. అంతలోన శూల♦హస్తుఁ డారాక్షసుం, డరుగుదెంచి వాని ♦ హతునిఁ జేసి
చని వచించి రైభ్యు♦ననుమతిఁ గొని కృత్య,తో మెలంగె నచటఁ ♦ బ్రేమ మీఱ.

వ. అంత భరద్వాజుండు నిజోటజంబునకు వచ్చి తనకుం దొంటివలె నభిముఖంబు గాక వైకృతంబునం బొందియున్నవీతిహోత్రు నుపలక్షించి గృహపాలుం డగు శూద్రువలనఁ దదుదంతం బంతయు నెఱింగి గతాసువై పడియున్నకొడుకుం జూచి. 186

సీ. చదువ కున్నను విప్ర♦జాతికి నెల్లవి,ద్యలు రాఁ దపించిన♦యలఘుమతివి
నీభక్తి నిరతంబు ♦ నేలవేల్పులయంద, నిలిపి యుంచెదునట్టి♦నిర్మలుఁడవు
భూతదయం గల్గి ♦ పొదలినసీ కిట్లు, దుర్మరణం బేల ♦ తొడర వలసె
రైభ్యునింటికిఁ బోకు♦రా తండ్రి యని యెంత,చెప్పిన విన వైతి ♦ విప్పు డకట

తే. యమునిఁ బోలినవాఁ డొక్కఁ ♦ డైననాఁడు,పుత్త్రినిఁ నిన్నుఁ గన లేక ♦ పొడవడంచెఁ
బుత్త్రశోకార్తి నింతయుఁ ♦ బొందఁ జాల,నేను నిదె నిన్నుఁ గూడెద ♦ నింతలోన.

చ. కటకట పుత్రశోకమునఁ ♦ గన్గొనఁ జాలక యెంత లెంతలుఁ
దటుకునఁ జేయఁ జూచెడిని ♦ దా నిల మానవుఁ డేఁ దలంపఁగాఁ
గుటిలుఁడనై మహాఘ మని ♦ కొంచెమయేనియు నెంచఁబోక లో
దిట చెడి దుష్టకార్యములఁ ♦ దెన్నునఁ బోవఁగ నుంటి నక్కటా. 188

వ. ఇట్లు పరిపరివిధంబులం బలవించి దుఃఖించుచు రైభ్యుండు నచిరకాలంబునఁ దన తనయునిచేఁ దెగుఁ గాత మని శపించి యవక్రీతున కగ్నిసంస్కారమ్ము చేసి తాను నానుసమిద్ధం బగుహుతాశనంబునం బడి దేహత్యాగంబు కావించె నంత. 189

సీ. అవని బృహద్ద్యుమ్నుఁ ♦ డనురాజు సత్త్రయా,గము సేయ సమకట్టి ♦ సముదయమున
రైభ్యపుత్త్రుల నిర్వు♦రఁ బుత్త్విజులు గా గ్ర,హించి తంత్రము నిర్వ♦హించునంత
నొకనాఁడు తనయింట ♦ నున్నసతిం గన, పేకువఁ జీఁకటి ♦ విడకమున్న
పఱతెంచుచును బరా♦వసుఁడు కృష్ణాజిన,సంవీతుఁడై వచ్చు♦జనకుఁ గాంచి

తే. మృగ మని వధించి తెలియుచు♦మిగుల వగచి,ప్రేతకార్యములను దీర్చి♦పితకు వెనుకఁ
జని నిజానుజునకుఁ జెప్పి ♦ సవనకర్మ, మీ వొకండవు నడపంగ ♦ లేవు గాన. 190

అర్వావసునివరప్రభావంబున నవక్రీతాదులు బ్రదుకుట.

వ. నే నొక్కండ నమపం జాలుదు నీవు నాకై వ్రతంబు పూని బ్రహ్మహత్యం బెడఁ బాపు మనుటయు నర్వావసుం డట్ల యగుం గావుత మని యగ్రజునకై తాను

* చరణజుఁడు = శూద్రుఁడు.



బ్రహ్మహత్యావ్రతంబు పూని జితేంద్రియుండై దానిఁ బరిసమాప్తి నొందించి యవల బృహద్ద్యుమ్ననియాగాయతనంబునకుం బోయినఁ బరావసుం డితండు బ్రహ్మహత్యాపాతకహతుండు వీనిదర్శనమాత్రంబున సత్రంబు చెడు ననిన విని రాజు వాని వెడలం ద్రోయించె నపు డతండు తనయగ్రజుండ కాని తాను దోషిఁ గా నని మొఱ వెట్టుకొనియు ఫలంబు గానక కాననంబునకుం జని తపను నాశ్రయించి పరమతపంబు గావించి యగ్నిముఖదేవతలం బ్రసన్నులం జేసి తద్వరప్రభావంబున సారవేదప్రతిష్ఠయు జ్యేష్ఠున కనాగస్త్వంబునుం బడసి రైభ్యభరద్వాజావక్రీతుల నెప్పటియట్ల బ్రదికించె నపు డవక్రీతుండు దేవతల కిట్లనియె. 191

క. చదివితి నెల్లవ్రతంబులఁ, బొదలించితి నిట్టినన్నుఁ ♦ బొడవడఁగించెన్
గడ రైభ్యుఁ డిట్టిశక్తికి, మొద లెయ్యది చెప్పుఁ డమర♦పుంగవులారా. 192

వ. అనిన వేల్పు లి ట్లనిరి. 193

చ.*గురుకులవాసముల్ సలిపి ♦ కొన్న ఫలించును వేదశాస్త్రముల్
గురుకులమందుఁ గ్లేశములఁ♦గుల గుదురై గడియించె విద్యలన్
వరమతి యైన రైభ్యుఁ డది ♦ వానికిఁ గారణ మయ్యె దీనికిన్
గర మలుగంగఁ బోకు మని ♦ క్రన్ననఁ బోయిరి వారు మింటికిన్. 194

వ. అని చెప్పి లోమశుండు వెండియు నిది యవక్రీతునిదివ్యాశ్రమపదం బిందలిస్నానంబు పాపప్రణాశకం బిది యుశీరబీజం బిది మైనాకం బిది శ్వేతపర్వతం బిది కాలశైలం బిది సప్తవిధం బైనగంగ యిది విరజస్స్థానం బిది మానవలోచనాగోచరం బివి దేవతలపాదచిహ్నంబు లిందు నష్టాశీతిసహస్రసంఖ్యాకులును ననేకరూపసంపన్నులును నానావిహారణపాణులు నగుగరుడగంధర్వకింపురుషయక్షరాక్షసాదులు యక్షేశ్వరుం డగుమాణిభద్రు సేవించుచుండు రివి యాతుధానరక్షితంబులును దుర్గమంబులు నగుపర్వతంబు లిది షడ్యోజనసముచ్ఛ్రితం బగు కైలాసపర్వతం బిందుఁ బ్రత్యహంబును యక్షరాక్షసకిన్నరపరిభృతులు కుబేరభవనంబునకుం బోవుచుండు రిట నీవు నాతపోబలంబునను భీమసేనభుజబలంబునను రక్షితుండ వయి యుండుము నీకు వరుణుండును యముండును గంగయు యమునయుఁ గైలాసంబును మరుతులును విశ్వదేవతలును వసువులును స్వస్తి యొసంగుదురు గావుత మనిన యుధిష్ఠిరుండు వానియపూర్వసంభ్రమంబు దిలకించి భీమసేనుం జూచి యి ట్లనియె. 195

* కులము = గృహము.

ధర్మరాజు భీమునితో గంధమాదనప్రయాణంబునకై విచారించుట.

చ. *ఇవి కడుదుర్గమాయనము ◆ లిందు మెలంగఁగ లేమ యజ్ఞసే
నవరసుతావతంస మని ◆ నామది కౌ నదిగాన నీవు నీ
నవలయు ధౌమ్యముఖ్యులును ◆ నవ్యరథంబులతోడ సారథుల్
కవలఁ గనిష్ఠుఁడున్ నిలువఁ ◆ గాఁ దగు మే మరుదెంచునంతకున్. 196

క. నేనును నకులుఁడు లోమశ,మౌనియుఁ జని పూని గంధ ◆ మాదనమునకున్
గానంగఁ బోయి వత్తుము, గాన న్నీ వబలఁ గావఁ ◆ గా నుండు మిటన్.

తే. అనినఁ బవమాననందనుం ◆ డనియె నిట్లు,రాక్షసాకీర్ణములు మహా ◆ గ్రావము లివి
యిందు నిను వీడి మే ముండ ◆ నిచ్ఛగింప,మర్జునుం జూచుబుద్ధియు ◆ నగునుమాకు.

చ. ఘనుఁ డగుఫాల్గునిం గనమిఁ ◆ గన్నులు గాయలు గాచుచుండె ని
వ్వనమున నిన్నును న్విడిన ◆ వంత దురంతము గాకపోవునే
జనసుత మేము నీ వనిన ◆ చందమున న్మెలంగ నోప మీ
వనజదళాక్షి నీ నుడికి ◆ వాంచె మొగం బిటు చూడు మర్మిలిన్. 199

తే. ‡సూతపౌరోగవులు రథ ◆ వ్రాతములును, ధౌమ్యముఖ్యులు మనవచ్చు ◆ దనుక వేచి
యెందునే నుండ నియమింపు ◆ మే ముముగుర,మనుసరింతుమునీయాజ్ఞ ◆ యగున యేని.

చ. నడువఁగ నేర కున్న సర ◆ నాథవతంసమ నేను ద్రోవదిన్
బుడుతల మాద్రినందనుల ◆ మూఁపునఁ గైకొని వత్తు నావుడున్
గడు ముద మంది ధర్మజుఁడు ◆ గాదిలితమ్ముని గౌఁగిలించి నీ
కడిమికి సంతసించితి నిఁ ◆ కన్ భవదిష్టవిధంబ యయ్యెడిన్. 201

వ. అంత లోమశుం డి ట్లనియె. 202

ఉ. నీవును భీముఁడుం గవలు ◆ నేనును నీజలజాతనేత్రియున్
బోవుద ముత్తమం బగుత ◆ పోనియమంబున గంధమాదన
గ్రావముఁ జేర నందు నరి ◆ కంతవిలుంతనదత్తు దక్షిణున్
దేవగణార్చితున్ విజయు ◆ నిం గనుఁగొందుము మిందు పొందు గన్. 203

వ. అని సంభాషించుకొనుచుం గదలి వారు ముందరఁ బ్రభూతగజవాజిసంకులంబును నానావిధకిరాతగణసమాకీర్ణంబును నగుసుబాహుపురమ్మునకుం జని కుళిందేశ్వరుం డగువానిచేఁ బూజితుం డై సూతపౌరోగవేంద్రసేనప్రభృతిరథవాజిగణంబులతో నం దుండ నియమించి ధనంజయదర్శనకాంక్షులై పాంచాలీసహితులై ధౌమ్యాది

* అయనము = మార్గము, యజ్ఞసేనుఁడు = ద్రుపదుఁడు.
‡ పౌరోగవులు = వంటలవారు.



భూదేవసమేతులై పాదచారులై గంధమాదనాభిముఖులై చని రంత ధర్మనందనుండు వాయునందనున కి ట్లనియె. 204

చ. తిరుగుచు నుంటి మిద్ధఁ గల ◆ తీర్థము లెల్లను బార్థదర్శన
స్ఫురణముపొంటె నేం డ్లయిదు ◆ వోయెను బోయి యతండు నేఁటికే
నరయఁగ రాఁడు చూడ నగు ◆ నంతికమం దనునానఁ జేసి యి
ద్దరు దగుకొండ లెక్కుటకు ◆ నై తపియింతుము గాదె తమ్ముఁడా. 205

సీ. పాకశాసను నైన ◆ వీఁక నెదుర్పఁ జాల్,బాహాబలంబునఁ ◆ బరఁగువాఁడు
సంగ్రామమున నైన ◆ శత్రుప్రసన్నుఁడై, యభయప్రదాత యౌ ◆ నట్టివాఁడు
కందర్పదర్పంబు ◆ కాదు కా దనిపించు,కాయప్రభాస్ఫూర్తిఁ ◆ గడఁగువాఁడు
దేవస్తుతం బైన ◆ దివ్యతేజంబున, నుత్తమశ్లోకుఁ డై ◆ యొప్పువాఁడు

తే, పొల్పునను వాసుదేవునిఁ ◆ బోలువాఁడు,ధైర్యమున మేరుతుల్యుఁడై ◆ తనరువాఁడు
జవమునను వాయుసముఁ డయి ◆ చనెడువాఁడు, దుర్జనచయైకభర్జనుం ◆ డర్జునుండు.

ఆ. *తమ్ముకుఱ్ఱ వాని ◆ దర్శన మగునంత, కంతరాత్మ తప్త ◆ మగుచు నుండు
నేల తడసెనొక్కొ ◆ యింతకాలము వాని,తోడ మనము కూడి ◆ మాడు టెపుడొ.

వ. అని చనుచున్నసమయంబున లోమశుం డిది మందరపర్వతమార్గం బిది దేవర్షినివాసయోగ్యం బిది బదరీప్రభవం బగుమహానది దీని నెప్పుడును వాలఖిల్యాదులు సేవించుచుందు రిటఁ బులస్త్యభృగుమరీచిప్రభృతులు సంతతసామగానంబులు సేయుచుందురు సిద్ధసాధ్యగరుడగంధర్వాదిదేవయోనిసమన్వితం బగు దేవేంద్రుం డిందు నిత్యకర్మంబు లొనరించుచుండు సూర్యచంద్రాదిగ్రహంబు లహోరాత్రవిభాగమ్మున నిమ్మహానది ననుసరింతురు. దీని నీగంగాద్వారంబున మహేశ్వరుం డుత్తమాంగంబున ధరించె నని చెప్పినఁ బాండవు లయ్యాకాశగంగ కభివాదనం బొనర్చి ఋషిగణపరివృతు లై కదలి నడచుచు నెదుటఁ బాండురప్రభల దశదిశల వెలింగించుచుఁ గైలాసప్రతిమానం బగుదానిఁ గని యిది యేమి యని యడిగిన లోమశుం డివి నరకాస్థులు వీనివృత్తాంతంబు చెప్పెద నాలకింపుఁ డని యి ట్లనియె.

సీ. నరకుఁ డన్దైత్యుండు ◆ సురలోకవిభుతకై, తగఁ బదివేలేండ్లు ◆ తపము చేసి
ఘనుఁడై సురల నెల్లఁ ◆ గాందిశీకులఁ జేయ, నులికి జిష్ణుఁడు విష్ణు ◆ నొద్ద కేగి
ప్రణతుఁడై వినుతించి ◆ రక్షోభయము దెల్పి, రక్షింపు మని వేఁడ ◆ నాక్షణమున
హరి సోఁకుకడ కేగి ◆ హస్తమ్ముతో నంటి, క్రోధనుఁ డై వానిఁ ◆ గూల నేసెఁ

* కూడిమాడు = కలసిమెలసియుండు.

తే. గ్గూల నేసినఁ జెన్నఁగొండ ♦ గూలినట్లు, కూలె నేలకు నరకుఁ డ♦క్కాలమునను
యెమ్ము లెల్లను రాశియై ♦ యెమ్మె మీఱె, వెండికొండ యనం దగి ♦ పాండవేయ.

హరి వరాహరూపంబున భూమి నుద్ధరించినకథ.

వ. మఱియు నిట శ్రీమహావిష్ణువు వరాహరూపంబున భూదేవి నుద్ధరించె నక్కథయుం
జెప్పెద నవధరింపుము. 210

తరళము. కృతయుగంబున నాదిదేవుఁ డొ♦గిన్ యమత్వము నొందుచున్
క్షితితలంబున భూతకోటులు ♦ చేటు లేక ప్రవర్ధిలన్
క్షితి తదీయభరంబు పెంపున ♦ గ్రిందికిన్ శతయోజన
స్థితి చెదన్ డిగఁ జాఱి కుందుచుఁ ♦ జెప్పె విష్ణున కంతయున్. 211

చ. శరణము సొచ్చి ప్రోవు మని ♦ తన్మనతి త న్నటు వేఁడ నామెకున్
హరి యభయప్రదాన మిడి ♦ యప్పుడ తాను వరాహమూర్తియై
గరిమ వహించి మించి తన♦కన్గొన నొప్పెడునొంటికొమ్మునన్
ధరణి సముద్ధరించి తగ ♦ దానిభరం బుడిగించె నెంచఁగన్. 212

ఆ. అపుడు భూతసంచ♦యము తల్లడిల్లంగ, వేల్పు లెల్ల వెగడి ♦ విధిసవిధము
నకు గమించి జగము♦లకుఁ గల్గునాపడి, విన్నవింప నతఁడు ♦ విని ముదమున. 213

ఉ. వారలఁ గాంచి యి ట్లనియె ♦ వారిజగర్భుఁడు వేల్పులార యా
ధారుణి భూరిభారమునఁ ♦ దా నొగిఁ గ్రుంగుడు నుద్ధరించె ల
క్ష్మీరమణుండు తద్రయము♦చే నిటు లయ్యె భయం బ దేటికిన్
మీరలు వోయి మ్రొక్కుఁ డత♦ని న్వెత దీర్చు నతండు మీ కటన్. 214

వ. అని చెప్పి పరమేష్ఠి సురపరివారపరివృతుం డయి హరిపరిసరంబునకుం బఱతెంచి సేవిం
చి చనియె నంత. 215

క. ధరణి ధరించినకతనన్, హరి శ్రీవత్సాంకుఁ డనఁగ ♦ నలరారి పురం
దరపరమేష్ఠిప్రముఖా, మరగణసంసేవ్యుఁ డగుచు ♦ మహిమం దనరెన్. 216

పాండవులు గంధమాదనపర్వతంబునకుం బోవుట.

వ. అని చెప్పిన న్విని పాండవులు ప్రహృష్టమనస్కులై తరలి నానావిధపర్వతారణ్యనదీ
నదాదులం దాఁటి చని చని ముందఱ. 217

మ. కని రప్పాండుమహీశ్వరాత్మజులు వేడ్కన్ ప్రాగుదీచీదిశన్
న్వనదంభోదపరీవృతోన్నతశిలా♦సాంద్రమ్ము రుంద్రావనీ

* ప్రాగుదీచీదిశ = ఈశాన్యము. రుంద్రము = విరివియయినది.



*జనితాంతోచ్చలదండజేంద్రరవని♦స్తంద్రమ్ము చంద్రాంశుమ
ద్ఘనివార్యంద్రము గంధమాదనమహా♦గోత్రేంద్ర మాత్తేంద్రమున్. 218

సీ. అనిశపుష్పఫలాంచి♦తానోకహాన్వితం, బమరగంధర్వస♦మావృతంబు
ధాతుమత్తటదిక్ప్ర♦తప్రభాకరము ప్ర, స్తరసమాకలితని♦ర్ఝరవరమ్ము
నిర్జరసంచార♦నిత్యభావితము నా, నావిధమృగపక్షి♦సేవితమ్ము
సురుచిరోన్నతశృంగ♦సుందరం బుత్తమ, మణిమయకందర♦మందిరంబు

గీ. పావనాశము పుణ్యాసం♦భరితదేశ, మప్సరోజనవాస్తవ్య ♦ మార్యసేవ్య
మవ్యయానందపథ మతి♦భవ్యవిధము, మహిమ నభివర్ణితము గంధ♦మాదనమ్ము.

ఉ. అట్టిమహోన్నతిం దనరు♦నగ్గిరి వారలు చేరఁ బోఱున
వ్వట్టునఁ జండమారుత మ♦పారరవంబునఁ బుట్టి రోదసిం
బెట్టుగ నిండె దానఁ బృథి♦విం గలభూతచయంబు దద్దఱన్
జెట్టులుఁ జేమలు న్విఱిగి ♦ చెన్నఱి సాల్పడె నల్పలంతులన్. 220

ఉ. గాలిక బిట్టు రేఁగి ధరఁ ♦ గల్గియు నల్గడఁ గ్రమ్ముకొన్నదు
మ్మోలిఁ దృణాశ్మచూర్ణమున ♦ నున్నతమై నభ మెల్లఁ గప్పె నా
భీలతలంబుగా నవుడు ♦ పెల్లగుదెంచినచిమ్మచీఁకటిన్
బోలఁగఁ దోఁప వాకసము ♦ భూమియు దిక్కులును న్విదిక్కులున్. 221

తే. †చిక్కనై క్రమ్ముకొని యున్న ♦ చీఁకటిఁ బడి
కన్ను మిన్నును గానరా ♦ కున్న వార
లొండొరుం బల్కఁ జూడంగ ♦ నోడి పోఁడి
చెడఁగ భయ మంది రెంతయు ♦ నెడఁదలందు. 222

తే. ‡మిన్ను విఱిగి పడెనొ యేమొ ♦ మేదిని పయి
మేదిని విభిన్న మయ్యెనో ♦ మేరుభూధ
రంబు గూలెనో యని భయ♦భ్రాంతు లగుచుఁ
జెట్లఁ జేమలఁ జేతులఁ ♦ జెలవికొనుచు. 223

క. చె ట్టొకఁడు పుట్టె యొక్కఁడు, గ ట్టొక్కఁడు పట్టి రపుడు ♦ కార్ముకధరుఁ డై
దిట్టవడి భీము డొండొక, చెట్టుకడం జేరెఁ గృష్ణఁ ♦ జెంతం గొనుచున్. 224

* నిస్తంద్రము = తంద్రలేనిది. మంద్రము = గంభీరమైనది. గోత్రేంద్రము = పర్వతశ్రేష్ఠము. ఆత్తేంద్రము = పొందఁబడినయింద్రుఁడు గలది; అనఁగా నింద్రుఁ డుండు నని భావము.

† పోఁడి = ఒప్పు. ‡ [illegible]

వ. అగ్నుల సంరక్షించుచుకొనుచు ధౌమ్యుండును ధర్మజుండును సహదేవుండును నొక్క వృక్షంబును లోమశ ప్రముఖ బ్రాహ్మణపరివృతుండై నకులుం డొక్కవృక్షంబును నాశ్రయించి యుండె నపుడు గాలి యుడిగి రజం బడంగినంత. 225

చ. పటుతరవజ్రముల్ పడెడు భంగి నభంగురనిస్వనంబునం
జిటచిటశబ్దముం గలుగఁ జిన్కులు నుర్మలు మెర్మములు న్మహా
త్కటగతితోడ సాంద్రకరకంబులతో నురుధార లొప్పఁ బ్ర
స్ఫుటముగఁ బెద్దవృష్టి పడె బోరనఁ గుండలఁ బోయునట్లుగన్. 226

మ. *ఘనసంపాతమునన్ జలప్రచయ మాగ్రావంబునం గ్రిగ్గినం
తనఁ బెన్వెల్లువ లై రయంబున నుపాంతద్రుమవ్రజం బెల్లఁ బె
ల్చనఁ గూలం గొని ఫేనసంతతులతో సంధిల్లి పాఱెం బ్రపా
తనితాంతోచ్చలనప్రభూతబహుశబ్దం బెల్లెడ న్నిండఁగన్. 227

ఆ. అంత గాలితోడ నారవ మంతయు, నుడుగఁ బల్లములకు నోడిగిల్లి
వారిపూర మెల్ల వడిఁ బాఱఁ దలచూపె, వేఁడివెలుఁగు లోకవిదితముగను. 228

వ. అంత నంతల నింతల నడఁగి మడఁగి యున్నవా రందఱు నొక్కటం గూడి క్రోశ మాత్రదూరం బరిగి రప్పుడు పాంచాలి పరిశ్రాంత యై సంచలించి నడువఁ జాలక నేలం గూలఁబడి మూర్ఛమునుంగుటయుం గని కురంగట నున్ననకులుండు దానిం బొదువుకొని యన్న కిట్లనియె. 229

పాండవులు ద్రౌపదీపరిక్లేశంబునకు వగచుట.

ఉ. డస్సి యిలం బడెం గను వడంకుచుఁ బాండవధర్మపత్ని తా
నిస్సిరొ దైవ మీమృగవరేక్షణ కిట్లు వడంగ వ్రాసె లో
ను స్సన నయ్యెఁ జూడఁ గరుణోదధి! నీ విటు వచ్చి తేర్పు మో
జస్సునఁ గూర్పు దీని నని సారెకుఁ బల్కిన సంభ్రమించుచున్. 230

వ. అపుడు భీమసేనసహదేవసమేతుం డయి ధర్మతనయుండు పఱచి వచ్చి వివర్ణవదన యగు నామెం దనయంకసీమం జేర్చుకొని దైన్యంబున. 231

చ. ‡కటకట ధర్మహర్మ్యములఁ గ్రాలెడుపాన్పులఁ బండ నొప్పునీ
కుటిలవినీలకుంతల కగుర్వొపువుం గలిగించుతాలపై
నిటఁ బడియుండ నయ్యె వనజేక్షణపాదము లెత్తివాటె మో
మటమట ప్రమంది కుందునటు లయ్యె వనంబుల సంచలించుటన్. 232

* క్రాగు = గ్రహించుట. ‡ అటమట = దుఃఖము. ప్రమంది = పోలు.



ఉ. పాండవపత్ని యై మిగుల భాసిలు నామత యించు నెంచి భూ
మండలమండనుండు నృపమాన్యుఁడు ధన్యుఁడు సోమకుండు ము
న్నండజయాన దీని మన కందఱ కిచ్చెను దమ్ములార మూ
ర్ఖుండను నేను నాకతనఁ గోమలి కిట్టులు వచ్చె నయ్యయో. 233

వ. అని దానిం గట్టుకొని బెట్టు వాపోవుచుండ ధౌమ్యప్రభృతిద్విజవరులు సనుదెంచి రక్షోఘ్నమంత్రంబు లుచ్చరించుచు నాశీర్వచనంబుల నాశ్వాసించి రంతఁ గొంతసేపటికి శైత్యోపచారంబుల సేద దేఱి లబ్ధసంజ్ఞ యైనయాజ్ఞసేనిం బాండవేయు లొక్కకృష్ణాజినసంస్తరణంబున విశ్రమింపం జేసి యల్లనల్లనఁ బాదసంవాహనంబు సేయుచుండి రపుడు యుధిష్ఠిరుండు భీమసేనుదిక్కు మొగం బై. 234

క. *హిమదుర్గమంబు లతివిష,మము లీపర్వతము లిందు మనకృష్ణ యిఁకన్
శ్రమ కోర్చి నడువ నేరదు, విమలమతిం దివురు మయ్య వెఱ వరయంగన్. 235

ఆ. అనిన భీమసేనుఁ డనియె నేఁ జాలుదు, నిన్నుఁ గవల ద్రుపదనృపకుమారి
మోచికొని చనంగ భూనాథ మనఘటోత్కచుఁడునుం గలండు ఘనుఁడు వాఁడు.

వ. అని వృకోదరుం డగ్రజననుజ్ఞ వడసి నిజనందనుం డగుహైడింబుం దలంచుటయు నంతలో నతండు రాక్షసపరివారపరివృతుండై వఱతెంచి పాండవులకును దక్కనుం గలబ్రాహ్మణోత్తములకును నమస్కరించి కృతాంజలి యై భీమసేనుం జూచి తండ్రీ తనయుం డెట్టిశుశ్రూష సేయ నర్హుం డానతిం డనిన నతండు వానిం గౌఁగిలించుకొని యి ట్లనియె. 287

తే. అలసె నీతల్లి యిది ద్రుపదాత్మజాత, దీని నోతండ్రి బలవంతుఁ డైననీవు
స్కంధమునఁ గొంచు నొకపీడ గలుగకుండ, మోచికొని రమ్ము మావెంట ముదముగదుర.

వ. అనిన ఘటోత్కచుం డివి సంకటమార్గంబు లగమ్యంబులు మీరును నడఁ జాలరేను మి మ్మందఱ నెత్తికొని వత్తు నని పాండవులం బాంచాలిని ధౌమ్యునిం దానును దక్కనబ్రాహ్మణులఁ దక్కనుంగలరాక్షసులును వహించుకొని చని రపుడు లోమశుండు సిద్ధమార్గంబునం జనియె ని ట్లందఱు నమందగమనంబున వనంబులు నుపవనంబులు నదులు నదంబులుఁ బర్వతంబులు దేశంబులునుం దాఁటి దాఁటి కైలాసపర్వతసమీపంబునందలిగంగాతీరంబున దివ్యపాదపశోభితంబును మహర్షిసేవితంబును నానాద్విజగణసమేతంబును దమోరహితంబును దుర్జనదుష్ప్రవేశంబును బలిహోమార్చితంబును దివ్యపుష్పఫలరవిరాజితంబును స్రుగ్భాండాగ్నిశరణసంయుతంబును సర్వ

* తివురు = త్వరపడు, యత్నించు.

భూతశరణ్యంబును బ్రహ్మఘోషనినాదితంబును సర్వశోకవినాశనంబును లక్ష్మీసమన్వితంబును బరమపవిత్రంబు నైన నరనారాయణాశ్రమంబు నై బదరీవనంబు లోచనగోచరం బగుటయు రాక్షసస్కంధావరోహణంబు చేసి భ్రాతృబ్రాహ్మణపరివృతుం డగుధర్మసుతుం డందుఁ దన్నెదుర్కొని యాశీర్వదించుమహామునీంద్రుల కభివందనంబు లాచరించుచుఁ జని స్వర్గోపమంబును సర్వదేవపూజితంబును నగునరనారాయణస్థానంబుఁ గని యట భాగీరథీజలస్నానంబు చేసి నియతవ్రతనిష్ఠాగరిష్ఠుం డై మైనాకంబును హిరణ్యశిఖరంబును బిందుసరోవరంబునుం జూచుచు నం దందు విహరించుచు నట్లు బదరీవనంబునం దాఱుదినంబు లర్జునదర్శనలాలసుం డై విశ్రమించి యుండె నప్పు డొక్కనాఁడు. 239

## భీముఁడు సౌగంధికహరణార్థంబు పోవుట.

మ. పవమానాత్మభవుండు భావ మలరం బాంచాలితోడ న్మహో
త్సవ మేపారఁగఁ గూడి పోయి యెలమిన్ సర్వర్తుపుష్పోజ్జ్వలం
బవునక్కాననమందుఁ గోయిలలు గూయం జిల్కలుం బల్కఁ గం
ధవహుం డల్లనఁ బుష్పవాసనల నీన న్మెట్టె నప్పట్టునన్. 240

తే. ఇట్లు విహరించుచున్నచో నెదుటఁ బడియె, వాతవేగాహతం బయి భూతలమున
నబ్బురము దోఁప దివ్యగంధాంచితము సహస్రపత్రాబ్జ మరుణబింబాభ మపుడు.

తరువోజ. అద్దివ్యకుసుమ మంబుజాక్షి వీక్షించి, యచ్చెరువడి దాని నట్టె చేఁ బూని
యద్దిర యని భీము నారసి యిట్టు, లనియె వల్లభ చూడు మతిరమణీయ
మిద్ది యపూర్వ మా నే దీనిఁ గొంచు, నేగి ధర్మజునకు నిచ్చెద మఱియుఁ
దద్దయు నిట్టి వీందరి నున్నఁ దెచ్చి, దయ నిచ్చి నాకు ముదము గూర్పు మిచ్చ.

వ. అని పలుకుచు నప్పువ్వుఁబోఁడి యప్పువ్వు నప్పువ్వుం ధర్మరాజుకడకుం గొనిపోయె నిట భీమపరాక్రముం డగుభీముండును భామినీమనోరథంబు దీర్ప నెంచి రుక్మపృష్ఠం బగుచాపంబును నాశీవిషోపమంబు లగునారాచంబులును ధరించి తత్క్షణంబ. 243

క. అరవిందముఁ గొనివచ్చిన, కరువలి కెదు రగుచు నరిగెఁ గ్రిస్సన మృగరా
ట్పరవిక్రమంబు మెఱయఁగ, గురువృషభుం డభయుఁ డగుచుఁ గుతుకముతోడన్.

క. మదగ్గొండవోలె నడచుచు, నదు గడుగున గంధమాదనాద్రిస్థలముల్
వడి నదరఁ జేయునాతనిఁ, కడిమికి భూతంబు లెల్ల గడగడ వణఁకెన్. 245

శా. నానాధాతువిచిత్రచిత్రితము నానాపాదపోపేతమున్
నానాజంతుసమూహసంకులము నానాపక్షినాదాంచితం



బై నల్వొందెడుగంధమాదనగిరిప్రాంతప్రదేశంబులన్
గానం బొల్చెడుచోద్యముల్ గనుచు వేడ్కం బోయె నాతం డొగిన్. 246

క.† సర్వర్తుకుసుమశోభిత, మూర్విజము తద్వనాళి నున్నతరీతిన్
గర్వించి కూయుకోయిల, నిర్వృత్తిధ్వని కతంబు నెమ్మది నలరెన్. 247

చ. చల్లనిమందమారుతము సౌరభమున్ వెదచల్లుచున్ బొలం
బెల్లెడఁ దాన యై కలయ నేచుచు వచ్చి పథిశ్రమంబు వో
నల్లనఁ దాఁకుడెంచుటయు నాతఁడు దానికి సంతసిల్లుచున్
మెల్లన మెట్టుచున్ జనె వనిం గలవింతల నెల్లఁ జూచుచున్. 248

సీ. సతతనృత్యత్కేకిసంఘసంభూతకేకారవంబులు వినినంత నలరి
దిగ్వారణవిషాణదీర్యచ్ఛిలాతల, ధాతుధూళీపాళిఁ దనరఁ దాల్చి
శాద్వలప్రవిచలత్సారంగసముదయ, చంక్రమణానందసరణిఁ దేలి
కోకూయమానపుంస్కోకిలకాకలీ, స్వరముల కెంతయు సంతసించి

తే. గమనవేగంబునం దారిఁ గలలతావితాన మెల్లఁ జలింప మత్తద్విపంబు
గతిఁ దలిర్చుచు గంధర్వకామినీని, రీక్షితుం డయి నడచెఁ బెంపెసఁగ నతఁడు. 249

మ.‡ అనిలప్రోద్భవుఁ డన్నగేంద్రమునఁ బ్రస్థాదుల్ ప్రకంపింపఁ బెం
పున నం దందుఁ బరిభ్రమించుచు మహాభూజంబులం గూల్చుచున్
దనమ్రోలన్ విహరించుసత్త్వసమితిన్ సత్త్వంబులన్ వేయుచున్
ఘనసత్త్వంబున నార్చుచుం జనియె దిగ్భాగంబు లల్లాడఁగన్. 250

చ. అశనిసహస్రపాతసదృశారవ మొప్పతిలంగ నార్చుచున్
దశదిశలున్ జలించె వసుధాధ్రగుహాగహనాగమాదులన్
భృశము వసించుసింగములు పెద్దపులుల్ మహిషంబు లెల్లులున్
శశకులు పక్షులు న్నాదరి పాఱె భయంబున సంభ్రమించుచున్. 251

వ. ఇట్లు గంధమాదనసానువులం జరించుభీమసేనుండు ముందట బహుయోజనవిస్తృతం బయి సురమ్యం బై నకదళీషండం బొండు గని యందు సొచ్చి ముచ్చటం జేసి బహుతాళసముచ్ఛ్రయంబు లగుకాంచనకదళీస్తంభంబుల నెల్ల నుత్పాటించి నృసింహుం డను గర్వించి క్రీడించుచు సింహనాదంబునన్ వెవరి పఱచుజలార్ద్రవిపక్షపక్షిసమూహంబులవలనఁ దెలియంబడినసరోవరంబునకుం జని యందుఁ గృతావగాహుం డయి వెడలి వచ్చి [illegible] విశృంఖలగతి విహరించుచు నొక్క-

† సర్వర్తు [illegible]. ‡ [illegible].

పాదపప్రాంతంబున నిలిచి సర్వప్రాణంబునం జేసి శంఖంబు పూరించి భుజాస్ఫాలనంబు సేయుటయును. 252

భీముఁడు హనుమంతుని దర్శించుట.

శా. *దానంజేసి భయంకరం బగుచు శ♦బ్దం బెంతయే నుద్భవం
బై నానాగిరిగహ్వరంబుల వడిన్ ♦ వ్యాపించి హర్మ్యంచు ధా
త్రీనాకంబుల నిండి మెండుకొనుచుం ♦ దిగ్దేశము ల్మ్రోసె నా
ధ్వానం బొప్పగ నాలకించి హనుమ♦న్నాముండు తత్రత్యుఁ డై. 253

మ. తనతోఁబుట్టువు భీమసేనుఁ డని చి♦త్తంబందు వాతాత్మజుం
డనఘుం డాతఁడు నిశ్చయించి యతనిన్ ♦ హర్షంబునన్ జూచుని
చ్ఛ నొకం డై చనుమార్గ మడ్డి కదళీ♦షండంబులం బండి యుం
డెను నిద్రించెడునట్లు పుచ్ఛమున శ్రో♦ణిం గొట్టి గుర్వెట్టుచున్. 254

క. †ఆలాంగూలాస్ఫోటా,ఖిలధ్వని గుహలనిండి ♦ భీప్రద మగుడున్
బోలించి భీమసేనుఁడు, లీలమెయిం జనియె నట కు♦లీవుమార్గమునన్. 255

వ. ఇట్లు చని యక్కదళీవనమధ్యంబునం దొక్కవిశాలశిలాతలంబున. 256

సీ. మెఱుపుతెఱంగున ♦ మెఱయుకన్నులవాఁడు, కపిలవర్ణాంగంబు ♦ గలుగువాఁడు
తామ్రజిహ్వికయును ♦ దామ్రాస్యము వివృత్త,దశనంబులుం గల్గి ♦ తనరువాఁడు
విమలేందుబింబంబు♦విధమున వెలిఁగెడు,కోలమొగము గల్గి ♦ క్రాలువాఁడు
కొన వంగి దీర్ఘమై ♦ తనురుహాంచిత మైన,లాంగూల మెసఁగఁ బొ♦సంగువాఁడు
తే. బలిసి హ్రస్వ మైనగళంబు♦బాహులతలఁ,గట్టుకొనిస్కంధభూయిష్ఠ♦కాయము నిరు
పేదనడుమును గడుఁ బొట్టి♦పెదవు లదరఁ, బొదలువాఁ డొక్కవానర♦పుంగవుండు.

మ. అచలంబో యన నేకమార్గమున క♦డ్డై వేఁడివెల్గట్లు వె
ల్గుచు నిద్రించెడువానరోత్తముని న♦క్కుంతీతనూజుండు గాం
చి చలద్భావుఁడు సింహసంహననుఁడై ♦ చేసెన్ మహోగ్రంబుగాఁ
బ్రచురప్రక్రియ సింహనాదము దిశా♦భాగంబు లల్లాడఁగన్. 258

సీ. ‡హనుమంతుఁ డాశబ్ద♦మున నల్ల నల్ల మే,ల్కాని కన్నుఁగవ విచ్చి ♦ కోపదృష్టిఁ
గని భీమసేను ని♦ట్లనియె నేమయ్య నన్,సుఖసుప్తు లేపితి ♦ ప్రాంపు విడిచి
మముబోఁటిమృగము లే♦క్రియమున మెలఁగినఁ, దగుఁ గాని నీ కిట్టు♦లగునటయ్య
బుద్ధిసంపన్నులై ♦ పుట్టినమానవుల్, మది భూతదయ గల్గి ♦ మనలుదుంద్రు

* తత్రత్యుఁడు = అచట నున్నవాఁడు. † ఉలివు = శబ్దము. ‡ ప్రాంపు = ఉచితజ్ఞత.



తే. *కొండికవు నీవు పెద్దలఁ ♦ గొలిచి ధర్మ,మనుగ్రహించి యెఱుంగ వో♦పురుషమూర్తి
నీ వెఱుంగవు నరులకుఁ ♦ బోవ రాని,పదము లివి యేటి కై తివి ♦ పలుకు మయ్య.
తే. సిద్ధగతి లేనివారికిఁ జేర♦ రాని, దవలితెరు వందునం బోవ ♦ నమరలోక
మమర నగుఁ జెప్పితిని గృపా♦యత్తచిత్త,మునను నమ్ముము నీకుఁ బోఁ♦బోలదవల.

వ. అమృతకల్పంబు లైనయీ ఫలంబులు భక్షించి మగిడిపొమ్ము చెడక నావచనమ్ము చేకొమ్మని ప్రబోధించిన భీమసేనుం డతని కిట్లనియె. 261

ఉ. ఈ వెవ రీప్లవంగతను ♦ వేటికిఁ దాల్చితి క్షత్రియుండ నే
నావరకౌరవాన్వయము♦నందుఁ బృథాసతికిన్ సదాగతి
శ్రీవలనం జనించితి ధ♦రిత్రిఁ గవీంద్ర వృకోదరాఖ్యకుం
డావల మైతి నావుడును ♦ నవ్వుచు నవ్వనచారి యిట్లనున్. 262

ఆ. వానరుండ నేను ♦ వాయునందన నీకు, నెడఁగ దొలఁగి మార్గ ♦ మిడఁగ నోప
నను దొలంచి చనుము ♦ నావలనన్ హాని, గలుగఁ బోదు నీకుఁ ♦ దెలిసికొనుము.

ఆ. ‡అనిన భీమసేనుఁ ♦ డనియె వైశస మగు, ననుచుఁ దలఁకె దయను ♦ నయ్య యిష్ట
మేని లేచి మార్గ ♦ మిమ్ము నావలన నీ,కును బొసంగఁ బోదు ♦ ఘనతరార్తి. 264

చ. అనవుడు నంజనీతనయుఁ ♦ డాతని కిట్లను నోయివాయునం
దన ఘనరోగపీడితుఁడ ♦ నా కిసుమంతయు లేచుశక్తి లే
దని వచియింతు నీ కరుగు♦నట్టిద యైనను నన్ను దాఁటి పొ
మ్మనుటయు భీమసేనుఁడు న♦యం బలరారఁగ వాని కిట్లనున్. 265

తే. నిర్గుణుం డగుపరమాత్మ ♦ నిన్నుఁ బోలి,కాయమును దాల్చి జ్ఞానవి♦జ్ఞేయుఁ డగుచు
నుండు వానికి నవమాన ♦ మొందు గాఁగ, దాఁటిపోఁజాలఁ గాకున్న ♦ మేటి నగుచు.

క. విను నిన్ను నీగిరీంద్రముఁ, గనుచుండఁగ నింతలోన ♦ ఘనజవనమునన్
గొని దాఁటి పోవ నోపనె, మును హనుమంతుఁడు మహాస♦ముద్రముఁ బోలెన్.

తే. అనుడు హనుమంతుఁ డేటికి ♦ వనధి దాఁటె, నీ వెఱుఁగుదువే నాకు♦ నెఱుఁగఁ జెప్పు
మన వృకోదరుఁ డతఁడు మా♦యన్న బలస,మన్వితుం డని వింటి రా♦మాయణమున.

ఉ. రామునిధర్మపత్ని నొక♦రాక్షసవీరుఁడు దొంగిలించి లం
కామహి నిల్వరించుటయుఁ ♦ గానల మెట్టెడురాముఁ దేర్ప నా
ఱామడ లొక్కపెట్టు లవ♦ణాంబుధి దాఁటి జవంబు పేర్పడన్
క్షేమ మెఱింగి వచ్చెఁ గపి♦శేఖరుఁ డాతని నీ వెఱుంగవే. 269

* ఏటి కైతివి = ఎందుకు వచ్చితివి. ‡ వైశసము = హాని.

క. ఏను వాయుకన్న కేన వత్తు • నిద్ధతేజ,మునఁ బరాక్రమమున నీకు • నెుత్తు శక్తి
గలను జూడుము లెమ్ము మా•ర్గమ్మొసంగు, ముదిక చెడకుమునా నుడి•సరకుగొనుము.
వ. అని భుజబలదర్పితుండును శౌర్యోన్మత్తుండు నై పలికిన భీమసేనున కలుగ కంజనీనంద
నుండు లోలోన నవ్వి యవ్వాయునందనున కిట్లనియె. 271
చ.*ముదుసలివాఁడ లేచి యొక•పాంతఁ జన న్మయి శక్తి లేదు నా
కెదఁ గరుణించి నా దయిన•యీచిఱుతోఁకను బాయఁ ద్రోచి త
త్పదమునఁ బొమ్ము నావుడును • బావని వానిని హీనసత్త్వుఁ గా
మదిఁ దలపోసి రోసి మద•మత్తత సత్త్వతఁ గ్రూరచిత్తుఁ డై. 272
శా.†లాంగూలమ్మునఁ బట్టి కొట్టి జముఁ గో•ల్వం బుత్తు నం చెంచి గో
లాంగూలేశ్వరు మెచ్చ కిచ్చఁ జెరకే•లం బట్టి లీలాగతిన్
జెంగం జేయఁగఁ బోయి చాల కవలన్ • జేదోయియుం జేర్చి పూ
న్కిం గైకొంచు నొకింతయేని కదుపన్ • లే కమ్మహాపుచ్ఛమున్. 273
ఆ. మొగ్గతిల్లఁ బడియుఁ • బాడవడంగి యతండు,స్విన్నగాత్రుఁ డగుచు • ఖిన్నుఁ డగుచు
నూర్పుగములు పుట్ట• నొదిగి గర్వము దిగఁ,ద్రావి హనుమ కనియెఁ•బ్రాంజలియయి.

—•—• భీమునకు హనుమంతుఁడు తన్నెఱింగించుట. •—•—

చ.¶తెలియక తప్పు చేసితిని • దేవరకు న్నను సైఁచి ప్రోవఁగా
వలయుఁ బ్రసన్నచిత్తమున • వానరరూపము దాల్చినట్టి నీ
విలపయి మెట్టుసిద్ధుఁడవో • బుద్ధిఁ జలిర్చెడుగుహ్యకుండవో
తెలుప ననుగ్రహింపు మరి•తిన్ భజియించెద శిష్యుఁడు నంటనే. 275
తరువోజ.%అనిన సంతస మంది •హనుమంతుఁ డిట్టు•లనియెన న్నెఱుఁగ లో•నభిలషించెదని
వినుము చెప్పెద నేను • విశ్వవిఖ్యాతి • వెలయు కేసరిపత్ని•విమలగర్భమున
ననిలాంశమునఁ బుట్టి • యఖిలజగంబు•లందు హనూమంతుఁ • డను పేరు గాంచి
ఘనుఁ డగుసుగ్రీవు•కడ మైత్రి వడసి • కాలంబు గడపిన•కపివంశజుండ. 276
సీ. ధరణి దాశరథి యై • హరి రామనామము, గ్రాలంగ నుదయించి • లీల నొప్పి
పితృశాసనంబున • సతితో ననుజుతోడ, దండకారణ్యంబు • దఱియ వచ్చి
రాక్షసేంద్రుం డైన•రావణుచే దారఁ, గోల్పోయి మిక్కిలి • కుతిలఁ గుడిచి
ఋష్యమూకంబున • నెపుడు వసించెడుసుగ్రీవుసఖ్యంబు • చులకఁ జేసి

* పావని = పవనపుత్రుఁడు. † లాంగూలము = తోక. ‡ గోలాంగూలము = కోఁతి
చెంగంజేయు = తొలఁగఁజేయు. ¶ అరితి = మారితి. % హనూమంతుఁడు—తరువోజవృత్తము.
Keep.



ఆ. వానియన్న యైన•వాలిని వధియించి•రాజ్యపదమునందుఁ • బూజ్యుఁ డైన
సూర్యపుత్రు మిత్రు • సుగ్రీవు నభిషిక్తుఁ, జేసి తత్పదమున • వాని కెక్క. 277
వ.*పట్టభద్రుండ డగుసుగ్రీవుండు రామభద్రు నర్ధాంగలక్ష్మి నన్వేషింప నెల్లచోటులకుం
గోటానఁగోటుల వానరవీరులం బుచ్చె నే నందుఁ గొందఱం గూడి పోయి దక్షిణా
ర్ణవంబు తూర్ణంబునం దాఁటి లంకాపురంబున సీతం గాంచి వచ్చి రామున కెఱిం
గించిన నతండును వానరబలంబులం గూర్చుకొని చని లోకవిద్రావణుం డగురావ
ణుం గూల్చి గుణవిభూషణుం డగువిభీషణునకుఁ బూజ్యసామ్రాజ్యం బొసంగి
సతితో సంపదుపేతం బగుసాకేతంబునకుం జని పట్టభద్రుం డై. 278
తే. తనయశంబు జగంబునఁ • దనరుచుండ,నంతదాఁకను నా కాయు • వలరునట్లు
వర మొసంగి మహాత్ముఁడు • పదునొకండు,వేలవర్షము లిల యేలి • వెనుకఁ జనియె.
వ. అది మొదలుగా నేను దేవగంధర్వవిద్యాధరసేవితుండ నై వారు గానంబునం
బ్రసాదించిన శ్రీరామచరితామృతం బారఁ గ్రోలుచు నిట నుంటి నిది మర్త్యుల కగ
మ్యం బగుదేవమార్గం బిందుఁ జనుచున్నని న్నెవ్వండు ధర్షించి శపించునో యని
నీమార్గం బిట్టు లరికట్టి చూపట్టితి ననిన భీమసేనుండు ప్రహృష్టమానసుం డై హను
మంతునకు సాష్టాంగదండప్రణామం బాచరించి యి ట్లనియె. 280
ఉ. ధన్యుఁడ నైతి నీ దయిన•దర్శన మబ్బుటఁ జేసి తేజగ
న్మాన్య కృతార్థుఁడన్ జగతి • నాసరివాఁ డొకరుండు లేఁడు నే
నన్యవరంబు వేఁడకొన • నైన సముద్రము దాఁటునాఁడు నే
దైన్యముఁ బొంద కె ట్లగునొ • తావకరూపము చూడ నెంచితిన్. 281
వ. అనిన హనుమంతుండు తమ్మునికి ట్లనియె. 282
క. అప్పుడు వెలసినరూపం, బిప్పుడు నీ వరయఁ జాలు•దే కాలగుణం
బెప్పుడు నొక్కవిధంబున, నొప్పదు ప్రతియుగమునందు • నొక్కవిధం బా. 283
వ. యుగధర్మంబులం జేసి కాలావస్థలు మాఱి ప్రభావాదులును మాఱుచుండు భూమియు
నదీనదంబులును నగంబులును వృక్షంబులును యక్షరక్షోగణంబులును దేవర్షిసంఘం
బులును గాలంబు ననుసరించి పరివర్తించుచుండు దురతిక్రమం బైనయీప్రధ్వంసన
కాలంబున నారూపంబుఁ జూపనుం గా దనిన భీమసేనుండు కృతాదియుగంబుల
లక్షణంబులు నాచారంబులు ధర్మంబులు నెఱింగింపు మనుటయు నతం డతని కిట్లనియె.

* తూర్ణము = శీఘ్రము.

—◆ హనుమంతుండు భీమునకు యుగధర్మంబులఁ జెప్పుట. ◆—

సీ.*కృతయుగంబునఁ గృత♦మే కాని కర్తవ్య, మది లేదు విను మట్టి♦యవసరమున
నాల్గుపాదంబుల♦ నడచును ధర్మంబు, వ్యాధు లాధులు లేక ♦ వఱలు జగము
క్రయవిక్రయములు ఋ♦గ్యజుస్సామములును వర్ణములు భిన్నభావముల్ ♦గలుగఁబోవు
మదమత్సరములు కా♦మము క్రోధలోభ మోహంబు లక్కాలంబు♦నందు లేవు
తే. జనులకు నసూయదర్పపై♦శునములు భయ,విగ్రహంబులు సంతాప ♦ మాగ్రహంబు
కలుగ దందఱు యోగుల♦గతి మెలంగి, పరమపద మందుచుందురు ♦ ప్రతిభ మీఱ.
ఆ. శ్వేతవర్ణుఁ డైన♦శ్రీమహావిష్ణువు, సకలభూతములకు ♦ సంతతంబు
నాత్మ యగుచు నేలు ♦ నక్కాలమునయందు, నిఖిలలోకములను ♦ నెమ్మి గదుర.
వ. కృతలక్షణులైన బ్రాహ్మక్షత్రియవైశ్యశూద్రవర్ణంబులవా రయ్యుగంబున సమాశ్రయ సమాచారసమజ్ఞానసమకర్ములు నేకమంత్రవిధిక్రియులు నేకదేవసమాయుక్తులు నేక వేదాశ్రితులు నేకధర్మాచరణులై కతత్పరులునై యకామఫలసంయోగంబునఁ జతురాశ్రమయుక్తకర్మంబులం జేసి పరమగతిం బొందుచుందు రిది త్రైగుణ్యపరివర్జితం బుత్తమంబు నగుకృతయుగంబునందలిప్రకారం బని మఱియు. 287
ఆ. త్రేతయం దొకండు ♦ దెగుఁ గాలు ధర్మమూర్తికి సురక్తవర్ణ♦దీపితుండు
విష్ణు వేలు జగము ♦ విశ్రుతధర్ములు, పుణ్యకర్మరతులు ♦ భూమిజనులు. 288
వ. అందు నిత్యసత్యనిరతులును దపోదానయజ్ఞపరాయణులు నై ప్రజలు స్వధర్మప్రవర్తకులై యుందు రీద్వాపరంబున. 289
చ.†పదముల రెంట ధర్మువు ప్ర♦వర్తిలు విష్ణువు పీతవర్ణుఁ డై
పొదలి జగంబు లేలుఁ బ్రజ ♦ పొం దఱి ముందరియట్లు సత్యముల్
బొదలుప లేక వేదమును ♦ మూఁడును నాల్గును రెండు నొండు గా
మదిఁ దలపోసి పెక్కు లగు♦మార్గములం బడి తొట్రు వొందెడున్. 290
తే. కామ్యకర్మనిరతు లయి♦కడఁగి యజ్ఞ,ములును దానంబులును దపం♦బులును సలుప
నెంత్రు ప్రజ లాధులున్ వ్యాధు♦లెపు డుపద్ర,వములుగలుగఁదపింతు రే♦వ్వలనఁగాని.
చ. కలియుగమందు ధర్మ వొక♦కాల మెలంగెడుఁ గృష్ణవర్ణుఁ డై
జలరుహనాభుఁ డేలుఁ బ్రజ ♦ సంతత మీతులు వ్యాధు లాధులున్

* కృతమేకానికర్తవ్యము—"కృత మేవ కర్తవ్యం తస్మిన్ కాలే యుగోత్తమే" అని మూలము.
† పొండఱి = పొందు విడిచి.



*గలుగఁ నరిప్రకాండ మది ♦ గాట మగుం జెడు వేదమార్గముల్
దొలఁచఁబడున్ స్వధర్మముల♦తో సవనాదులు సర్వకర్మముల్. 292
క.¶కలుగు నుపద్రవములు యుగ,ములు మాఱును ధర్మకర్మ♦ములు మాఱు జనుల్
ఖలు లగుచు బొంక జంకరు, తలక్రిం దగు నెల్లజగము ♦ తత్కాలమునన్. 293
వ. ఇట్లు యుగంబులపరివర్తనం బగు నని చెప్పి నీకు స్వస్తి యగుం బొమ్ము రమ్మనిన భీముండును. 294

—◆ హనుమంతుండు భీమునకు నిజరూపంబు జూపుట. ◆—

ఆ. నాఁటినీదురూపు ♦ నాకు దయామతిఁ, జేసి చూపకున్న ♦ భాసురాత్మ
యెట్లు పోవువాఁడ ♦ నెఱిఁగింపవే యన, నగుమొగంబుతోఁ ♦ బ్లవగవరుండు. 295
క. సాగరలంఘనవేళం, దాఁ గొనియున్నట్టిరూపు ♦ తనతమ్మునకున్
వేఁగనిప్రియమునఁ జూపంగాఁ గపివరుఁ డప్డు డెంచి ♦ కాయము పెంచెన్. 296
మ.‡అమితచ్ఛవ్యభిరామ మైనకపిదే♦హం బెల్లెడ న్నిండి భూ
ధ్రము పై పైఁ గన నొప్పఁ బుచ్ఛము దిగం♦తవ్యాపకం బై పరి
భ్రమముం జేయఁగ నంజనీతనయుఁ డ♦భ్రం బంటి యున్నట్టివిం
ధ్యమహీధ్రం బన నై భయంకరగతిన్ ♦ దర్పోద్ధతిం దానర్తిల్లెన్. 297
చ. దినకరమూర్తి యై దివము ♦ దిక్కులు పిక్కటిలంగ నిండి యుం
డినపవమాననందనుక♦డిందిశరీరముఁ గాంచి విస్మయం
బును భయమును బెనంగొనఁగఁ ♦ బూరుకులీనుఁడు భీముఁ డార్తుఁ డై
కనుఁగవ మోడ్చి దద్దఱిలి ♦ కాయ మెఱుంగ కొకింత నంతలోన్. 298
ఆ. హనుమ నగుచు భీము ♦ నరసి నామే నింతమాత్ర మయ్యెఁ గనుము ♦ శత్రులందు
డీనికన్న నెన్ని♦యేని రెట్లయ్యెడు, నవసరంబు వడిన♦యట్టిపట్ల. 299
ఆ.†అద్భుతంబు రాద్రి ♦ మై వింధ్యసన్నిభ, మైనహనుమదేహ ♦ మరసి యరసి
సంభ్రమించి వాయు♦సంభవుఁ డిట్లనుఁ, గేలుదోయి మోడ్చి ♦ కీశపతికి. 300
పంచచామరము. దివాకరుం డనంగ వెల్గు♦దివ్యమూర్తి నిం గనుం
గవం గనుంగొనంగ నోపఁ ♦ గాన శాంతిఁ బూని తొం

* గాటము = అత్యంతము. తొలఁచఁబడు = తొలఁగఁజేయఁబడు.
¶ తలక్రిం దగు నెల్లజగము = అనఁగా లోకమంతయు వ్యతిరేకభావమును బొందు నని తాత్పర్యము.
‡ అమితచ్ఛవ్యభిరామము = గొప్పకాంతిచే సుందరము. † కీశపతి = వానరాధిపతి.

* టివాసి నుండి నాదుశ్రీతిని న్వేలాత్ప మహియ్యక్కెదే
వివర్యు లైన నిన్నుఁ బోలువారి శౌర్యసంపదన్. 301

ఉ. ఇంతటినీవు రామునకు ♦ నేడ్గడ నై యనిఁ గూడి యుండఁగా
నెంతటిలెక్క రావణుని ♦ నేయుట లోపవమానసందనా
కొంతటిలోన నీ దయిన ♦ కోపలవంబు జగత్త్రియంబు నా
క్కింతకుఁ దే సమర్థ మగు ♦ నీ వమరుండవు వేయునేటికిన్. 302

వ. అని ప్రార్థించుచు వినయవినమితాంగుం డైనతమ్మునిం గాంచి లాలించుచు గోలాంగూలవల్లభుం డి ట్లనియె. 303

ఉ. తమ్ముఁడ నీవు చెప్పునది ♦ తథ్యము నా కలరాక్షసేంద్రు నా
లమ్మునఁ గూల నేయుట లలంతియ కాని రఘూద్వహుండు తా
నమ్మనుజాశిఁ జంపుటకు ♦ నై ప్రభవించుటఁ జేసి నాదుకా
ర్య మ్మటు లయ్యెఁ గానియెడ ♦ రక్కసిమూఁకల నుక్కడంపనే. 304

సీ. అని మఱియును నిట్టు ♦ లను నిది సౌగంధికవనమార్గం బగుఁ ♦ గాని వినుము
యక్షరాక్షసపరిరక్షిత మగునందుఁ, గుసుమాపచయము సాహసముతోడ
నలుపంగ వలదు వేల్పులు మాన్యు లెప్పుడుఁ, బూజింపఁ దగుదురు ♦ భూజనులకు
బలిహోమనతిమంత్రముల భక్తిఁ గొలువ వ్వారు ప్రసాదమొనరింతురు దయఁజేసి
తే. సాహసింపకు మీవు భాస్వత్స్వధర్మపాలనము సేయు మం దుండి ♦ పరమధర్మ
ముల నెఱుంగుము పెద్దలఁ ♦ గొలువకున్న ధర్మము తెఱం గెఱుంగఁగ దరము గాదు.

—•••◆ హనుమంతుండు భీమునకుం గొన్నినీతులు గఱపుట. ◆•••—

క. ధర్మ మధర్మం బనియు న ధర్మము ధర్మం బనియును ♦ దలఁతు రలంతుల్
నిర్మలమతు లగువా రాధర్మాధర్మముల తెఱఁగుఁ ♦ దడఁబడ రెఱుఁగన్. 306

తే. తలఁప నాచారమున నొప్పు ♦ ధర్మ మందు, వేదములు ప్రతిష్ఠితము లై ♦ వెలయు వేద
ములను యజ్ఞకర్మంబులు ♦ పొదలు నట్టియజ్ఞములఁ దృప్తులై వేల్పు లలరుచుంద్రు.

సీ. కవిబృహస్పతులవాక్యగతు లెఱిఁగి నయకలితు లై మానవుల్ ♦ మెలఁగ వలయు
వేదాధ్యయనదండవిహరణకృషివణిజ్యాగోవనములు ధర్మాభిధములు
ధర్మంబు చెడిన నీధరణి నిర్మర్యాద, మై నశించెడు నోలి ♦ నఖలజనము
నీవు క్షత్రియుఁడవు ♦ గావున రక్షణమే స్వధర్మం బని ♦ యెఱిఁగికొనుము

* వెలాప్పము = వెడలింపుము; ఉపసంహరింపు మని యభిప్రాయము.



తే. బుద్ధిమంతులు వృద్ధులబోధ లాని, దేశవృద్ధిక్షయంబులు ♦ దెలిసికొనుచు
నిగ్రహానుగ్రహంబులు ♦ నెగడఁ జేయ, లోకమర్యాద నిలుచు నలోల మగుచు.

వ. బుద్ధిమంత్రపరాక్రమంబులు గలరాజు సామదానభేదదండోపాయంబులఁ గార్యంబు సాధించునది గాని సాహసించుట సమ్మతంబును సాధుసమ్మతంబును గాదు కార్యంబు మంత్రిమూలంబు గావున బుద్ధిమంతులును విద్వాంసులు నైనద్విజులతో మంత్రించునది కాని స్త్రీమూఢబాలలుబ్ధలఘుజనులతో మంత్రించునది కాదు. 309

తే. *ధర్మకార్యములం దతిధార్మికులను, నర్థకార్యములందు విద్యాధికులను
గ్రూరకర్మములందు నక్రూరజనుల, స్త్రీలయందుఁ గ్లీబుల నిల్పఁ ♦ జెల్లుఁ బతికి.

చ. ‡ఎదిరిని ద న్నెఱింగి పృథివీశ్వరుఁ డెప్పుడు రాజ్యభారముం
బొదల ధరించి సజ్జనులపొందును విందును గల్గి వెల్గుచున్
సదమలవృత్తి భూప్రజ నజస్రము సాఁకి యశంబు గాంచు నీ
వదటునఁ గార్యముల్ సలుప ♦ నాత్మఁ దలంపకు నీకు మే లగున్. 311

వ. అని యనుగ్రహించి పలికి హనుమంతుం డమ్మహాదేహం బుపసంహరించి తనకుఁ బ్రదక్షిణించుభీమసేనుం గరంబులం దిగిచి కౌఁగిలించుకొని వానిశ్రమం బపనయించి సౌహార్దంబున బాష్పగద్గదవచనుం డై యి ట్లనియె. 312

ఉ. తమ్ముఁడ నీకతమ్మునను ♦ దాశరథిన్ స్మరియింపఁ గల్గె జ
న్మమ్ము పవిత్ర మయ్యె నలనాఁటిచరిత్రలు చెప్పుకొంటి ము
ల్లమ్మునఁ గౌతుక మ్మది సెలంగె నసుంగు నినుం గనుంగొనన్
నెమ్మి నెసంగె నా దయిననేత్రయుగంబు ఫలించె నెంచఁగన్. 313

శా. †భ్రాతృస్నేహముతో వరం బొసఁగెదన్ ♦ భవ్యార్థము ల్గోరు మే
నేతన్మాత్రములోన హాస్తినగరం ♦ బీకొండ తోఁ గూల్తునో
మీతో నాడ్డినధార్తరాష్ట్రులను భూమిం బాయఁగాఁ బుత్తునో
తోఁతేరం బ్రజ లంటఁగట్టి యిటకుం ♦ దుర్యోధనుం దెత్తునో. 314

వ. అని పలికిన విని భీమసేనుండు ప్రహృష్టాంతరంగుం డై. 315

ఉ. చెప్పినయట్లు చేయుటకుఁ ♦ జెల్లినవాఁడవు నీ కి దెంత మే
మిప్పుడు నీకటాక్షమున ♦ కెంతయుఁ బాత్రుల మైతి మందునన్
దప్పక ధార్తరాష్ట్రుల రణంబున మేము జయింతు మింక నో
యప్ప యొకళ్లు మా కెనయునట్టిరు లేరు ధరాతలంబునన్. 316

* క్లీబులు = నపుంసకులు. ‡ అదటు = గర్వము. † తోఁతెంచు = వచ్చు.

ఆ. అనుచు నాంజనేయుఁ ◆ డనియె నేరణమున, విజయుఁ డెక్కుమందు ◆ వెలుఁగుచుండి
పగఱఁ దాఁకునపుడు ◆ దగ మీఱు విజయంబు, గలుగఁ జూచుచుండుఁ ◆ గరుణఁ జేసి.

వ. అని వానికి సౌగంధికసరోవరమార్గం బెఱింగించి మించినవేడ్కం బోయిరమ్ము ప్రస్తావంబుల నన్నుం దలంపు మిట నాయునికి యేరికిం బ్రకటింపకుము నీవు వాయుపరిరక్షితుండ వగు మని చెప్పి యప్పు డంతర్హితుం డయ్యె నంత భీమసేనుండును హనుమంతు నంతరంగంబున ననుస్మరించుచు నమ్మార్గంబు పట్టి రమణీయంబు లగువనంబులు నుపవనంబులును సరోవరంబులును సరిద్వరంబులును లోచనగోచరంబు గాఁ బ్రవహించుచుఁ బ్రవర్షమేఘంబులం బోలియున్నమత్తవారణయూథంబులవలనను హరిణీసహితహరిణసమూహంబులవలనను జిత్తంబు మోదాయత్తంబుగా జని చని మహిమవరాహసింహశార్దూలనిషేవితం బగునగ్గిరిం దఱియం జొచ్చి కుసుమగంధబంధురంబులును ద్రుమపల్లవకోమలంబులును మారుతకంపితంబులును మహోన్నతంబులు నగుమహావృక్షంబుల నిరీక్షించుచుఁ గృతపద్మాంజలిపుటంబులును మత్తషట్పదసేవితంబులు నగుపద్మినీసముదయంబుల మజ్జమానమనోదృష్టి యై పోవం బోవ ముందర. 318

భీమసేనుండు సౌగంధికసరోవరం బరయుట.

ఉ. *రం గగునగ్గిరీంద్రశిఖ ◆ రంబునఁ గాంచె మరుత్సుతుండు సా
రంగరథాంగహంసబక ◆ రాజివిరాజిత మై ప్రతీరజో
త్తుంగతమాలసాలచయ ◆ తోరణభూషణభూషితంబు నై
బంగరుఁబద్మముల్ గలిగి ◆ భాసిలునొక్కనదీలలామముఁ. 319

తే. ఆవృకోదరుఁ డానదియందుఁ జూడఁ, గలిగె బాలార్కసదృశద్యు ◆ తుల వెలుంగు
నట్టిసౌగంధికవనంబు ◆ హర్ష మెసఁగఁ, గన్నుదోయికిఁ బండువు ◆ గాఁగ నపుడు. 320

వ. అట్లు కాంచి యక్షరాక్షసరక్షితంబై దివ్యసౌగంధికావృతంబై నానాపక్షిగణాకీర్ణంబై వివిధద్రుమలతాకులంబై హరితాంబుజసంఛన్నంబై విచిత్రభూతంబు నకర్దమంబై కైలాసశిఖరాభ్యాశంబున నున్నపుష్కరిణిచెంతకుం జని యందలినిర్మలజలంబులం గ్రోలి తదనుభావంబుల కత్యద్భుతంబు నమందానందంబునుం బొంది యుండె నానమయంబున. 321

మ. పదివే లొక్కట్రిధవళాహ్వయుల్ భుజబల ◆ ప్రత్యక్షవిద్విడ్గిరుల్
విదితోగ్రాస్త్రులు వల్కలాజినధరుల్ ◆ వీరు న్మరుత్సూనునిన్

* ప్రతీరము = తటము.



* గుదెదాల్పుం గని తజ్జలాంతికమునం ◆ దుల్ వీఁడు తో ల్ద్రాల్చియుల్
బద సౌశస్త్రముఁ దాల్చి వచ్చె నిట కేఁ ◆ వాఁ డేటికి న్వచ్చెనో. 322

వ. అని వారొండొరు వితర్కించుకొనుచు వృకోదరుం డాయ వచ్చి. 323

క. మునివేషధరుండవు చెంతను గల వాయుధము లెల్లఁ ◆ దడఁబడ కిటకున్
జనుదెంచి తేవఁడ వేటికిఁ, జనుదెంచితి చెప్పు మనుచు ◆ జడియక కలఁడుల్. 324

ఉ. పాండవుఁ డల్ యుధిష్ఠిరన్రు ◆ పాలునితమ్ముఁడ భీమసేనుఁ డన్
దండితశత్రులోకుఁడను ◆ దమ్ములుఁ గొమ్మయు నన్న నేను నీ
కొండకు వచ్చినార మొక ◆ కోన సమీరసమీరితాబ్జ మొ
క్కం డది నేత్రపర్వ మయి ◆ కాంతమనంబుఁ గరంగఁ జేయుడుల్. 325

తే. ఇట్టిసౌగంధికంబుల నెట్టులేని, గొన్ని కొనివచ్చి యిచ్చి నాకుం బ్రియంబు
సేయు మని యది గోరిన ◆ నీయెడకుఁ ద, దర్థ మరుదెంచినాఁడ బలాఢ్యులార. 326

వ. అనిన రాక్షసు లాతనిదిక్కు మొగంబై. 327

సీ: ఇది కుబేరునిపదం ◆ బిందుఁ గ్రీడించు నాతఁడు మర్త్యు లిట రాఁగఁ ◆ దగదు వినుము
దేవగంధర్వులు ◆ దివ్యర్షులును వాని, పరమాజ్ఞఁ గొనికాని ◆ తిరుగ రిచటఁ
గా దని చనుదెంచి ◆ కమలముల్ గొన నెంచి, నట్టిఁడు శిక్షకు ◆ నర్హుఁ డగును
ధర్మజానుజుఁడవు ◆ ధనదున కెఱిఁగించి, జలము లానుము పద్మ ◆ ములను గొనుము

తే, లేకయుండిన నీవు చూడ ◆ లేవు చనుము, నావుడును భీమసేనుఁడు ◆ నవ్వి వారిఁ
జూచి నే నేల యాచింతు ◆ రాచబిడ్డ, నయ్యు నాధర్మమును వీఁడ ◆ నౌనె చెప్పుఁడ.

వ. అని మఱియును. 329

చ. వనములు పర్వతంబులును ◆ వార్ధులు వాఁకలు నెల్ల వారి వై
తనరును గాని యొంకొకని ◆ తాతలసొమ్మన రా దెవండు నీ
వనజవనంబు స్వీయ మన ◆ వైచికొనండు కుబేరుఁ డెట్లు దీ
నిని దన దంచు నెంచుకొను ◆ నే నిట నేమసి వాని వేఁడనన్. 330

వ. అని రాక్షసుల నెల్లం గినిసి పలికి పవమాననందనుండు వలదు వల దని భర్జించువారి నరకుగొనక నళినీవనంబు సొచ్చుటయును. 331

భీమసేనుండు సౌగంధికసరోవరంబున యక్షరాక్షసుల నోడించుట.

ఉ. పట్టుఁడు కట్టుఁ డంచు వన ◆ పాలురు వారు మదోద్ధతిన్ గదా
పట్టసతోమరాసిముఖ ◆ బాఢతరాయుధముల్ గ్రహించి య

* తోలు = కృష్ణాజినము; (వనవాసదీక్షితుఁడు గావునఁ గృష్ణాజిన మని చెప్ప నొప్పు.)

వ్వట్టున నొక్కఁ బెట్టునఁ బ్రభంజననందనుఁ డాఁకుదెంచినన్
నెట్టన నుగ్రమూర్తి యయి నిల్చె నతం డశోకకొండకై వడిన్. 332

మ. యమదండప్రతిమాన మై సకలలోకాత్యంతభీమంబు నై
యమితోజోయుత మై మహాహన్నతము నై హాఠోర్వ్వందుదండంబు దు
ర్దముదోర్దండములం దమర్చి నిజదర్పం బేర్పడన్ భీముఁ డా
సమరప్రాంగణమందు గంటమిగిలెన్ సంవర్తకాలాకృతిన్. 333

చ. *వడముడి శత్రుశస్త్రముల వమ్ముగఁ జేయుచుఁ జేయి మీఁదు గా
నడచి గదాహతిన్ రిపుగణంబుల నోలిఁ బడల్పడంగ నే
యుడు బెగడొంది కుంది తమయున్నతి డిందఁగఁ గాందిశీకు లై
తడఁబడి వీఁగి సంభ్రమము దార్కొని పాఱిరి వారు భీరు లై. 334

వ. భీమసేనుం డట్లు క్రోధవశగణంబుల నెల్ల నశ్రమంబున నిర్జించి పుష్కరిణిం జొచ్చి యమృతపానంబు చేసి సుగంధబంధురంబు లగుసౌగంధికంబుల నెన్నియేనిం గొని యందు స్వచ్ఛందవిహారంబు గావించుచుండె నట్లు కాందిశీకు లైనవారు పోయి కుబేరున కావృత్తాంతం బెఱింగించిన నతం డది యంతయు నంతరంగంబున నెఱింగి సరోవరపాలకులం దిలకించి నేను వాని నెఱుంగుదు వాఁడు భీమసేనుం డనువాఁడు ద్రౌపదికై సౌగంధికంబులం గొనిపో వచ్చినవాఁడు మీరు వానియిచ్చవచ్చినయచ్చ న మెలంగనిచ్చునది యని చెప్పిపుచ్చె నంత నక్కడ. 335

ఉ. కరువలి పెల్లు రేఁగి తనుకర్కరకర్కశ మై కలంగి దు
ర్భరముగ వీచె నుల్కలి లరాలె నభోమణి మాసెఁ జీఁకటుల్
విరియఁగఁ బాఱె భూతములు బిట్టు వడంకెను బాంసువర్షముల్
గురిసె దెసల్ చలించెఁ బిడుగు ల్వడె నెల్లెడఁ దల్లడంబుగన్. 336

వ. ఇట్లనేకోత్పాతంబులు పుట్టినప్పుడు ధర్మనందనుం డది యేట్టిదియో యని నలుగడం గలయఁ బరికించి వడముడిం గానక పాంచాలిం గాంచి మహాసాహసారంభుం డగుభీముం డెందు వోయె నివి సంగ్రామసంరంభసూచకంబు లనిన విని ద్రౌపది వాని కిట్లనియె. 337

ధర్మరాజు భీమసేనుం గాన వచ్చుట.

తరువోజ. పసిఁడిసౌగంధికప్రసవంబు వాయుబలమునఁ బఱతెంచి పడియె నాచెంత
నదిదానిఁ గొని నేను వెఱఁగంది యిట్టివి మఱియుఁ గలవేని వేడుకయయ్యె

* చేయిమీఁదుగా = అతిశయముగా; చేయిమీఁదుగా నడచినపూర్ణకామఁడవు. అని పాండు రంగమాహాత్మ్యము. వీఁగు = యుద్ధమునుండి పాఱు.



నోసఁగుమి కొనివచ్చి యోమోహీర యనుచు నా యువతి పలికెను ప్రాగుత్తర మైన
దెస వట్టి చనె నది దేవర్ష యనుచుఁ దెలిసెఁ దెలిసిన యుధిష్ఠిరుఁ డంత.

క. అగుఁ గాక మనము నాతఁడు, తెరువమెయిం బోయినట్టితెరువునఁ బడి పో
వగు ననుచు ఘటోత్కచుఁ గని, తగవుమెయిం బలికె నిట్లు తాత్పర్యమునన్.

ఉ. తనయుఁడ నీదుతండ్రి కడుదవ్వుగఁ బోయె నటంచు నెంచెదన్.
ఘనతరసత్వసంపదలఁ గ్రాలెడు నాతఁడు వాతరంహుఁ డై
వనముల మెట్టి శాంతు లగువారల నీసరివారు నీవు నీ
జననిని మోచి తెమ్మటకుఁ బయ్యనఁ బోవుద మంచుఁ దెల్పుచున్. 340

వ. ఆఘటోత్కచుండును బరివారంబును ముందఱిచందంబున నందఱ నెత్తుకొని చని సౌగంధికసరోవరంబుకడం దివ్యుటయు నట భిన్నకాయోరుబాహుశిరోధరు లై కూలియున్నయక్షరాక్షసవీరులసమూహంబున సందష్టదశనుండును సంనద్ధుండును సామర్షుండును నై దండధరుండో యన మండిపడుచు దోర్దండంబుల నిజగదాదండంబు ద్రిప్పుకొనుచున్నవృకోదరుం గాంచి సమీపించి ధర్మనందనుం డానందకందళితహృదయారవిందుం డయి వాని నాలింగనము చేసికొని యిట్లనియె. 341

సీ. ఇట్లు సాహస మొనరించు టెన్న నీకు, నెల్లవేళలయందును జెల్లు నటర
తమ్ముఁడా నాకుఁ గూర్తేని నెమ్మనమున, నింక నెప్పు డిట్లు తెగింప నెంచ కయ్య.

వ. అని బోధించి వానియిచ్చినపద్మంబులు పుచ్చుకొని తత్తీరవనాంతరంబున విహరించుచుండె నయ్యవసరంబున నుద్యతాయుధు లగుకుబేరోద్యానపాలురు వచ్చి దర్శనం బిచ్చిన వారి ననునయించి తత్ప్రసాదంబునం జేసి ధర్మనందనుం డాగంధమాదనసానువులందుఁ గొంతకాలం బుండి కొండొకసమయంబున భీమసేనుం దిలకించి మన మీలోమశమునీంద్రుననుగ్రహంబునం గదా భూతలంబునం గలపుణ్యక్షేత్రతీర్థంబులు సేవించి పుణ్యచరిత్రంబు లెన్నియో విని కృతకృత్యుల మై గంగాద్వారంబు దాఁటి హిమవత్పర్వతంబు నతిక్రమించి నరనారాయణాశ్రమంబు ప్రవేశించి యీ వైశ్రవణావాసంబునకు రాఁ గలిగితి మిం దుండి యెందుఁ బో వచ్చునో యని పలుకుచున్నంత నశరీరవాణి యెల్లరును విన మీరు రిప్పై నరుగ శేరు మరలుం డని పలికిన వా రావాక్యంబు లాకర్ణించి పెండియు నరనారాయణాశ్రమంబునకు వచ్చి ఘటోత్కచుం బుచ్చి ఫాల్గునగమనాకాంక్షం జేసి యందు బ్రాహ్మణపరివృతు లై సుఖంబుండి రంత నొక్కనాఁడు జటాసురుం డనువాఁడు. 343

—— జటాసురవధపర్వము. ——

మత్త. బ్రాహ్మణాకృతిఁ దాల్చి యెంతయు ♦ భవ్యతేజముతో నటన్
బ్రహ్మవేత్తలఁ గూడి యుండిన ♦ పాండవేయుని చెంతకున్
బ్రాహ్మణుండ నటంచుఁ బల్కుచుఁ ♦ బండితుం డయి రాఁగఁ ద
ద్బ్రహ్మవృత్తి నెఱుంగ కాతఁడు ♦ చేరఁదీసెఁ బ్రియంబునన్. 344

ఆ. *ఆజటాసురుండు ♦ నతని సేవించుచు, నతనిధర్మపత్ని ♦ నతనిధనువు
నపహరింప నెంచి ♦ యంతరం బరయుచుఁ, జేయుచుండెఁ గొక్కు ♦ రాయిజపము.

క. నిపుణునఁ గప్పంబని, ప్పపునప్పాపాత్ము నెఱుఁగ ♦ కాధర్మసమ
ద్భవుఁ డప్పుడు పోషించెను, నవిమర్శము గాఁగ వాని ♦ సన్నిధిఁ గొనుచున్.

వ. ఇట్లుండ జటాసురుండును సానుచరుం డగుఘటోత్కచుండు తనగృహంబునకుం జని భీమసేనుండు మృగయార్థ మరిగి లోమశప్రభృతులు స్నానపుష్పాపచయార్థం బెడసి యుండ నెడ రెఱింగి భైరవంబును వికృతంబు నైనరూపాంతరంబు నేకరించి పాపుండై వారిశస్త్రాస్త్రంబులతో ద్రౌపదీయుధిష్ఠిరనకులుల నెత్తికొని తత్క్షణంబునం బఱచె సహదేవుండు వానిచేతం బట్టువడక తప్పించుకొని భీము నాక్రందనంబు నేసి పిలుచుచుం బోయె నవ్వ డజాతశత్రుండు రాత్రించరుం జూచి యిట్లనియె. 347

ఉ. ధర్మము పోకడంచి తది ♦ తప్పని యెంచవు రాక్షసేంద్రులున్
ధర్మము నాశ్రయించుకొని ♦ తారు మెలంగుట లీ వెఱుంగవో
దుర్మతి దేవదానవుల ♦ తో నగు నెల్లశరీరధారులున్
గర్మకు లైనమర్త్యులకుఁ ♦ గాదె భరింపఁగ నైరి చూడఁగన్. 348

క. హవ్యమునం గవ్యమునన్, భవ్యక్రియఁ గొలువఁబడి సు ♦ పర్వులు పితలున్
నవ్యగతి మర్త్యకోటులఁ, గ్రవ్యాద! భజించుచుంద్రు ♦ గాదె తలంపన్. 349

ఆ. అట్టిమనుజకోటి ♦ యం దేము రాష్ట్రము,లేలునట్టివార ♦ మిట్లు మాకు
నగ్గనేత నీకు ♦ లగ్గు గా దోరోరి,కలుషచిత్త యింత ♦ తెలియ వేర. 350

ఉ. గురులకు బ్రాహ్మణోత్తముల ♦ కున్ విభుసాళను లైనవారికిన్
వరదుల కన్నదాతలకు ♦ నమ్మినవారికి మిత్రకోటికిన్
నిరతము నిల్వ నీడ నిడి ♦ నెమ్మి భజించెడునట్టిమేటికిన్
దురితము నేయఁ బూను టది ♦ దుర్గతిహేతువు సూవె దుర్మతీ. 351

* కొక్కురాయి = బకము; (బకధ్యానము లోకప్రసిద్ధము).



క. పరమపతివ్రత యగునీ,హరిణాక్షిన్ ముట్టఁ దలఁతు ♦ వది తలపోయన్
దురితాత్మ విషముఁ ద్రావిన,వర వై నీమేన నుసురు ♦ వదలించుఁ జుమీ. 352

క. మాయందుఁ గుడిచి మా కిటు, సేయం దలపోయుకన్నఁ ♦ జెచ్చెర దేహం
బీమొద విడుచుట మే లో,హా యధముఁడ నీ వనంగ ♦ నాకపాళివాకో. 353

తరువోజ. నీచిత్తమం దిట్టి ♦ నీతి గాదేని ♦ నెఱి మాశరము లిచ్చి ♦ నీవు మాతోడ
నేది యుద్ధముచేయు ♦ మిటుఁ జేత నీకు ♦ నింతయుఁ జెల్ల దో ♦ రీ నింద వచ్చు
నీచాత్మ నిలిచెదు ♦ నీ కపకీర్తి ♦ నిక్కము చెప్పితి ♦ నే విను మంచు
నాచతురుఁడు వాని ♦ నది మొ శిరంబు ♦ నందు గమనవేగ ♦ మాఁగుటపొంచె. 354

వ. దానం జేసి జటాసురుండు భారాభిభూతుం డయి వడి నడంగియుండె. నాలో సహదేవుండు పఱచివచ్చి వెఱకుం డీమూఢునివేగం బే నాఁగుదు క్షత్రియుం డగువానికి శత్రువుం జంపు టొండెఁ గాదేని చచ్చుట యొండెఁ బరమధర్మం బీరాక్షసుండు నేఁడు పొద్దు గ్రుంకుటకుమున్న చచ్చెడుం గాక వెఱవ కుండుఁ డని తనవారి కభయంబు వలికి రాక్షసు నడ్డగించుచు నిట్లనియె. 355

ఆ. ఓరిరాక్షసాధ ♦ మా రంహముగ నిట్లు, పాఱె దేల నిలువు ♦ బాహుబలవి
నిర్జితాభియాతి ♦ నే సహదేవుఁడ, నీ వెఱుంగవోయి ♦ నెమ్మనమున. 356

క. అని కినిసి పలుకుతరుణం,బున నట కనిలాత్మజుండు ♦ భూరిగదాముం
డనమండితభుజయుగళుఁడు, చనుదెంచెఁ బ్రభంజనప్ర ♦ సర మేర్పడఁగన్. 357

—— భీమసేనుండు జటాసురుఁ బరిమార్చుట. ——

వ. ఇట్లు వచ్చి విప్పచ్చునగ్రజుండు జటాసురుం జూచి యిట్లనియె. 358

తే. నిన్ను నీవైఖరిం బట్టి ♦ నేను మున్న, నపసవగ నెఱింగితిఁ గాని ♦ చంపనైతి
నతిథి వై బ్రాహ్మణాకృతి ♦ నలరుచుంట, దోస మంచుఁ దలంచుటఁ ♦ జేసి తులువ.

తే. ఎగ్గు చేసితి కాన నీ ♦ విపుడు కాల,సూత్రలంబితబడిశమం ♦ దాత్రపడుచుఁ
జేప వై చిక్కుకొంటివి ♦ చెనఁటి వీవు, బకహిడింబులమార్గంబు ♦ పట్టు దింక. 360

వ. అని పలుక నలుక వొడమ నక్తంచరుండు కాలచోదితుండై తనశక్తిం గలవారలం డించి మించినక్రౌర్యంబున యుద్ధసన్నద్ధుండై భీమసేనుం జూచి. 361

శా. నీకై వేచి విలంబనం బగుగతిన్ ♦ నే నేగుచుంటిన్ బలో
ద్రేకం బేర్పడ నిన్ననిం గడపి నీ ♦ దోర్బాహ్యవాస్త్రంబునన్
వీకం జేసెదఁ దర్పణంబులను ము ♦ న్నీచే ధరం బడ్డను
శ్లోకుల్ రాక్షసవీరవర్యులనుసం ♦ శుద్ధాత్ములన్ శాంతిగన్. 362

మెఱిఁగి గవ్రిపుదమార • మును గవ్వనదటిబో, దెలసాంపు దిలకింప • నలరు మేను
బంగారుమేడల • రంగారునంపంగి, యారముల్ మది కిచ్చు • లూరఁ జేయఁ
తే. గేసరంబులఁ దగునాగ • కేసరములు, మంజులచ్ఛవి నొప్పెడు • వంజులములు
పొగడఁ దగుతావి నెగడెడు • పొగడగములు, నరయ నరయ మేఁ బరవశ • మౌను జూవె.
మ. నళినీషండసమంచితంబు లగుచుఁ • నల్పొందుపద్మాకరం
బుల నెల్లప్పుడు నీఁదులాడుచుఁ గడు • నామోదంబునం బొందున
క్కలహంసంబులఁ దీఁగయుయ్యెలల నూఁ • గం జేయుచుఁ సర్వజీ
వులకుఁ జీవన మైనవాయు వెవుడుఁ • బొల్పొందు నిందుం దగఁ. 374
క. మత్తమయూరము లెత్తటి, మొత్తములై పురులు విప్పి • ముద మెదఁ బొదలఁ
నృత్త మొనర్చుచు నార్చుచుఁ, జిత్తము లిగురొత్తఁ జేయు • శిఖరములందుఁ.
తే. రక్తపీతారుణంబులై • గ్రాలునట్టి, ఖగము లెల్ల మహీరుహా • గ్రముల నెక్కి
శ్రోత్రపేయంబుగాఁ గూయఁ • జూడుమదిగో, కన్నులపండువ యయ్యెడుఁ • గనుఁగొనంగ.
ఆ. పద్మకాంతితోడఁ • బరఁగి చౌదంతులు, మదకరేణువులను • గదిసి కదుపు
లగుచు నడచుకొండ • లనఁగ నిక్కొండపై, నిండియుండెఁ జూవె • దండితారి.
క. శతతాళసముత్సేధము, లతిసుందరధాతుయుతము • లగుగిరిశృంగ
ప్రతతులనుండి ధరం బడు, నతులితజలధార లరయ • నానందముగఁ. 378
వ. అని యనేకవిధంబుల నగ్గంధమాదనౌన్నత్యంబుఁ బ్రశంసించుచుఁ బాండునందను లం దందుఁ గలవిచిత్రంబు లరయుచుం జని ముందర ఫలపుష్పసమేతం బై పరమపవిత్రం బైనబుష్యాశ్రమంబుఁ గని యందు సర్వధర్మపారంగతుండును దపఃకృశీభూతసర్వావయవుండు నగునార్ష్టిషేణుం డనురాజర్షి నుపాసించుటయు నతండు దివ్యదృష్టిం జేసి వారి నెఱింగి గౌరవించి కూరుచుండ నియమించి ధర్మనందనుం గాంచి యిట్లనియె. 379

పాండవు లార్ష్టిషేణాశ్రమంబునకుఁ బోవుట.

చ. కురువర నీ వసత్యమునకుం జొరనీక మనంబు ధర్మమా
ర్గరతి నిలంగఁ జేయుచు వికారవిదూరుఁడ వై వెలుఁగుచుఁ
నిగతము తల్లిదండ్రులు గణించినవృత్తి నెసంగి వైద్యులఁ
గురువుల వృద్ధులం గొలిచి • కూరుతె వారికిఁ గోర్కి దీరఁగఁ. 380
తే. పితృపితామహు లరిగిన • గతిన నీవు, నరుగుచుంటివె ధౌమ్యు లాచార్యు లెల్ల
దిద్దిర ట్లీవు కర్మము • తెలుపు వట్టి, వెలుఁగుచుంటివె శోకము • వే లనంగ. 381



తే. జనని జనకుండు నగ్నియు • ననిలుఁ డాత్మ, యనెడునీయేవురను గొల్చు • నట్టివారి
కిహపరంబులు రెండు జయింపఁ గలుగు, నని యెఱింగితివే ధర్మ • తనయ నీవు. 382
క. అనుచుఁ ధర్మజుఁ డి ట్లను, మునివర నీచెప్పినట్లు • పుణ్యపథమునఁ
జన నెంతు యథాశక్తిఁ, ఘనుఁ డగుధౌమ్యుండు నాకుఁ • గలుగుటకతనఁ. 383
వ. అనిన నాఁగాత మని సంతసించుచు నార్ష్టిషేణుండు యుధిష్ఠిరుం జూచి వెండియును.
సీ. వాయుభక్షులు బుషుల్ • వైహాయసం బైన, గతి వచ్చి యీగిరిఁ • గాంచుచుంద్రు
శైలశృంగములందు • లీలఁ గింపురుషులు, తెఱవమిన్నలతోడఁ • దిరుగుచుంద్రు
గంధర్వవర్యులు • గానం బొనర్పంగ, నప్సరఃకామిను • లాడుచుంద్రు
పర్వసంధులయందుఁ • బణవశంఖకమృదంగ, ధ్వాన మిట వినం • గానవచ్చు
ఆ. నప్సరోగణంబు • లనిశంబు గొలువంగ, ధనదుఁ డరయ వచ్చు • ధరశిరమునఁ
బర్వసంధులందు • సర్వభూతములకు, నిందు నున్నయేని • యిందుకులజ. 385
ఉ. యక్షులు రాక్షసుల్ సురలు • నద్రిశిరంబునఁ గొల్వుదీరునా
యక్షపతిఁ భజించునమ • యంబునఁ దుంబురుఁ డున్నతక్రియా
దక్షుఁడు దేవతానములఁ • దంతులు మీటుచుఁ బాడుచుండ మే
మీక్షితిమండి విందు మెద • కింపు జనింపఁగఁ బర్వసంధులఁ. 386
వ. అని మఱియును. 387
తే. ఇంకమీఁద నశక్య మా • నేగ మీకు, నవలఁ గైలాసశిఖర మిం • పలరు నటకు
సిద్ధమునులకు మాత్రము • చెల్లు నరుగ, నెఱుఁగుదును గానఁ జెప్పితి • నింతపట్టు.
క. చాపలమునఁ జన నెంచిన, యాపురుషుని శూలపాణు • లై మదిఁ గ్రౌర్యం
బేపార నెల్లరాక్షను, లోపమి హింసించిపుత్తు • రోకురునాథా. 389
వ. కావున నీ విటనుండి ముందుఁ బోవ నెంచ కర్జునదర్శనం బగునంతకు నాయాశ్రమంబున నున్నకొలఁదిఫలంబు లాహరించుచు నుండుము నీకుఁ గార్యసిద్ధి యగు ననం బాండవు లాతనిశాసనంబున నందు నివసించి రసవంతంబు లగుఫలంబులును నానావిధమృదుమధురమృగమాంసంబులును మెసవుచు లోమశోక్తంబు లగుననేకకథలు వినుచు నైదవసంవత్సరం బతిక్రమింపం జొచ్చి రప్పు డొక్కనాఁడు మహాహ్రదనివాసి యగుబుద్ధిమంతుఁ డనుమహానాగుని సుపర్ణుండు హరించె దానం జేసి గంధమాదనం బంతయుం గంపించె నంత నయ్యద్భుతం బెల్లరుం జూచుచుండి రానమయంబునఁ బాండవులయెదుట గంధమాదనాగ్రంబునుండి గంధవహప్రేరితంబులై గంధవంతంబులును బంచవర్ణంబులు నగుదివ్యసుమంబులు కొన్ని పడిన వా రావూవులం

జేరి పరమానందభరితు నొంది రంత నేకాంతంబున నుర్వతోద్దేశంబున సుఖాసీనుం డగుభీమసేనుం గాంచి పాంచాలి యిట్లనియె. 390

భీముండు ద్రౌపదిపంపున నశ్వరథకు నుత్తరము జనుట.

తే. అశ్వరథ యనునదినుండి యతిజవంబు, గలసమీరునివలనఁ జెంగటను బడియెఁ
బంచవర్ణంబులై పేర్మి నెంచఁ దగి సు,గంధబంధురకుసుమముల్ గంటి కాదె.

ఉ. ఖాండవదాహకుం డగుచుఁ గౌశికముఖ్యుల గండడంచి త
మ్ముండును శౌర్యసంపదలు పొంపిరివోవ హిడింబముఖ్యులన్
భండనమందు వ్రేల్మిడిని బట్టి వధించిననీవు నన్ను మా
ర్తాండున కెత్తు వత్తురు ప్రతాపమహత్వమునన్ ధ్రువంబుగన్. 392

వ. కావునం జెప్పెద నాకర్ణింపుము. 393

శా. ఈశైలాగ్రము చిత్రరూపధర మై యింపొందెడున్ సుందరం
బై శస్తంబయి దానిఁ గన్గొనఁగ నాస్వాంతంబు వాంఛించుఁ బ్రా
ణేశా! బాహుబలాఢ్యులై నమిముబోంట్లేవంటిదేష్టార్థముల్
ధీశక్తిన్ భుజశక్తిఁ దీర్పఁ గలరర్థి న్వేఁడునిష్టాలికిన్. 394

వ. అని పలికినపలుకులు తన్నుల్లసంబాడిన ట్లయినం గనలి వృకోదరుండు గదయు ఖడ్గంబును ధనువును బాణంబులును ధరించి విగతభయక్లేశుండై శైలరాజంబు నాశ్రయించి విషమం బగునేకాయనంబున బహుతాళోచ్ఛ్రయం బగుతచ్ఛృంగం బధిరోహించి మించినవేడ్కఁ బర్వతాగ్రంబునకుం జని యందు సౌవర్ణప్రాకారపరివృతంబును గాంచనరత్నఖచితమహాసౌధసమలంకృతంబును సర్వోత్తమద్రుమసంచయోద్యానసమంచితంబును విలాసినీజననృత్యగానవిరాజితంబును మహావిభవవిస్తరంబు నగువైశ్రవణావాసంబునుం గని గంధమాదనసంభవం బై సుగంధబంధురం బైన గంధవహుం డల్లన నేదదేర్ప నొక్కచో విశ్రమించి ద్విషద్రోమహర్షణంబుగ శంఖధ్వానంబును ధనుష్టంకారంబును గావించె నంత. 395

ఉ. భూతము లెల్ల మూర్ఛిలఁగ బుట్టినపెట్టిదమైనతద్రవం
బాతతమై దిగంతములయందుఁ దాఁగి మ్రోసిన యక్షరాక్షసుల్
వాతతనూజుచక్కటికి వచ్చి గదాపరిఘాదు లూని వి
ఖ్యాతబలంబు డంబెసఁగ నాతనిఁ దాఁకిరి వీఁక సమ్మెదన్. 396

ఉ. వారికిఁ బోరు ఘోర మయి వర్ధిలె నప్పుడు వాయుసూనుఁ డ
ప్వారిగ బాణవర్షమును వారిపయిం గురియించి తద్బలా



పాతాళప్రభాపములను బగ్నములై పడఁ జేయఁ గ్రుద్ధులై
పొదివి రాక్షసేశ్వరులు యుద్ధపరాక్రమ మువ్వతిల్లఁగన్. 397

ఉ. *ఎక్కుడు బాణదాన మయి యేడ్తెఱఁ బాఱుచు భీమసేనుఁ డు
క్కెక్కి మహాస్త్రశస్త్రముల నెంతయుఁ బంతముతోడ నేయుచున్
జిక్కలి రక్తపాత మయి మేదినిపైఁ బ్రవహించ మొండెముల్
క్రిక్కిఱియంగఁ గూలి నటఁ గ్రిందును మీఁదును సందడింపఁగన్. 398

ఆ. ‡గాడ్పుపట్టి నెదురఁగా నోడి జక్కులు, రక్కసులు నపుడు పరాఙ్ముఖు లయి
చట్టొకండు గాఁగఁ జెచ్చెరఁ గొని పాఱి, రార్తు లగుచు బ్రదుకుదాసఁ జేసి. 399

భీమసేనుఁడు మణిమంతుఁ డనుయక్షనాయకుం జంపుట.

వ. †అంత యక్షేశ్వరసఖుం డగుమణిమంతుం డనురాక్షసుం డుక్కుమిగిలి గదాదండమండితకరుం డై యొక్కమనుష్యమాత్రుని కిట్లు చిక్కి విక్కబలిమిం బాఱుదురే మరలుం డిది ధనేశ్వరుండు వినిన నవ్వ డని తమబలంబుల నెల్ల నిలువరించుచుఁ బఱతెంచి భీముం దాఁకి ప్రతీకారంబుగా నిజబలపౌరుషంబులం జూపుటయును.

సీ. భీమసేనుఁడు మాఁడు భీమాస్త్రముల వానిఁ, గొట్టెఁ బార్శ్వమునందుఁ గ్రుద్ధుఁ డగుచు
వాఁడును దనవాఁడిపోఁడిమి మెఱయంగ, వాని భీముపై గద విసరి వైచెఁ
బదల మండుచు వచ్చుగదఁ గాంచి వడముడి, దోర్దతూపులు వైచి తుంచె దాని
మణిమంతుఁ డలిగి రుక్మపుదండమున నొవ్వ, శక్తిం బ్రయోగించె శత్రుమీఁద

తే. నదియు మండుచు వచ్చి వాతాత్మజాతు, దక్షిణభుజంబుపైఁ దాఁకి తత్క్షణంబ
తూలి పడ నేలపై నంతఁ గాలిపట్టి, క్రోధతామ్రాక్షుఁ డగుచును గొంత నవ్వి.

ఉ. కాంచనపట్టబద్ధ మయి క్రాలుగదం గొని భీమసేనుఁ డా
క్రంచుక వానిపైఁ బఱచి యేడ్తెఱఁ జూపుచు నున్న వాఁడునున్
మించి జ్వలించుశూలమును మీఁదఁ బడ న్వడి వైచె వైచినన్
ద్రుంచెను దాని ముక్కలయి త్రుళ్ల నతం డతిసత్వరంబుగన్. 402

క. ఏది ప్రభంజనతనయుఁడు, చూచెనునంతటన వాని స్రుక్కించి గదన్
దాఁచి వడి గరుత్మంతుఁడు, త్రాఁచుం బట్టె నొంపఁ జంపఁ దమి నేగుటయున్. 403

* ఏడ్తెఱ = పరాక్రమము; విజృంభణము. ఉక్కు = శౌర్యము.
‡ గాడ్పుపట్టి = పవనతనయుఁడు; భీముఁడు. జక్కులు = యక్షులు
† విక్కబలిమింబాఱు = విఱుకకు మరలి పాఱు.

వ. తత్క్షణంబ మణిమంతుం డంతరిక్షంబున నెగసి కినిసి భీమసేనుం దార్చుచుం జేర్చి
శివానిం గుఱి చేసి నిజగదాదండంబు విసరివేసిన నిర్వ్యాకులమనస్కుం డగుచు నాకౌంతేయుం
జేసి వాఁడు సింహనిహతం బయినకుండాలకుపోలిక నేలం గూలి కాలధర్మంబు
నొందె నంత నది యంతయుం గని హతశేషు లార్తస్వరం బెల్లదిక్కులం బిక్కటిల్లఁ
దూర్పుదిక్కునకుం బాఱి రంత నట నజాతశత్రుండు మహాఘోరగుహాముఖంబుల
మాఱుమ్రోయుమహాధ్వని విని భీమసేనుం గానక విమనస్కుం డయి ద్రౌపదివలన
వానిపోయినతెఱం గెఱింగి యామె నార్ష్టిషేణుకడం బెట్టి మాద్రేయధౌమ్యులో
మశప్రభృతిపరిజనపరివృతుం డై శైలాగ్రంబున కెక్కి కుబేరసదనసమీపంబున
గతసత్త్వు లై పడియున్న రాక్షసులనడుమ నడగొండవలె నడయాడుచు గదాధరుం
డై విక్రమించువృకోదరుం గాంచి కౌఁగిలించుకొని యిట్లనియె. 404

చ. చన దని చెప్పిన న్వినక • సాహస మిట్టు లొనర్చినాఁడ వో
యనుజ సురాహితం బది మ • హాపద కౌ నిటు లింక నెప్పుడుం
బొనరుపఁబోకు మయ్య మము • బోటులమాటలు పాటిసేయఁగా
నొనరుఁ గదయ్య నీ కెఱుఁగ • నోపని దుండు నటయ్య తమ్ముఁడా. 405

వ. అని ధర్మతత్త్వవిభాగజ్ఞుం డగుకుంతీపుత్త్రుండు తమ్మునిం బ్రబోధించుచుండె నంత
భీమసేనభయార్దితు లైనరాక్షసులు నిట్టూర్పుచుం బఱచి పోయి యక్షాధిపతిం
గాంచి. 406

మ. పరిఘప్రాసగదాసితోమరముఖ • ప్రస్తోత్రపాత్రాయుధో
త్కరముం దాల్చినయుద్ధకర్కశులు నీ • దండం బ్రవర్తించున
ట్టిరు వారెల్ల మన కేళికావనమునం • డీకొంచు మర్త్యుం డొకం
డురుతేజంబున నుక్కడంచె విను మ • హోగ్యా గుహ్యకాధీశ్వరా. 407

క. మును సౌగంధికసరసున, మనక్రోధవశాదిగణము • మడియించినయ
మ్మనుజుండె వెండి యిగ్గతిఁ, బొనరించినవాఁడు సువ్వె • పుణ్యజనేశా. 403

క. మణిమంతుండు నీమిత్త్రుఁడు, రణమున హతుఁ డయ్యె యక్ష • రాజ! కనం దా
రుణ మయ్యె నచ్చోటు మేము మరణమునకుం దప్పి యిట్లు • రా నైతి మయో.

వ. *అనిన విని క్రుద్ధుండై కుబేరుం డిది వానిరెండవయపరాధం బింక సైరకుండరా దని
యుద్ధంబు సేయ సన్నద్ధుండై గిరిశృంగోచ్ఛ్రితం బగునొక్క మహారథం బథిరో

• ఉచ్ఛ్రితము = పొడవైనది. చికీర్ష = చేయనిచ్ఛ.



హించి దేవగంధర్వసంస్తూయమానుండై బలంబులం గూడి కదలివచ్చి పాండుపు
త్త్రుం గాంచి దేవకార్యచికీర్షుం డౌటఁ బ్రీతుం డై యుండె నంత వారును వాని కభివం
దనంబులు సేసి వినయం బభినయించుచుఁ బ్రాంజలు లై నిలిచినం గాంచి సంతసించి
పుణ్యజనేశ్వరుండు భీమసేనుం బోధించుచు ధర్మనందనుం జూచి యిట్లనియె. 410

కుబేరుఁడు ధర్మరాజునకు దర్శన మిచ్చి సంభాషించుట.

చ. నరవర నీమతమ్ముఁ డిట • నాకపకారము సేసె నంచు నీ
వరమరఁ బొందఁబోకు మి • దంతయుఁ గాలమహత్త్వ మిందునన్
వరబలుఁ డైనవీనిచయి • నా కగు నల్కకు మాఱు ప్రీతి ము
న్నరుదుగఁ గుంభసంభవుఁ డ • హంకృతితోడ శపించె నిట్లుగన్. 411

వ. అని వృకోదరుదిక్కు మొగం బయి కృష్ణానిమిత్తంబున నీచేసినసాహసంబునకు
మెచ్చితి మాశాపవిముక్తి యయ్యె నని ప్రశంసించునవసరంబున ధర్మనందనుం
డక్కుబేరునకు దండప్రణామంబు చేసి యగస్త్యుం డేమిటికి శపించెం జెప్పు నను
గ్రహింపు మనిన నతం డతని కిట్లనియె. 412

తే. కుశవతీతీరమునఁ దొల్లి • విశదరీతి, వేల్పు లధ్వర మొనరించు • వేళ నేను
మూఁడుమూర్ల మహాపద్మ • ము లగుసంఖ్య, నలరుయక్షరాక్షసులతో • నరిగితి నట.

వ. *ఆకాశయానంబున నరుగునప్పుడు మార్గమధ్యంబున నగస్త్యుండు యమునాతీరా
రణ్యంబున నూర్ధ్వబాహుండై సూర్యాభిముఖంబుగా నిలిచి ఘోరతపంబు గావిం
చుచుండె నదిమెఱుంగక వానిశిరంబుపైఁ బడ నాప్రియసఖుం డైనమణిమంతుండు
నిష్ఠీవనంబు సేసిన నతం డలిగి. 414

చ. నను గని పల్కె నోయిధన • నాయక నీ విటఁ జూచుచుండ నీ
జనుఁ డిటు నాదుపై నుమిసెఁ • జాల మదంబున నుండెఁ గావునన్
మనుజుఁ డొకండు వాని క్షణ • మాత్ర వధించెడు నల్లసేనతో
విను మతనిం గనుంగొనిన • నీ దగుసేగియు నేగు నయ్యెడన్. 415

వ. కావున నే నీవడమొడికారణంబున శాపవిముక్తిం గాంచితి నని మఱియును. 416

సీ. ‡ధృతియు దాక్ష్యంబును • దేశకాలపరాక్ర, మమ్ము లైదు లోకతంత్రమున విధులు
ధర నీవిధు లెఱింగి • దక్షుఁడై క్షత్రియప్రవరుండు పాలించుఁ • బ్రజల నెల్ల
సర్వకర్మంబులు • సాధ్యముల్ వానికి, నిం దందుఁ గీర్తియుఁ • బొంది పోనగు
దేశకాలంబులఁ • దెలిసి విజృంభించి, వృత్రుని మొత్తె ముర • వేల్పుఱేఁడు

* నిష్ఠీవనము = ఉమియుట. ‡ ఇందు = ఇహలోకమందు; అందు = పరలోకమందు.

తే. [illegible]లును సాటిసమ్ముఁ • గిందు మీఁదు, నరయఁ జాలక తిరిగెదు వట్టివాఁడు
*నిరయమునఁ బడి కుందు • నీవు కాల,కావు నీక్షీయ దిద్దుము • దేవ [illegible].

వ. మీరారు వెండియు నార్ష్టిషేణాశ్రమంబునకుం జని యచ్చోట శ్రీకృష్ణు [illegible] బొక్కుచుండు నివసింపుఁడు మీరు మున్ను యోగంబునం జేసి గంధర్వకిన్నరయక్షరక్షోగణంబు లన్న పానంబు లిచ్చి పోషించుచుండు మిమ్ము ధర్మాని లేంద్రాశ్విలుం బోలె నెవ్వఁడును రక్షించుచుండు సర్వతత్త్వవిధానవిద్వరిష్ఠుండును గుణగరిష్ఠుండు నగు మీపాల్గునుండు స్వర్గంబునఁ గుశలియై సర్వసౌఖ్యంబు లనుభవించుచుండె దమ దాన బల బుద్ధి హ్రీ ధృతి తేజంబు లాతనియందుఁ బొందుపడియుండె జిష్ణుం డెన్నఁడు నన్నరునకు ననుకూలుండు గాని ప్రతికూలుండు గాఁడు దేవపితృగంధర్వమానితుం డగునతం డట నానావిధాస్త్రంబులు వడసి దేవహితుం డయ్యె మఱియు యమునాతీరంబున నేడు వాజిమేధంబులు చేసి పితృదేవభూదేవులం దృప్తులం జేసి వాసిగన్న మీపితృపితామహుం డగు శంతనుండు స్వస్థుండై శ్వేతవాహనునిచేతఁ జేతంబునం బ్రీతి నొంది సర్వదా మీకుశలం బడుగుచుండు నని చెప్పి వారినమస్కారంబులం గ్రహించి మీకు విజయం బగుఁ గావుత మని యాశీర్వదించి కృతాస్త్రుం డగుగుడాకేశుం డచిరకాలంబునన మీకడకు వచ్చు నని బోధించి కుబేరుం డనుచరసహితుండై యలకాపురంబునకుం జనియెఁ బాండవులును నార్ష్టిషేణాశ్రమంబునకు మరలివచ్చి సుఖంబుండి రంత. 418

—•—◆ ధౌమ్యుండు ధర్మజునకుం గైలాసాదులం జూపుట. ◆—•—

సీ. ఒకనాఁడు వేఁడివే • ల్పుదయించునవు డాహ్ని,కము దీర్చి ధౌమ్యుండు • కౌతుకమున
ధర్మజుం గని ప్రాగు • దగ్దిశం జూపుడు,వేలఁ జూపుచుఁ బల్కె • విశ్రుతముగ
రాజేంద్ర యిది మంద • రం బద్దిదనుక భూ,తల మావరించి యీ • ధరము తనరు
నింద్రవైశ్రవణు లె • ప్డీదిశ లేలుదు, రుందు రానందంబు • పొందుపడఁగ
తే. నిందు ధర్మజ్ఞు లగుఋషు • లెందఱేని
సిద్ధులును సాధ్యులును దమ్ముఁ • జేరి యుండ
నుద్యదాదిత్యు సేవించు • చుందు రెపుడుఁ
గాఁపురంబుండె నిజతేజ • మేపుమీఱ. 419

తే. †ఊనురుదాల్పుల కెల్లఁ దా • నొడయఁ డగుచు
దక్షిణం బగునీదెస • ధర్మమూర్తి

* నిరయము = నరకము. † ఊనురుదాల్పులు = జీవులు. సంయమని = యమునిపట్టణము.



సంయమనిపురి నివసించు • నంతతంబు
నరసి సర్వముఁ దీర్పఁ • దండి యుండు. 420

క. [illegible] యస్తశైల మనఁ బడు, నిది సాగర మిందు వరుణుఁ • డేప్రొద్దు జగ
ద్విదితమహాశ్వైభవమునఁ, బొదలుచు రక్షించు సెల్ల • భూతచయంబుల్ 421

సీ. అదె యుత్తరమున బ్రహ్మాదిసత్తరుల కిక్కు, యగు మేరుభూధర • మలరుచుండు
నందుఁ బితామహుం • డఖిలప్రపంచంబు, సృష్టి చేయుచు నుండు • నిష్టకీర్తి
నతని మానసపుత్త్రు • లగుదక్షసత్తముల్, సప్తర్షులును సుఖా • వాప్తిఁ గొలుతు
రట కింతదవ్వున • నత్యంతకాంతికి, సదన మై విష్ణుని • సదన మెసఁగు
తే. మేరుగిరికూర్పు డెన నిజా • మేయదీప్తి, దేవదానవదుష్ప్రేక్ష్య • మై వెలుంగు
నచట యతు లకుఁ గాక బ్రహ్మర్షులకును, లేదు గతి దాని వర్ణింప • లేఁ డొకండు.
చ. అరసి తపం బొనర్చినమ • హాత్ములు మోహవివర్జితుల్ యతుల్
కర మరుదంద నప్పురముఁ • గాంచఁగ నై యట దేవదేవునిన్
హరి భజియించుచున్ నిరత • మందె వసింతురు గాని వెండి యీ
ధరణిని రా రొకప్పుడును • దన్మహిమంబు నుతింప శక్యమే. 423

క. ఈశ్వరుఁ డాపురవరమున, శశ్వద్వైభవయుతోడ • నతతము భక్తా
నశ్వరవరఫలదుం డై, శాశ్వతుఁ డై వెలయుచుండు • సర్వస్తుతుఁ డై. 424

సీ. సూర్యుండు చంద్రుండు • చుక్క లామేరువు, జుట్టివచ్చుచు నుందు • రెట్టిపొడల
నర్కుఁ డస్తంగతుం • డై సంధ్య కడచన, నుత్తరంబును బొంది • యుదయమందుఁ
బ్రాఙ్ముఖుం డై మేరు • పర్వతంబును జుట్టి, చను మందరమున కాం • చాయ మగఁడు
దాన నేర్పడుచుండుఁ • దగ రేయి పవలును, మాసాయనములు క్ర • మం బెసంగ
తే. నినుఁడు మందరమార్గంబుఁ • గొనినయప్డు
భూతములతేజము గ్రహించు • భూమి నవుడు
స్వేదమును గ్లాని తంద్రియుఁ • జేరు జనుల
నిదురయును వారి సేవించు • నెమ్మి నపుడు. 425

క. ఉత్తరమార్గగతుం డై, యత్తపనుఁడు కురిసి వర్ష • మఖిలజగమునం
దత్తఱి భూతంబులకున్, జిత్తం బిగురొత్తఁ జేయుఁ • క్షేమంకరుఁ డై. 426

వ. ఇట్లు విచ్ఛిన్నగ్రహసంచారంబునఁ గాలచక్రం బేర్పడి పరివర్తించుచుండు నని చెప్పిన నంతసించి పాండవు లానగేంద్రంబున నర్జునదర్శనలాలసు లై సద్వ్రతంబు లాచరించుచుఁ గుబేరప్రేరితయక్షరాక్షసనేవితులును విచిత్రమాల్యాలంకృతులు నై నానా

విలాసభాసమానంబు లగుగిరిప్రదేశంబుల విచ్ఛావిహారంబులు సేయుచు శుకపికశో
కాదిస్వరంబుల కలరుచుఁ బల్లవితకుసుమితఫలితలలితరసాలాదినానాసాలసమంచి
తంబు లగువనంబులు దిలకించుచుఁ గుసుమగంధబంధురంబు లగుపుష్కరిణీసంబం
ధంబుల సేవించుచుండియు విజయవిరహసహ్యమానమానసు లై సతతం బానవ్య
సాచిన్ స్మరించుచు దిన మొకసంవత్సరంబుగఁ గడవ నీడువారి కట్ట నతికృచ్ఛ్రంబున
నొక్కమాసం బతిక్రమించె ననిన విని నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు
సెప్పు మని సూతు నడుగుటయును. 427

ఆశ్వాసాంతము.

శా. నానాగర్భములందుఁ బుట్టి జగతిన్ ♦ నానాదురాచారముల్
నే నెన్నో మితి లేక చేసి ఖలతన్ ♦ నిత్యంబు పాపంబులన్
జ్ఞానం బింతయు లేనిమూఢునిగతిన్ ♦ వర్తించితిన్ దాసుఁడన్
నానేరంబులు సైఁచి నన్నుఁ గరుణన్ ♦ రక్షింపు సర్వేశ్వరా. 428

గద్యము.

ఇది శ్రీమద్రఘునాథనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునం
దారణ్యపర్వంబునం బంచమాశ్వాసము
శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీ
బాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

ఆరణ్యపర్వము—షష్ఠాశ్వాసము.



*మన్మకీర్త్యలపురిన్
ప్రేమన్ శ్రీచంద్రమౌళి ♦ పృథ్వీశ్వరునిన్
గామించి ప్రోచుచున్నత
ధామా! సుగుణాభిరామ! ♦ దైవలలామా! 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కి ట్లనియె నట్లు యుధిష్ఠిరప్రభృతు లర్జున
దర్శనలాలసు లై గంధమాదనంబున నివసించి యున్నంత. 2

నివాతకవచయుద్ధపర్వప్రారంభము.

తే. త్రిదివమున నైదువర్షముల్ ♦ తేజరిల్లి, కత్తి పాశుపతాద్యస్త్ర♦కలితుఁ డగుచు
మించి యింద్రునిచే ననిపించుకొనుచు, గంధమాదనగిరి కిచ్చఁ ♦ గదలి వచ్చె. 3

ఉ. ఆతతదివ్యరత్నసము♦దంచిత మున్నతవాహనోహ్యమున్
మాతలిసంగృహీత మయి ♦ మానగుదివ్యరథంబు నెక్కి ఖ
ద్యోతసమద్యుతిన్ దెసల ♦ నొయ్యన వెల్గఁగ జేయుచున్ నరుం
డాతతి నార్ష్టిషేణునిమ♦హాశ్రమభూమికి వచ్చె ముచ్చటన్. 4

తే. అట్లు సంవత్సమేతుఁ డై ♦ యరుగుదెంచి, నరుఁడు వాహావరోహణ ♦ మొరిమఁ జేసి
ధౌమ్యధర్మజభీమపా♦దముల కెఱఁగి, కవలఁ గౌఁగిట నిడి కృష్ణ ♦ గారవించె. 5

క. తనరాక నలరుభ్రాతలఁ, గని మనమున సంతసిల్లి ♦ ఘనుఁ డాహరినం
దనుఁ డాయదనున నందఱి,నెనరునకుం బాత్ర మగుచు ♦ నెగడొందె నటన్. 6

వ. అంత వా రందఱు నయ్యింద్రరథంబున కభివందనపూర్వకంబుగఁ బ్రదక్షిణంబు గాన
రించి మాతలి నతిప్రీతిం బూజించి యంపివుచ్చుటయు నతండును వారి నభినం

* ధామము = ప్రకాశము.

దించి త్రిదివంబునకుం జనియె నర్జునుండును మహేంద్రదత్తంబులు మహార్ఘవంతంబు లగువిభూషణంబు లెల్ల నల్లనం బాంచాలి కొసంగి భ్రాతృబ్రాహ్మణపరివృతుం డై కానుం గామ్యకంబునుండి పోయి యింద్రకీలంబునం దపంబు సేయుటయు నింద్రుండు ప్రత్యక్షం బగుటయు భూతేశుండు పాశుపతం బనుగ్రహించుటయుఁ ద్రిదశాలయంబున కరుగుటయు శక్రాగ్నియమవాయువ్యక్షకృతులును మహాస్త్రంబు లొసంగుటయు లోనగువృత్తాంతం బంతయుం జెప్పి యారాత్రి మాద్రీమతమధ్యగతుండై పండుకొని నిద్రవోయె నంతఁ బ్రభాతంబున నెల్లరు నజాతశత్రుం బరివేష్టించి సుఖోపవిష్టు లై యున్న యవసరంబున. 7

ఇంద్రుండు పాండవులకడకు వచ్చుట.

చ. దివమున దేవదుందుభుల♦దివ్యనినాదము శంఖనాదముల్
బ్రవిమలఘంటికారవము ♦ రథ్యరథస్వన మొక్కఁడై వినం
దవిలిన నివ్వెఱంపడుచుఁ ♦ దద్గతి నారయుచుండునంతలో
రవిశతమో యనం బొలిచె ♦ రమ్యవిమానము లెన్నియేనియున్. 8

ఉ. అంతట నప్సరోగణస♦మంచితుఁ డై సురసిద్ధసాధ్యు ల
త్యంతవిభూతితోఁ దనరి ♦ తన్ను భజింప హరిప్రయుక్త మై
సంతతమేఘనాదమున ♦ జా నగుదివ్యరథంబు నెక్కి లో
నెంతయు సంతసంబున మ♦హేంద్రుఁడు పొల్చెఁ దదంతికంబునన్. 9

తే. అట్లు పొల్చి రథావరో♦హణ మొనర్చి
నట్టివాని నెదుర్కొని ♦ యర్ఘ్యపాద్య
విధుల నర్చించి సేవించె ♦ వినయమునను
దమ్ము లందఱుఁ గూడి రా ♦ ధర్మసుతుఁడు. 10

వ. అట్లు పూజితుండై దేవేంద్రుండు వారి నభినందించుచు ధర్మనందనుం జూచి యి ట్లనియె. 11

ఉ. పాండుకుమార నీ వవని♦పాలనముం బొనరించి సౌఖ్య ము
ద్దండయశంబు నొందెదవు ♦ తద్దయు నానుడిఁ గామ్యకాటవిన్
వెండియుఁ జేరఁ బొమ్ము జన♦విశ్రుతుఁ డీవరుఁ డెల్లశత్రులన్
జెండు నజయ్యుఁ డేరికిని ♦ జెప్పితి నీకి నే మహాస్త్రముల్. 12

వ. ఇతండు నాకుఁ గృతప్రియుండు నే నింకఁ బోయి వచ్చెద నని హర్షంబు నొందుచు మహర్షిజనసంస్తూయమానుండై దేవేంద్రుండు దివంబునకుం జనియె. 13



తే. పాండవులఁ జూడ నింద్రుండు ♦ వచ్చె నట్టి,పట్లు నియమవ్రతంబునఁ ♦ బట్టి యొక్కఁ
డేఁడు చదివిననరుఁడు నా♦కేండ్లు బ్రతుకు, బాధ లేక సుఖంబుగా ♦ నీధరిత్రి. 14

వ. అ ట్లింద్రుండు చనినవెనుకఁ గృతాంజలి యై యున్న ధనంజయుం జూచి ధర్మతనయుండు పరిహృష్టాంతరంగుండై మూర్ధాఘ్రాణంబు చేసి యి ట్లనియె. 15

శా. ఈకాలం బెటు లేగ స్వర్గమున నీ ♦ వేరీతి నస్త్రంబులం
జేకోఁ గల్గితి విందురిఁ డీశ్వరుఁడు నీ♦చే నెట్లు వీక్షింపఁగా
నై కారుణ్యముఁ జూపి రేకరణి నీ ♦ వాయిందురి మెప్పించితో
నా కీయంతయునున్ సవిస్తరముగ ♦ న్వాకి మ్మటం దమ్ముఁడా. 16

వ.*అనిన నర్జునుం డన్న కి ట్లనియె. 17

అర్జునుం డన్నతోఁ దన యీశ్వరుఁడు ప్రత్యక్షమైనవిధం బెఱింగించుట.

సీ. దేవ నీచెప్పిన♦తెఱఁగున నేఁ బ్రతిస్మృతిఁ గొని భృగుతుంగ♦శిఖరి కరిగి
యొక రేయి నివసించి♦యుండి కాంచితి వృద్ధవిప్రుఁడై వచ్చిన♦విబుధనాథు
నతనిపంపున శైశి♦రాద్రికిఁ జని శివు, నర్చించి చేసితి ♦ నధికతపము
ఫలమూలములు దిని ♦తొలినెల జల మాని,మఱునెల కుడువ కా♦మఱునెలయును

తే. గడపి నాల్గవనెలనూర్ధ్వ♦కరుఁడ నగుచు, నిలిచి తపియించిని గడు ♦ నిష్ఠఁజేసి
యిట్లు తీవ్రతపం బున్న♦యేని నాకుఁ, జేవ దఱుఁగదు విస్మయం ♦ బావహిల్లు. 18

వ. ఇట్లు నిరాహారంబుగఁ జతుర్థమాసంబునుం గడవనీది పంచమమాసంబున నొక్కదివసంబు గడపితి నమ్మఱునాఁ డరుణోదయంబున. 19

ఉ. పంది యొకండు నాకడకు ♦ వచ్చెను హెచ్చుగ ఘుర్ఘురించుచున్
సందడి సేయుచుం బుడమి ♦ జర్జరితంబుగ ముట్టెఁ గొట్టుచున్
ముందఱఁ గాళ్ల దు మ్మెగురఁ ♦ బోయుచు నమ్మున నేల రాయుచున్
గ్రందుగ నిప్పుఁ గ్రక్కుచును ♦ గ్రక్కదలాడెడుకొండయో యనన్. 20

వ. అట్లు వచ్చినం జూచి నేను. 21

ఉ. అమ్ములఁ బూని యున్నసమ♦యమ్మున దానిని వెంబడించుచుం
గొమ్ములతోడ నొక్కయెఱు♦కుందొర తొందర మీఱ వచ్చి వా

* ఇట మూలమున విపులముగా వర్ణింపఁబడి యున్నది. ఈకథయే ము న్నొకసారి యీపర్వము లోని 57 వ పద్యము మొదలుకొని వర్ణించి యుండుటచేఁ బునరుక్తమగు నని యిట నిట్లు సంక్షేపింపఁబడినది.

లమ్మునఁ బంది నేసి నవు ♦ డారసి యేసితి నేను రెండుబా
ణమ్ములు నేకకాలమున ♦ నాటుకొనెం గిటిమేన మానుగన్. 22

సీ. మాయాకిరాతుఁ డా♦మై నున్నవాఁ డని, ధర్మవిరుద్ధంబు ♦ దలఁచి తనుచు
నలిగి నాపైఁ బెక్కు ♦ లగుతూపు లడరించె, నేను నించితి వాని♦మీనఁ బెక్కు
లమ్ములు వేవిధముల ♦ నతఁడు గన్పట్టె నే,సితి నన్నిరూపుల ♦ శితశరమ్ము
లంతలో నన్నియుఁ ♦ నసఁగ నొక్కం డయి, యతఁ డుగ్రుఁ డై చూపె ♦ నాగ్రహంబు
తే. నే నలంతులఁ బోవఁ డీ♦యెఱుఁ గటంచు, వాయుశలభముఖాస్త్రముల్ ♦ వఱపి వమ్ము
లైన బ్రహ్మాస్త్ర మేసితి ♦ నదియు వాని,వదనగహ్వరమునఁ బడి ♦ వమ్మ యయ్యె.

వ. అట్టియెడ భయభ్రాంతచిత్తుండ నై నేను జేయునది యెద్దియును లేక బాహుయుద్ధంబునకుం బూని వానిశరీరస్పర్శమాత్రంబున గాత్రంబు నిర్వీర్యం బై బెండువడినఁ జేష్ట లుడిగి పుడమిం బడితిఁ బడునప్పు డప్పురుషుండు పక్కున నవ్వి యవ్వల నవ్వగలం బావ నోపుపరమేశ్వరుండు పార్వతీసహితుం డై నామ్రోల సాక్షాత్కరించి నాకుఁ బాశుపతాస్త్రం బనుగ్రహించి యదృశ్యుం డయ్యె ననంతరం బింద్రాదిలోకపాలు రరుదెంచి వాయవ్యాగ్నేయపైతామహవైష్ణవాదిదివ్యాస్త్రంబు లొసంగి రంత నేను దేవేంద్రునాదేశంబున మాతలిప్రయుక్తరథం బెక్కి సురలోకంబున కరిగి యట మఱియుఁ గొన్నిదివ్యాస్త్రంబులు వడసి యాయయిదేండ్లు నాదేవభవనంబున నుంటి నప్పు డొక్కనాఁడు దేవేంద్రుండు నాశిరంబు పుడుకుచు నిట్లనియె. 24

ఉ. ఇప్పుడు నిన్ను దేవగణ♦మేని జయింపఁగ లేదు మర్త్యుల
న్జెప్పఁగ నేల లోకముల ♦ నీసము లెవ్వరు లేరు పోరులన్
నిప్పున కెత్తు వచ్చెదవు ♦ నీవు జితేంద్రియసంచయుండ వో
యప్ప! దివంబునన్ గురుహి♦తార్థ మొకం డగు నీకుఁ జేయఁగన్. 25

వ. అనిన నేఁ జేయఁగలయది చేయుటకు సిద్ధుండ నై యుంటి ననుడు నతండు వెండియు నోతండ్రీ! నీవు ప్రయోగోపసంహారనివృత్తిప్రాయశ్చిత్తప్రతిఘాతంబు లనునేను విధంబులతోఁ బదునేనుదివ్యాస్త్రంబు లెఱిఁగినవాఁడవు నీకు సాధింప రాని కార్యం బొక్కఁడును లేదు వినుము. 26

ఆ. అబ్ధికుక్షిదుర్గ ♦ మాశ్రయించి నివాతకవచు లనఁగ దాన♦వవరు లెన్న
మూఁడుకోట్లు గలరు ♦ మొనసి నీ వాజగత్కంటకుల జయించి ♦ ఖ్యాతి గనుము.

వ. ఇది నీకు గురుదక్షిణయట్టి దగు నని నాయుత్తమాంగంబున నియ్యుత్తమకిరీటంబు



వెట్టి స్వర్ణరూపం బగునియ్యభేద్యకవచంబు దొడిగి స్వరూపసదృశంబు లగు నంగవిభూషణంబుల విభూషితుం జేసి గాండీవంబున నజరం బగు నీమౌర్వి నెక్కించి మయూరసమలోమాలంకృతహయోపేతంబును మాతలిసంయుక్తంబు నగుదివ్యరథంబు పైఁ గూరుచుండం బెట్టి దీవించి యంపిపుచ్చుటయు నే నంగీకరించి ప్రస్థానభేరి వేయించి చనుచున్నంత దేవత లెల్లరు నన్నాఱింగి. 28

అర్జునుఁడు నివాతకవచాదుల సంహరించినకథ.

ఉ. తొల్లి మహేంద్రుఁ డీరథము♦తోఁ జని వృత్రబలాదిదైత్యులన్
ద్రెళ్ళఁగ నేసెఁ గోట్లకొలఁ♦దిన్ గలరాక్షసనేనతో జగ
ద్వల్లభ నీవు నట్లమర♦వైరులఁ గూల్పు మటంచు మెచ్చుచున్
దెల్లము గాఁగ నా కిడిరి ♦ దేవత లీమహనీయశంఖమున్. 29

క. దేవత లిచ్చినదానన్, దా వెలుఁగొందెడిని దేవ♦దత్త మనంగా
దేవేంద్రుఁడు దీన జయశ్రీ వెలయం దోలె నరులఁ ♦ ద్రిదివమునందున్. 30

వ. *అని మెచ్చుచు నంపిపుచ్చి రేను నట్ల కవచకిరీటశంఖంబులు వడసి యుయుత్సుండ నై దానవాలయంబునకుం బ్రస్థితుండ నై చని. 31

సీ. నురువులతో లేచి ♦ కర మొరయుచు నుండు,తరఁగ లాడెడుమహా♦గిరు లనంగఁ
దిమితిమింగిలకచ్ఛ♦పములు నక్రమ్ములు, వారినిమగ్నప♦ర్వతము లనఁగ
నీటిక్రిందం దోఁచు♦కోటులురతనముల్, రేలు మొగులచాటు♦రిక్క లనఁగ
రత్నవర్ణంబు లై ♦ రమణించు వేనవేల్,నావలు మేలైన♦దీవు లనఁగఁ
తే. జూడ నొప్పి భయంకర♦స్ఫూర్తితోడఁ, గాలితాఁకునఁ గల్పాంత♦కాలజలద
గర్జితం బన ఘూర్ణిల్లి ♦ ఘనరవమ్ము,తో నెసంగుమహాంబుధి ♦ నేను గంటి. 32

వ. అంత నయ్యంతికంబున దేవాంతకపురంబు లోచనగోచరం బగుటయు నట మాతలి భూతలంబునకుం డిగి కూబరంబువట్టి త్రేలాడి దాన నినుమడించినభీషణరథఘోషంబున దిశావలయం బల్లాడం జేయుచు నతిరయంబున నమ్మహారథంబు పఱవం జేసె దానవు లారథఘోషంబు విని నన్ను సునాశీరుం డని తలంచి సంభ్రమించి పురద్వారంబులు మూయించి రేను నత్తఱిఁ జిత్తంబున ముదంబు హత్తుకొన దేవదత్తం బొత్తితి నానినాదం బఖిలదిగ్వలయంబు సంస్తబ్ధంబు గావించి ప్రతిశబ్దజనకం బై భూతభయంకరంబుగాఁ దోఁచిన నేఁధి నివాతకవచు లెల్లరుఁ గోటానఁగోటులు కూటువ లై శరశ్రాణశిరస్త్రాణంబులు దొడిగి శరచాపంబులు

* యుయుత్సుఁడు = యుద్ధముసేయనిచ్ఛ గలవాఁడు.

పట్టిస గదాసిఖడ్గముసలముద్గరపరశుపట్టసప్రాసకుంతతోమరభిండివాలకరవాలశూలచక్రశతఘ్నిముసుండిప్రముఖనానావిధాయుధంబులు ధరియించి యుద్ధసన్నద్ధులై వచ్చి శీఘ్రగమనంబునం జేసి సన్నద్ధుండనై యున్న నన్నుఱుంగం జాలక రథఘోషంబునకుం బ్రతిఘోషంబుగా వాదిత్రంబులు మొరయించి మించి కొంతవడికి నన్ను ముట్టడించి బాణవర్షంబు నాపైఁ గురియించి రప్పుడు నాకును నివాతకవచులకును మహాసంకులసంగ్రామంబు సంభవించె నానమయంబున. 33

చ. ‡ములుమొన వేఁడుమూఁకకును ♦ బోలినచోటట నాకసంబునన్
గలుగక యుండఁ గ్రిక్కిఱిసి ♦ కన్గొనుచుండిన వేల్పుమూఁకలున్
బొలిచిన దేవమానులును ♦ మోదముతో ననుఁ గాంచి మెచ్చి ర
బ్బలరిపుఁ దారకామయముఁ ♦ బాయఁగఁ జేసెడునప్పుడుం బలెన్. 34

వ. అంతఁ గొంతవడి కానికాఁటు లెల్లఁ బెల్లు రేఁగి పరిగృహీతాయుధులై నావయిం గదిసి. 35

సీ. బాణపరంపరల్ ♦ పరఁగించి కొందఱు, ముంచిరి ననుఁ జుట్టుముట్టి మిగులఁ
బరశుపట్టసగదా♦ప్రాసకుంతాదులఁ, గొందఱు నా తేరుఁ ♦ గొట్టి రలుక
శూలముసుంఠులు ♦ కేలఁ గీలించి కొందఱు నన్నుఁ బొడిచిరి ♦ తఱిమి వచ్చి
భూరిశతఘ్నులు ♦ బోరన నామీఁదఁ, గుఱి సేసి కాల్చిరి ♦ కొంతమంది

తే. యిట్లు రౌద్రాకృతులు చాల్చి ♦ యెల్లవారు
నొక్కఁడై నన్నుఁ బరిహరించి ♦ రుక్కు మిగిలి
యేను వయ్యాయుధంబుల ♦ నెల్లఁ ద్రుంచి
యొంచితిఁ బదేసితూపుల ♦ నొకని నొకని. 36

వ. ఇట్లు నే నానివాతకవచుల నొనేసి విముఖులం జేసిన మాతలియు వాతరయంబున నిరర్గళబహుమార్గప్రచారంబుల రథంబు నడిపె నపు డారథనేమినిస్వనంబున హృదయంబు భేదిల్లియు రథాంగంబులక్రిందం బడి నలిఁగియు మహాహయచరణసంఘట్టనంబులం గిట్టియు మద్బాణపరంపరలం డొగియు నానక్తంచరసేనాసమూహంబున రథులు విరథులును సారథులు వీతమనోరథులును నేనుంగులు వీనుంగులును హయంబులు సంప్రాప్తప్రాణభయంబులును బత్తులు సమాత్తవిపత్తులును నై పెలుచఱచి యఱచుచుం బఱచి రపుడు నాచిత్తం బుత్తలంపడు మండు మెఱింగి సురేంద్రసారథి పరమాద్భుతవేగంబునఁ దేరు వోఁ దోలిన నే నతండు

‡ తారకామయము = తారకాసురబాధ.



సంతసించునట్లు వారిం గూడఁ బాఱి నానాస్త్రశస్త్రంబుల సాయుధపాణు లగు నానక్తంచరుల వేనవేలం గూల నేసి పాఱఁ దోలితి నందు గొంద ఱవుర్వంబున నెదిరి నాపై శరవర్షంబులు గురిసి శక్తిశూలాదు లేసి నొప్పించిన నే నింద్రదైవత్యంబును ఘనేంద్రతేజంబును నగుదివ్యాస్త్రంబు సంధించి ప్రయోగించి వారిం బ్రహరించి కరలాఘవంబు మెఱయ మఱియుం బదేసి బదేసి బాణంబులు వరుస నేసి దీపించితి నప్పుడు. 37

శా. గాండీవంబుననుండి కాండములు భృంగవ్రాతము ల్మ్రోఁగ ను
ద్దండారావముతో బయల్పడి వడిన్ ♦ దచ్ఛత్రుగాత్రంబులం
జండప్రక్రియ భిన్నభిన్నములుగాఁ ♦ జల్పంగ రక్తౌఘముల్
మెండై నిండె ధరిత్రి మాతలి కడు ♦ న్మెచ్చె న్ననున్మెచ్చటన్. 38

క. *మాయాయుద్ధము సేయఁగ, మాయావులు గడఁగి గోత్రమాత్రోపలముల్
నా యెదుటఁ గురిసి పోరిరి, సామాన్యము గానియట్టి శౌర్యము మెఱయన్ 39

మ. ‡శతకోటిప్రతిమాన మస్త్రసమితిన్ ♦ సంధించి నే నాదృష
త్ప్రతతిం జూర్ణముగా నొనర్చితినిఁ ద♦త్కాలంబున న్వెల్గుచున్
క్షితిపై రాలెను తాలనుండి జనియిం♦చె న్వహ్నిపుంజంబు సం
తతభీతిప్రదమై సమగ్రమగుచున్ ♦ దావప్రకారంబునన్. 40

ఉ. †అయ్యెడ నాసమక్షమున ♦ నయ్యె మహోత్తరవారివర్ష మొ
య్యొయ్యన నేన్గుతుండములో♦కో యన ధారలు నాల్గుదిక్కులన్
బ్రుయ్యఁగఁ జేయుచుం బ్రబలి ♦ భూమిపయిం బడి వెల్లువయ్యె న
మ్మయ్య యన న్నివాతకవ♦చాసురముక్తజలాస్త్రసంగతిన్. 41

ఆ. సూర్యతేజ మాఁగి ♦ చూపట్టునజ్జడి వాన వెల్లువలన ♦ వల నెఱుంగ
నే సురేంద్రుఁ డిడిన ♦ యాశోషణాస్త్రమ్ము, నేసి దాని వట్టఁ ♦ జేసినాఁడ. 42

తే. అసురు లనలానిలాస్త్రము♦లడరఁ జేయ, నేను సలిలాచలాస్త్రము♦లవ్వాని యేసి
వాని వెంపుడిగించితి ♦ వారలు మఱియు, నంధతమసంబుపుట్టించి♦రపుడు మాయ.

ఉ. చిమ్మనచీఁకటుల్ దెసలఁ ♦ జిక్కనికాటుకఁ బ్రామినట్టులై
క్రమ్మనఁ జెట్టుఁ బుట్టయును ♦ గట్టును గన్న మెఱుంగరామి లో

* గోత్రమాత్రోపలములు = పర్వతములట్టి రాలు. ‡ శతకోటి = వజ్రము. దృషత్తు = రాయి.
† బ్రుయ్యు = వకించు. అమ్మయ్య = ఆశ్చర్యార్థకం బిట్లు వ్రయోగము గోదావరిమండలమునం గలదు.

కమ్మనఁ బీడ యయ్యెఁ దుర♦గమ్ములు దొట్రిలి మ్రొగ్గ సూతుఁడున్
బమ్మరవోయి పగ్గములఁ ♦ బట్టఁగ నేరక సంచలించుచున్. 44

మత్త. ఏమి సేయుదు నేమి సేయుదు ♦ నింద్రనందన ఘోరసం
గ్రామ మియ్యది తొల్లి సంద్రముఁ ♦ ద్రచ్చునాఁ డమృతార్థసం
గ్రామము న్బలిశంబరాదులఁ ♦ గం డడంచిననాఁటిసం
గ్రామ మింతకుఁ గావు నే నిటు ♦ గాన నెన్నఁడు నబ్రముల్. 45

తే. మఱియు వృత్రాదియుద్ధముల్ ♦ వఱలునాఁడు, వాసవున కేను సాది నై ♦ వాపురముల
నడపితిని గాని కడిమి నె♦న్నండు నిట్లు, సంభ్రమము నొంది యెఱుఁగనో ♦ సవ్యసాచి.

వ. ఇది పితామహప్రతిపాదితం బయినభువనసంక్షోభంబువలెం బొడకట్టి భయో
జ్జనకం బగుచున్నది యనిన నే నామాతలి నూఱడించి నాబాహుబలంబును
గాండివప్రభావంబును శస్త్రాస్త్రవిజ్ఞానంబును జూచుచు సుస్థిరుండ వగు మొక్క
వ్రేల్మిడి నీమాయ నంతయు మాయింతు నని పలుకుచు. 47

చ. సురలకు సమ్మతం బసుర♦సూదన మై తగునస్త్రమాయ నే
గరిమ సృజింప నయ్యది య♦ఖండజవప్రతిభావిభావముల్
పరఁగ నొకింతలోపల న♦పారమహాసురమాయ లన్నియున్
విరియఁగఁ జేయఁ జీఁకటులు ♦ వీడెఁ బ్రకాశము గూడె దిక్కులన్. 48

ఉ. ‡కంటికి వెల్లు తోఁడ్పడిన♦కాలమునం దమరేంద్రసూతుఁ డాఁ
కంటకకోటి డాయునటు ♦ గ్రన్ననఁ దే ర్నడపించె వారు న
న్వెంటన నావయిం బడిరి ♦ వేలకువే లయి నేను నెంతయున్
మంటలు దేరునమ్ములను ♦ మాటికి మొత్తితి వారి నత్తఱిన్. 49

శా. అంతర్ధానము నొంది దైత్యులు నభం♦బం దుండి నాపైఁ బడన్
గొంత ల్గానిమహీధ్రముల్ విసరి కొం♦కుం గూర్ప నే నెంతయున్
సంతోసంబునఁబోలె గాండివమునన్ ♦ సంధించి శస్త్రాస్త్రముల్
పంతం బొప్పఁగ నేసి కూల్చితి నెటం ♦ బాఱంగనీ కీసునన్. 50

ఆ. నేల నింగి డాఁగి ♦ కూలియుఁ గూలక, వేనవేలు దనుజ♦వీరు లద్రు
లొక్కపెట్ట యెత్తి ♦ మిక్కిలి కాఁకమైఁ, జుట్టుముట్టి నన్నుఁ ♦ గొట్టి రపుడు. 51

ఉ. అద్రులలో నడంగి వెస ♦ డందెడునన్ను నెఱింగి సూతుఁ డో
భద్ర! భయంబు దక్క సుల♦భక్రియఁ గూలిచి వజ్ర మిమ్ము హా

‡ కంటకకోటి = శత్రుసమూహము.



పద్రిప మేగ సేయు మని ♦ పల్కుడు నే వడి గాండివంబునన్
మాద్రికి మీఱుదాని నభి♦మంత్రణముం బొనరించి యేసితిన్. 52

తే. వజ్రబాణంబు లవి సుతీ♦వ్రంబు లగుచుఁ, బర్వతావళి నడఁగించి ♦ గర్వదుర్వి
దగ్ధు లై డాఁగి యుండిన♦దైత్యవరుల, నెల్లఁ గూలిచి పుచ్చె నొ♦క్కంతలోన. 53

శా. చండప్రక్రియ నట్లు దోర్బలలస♦చ్చాపర్యం బవార్యంబుగా
గాండీవంబున లావుఁ జూపి రిపులన్ ♦ ఖండించితి న్మొండెముల్
తుండెమ్ముల్ శిరము ల్కరమ్ములును గా♦ళ్లున్ వ్రేళ్లునుం గొండ లై
పెం డై కానఁగ నయ్యె నానమరభూ♦మిన్ గుప్పలుం దిప్ప లై. 54

వ. ఇట్లు నే నొక్కింతయుం జెక్కుచెదరకుండ నా నివాతకవచుల నుక్కడంచితి నవు
డంతరంగంబున నద్భుతంపడి యిట్టిపరాక్రమంబు దేవతలందును లే దని మాతలి
ప్రీతిం జేసి నన్నుఁ బ్రశంసించె నంత. 55

తే. ‡దైత్యు లిగ్గతి మడిసిన♦దానఁ దత్పురమునఁ గాంతలు శరదాగ♦మమున నాఁడు
బెగ్గురులుపోలె మిక్కిలి ♦ బెగ్గలికము, గలుగ నాక్రందనము సేసి♦ రెలమిదూలఁగ.

వ. అట్లాక్రందనంబు చేసి చేసి నారథనేమినిస్వనంబు విని దైత్యాంగన లెల్ల వెఱ
చఱచి పఱచి రాలో నే నాపురంబు డాయం జని దానియద్భుతప్రకారంబునకు
నంతరంగంబున నంతసించుచు దేవరాజరథసారథిం జూచి. 57

తరళము. ఇది పురందరువీటికన్న న♦నేకరీతుల మేటి యై
పొదలుచున్నది వేల్పు లిందుఁ బ్ర♦మోద మేటికిఁ బొందరో
కద యనన్ ద్రిదశేంద్రసారథి ♦ కాంచి న న్నిటు పల్కె నో
సదమలాత్మ! వచింతు నిప్పురి♦సర్వవృత్త మెఱుంగఁగన్. 58

తరు. సురరాజపుర మిది ♦ సుర లిట మున్న ♦ సుఖముందు రీరాక్ష♦సులభీతిఁ దొఱఁగి
కర మరుదంద ర♦క్కసులును బిదపఁ ♦ గమలాసనునిఁ గొల్చి ♦ కను తపంబునను
గరుణ వడసి దేవ♦గణములవలనఁ ♦ గలకాల మభయంబు ♦ గలిగెడునట్లు
పుర మిందుఁ దము కున్కి ♦ పొసఁగెడునట్లు♦పొరిఁబొరిఁ బ్రార్థించి♦పొందిరి వరము.

క. పరమేష్ఠియు నపుడు పురం,దరుఁ గని నీపురము దైత్య♦తతి కిడి చను మీ
సురవైరు లవల నమరే,తరుఁ డగునొకపురుషువలనఁ ♦ దా ర్జత్తు రనిన్. 60

వ. ఆకారణంబున నిప్పురం బప్పుడు నివాతకవచుల దయ్యె దేవదుర్జయు లగునీనిర్జ
రారుల జయించుటకు నీకుఁ బాకశాసనుం డనేకాస్త్రంబు లనుగ్రహించె

‡ ఆఁడుబెగ్గురులు = ఆఁడుకొంగలు.

దానంజేసి నీవు వీరి నస్త్రశయంబునం జయించి తని వ న్నగ్గించుచుఁ బురసౌంద
ర్యం బంతయుం జూపి రథంబుఁ గ్రమ్మఱించె నమ్మార్గంబున గోపురాట్టాలకో
పేతంబును జతుర్ద్వారంబును సర్వరత్నప్రభాభ్రాజితంబును నానావస్తునిస్తులంబు
నత్యద్భుతోపమదర్శనంబును గామగమనంబు నగు నొక్కదివ్యనగరంబుఁ గాంచి
నే నిది యెవ్వరి దనిన నిది హిరణ్యపురంబు దీనివృత్తాంతంబు చెప్పెద విను మని
మాతలి యి ట్లనియె. 61

అర్జునుఁడు పౌలోమకాలకేయాదులం జంపినకథ.

సీ. కలరు పులోమయుఁ ♦ గాలక యనుదైత్యవనిత లిర్వురు తొల్లి ♦ వనజభవునిఁ
గొలిచి పెక్కేఁడులు ♦ కొని రిభచరమైన పురముఁ సురాజయ్య♦పుత్త్రికలను
దత్పురం బిది వారి♦తనుజులు పౌలోమకాలకేయులు పెక్కు♦వేలమంది
యుండుఁ గాఁ పురముందు ♦రిపుడు మర్త్యునిచేత మృతివీరికఁ జూడుని♦ర్మించియుంచెఁ
ఆ. గాన నీవు వజ్ర♦కల్పాస్త్రముల వీరిఁ, గూల్పు మనిన నే న♦నల్పకౌతు
కమున నట్టులేని ♦ కడు వేగమునఁ దేరు, పురముమీఁది కీవు ♦ పోవ నిమ్మ.
శా. ‡ఈపౌలోములఁ గాలకేయుల మదీ♦యోద్దామశస్త్రంబులన్
గోపస్ఫూర్తి హరించి లోకములకుం ♦ గూర్తు న్ముదం బన్న నా
తోపాధ్యాయుఁడు సంతసించుచు రథం ♦ బాకాశతలోఁ దోలి న
న్నాపూర్వార్యము చెంత నిల్పె నవు డ♦త్యాశ్చర్య మేపారఁగన్ 63
వ. అంత మారాక విని హిరణ్యపురనివాసు లాపౌలోమకాలకేయు లఱువదివేలదివ్య
రథంబులతో మహావేగంబున వచ్చి శస్త్రాస్త్రంబుల నన్ను నొప్పించిన నేనును.
క. కరలాఘవ మేర్పడ నా, సురవైరుల నెల్ల నేసి ♦ సుక్కించియుఁ ద
త్పరయగతి కడ్డుకోలుగ, శరవర్షము గురిసినాఁడ ♦ శౌర్యస్ఫూర్తిన్. 65
తే. అప్పు డాసురమాయన♦య్యసురవరులు, పురముతోఁ గూడ మింటికిఁ♦బోవు టెఱిఁగి
మార్గణంబుల వారల♦మార్గ మడ్డి, కూల నేసితిఁ బెక్కురఁ ♦ గోప మడర. 66
మ. వరదానంబున వాసి కెక్కి త్రిజగ♦ద్వర్ణప్రభావంబునన్
గరిమం గాంచినతత్పురీవరము వే♦గం బొప్పఁ బైకెగుచున్
బరఁగం గ్రిందికి వచ్చుచున్ మునుఁగుచున్ ♦ రత్నాకరంబందు న
త్వరమై యడ్డము వోవుచున్ గనఁ దగెన్ ♦ దత్తత్ప్రదేశంబులన్. 67

‡ పూర్వార్యము = పురరాజము.



ఉ. *కామగ మప్పురం బిటు ల♦ఖండజవంబున సంచలించుచున్
భీమసమీరకమున్ సలిపి ♦ పిమ్మట పుట్టఁగఁ జేయునట్టిపౌ
లోములఁ గాలకేయుల స♦లోలగతిం గొని యేసి యేసి నే
నామెయిఁ గూర్చితిం బురము ♦ నాయనబాణపరంపరాహతిన్. 68
వ. ‡అట్లు పుటభేదనంబు భగ్నంబై పడినఁ గాలచోదితులై పౌలోమకాలకేయు
లఱువదివేలదివ్యరథంబు లధిష్ఠించి నాపై ననేకాస్త్రంబు లేయుచుం గవిసిన
నేను ప్రత్యస్త్రంబు లేయుచుం బోరియు నపారపారావారోర్మిచయంబువోలెం
గోటానఁగోటులై నవారిం గాంచి మనుష్యుండ నే నెట్లు వీరిం దుద ముట్టించెద
నని భయంబు నొంది. 69
చ. †మనమున భక్తితో శివు ను♦మాధవునిం దలపోయునంత నా
కనుఁగవఁ దోఁచె మూఁడుగుము♦ఖంబులు మూఁడుశిరంబు లాఱుకే
లును ఫణిభూషలుం దగ వె♦లుంగుచు నొక్కపూరుషుండు నేఁ
బనివిని మ్రొక్కి వాని కటఁ ♦ బాశుపతం బరివోసి యేసితిన్. 70
వ. §అప్పాశుపతాస్త్రప్రభావంబున సింహంబులును శరభంబులును శార్దూలంబులును
ఋక్షంబులును మహోక్షంబులును మహిషంబులును బన్నగంబులును వృకం
బులును గజంబులును వరాహంబులును వానరంబులును మార్జారంబులును
గృధ్రంబులును గరుడగంధర్వయక్షరాక్షసపిశాచగుహ్యకాదులు లోనగు ననేక
జంతుజాలంబులు నేల యీనిన ట్లుద్భవిల్లి సర్వదానవవినాశం బగునట్లు ప్రవర్తి
ల్లుచుండ నేనును వజ్రాశనిసమప్రభంబు లగుదివ్యాస్త్రంబు లెన్నియే నేసి
క్రవ్యాదుల నెల్ల విగతాసులం జేసి మహేశునకు మఱియు నభివందనంబు చేసి
పాశుపతం బుపసంహరించి మాతలిప్రస్తూయమానుండనై వినాశనం బైనహిర
ణ్యపురంబు విడిచి మగిడి వచ్చి మహేంద్రున కభివందనంబు సేయుటయు నతండు
నివాతకవచపౌలోమకాలకేయాదిమహాసురవధవిధంబు సర్వంబును మాతలి
వలన విని మనంబున హర్షించి మహర్షిసమేతుండై నన్ను మన్నించి యి ట్లనియె.
చ. ‖సురల కసాధ్యులై ప్రజల ♦ శోషిలఁ జేసెడుదుష్టదైత్యులన్
దురమున సంహరించితివి ♦ దోర్బల మేర్పడ నిన్ను మ్రొక్కనం

* పిమ్మట = మనోవ్యథ. ‡ పుటభేదనము = పట్టణము. † బనివిని = అజ్ఞాపరవర్తియగు.
§ క్రవ్యాదులు = రాక్షసులు. ‖ శోషిల = నొంపులకు.

బరులెవ రైన నోపరు భ♦వద్బలనిర్జితధారణీస్థలిన్
గురువృషభుండు ధర్మజుఁడు ♦ కోరిక లీరికలెత్త నేలెడిన్. 72

ఆ. ముజ్జగముల నేరుఁ ♦ బోలరు నీకన్న, ద్రోణు భీష్ముఁ గర్ణు ♦ ద్రోణపుత్రుఁ
గృపుని శకునిఁ జెప్ప ♦ నేటికి షోడశాంశమున కేని వారు ♦ చాల రరయ. 73

వ.* అని నన్నుఁ బ్రశంసించుచు నభేద్యం బగునీతనుత్రాణంబును దేవదత్తం బనునీ
శంఖంబును దివ్యం బగునిక్కిరీటంబును దివ్యమాల్యాంబరాభరణాదులు నొసం
గినం బొంగుచు నే నందు గంధర్వకుమారులం గూడి సుఖంబుంటి నంతఁ గొంత
కాలంబున కింద్రుండు నన్నుం బిలిచి నీసహోదరులు నిన్నుం జూడఁ గోరుచున్న
వారు నీవు పోయిరా వలయు నని యంపిపుచ్చె నిట్లు నాకుఁ ద్రిదివంబున నేను
వర్షంబులు గడచనియె ననిన విని సంతసించుచు యుధిష్ఠిరుండు సాదరావలో
కనంబున నరుం గారవించి యి ట్లనియె. 74

అర్జునుఁడు ధర్మజున కస్త్రంబులం జూపుట.

మ. మునపుణ్యంబునఁ జేసి యస్త్రములు సం♦పాదింప నయ్యె న్మహే
శునితో మార్కొని నీవు వానికరుణన్ ♦ శోభిల్లఁగాఁ గంటి విం
ద్రునిగద్దెన్ వసియింపఁ గంటి వట సం♦తోషంబునుం గొంటి వీ
వనరాజ్యాంతమహామహీవలయ మేఁ ♦ బాలింప నుంటిం జుమీ. 75

ఆ. అనివాతకవచ♦దానవకోటుల, గీటడంచినట్టి♦మేటియస్త్ర
శస్త్రములను జూడ ♦ స్వాంత మాఁ గావునఁ, గోర్కి దీర్పుమయ్య ♦ గుణశరణ్య.

వ. అనిన నర్జునుం డల్లి ప్రభాతంబున నవి యెల్లఁ జేటతెల్లంబు గావింతు నని
నాఁడు గడపి మఱునాఁ డరుణోదయంబునఁ గాల్యకరణీయంబులం దీర్చి భ్రాతృ
పరివృతుం డగుధర్మజునికడ దేవత లిచ్చినదివ్యాస్త్రంబు లెల్ల ననుక్రమంబుగం
బ్రదర్శింపం దొడంగె నంత. 77

మ.‡ ధర కంపించెఁ బయోనిధుల్ గలఁగెఁ బా♦తాళంబు భేదిల్లె ది
క్కరులున్ బ్రమ్మొగ్గ నవంతుఁడున్ వడియె రి♦క్కల్ రాలె భూమిధ్రముల్
పరియల్ వాఱెను సూర్యకాంతి యడఁగెన్ ♦ బాధంబుగాఁ జీఁకటుల్
విరిసెన్ భూతభయంకరం బగుచు నుర్విన్ రాలె నుల్కల్ గడున్. 78

వ. ఆసమయంబున నింద్రాదిబృందారకబృందంబు లాకసంబున నిలిచి నారదుం
బుచ్చిన నతండు ధనంజయుపాలికి వచ్చి మంత్రంబులువోలె రక్ష్యమాణంబు

* తనుత్రాణము = కవచము. ‡ విరియు = అతిశయించు; ఉప్పొంగు.



లగునస్త్రంబు లి ట్లధిష్ఠానంబు లేకార్తుండవు గాక ప్రయోగించుట తగదు
దీన లోకత్రయంబునకుం గీడు వాటిల్లు నిట్లు సేయకు మజాతశత్రుండు తనమ
నోరథం బాహవంబునం దీర్చుకొనుం గాక యని వారించి దివంబునకుం జనియె
నంతఁ గౌంతేయులును గృష్ణాసహితు లై వైశ్రవణప్రసాదంబున నగ్గిరీంద్రంబున
నాల్గువర్షంబు లొక్కదివసంబుపోలెం గడపి రప్పటికిం దొల్లిటియాఱింటితో
వారికిఁ బదేండ్లు వనవాసం బయ్యె నప్పు డొక్కనాఁ డేకాంతంబునఁ దమ్ములం
గూడి యున్నధర్మజుం గాంచి భీమసేనుం డి ట్లనియె. 79

అజగరపర్వప్రారంభము.

మ.* ఇది యేకాదశవర్ష మింక నొక రెం♦డేం డ్లి ట్లరణ్యాళి నా
పద లొందం దగు నవ్వలన్ ఖరతరా♦బ్దం బొక్కఁ డౌ దానికిం
దుది గల్గించుట దుర్లభంబు మన మిం♦దుం గాక యం దుండినన్
సదసద్వృత్తి మెఱింగి దాయ గెలువన్ ♦ సాధ్యం బగు న్వింటివే. 80

క.‡ శినివరుఁడు కృష్ణముఖ్యులు, మనకున్ విజయంబు గోరి ♦ మనపక్షం బై
యని సేయుదు రీ వరులన్, దునిమి మహీరాజ్య మేలఁ ♦ దొడరెద వనఘా. 81

వ. అనిన యుధిష్ఠిరుం డనును. 82

క. కరిపురికిఁ జెంత నుండిన, నరివృత్తం బెఱిఁగి దాని ♦ కను వగురీతిన్
బరివర్తింపఁగ నగు తెఱఁ, గరయఁగ నగు నిదియ నాకు ♦ నభిమత మనుచున్. 83

వ. ప్రస్థితుం డై వైశ్రవణాధివాసం బగునప్పర్వతరాజంబునకుఁ బ్రదక్షిణంబు గావించి
నదీనదసరిద్వేశ్మంబులం గుబేరానుచరుల నామంత్రించి పర్వతాధిదైవతంబు నంత
రంగంబునం దిడికొని యి ట్లనియె. 84

చ. అరుల జయించి రాజ్యపద♦మందు మహావిభవంబు నొంది నే
ధరణితలంబునందు వినుతంబుగఁ జేయఁగ నైనచేఁతలన్
బరఁగఁగఁ జేసి మిత్రులను ♦ బంధులఁ గూడి తపఃఫలార్థి నై
ధరణిధరంబ! నీకడకుఁ ♦ దత్పరతం జనుదెంతు వెండియున్. 85

వ. అని ప్రార్థించి యున్నయప్పుడు. 86

తే. పయన మేగడుకురువంశ♦భవులఁ దండ్రి, తనయులం బలె లోమశ♦మునివరుండు
ప్రీతుఁ డై కాంచి బోధించి♦పేర్మితోడఁ, జనియె ననిపించుకొని దేవ♦సదనమునకు.

* దాయ = జ్ఞాతి; శత్రువు.
‡ తొడరు = కలుగు.

వ. అనంతరం బప్పాండవు లార్ష్టిషేణానుజ్ఞాతు లై ఘటోత్కచాదిరాక్షసవీరులు తమ్మెల్ల మోచికొని రా మగిడి వచ్చుచుఁ దపోవనంబులు దీర్ఘికలు నాయతనంబులుం దాఁటి కైలాసంబు నతిక్రమించి వృషపర్వాశ్రమంబునకుం జని వాని చేతం బూజితు లై తమప్రవాసకారణంబు వాని కెఱింగించి యం దొక్క రేయి యుండి మఱునాఁడు బదరీవనంబునకుం బోయి నారాయణావసథంబున విశ్రమించి కుబేరకాంతం బగునలినీప్రాంతంబు దిలకించి నందనవానంబునకు వచ్చి యొక్కమాసం బట నివసించి చీన తుషార దరద కుళిందాదిదేశంబు లతిక్రమించి కిరాతేశ్వరుం డగుసుబాహుపురంబునకుం జని యట నొక్కనాఁ డుండి ఘటోత్కచాదులం బోవం బంచి నిజపరిచారకు లగునింద్రసేనపౌరోగవప్రభృతులం దోడ్కొని గథంబు లెక్కి యామునాద్రికిం జనుదెంచి విశాఖయూపసమీపంబున నొక్కసంవత్సరంబు నివాసంబు గావించి రప్పు డాద్వాదశవర్షంబున నొక్కనాఁ డొక్కపర్వత కందరంబున భీమసేను నొక్కయజగరంబు వట్టిన ధర్మరాజు వాని విడిపించి ప్రాణభయంబువలనం బాపి రక్షించె నావెనుక నావనంబునుండి సరస్వతీతీరంబున నుండువా రై ద్వైతవనంబునకుం జని సుఖంబుండి రనిన జనమేజయుండు వైశంపాయనుం జూచి నాగాయుతసత్త్వుం డై భీమపరాక్రముం డైనభీమసేనుం డొక్కపాముఁవలనిభయంబు నొందుట యెట్టిది ధర్మజుండు విడిపించుట యెట్టిది విన వలతుం జెప్పు మనిన నతం డతని కి ట్లనియె. 88

—•◆ వేఁట కేగినభీమసేను నజగరంబు పట్టుకొనుట. ◆•—

ఉ. ఆవృషపర్వనాశ్రమము నందుఁ గురూద్వహు లున్న యప్డు నానావిధశస్త్రము ల్గొని ఘనంబున భీముఁడు వేఁట లాడఁగా భావన చేసి యొక్కరుఁడ ♦ పర్వతభాగము లెక్కి మక్కువన్ దా విహరించె రమ్య మయి ♦ తద్దయు నొప్పుమతద్వనంబునన్. 89

సీ. దేవర్షిసేవిత ♦ దేశంబు లరయుచు, శుకపికస్వరముల ♦ సొంపు వినుచు
ఫలపుష్పసంభృత ♦ బహుపాదపంబులఁ, గనుచు నెమ్ములనృత్త ♦ మున కలరుచు
నయనానందనసరి ♦ న్నలినంబు లెంచుచు, మణికందరములసం ♦ పదలఁ గనుచు
దేవదారువులందు ♦ తేవ మెలంగుచు, నగనుగంధముల కా ♦ నందపడుచు

తే. మృగయఁ దిరుగుచుఁ గోలాది ♦ మృగచయంబు, పట్టివధియించుచును గాలి ♦ పట్టి యరుగు వృక్షములఁ బెల్లగించుచు ♦ నక్షయముగ, నార్చుచు న్మల్లచఱచుచుఁ ♦ బేర్చె మిగుల.



వ.*నదుసుచుఁ బ్రాఁకుచు న్నిలిచి ♦ నాల్గుకెలంకులు పారఁ జూచుచున్ వడి వడి నేగుచున్ నసునసు ♦ వంచుచు నించుక చిక్కపెట్టుచున్ దొడిఁబడి వృక్షపుంజములఁ ♦ దూఱుచుఁ జేరుచు మాటిమాటి కయ్యడవిమృగంబుల న్వెదకి ♦ యక్కురువీరుఁడు వేఁట లాడుచున్. 91

మ. గిరిదుర్గంబునయందుఁ గాంచె గిరి నా ♦ కీర్తింప నొప్పెడు కందరముం బోలెడునాస్యమున్ వరహరి ♦ ద్రాతుల్యరూపంబు కోపరసప్రజ్వలదీక్షణంబులును బి ♦ భ్యద్దంష్ట్రిలుం గల్గి భీకర మై నాల్కలు గ్రోయుచుండెడుమహా ♦ కల్పాంతకాహీంద్రమున్. 92

క.†నిశ్వాసక్ష్వేళాగ్నిన్, విశ్వం గలతృణము నేర్చి ♦ వెల్గుచు నధికానశ్వరకోపస్ఫురణన్, శాశ్వతదార్ఢ్యమున నేచు ♦ శయు వది కడఁకన్. 93

తే. సత్వరంబుగఁ బఱతెంచి ♦ సత్వ మెసఁగ, ననిలతనయునిబాహుద్వ ♦ యంబు తనదు వదనగహ్వరమునఁ బట్టి ♦ వానిమేను, తనదుమేనున బంధించెఁ ♦ దద్దఁ జుట్టి. 94

క. నాగాయుతబలుఁ డయ్యున్, నాగపురీశానుజుం డ ♦ నంతబలాభోనాగంబుపట్టు విడిపడ, నేగతియుం గానరాక ♦ హీనబలుం డై. 95

వ. అజగరంబుమేనం జిక్కి కదలనేరక దానిబలంబున కద్భుతంబు నొంది యిది సామాన్యసర్పంబు గా దని యెంచి దాని కి ట్లనియె. 96

చ. ఉరగవరేణ్య నీ వెవఁడ ♦ వో ననుఁ బట్టితి వేమి సేయుదో కురువిభుఁ డైనధర్మజున ♦ కుం గనుఁ గూర్చినతమ్ముఁడన్ బలోత్తరుఁడను భీమసేనుఁడను ♦ దండధరుం డన యక్షరాక్షసోత్కరములఁ గూల్పఁ జాలితి నిఁ ♦ కన్ మృగకోటులఁ జెప్ప నేటికిన్. 97

క. పదివేలేన్గులబలమునఁ, బొదలెడుననుఁ బట్టి యిట్లు ♦ పొడవడఁగింపన్ గదిరితి విద్యాబలమో, యిది వరబలమో వచింప ♦ వే వెఱఁ గయ్యెన్. 98

వ. అనినం బూర్వజ్ఞానసంపన్నం బగునప్పన్నగంబు మఱియుం దనకాయంబున వాని కాయంబుఁ బట్టి చుట్టి నోటి నున్నబాహులు విడిచి యి ట్లనియె. 99

సీ. ఆఁకట మటమట ♦ లాడునా కశనంబు, దైవనిర్మిత మయి ♦ దరికి వచ్చె నాపట్టు విడిపింప ♦ నోప రెవ్వరు బలహీను లై పోయెద ♦ రేను మున్ను బారిఁ బడినసింహ ♦ వారణాదులఁ బట్టి, భక్షింతు నే దేహ ♦ బలముకలిమిఁ గోపమునం దొల్లి ♦ శాపంబు వెట్టె నగస్త్యుండు దాన ని ♦ క్కరణి నైతి

* చిక్కపెట్టుచు = మృగాదులం దోలుచు. † విశ్వ = భూమి. శయువు = పెద్దపాము.

తే. నేనుమీపూర్వులకుఁబూర్వుఁ♦డైన వాఁడ,నహుషుఁడనువాఁడనాయువు♦నకునుతుండ
బ్రాహ్మణావజ్ఞఁ జేసిన♦ఫలము గాఁగ, నిట్లజగరంబ నై యుంటి ♦ నేండ్లు పూండ్లు. 100

మ. నిను దాయాదుఁడ వంచు నెంచ శోకయిం♦తేనిన్ భుజింపంగ నె
మ్మనమం దెంచితిఁ గొండచిల్వ నగుచున్ ♦ మా నేఁడి యున్నట్టిదా
న నయో నా కిటు వచ్చె నింద్రపదవిన్ ♦ సౌఖ్యంబునం బొందునే
వనమందుం బడి దుష్క్రియల్ సలుపుచున్ ♦ వర్తింప నైతిం జుమీ. 101

వ. అని తనగతికి వగచునజగరంబునకు భీముం డి ట్లనియె. 102

తే. కలుగుఁ దోలఁగును సుఖదుః♦ఖములు దలంప,వాని కింతయు మేతాల్పు వగవరాదు
పురుషకారంబునం జేసి ♦ పురుషుఁ డెవుడు,దైనమును ద్రోసిపుచ్చంగఁ ♦ దగదుగాదె.

మ. పురుషార్థంబునకన్న వేమఁగు లోఁ♦పన్ దైవ మెమ్మైన్ మహీ
శ్వర! దైవోపహతుండఁ గావున బలై♦శ్వర్యంబునం బొల్చునే
గిరిదుర్గంబున కిట్లు వచ్చి భుజశ♦క్తిం బాసి సర్పోదరాం
తరపాతంబున నైతి నేమి యనుచున్ ♦ నావృత్తముం జెప్పదున్. 104

సీ. నాకు శోకింప నేఁ ♦ బోకంతయుం గాని, నాభ్రాతృవరు లర♦ణ్యంబులందు
రాజ్యపరిచ్యుతి ♦ రమణ నో మెలఁగుదు, రార్తులై వారలీ♦వార్త వినినఁ
దమమహోద్యమ మీఁగి ♦ ధరణిఁ ద్రెళ్లెద రమ్మ, పుత్రశోకంబునఁ ♦ బొడవడంగు
మాకూర్చునిల్లాలు ♦ మఱియొకలా గగు, మామనోరథములు ♦ మంటఁ గలయు

తే. ఖలుఁడు దుర్యోధనుండు ని♦ష్కంటకముగఁ
బూజ్యసామ్రాజ్యమును గొని ♦ పూజ్యుఁ డగుచు
నెగడు ననుచు విలాపించె ♦ నెఱిఁ దొఱంగి
భుజగభోగపిండీకృత♦మూర్తి యగుచు. 105

ధర్మరాజు భీమసేను వెదకఁ బోవుట.

వ.* ఇట యుధిష్ఠిరుండు నస్వస్థచేతనుండై చింతించుచుండ వానికి దక్షిణంబునుండి యశివం
బగుశివారావంబు వినవచ్చె నేకపక్షాక్షిచరణ యగుమీనవల్లిక రక్తంబుఁ గ్రక్కుచు
నెదుటం బొడసూపెఁ గర్కరకర్షణం బగుప్రచండవాతంబు వీతెంచె మృగపక్షి
రుతంబు లపసవ్యంబులై తోఁచెఁ బృష్ఠభాగంబునఁ గృష్ణవాయసంబు "యాహి
యాహి" యని శబ్దంబు దోఁపం గూయుచుండ మాటిమాటికిం దక్షిణభుజాస్పందం

* మీనవల్లిక = నీళ్ల నుతికి మత్స్యములఁ బట్టుపక్షి; శకునములలోఁ గొన్ని యశుభశకునములును గొన్ని శుభశకునములుం గలవు దానంజేసి పిమ్మట కీడు లగు నని ధర్మజుం డూహించె నని యూహింపనగు.



బును వామచరణచలనంబును సవ్యాక్షివికారంబునుం బొడమె నపుడు భయంబు-
ను భయానంతరంబున మేలును శంకించుచు భీమసేనుం డెందుం బోయె నని ద్రౌపది
నడిగి తెలిసికొని ధనంజయనకులసహదేవుల ద్రౌపదీసంరక్షణార్థంబు నియోగించి ధౌమ్య
సహితుండై పావనిపదచిహ్నంబు లరయుచుం దూర్పుదిక్కు పట్టి నిహతగజయూథ
మృగమృగేంద్ర శతసహస్రంబులును నిర్భగ్నద్రుమంబులును భీమసేనునిమార్గం బెఱిం
గింప వరిగి యరిగి రూక్షమారుతభూయిష్ఠంబును నిష్పత్రద్రుమసంకులంబును
గంటకసమాకీర్ణంబు నగునొక్కగిరిగహ్వరంబున భుజగేంద్రభోగపరివేష్టితుండై చేష్టలు
దక్కి యున్నతమ్మునిం జూచి సంభ్రమించి. 106

ఆ. తల్లి! కుంతి! నీకుఁ ♦ దగనియాపద వచ్చెఁ, బర్వతంబు వోలు♦పామువలన
నీసుతుండు తెగును ♦ నేఁ డయో నే నేమి, చేయువాఁడ ననుచుఁ ♦ జెన్ను దఱిఁగి. 107

వ. ఉన్నసమయంబున భీముం డగ్రజు నెఱింగి యి ట్లనియె. 108

తే. ఆయువుసుతుండు నహుషుఁడీ♦యనఘమూర్తి,సర్పమై యిట్లు ననుఁ బట్టెఁ♦జంపితినఁగ
నార్య! విధిచోదితం బిది ♦ యనుడు నతఁడు, కరము దుఃఖించి యి ట్లను ♦ నురగమునకు.

చ. వినువుము సర్పరాజ! జన♦విశ్రుతుఁ డీతఁడు నాదుతమ్ముఁ డి
య్యెడల భవద్వశుం డగుచు ♦ నేర్పడె నాఁకలి దీఱ నీకు నే
నిడియెదఁ జాలినంత మఱి♦యే దయినం దగుభోజనంబు నా
యెడఁ గరుణింపవే యన న♦హీశ్వరుఁ డి ట్లని పల్కె వానికిన్. 110

ఉ. నోటికిఁ జిక్కె నీతఁడు గ♦నుంగొని మ్రింగుట నావ్రతంబు నా
చోటికి వచ్చువారి నిటు ♦ చొప్పడఁ జేసెను భాగధేయ మీ
నాఁటికి రేవు నీ విఁక మ♦నంబున దీనికిఁ జింత సేయఁగా
నేటికి మందిభక్ష్య మగు♦నీతని నే విడ నోప నేగుమా. 111

చ. అనవుడు ధర్మజుండు విన♦యంబున ని ట్లను సర్పవల్లభా
కనుఁగొన నీవు దేవుఁడవొ ♦ కాకొకదైత్యుఁడవో యథార్థమున్
వినుచుము నే యుధిష్ఠిరుఁడ ♦ వేఁడుచునుంటి మదీయసోదరున్
ననరున నిచ్చి పుచ్చు మెద ♦ నీ కిది కోరిక చెప్ప నావుడున్. 112

ఆ. రాజుఁ గాంచి యజగ♦రం బిట్టు లను నేను, దెలియ రాజనకును ♦ దేజ మీఱఁ
బంచముండ నగుచుఁ ♦ బ్రబలినవాఁడ నా,యువున కాత్మజుండ ♦ నుర్వినాథ. 113

చ. నహుషుఁడ నేను మీకులము♦నం బ్రభవించినవాఁడఁ దొల్లి టన్
బహుసవనంబులన్ జలిపి ♦ భవ్యతపం బొనరించి మించి సు

స్పృహఁ జని స్వర్గధామ మటఁ ♦ బెద్దలఁ గెగ్గు పౌనర్భవదాన ని-
ట్లహి నయి వేఁగుచుంటి నకటా విధిచెయ్వుల కబ్బ మెంతయున్. 114

వ. *ఐశ్వర్యమదమత్తుండ నై బ్రహ్మరథం బెక్కి వారి కవమానంబు చేసినకతనం గినిసి యగస్త్యుం డనుమునివరుండు నన్ను శపించి నాప్రార్థనం జేసి నాకుఁ బూర్వస్మృతియు సపూర్వసత్త్వంబు నొసంగి శాపమోక్షప్రకారంబు నెఱింగించె నీవు నాచేయుప్రశ్నంబుల కుత్తరం బిచ్చి నీతమ్ముని విడిపించుకొని పొమ్ము ట్లు కాకున్న మద్భుక్తకాలసంప్రాప్తాహారం బైనవీని విడువ నోప ననిన నజాతశత్రుం డజగరవరంబున కి ట్లనియె. 115

ధర్మరా జజగరప్రశ్నముల కుత్తరం బిచ్చుట.

చ. అజగరనాథ నీ పలుకు ♦ వబ్రహ్మబల్కుల కుత్తరంబు లీ
వృజినవిదూరుఁ డై వఱలు ♦ విప్రవరేణ్యుఁడు పోలుఁ గాని నే
నజినముఁ దాల్చుమాత్రఁ దగ ♦ నైన వచింపు మెఱింగినట్టుల
క్కజ మనఁ జెప్పుచుంటి ననఁ ♦ గా నురగేంద్రుఁడు వాని కిట్లనున్. 116

క. ఎట్టిఁడు బ్రాహ్మణుం డగు, నెట్టిది వానికి నెఱుంగ ♦ నెనఁగెడునది నా
కిట్టియెడఁ జెప్పు మనవుడు, ని ట్టనుచుం జెప్పెఁ గుటిలు ♦ లేశ్వరుఁ డెన్నన్. 117

తే. †సత్యదానశీలానృశం ♦ స్యక్షమాత,పోఘృణాదులు గలిగిన ♦ పురుషవరుఁడు
బ్రాహ్మణుం డగు సుఖదుఃఖ ♦ రహితమైన,బ్రహ్మమే వేద్య మగునట్టి ♦ వస్తు వరయ. 118

వ. అనిన భుజంగంబు వెండియును. 119

తరువోజ. అరయఁ జాతుర్వర్ణ్య ♦ మది సుప్రమాణ ♦ మగును నీచెప్పిన ♦ యట్టిసత్యాది
వరగుణంబులు గల ♦ వాఁడె విప్రుఁ డన ♦ వచ్చునయేని నీ ♦ వాకొనునివ్వి
వరుస శూద్రునియందు ♦ వఱలునయేని ♦ వాని బ్రాహ్మణుఁ డన ♦ వచ్చునే మఱియు
విరహితసుఖదుఃఖ ♦ విధి బ్రహ్మ మంటి ♦ వెలయ నారెంటిని ♦ విడి విశ్వ మున్నె.

వ. అనిన నజాతశత్రుండు. 121

తే. ‡వృత్తములె యుత్తమంబులై ♦ వెలయుఁ గాన,శూద్రునందు సత్యాదులు ♦ సొచ్చియున్న
వాఁడు సద్విప్రుఁ డగునవి ♦ వఱలకున్న,బ్రాహ్మణుఁడు శూద్రుఁ డన బడుఁ ♦ బాపతేఁడ.

వ. శీతోష్ణంబులనుమ నొంక్లాకంబు గానరానియట్లు సుఖదుఃఖంబులకు వెలియై లోకంబు లే దనుట నిక్కంబ కాని లోకాతీతుం డగుపరబ్రహ్మం బొక్కండు గలండు గావున నట్లు చెప్పితి ననుటయు. 122

* బ్రహ్మరథము = బ్రాహ్మణులు మోయుపల్లకి,
† శీలము = సద్వృత్తి. ఆనృశంస్యము = అక్రూరభావము. ‡ వృత్తము = నడత.



తే. అజగరం బిట్లు పలికె నో ♦ యయ్య నీవు, చెప్పినట్టులు వృత్తమ ♦ యొప్పునేని
జాతు లేటికి వ్యర్థముల్ ♦ సంభవించు, నెఱుఁగఁ జెప్పవె యన పతఁ ♦ డిట్టు లనియె.

సీ. *ఆహారమైథున ♦ వ్యవహారనిద్రలు, జననంబు మరణంబు ♦ సమత నొంది
చూపట్టుటను మను ♦ ష్యులు వర్ణసంకరు, లయి రవ్వ వృత్తంబు ♦ ననుసరించి
జాతు లేర్పడె విప్ర ♦ జాతికి జాతకర్మము వాల్చె నాభివ ♦ ర్ధనము మున్న
జనని సావిత్రియు ♦ జనకుఁ డాచార్యుండు, నాబ్రహ్మకులునకు ♦ నగుఁ దలంప ||

తే. వేదచోదితసంస్కార ♦ విధులకతన, నతఁడు వెండియు జన్మంబు ♦ నంది ద్విజుఁ డ
నం దలిర్చెడుఁ దత్పూర్వ ♦ మందు శూద్ర,సముఁ డటంచు శ్రుతిస్మృతుల్ ♦ చాటుచుండు.

వ. కావున నుపనయనాదిసంస్కారంబులం బడసి సత్యాదులం బొందినయతండు బ్రాహ్మణుం డట్లుపనయనసంస్కారంబుఁ బడసి సత్యాదిగుణంబులు లేనివాఁడు బ్రాహ్మణబ్రువుండు నని మనువచనం బనిన దాసరిపాము వెండియు. 126

ఆ. విదితవేదుఁ డైన ♦ విద్వాంసుఁడవు నీవు, నీదు నుత్తరముల ♦ నాదుమదికి
ముదము గదిరె నింకఁ ♦ బొదలు నీతమ్ముని, నెట్లు మ్రింగువాఁడ ♦ నేను జెపుమ.

వ. అనిన యుధిష్ఠిరుండు పంతసించుచు నీవు వేదవేదాంగవిదుండ వని తోఁచెడిం గావున నడుగుచుంటిఁ బురుషుం డెట్టికర్మం బాచరించి యుత్తమగతిం బడయఁ గలుగుం జెప్పు మనిన నతం డతని కి ట్లనియె. 128

అజగరంబు ధర్మజుప్రశ్నముల కుత్తర మిచ్చి భీముని విడిచిపుచ్చుట.

తే. సత్యవచనం బహింసయు ♦ నిత్యపాత్ర,దానము ప్రియోక్తి యనునవి ♦ మానవులకు
సద్గతికి సాధనంబులై ♦ చనెను ననుడు, మఱియు నిట్లని యడిగె ధ ♦ ర్మజుఁడు వాని.

క. ‡నీ చెప్పినయిం దెయ్యది, ప్రాచుర్యము నొంది పెద్ద ♦ పడి యుండెడు నా
కోఁ జెప్పు మనుడు నిడుపం, డాచంద్రాన్వయున కిట్టు ♦ లనియెం బ్రీతిన్. 130

ఆ. కార్యగౌరవంబు ♦ కతన నం దొక్కొక్క,వేళ నొక్కఁ డొకఁడు ♦ పెద్దపడును
గాని యరసి చూడ ♦ వానిలో గౌరవ,లాఘవములు లేవు ♦ లవముగాని. 131

వ. అనిన ధర్మజుండు వెండియు. 132

ఆ. స్వర్గ మెట్లు పొందఁ ♦ జనుఁ గర్మఫలములు, ధ్రువము లొడలు దెగిన ♦ తుదిని జీవుఁ
డెట్లు ఫలము నొందు ♦ నిది యంతయును విన, వలతుఁ దెలుపు మనినఁ ♦ బలువతేఁడు.

సీ. స్వర్గవాసము నర ♦ త్వమును దిర్యగ్యోని, యనఁ గర్మగతులు మూఁ ♦ డలరుచుండు
దానాదు లొనరించి ♦ తా నహింసాపరుఁ, డై నరుఁడు స్వర్గ ♦ మందఁ గలఁడు

* వర్ధనము = ఛేదనము. సావిత్రి = గాయత్రి. ‡ నిడుపండు = సర్పము.

కర్మము విపరీతగతి నైన సుకృతశేషమున మర్త్యుం డయి ♦ జగతిఁ బుట్టుఁ
గామలోభాదులు ♦ గలిగి హింసాపరుం, డైనఁ దిర్యగ్జన్మ ♦ మంది కుంఠి-
తుఁ, దుఃఖ మనుభవించి ♦ దుష్కృతం బది తీర, మనుజుఁ డై సుకర్మమార్గమునను
దేవపదము నొందు ♦ జీవుఁడు నిత్యుండు, కర్మవశత నిట్లు ♦ గతులఁ గాంచు. 136

వ. ‡అని చెప్పిన ధర్మనందనుండు మఱియు ని ట్లనియె నయ్యా శబ్దస్పర్శరూపరసగంధంబు
లనువిషయంబుల కధిష్ఠానం బెద్ది వాని నెల్ల యాగపద్యంబునం బొందవచ్చునే
యనిన లేలిహానం బి ట్లనియె. 137

తే. బుద్ధియు మనంబునింద్రియములనుగూర్చి,విషయములఁబొందు క్షేత్రజ్ఞ ♦ విశ్రుతుండు
సర్వవిషయంబులను నేకసమయమందు, ననుభవింపంగ నాత్మకు ♦ ననువు పడదు.

వ. అనిన ధర్మపుత్రుండు మనోబుద్ధులలక్షణం బెట్టిది చెప్పు మనిన నురగంబు మఱియును.

తే. బుద్ధి యాత్మానుగం బయి ♦ పొసఁగు గుణక,హితము జ్ఞానాత్మకంబగు ♦ నెపుడుమనము
కనుఁగొనఁ దగు సంకల్పవికల్పరూప, మాత్మగుణ మిట్లు భేదమం ♦ దగును దెలియ.

తే. అనుడు ధర్మజుఁ డిట్లను ♦ నజగరమున, కిట్టిబుద్ధిమంతుఁడవు ని ♦ న్నిట్లు మోహ
మావహించెనొ చూడ నాశ్చర్య మగుఁ, దెలిపి నాసంశయములెల్లఁ ♦ దీర్పు మనఘ.

వ. అనిన నజగరం బి ట్లనియె. 140

క. ప్రజ్ఞావంతుఁడు శూరుఁడు, ప్రాజ్ఞుం డగు నైన సిరులు ♦ బలపడ నెంతే
నజ్ఞానవంతుఁ డగు సర్వజ్ఞుండవు నీకు వేఱ ♦ పలుకఁగ వలెనే. 141

వ. అయినం జెప్పెద వినుము తొల్లి నే నైశ్వర్యమదమత్తుండ నై గర్వించి దేవలోకం
బున దివ్యవిమానంబున విహరించుచు దర్శనమాత్ర సర్వప్రాణితేజం బుపసంహ
రింపం గలబలంబు గలిగి దేవగంధర్వయక్షరాక్షసపన్నగాదులఁ గనుసన్నల మెలంగఁ
జేయుచు నొం డెఱుంగ కొక్కనాఁడు బ్రహ్మర్షిసహస్రవాహ్యమానశిబికారూఢుం
డనై పోవుచుఁ బాదప్రహరణంబున నగస్త్యుం డనుమునీంద్రు నొంచిన నతండు
గనలి నన్ను ధ్వంససర్ప యని పలికిన నే నిట్లు సర్పంబ నై విమానంబునుండి ప్రచ్యు
తుండ నగుచు నపరాధంబు సైఁచి శాపాంతం బనుగ్రహింపు మని ప్రార్థించిన
నతండు నన్నుఁ గరుణించి కరుణాసముద్రుం డగుధర్మజుండు నీయడిగినప్రశ్నంబుల
కుత్తరం బిచ్చి ని న్నీశాపంబునుండి మోక్షితుం జేయం గలం డని యెందియు నీకుఁ
బుణ్యలోకంబులు గల వని పలికె నేనును బ్రాహ్మణతపఃప్రభావంబున కద్భుతంబు
నొందుచు నిందుఁ బడి బ్రహ్మంబు నొందుటకు సత్యదమదానతపోహింసాదులు

‡ లేలిహానము = పాము.



సాధకంబులు గాని జాతికులంబులు సాధకంబులు గా వని నిర్ణయించుకొని యిట్లు
తద్విషయప్రశ్నంబు గావించి నీచే ని ట్లనుగ్రహింపంబడితి నాకు శాపమోక్షం
బయ్యె వీఁడె నీతమ్ముండు మీకు స్వస్తి యగుం గాక పోయివచ్చెద నని యుచ్చ
రించుచు నగ్గోనసరూపంబు విడిచి దిగ్గన దివ్యరూపంబు నొంది సహుష్షుం డై
స్వర్గంబునకు నిర్గమించె నంత యుధిష్ఠిరుండును ధౌమ్యసహితుం డయి వృకోదరుం
దోడ్కొని నిజాశ్రమంబునకు వచ్చి తద్వృత్తాంతం బంతయుం దనవారి కెఱుంగఁ
జెప్పిన నెల్లరును భయవిముక్తుం డైనభీమసేనుం గాంచి సంతసించి రనంతరంబ.

మార్కండేయసమస్యాపర్వప్రారంభము.

వర్షర్తువర్ణనము.

క. అంతటఁ బ్రావృట్కాలము, సంతతగర్జార్భటీప్రసంగతసాంద్రా
నంతాభ్రావృతసర్వది,శాంతర మై తోఁచె విరహు ♦ లట్టిట్టుపడఁగ. 143

సీ. మేఘావృతం బయ్యె ♦ మి న్నెల్ల నుఱుములు,మెఱుములు తఱ చయ్యె ♦ మిసిమిదోఁపఁ
దరణిప్రభ యడంగెఁ ♦ దారకల్ నిసి మాసెఁ, బడమట నింద్రచాపములు దోఁచె
విడక రేలుఁ బవల్లు ♦ వడి హోరు మని జముల్, పడియెఁ దాపము పటాపంచ లయ్యె
నృత్యంబు గావించె ♦ నెమ్మలు మత్తిల్లి, భేకరుతంబులు ♦ పెచ్చుపెఱిగె

తే. వారిపరిషిక్త మై ధరావలయ మెల్ల, శాంత మయ్యె స్రవంతు లశ్రాంతకాంతి
మత్ప్రవాహము లయ్యె సమస్తభూత,సంతతికి సౌఖ్య మయ్యె నాసమయమందు.

మ. *పురువార్ధారలు చంచలద్యుతులు సంపూర్ణాసితాంగంబులన్
నిరతోద్యద్ఘనగర్జలుం గలిగి నిర్నిద్రప్రభావంబునన్
సురవర్త్మం దగునబ్దముల్ మదమునన్ ♦ జొత్తిల్లి సిందూరభా
స్వరనీలేభము లెప్డు బృంహితములన్ ♦ వర్తించు నా నొప్పెడున్. 145

మ. ‡జలదధ్వానము మర్దలధ్వనులు గా ♦ శంపాలతల్ గుగ్గులూ
జ్జ్వలకీలమ్ములు గాఁ బ్రవర్షరుతి భాస్వద్వాద్యజాలమ్ము గా
నలిఝిల్లీకులనాద మున్నతగతిన్ ♦ వ్యాపించుగీతమ్ము గా
నలిపెన్ నృత్యము కేకిలోక మెపుడున్ ♦ షడ్జంబునం బాడుచున్. 146

* పురువార్ధారలు = గొప్పవర్షధారలు. సురవర్త్మ = ఆకాశము.

‡ గుగ్గులూజ్జ్వలకీలలు = గుగ్గిలపుమంట. (పూర్వకాలమునఁ బాత్రప్రవేశమున నిట్లు గుగ్గిలపు మంట చేయుదురు). అలి = తుమ్మెద. ఝిల్లి = చిమ్మట.

ఉ. *వారిదసంభృతాసితన♦భస్థ్సలమందు మణీగణప్రభా
సారసముజ్జ్వలం బయి యొ♦నంగుసురాధిపచాప మర్విపైఁ
దీరి స్ఫురించెనో యనఁగఁ ♦ దేజరిలున్ సురగోపగోప్య మై
భూరితరప్రభూతతృణ♦పుంజసమంచితభాగ మత్తఱిన్. 147

ఆ. దెసలు మాఱుమ్రోయఁ ♦ గొసరి కేకారవం, బెసఁగఁ బురులు విప్పి ♦ విసుగ కాడు
నెమ్మిగములఁ గాంచి ♦ నెమ్మది లల్లాడ, విరహిజనము చాల ♦ వెగడు గుడిచె.

తే. చాలఁ దపియించుచుండెను♦నేలపడఁతి, తొలకరిని వర్షబిందువుల్ ♦ గలయఁ బర్వఁ
గొసరి కమ్మతావుల నావి ♦ గుప్పరించె, పవును విరహులనిట్టూర్పు ♦ ననుకరించి.

మ. ‡జనితోష్ణంబునఁ జిక్కియున్నతటినీ♦శర్వర్యటీవారముల్
ఘనకీలాలము పొట్టనిండఁ గొని త♦త్కాలంబునం జియ్యఁబ
ట్టి నికాయ్యంబులఁ గూల్చి సర్వ మతిధా♦టిం గొంచుఁ గాల్వేతు లా
డనిచో జంతుల నెల్ల మ్రింగి పురము ♦ ల్మాయించి పాఱు న్వడిన్. 150

ఉ. †వేఁడివెలుంగురస్మ్ములను ♦ వేసఁగిఁ గ్రాఁగినసీళ్లనుండి పై
కీడెనునావి యభ్రమున ♦ కేగి సదాగతిశక్తి నభ్రి మై
కూడి జలస్వరూపమును ♦ గొంచు ధరం బడు వెండి వర్ష మై
వీడి పదంబు త్రుళ్లిపడు♦వీఁకిఁడికిం జనవే యథోగతుల్. 151

వ. అట్టిప్రావృట్కాలంబునఁ బాండవు లామరున్మార్గంబుల విహరించుచు సుఖం
బుండి రంత. 152

## శరత్కాలవర్ణనము.

క. శరదాగమమ్ము గురుతర,పరితోషాగమము హంస♦వారమ్ములకున్
స్మరదివ్యాగమ మొప్పెను, బరివర్ధితసస్యపర్ణ♦భవ్యాగమ మై. 153

సీ. నదు లెల్ల నిర్మలా♦నందకందము లయ్యె, నంచల కానంద ♦ మతిశయిల్లె
నాకసంబు వినిర్మ♦లాకారమును గాంచెఁ, దీరి నక్షత్రముల్ ♦ తేజరిల్లెఁ
బంపువెన్నెల గాచె ♦ నిండి రేల్ కన్నుల,పండువై కమలముల్ ♦ పరిఢవిల్లెఁ
బొలము లెల్లను సస్య♦కలితంబులై యొప్పెఁ, గ్రపవనంటులు ♦ కడుఁ దలిర్చె

తే. నలినగర్భమరందపా♦నప్రమత్త, భృంగసంగీతనాద మొ♦నంగ దెసల
భూమిసతి కిడ్డమేటివిం♦జామరములు, నాఁగఁ దగె జెల్లుపూల్ శర♦దాగమమున. 154

* సురగోపము = ఆరుద్రపురుగు. తృణపుంజము = ఇట నల్లనికాలతృణమును గ్రహించునది.
‡ శర్వర్యటి = రాత్రిసంస్త్రీ. † ఈఁడు = చాలఁగు. అని = ఉబ్బ. అభ్రము = ఆకాశము, మేఘము.



చ. *తెలతెలపోయె మేఘములు ♦ తేటి కృశత్వము నొందె వాఁకలున్
గలకలలాడె హంసములు ♦ కాంతము లై కమలంబు లొప్పెడున్
జలజల రాలె మంచు మృగ♦జాతికి సంతస మయ్యె సస్య డిం
పలరఁగ రేలఁ బట్టపవ♦లట్టులు తీరిచి కాచె వెన్నెలల్. 155

చ. ‡ఇలవయి నెల్లవర్ణములు ♦ నేకవిధం బయి తన్నుఁ జేరఁ దా
నలరెను బ్రహ్మమో యనఁగ ♦ నంతట నిండి విశుద్ధకాంతి మై
వెలసి సమస్తజీవులకు ♦ వేడుకఁ గూర్చుచుఁ దీర్చి కాసె రేల్
నలిగఁ జకోరపాళి కశ♦నం బయి శారదచంద్రచంద్రికల్. 156

మ. ఎలమిం గార్తికమాధవుండు త్రిజగ♦ద్వ్యాకూపరస్వాంతుఁ డై
యిలపై మెట్టఁగ రాఁ దదీయు లవు ♦ డెంతేభక్తి భావించి ర
త్తులసీకాంత సహస్రదీపములతోఁ ♦ దోఁతెచ్చి నెత్తమ్మి పూల్
సెలఁగం జల్లె ననంటి పం డ్లిడె వహిం♦చెన్ జెల్లు వింజామరల్. 157

ఉ. సారసపత్రనేత్రలు ని♦జప్రమదావనసౌధవీధులం
జేరి మనోరథంబునను ♦ జెల్వము మీఱఁగఁ దీరి బారులై
శారదపూర్ణిమానిశల ♦ సారెకు వెన్నెలవత్తు లాడుచున్
మారునిదీములో యనఁ గ♦నం దగి రందము చంద మేర్పడన్. 158

తే. †తమకు నాకాశధర్మంబు ♦ దవిలికొనఁగఁ, గలఁక దేఱి వినిర్మల♦గతులు గలిగి
సరసు లుల్లసిలున్ శర♦త్సమయమునఁ బొ,నరుపరమహంసల కగుమా♦నసములట్లు.

తే. §తనయుజన్మదినము ♦ దా పయి వచ్చు నం,చెంచి సంతసమున ♦ మించు ననఁగ
శరవణంబు పూచె ♦ సంపూర్ణపూర్ణిమా,చంద్రకాంతి కెనయఁ ♦ జాలుకాంతి.

వ. అట్టిశరత్సమయంబునఁ దాపసపరివృతు లైన పాండవులు సరస్వతీజలస్నానపానం
బులఁ బరిమోదించుచుం గొన్నిదినంబు లుండి ధౌమ్యసహితు లై సూతపౌరో
గవాదులం గూడి కామ్యకకాననంబునకు వచ్చి యందలి మునిబృందంబులచే నభి
నందితు లయి యున్నంత నొక్కద్విజుం డరుదెంచి ధర్మజుం గాంచి యి ట్లనియె.

* కలకలలాడె = ప్రకాశమానముగా నుండె నని గ్రహించునది. ‡ నలిగ = అధికముగ.
† ఆకాశధర్మము = ఇపుడు నిర్మలత్వము గ్రహించునది. ఇందుఁ బరమహంసమానసాదిశబ్దములు శ్లేషించుచున్నవి.
§ శరవణము = రెల్లు. తనయుజన్మదినము = ఇటఁ దనయుఁ డనఁ గుమారస్వామి (రెల్లు చూడు) యనియు, జన్మదినము మార్గశీర్షాది యనియు నది సమీపమం దున్న దనియు గ్రహించునది.

చ. యదుకులసార్వభౌముఁడు మ♦హామహుఁ డామధుసూదనుండు మీ
యుదయము గోరుచుండును మ♦హోన్నతకీర్తుల రై నమీర లి
ప్పదమున వచ్చియుంట విని ♦ పార్థివతల్లజులార మిమ్ము న
మ్మదమునఁ జూడ వచ్చెడిని ♦ మానవతీమణి సత్య వెంట రాఁ. 162

వ. మఱియును. 163

ఆ. బహుళవత్సరములు ♦ బ్రదికి మహాతపం, బాచరఁ జేసి శుచితుల♦సార మెఱిఁగి
వినుతి కెక్కినట్టి♦ఘనుఁడు మార్కండేయ,మౌనివరుఁడు నిటకుఁ ♦ గాన వచ్చు. 164

శ్రీకృష్ణుఁడు సత్యభామతోఁ బాండవులకడకు వచ్చుట.

ఉ. ఈవగఁ బల్కుచున్నతఱి ♦ నెల్లర కబ్రము దోఁప శైబ్యసు
గ్రీవసమంచితం బగువ♦రిష్ఠరథంబున సత్యభామతో
నావసుదేవపుత్త్రుఁడు స♦మాగతుఁ డయ్యెఁ బులోమపుత్త్రితో
దేవవిభుండు వోలెఁ గురు♦దేశవిభుం గనునిచ్చపెంపునన్. 165

వ. ఇట్లు సమాగతుం డైన వాసుదేవుం డాసమీపంబున రథావతరణంబు చేసి వచ్చి ధర్మనందనవాయునందనుల కభివందనంబు చేసి ధౌమ్యుం బూజించి తనపాదంబుల సాఁగిలి పడిన నర నకుల సహదేవుల నక్కునం జేర్చి ద్రౌపది నాశ్వాసించి విశ్రమించె నంత సత్యభామయు ద్రోవదిం గౌఁగిలించుకొనియె నప్పు డప్పాండుసందనులు పురోహితుం బురస్కరించుకొని పుండరీకాక్షుం బూజించి నలుగడఁ బరివేష్టించుకొని యుండి రంత హృషీకేశుండు గుడాకేశుం గూడి గుహునితోడం గూడినభగవంతుం డగుభవుం డనం బరఁగి విజయవిజయప్రకారం బంతయు విని సంతసించుచు విశ్రమించి ధర్మరాజుం బ్రశంసించుచు నిట్లనియె. 166

సీ. రాజ్యలాభముకంటెఁ ♦ బూజ్యంబు ధర్మంబు, ధర్మార్థము తపంబు ♦ దనరు ననుచు
సత్యార్జవంబుల ♦ సదమలధర్మంబు, నసువ వ్రతంబులు ♦ కడఁక నలిపి
వేదంబులును ధను♦ర్వేదంబునుం బొంది, క్షాత్రధర్మంబున ♦ ధాత్రి నేలి
యర్థ మార్జించి స♦ర్వాధ్వరంబు లొనర్చి, యుభయలోకములఁ బెం♦పొందు దీవు

ఆ. *గ్రామ్యధర్మములను ♦ రతి లేదు నీ కర్థ,లోభమునను ధర్మ♦లోపముగ మె
లంగ వీవు సత్య♦సంగతి మెలఁగుట, ధర్మరాజ నాఁగఁ ♦ దనరి తధిప. 167

చ. కురుసభ నట్లు ద్రౌపదిని ♦ గొంచ నధర్మ మొనర్పఁ గాంచి లోఁ
గరము సహించి తమ్ములకుఁ ♦ గా దిటు నీదుప్రతిజ్ఞ నెల్ల నె

* గ్రామ్యధర్మములు = తప్పుపనులు, రతి = కోరిక.



ల్లరమును బూనియుంటివి బ♦లంబులతో నరి:నిగ్రహింప నో
నరవర రాజ్యపాలన మొ♦నర్తువు సర్వసమృద్ధులుం దగన్. 168

క. మీపుణ్యంబున నర్జునుఁ, డాపశుపతివలన జగము ♦ లగ్గింపంగా
నేపారునస్త్రరాజము, లీవగిదిం బొంది వచ్చె ♦ నే మనవచ్చున్. 169

చ. *వినుము దశార్హయోధు లగు♦వీరులునుం గుకురాంధకాదులున్
మనమున నీనిదేశమును ♦ మన్నన సేయుచు నున్నవారు నీ
వని మొనకట్టితేని సుర♦థాశ్వగజాదిచమూసమేతు లై
చని ఖలు లైనకౌరవులఁ ♦ జక్కడుపం దలపోసి రీసునన్. 170

క. తమ్ములబలమున్ బంధుజ,నమ్ములతోడ్పాటు కలిగె ♦ నరనాథ యిఁకన్
సమ్మతి నాగపురిన్ రా,జ్య మ్మేలం జనుము వ్యసన ♦ మంతయుఁ దీఱన్. 171

వ. అని ప్రశంసించుచుఁ బాంచాలిం గాంచి యి ట్లనియె. 172

ఉ. శీలము గల్గి నీసుతులు ♦ శిష్టసుహృజ్జననిత్యసంగతిన్
బోలి యదుప్రభూతు లగు♦పుత్త్రులమైత్రిని బొల్చుచుంటఁ బాం
చాలముపొంతఁ బోవ కని♦శంబును ద్వారకయందె యుండి భూ
పాలురు మెచ్చ మచ్చనను ♦ భాసిలుచుండిరి పేర్మిపెంపునన్. 173

తే. ఈవునుం గుంతియును వారి ♦ నెట్లు చూచు,చుందురో దాని కిబ్బడిఁ ♦ బొందుపొసగఁ
కేఁ బవల్ సూచుచున్నది ♦ ప్రీతి గదుర, నవప్రమోదములో సుభ♦ద్రాంబుజాక్షి.

వ. ప్రద్యుమ్నుం డనిరుద్ధాభిమన్యుసుధభానులకుం బోలె నీకుమారులకును నస్త్రశస్త్రవిశేషంబు లెల్లఁ దెల్లంబుగ నేర్పుచున్నవాఁడు వారు ననిశంబు రథాశ్వయానాదుల విహరించుచు సంతసించుచున్నవారు వారికై విచారింపం బని లేదు ధార్తరాష్ట్రులకుఁ జేటుకాలంబు వచ్చె మీకు మే లగు నని యాశ్వాసించుచున్నతఱిఁ గృతాంజలి యై ధర్మరాజు ట్లనియె. 175

ఉ. నందియ మేల నీ వనిన♦చందమునం దగుఁ గాదె సర్వ మో
నందకపాణి మాకు శర♦ణం బొకనీ. వని నమ్మియుంటి మే
మందఱమున్ భవద్వచన♦మందు మెలంగుదు మీప్రతిజ్ఞ సె
ల్లం దుది నీతలం పయిన♦లాగునఁ జేయు మనుగ్రహింపవే. 176

వ. అని విన్నవించుచున్నసమయంబున. 177

* మొనకట్టు = ఉత్సహించు. చక్కడుచు = ఖండించు; చంపు.

—•◆ మార్కండేయుండు పాండవులయొద్దకు వచ్చుట. ◆•—

చ.*బహుళతపం బొనర్చి బహు♦వర్షసహస్రము లేగఁ జేసియున్
స్పృహమెయి నిర్వ్యదేనునను ♦ లే కలవాఁ డయి రూపవంతుఁ డై
తహతహ లేక వేలుపువి♦ధంబున వెల్గెడువాఁడు మానితో
డహివలయుండు నాఁ బొలిచె ♦ నందు మృకండుసుతుండు దండి యై. 178

వ. అట్లు మార్కండేయుండు తనసముఖంబునఁ బ్రత్యక్షం బగుటయుం గని కృష్ణసహితు
లైనపాండవులును గృష్ణుండును బ్రాహ్మణులును వాని నెదుర్కొని తెచ్చి సుఖా
సీనుం జేసి పూజించి సేవించి రంతఁ గేశవుండు పాండవానుమతంబున నతనిం జేరి
నమస్కరించి యి ట్లనియె. 179

ఉ. ఏనును సత్యయుక్ ద్విజులు ♦ నీదుపదాత్మజ పాండవేయులున్
నీనుడు లాలకించుటకు ♦ నిల్చితి మీవు దయారసం బెడం
బూని వచింపవే యిపుడు ♦ పుణ్యపురాతనరాజవృత్తముల్
మానిమహత్త్వముల్ సతుల♦మాన్యచరిత్రము మానిసత్తమా. 180

వ. అని యడుగుచున్నయవసరంబున నారదుం డరుదెంచి వారిచే నర్చితుం డయి వా
రెల్ల ధర్మకథాశ్రవణాసక్తు లగుట యెఱింగి మార్కండేయుం జూచి యి ట్లనియె. 181

క. వీ రెల్లఁ బుణ్యవృత్తము, లారయ నర్థించుచుండి ♦ రదిగావున నో
భూరిప్రభావ వీరికిఁ, గోరికమెయి ధర్మ మెఱిఁగి♦కొనఁ జేయఁ గదే. 182

వ. అని యభినందించి చనియె నంత మార్కండేయుండు కృష్ణాదులం జూచి మీ
రెల్లరు సావధానచిత్తుల రగు డెంతయో చెప్ప వలసియున్న దనిన ధర్మనందనుం
డమ్మునిం గాంచి నమస్కరించి కథాప్రచారంబు సేయం దలంచి యి ట్లనియె. 183

చ.‡మునివర నీ వెఱుంగుదువు ♦ పుణ్యచరిత్రము లెన్ని యేనియున్
ఘనుఁడవు ధర్మవేత్తవు జ♦గన్నుతకీర్తివి నిన్ను నీజనా
ర్దనునిసమక్షమం దడిగెఁ♦ద న్ దయ చేసి వచింపవే మనం
బునఁ గలసందియంబులను ♦ బోకడపెట్టఁగఁ జాలుధర్మముల్. 184

వ. అని మఱియును. 185

సీ. ధర్మమం దెప్పుడుఁ ♦ దగిలి మెలంగెడు,వా రిట్లు సుఖ మేది ♦ పొలఁగుటయును
ధర్మవిహీనులై ♦ దుర్మతు లగుధార్త,రాష్ట్రులు సుఖులై ప♦రంగుటయును

* సమలు = సంవత్సరములు. ‡ పోకడపెట్టు = పోఁగొట్టు.



గన సందియం బొందు ♦ గలిగె నో మునినాథ, తెలియఁ జెప్పవె తేట♦తెల్లముగను
జనుఁడు శుభాశుభ♦ఘనకర్మముల కెల్లఁ, గర్త యీశ్వరుఁ డెన్నఁ ♦గాఁడు గాన

ఆ. నతఁడ కర్మఫలము ♦ నంద నోఁ గద యిందుఁ, బొందునొక్కొ పరంబు♦నందుఁ బొందు
నొక్కొ యిందు నందుఁ♦నొందునో యెందును, బొందఁడో యెఱుంగఁ♦బోలు నాకు.

వ. అనిన మార్కండేయుండు నీ యడిగినప్రశ్నం బుత్తమంబు దాని నీ వెఱింగినవాఁడ
వయ్యును బ్రచారార్థంబు న న్నడిగితివి గావునం జెప్పెద నాకర్ణింపు మని యి ట్లనియె.

—•◆ మార్కండేయుండు ధర్మరాజునకుఁ గర్మగతిప్రకారం బెఱింగించుట. ◆•—

సీ. మునుమున్న పుట్టిన♦ఘనుఁడు ప్రజాపతి, పుట్టించెఁ బరిశుద్ధ♦భూతములను
ధర్మతంత్రంబు లై ♦ తనరునాభూతము,లందు నరుల్ ఘను ♦ లనఘగతులు
సత్యవాదు లమోఘ♦సంకల్పులు శమాది,సుగుణసంపన్నులు ♦ శుద్ధమూర్తు
లల్పబాధులు ప్రసి♦ద్ధార్థులు నిరుపద్ర,వులు నిజేచ్ఛాజీవు ♦ లలఘుమతులు

తే. ద్వేషరాగప్రముఖదోష♦విరహితు లయి, బహుసహస్రసంతాను లై ♦ బ్రహ్మభూతు
లై ప్రబరికి పెక్కువేలేఁడు ♦ లమరులట్లు, సర్వజగములఁ దిరుగంగఁ ♦ జాలి రధిప. 188

వ. అంతఁ గాలాంతరంబునఁ బృథివీతలచారు లగునమ్మనుష్యులు కామక్రోధలోభమో
హాభిజాతులు మాయావ్యాజోపజీవులు వ్యర్థసంకల్పులు నిరర్థకులు విజ్ఞానవిరహితులు
నశుభకర్మాచరణైకతత్పరులు వ్యాధిబాధితు లల్పాయుష్కు లై నాస్తికు లై మహా
పాతకంబు లాచరించుచుఁ దిర్యగ్యోనులం బుట్టుచు నరకంబు లనుభవించుచు సంసార
చక్రంబునం బడి పరిభ్రమింపం దొడంగి రని వెండియు. 189

చ. పొనరిచి పుణ్యపాపములు ♦ భూమి జనుండు మృతిం గ్రహించి మిం
చినగతిఁ బోవునప్డు తన♦చేసినకర్మము నీడవోలె వె
న్కొని చని మంచిచెడ్డలను ♦ గూర్చు గతుల్ గలిగించు నందునన్
గొని సుఖదుఃఖముల్ మరలఁ ♦ గొంతటిలో భవ మందు నిద్ధరన్. 190

క. అరయఁగఁ బుణ్యాత్ముఁడు ధరఁ, బరమోత్తమజన్మ మెత్తుఁ ♦ బాపాత్ముఁడు దా
నిరయమునఁ గూలి వెండియు, ధర నధమపుజన్మ మెత్తు ♦ ధరణీనాథా. 191

తే. తనపొనర్చినకర్మంబు ♦ తనువు సెడినఁ,గాని సెడ దింత యేనియుఁ ♦ గాన నుత్త
ములకు నుత్తమలోకముల్ ♦ ఖలుల కధమ,లోకములు గల్గు నని మది♦లోనఁ గనుము.

మ. శ్రుతిశాస్త్రార్థపరాయణుం డయి మన♦శ్శుద్ధిం దపంబుండి సు
స్థితుఁ డై యుత్తమమార్గ మందినఋషి♦శ్రేష్ఠుండు సుక్షేత్రమే

గతిగా గర్భమునందు నుండుటలు వె♦న్కన్ బుట్టుటల్ గాంచుచున్
స్తుతిపాత్రుం డయి కర్మభూమి యగునిం♦దుం బుట్టి స్వస్థుం డగున్. 193

వ. కర్మబద్ధం బయినయీప్రపంచంబునం గలప్రాణికోటియం దొకని కిహంబునందును వేఱొకనికిఁ బరంబునందును మఱియొకని కిహపరంబులందును సుఖం బగు నింకొక్కని కెందును సుఖంబు లేదు తత్ప్రకారం బెట్టి దంటివేని వినుము. 194

మ. ధనవంతుం డయి పూని కట్టి తొడి కాం♦తాలోలుఁ డై లోభమో
హనిబద్ధుం డయి పుణ్యకర్మవిముఖుం ♦ డై యుండువాఁ డెన్న నిం
దు నితాంతంబు సుఖంచు నందు మిగులన్ ♦ దుఃఖంబులం బొందు దు
ర్జనలోకప్రతిపాద్యమాననిరయ♦ప్రధ్వస్తమానాత్ముఁ డై. 195

చ. జపము తపం బొనర్చుచును ♦ శాంతియు దాంతియుఁ గల్గి యోగమం
దెపుడు వసించుచున్ శ్రుతుల ♦ నిచ్చఁ బఠించుచు జీవహింసయం
దపగతచిత్తుఁ డై మెలఁగు♦నట్టిఁ డిహంబున సౌఖ్య మంద లేఁ
డపరిమితప్రకారముల ♦ నందుఁ బరంబున సౌఖ్యసంపదల్. 196

ఉ. ఉత్తమపద్ధతిం ధనము ♦ లొప్పఁగఁ గూర్చి వివాహితుండు లో
కోత్తరుఁ డై మహాధ్వరము ♦ లొయ్యనఁ జేసి బుధుల్ నుతింపఁగా
విత్తము త్యాగభోగముల ♦ వెచ్చపడం బొనరించుచుం బరా
యత్తమతి న్మెలంగునరుఁ ♦ డందును నిందును సౌఖ్య మందెడున్. 197

ఉ. *లే దని పల్కుచుం దపము ♦ లేక జపంబును లేక లేకి యై
సాదుల దూఱుచున్ శమము ♦ సత్యము గానక వ్యర్థహింస కై
తాఁ దిన కోడ్లకు న్విడక ♦ ధర్మమతిం దిగఁద్రొవి మూఢుఁ డై
చీఁదఱఁ గొన్నవాఁడు చెడు ♦ సిద్ధి నెఱుంగక యిందు నందునున్. 198

వ. ఇది కర్మగతిప్రకారంబు. 199

ఉ. మీరలు దివ్యమూర్తుల ర♦మేయపరాక్రమవిక్రమంబునన్
దీరినవార లత్యధిక♦తేజుల రెల్లకళావిశేషముల్
నేరిచినట్టివార లిటు ♦ నిర్జరకార్యముఁ దీర్ప భూమికిన్
జేరినవార లాఢ్యులరు ♦ చెప్పితి నమ్ముఁడు నిక్క మింతయున్. 200

* లే దని పల్కుచు:—ఇట్టివాఁడె నాస్తికుఁ డని తెలియందగు. లేకి = అప్రయోజకుఁడు.
చీఁదఱ = ఈ పదరివము.



తే. శూరు లై మీర లుత్తమా♦చారశీలు, రగుచు నున్నతకార్యంబు ♦ లాచరించి
సురలఁ జెతరులఁ దనిపి త♦త్సుకృతమునను, స్వర్గ మంది సుఖంతు ర♦వ్వల నతంబు. 201

వ. ఇప్పు డింత పడుచున్నవార మని విచారింప వల దీక్లేశంబు తుదకు సుఖార్థంబ యగు ననిన ధర్మనందనుం డూఱడిల్లి బ్రాహ్మణప్రభావంబు విన వలతుం జెప్పు మనిన మార్కండేయుం డతని కి ట్లనియె. 202

మార్కండేయుండు బ్రాహ్మణప్రభావము చెప్పుట.

తే. మున్ను హైహయవంశసం♦భూతుఁ డైన, రాకుమారుఁడు మృగయాస♦మాకులాత్ముఁ
డై మెలంగుచు నొకయర♦ణ్యంబునందుఁ, దృణలతాగుల్మవృత మైన♦ దేశమందు.

వ. కృష్ణాజినోత్తరీయుం డై కూరుచుండినయొకమునికుమారుం జూచి మృగం బని శంకించి శరంబునం జేసి కూలనేసి తెలిసినంతఁ బశ్చాత్తాపతప్తుం డై వగచుచుం జని తనకులవృద్ధుల కంతయుం జెప్పిన వారు వానితో నటకుం జని వానిం గాంచి వీఁ డెవ్వనివాఁడో యని వనంబున నలుగడ రోయుచు. 204

ఉ. పోయి యరిష్టనేమి యనఁ ♦ బొల్చినతార్క్ష్యమునీంద్రునాశ్రమం
బాయెడఁ గాంచి మ్రొక్కుటయు ♦ నమ్ముని వారికిఁ బూజ సేయఁగాఁ
బోయిన వార లి ట్లనిరి ♦ పూజ కనర్హుల మేము మాజనుం
డీయడవిన్ వధించె నొక♦పృథ్విసురుం దురితంబు చేకుఱన్. 205

వ. అనినఁ దార్క్ష్యుం డిట్లనియె. 206

తే. ఎట్లు హతుఁ డయ్యె బ్రాహ్మణుం ♦ డెచట నుండెఁ
దెలియఁ జెప్పుఁడు నాతపో♦బలము మీర
లరసికొనుఁ డన్న వార లా♦యన క దంత
యును నెఱింగించి రెంతయు ♦ వినయమునను. 207

తే. అంత హైహయు లచట గ♦తాసు వైన
మునికుమారుని వెదకి యెం♦దునను గాన
కంతయును స్వప్నవృత్తాంత♦మట్లు తలఁచి
నివ్వెఱంపడుచుండిరి ♦ నెమ్మనమున. 208

వ. అంతఁ దార్క్ష్యుండు హైహయుల కాకుమారుం దెచ్చి చూపి యి ట్లనియె. 209

శా. మీచేతన్ హతుఁ డైనవాఁ డితఁడొకో ♦ మీ కానవా ల్పట్ట నై
తోఁచెం బో యితఁ డస్మదీయుఁడు సుపు♦త్రుం డంచుఁ దెల్పంగ వా
రాచిన్నారికుమారుఁ జూచి మది న♦త్యాశ్చర్యముం బొంది యో
హో హా చిత్రం బిది చచ్చి పుట్టె నితఁ డె♦ట్లో విస్మయం బయ్యెడిన్. 210

వ. ఇది మీతపోమాహాత్మ్యంబు గావలయు విన వలతు మనిన నతండు వెండియును.

శా. మ మ్మెవ్వం గన నోడు మృత్యువు స్వధ♦ర్మంబందు మే ముండి న
త్యమ్ముం బల్కుచుఁ బుణ్యదేశవసతిం ♦ దళ్కోత్తి శీలమ్ము శౌ
చమ్ముం గల్గి శమాదులం దగిలి మా♦త్సర్యంబు వోనాడి లో
క మ్మెన్నంగ సమాగతాతిథుల వే♦డ్కం గొల్చుచుం బొల్చుటన్. 212

వ. మీ కిట్లు మాతపఃప్రభావంబున లేశమాత్రం బెఱింగించితి నింక మీరు బ్రహ్మహత్యాతిపాతకంబువలనిభయంబు దక్కి పొం డనిన హైహయు లట్లు యగుం గావుత మని సంతసించుచుఁ దార్క్ష్యం బూజించి నిజనివాసంబులకుం జని రని చెప్పి మార్కండేయుండు వెండియు బ్రాహ్మణప్రభావంబు చెప్పెద విను మని యి ట్లనియె.

అత్రిగౌతమసంవాదము.

ఉ. అత్రి యనంగఁ బేర్వడిన♦యట్టిమునీంద్రుఁడు మున్ మహాతపం
బాత్రము వో నొనర్చుటకు ♦ నై తలపోయుచు ధర్మపత్నినిం
బుత్రులఁ బిల్చి కాన కిదె ♦ పోయెద నే నిరుపద్రవార్థ మా
ధాత్రిఁ దపింప నావుడును ♦ దామరసేక్షణ తత్క్షణంబునన్. 214

చ. మగనికి మ్రొక్కి యి ట్లనుఁ గొ♦మాళ్లును భృత్యులుఁ గూటిపేద లై
వగచుచు నిట్టు లుండ నిట ♦ వారల నెల్లరఁ బెట్టి పోవఁగా
నగునె మహాత్మ విత్త మిసు♦మం తయినన్ గణియించి యిచ్చి పోఁ
దగు నిది ధర్మ వం చనరె ♦ ధర్మవిదుత్తరు లీ వెఱుంగవే. 215

ఉ. వైన్యుఁడు లోకమాన్యుఁ డయి ♦ వాజిసవం బొనరించుచుండె నేఁ
డన్యవదాన్యు లెవ్వ రిసు♦మంతయు నాదరౌఁ బోలనేర రా
ధన్యుని వేడఁ బోయినను ♦ దప్పక యిచ్చెడు వాంఛితార్థముల్
మాన్యచరిత్ర నా దయిన♦మాట మనంబునఁ బాటి సేయవే. 216

వ. అనిన నత్రి కళత్రంబున కి ట్లనియె. 217

మ. గరితా యి ట్లని చెప్పె గౌతముఁడు లో♦కఖ్యాతుఁ డావైన్యభూ
వరుఁ డర్థించిన నిచ్చు నర్థములు దై♦వారంగ నెవ్వారి కై
న రహస్యం బౌశఁ డౌను దత్సభఁ గనున్ ♦ నామీఁద ద్వేషించి పె
క్కురు విద్వేషులు గల్గ విందు నట నా♦కు న్మేలు చేకూరునే. 218

క. నామాట సెల్లకుండఁగ, నే మైనం జేయు నచట ♦ నెంతురు వగ లో
క్షోమలి మెది యె ట్లైనన్, నీమాటం జేసి పోవ ♦ నే నిపు డెంతున్. 219



వ. అని పలికి పయనం బై యతండు వైన్యయజ్ఞాయతనంబునకుం బోయి వైన్యుం గాంచి ప్రస్తుతించుచు ని ట్లనియె. 220

మ. మనుజాధీశ్వర నీవు ధన్యుఁడ వసా♦మాన్యప్రభావుండ వా
దినరేంద్రుండవు నీశ్వరుండవు మహా♦తేజస్వి వెల్లప్పుడున్
నినుఁ బోల్కొందురు మానితల్లజు లెదన్ ♦ నీకంటె నొండొక్కనిన్
ఘనునిన్ ధర్మవిదున్ వదాన్యు నెచటం ♦ గానంగఁ బో రెవ్వరున్. 221

ఆ. అనినఁ గ్రుద్ధుఁ డగుచు ♦ నట నున్నగౌతముఁ, డత్రిఁ గాంచి యనియె ♦ నడరి నీదు
ప్రజ్ఞ దఱిఁగె నిట్లు ♦ ప్రలపింతు వేటికి, నోట వచ్చినట్లు ♦ మేటివోలె. 222

ఆ.*అర్థకాంక్షఁ జేసి ♦ యాదినరేశ్వరుం, డీశ్వరుం డటంచు ♦ నితని బూతు
వోలెఁ బొగడి తీవు ♦ పోలునే యింద్రాదు, లాద్యు లై ప్రశస్తి ♦ నంది యుండ. 223

చ. అనవుడు నత్రి యి ట్లనియె ♦ నక్కట నీకు ని టాడఁ జెల్లునే
ఘనతరవైభవంబున జ♦గన్నుతుఁ డై విలసిల్లి కాశ్యపిన్
దనరఁగ నేలునీతఁడె వి♦ధాతయు నింద్రుఁడు చంద్రుఁ డెన్న నో
మునివర నీదుచిత్త మిట ♦ మోహమునం జెడె నేమి సెప్పుదున్. 224

క. నావుడు గౌతముఁ డి ట్లను, నోవృద్ధుఁడ నేను మోహ♦యుక్తుండను గా
నీవే మోహావిష్టుఁడ, వేవిధమున ధర్మ మెఱుఁగ ♦ నెంతువు చెపుమా. 225

వ. నీవు వయోవృద్ధుండ వైనను జ్ఞానవృద్ధుండవు కాఁ జాలవు బాలుండవు మూఢుండవు నని యధిక్షేపించె నట్లు వా రిర్వురు నుర్వియు నాకాశంబునుం బగులునో యన నుచ్చైర్నినాదంబునఁ బెద్దయుం బ్రొద్దు పెద్దవాదంబు పెట్టుకొనిన నందలివా రెల్లం గలంగి వీరి నెవ్వ రిందుఁ బ్రవేశపెట్టి రని గర్హించుచుండి రవుడు కాశ్యపుం డను మునీంద్రుండు వారికడకుం జని మీ రేల యిట్లు కలహించుచుంటిరి చెప్పుం డనిన గౌతముం డి ట్లనియె. 226

క.‡వినుఁ డో భూసురులారా, మనముల నెరియించునట్టి♦మా వాదం బీ
మనుజేంద్రు నింద్రుఁ డని యీ, ముని పొగడెం గా దటంచు ♦ మొనసితి నేనున్.

వ. అనిన విని సదస్యు లెల్లరు దానిం దీర్ప నేరక ధర్మవిద్వరిష్ఠుం డగుసనత్కుమారుపాలికిం జని వారివివాదం బెఱింగించి సంశయచ్ఛేదంబు సేయు మని ప్రార్థించిన నతండు వారి కి ట్లనియె. 228

---

* బూతు = బట్టువాఁడు, వంది.

‡ మొనయు = పూను.

చ. *ప్రజల నజస్రముగ్ మనుచు ♦ వైన్యుని ఁ జెప్పెదనత్రిపక్షమే
విజయము నొందెఁ గా దనుచు ♦ వీడ్వడుగౌతముపక్ష మోడె నే
వృజినము లంటనీక పృథి ♦ విం దగ నేలెడురాజచంద్రుఁడే
నిజముగ ధాతయుం భువన ♦ నేతయు శక్రుఁడు శుక్రుఁ డారయన్. 229

తే. బ్రాహ్మణునితోడ క్షత్రియ ♦ ప్రవరుఁ డెపుడుఁ, గూడి యుండిన గాలితోఁ ♦ గూడినట్టి
వహ్నిపోలిక శాత్రవ ♦ వనము లెల్ల, గడియలోపల నేర్చి లో ♦ కములఁ గూల్చు. 230

ఉ. భూతలమం దధర్మ మగుఁ ♦ బో యని బ్రాహ్మణుఁ లెల్లఁ దొల్లి యు
ద్భీతమనస్కులై తెలిసి ♦ స్వీయబలం బది క్షత్రమందు సం
ప్రీతిఁ దగిల్చి రందున వ ♦ రిష్ఠతఁ గైకొని రాజు నిర్జర
వ్రాతమునందు సర్వమని ♦ భాతి తమం బడఁగించి మించెడిన్. 231

వ. ‡ధర్మమూర్తి యనం జనునట్టిక్షత్రియుండు సామాన్యుండు గాఁ డతండు భూపతి యై ప్రజాపతి బృహస్పతి విరాట్టు సమ్రాట్టు యుధాజిత్తు సహాజిత్తు పురాజిత్తు సత్యమన్యుఁడు సత్యజీవుఁడు సత్యధర్మప్రవర్తకుఁడు స్వర్ణేత జగన్నేత భవుండు లోనగు పేళ్లం బేర్కొనంబడు నట్టిరాజు శాస్త్రప్రామాణ్యదర్శనంబునఁ బ్రధానస్థాన మలంకరించి జగత్త్రయార్చనీయుం డయ్యె నని వివరించిన విని సంతుష్టహృదయుం డయి వైన్యుం డత్రిం బిలిచి మహాత్మా నన్ని మనుష్యలోకంబునఁ బెద్దఁ జేసి దేవతుల్యుం డని ప్రశంసింపఁ జేసితివి గావున నీయెడ నేను బ్రసన్నుండ నయితి నీకు నానావిధంబు లగువిత్తంబులమొత్తంబును నుత్తమదాసీసహస్రంబును బదికోట్లగద్యాణంబులును బదిబారువులబంగారంబు నొసంగెదం గొను మని సత్కరించుటయు నతండును.

క. అవనీంద్రుఁ డొసఁగునర్థము, లవి యన్నియుఁ బడసి నిజగృ ♦ హమునకుఁ జని యు
త్సవ మెసఁగ నొసఁగి తనయుల, కవలఁ దపోవనముఁ జేరె ♦ సతినిష్ఠ మెయిన్. 233

వ. అని చెప్పి మార్కండేయుండు పాండవాగ్రజుం జూచి సరస్వతీతార్క్ష్యసంవాదం బను నితిహాసం బొండు గలదు విను మని వెండియు ని ట్లనియె. 234

—•—◆ సరస్వతీతార్క్ష్యసంవాదము. ◆—•—

తే. తొల్లి తార్క్ష్యుఁడు వాగ్దేవి ♦ నెల్లగతులఁ, గొలిచి ప్రత్యక్ష మగునామె ♦ కెలన నిలిచి
యి ట్లనియె దేవి పురుషుఁ డే ♦ మేమి చేసి, శ్రేయ మందు ధర్మచ్యుతిఁ ♦ జెందకుండ.

* శుక్రుఁడు = కవి, "సవిఃశక్రిశ్శుక్రిశ్చ" అని మూలము.

‡ గద్యాణము = బంగారునాణెము, వరహా.



వ. మఱియు నేకాలంబున నెట్టివ్రతంబున నగ్నిహోత్రు నారాధింప దగు నెట్లు చేసి పుణ్యగతులం బడయం గలుగుఁ జెప్పు మనిన భాషాదేవి వానిశుశ్రూష కలరి యి ట్లనియె. 236

మ. అనిశంబున్ శుచి యై శ్రుతుల్ చదివి బ్ర ♦ హ్మజ్ఞానముం గల్గియుం
డునతం డావల దేవలోకములయం ♦ దున్ దేవతాకోటితో
ననుఁగుంజుట్టమువోలె నై మెలఁగు ర ♦ మ్యారామదేశంబులన్
ఘనకాసారతటంబులన్ దివిజకాం ♦ తాకోటితో నాడుచున్. 237

సీ. స్వర్ణదానముచేసి ♦ సతతంబు సూర్యదే,వునిలోకమును బొంది ♦ తనరుచుండు
వస్త్రదానము చేసి ♦ వసియించు జైవాత్ర,కునిలోకమునయందుఁ ♦ గుతుక మలరఁ
దిలధేనుదానంబు ♦ సలిపి సంతసమున, వసులోకమును జేరి ♦ వాసిఁ గాంచు
భూదాన మొనరించి ♦ పోయి పురందరు,వరలోకమునయందుఁ ♦ బరఁగుచుండు

తే. హలము మోయంగఁ జాలిన ♦ బలము గలిగి, మెఱుఁగునెద్దును దానంబు ♦ సలిపిమనుజుఁ
డలరు దశధేనుదానంబు ♦ సలిపినట్టి, ఫలముఁ గొని పోయి సురలోక ♦ ముల సుఖించు.

శా. *పీనాపీన సమాంసమీన సుకరన్ ♦ విఖ్యాతవత్సాదరన్
గోనాథాంచితగోసమోహ్య సుఖసం ♦ దోహ్యన్ సువస్త్రాహి నా
స్థానిస్థాప్తి నలంకరించి కపిలన్ ♦ దానంబు గావించువాఁ
డానాకంబున నుండు నెన్నియెఁలు లా ♦ నప్పుడ్డ కన్నేఁడులున్. 239

క. అన్యు లెమ్మెచ్చెడుమచ్చునఁ, గన్యాదానంబు చేసి ♦ క్ష్మాతలమందున్
ధన్యుం డగుమనుజుఁ డసా, మాన్యగతిఁ దరింపఁ జేయు ♦ మఱి పితృగణమున్.

తే. ‡అధికతరనిష్ఠ నేడేఁడు లగ్ని వేల్చి, నతఁడు సప్తపూర్వులును స ♦ ప్తావరులును
బితలు తనతోఁ బునీతు లై ♦ వెలయఁ జేయుఁ, దనపొసర్చినకర్మగ ♦ తమునఁ జేసి.

వ. అశుచియు ననిర్ణిక్తపాణియు నబ్రహ్మవేత్తయు నవిద్వాంసుండు నగువాఁడు హోమకర్మంబున కర్హుండు గాఁడు దేవహవ్యంబున నశ్రోత్రియు నియోగింప జనదు వాఁడు శ్రద్ధమై నారాధింపఁ జాలండు శ్రద్ధావిరహితుం డిచ్చుహవిర్భాగంబు లమరులారగింప నొల్లరు వా రెప్పుడును శౌచం బారయుచుందురు శ్రద్ధధానులై వేలి

* పీనాపీన = బలిసినపొదుఁగు గలది. సమాంసమీన = ప్రతిసంవత్సరము ఈనునది. సుకర = సాధువైనది. సుఖసందోహ్య = సులభముగాఁ బిదుకనిచ్చునది. సువస్త్రాహి = తొలంచాలుపడ్డ. అస్థానిస్థాప్తి = అదనముయొక్కయు నిష్ఠయొక్కయు నొందుటచేత. కపిల = పుల్లావు.

‡ అవరులు = మీఁదివారు.

మహితశిష్టాళిక లగుసాధుశీలుర గోలోకం బధిగమించి సుఖింతు రనినఁ దార్క్ష్యుం
డామె కి ట్లనియె. 242

తే. నీవు క్షేత్రజ్ఞభూత వై • నెమ్మితోడఁ, గర్మకాండము బోధింతు • కరుణఁ దెలుప
నెంచు మమ్మ ప్రజ్ఞాదేవి • వేమొ కాక, యెవ్వతవో నీదుతత్త్వ మే • నెఱుఁగఁ దలఁతు.

వ. అనిన సరస్వతి యి ట్లనియె. 244

ఆ. వహ్నినుండి నేను • వచ్చితి విప్రుల, సంశయములఁ దీర్ప • సంయమీంద్ర
నీదుచెలిమిఁ జేసి • నిశ్చయ మి ట్లని, యెఱుఁగఁ జేయుచుంటి • నింతవట్టు. 245

తే. అనుడు నతఁ డిట్లు వలికె నోయమ్మ నీవు, కడు వెలుంగుచునుంటి మై • కాంతిగరిమ
నీకుఁ బురు డెవ్వతయు లేదు • నిక్క మెన్న, దివ్యమూర్తి వి నినుఁ బోలు • దేవు లెవరు.

వ. అనిన సరస్వతియు. 247

చ. మునివర యజ్ఞకర్మముల • ముఖ్యము లై తగు ద్రవ్యరాశి నే
ననిశము సంప్రవృద్ధ నయి • యత్యధికప్రభ వెల్గుచుండి త
ద్ఘనతరవస్తురూపమునఁ • దద్దయు నొప్పుచు హవ్యవాఙ్ముఖ
మ్మునఁ బ్రభవించి భక్తులకుఁ • బుణ్యఫలప్రద నై మెలంగుదున్. 248

వ. మఱియుఁ దపస్స్వాధ్యాయబ్రహ్మచర్యపరీతపుణ్యయోగంబుల వీతశోకు లై విముక్తు లైనపురుషులు పరాత్పరుం డైన పురాణుం డైనపురుషు నధిగమింతు రాపురుషముఖ్యంబున సహస్రశాఖోపశోభితం బైనమహావేదపాదపం బొం డగు దానిమూలంబునఁ బుణ్యోదకప్రస్రవణంబులును శర్కరాసైకతంబులును ధానాపూపమాంసశాకపాయసకర్దమంబులు నయినమహానదు లుదయించి ప్రవహించు నందు నింద్రాదిబృందారకబృందంబు లనేకాధ్వరంబు లొనరించుచుండు నది మత్పదం బని యెఱుంగుమని చెప్పిన విని తార్క్ష్యుం డద్దేవికి దండప్రణామంబు గావించి ధన్యుం డయ్యె నని చెప్పిన విని ధర్మజుండు మార్కండేయుం గని వైవస్వతమనువృత్తాంతంబు విన వలతు ననుగ్రహింపు మనిన నతం డతని కి ట్లనియె. 249

వైవస్వతమనుచరిత్రము.

తే. *కలఁడు తొల్లి వివస్వంతు • కన్నకొడుకు, ఘనుఁడు వైవస్వతుం డను • మను వతండు
తపమునం దేజమున లక్ష్మిఁ • దండ్రి మించి, తాతకు సమానుఁ డయ్యె వి • ఖ్యాతికలిమి.

తే. అతఁడు బదరీవనంబున • యందు నూర్ధ్వ, బాహుఁ డై యేకపాదము • వసుధ మోపి
యనిమిషుఁ డవాక్శిరుం డై • ఘనతపంబు, సలిపె బదివేలవర్షముల్ • స్థైర్య మెసఁగ.

* తాత = పితామహుఁడు, బ్రహ్మ.



వ. అతం డొక్కనాఁ డొక్కనదీతీరంబునకుం జని కృతావగాహుం డై యున్నసమయంబున నొక్కమత్స్యశాబకంబు దరికి వచ్చి యి ట్లనియె. 252

మ. *అలఘూదారగుణాబ్ధి! నీదుశరణం • బర్థింతు మత్స్యంబులన్
బలవంతంబులు దుర్బలంబులఁ దినుం • బాటింప కింతేని నే
నలఁతిన్ మత్స్యభయంబు నామనమునం • దయ్యెన్ మహోద్రిక్త మై
విలసత్కీర్తి వి నన్ను దీనుని దయన్ • వీక్షించి రక్షింపవే. 253

క. శరణాగతవత్సలుఁడవు, ధరణీశుఁడ వీవు నన్ను • దయ దైవారన్
మరణింపకుండఁ జేయుము, పరికింపఁగ నున్నతంపుఁ • బద మగు నీకున్ 254

వ. ‡నీకు నేఁ బ్రత్యుపకారంబు సేయ నోపుదు ననిన నతండు కరుణాతరంగితాంతరంగుం డై తనకరంబున నమ్మత్స్యశాబకంబుఁ బట్టి కొనిపోయి దానిఁ జంద్రాంశుసమప్రభం బగునొక్కయళింజరంబునం బెట్టి పుత్త్రప్రేమం జేసి పోషించుచుండె నంత నదియు దినదినప్రవర్ధమానం బై పెద్దకాలంబున కాకాఁగునం దనకెడము లేమిం జేసి యొక్కనాఁ డామనువుం గాంచి యి ట్లనియె. 255

చ. మొదలఁగఁ దావు లే దిచట • మే నిది పెచ్చు పెరింగె నోదయా
హృదయ మఱొంచు వో నిలుప • నెంచవె నావుడు నామనుప్రభుం
డది విని దానిసిం గొని ర • యంబునఁ గొండొకపెద్దవాపిలో
ముదమున నిల్పెఁ బో ల్పెసఁగె • ముందఱిచందమునన్ ఝషం బటన్. 256

వ. అ ట్లనేకవత్సరగణంబులు గడచనినవెనుక ద్వియోజనాయతంబు నేకయోజనవిస్తృతంబు నగునమ్మహావాపియుం దనకుఁ జోటు చాలమి జాలిం బడి మీను మనువుం జూచి యి ట్లనియె. 257

తే. ఇందు నీప్రోవునం జేసి • యేఁ బ్రవృద్ధి, నొందితిని మేను ద్రిప్పంగ • నందు లేదు
కరుణఁ గొనిపోయి నన్ను గం • గాస్రవంతి, నిలుపఁ దలపోయు మనుటయు • నృపవరుండు.

వ. కరుణాతరంగితాంతరంగుం డై దానిం గొని గంగానదిం దిగవిడిచి వచ్చె నదియు నటఁ గొంతకాలం బుండి మరల మనువుం జూచి. 259

క. ఈగంగానదిఁ గదలం, గాఁ గలుగదు తావు గానఁ • గరుణావార్ధీ
వేగమ వార్ధి న్నన్నిడఁ, గాఁ గడఁగుము నీకు మేలు • గాఁగల దనుడున్. 260

వ. వైవస్వతుండును మహోన్నతం బయ్యు వహనసౌలభ్యంబు నొంది యున్నచేప నెత్తికొని పోయి మహార్ణవంబునం బడవైచె నప్పుడు. 261

* మహోద్రిక్తము = చాల విజృంభించినది. ‡ అళింజరము = గాబు.

మ. కనుచుండన్ మకరాలయంబు తనకున్ ♦ గాయంబు లిప్పంగఁ జా
లనియట్లైన మఱొంటుచోట నను నిం♦ల్పం జూచి కాపాడు మో
మనుజాధీశ్వర యంచుఁ బల్కెడుమహా♦మత్స్యంబు వీక్షింపుచున్
మనమందున్ వెఱఁగంది యాతఁడు గడున్ ♦ దర్కించె మేధావియై. 262

శా. మాయాజీవియ కాని యిద్ది తెలియన్ ♦ మత్స్యంబు గా దింతలో
నీయంభోధియు నిండఁ బెంచెఁ దను వే ♦ నెన్నంగనుం జూడ ని
ట్లాయామంబు విశాలముం గలుగు మీ♦టాడంగ నారాయణుం
డీయోజ న్ననుఁ దేర్ప నుండె సహహా ♦ యే నెన్న ధన్యాత్ముఁడన్. 263

వ. అని యతని నుద్దేశించి. 264

చ. సకలచరాచరంబులను ♦ జంప భరింప సృజింపఁ గర్తవై
ప్రకటిత సన్మహత్వమున ♦ భాసిలుచుం ద్రిజగంబు లేలుర
క్షకులకు రక్షకుండ వగు♦సన్నుతమూర్తివి నిన్నెఱుంగ బ్రి
హ్మకును దరంబు గాదు సుజ♦నారివిమర్దన యోజనార్దనా. 265

ఆ. దిక్కు మాలినట్టి♦దీనులపాలిటి,దిక్కునీవ దేవ♦దేవ మత్స్య
రూప మైననీకు ♦ మ్రొక్కెద నీపాద,సేవకుండ నన్నుఁ ♦ బ్రోవవయ్య. 266

వ. అని ప్రార్థించినం బ్రసన్నుం డై మీనావతారుం డైనయప్పుండరీకాక్షుండు నవ్వుచు నతని కిట్లనియె. 267

సీ. నన్ను రక్షించితి ♦ వెన్న నీ కే నొక్క,హిత మొనగూర్చెద ♦ నెఱుఁగ వినుము
సంవర్తసమయంబు ♦ సంభవించు నచిర,కాలమం దంభోధు ♦ లోలిఁ బొంగు
జంగమస్థావర♦సంభృత మైనయీ,భౌమ మంతయుఁ జెడి ♦ ప్రలయ మగును
గాన నీ వొకనావ ♦ గావించుకొని యందు, సర్వబీజంబులు ♦ సంగ్రహింపు

తే, మంత సప్తర్షులను గూడి ♦ సంతసమున, దాని నెక్కి ప్రతీక్షింపు ♦ మేను వత్తు
శృంగి నై న న్నెఱింగి నా♦శృంగమునకుఁ, గట్టు మానావ శంకింప ♦ కెట్టు లనుచు.

వ. అని చెప్పిన వైవస్వతుం డట్ల చేయుదు ననుటయు నమ్మత్స్యమూర్తి వాని నామంత్రణంబు చేసి యంతర్ధానంబు నొందె నంత నమ్మను వమ్మహామత్స్యోక్తప్రకారమ్మున నౌకానిర్మాణంబును ధాన్యసంగ్రహణంబునుం గావించుకొనియె నంతఁ గల్పాంతంబున. 269

సీ. ద్వాదశాదిత్యు ల♦త్యంతతేజస్స్ఫూర్తి, నొకటఁ దోఁచి వెలింగి ♦ రుగ్రముగను
జలపట్టి సప్తజం♦ఝూవాతములు రేఁగి, యుర్వీధరముల నుత్♦ఖాత లూఁచె



నంభోధిసంభవో♦గ్రౌర్వాగ్ని చెలరేఁగి, నిఖిలప్రపంచంబు ♦ నిర్దహించెఁ
బుష్కలావర్తకాం♦భోదము ల్వొడివడి, యెల్లెడ జడివాన ♦ పెల్లు గురిసె

తే, సప్తసాగరములు మహా♦సంభ్రమమున,వేలలను మీఱి మి న్నంటి ♦ వెల్లివిరిసి
ఘూర్ణిలుచు భీషణం బయి ♦ కులనగములు, మున్నుగాఁ గలచోటులు♦ముంచి మించె.

వ. అపుడు వైవస్వతుండు సప్తర్షిసమేతుం డై సర్వధాన్యసంభృతం బైననావ నెక్కి యొక్కలం బగునమ్మహార్ణవంబు దరియింప నెంచి మీనమూర్తిం దలంచుటయును.

—●●◆ ప్రళయార్ణవంబున వైవస్వతునకు మత్స్యమూర్తి ప్రత్యక్షమగుట. ◆●●—

సీ. మేలిమిబంగారు ♦ మేల మూడఁగఁ జాలు,తళతళద్యుతితోడి♦తనువు పొదలఁ
బర్వతంబుల నైనఁ ♦ బగులింపఁగాఁ జాలు,శతకోటి కెనయగు♦పుచ్ఛంబు దనర
బ్రహ్మాండకోటుల ♦ భరియింపఁగాఁ జాలు,బలమైనవలుదమీ♦నలు చెలంగ
గిరులతెక్కలపెంపుఁ ♦ గ్రిందు సేయఁగఁ జాలు,చిఱుగరు లిరుగడఁ ♦ జెన్నుమీఱఁ

తే, దళుకు లీనెడుమిఱ్ఱుచూ♦పులు దలిర్ప, బిగువుదేఱినటెఱమీఱు♦మొగ మెసంగఁ
గుధరముల నెత్తఁదగునొంటి♦కొమ్ము పొసఁగఁ,మత్స్య మై వచ్చె నచటికి♦మాధవుండు.

ఉ. *వచ్చినమత్స్యమూర్తిఁ గని ♦ వాసవవందితుఁ డామనుప్రభుం
డెచ్చినభక్తి మ్రొక్కి, తద♦హీనముఖస్థితశృంగమందుఁ బెం
పచ్చుపడన్ వటారకమ♦యం బగుపాశము వైచి చుట్టినన్
మచ్చము హెచ్చి వారినిధి♦మధ్యమునన్ విహరించె వేడుకన్. 273

వ. అయ్యవసరంబున. 274

క. ‡తరఁగల నాడుచు గాలిం, బరికంపించుచును నీటి♦వడి ఘూర్ణిలుచున్
దరి శరధినడుమఁ దిరిగెన్, మరు బారిం జిక్కికొన్న♦మదవతివోలెన్. 275

తే. దిక్కులు విదిక్కులును భువి ♦ దివి యటంచుఁ
దెలియఁగా రాక యొటఁ జూడ ♦ జలమ యగుచు
భూరిభయదమహాధ్వాన♦పూర్ణ మగుచు
వెల్లివిరిసె జలార్ణవ ♦ మెల్లకడల. 276

వ. అట్టిసమయంబున. 277

—●●◆ మత్స్యమూర్తి ప్రళయార్ణవంబున విహరించుట. ◆●●—

సీ. ఉదధినీ రంతయు♦నొయ్యొయ్య దివ మంట, నొనరించు ఫూత్కార♦మొక్కమాఱు
పాతాళభాగంబు♦పట్టు చూపట్ట నీ, ళ్లొగిఁ దోఁకఁ దాటించు ♦ నొక్కమాఱు

* వటారకము = అరెనార "వటారకమయంపాశం" అనిమూలము.   ‡ తరి = నావ.

నీర్వాహి పాయ లై ♦ నెఱియ వాఱఁగ నీఁదు,హోర్వారవము దోఁప ♦ నొక్క తేప
కోటిశతఘ్ను లొక్కటఁ ద్రేలినట్లు పైనుండి వడు న్వార ♦ నొక్కసారి
ఆ. తోఁక నీట నిలిచి ♦ వీఁక నాకసము చుంబించు నొక్కమాఱు ♦ బిఱ్ఱబిగిసి
నీట మునుఁగు నొక్క ♦ మాటు సయ్యాటలో, నొనరఁ దేలి యాడు ♦ నొక్కతేప.

వ. ఇట్లమ్మత్స్యమూర్తి మహార్ణవంబున ననేకశతసహస్రవత్సరంబు లానౌకం దిగిచికొని విహరించుచుం బోయి పోయి జలక్షయం బగుజాడ లెఱింగి హిమవన్నగశృంగంబునకుం జని ఋషులం జూచి యి ట్లనియె. 279

క. ఇది హిమవచ్ఛృంగం బిప్పదమున మీనావ నాఁగ ♦ బంధింపుఁడు నా
నిది యా నని వా రయ్యొప్పిదమునఁ బొనరించి భీతు ♦ విడిచి రెడందన్. 280

వ. దానంజేసి యాశృంగం బిప్పటికిని నౌబంధనం బనునామంబునఁ బ్రసిద్ధం బయ్యె నయ్యవసరంబున. 281

శా. మీ నై యున్నరమాధవుండు ఋషులం ♦ బ్రేమించి తా ని ట్లనున్
మౌనీంద్రోత్తములార నేన ప్రభుఁడన్ ♦ నాకంటె నొండొక్కనిన్
గానం జాలరు లోకజాలముల భ♦క్తశ్రేణిఁ బ్రోవంగ ని
ట్లీనీర్వాహి నెసంగితిన్ భయము వో ♦ నీ రింక వర్తింపుఁడీ. 282

ఉ. నాకృప కాలవాల మయి ♦ నల్వగునీమను వద్వితీయుఁ డై
చేకొన కాత్మమోహమును ♦ జేసి తపంబు సురాసురాళితో
లోకములన్ సృజించు నని ♦ లోఁ గలమాట వచించి ప్రీతిమై
నాకమనీయమూర్తి మును ♦ లచ్చెరువంద నదృశ్యుఁ డై చనెన్. 283

వ. అంత. 284

ఆ. మనువు భూతసృష్టి ♦ పొనరించుటకుఁ బూని, చాల కపుడు తపము ♦ పోలఁ జేసి
వెనుకఁ దత్ప్రభావ♦మునఁ దగి సృష్టించె, నిఖలలోకములను ♦ నేర్పు కలిమి. 285

క. ఇది మత్స్యపురాణమునం, బాదలెడు నీగాథ వినినఁ ♦ బురుషుఁ డఘములన్
జిదిమి కృతార్థుం డై సౌఖ్యద మగుస్వర్గైకవాస ♦ మందెడు నవలన్ 286

వ. అని చెప్పిన విని కౌంతేయుండు మార్కండేయుదిక్కు మొగం బై. 287

శా. కల్పాంతంబు లనేకముల్ కడచనం ♦ గన్గొంటి నీ కెందునన్
బోల్పం జాలినవాఁడు లేఁ డనఁడు నం♦భోజాసనుం డొందు గా
కల్పంబోటు భవత్ప్రభావ మఖిలం ♦ బంభోధి యైనప్పు డా
వేల్పుం బెద్ద ప్రబుద్ధుఁ డై మెలఁగుటల్ ♦ వీక్షింతు నీ వెప్పుడున్. 288



శా. ఆనారాయణునాభిపద్మమున ని♦ద్రాసక్తుఁ డై యుండి వి
జ్ఞానం బేర్పడ సృష్టికర్త యగుచున్ ♦ జానొందునాభారతీ
జానిం గొల్చుటఁ గాదె నిన్ను జరయున్ ♦ జావున్ స్పృశింపంగఁ బో
వోనాళీకభవానుభావ! భవదీ♦యోత్పత్తి సామాన్యమే. 289

వ. అనేకజగత్ప్రళయంబులు ప్రత్యక్షంబుగం జూచి యెఱింగినమహానుభావుండ వగుని న్నర్థించుచుంటిఁ బ్రళయకాలంబులందుఁ బ్రపంచంబు లె ట్లుండుం దత్ప్రకారంబు విన వలతు నెఱింగింప ననుగ్రహింపు మనిన మార్కండేయుం డతని కి ట్లనియె. 290

తే. అవ్యయుండు స్వయంభు వ♦వ్యక్తుఁ డమలుఁ
డీశ్వరుఁడు సూక్ష్ముఁ డనఘుఁడు ♦ శాశ్వతుండు
సగుణుఁడును నిర్గుణుఁడును నై ♦ తగ వెలుంగు
పరమపురుషుని భజియింతు ♦ భక్తిఁ జేసి. 291

వ. ఆపురాణపురుషుండు వాసుదేవుం డై యిపుడు నీదండ మెలంగుచున్నవాఁ డీజనార్దనుండ కర్తయు వికర్తయు భూతాత్ముండు భూతభావనుండు ననాదినిధనుండు నచింత్యుం డితండు సర్వంబు నెఱుంగు నితని వేదంబులు నెఱుంగఁ జాల వని నెమ్మనమ్మునం గృష్ణునకు నమస్కరించి యుగప్రమాణాదులతో జగత్ప్రళయప్రకారం బెఱింగించెద నని మార్కండేయుండు పాండవేయునిదిక్కు మొగం బై నరేంద్రా! వినుము కృతయుగమ్ము నాల్గువేలేండ్లు దానిసంధ్య నాల్గునూర్లయేండ్లు సంధ్యాంశము నన్నియేండ్లు త్రేతాయుగంబు మూఁడువేలేండ్లు దానిసంధ్య మున్నూఱేండ్లు సంధ్యాంశము నన్నియేండ్లు ద్వాపరంబు రెండువేలేండ్లు దానిసంధ్య యిన్నూఱేండ్లు సంధ్యాంశము నన్నియేండ్లు కలియుగంబు వేయేండ్లు దానిసంధ్య నూఱేండ్లు సంధ్యాంశము నన్నియేం డ్లిట్లు పండ్రెండువేలదివ్యవర్షంబులఁ బరిగణింపంబడుచతుర్యుగంబులు నొక్కమహాయుగం బగు నట్టిమహాయుగంబులు వే యైనఁ బరమేష్ఠి కొక్కపగ లగు నాపగటితుదియే ప్రళయకాలంబు నాఁబడు నని మఱియును. 292

### మార్కండేయుండు ధర్మజునకుఁ బ్రళయప్రకారం బెఱింగించుట.

ఆ. ప్రళయమునకు వేయి♦పరివత్సరములకు,మున్న జగములందు ♦ నున్నజనులు
ధర్మబాహ్యు లగుచుఁ ♦ గర్మకాండము రోసి, యల్పజీవు లగుదు ♦ రధము లగుచు.

వ.*మఱియు వర్ణాశ్రమధర్మంబులు నశించు నధర్మపరు లతిశయింతు రసత్యం బ
నిత్యప్రవర్తకం బగు వంచన లతిశయించు నపుడు బహువత్సరంబు లనావృష్టి
దోషం బగు దానఁ బ్రజ లెల్ల నశింతు రనంతరంబ. 294

తే. ఉగ్రుఁ డై ద్వాదశాత్ముఁ డత్యున్నతగతి
వెలుఁగుచుం దనసప్తదీప్తుల సమస్త
జలధు లింకించి తృణకాష్ఠములరసంబుఁ
దిగిచి జగ మెల్ల భస్మసాత్కృతముఁ జేయు. 295

మహాస్రగ్ధర. వెనుకన్ సంవర్తకాఖ్యున్ ♦ వెలసి దహనుఁ డుర్వి న్మహావాయుసంగం
బున వేవేల్యోజనంబుల్ ♦ పొడ వయి దివికిన్ ♦ బోయి భీతావహం బై
కనుచుండన్ నాగలోకాక్రమణమునఁ గడుం ♦ గ్రాలి ముల్లోకముల్ పె
ల్చనఁ గాల్చు న్నిఱుగా నిర్జరనరఫణభృజ్జంతుజాలంబుతోడన్. 296

వ. తదనంతరంబ. 297

సీ. మెఱపుఁదీఁగలతోడ ♦ మెలఁగుచు మదపుశైలములఁ బోలి నల్ల నై ♦ కొన్ని కొన్ని
పసుపున కెన వచ్చి ♦ పచ్చనై హెచ్చి హింగుళసమప్రభ నొప్పి ♦ కొన్ని కొన్ని
నగరవగంబులో ♦ నడగొండలో నాఁగ, ఘోరరూపము లయి ♦ కొన్ని కొన్ని
ఛిద్రుప లై విడి కూడి ♦ చిక్కనై యుక్కెక్కి, కూటువల్ గట్ట నై ♦ కొన్ని కొన్ని
తే. చిమ్మచీఁకట్లు గ్రమ్మిన ♦ ట్లుమ్మలించి, ఘోరనిస్వనమున దెసల్ ♦ బూరటిల్ల
నాకసం బెల్లఁ గ్రిక్కిఱియంగ నగుచుఁ, గురియు ధారాధరంబులు ♦ కుంభవృష్టి.

శా. ‡ద్యావాపృథ్వ్యవకాశ మింతయును లే ♦ దన్నట్లు కాలాబ్దముల్
చేవం బూరిక లై గజేంద్రకరపుష్టిన్ వృష్టిధారల్ ధరన్
బ్రావంగాఁ బరమేష్ఠిచోదితము లై ♦ పంద్రెండుదివ్యాబ్దముల్
ప్రావృడ్భార మనంగ నై కురియు సర్వత్రామ్మయం బై కడున్. 299

శా. ముల్లోకంబుల నేర్చి పేర్చియు భయమ్ముం గూర్చుని వ్వంతయుం
బల్లారున్ బగులు న్నగంబులు మహీచక్రంబు నీర్వామిలోఁ

* ఇట మూలమునఁ గలియుగధర్మములు విస్తరించి వర్ణింపఁబడి యున్నవి. కలియుగధర్మములు మతి.
కొంకచో ముందు వర్ణించియుండుటచే నిటఁ దెలుఁగున విడువఁబడియె.

‡ పూరిక = గుణించఁబడినది లేక నింపఁబడినది. ప్రావు = వ్యాపించు. ప్రావృడ్భారము = వర్ష
కాలభారము. అమ్మయము = జలమయము.



ద్రెల్లన్ వేల నతిక్రమించి జలధుల్ ♦ రేఁగున్ మహోద్రేక మై
మొల్లం బై కనుపట్టుఁ బట్టువిడ కేపుం జూపుఁ బెంజల్లునన్. 300

ఆ. అంతఁ జండవాత ♦ హత్యున్నతంబుగాఁ, బ్రబలి యెల్లకడలఁ ♦ గ్రమ్ముకొనిన
యట్టివారిదముల ♦ నట్టిట్టు పడఁ గొట్టి, విరియఁ జేయు నపుడు ♦ విధివశమున. 301

క*. అప్పుడు ఘోరం బగుచున్, జొప్పిల్లినప్రళయకాలశుంభద్వాతం
బప్పరమేష్ఠి స్వయంభువు, నిప్పచ్చగఁ ద్రావి తమ్మి ♦ నిదురించు నటన్. 302

వ. ఇది కల్పాంతప్రకారంబు విను మతీతకాలంబున. 303

మార్కండేయుండు తాను బ్రళయార్ణవంబున విష్ణుదరంబు సొచ్చినది చెప్పుట.

చ. ‡నగము లగంబులుం దెగియు ♦ నాకము భూమియు లేక లోకముల్
మొగి నశియింప సంతమసముల్ పిఱుదీయక నిండ దండి యై
యగపడునట్టికల్పమున ♦ నంబునిధిం బడి యీఁదులాడుచున్
దగిలి యొకండ నే నలసి ♦ తద్దయుఁ బ్రొద్దు పరిభ్రమించితిన్. 304

ఉ. ఒండొకదిక్కు గానక మహోదధియం దటు బమ్మరించుచున్
గొంతొకనాఁటి కందుఁ గనుఁగొంటి నొకానొక పెద్దమఱ్ఱిపై
నిండినకొమ్మపై మిగుల ♦ నిద్దపుఁ దేజున నొప్పపాన్పుపైఁ
గొండిక యొక్కరుండు కడుఁ ♦ గోరికఁ జేసి వెలుంగు చుండఁగన్. 305

మ. అతసీపుష్పసమానవర్ణు జలజాతాక్షున్ మృగాంకాస్యునిన్
నుతిపాత్రద్యుతిమచ్ఛరీరు శిశువున్ ♦ దొట్రిల్లి వీక్షించి నే
నితఁ డెవ్వండొ జగంబు లెల్లఁ దెగ ని ♦ ట్లిక్కాలమం దుండె న
ద్భుత మే తెంచెడి లోకరక్షకుఁ డగుంబో యంచుఁ జింతించుచున్. 306

వ. భూతభవిష్యద్వేది నయ్యు నే నాబాలు నెఱుంగఁ జాలక నిర్విణ్ణుండ నై యున్నన
న్నతం డో మార్కండేయా యని సంబోధించి పిలిచి శ్రుతిసుఖావహం బగుమధుర
స్వరంబున ని ట్లనియె. 307

చ. బడలితి వంచుఁ దోఁచెడిని ♦ భావమునం దయొ విశ్రమింపఁగా
నెడఁదఁ దలంతు వేని చన ♦ విచ్చితి వచ్చి మునీంద్ర నీవు నా
కడుపునఁ జొచ్చి యిచ్చమెయిఁ ♦ గాలము పుచ్చు మటంచు నాస్యమున్
గడు వివృతంబుగాఁ జలిపెఁ ♦ గన్గొనుచుండెడునంతలోపలన్. 308

* చొప్పిల్లు = తగు. నిప్పచ్చ = శూన్యము. ‡ సంతమసము = చీఁకటి.

వ. నేను నాచిరజీవితంబునకును మానుష్యత్వంబునకును నిర్వేదించుచు దైవయోగం బునంజేసి యవశుండ నై తన్ముఖంబునుండి వానికుక్షిం బ్రవేశించితి నందు నానారాష్ట్రనగరారణ్యాకీర్ణం బగుమేదినిం గంటి నామేదినియందు వివిధవిధాధ్వ రంబు లొనరించుబ్రాహ్మణులును సర్వవర్ణానురంజకు లై యుర్వరం బాలించు క్షత్రియులును గృషికు లై కుబేరతుల్యధనసంపన్ను లైనవైశ్యులును ద్విజశుశ్రూ షణనిరతు లై గుణసముద్రు లైనశూద్రులును బొలుపొందుచుండి రందు గంగ యమున సరస్వతి శతద్రువు సీత కౌశికి చర్మణ్వతి వేత్రవతి చంద్రభాగ సింధువు విపాశ గోదావరి నర్మద తామ్రపర్ణి వేణ సువేణ శోణ కృష్ణవేణి మహానది వితస్త కావేరి విశల్య కింపున లోనగుమహానదులును యాదోగణనిషేవితంబు లై మణి గణప్రభద్రంబు లగుసప్తసముద్రంబులును హిమవద్ధేమకూట నిషధ శ్వేత గంధమా దన మందర నీల మేరు మహేంద్ర వింధ్య మలయ పారియాత్ర ప్రముఖపర్వతంబు లును నైమిశ ద్వైత కామ్యక బదరీ బిల్వాదిమహావనంబులును సింహ శార్దూల శరభ వరాహ గజ గవయ ప్రభృతిమహాసత్త్వంబులును లోచనగోచరంబు లయ్యె నంతఁ గొంతలోఁ జంద్రసూర్యనక్షత్రవిరాజితంబును దేజోజాజ్వల్యమానంబు నగుమహాకాశంబును మఱియు నొక్కింతలో శక్రాదిదేవగణంబులును సాధ్య రు ద్రాదిత్య గుహ్యక పితృ దేవర్షి వస్వశ్వి సుపర్ణ పన్నగ గంధర్వాప్సరో యక్ష రక్షఃప్రముఖ దేవయోనిగణంబులును దైత్య దానవ కాలేయాది దేవద్వేషినము దయంబులును మఱియు స్థావరజంగమాత్మకంబు లగునమస్తప్రపంచంబులును బరి భ్రమించి చూచితి నంత. 309

ఉ.*ఇట్టిమహాద్భుతమ్ములకు ♦ నిమ్మగునమ్మహానీయకుక్షిలో
నట్టియెడన్ మెలంగుచు రవంతయు నంతము గాన కంతలో
నెట్టన నూఱువర్షములు ♦ నిండిన నే శరణంచు వేఁడుచున్
జిట్టలు గాఁగ నే నవుడు ♦ చేరితిఁ దొల్లిటిమఱ్ఱిచెంతకున్. 310

ఆ. ఇట్లు వచ్చి తొంటియట్లు న్యగ్రోధశాఖాగ్రమందుఁ బండి యట్టివాఁడు
చిట్టివాఁడు వానిచెంతకుఁ జనుటయు, నన్నుఁ గాంచి యతఁడు నగుచుఁ బలికె.

క. మునివర! నా దగునుదరంబున సుఖముంటివి గదయ్య ♦ భూయిష్ఠం బై
కనఁబడునీశ్రమ మెల్లన్, జనియెం గద చెప్పవయ్య ♦ సంభ్రమ మరుగన్. 312

వ. అని ప్రశంసించుటయు. 313

* చిట్టలు = ఆశ్చర్యములు.



చ. అనువులు గల్గి పీడువడు నాత్మను జూడఁగఁ జాలి మూర్ఛ మై
మొనఁగినదృష్టి నా కవు డొకించుక లో నుదయింప వ్రెండియున్
బన గలవాఁడ నై నిముఁగు భవ్యమహాత్వము సంస్మరించుచున్
వెనుకొయి వాని కెందలిరు వ్రేళ్లఁ దలిర్చెడుకాళ్ల మ్రొక్కియున్. 314

ఉ. మోడ్పుఁగేలు ఫాలమునఁ జేర్చి వినయంబు మొలవఁగాఁ బ్రియత్నమున మఱింత
చెంత కరిగి చూచి ♦ శ్రీవల్లభా భవన్మాయఁ దెలియ వశమె ♦ మాదృశులకు.

క. నీయుదరంబున మెలఁగెదు నాయెడఁ దం దలఁచునంత ♦ నలినాక్ష యిటన్
బాయక వచ్చితి నచ్చెరు వై యున్నది నీచరిత్ర ♦ మంతయుఁ దెలియన్. 316

మ. అఖిలంబుం గడ లేఱ నీ విటు నిమగ్నం బై యుంటి నీకుక్షిలో
నిఖిలం బుండె ని దేమిచోద్యమొకొ మాన్యస్తుత్య! యీమఱ్ఱిపై
సుఖ మొప్పారఁగ నెంతకాల మెలమిన్ ♦ జొత్తిల్లి యుందో భవ
న్ముఖపద్మోద్యదమూల్యవాగమృత మిందుం జిల్కఁగాఁ జేయవే. 317

తే. బ్రాహ్మణుఁడ నాటఁగోరితిఁ బరమ మై య, చింత్యమైనట్టియర్థంబు చెప్పుమనుచు
విన నభిలషించుభక్తుని ♦ వీనిఁ గరుణ, నరసి వచియింపవే సర్వ ♦ మబ్జనయన.

—నారాయణుండు తనప్రభావము మార్కండేయునకుఁ జెప్పినకథ.—

వ. అని ప్రార్థించినం బ్రసన్నుం డై పుండరీకాక్షుండు నన్నానందించుచు నిట్లనియె.

తే. నామహత్వము వేల్పు లైనం గ్రహింపఁ, జాల రింతయుఁ బితృభక్తిఁ గ్రాలునీవు
నన్ను శరణంబు వేఁడితి ♦ నిన్ను నీతపం బెఱుంగుదుఁ గావునఁ ♦ బలుకుచుంటి.

క. నారము లన నుదకంబుల, పే రవి నా కయన మగుట ♦ విష్టపముల నే
నారాయణాహ్వయంబునఁ, దీరి మెలంగెదను దేవదేవుఁడ నగుచున్. 321

సీ. నేన విష్ణుండను ♦ నేన రుద్రుండను, నేన జిష్ణుండను ♦ నేన ధాత
నేన వైశ్రవణుండ ♦ నేన సూర్యుండను, నేన చంద్రుండను ♦ నేన వహ్ని
నేన కశ్యపుఁడను ♦ నేన గంధవహుండ, నేన కుబేరుండ ♦ నేన నిరృతి
నేన ప్రపంచంబు ♦ నేన సాగరములు, నేన మహానదు ♦ లేన గిరులు

తే. నేన ప్రళయాగ్ని నేన కల్పానిలంబు, నేన సంవర్తసూర్యుండ ♦ నేన సర్వ
మేన శాశ్వతుఁడను నేన ♦ యీశ్వరుండ, నని యెఱుంగుము చెప్పితి మునివరేణ్య.

తే.*నాముఖం బగ్ని పాదముల్ ♦ భూమి కనులు
చంద్రసూర్యులు శిరము పుష్కరము చెవులు

* పుష్కరము = ఆకాశము.

దెసలు చెమ్మట లుదకముల్ ♦ దివి శరీర
మనిలము మనమ్ము తెలియు మో•మునివరేణ్య. 323

మ. సురకార్యార్థము నే సృజింపఁ గడిమిం ♦ జూపట్టుకామంబు మ
త్సరముం గ్రోధము లోభమోహములు హా•ర్షంబుల్ భయభ్రాంతులుం
గర మొప్పారుమదీయలోమములు చు•క్కల్లోమకూపంబు లు
ర్వర వార్ధుల్ శయనస్థలంబు లగుఁ బో ♦ వాచంయమిగ్రామణీ. 324

తే.*నలిపితిని వేనవే ల్జన్న•ములను భూరి,దక్షిణలు పెట్టి వేదవి•ద్వర్యులైన
ద్విజులుపార్థివులును విభుల్ ♦ దేవయజన,మందు సేవింత్రు నను జేసి•యజ్ఞములను.

చ. అరయఁగ మేరుమందరస•మంచితమై చతురబ్ధిగుప్తమై
గురుతరమైనభూతలము ♦ క్రొంచక మున్ను వరాహమూర్తి నై
స్థిరముగ నుద్ధరించితిని ♦ శేషుఁడనై శిరమందుఁ దాల్తు దు
ర్భర మగుబాడబాగ్ని నయి ♦ త్రావి జలంబులు వెండి నించెదన్. 326

క. కల్పాంతములం దిట్టు ల,నల్పగతిం జేసి సాగ•రాంభస్తతి నే
బొల్పుగ వసియించెద సం,కల్ప మెనంగం బ్రపంచ•కల్పనయందున్. 327

మత్తకోకిలము. నాదుమోమున భూమిదేవులు ♦ నాభుజంబుల క్షత్రియుల్
నాదునూరువులందు వైశ్యులు ♦ నాపదంబుల శూద్రులున్
బ్రోది నయ్యెడ రంత లోకము•పొంటె ఋగ్యజురాదు లౌ
వేదముల్ జనియించు నయ్యావి ♦ వెన్క నన్నెఁగిఁ బొందెడిన్. 328

క. అతిశాంతచిత్తు లుత్తము, లతులితవిజ్ఞానవృత్తు ♦ లనహంకృతు లా
యతపుణ్యవ్రతయుతు లగు,యతు లెప్పుడు నన్నుఁ గొలుతు ♦ రంచితభక్తిన్.

తే. తప మహింసయు సత్యము•దానధర్మ,ములును వేదాధ్యయనమును•గలిగిద్విజుఁడు
మఖము లొనరించి నాసేవ ♦ మఱవఁడేని,వాని కున్నతపద మగు ♦ మౌనిచంద్ర.

క. అకృతాత్మ లనార్యులు ఖలు,లు కృపణులును గలుమతులు ♦ లోభులు నన్నిం
చుక యైనఁ దెలియఁ జాలక,సుక మెఱుఁగక యధమగతుల•నుక్కుడు రెపుడున్.

మత్తకోకిలము. ఎప్పు డుత్తమధర్మముల్ చెడు ♦ నెప్డధర్మము హెచ్చునో
యెప్పు డింద్రముఖామరుల్ తెగ ♦ నెప్డు దైత్యులు పొల్తురో
యప్పు డేను మహాకులీనుల•యందు మానుషమూర్తి నై
యొప్పు మీఱఁగఁ బుట్టి శాంతిని ♦ నొందఁ జేయుదు నంతయున్. 332

* దేవయజనము = యజ్ఞమునందు వేల్పులకుఁగా నేర్పడినగృహము.



ఆ. ఖలులఁ దున్మి పాప•కలితంబు లగుకర్జ,ములఁ దొలంచి సాధు•వులను మించి
ధర్మ మెల్లకడలఁ ♦ దనరంగ నొనరించి, పొలుతు నేను దఱులు ♦ వొడమునపుడు.

చ. కృతమున శ్వేతవర్ణమును ♦ త్రేతను బీతము ద్వాపరంబునన్
నుత మగురక్తముం గలిని ♦ నూల్కొనుకృష్ణము గల్గి యొప్పునే
నతులితకాలచక్రము ని•రంతరముం భ్రమియింపఁ జేయుచున్
గృతమతినై చరించెదను ♦ గీల్కొని లోకములందుఁ బొందుగన్. 334

ఉ.*ఇట్టిప్రపంచగోళముల ♦ నెల్ల నొకించుకమాత్రలోనఁ జే
పట్టిననేను గల్ప మది ♦ వచ్చినపట్టున నాశనంబుగా
నెట్టనఁ జేసి యిట్టు రమ•ణింతు ననంతుఁడనై త్రివర్త్మనై
యిట్టిది నాప్రభావము ము•నీశ్వర! నీకు నెఱుంగఁ జెప్పితిన్. 335

చ. ఒకరుఁడు నన్నెఱుంగుటకు ♦ నోపఁడు నీవు మహాతపస్వి వౌ
టకు ఫల మిట్టు మెట్టుచు ని•టన్ ననుఁ గన్గొనఁ గంటి వబ్ధిలోఁ
బ్రకటసుదుఃఖముం గుడుచు•వానికి నీకుఁ జరాచరప్రపం
చకములు కుక్షిఁ జూపి యట ♦ సౌఖ్య మెనంగఁ బొనర్చితిం జుమీ. 336

సీ. నారాయణుండ నే ♦ నాశరీరార్ధము, భువనపితామహుం ♦ డవ్వువిధాత
కరముల శంఖచ•క్రగదాదులు ధరించి, యుగచతుష్కసహస్ర•మగుపఱకును
యోగనిద్రాసక్త ♦ నుండెద నిసుఁగనై, లలి నిట్లు బ్రహ్మ మే•ల్కనుటఁ గోరి
వర మొసంగితి నీకుఁ ♦ బరమేష్ఠి నై నేన, ప్రళయమం దైనయా•జలధిలోన

తే, నలసితివి నీవు సుఖముండు ♦ మయ్య యిటన
బ్రహ్మయుఁ బ్రబోధితుం డగుఁ ♦ బంచభూత
ములయు స్థావరజంగమం•బులయు సృష్టి
మరలఁ బొనరింతుఁ జూడు మో•పురుషముఖ్య. 337

వ. అని చెప్పి యప్పు డప్పరమేశ్వరుం డంతర్హితుం డయ్యె నంతం గ్రమంబున నైన
యీప్రజాసృష్టి యంతయు నత్యంతాశ్చర్యంబు వొడమఁ బ్రత్యక్షంబుగం
జూచితి నని మార్కండేయుండు వెండియు. 338

శా. ఏదేవుండు శిశుత్వరూపమున నా ♦ కీక్షింపనై మున్ను క
ల్పాదిన్ దీర్ఘతరాయు విచ్చి కరుణా•స్వాంతంబునం గాంచెనో

* త్రివర్త్మ = మూఁడుమార్గములు గలవాఁడు. (సత్వరజస్తమములు).

యాదేవుండు పురాణపూరుషుఁడు వి•శ్వాత్ముండు విశ్వేశ్వరుం
డీడంతన్ వసుదేవనందనుఁడు నా • నింపొందు నీక్షించితే. 339

మ. ఇతఁడే ధాత యితండె త్రాతయు నితం•డే లోకసంహర్త యీ
యతిలోకస్తుతుఁ డీజనార్దనుఁడు సెం•య్యం బొప్ప వార్ష్ణేయుఁ డై
క్షితియందుం బ్రభవించె నిట్లు తగ నీ•కృష్ణున్ మహావిష్ణునిన్
నతి గావించి భజించు టొప్పు మనకున్ • గౌరవ్యచూడామణీ. 340

తే. ఇమ్మహాత్మునిదర్శనం • బిపుడు గల్గు,కతనఁ బూర్వస్మృతి లభించెఁ•గాదెనాకు
నితనిసన్నిధి యగుట నే • నెంతయేని,ధన్యుఁడను నాదుజన్మంబు•ధన్యతమము.

చ. అన విని ధర్మజుం డనుజు • లందఱు భక్తి భజించుచుండఁగా
వనితయుఁ దాను శౌరి కభి•వందనముం బొనరించి కొల్చెఁ గొ
ల్చిన మధుసూదనుండు మదిఁ • జెన్నలరారఁగ వారి వల్గువ
ర్తనముల గౌరవించె నుచి•తస్థితిఁ బల్కుచు సామవాక్యముల్. 342

వ అనంతరం బక్కౌంతేయుండు మార్కండేయునిదిక్కుమొగం బై యి ట్లనియె.

ఉ. నీకరుణాకటాక్షమున • నే వినఁ గల్గితిఁ గల్పవర్తనం
బేకరణిం దలిర్చె నది • యెంతయు సంతస మయ్యె నింతలో
నీకలి ధర్మలోప మయి • హీనతఁ గాంచెడు నంచు వింటి నీ
లోక మెనంగు నెట్లు కలి•లో మఱియుం గృత మెట్లు వర్తిలున్. 344

వ. ఇది యంతయు సవిస్తరంబుగం జెప్ప ననుగ్రహింపు మనిన మార్కండేయుండు
వార్ష్ణేయపాండవేయుల నభినందించుచు ధర్మనందనుం జూచి యి ట్లనియె. 345

— మార్కండేయుండు ధర్మజునకుఁ గలియుగధర్మంబులు చెప్పుట. —

ఆ. వినుము తొల్లి నేను • వినుకలిఁ గనుకలి, ననుభవించి తెలిసి•నట్టిదానిఁ
దెలియఁ జెప్పువాఁడఁ • గలికాలధర్మంబు, లవహితుండ వగుము • కువలయేశ. 346

చ. కృతయుగమందు ధర్మవృష • మెప్పును నాలుగుకాళ్ల నొప్పు ను
న్నత మయి త్రేతయం దొకఁడు • నష్టము గాఁగఁ బదత్రియంబునన్
స్థితిఁ గొను ద్వాపరంబునను • జెప్పఁగ నొప్పుఁ బదద్వయంబునన్
గతి చెడిపోవ నీకలియు•గంబున నుండెను నొంటికాలునన్. 347

తే. ఆయువును వీర్యము బలంబు • ధీయుఁ దేజ
మివి యుగయుగంబు దఱుఁగు మా•నవులకుఁ గలి



వ్యాజమునఁ జేసియే ధర్మ • మాచరింతు
రధము లై నాల్గువర్ణము•లందుఁ బ్రజలు. 348

తరువోజ. జనులకు సత్యంబు • సంక్షయం బగును• సత్యక్షయంబున•స్వల్పమౌ నాయు
వనిశంబు నల్పాయు • వగుట నత్యల్ప • మగు విద్య లందున • నజ్ఞాన మెచ్చుఁ
గనుఁగొన నద్దానఁ • గల్గు లోభంబు • ఘన మయి లోభంబు•కామముం బెంచు
మునుకొని కామంబు •పోషించుఁ గ్రోధ•మును దాన వైరంబు•పొడము నెంతయును.

ఉ. వైరనిబద్ధు లై జనులు • వారును వారును బోరి చత్తు రా
చారము లన్నియుం జెడును • సత్యవివర్జితు లై ద్విజాదు లి
చ్చారతి సంచరించెదరు • సంకర మన్నిట సంభవించు నీ
ధారుణి ద్వాపరంబు చన • దాపర మౌ కలికాలముం దొగిన్. 350

ఉ. విప్రులు వేదబాహ్యు లయి • వీడి జపంబు తపంబు వేల్మియున్
విప్రతిపత్తి చిత్తమున • విత్తన మై వివృత్తు మై చనన్
విప్రియ మాచరించుచుఁ ద్రి•విష్టపవాసులఁ గొల్చుపట్లఁ బా
పప్రియు లై మెలంగెద ర•పండితు లై తుద నాయుగంబునన్. 351

తే. క్షత్రియులు క్షత్రధర్మంబు • సన్నగిల్ల, వృషలతుల్యు లై హాలిక•వృత్తి నుండి
శౌర్యధైర్యాదులును రాజ్య•సంపదలును, కలుగ కుండెద రధము లై •కలియుగమున.

మ.*జను లల్పాయువు లల్పవీర్యబలులున్ • స్వల్పాంగులున్ స్వల్పజీ
వనులున్ జారులుఁ జోరులున్ ఖలులు నై • వర్తింపుచున్ జేయరా
దనుకార్యం బది లేనివా రగుచుఁ బా•పాచారు లై దూఱుదుం
కెనలం దేలుచుఁ దూలుచుందురు కలిం • గింపాకు లై కాకు లై. 352

సీ. అనదలయుం బేద • లయినబందుగులయు, దాఁచఁ బెట్టినసొమ్ము • దోఁచుకొందు
రన్నవిక్రయణంబు • కన్నవిక్రయణంబు, నందియుం బెఱుఁగక • సల్పుచుందు
రనుకూలకన్యాగ్ర•హణము సేయక తమ,స్వేచ్ఛమైఁ గన్నెల • సేకరింతు
రితరుల కాతిథ్య • మీయక సతతంబు, పరభోజనేప్సతఁ • బరఁగుచుందురు

తే, వర్షములు లేమి మిక్కిలి • వనటఁ జెంది, త్రవ్వి కుద్దాలముల నదీ•తటములందుఁ
బైరు గావించి తత్స్వల్ప•ఫలమువలన,జనులు బ్రదుక నెంతురుయుగ•క్షయమునందు.

ఉ. వీతతపోవ్రతాదు లగు•విప్రులు లోభమునం జరించుచున్
జైత్రకవైవిక్రయులఁ • బాయుఁగ నేమము భోజనాదులన్

---

* దూఱుదుంకెన = బాల్లక్రీడావిశేషము. కింపాకుఁడు = మూఁఢుఁడు.

బ్రీతి నొకళ్లొకళ్లకును ♦ బెట్టుచునుండ్రు యుగక్షయంబునన్
దాతకుఁ దండ్రియు న్మఱియుఁ ♦ దండ్రికి బిడ్డయు భోక్తలారయన్. 355

సీ. *స్వాహాస్వధాదుల ♦ సన్నయు లేకుండు, నిమ్నంబులం గృషి ♦ నివ్వటిల్లు
గాఁడిఁ గట్టుదు రాలఁ ♦ గరుణ లేకొకయేఁటి,వత్స నాఁగలి దున్ను ♦ వలతు రవుడు
గోవులు వట్టును ♦ గొఱియలపాఁడియు, మేఁకలపాఁడియు ♦ మిగిలియుండు
స్వల్పఫలంబు లౌ ♦ తన్మాజంబు లన్నియు, రసవస్తువులరుచి ♦ వెస నశించు
తే. నించుకించుక యై ఫలి ♦ యించు నోష,ధులు ప్రబలు నారుగలవంట ♦ లిలఁ బుళింద
యవనపుల్కసభూయిష్ట ♦ మగును దుష్ట,సత్వములు పెచ్చుపెఱుగునా ♦ సమయమందు.

ఉ. బాలురరీతి వృద్ధులును ♦ బాలురు వృద్ధులరీతి నక్కలిం
దేలుదు రైహికార్థముల ♦ తెన్నునఁ బోవుచు దుష్టచిత్తులై
బాలిశులై చరించెద ర ♦ భాగ్యులు నాఁ బడి తండ్రి బిడ్డలన్
గూలుచు బిడ్డ లాయనను ♦ గూల్తురు కూల్చును భార్య భర్తనున్. 357

చ. పురుషులు భార్యలే తమకుఁ ♦ బొల్పగుచుట్టము లౌనుగా రటం
దురు మఱి భార్య లప్పతుల ♦ తో సుఖముండక వారి మెచ్చ కా
దరమునఁ జూడ కెప్పుడును ♦ దప్పులు సెప్పుచు నాజ్ఞ మీఱి కా
వరమునఁ దప్పదారిఁ బడి ♦ వంగనముం జెడ నుందు రక్కలిన్. 358

క. పతులన్ సుతులం జంపెదు,నతివలు కలికాలమందు ♦ నలరెద రిచ్ఛా
గతి నీచజాతితోడన్, మఱి రోయక సంచరింతురు ♦ మహితలమందున్. 259

ఉ. ‡భీరుఁడు శూరమాని యగు ♦ భీరుఁ డగున్ రణశూరుఁ డెల్లరున్
గ్రూరుల వై చరింపుచును ♦ గ్రొత్తలు పుట్టఁగఁ జేసి జంతుహిం
సారతిఁ బాపభాజు లయి ♦ సారెకు కార్యము లాచరించుచున్
ధారణిఁ జూడ నొప్పెద రు ♦ దర్కమునం గురువంశశేఖరా. 360

తే. †హేతువాదవిమోహితు ♦ లై తలిర్చి, బ్రాహ్మణులు నిజధర్మంబు ♦ పరిహరించి
సలుపుచు నభక్ష్యభక్షణం ♦ బిల ధనాశ, వృషలులం బోలి జీవించు ♦ వృత్తి నుంద్రు.

ఉ. క్షత్రియు లర్థమోహమున ♦ సర్వవిధంబుల మోస చేసియున్
మిత్రుల నైన మొత్తియును ♦ మిక్కిలి కప్పము గట్టియేనియున్
ధాత్రితలంబునం గలధ ♦ నంబుల నెల్ల హరించి విప్రను
క్షేత్రములన్ బలాత్కృతి గ్ర ♦ సించి వసించెద రయ్యుగంబునన్. 362



క. *మాయావు లగుచు వైశ్యులు, పాయక క్రయవిక్రయముల ♦ బడి మోసంబుం
జేయుచు వ్యవహారంబుల, న్యాయం బినుమంత లేక ♦ నడచెదరు కలిన్. 363

తే. పండితంమన్యులై బ్రహ్మ ♦ వాదు లగుచుఁ, దప మొనర్చుచు వృషలులే ♦ ధర్మములను
ద్విజుల కెఱిఁగించుచును వారి ♦ విత్తములను, బరిహరింతురు పాపస్వ ♦ భావు లగుచు.

తే. గురులు వంచింతు శిష్యుల ♦ గురులమాట, వినఁగ నొల్లరు శిష్యులు ♦ వివిధధర్మ
ములు నశించు నధర్మముల్ ♦ వెలయు నవుడు,పృథివియంతయు గ్రామ్యభూ ♦ యిష్ఠమగును.

ఆ. కొడుకు తండ్రితోడఁ ♦ గడు వాద మొనరించు, మగనితోడ నాలు ♦ తగిలి పోరు
నఖిలజగమునందు ♦ నానందశూన్యమౌ, నల్పతేజు లగుదు ♦ రవనిజనులు. 366

క. ఒండొరుల విశ్వసింపరు, నిండు నధర్మంబు ధర్మ ♦ నిష్ఠ లడంగున్
మెండగు నసత్య మీభూ,మండల మజ్ఞానతిమిర ♦ మయ మగు నధిపా. 367

తే. ‡జనపదము లట్టశూలము ♦ లును జతుష్ప,థములు శివశూలములును గాం ♦ తాజనంబు
కేశశూలము గా నయి ♦ క్షితితలమునఁ, గనఁగ నయ్యెడు నాఘోర ♦ కాలమందు. 368

మ. ఖలులై పుల్కసు లెందునుం బ్రబలి త ♦ త్కాలంబునన్ విప్రులం
బలిమిం బట్టి నలంగఁ గొట్టి మిగులన్ ♦ బాధించి తద్విత్తముల్
చలుకంగైకొని చంపఁ బూనుదురు సం ♦ క్షోభంబుగా వారు కా
ల్కొలఁదిం బాఱెద రద్రులందుఁ బడి దిక్కున్ ♦ మొక్కలేకార్తులై. 369

తే. †దస్యుపీడితులై ద్విజుల్ ♦ దశదిశలకుఁ, బఱచెదరు దిక్కుకింతయుఁ ♦ బడయ లేక
కాకులం బోలె నఱచుచుఁ ♦ గావు మనుచు, నార్తులై కలికాలము ♦ నందు వింటె.

సీ. వర్ణాశ్రమముల వి ♦ భాగంబు లేర్పడ, కెల్లవర్ణంబులు ♦ నేక మగును
బదునాఱువర్షముల్ ♦ పరమాయు వగు నప్పు, డాతెండ్లనకె గాంచు ♦ నాత్మజులను
బురుషుఁ డెన్మిదివర్ష ♦ ములయీడునకు బిడ్డలను గన్నతండ్రియై ♦ తనరుచుండు
మగఁడును మగనాలు ♦ తగిలి మెచ్చక పర,స్పరము విచ్చలవిడి ♦ సంచరింతు
తే. రవుడు శ్రాద్ధాదికృత్యంబు ♦ లంతరించు, నతిథులకుఁ జోటొసంగరు ♦ భవనభర్త
లన్నపానంబులకుఁ గాక ♦ యఖిలజనులు, మద్యపానంబు నేయంగ ♦ మదిఁ దలంత్రు

ఆ. ¶ఏడుకములఁ గొల్తు ♦ రితరదేవతలను, గొల్వఁ దలఁప రెవుడు ♦ గొలువుచేసి
బ్రతుక నెంతు రెల్ల ♦ ప్రజలును గ్రూరులై, కలుగఁబోవుఘోర ♦ కాలమందు. 372

* వట్టును = వట్టిపోవును. ‡ ఉదర్కము = రాఁగలకాలము. † వృషలుఁడు = శూద్రుఁడు.

* బడి = క్రమము. ‡ అట్టశూలములు = అన్నము అమ్ముకొనునవి. శివశూలములు = వేదము అమ్ముకొనునవి; కేశశూలము = శరీరము అమ్ముకొనునది. † దస్యులు = చోరులు. ¶ ఏడుకము = ఎముకల గోడ, లోపల ఎముకలుంచి పెట్టినగోడ, రూ. ఏడూకము. గొలువుచేసి = ఒరులను గొలచి.

క. కలు ద్రావువారు మత్స్యం,బులమాంసముఁ దినెడువారు ♦ భూతలమందుఁ
గలుగుదు రకాలవర్షము, గలుగుఁ మర్యాద చెడును ♦ గలికాలమునన్. 373

క. దేవాలయములు పృథ్వీ,దేవాలయములును ద్రెళ్లు ♦ దివ్యాశ్రమముల్
పావనతీర్థములుం జెడు, భావింప యుగక్షయంబు ♦ వర్తించుతఱిన్. 374

తే. ‡కలుగు దిగ్దాహ మురులకాం♦తులు నశించుఁ
జుక్కవెలుఁగఁడు సూర్యుఁ డే♦చక్కియందుఁ
బడును నుల్కలు తలగాము ♦ పట్టెడు నవ
పర్వమునఁ జంద్రసూర్యుల ♦ గర్వమునను. 375

క. ఉఱుములు మెఱుములు మెండగుఁ, దఱచుగ మండెడిని వహ్ని ♦ దశదిశలందుం
గొఱవులు పడుఁ బరుషముగా, నఱచుం రేఁబవలు పులుఁగు ♦ లాకాలమునన్. 376

మ. ఇలఁ బాలింపఁగ రాజు లేమిఁ గలుగున్ ♦ హీనాతిహీనస్థితిన్
బలవంతుల్ బలహీనులం గలన నొం♦పం జంప దేశంబులం
గలవారల్ గుఱిపెట్టుచున్ స్వజనముం ♦ గాపాడలే కార్తులై
పలవింపం దొరఁకొంచుఁ బాఱెదరు భూ♦భాగంబుల న్వేడుచున్. 377

కలియుగమునఁ గల్కిమూర్తి ధర్మములు ప్రతిష్ఠించుట.

వ. ఇట్లధర్మభూయిష్ఠం బై ఘోరదర్శనం బైన విపరీతకాలంబు ప్రవర్తించుచున్నంత ద్విజకాలప్రబోధితుండై శ్రీమహావిష్ణుండు విష్ణుయశుం డను పేరఁ గల్క్యాత్మకుండై శంబలగ్రామంబునం దొక్క బ్రాహ్మణావసథంబునం బుట్టి స్మరణమాత్రంబున సర్వశాస్త్రంబులును సర్వశస్త్రాస్త్రవాహనకవచాదిసాధనంబులును సన్నిహితంబు లైన వాని నెల్ల నధిగమించి మహాసత్త్వసంపన్నుండును దేజస్వియు నై. 378

చ. ధరణిసుపర్వసేనల సు♦దగ్రగతిం గొనిపోయి పాపపుం
దెరువునఁ బోవుదుష్టు లగు♦ తెక్కలికాండ్రకుఁ దోడు నీడ తా
తురకల నెల్లరం దునిమి ♦ దోర్బల మేర్పడ భూతలంబునన్
గురుతరధర్మము న్నిలువుఁ ♦ గోరిక లీరిక లెత్త నిండియున్. 379

తే. ధర్మపథమున నిల్చి య♦తండు జగతి, నట్లు దిగ్విజయము చేసి ♦ యధిపుఁ డగుచుఁ
జక్రవర్తి యై విధ్యుక్త♦సరణి నశ్వ,మేధయాగ మొనర్చు న♦మేయశక్తి. 380

మధురాక్కర. ధరణి యెల్ల విభాగించి ♦ దక్షిణగా నొసంగి
ధరణిసురులవర్ణంబునఁ ♦ దనరంగఁ జేసి భూరి

‡ తలగాము = రాహువు,



తరయశోరాశి యై మించి ♦ తనవార్ధకమునయందు
వరతపోవనమున నిచ్చ ♦ వసియింపఁ జను నతండు. 381

వ. ఇట్లు ధర్మప్రతిష్ఠ గావింపంబడి వర్ణాశ్రమవిభాగం బేర్పడ జగంబునం గలజను లెల్లఁ దొల్లిటియట్ల తమతమధర్మంబు లనుష్ఠింతు రద్దాన దైవానుకూల్యంబునం జేసి లోకం బభివృద్ధి యై మరలఁ గృతయుగంబు సిద్ధించు నెప్పుడు సూర్యచంద్రబృహస్పతు లేకరాశిగతులై పౌషంబునం జూపట్టుదు రప్పుడ కృతయుగంబు ప్రవర్తించుచున్న దని యెఱుంగునది. 382

చ. కృతయుగ మేగుదేఁ జను ల♦కించను లై చెడిపోక ధర్మ సం
చితగతి నాచరింతురు వి♦శీర్ణమఖక్రియ లెల్ల వర్ధిలున్
సతతము కాలవర్షముల ♦ సస్యము లొప్పు గ్రహంబు లొప్పుచున్
నుతగతులం బ్రవర్తిలు వి♦నూతనరీతిఁ దలిర్చు దేశముల్. 383

తే. క్షేమము నిరామయమును కా♦ర్యసిద్ధియును సు
భిక్ష మారోగ్యమును గల్గుఁ ♦ బృథివిజనుల
కపుడు దేవతాయతనంబు ♦ లింపుమీఱుఁ
దరుతటాకాదు లెంతయుఁ ♦ దనరుచుండు. 384

సీ. *సాధులై బ్రాహ్మణుల్ ♦ సత్క్రియల్ పొనరింత్రు, మునులు తపస్వులై ♦ పొనరుచుండ్రు
జపము తపంబును ♦ స్వాధ్యాయమును నిల్చు, వేదోక్తకర్మముల్ ♦ విస్తరించు
ధర్మమార్గంబున ♦ ధర నేలుదురు రాజు, లర్యులు న్యాయంబు♦నంద నిల్తు
రంఘ్రిసంభవులు సే♦వాసక్తు లగుదురు, సతులు సేవింతురు ♦ పతుల భక్తి

తే. వ్రతములన్ దానముల సత్య♦గతుల నిరతు
లగుదు రఖిలప్రజ లకాల♦మందు మృతిఁ
గాక సంపత్సమేతు లై ♦ ప్రాలుచుండ్రు
భువన మెప్పటియట్టులు ♦ పొదలుచుండు. 385

ద. కృతయుగవర్తనం బిది న♦రేశ్వర! త్రేతయు ద్వాపరంబు ని
ట్లతులితధర్మకర్మముల ♦ నై తగి వర్తిలు నీ కిదంతయున్
యతివరసంస్తుతం బగును ♦ ఘ♦నం బగువాయుపురాణపద్ధతిన్
మతిఁ గొని చెప్పితిం గనిన♦మచ్చున నిచ్చ ననుక్రమంబుగన్. 386

* అర్యులు = వైశ్యులు.

వ. చిరజీవి నగుటం జేసి నా కిదంతయు దృష్టంబు ననుభూతంబునుం గావున నతీతానా
గతయుగక్రమం బెల్లఁ దేటతెల్లంబు గావించితి మఱియు నొక్కహితోపదేశంబు
నుం గావించెద భ్రాతృసహితుండ వై నీ వవహితుండ వై యాకర్ణింపు మని
వెండియును. 387

మార్కండేయుండు ధర్మజునకు ధర్మోపదేశము చేయుట.

ఆ. ధర్మభృద్వరిష్ఠ ♦ ధర్మమునంద నీ,యాత్మ నిలుపఁ దలఁపు ♦ మన్ని యెడల
ధర్మమూర్తి యయిన ♦ ధరణీధవుఁడు సుఖం,పను నిహంబునందుఁ ♦ బరమునందు. 388

తే. మఱియు నొకమాట చెప్పెద ♦ మహితలేశ
పరిభవము సేయ నొప్పదు ♦ బ్రాహ్మణులకు
నెప్పుడును వారు కుపితులై ♦ యేమి చేసి
యేమి చేయ నైనం జాలి ♦ యుందుఁ గలరు. 389

శా. మార్కండేయుఁడు పల్కి నట్లు విని ధర్మప్రోద్భవుం డిట్లనున్
దర్కింపన్ భవదీయవాక్యములు వేదంబు ల్భవిష్యచ్ఛ్రో
దర్కప్రాప్తివిధాయకంబులు మునీంద్రా యెట్లు నే ధర్మసం
పర్కంబుం బెడఁబాయ కుందునొ సుధర్మం బెద్దియో చెప్పవే. 390

వ. అనిన మార్కండేయుండు వెండియును. 391

చ. ‡సకలజగత్ప్రసిద్ధ మగు సత్కులమందు జనించి ధర్మమూ
ర్తికి నయి ధర్మరాజనఁ బ్రతిష్ఠ వహించిననీకు నిం దెఱుం
గక యొకధర్మ మున్నదియె ♦ కౌరవవంశవిభూషణా! భవ
త్ప్రకటిత మైనయీవినయపద్ధతి కెంతయు సంతసించితిన్. 392

వ. అడిగితివి గావునం జెప్పెద వినుము. 393

సీ. సర్వభూతములందు ♦ సమబుద్ధి నిలుపుము, సదయుండ వగు మెద ♦ శాంతిఁ గొనుము
సత్యవాదివి గమ్ము ♦ సత్యంబు విడువుము, సూయ లే కనురక్తిఁ ♦ జూడు మొరుల
మృదుమధురోక్తుల ♦ మెలఁగుము హితుఁడ వై, ప్రజల నేలుము కన్న ♦ ప్రజలఁ బోలె
ధర్మ మార్జింపు మ ♦ ధర్మంబు వర్జింపు, మర్చింపు మతిథుల ♦ ననవరతము
తే. కొలువు మమరులఁ బితరులఁ ♦ గొలుము నీతిఁ, దప్పకుము మార్దవంబున ♦ నెప్పు డగుము
గర్వ మెఱుఁగక యుండుమీ ♦ యుర్విజనులఁ, బాలనము సేయునప్పుడు ♦ పార్థివేంద్ర.

‡ ధర్మమూర్తికి నయినాయమునకుఁ బుట్టి.



క. ఎప్పుడేని ప్రమాదమునన్, సుపరిష్కృత మగుచుఁ దప్పు ♦ చూపట్టినచో
నపుడే దానాదుల నీ, వపగతదోషుఁడవు గమ్ము ♦ భాస్కరతేజా. 395

తే. ధర్మమునఁ జేసి సర్వభూతలమునందు
నెనఁగు రాజుల గెల్చి రాజేంద్రుఁడ వయి
క్రతువు లొనరించి మిగుల సౌఖ్యమును గాంచి
శాశ్వతయశంబు నొందు మో విశ్వవినుత. 396

వ. ఇప్పటియీపరిక్లేశంబున కెంతయుఁ జింతింపకుము కాలసంప్రాప్తంబు లగువ్యసనంబు
లకుఁ బ్రాజ్ఞు లెప్పుడునుం బరితపింపరు కాలం బెంతవారికి నలంఘ్యంబు గావున
నీవు శంకారహితుండ వై మదుక్తక్రమంబునఁ బ్రవర్తింపు మనిన ధర్మనందనుండు
దేవా నీ చెప్పినచొప్పునఁ బ్రవర్తింపం బ్రయత్నించెద నా కెప్పుడును భయలోభ
మోహమత్సరంబులు లే వని చెప్పె నప్పు డటఁ గలవా రందఱుం బరమానందంబు
నం బొందుచుఁ బుండరీకాక్షసమేతులై యున్నపాండవులం గూడి మార్కండేయుండు
చెప్పినకథలన్ విని విస్మితులై యుండి రనిన జనమేజయుం డక్కథలం జెప్పు మని
వైశంపాయను నడిగె నని చెప్పి. 397

ఆశ్వాసాంతము.

శా. ప్రారంభించిన దాది గాఁగ నెపుడుం ♦ బ్రత్యూహము ల్గల్గె ని
య్యారణ్యంబున నాధి వ్యాధియును సంప్రాప్తంబు లయ్యెన్ మఱి
న్నేర న్మాంద్యము గ్రంథనిర్మితియు నింతే యయ్యె నో యయ్య నీ
కారుణ్యామృత మిచ్చి నిచ్చలు ననున్ ♦ గావం గదే మ్రొక్కెదన్. 398

గద్యము.

ఇది శ్రీమద్రఘునాథనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్త్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునం
దారణ్యపర్వంబున షష్ఠాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీ

బాలాత్రిపురసుందర్యైనమః.

# శ్రీకృష్ణభారతము

అరణ్యపర్వము.—సప్తమాశ్వాసము.

—:o:—



*వాసిరెడ్డికులపా
రావారసుధాంశుఁ డగుచు ♦ రాజిలి రాజై
జైవాతృకుఁ డై గుణముల
ప్రో వగుశ్రీచంద్రమౌళిఁ ♦ బ్రోవుము దేవా! 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కి ట్లనియె న ట్లడిగినజనమేజయునకు వైశం
పాయనుం డి ట్లనియె. 2

క. రాజేంద్ర వినుము ధర్మజుఁ, డాజటివల్లభునివలన ♦ నవనీసురవి
భ్రాజన్మాహాత్మ్యము విన,గా జతనము చేసి యిట్లు ♦ కడఁకం బలికెన్. 3

తే. బ్రాహ్మణోత్తములందు నా♦భక్తి దనరు, ననిశమును వారిమాహాత్మ్య ♦ మాలకింప
నిష్ట మగు నామనంబున ♦ నిపుడు మఱియు, విప్రులమహత్వ మెఱిఁగింప♦వే మునీంద్ర.

వ. అని ప్రార్థించిన నతం డతని కి ట్లనియె. 5

మార్కండేయుండు ధర్మరాజునకు బ్రాహ్మణప్రభావసూచకం బగుపరీక్షిత్తుకథ చెప్పుట.

మ. ‡కలఁ డిక్ష్వాకుకులోద్వహుం డను సకల♦క్ష్మాపాలచంద్రుం డపం
కిలచారిత్రుఁడు కీర్తిమంతుఁడు పరీ♦క్షిన్నామరాజేంద్రుఁ డు
జ్జ్వలతేజోమహితుం డయోధ్య యనఁ బెం♦ల్పుం బొల్చువీట న్మహీ
వలయం బేలుచునుండెఁ దొల్లిట మరు♦త్వత్ప్రాభవం బేర్పడన్. 6

చ. అతఁ డొకనాఁడు వేఁటకు మ♦హాహయరాజము నెక్కి పోయి యు
న్నత మగునొక్కకాననమున♦న్ మృగ మొక్కఁడు బాణవిద్ధ మై

* ఇందు సుధాంశు, రాజ, జైవాతృక, గుణ, చంద్రమౌళి శబ్దములు శ్లేషించుచున్నవి.
‡ పెల్చుక్ = అతిశయముచేత. మరుత్వత్ప్రాభవంబు = ఇంద్రవైభవము.



* యతిజవనంబునం బఱవ ♦ నయ్యెడ దూరము దానివెంబడిన్
క్షితిపతి పాఱి పాఱి శ్రమ♦చేఁ గడు డిందెను దృష్ణ నొందుటన్. 7

ఆ. అలసి దప్పిగొన్న♦యతఁ డొక్కచోఁ గాంచెఁ, జిక్క నగుట మిగులఁ ♦ జెన్నుమీఱి
నల్లనై కడిందినవకంబు గలవన,ఖండ మొకఁడు గనుల♦పండువుగను. 8

వ. కాంచి యందుఁ బ్రవేశించి తన్మధ్యంబున రమణీయసరోవరం బొండు లోచనగోచ
రం బగుటయు నతం డశ్వసహితుం డై తజ్జలంబులం జొచ్చి కృతావగాహుం డయి
వాహంబునకుం గొన్నిమృణాళంబులు మేఁత యిడి తా నాపుష్కరిణీతీరంబున
శయనించి విశ్రమించె నంత. 9

చ. శ్రవణరసాయనం బగుచుఁ ♦ జల్లనితెమ్మెరతోడఁ గమ్మనై
సవిధమునుండి వచ్చి యొక♦చక్కనిగీతము పంచమశ్రుతిన్
దవిలి మహీమహేంద్రుని క♦ద న్మది మెచ్చ నపూర్వవైఖరిన్
సవు రయి సుస్వరంబుల నె♦సంగి పవ న్వినవచ్చె నచ్చటన్. 10

చ. †విని యిది యేమిగానమొకొ ♦ వేడుక లోడిక లెత్తు నిత్తఱిన్
మనుజులు సంచరించెడిక్ర♦మం బది గానఁగ రాదు దేవభా
మిను లిటఁ జల్లులాట కయి ♦ మేదినికిం డిగి వత్తురేమొ క
న్గొన నగు నేరిపాట యగు♦నో యని చూచుచునుండె నవ్వలన్. 11

తే. అనిమిషుఁడు వోలె నరయున♦య్యవనిపతికి
నంత నొక్కసుమంతలో ♦ నండకత్తె
యొకతె కుసుమాపచయము చే♦యుచును బాట
పాడుచును జూడ నయ్యె న♦వ్వనమునందు. 12

ఉ. చూడఁగ నైన తత్క్షణమ ♦ సుందరి ముందట వచ్చి వచ్చినన్
వేడుకతోడ త్క్షేఁడు నలి♦వేణిని బిల్చి జలేజపాణి! నీ
వీడకు నెట్లు వచ్చితివొ ♦ యెవ్వరిదానవొ చెప్పు మన్నఁ బూఁ
బోఁడి వచించెఁ గన్నియను ♦ బా మ్మిచట న్విహరింప వచ్చితిన్. 13

వ. అనిన నతండు వెండియు. 14

ఉ. అన్నులమిన్న నీ వనిన♦యట్టులు కన్నియవేని మేలు నే
నిన్ను వరించితిన్ గరుణ ♦ నిల్పుము నాపయిఁ బల్కి వై యనన్

* తృష్ణ = దప్పి. † ఓడికలెత్తు = చిగిరించు. చల్లులాట = జలక్రీడ.

నిన్ను వరింతు నన్నవుడు ♦ నీళ్లల నిల్పక యుందువేని లే
కున్నను లేదు నాసమయ♦మో యిది వింటివె రాజచంద్రమా. 15

వ. అని పలికిన దాని కొడంబడి రాజేంద్రుం డాచంద్రవదనం గాంధర్వవిధానంబునం బెండ్లియాడి దానితో నభిమతక్రీడలం దేలుచుండె నంత నటం గొంతసేపటికి సేనావారంబు వచ్చి రాజుం బరివేష్టించుటయు నతండు చతురంతయానంబున నుండి కాంతాసహితుండై నిజరాజధానికిం జని రాజకీయాదులం దలంపక సంతతం బేకాంతంబున నచ్చేడెతోడం గూడిమాడి సుఖంవుచుండె నప్పుడు. 16

ఉ. ‡పరికి దర్శనం బిడక ♦ యొప్పుడు నప్పరమాణుమధ్యతోఁ
గోరిక మీఱ నుండుటయుఁ ♦ గోశవివృద్ధియు రాజ్యపాలనం
బారయకుంటయుం దెలిసి ♦ యాదటవోవ కమాత్యశేఖరుం
డోర మెలంగునూడిగవు♦టుగ్మలులం బిలిపించి యి ట్లనున్. 17

తే. అంతిపురవార్త లేమి భూ♦కాంతుఁ డేమి, చేయుచుండునో చెప్పుఁడీ ♦ చేడెలార
నావుడు నపూర్వ మొుం డగు ♦ నగరునందు, నిలుపరాదు జలం బని♦ నృపునియాజ్ఞ.

వ. ఇది యేటిదియో యెఱుఁగఁ జాల మనిన వారివచనంబుల కచ్చెరుపడి మెచ్చుచుఁ బ్రధానామాత్యుండును. 19

చ. సలలితపత్రపుష్పఫల♦సారమహీరుహసంభృతంబు ని
స్తులవిభవాభిశోభితము ♦ తోయవిహీన మహీనరత్నసం
కలితవితర్ధికాంచితము ♦ కాంచనమార్గపరిష్కృతంబు నై
వెలయుమహావనం బొకఁడు ♦ వీటికడం బొనరించె నెంచఁగన్. 20

వ. అమ్మహోపవనమధ్యంబున నొక్కదివ్యభవనంబును దానిపజ్జ ముక్తాజాలమయంబును సుధాసలిలలిప్తంబును సుగాఢంబు నగునొక్కవాపిం ద్రవ్వించి మించిన వేడ్కఁ దద్రామణీయకం బేకాంతంబున భూకాంతునకు దెలుంగం జెప్పించుటయు నాతం డత్యంతసంతోషితస్వాంతుం డై నిజకాంతం గూడి పోయి యాయుపవనంబునఁ బెద్దయుంబ్రొద్దిచ్చావిహారసౌఖ్యం బనుభవించుచు. 21

ఉ. కోరిక నిండ నందుఁ జని ♦ కొండొకకాలమున న్మహీవిభుం
డారమణీయకాననము♦నందుఁ బిపాసితుఁ డై భ్రమించుచున్
భూరితరక్లమంబునను ♦ బొంది మనోజ్ఞమహాతిముక్తకా
గారముపజ్జఁ గాంచెఁ గుతు♦కం బెసఁగన్ నడబావి నొక్కటిన్. 22

‡ ఆదటవోవు = కనిరయు.



తే. కాంచి తత్తీరమున నిల్చి ♦ తన్మవిభుండు, కలికిదిక్కుమొగం బయి ♦ సలిలపూర్ణ
మరసితే యిందు డిగి విమ♦లాంబువు లొక,యిన్ని తెచ్చి నాదగ దీఱ ♦ నిమ్ము కొమ్మ.

వ. అనుటయు నక్కొమ్మ కాని మ్మని చని. 24

క. నడబావి కరిగి నీళ్లులఁ, బడి మాయ మ్మగుడు నినుఁడు ♦ బహువిధగతులన్
గడుఁ పలవి పలవి పడఁతిం, బడినకడ న్వెదకఁ జొచ్చెఁ ♦ బరితాపమునన్. 25

వ. కానక పరిదేవనంబు సేయుచు బావి యంతయుం గాలించి కలంచి నీళ్లెల్ల వెడలం జల్లి యం దొక్కగర్తంబున మండూకం బొం డుండఁ జూచి యిది మత్ప్రియాంగన మ్రింగెం గా కేమి యని క్రుద్ధుం డై. 26

—•—•— పరీక్షిత్తు భార్యనిమిత్తము కప్పలం జంప నాజ్ఞ యిడుట. —•—•—

ఉ. కప్పల నెల్ల నెల్లెడలఁ ♦ గన్గొని చంపుఁడు చంపి చూపువా
రిప్పడమిం బహూకృతుల ♦ కెంతయుఁ బాత్రు లటంచు నాజ్ఞ యీ
నప్పడ వాఁగులందు నదు♦లందుఁ గొలంకులయందు బావులం
దొప్పెడుకప్పలన్ వెదకి ♦ యొహహరిసాహరిఁ జంపి రెల్లరున్. 27

చ. *నలుగడ రాజకింకరు ల♦నారతముం బ్లవహింస సేయుచున్
దలఁకి జగంబులం గలుగు♦దర్దురముల్ బ్రిదు కాసఁ జేసి య
య్యలుగుల మొల్ల భేకవిభుఁ ♦ డై తగువానికి విన్నవించుచుం
దెలిసి యతండు మాని యయి ♦ దేవరపాలికి వచ్చి యి ట్లనున్. 28

మ. ‡అపరాధం బిసుమంతయేనియును జే♦యం బోనిదేహి న్వధిం
చి వరంబుం జెడ రౌరవంబునఁ బడుం ♦ జెన్నొందువానిందుఁ డున్
నృపలోకాగ్రణి క్రోధము న్విడి యిఁకన్ ♦ నీస్వాంతమం దెంతయేఁ
గృప నూల్కొల్పుము కప్పలన్ మనిచి సం♦కీర్తిం బ్రవర్తింపుమా. 29

తే. మిక్కుటపుఁగోపమునఁ గ్రిందు ♦ మీఁదుఁ జూడ
కనపరాధుల హింసించు♦నట్టి డైన
వానిసిరియును సంపద ♦ వాసి చెడును
విను మధర్మంబు ప్లవహింస ♦ యుడుగు మధిప. 30

వ. అని పలికిన నిష్టజనశోకపరీతాత్ముం డగునతం డతని కి ట్లనియె. 31

* ప్లవహింస = మండూకవధము. దర్దురము = కప్ప; అలుగులము = బాధ.
‡ పరంబున్:—ఇది వతుత్సమము, దీన నిహము గ్రహించునది.

వ. అనిన శలుం డి ట్లనియె. 48

ఉ. బిచ్చపుబాపనయ్యలకుఁ • బెద్దతురంగము లేటికయ్య నే
నిచ్చెదఁ బుచ్చుకొమ్ము వల•తేని బలిష్ఠము లై వహింపఁగా
వచ్చినయెడ్ల రెంటి నవి • వాహనము ల్గదె విప్రజాతికిన్
ముచ్చట దీర నెక్కికొని • పొమ్ము వనమ్మున కట్లు కానిచోన్. 49

క. వేదముల మోయఁ గలిగెడి, భూదేవుల ననుచు వినికి • పొసఁగెడుఁ గానన్
వేదముల నెక్కి పొ మ్మటు, కాదే నడియానపదక • కొల్లదఁ జనుమా. 50

ఆ. అనుచు వామదేవుఁ • డనియె వేదమ్ములు, మమ్ముబోంట్లఁ గొని ప•రమ్మునందు
మోయఁ గలవు గాని • మోయ విహంబున, నె ట్లితరుల కొప్ప • నట్లె మాకు. 51

చ. అనవుడు నట్లయేనియు ర•యంబున గాలిని బోలి లీలపెం
పునఁ జనువేసడంబు లనఁ • బొల్చెడునాలుగుగర్దభంబులన్
గొనకొని నీ కొసంగెదను • గొ మ్మవి నిన్ను వహించు వామ్యముల్
చనవున నావి గాని పడి•వచ్చితివేనియు నీవి గా వికన్. 52

వ. అనిన వామదేవుండును. 53

క. అన్యాపహృతధనంబుల, మన్యువునం జేసి యైన • మరలఁ బడయుటల్
సన్యస్తుఁ డైనవానికి, నన్యాయము గానివ్రతము • యగు నవనీశా. 54

వ. అది యట్టిద కావున. 55

తే. గుఱ్ఱముల నీయకుంటివే • ఘోరరూపు, లయిన పెక్కుర రక్కసు • లస్మదీయు
లాయుధాంచితహస్తు లై • యలిగి నిన్ను, నొంపఁగాఁ బట్టి ముట్టెద • రొకట వింటె.

ఉ. నావుడు నుల్కి లొల్కి నయ•నంబుల నాశలుఁ డిట్లు పల్కి నో
హో వెఱపింప వచ్చితివొ•కో యికఁ జాలు బిభీషికోక్తు లి
ప్డే వనునట్టియయ్యసుర•లే నిను నీప్రియశిష్యు వీనిన్
నావచనంబునం దునిమి • నారకమార్గముఁ జూపకుందురే. 57

వ. అనిన వామదేవుండు నీ వి ట్లేల వాదులాడెదు బ్రతుకఁ దలఁతేని నావామ్యంబు లి మ్మని కనలి చూచుటయు నాక్షణంబ ఘోరాకారు లై నరాక్షసులు శూలహస్తు లయి పొడసూపి శలుం జుట్టుముట్టి గిట్టించుటయు నట్టిచో దలుండు నాకు విధేయుం డయ్యెనేని వామ్యంబులు వామదేవున కిచ్చుఁ గాత మని వేరొలుంగునం జెప్పి ప్రాణంబులు విడిచె నంత దలుండు రా జయ్యె నది విని వామదేవుండు వానిపాలి కిం జని త న్నెఱింగించి యి ట్లనియె. 58



వామదేవుండు దలునిఁ దూలించి గుఱ్ఱములం గొనుట.

ఉ. ధర్మముఁ దప్పవేనియు న•ధర్మము త ప్పని యెంతువేనియున్
ధర్మపరుం డనన్ యశము • దద్దయు నొందఁ దలంచితేనియున్
నిర్మలచిత్త నాహరులు • నీకడ నున్నవి వాని నిమ్ము నా
దుర్మతి వైనవాఁ డలిగి • ద్రుళ్లున నూతునిఁ జిల్చి యి ట్లనున్. 59

ఉ. *అలరిబ్రాహ్మణుండు గడు • నాడెడు నోడక వీని నేలపైఁ
గూలిచి మేనికండ లివి • కుక్కలకుం బలి యిత్తు నెంతయున్
గ్రాలు విషప్రదిగ్ధ మయి • కార్ముక మొం దది తెమ్ము నావుడున్
బోలు నటంచు విప్రకుల•భూషణుఁ డి ట్లని పల్కె నల్కమై. 60

తే. ఓరి నన్నుఁ జంప నున్నట్టి•నారసమున, నంతిపురి నాడునీసుతుం • డయిదు నయిదు
నేండ్లప్రాయంబునం బొల్చు•శ్యేనజితుఁడు, చచ్చుఁ గాత మిపుడు మద్వ•చనముకతన.

వ. అని పలికినంత నంతఃపురంబునం గలరాజపుత్త్రుండు సాయకనిహతుం డై త్రెళ్లె నది యంతయు నెఱింగియు నంతం బోక దురాగ్రహంబున దలుండు తనవారిం జూచి యి ట్లనియె. 62

ఉ. ‡చూచుఁడె బంధులార యిటు • చుచ్చుబు లై తగువాఁడితూపునన్
బాడబుఁ డై నవీనిపనఁ • బట్టెదఁ గట్టెద మిత్తి కుత్తుకన్
వేసుక మీకుఁ గూర్తు భుజ•విక్రమ మేర్పడ నంచుఁ జేర్పడన్
పీడనిశౌర్యగర్వ మెద • వేఁచఁగ నావఁగ రానియీసునన్. 63

తే. శరము సంధించి విడువంగఁ • గరము లెత్తె, మత్తుఁ డాదలుఁ దప్పు డు•న్మత్తుఁ డనఁగ
నె త్తినకరంబు లె త్తిన•ట్లె కనంగ, నయ్యె నెంతయు మానిమా•హాత్మ్యమునను. 64

వ. ఇట్లు సంస్తంభితభుజస్తంభుం డై సంరంభంబు నమర్షంబునుం బొల్లవోవ వెల్లనై గండు చెడ బెండుపడి యతండు తనవారిం జూచి దైన్యంబుఁ దోఁప వెండియు.

ఉ. ఇ త్తరి బాణముం దిగిచి • యేయుట కింతయుఁ జాల నిట్లు పై
కె త్తినచేయి దింపుటకు • నింతయుఁ జాల శరీర మంతయున్
దుత్తుము రయ్యె నో యనఁగఁ • దొట్రిలుచున్నది వీనిఁ జూడ నా
చిత్తము త త్తఱించెడిని • చెప్పఁగ నే మిఁక నేమి సేయుదున్. 66

వ. అని సంభ్రమించువానిం గాంచి దయాతరంగితాంతరంగుం డై వామదేవుం డి ట్లనియె. 67

* అలరి = దుశ్శీలుఁడు. ‡ చుచ్చుబుకు = మిక్కిలితీక్ష్ణము.

నిలయమునకు భుజించుచు వి♦నీతమతిం జనునట్టివానికిన్
గలుగుసుఖంబు భూపతికిఁ ♦ గల్గ దటంచు నెఱుంగఁ బోలెడిన్. 81

తే. పెరల కతిథులకును భూత♦తతికిఁ బెట్టి, శిష్ట మన్న మిష్టులతో భు♦జించునట్టి
వానిజన్మము పూతము ♦ వానిసుఖమె, సుఖ మనం దగు నన్యుల♦సుఖము సుఖమె.

చ. అతిథి భుజించునన్న మున♦యం దరయం గబళంబు లెన్ని న
న్నుత మగు నన్నివే లయిన♦నున్న నిగోవుల దానమీయ నా
వితతఫలంబు దాతకు ల♦భించెడు దాన నతండు పావనం
తతులను బాఱఁదోలి సత♦తంబు నిహంబు పరంబు నొందెడున్. 82

ఆ. కుడిచి యతిథి తనదు♦కుడిచేయి గడిగిన,సలిల మన్న దాత♦కలుషములను
గడిగివైచు దానఁ ♦ గల్మషరహితుఁ డై, త్రిదివమందు నతఁడు ♦ పొదలఁ గలఁడు.

వ. అని బకుండు దేవేంద్రునకుం జెప్పిన సంతసించుచు నతం డతనితో నిష్టకథానులాపంబు లం గొంతప్రొద్దు పుచ్చి స్వర్గంబునకు నిర్గమించె ననిన విని కౌంతేయాగ్రజుండు మార్కండేయుం జూచి మహాత్మా! బ్రాహ్మణప్రభావంబు సెప్పి తింక రాజన్యప్రభావంబు విన వలతుం జెప్పు మనిన నతం డి ట్లనియె. 84

చ. మును నహుషాత్మజుం డగుచుఁ ♦ బొల్చి యయాతి ధరిత్రి నేలుచో
ఘనుఁ డగుబ్రాహ్మణుం డొకఁడు ♦ గన్గొన వచ్చి వచించె నిట్టు లో
మనుజవరేణ్య నేను గురు ♦ నర్చన సేయఁగఁ గోరి వచ్చితిన్
నినుఁ గని యర్థముం బడయు♦నెమ్మదిఁ జేసి యొసంగ నెంతువే. 85

క. అని నీకు వలయునర్థముఁ, గొను మిచ్చెద ననుచుఁ బలుకు♦కువలయనాథున్
గని నాకు నమయ మొం డగుఁ, గొనియెద నది సేయ నీవు ♦ కుదిరెదవేనిన్. 86

వ. అనిన యయాతి నీసమయం బెట్టిది చెప్పు మనిన నతండు వెండియు. 87

ఆ. అర్థి వచ్చి యడిగి♦నా వానిపై దాత, మనమునందు యొని ♦ కినియఁబనుట
లోకధర్మ మట్లు ♦ గాక ప్రియం బైన,దానినేని యిత్తు వైనఁ గొందు. 88

వ. అనిన రా జి ట్లనియె. 89

క. యాచింపఁ దగనివస్తువు, యాచించినవాని కిత్తు ♦ నన నంటినయో
నోచెల్ల యీయకుండం, జూచెదనే యిచ్చి వగవఁ ♦ జూచెదనె మదిన్. 90

తే. అర్థులకు నిచ్చి సంతోష ♦ మనుభవింతు, నింతయును జెప్ప నొరుల కే♦ నిచ్చితి నని
యాచకుం డగ్గెనేనియు ♦ నల్గ నేను, విప్రుఁ డెల్లతెఱంగులఁ ♦ బ్రియుఁడు నాకు. 91



వ. అని గుర్వర్థం బర్థించినగోసహస్రం బాబ్రాహ్మణున కిచ్చి పుచ్చె నిది యయాతి భాగ్యం బని మఱియును. 92

మార్కండేయుండు రాజులచరిత్రము చెప్పుట.

సీ. వృషదర్భసేదుక♦విఖ్యాతనాములు, భూమీశు లై మున్ను ♦ పొదలుచుందు
రర్థులకు సువర్ణ ♦ మది తక్క మఱియొక్కఁ, డెదియు నీనివ్రతంబు ♦ మొదటివాని
కగు సేదుకుఁ డెఱుంగఁ ♦ డానియమవ్రతం, బపు డొకబాడబుం ♦ డరుగుదెంచి
సేదుకు దీవనల్ ♦ సేసి గుర్వర్థంబు, వేయిగుఱ్ఱంబుల ♦ వేడ్క నడిగె

తే, నతఁడు నే నిడనోప నీ ♦ వరుగుము వృష,దర్భుఁ డిదు నీకు నావుడు ♦ ధరణిసురుఁడు
వానిపాలికిఁ జని తన♦వచ్చినపని, విన్నవించెను మిక్కిలి ♦ వినయమునను. 93

వ. వృషదర్భుండును దననియమంబునకు భంగపాటు వాటిల్ల ఘోటకంబుల నడిగె నవ్వానిం గనలి కశాభిహతిం గావించిన నతండును. 94

తే. నిరపరాధిని న న్నిట్లు ♦ నీ వనుపఁగ, నేటి కని కిన్కఁ గొని శపి♦యింప నున్న
ననునయించి మహీశుఁ డీ ♦ వడిగినట్టి,వాని నీఁడయ్యెనొటు వేఁ ♦ డైనఁ గాని. 95

మత్తకోకిలము. *అవ్విధంబునఁ బల్క బ్రాహ్మణుఁ ♦ డల్క వీడి మహీశ నే
నవ్వనిం గని వేఁడఁ గాని యొ♦కింత మున్ను ఘనుండు నా
నివ్వసుంధరఁ బేర్మిఁ గన్న న♦రేంద్రచంద్రుని సేదుకున్
నవ్వ వేఁడితి వేఁడ నాతఁడు ♦ నిన్నుఁ దెల్పిన వచ్చితిన్. 96

వ. అని చెప్పిన వృషదర్భుండు నాతప్పు సైఁపు మీపూర్వాహ్ణంబున బొక్కసంబునకు వచ్చినరొక్కం బంతయు నిచ్చెద నది నీ కశ్వసహస్రంబునకు మించినమూల్యం బగుఁ గాత మని యట్లొసంగె నిది వృషదర్భునిదాతృత్వం బని మఱియును. 97

చ. కురుకులసంభవుం డగునొ♦కొండు సుహోత్రుఁడు నాఁగ నొప్పువాఁ
డరదము నెక్కి పోయి వన♦మందు మునీంద్రులఁ గొల్చి వచ్చుచున్
సరథు నుశీనరాత్మజుఁ బ్ర♦శస్తయశున్ శిబి మార్గమధ్యమం
దరసి యెదుర్కొనం జనియె ♦ నాతనిదారికి నడ్డుకోలుగన్. 98

వ. శిబియు నెదుర్కొని సుహోత్రునిదారి కడ్డంబు నడిచె నంత. 99

మత్త. నేను బూజ్యుఁడ నోసరిల్లుము ♦ నీ వటంచు సుహోత్రుఁడున్
నేను బూజ్యుఁడ నోసరిల్లుము ♦ నీ వటంచు శిబీశుఁడున్

* సెవ్వ = దారిద్ర్యము.

బ్జాని పల్కుచు నల్కఁ బెంపునఁ ♦ బొల్లపోవ నొక శ్లోక
శ్లాన పెట్టినయట్లు దారికి ♦ నడ్డ నిల్చిరి పెల్చనర్. 100

తే. అపుడు నారదుఁ దర్థదైంచి ♦ యుచ్చటి కీర, విద్య వ్యదికట్టె యుట్లు తె ♦ స్నీక నిలిచి
యుండి రేమని యడుగ న♦తండు నతఁడు, నతని కిట్లని పల్కెడి ♦ పాత్రింబలు లయి.

క. ఘనుఁ డొసర్చిన దన,ఘునతకు లోపంబు యడుగును ♦ గావున విను మో
మున్నివర్ర యి ట్లుంటిమి మా,ఘునతయు నస్యావతయుఁ దెలుపఁ♦గాఁ దగు వీకు 

వ. అనిన నారదుం డి ట్లనియె. 103

తే. మృదుఁడు క్రూరుని గ్రూరుండు ♦ మృదుని గొల్చుచు
సాధు వగు సాధుశీలుఁ డ♦సాధువునెడఁ
గృతమునకు నసాధ్యమంగు లు♦చిత మొనర్ప
నుత్తముం డెన్నిమడుఁగులే ♦ నోపి చేయు. 104

తే. అనృతవాదిని సత్యము♦నను గృపణుని, జాగమునఁ గ్రూరకర్ముని ♦ క్షమమునను న
సాధువును సాధుసంగతి ♦ జగతిఁ గెలువ, నొప్పు నని నీతిశాస్త్రముల్ ♦ చెప్పుచుండు.

ఉ. నీవును నీవు నుత్తములు ♦ నీకును నీకును బోల్పఁ జాల రా
దేవత లైన మాయశము ♦ దిక్కుల నల్లెడఁ బిక్కటిల్లె నో
పావనమూర్తులార! మిముఁ ♦ బ్రస్తుతి సేయఁగ వచ్చుమేటు లం
చీవి నుశీనరాత్మజుఁ డొ♦కించుక మించు నటంచు నెంచెదర్. 106

వ. అని నారదుండు చెప్పిన సుహోత్రుండు శిబికిఁ బ్రదక్షిణంబు గావించి ప్రశంసించుచు
మార్గం బొసంగి చనియె నని మఱియును. 107

ఉ. చాగమునందు మేటి యని ♦ సన్నుతిఁ గన్న యుశీనరాత్మజున్
నాగులలోకమున్ దివిజ♦నాథులలోకము మర్త్యలోకమున్
బాగుగఁ జూచియు న్వినియుఁ ♦ బాడి యెఱుంగుఁ దదీయకీర్తి ది
వ్యాగమసారశోభయుల క♦హర్నిశముం గడు వన్నెఁ బెట్టుచున్. 108

సీ. వేల్పు లాతనిచిత్త♦వృత్తిఁ బరీక్షింప, వేచుడు నింద్రుండు ♦ వీతిహోత్రుఁ
డపుడు డేగయు గువ్వ ♦ యై శిబిపాలికిఁ, బఱతెంచుటయు డేగ ♦ తఱిమి రాఁగ
శరణు రక్షింపు మో♦నరవర! యని వాని,మఱుపు సొచ్చెను గువ్వ ♦ వెఱచినట్లు
దాని కభయ మిచ్చి ♦ మానవనాథుఁ డా,హారార్థి యయి వేఁడు♦నట్టి డేగ

ఆ. కొడలు కోసి యిచ్చె ♦ సువ్వొత్తుగా జగం, బెఱుఁగ బంక డొంక ♦ నెఱుఁగ కపుడు
విహంగరూపములను ♦ విడిచి వా రటఁ బొల్చి, వరము లిచ్చి చనిరి ♦ వ్రాలి మెచ్చి



ఉ. దేవవరప్రసాదమున ♦ దివ్యమునిప్రణుతప్రకారుఁ డా
భూవలయాధినాథున క♦పూర్వముగా నొడ లెల్ల దివ్యగం
ధావృత మై హిరణ్మయము ♦ మై వెలుఁగొందెఁ దదీయపార్శ్వమం
దావల నొద్భిదుం డనఁగ ♦ నై ప్రభవించె సుతుండు దండి యై. 110

వ. కపోతరోమనాముం డగునక్కుమారుండు రాజవృషభుం డై రాజ్యం బేలి జగద్వి
ఖ్యాతిం గాంచె నని చెప్పి మఱియు నాశిబిప్రభావంబు దేటపడం జెప్పెద నాకర్ణింపు
మని యి ట్లనియె. 111

శిబిచరిత్రభావకథనము.

సీ. ఘనుఁ డష్టకుం డనఁ ♦ గలఁడు విశ్వామిత్ర,కులజుండు భూపాల♦తిలకుఁ డాతఁ
డఖలరాట్సేవితుం ♦ డై చేసె వాజిమే,ధము తమ్ము లై నప్ర♦తర్దనుండు
వసుమనసుండు శిబి ♦ వరుసమై సేవింప, ఘనతరరథ మెక్కి ♦ చనెనువాఁడు
దారి నెదుర్కొన్న♦నారదునకు మ్రొక్కి, తమచెంత నాతనిఁ ♦ దనరఁ జేసె

తే, నపుడు తమ్ములలో నొక్కఁ ♦ డడిగె నిట్లు, మునివరేణ్య మే మందఱ♦మును దివంబు
నకు గమింతుమయేని నం దు ♦ నడుమ నెవఁడు, డిగ్గిపోవునొ చెప్ప వే♦డెదను భక్తి. 112

చ. అనవుడు నారదుం డనియె ♦ నష్టకుఁ డొక్కఁడు డిగ్గు మున్న యే
మనఁ వినుఁ డొక్కనాఁ డరద ♦ మాతఁడు నేనును నెక్కి పోవుచుం
గనుఁగొని గోసహస్రములు ♦ గుంపు లి లెవ్వరి వన్న నే నతం
డనియె ని వన్ని నాయొసఁగి♦నట్టివ యంచు నెఱుంగఁ బోలదే. 113

వ. అని తనదానంబు తాన మెచ్చుకొనియెం గావున నష్టకుండు డిగవలయు నంటి నవ్వల
నెవ్వండు డిగు ననినఁ బ్రతర్దనుం డని చెప్పి మఱియు ని ట్లనియె. 114

సీ. ఏను బ్రతర్దను♦నింటఁ గొన్నా ళ్లుండి, యతనితో రథ మెక్కి ♦ యరుగుచుండ
నరుదెంచి బ్రాహ్మణుం ♦ డడిగె రథాశ్వ మి, మ్మని యతం డవల నే♦నది యొసఁగుదు
నని యిప్డె వలయు నా ♦ కనువాని కిచ్చె నా,తఁడు కుడిప్రక్కఁ బెం ♦ పడరుదాని
వెనుక మఱొక్కఁడు ♦ విచ్చేసి యాచింప, నిచ్చె రెండవచక్కి ♦ నెసఁగుజక్కి

తే,*నంత మఱియిద్ద ఱరుదెంచి ♦ యప్పు డడుగ, నొండు రెండు తురంగము ♦ లుండ నిచ్చి
తేరు దా నీడ్చికొని పోయె ♦ దారి వట్టి, పోవున ప్పిడుగడ నొందె ♦ భావమందు. 115

వ. ఇచ్చిన దాని కి ట్లసూయపడియెం గావునఁ బ్రతర్దనుండు డిగు నవల వసుమనుం
డదియుం జెప్పెద వినుండు. 116

* ఇడుగడ = అసూయ.

సీ. మును వసుమనునింటఁ ♦ బుష్పరథప్రయో,జనమున స్వస్తివా♦చనము నడచె
నట నేను ద్విజులతో ♦ నరిగితి నతఁడు మా, కందఱకును జూపె ♦ నారథంబు
దాని నే మెచ్చితి ♦ దీని నీ కిచ్చితి, ననె నాతఁడు మఱొక్క♦యవసరమున
మరల నుత్సవ మయ్యె ♦ విరితేరు వోగడ నే, నదియు నీ కిచ్చితి ♦ ననియె నతఁడు
తే. మఱియు మూఁడవపరి వసు♦మనసుఁ డుత్స,వముఁ బొనర్పఁగ నేఁ దొంటి♦వలె నరిగితి
నపుడు విప్రులఁ జూపి నా♦కనియె స్వస్తి, వాచనము లెన్న యయ్యె నే♦వలయుఁ బలుక.
వ. అని విప్రుల నుల్లనంబాడెఁ గావున వసుమనసుండు డిగువాఁడ యని చెప్పితి
నని మఱియును. 118
ఆ. డిగఁడు శిబి యొకండు ♦ డిగిన నే డిగియెద, నతని కేను జాల ♦ నన్నిగతులఁ
బుణ్యలోకములకుఁ ♦ బోయెడు నతఁ డిటఁ, గారణం బొకండు♦ కలదు వినుఁడు. 119
మ. క్షితిదేవుం డయి నల్వ యీశిబిఁ బరీ♦క్షింపంగ విచ్చేసి యొ
క్కతఱిం బెట్టుము భోజనం బనుచు వేఁ♦డ్కం బల్క నాతండు నీ
హిత మెట్లో వచియింపు మన్న నతఁ డో♦యీ! నీబృహద్గర్భుఁ డ
న్సుతుమాంసమ్మును వండి పెట్టుము భుజిం♦తుం దాని నిష్టంబుగన్. 120
తరళము. అనుచు జంక కతండు పుత్రకు ♦ నట్టె చంపి ద్విజుండు చె
ప్పినవిధంబున వండి పాత్రికఁ ♦ బెట్టి దాని శిరంబునన్
గొని ముని న్నమకించుచుండెను ♦ గొంతలో నొకదూతుఁ డా
జనవరేణ్యునిపాలికిం జని ♦ సంభ్రమంబున నిట్లనున్. 21
వ. దేవా! నీవెదకువృద్ధబ్రాహ్మణుండు క్రుద్ధుండై నగరంబు సొచ్చి కోశాగారం
బులు నాయుధాగారంబులు నశ్వశాలలు గజశాలలుం గాల్చుచున్నవాఁ డని
నివేదించిన నతండు వినయవినమితోత్తమాంగుం డయి చని బ్రాహ్మణునిం గని
నమస్కరించి. 122
మ. ధరణీదేవకులావతంసమ భవ♦ద్వ్యాహారముం జేసి నే
నరుదారం బచనంబు చేసి పలలం ♦ బన్నంబునుం బాత్రలోఁ
బరితోషంబునఁ బెట్టియుంచితి నిఁకన్ ♦ భక్షింపు మన్న న్మనీ
శ్వరుఁ డుగ్రంబున మోము వాంచి యొదియు ♦ న్వాక్రువ్వఁ. డెవ్వేళకున్. 123
వ. అంత నమ్మహీకాంతుం డత్యంతభక్తిభరితుం డయి మఱియు బహుప్రకారం
బులఁ బ్రార్థించినం బ్రసన్నుం డయి మాయాబ్రాహ్మణుం డతనిం జూచి నావచ
నంబునం జేసి యొండాడక నీవ యీపలలాన్నంబుఁ దిను మనుటయు నతం డట్ల



యగుం గాక యని విమనస్కుండు గాక వీఁకం బూని దానిఁ దనబాలునికపా
లంబునం బెట్టుకొని తిన నుద్యమించె నంత నతం డతనిహస్తంబు పట్టుకొని యి
ట్లనియె. 124
శా. కామక్రోధములన్ జయించితివి నం♦ల్కెంతేని మోహంబు నీ
కేమైఁ జూచిన లేదు యాచకుల కే♦మేనిన్ సమర్పింతు వా
హా! మాటాడినమాత్రఁ బుత్రుఁ దెగఁగో♦యం జంకవై తింతయున్
సామాన్యుండవు గావు నిన్నుఁ బొగడన్ ♦ శక్యంబె రాజోత్తమా. 125
వ. అని ప్రస్తుతించె నపుడు శిబి తలయెత్తి తనప్రమోల దేవకుమారుండువోలె దివ్య
గంధాన్వితుండును నానాలంకారాలంకృతుండు నగునిజపుత్రుం జూచి వెఱఁగందు
నంతలో నాబ్రాహ్మణుం డదృశ్యుం డయ్యె నపుడు మంత్రులు వచ్చి రాజుం
దర్శించి నీ వేమిఫలం బపేక్షించి యిట్లు చేసి తనిన నతండు వారి కిట్లనియె.
ఉ. కా దనముం గడించుటకుఁ ♦ గాదు ధనార్థము కాదు పేర్మికిన్
గా దది భోగతృష్ణకును ♦ గా దొకదానికిఁగాని యుగ్గతిన్
సాదుల కిష్టమైనయది ♦ సల్పఁగ నౌ నని సల్పితిం జుఁడీ
నా దగుచిత్తవృత్తి యిది ♦ నాఁగ నెఱుంగుఁడి మీర లందఱున్. 127
వ. అని శిబిప్రభావంబు చెప్పె నని చెప్పుటయును. 128
క. విని సంతసించి కుంతీతనయుండు మృకండుతనయు ♦ దర్శించి యనున్
మునివర మీకంటెను నిలన్, గనుఁగొనఁ జిరకాలజీవి ♦ కలఁడే చెపుమా. 129
వ. అనిన మార్కండేయుండును. 130

ఇంద్రద్యుమ్నోపాఖ్యానము.

క. కలఁ డింద్రద్యుమ్నుం డన, వెలసినరాజర్షి తొల్లి ♦ విహితాధ్వరుఁ డై
నలలితయశుఁ డై భూమండలమున వెలుఁగొంది చనియె ♦ నాకంబునకున్. 131
క. ఇంద్రద్యుమ్నుఁడు పెక్కేం, డ్లింద్రోపముఁ డగుచు నిర్జ♦రేంద్రునియింటన్
సాంద్రామలకీర్తిం గొని, చంద్రప్రభ నొప్పె నమర♦సన్నుతుఁ డగుచున్. 132
ఉత్సాహము. చాలఁగాల మిట్లు దనిన ♦ త్రుమ్మతలంబునందుఁ బే
రోలి మాయ వేల్పు లతని♦యొద్ద కేగుదెంచి భూ
పాల క్షీణపుణ్యుఁ డైతి ♦ పద యిట న్వసింపఁగాఁ
జాల వంచుఁ గ్రిందఁ బడఁగ ♦ నదలఁ ద్రోచి రత్తఱిన్. 133

క. ద్రోపు వడి యతఁడు ప్రచ్యుతుఁడై పుడమిం బడుచు లేచి ♦ యతిసంభ్రాంతిన్
గాపురుషునట్లు వగచుచు, నాపజ్జకు నరుగుదెంచి ♦ నయ మేర్పడఁగన్. 134

ఆ. తనదుపేరు సెప్పి ♦ మునులముత్తాత వౌ, నీవు నన్నెఱుంగు♦ దే మునీంద్ర
యనుడు నేను వాని ♦ నరసి యిటన మేము, తప మొనర్చుచుందు♦ మెపుడుఁ దగిలి.

క. నిన్నెఱుఁగు టెట్లు నావుడు, నన్నాతఁడు సన్నుతించి ♦ వకవకపడుచున్
నిన్నుఁ స్మరించినవృద్ధుం, డున్నాఁ డ్రుచ్చి నన్ను ♦ నోమవె తండ్రీ. 136

వ. అని ప్రార్థించుటయును, 137

సీ. అక్కటికంబు లో ♦ నంకురింపఁగ నేను, వాని కంటిని హిమ♦వంతమందుఁ
బ్రావారకర్ణాఖ్యుఁ ♦ బరఁగునులూకంబు, నాకన్నఁ బెద్దది ♦ యై కడంగు
నిన్నెఱుంగునొ యేమొ♦ నీవందుఁ జనుమన్న, నతఁడు నన్ గూడ ర♦మ్మనియె ననుడు
వృద్ధుల మే మింత ♦ వెడలలేమన నతం, డశ్వమై తనవీఁపు♦నందు నన్ను

తే. మోచికొనిగూబపాలికిఁ♦బోయిపిలిచి, నన్నెఱుఁగుదె యింద్రద్యుమ్నుఁ♦డన్న వాఁడ
నన్న ఘూక మొకింత లో♦ నరసి నిన్ను, నిక్కువ మెఱుంగ నే నని♦ నుక్కుపలికె.

వ. పలికిన నులికిపడి యింద్రద్యుమ్నుండు నీకంటెఁ జిరజాతుండు గలఁడేని చెప్ప ననుగ్రహింపు మనిన నక్కౌశికం బి ట్లనియె. 139

క. కల దింద్రద్యుమ్నం బను, కొల నట నాడీకజంఘు♦కుం డనుబక మొఁ
డలరు నది నిన్నెఱుంగుం, గలదొకొ నాకంటెఁ బెద్ద ♦ గావుటకతనన్. 140

తే. *అనుడు నాతఁడు నాతోక♦నయ్యులూక, వల్లభునిఁ గొంచు నచటికి♦వడిగ నడచె
నవుడు కొక్కెరఁగని మేము♦నృపతి పేరు, కఱుదునం జెప్పి వీని నీ♦వెఱుఁగుదట వె.

వ. అనిన నక్కొక్కెర యొక్కించు కాలోచించి. 142

క. నే నతని నెఱుఁగఁ జాలం, గాన మహాభాగులార ♦ కల దిట వృద్ధై
తా నెఱుఁగు నకూపారుఁడు, నా నొడువం దగినకూర్మ♦నాథుం డనుచున్. 143

వ. అడిగిచూత మని యెలుం గెత్తి దానిం బిలిచి కూర్మవల్లభా నిన్నొకయర్థం బడిగి తెలిసికొన నై యున్నయది యిట రా నవధరింపు మని విన్నవించుటయును.

ఉ. ఆయులి వాలకించి జల♦మందలికూర్మము కూర్మి మించఁగా
మాయెడ కేగుదెంచుటయు ♦ మచ్చిక హెచ్చఁగ మేము దాని కా

* కఱుదు = చేర్పు.



రాయనిపేరు సెప్పి మును ♦ గ్రాలినవీని నెఱుంగుదే యనన్
బాయనిబత్తి చిత్తమునఁ ♦ బాదుకొనం గమఠం బడంకువన్. 145

వ. ఒక్కించుక ధ్యానించి బాష్పపూర్ణనయనయుగళంబును నుద్విగ్నమానసంబును వేపమానాంగంబును విసంజ్ఞకల్పంబు నై యెలుంగు రాల్పడఁ గేల్దోయి మొగిడ్చి యి ట్లనియె. 146

ఉ. ఏల యెఱుంగకుండెదను ♦ యేను మహాగుణభూషణు న్మహీ
పాలుని వాని వానిదయ ♦ వాసముచేయుచు నుంటి నిందు నీ
కూలమునం దనేకశత♦కోటులు దక్షిణ లిచ్చి జన్నముల్
వేలకు వేలు చేసి నిలి♦పెన్ మణియూపము లెన్నియేనియున్. 147

ఉ. ఆతఁడు దక్షిణార్థముగ ♦ నర్థుల కిచ్చినగోగణంబు లీ
భూతలమందు మెట్టుటను ♦ భూరిఖురంబుల గ్రొస్సి గ్రొస్సి తా
దే తగి యీసరోవర ము♦దీరిత మయ్యెఁ దదాహ్వయంబునన్
బ్రీతికిఁ గారణం బతని♦పేరు స్మరించితి నేను ధన్యుఁడన్. 148

మధ్యాక్కర. అని పల్కుచున్నంత ♦ నమరలోకము♦నందుండి దేవ
మునిసేవితం బగు ♦ ముదము పొదలించు♦పుణ్యవిమాన
మును గొంచు దేవతా♦ముఖ్యు లరుదెంచి ♦ మోదము నించి
జననాథ నీకీర్తి ♦ జగతిపై నెప్పుఁ ♦ జనుదెమ్ము దివికి. 149

వ. అని మఱియును. 150

చ. తనయశ మెంతదాఁక వసు♦ధన్ విదితం బగు నంతదాఁక న
జ్జనుఁ డలనాకమం దలరి ♦ సౌఖ్యములం దులఁదూఁగు నట్లు తా
నొనరుచుదుష్కృతంబున న♦ముద్భవమానయశంబు పెంపునన్
జను నరకంబుఁ గాన నని♦శంబు గణింపఁగ నొప్పుఁ బుణ్యమున్. 151

వ. అని పలుకుచు విమానం బెక్కు మనుచు నింద్రద్యుమ్నుని వేగిరించుటయు నతం డీవృద్ధుల నిద్దఱ నిజస్థానంబులం బెట్టి వచ్చెద నావచ్చువఱకు నిచ్చటన ప్రతీక్షించుచుండునది యని చెప్పి నన్నునుం బ్రావారకర్ణుని యథాస్థానంబులం బెట్టి తా నాదేవయానం బధిష్ఠించి స్వర్గంబునకు నిర్గమించి యథోచితస్థానంబు నొందె నిది యంతయుఁ జిరంజీవి నగునాచే ననుభూతం బయ్యె నని చెప్పినఁ బాండవేయాగ్రజుండు మార్కండేయుం జూచి మునీంద్రా! నీప్రసాదంబునం జేసి కదా స్వర్గచ్యుతుం డగు నింద్రద్యుమ్నునకు స్వస్థానంబు లభించె నని ప్రశంసించిన నతండును. 152

క. నరకమునఁ బడిననృగున్నృప,వరు నవును సముద్ధరించి ♦ వాంఛితఫలముల్
కర మర్థి నొసఁగె నీమురహరునిం బొగడంగ వలవ♦దా మున కిపుడున్. 153

వ.*అని వాసుదేవుఁ బ్రస్తుతించుచుండ ధర్మనందనుండు మృకండునందనుం దిలకించి దానంబునకు దేశకాలపాత్రంబు లెట్టివి విన వలతుం జెప్పు మనిన నతం డతని కి ట్లనియె. 154

మార్కండేయుండు ధర్మజునకు దానమహిమాదికము చెప్పుట.

తే. పుట్టుతో బహిష్కృతుఁడు సంపుత్రకుఁడును,దనకుఁగాఁ బాకమును జేసి♦కొనెడువాఁడు
నెవుఁడును బరాన్నమును దిన♦నెంచువాఁడు,దలఁపఁగా వీరు దానపా♦త్రములు గారు.

వ.†మఱియుఁ బరపాకభోజియు నారూఢపతితుండును నన్యాయోపహితుండును బతితుండును దస్కరుండు ననృతవాదియుఁ బాపాత్ముఁడును గృతఘ్నుఁడును గ్రామపాచకుండును వేదవిక్రయియును శూద్రపాచకుఁడును బ్రహ్మబంధువును వృషలీపతియు స్త్రీజితుండును వ్యాళగ్రాహకుండును బరిచారకుండును ననునీపదునార్వురకుం జేసిన దానంబు నిష్ఫలంబు. 156

తే. భయమునం గాని క్రోధంబు♦వలనఁ గాని, తమమునం గాని చేసిన♦దాన మరయ
ఫల మొసంగదు సాధుస్వ♦భావమునను, సద్విజుల కిచ్చుదానంబు ♦ సన్నుతంబు. 157

వ. సర్వకాలంబులును సర్వావస్థలును సర్వదానంబులకుం జెల్లు నం దుత్తమబ్రాహ్మణులకు వృద్ధత్వంబునం జేసిన దానం బుత్తమోత్తమం బై సఫలం బగు నాకర్ణింపుము.

చ.‡జపము తపంబు హోమమును ♦ సంధ్యయు నధ్యయనంబు దేవమూ
ర్త్యపచితియుం బొనర్చుచు భ♦వాంబుధి దాఁటఁగఁ జేయు దాఁటు నె
ల్లవుడును వేద మున్తరణి♦యం దయి బ్రాహ్మణుఁ డట్టివానికిన్
నిపుణతఁ జేయుదాన మది ♦ నింద్యము గాక ఫలప్రదం బగున్. 159

* ఇది మొదలుకొని కువలాశ్వనిచరిత్రమునఱకును దానధర్మాదికకథనము శంభుదాసుని భారతమునఁ బూజ్యము.

‡ పరపాకభోజి = సర్వదా పరాన్నముఁ దినువాఁడు. ఆరూఢపతితుండు = భ్రష్టమైనవాఁడు. పతితుఁడు = చెడినవాఁడు. గ్రామపాచకుఁడు = గ్రామపురోహితుఁడు. వేదవిక్రయి = వేద మమ్మువాఁడు. శూద్రపాచకుఁడు = శూద్రునకు వండిపెట్టువాఁడు. బ్రహ్మబంధువు = దూఱఁ దగినవాఁడు. వృషలీపతి = శూద్రినిగట్టుకొన్నవాఁడు. స్త్రీజితుఁడు = స్త్రీవశమం దుండువాఁడు. వ్యాళగ్రాహకుఁడు = పాములఁ బట్టువాఁడు. పరిచారకుఁడు = ఊడిగము చేసి బ్రదుకువాఁడు.

‡ దేవమూర్త్యపచితి = విగ్రహారాధనము. తరణి = నావ.



సీ.*ఉత్తమబ్రాహ్మణు ♦ నుపచరించినవాని, కిత్తు రుత్తమపదం ♦ బెల్లసురలు
దేవతలం బిత్రు♦దేవతలం ధాత్రి,దేవతలం గొల్వఁ ♦ దే జెనంగుఁ
గళ్ల కుత్తుకఁ జుట్టి ♦ త్రెళ్ల నున్నప్పుడు, శ్రుతిదేవసేవ స♦ద్గతికిఁ ద్రోవ
శ్రాద్ధకాలమున స♦ద్బ్రాహ్మణులఁ బ్రయత్న,మున నియమింప నొ ♦ భోక్తలుగను
తే.‡కునఖియుఁ గురూపియును గుష్ఠి ♦ గోళకుండుఁ
గుండుఁడును రోగి మాయావి ♦ గాండపృష్ఠుఁ
డును దగరు భోక్తలుగ శ్రాద్ధ♦మునకు నింద్య
మగు నపాఙ్క్తేయుఁ డైన న♦య్యదియుఁ జెడును. 160

తే. వేదపారగుఁ డొక్కఁడు ♦ వెలసియున్న, వానితోఁ గూడి మూకాంధ♦బధిరు లైన
వారు శ్రాద్ధనిమంత్రణ♦ప్రాప్తి కర్హు, లగుదు రంద ఱుత్తము లైన ♦ నడుగ వలెన.

చ. అతిథికి భోజనం బిడిన♦యందున సంతస మందినట్లు దే
వత లనిశంబు వేల్పుటను ♦ వాడనిపూవులఁ బూజ సేయుటన్
స్తుతు లొనరించుటన్ సతులఁ ♦ జూపుట సంతస మంద రందునన్
సతతము నన్నపానము లొ♦సంగి ద్విజాతిని గొల్చు టొప్పగున్. 162

తే.†దేవమాల్యాపనయనంబు ♦ ద్విజవరులకు, గాత్రసంవాహనంబు నా♦కల్పసేవ
యును దదుచ్ఛిష్టమార్జనం♦బును నొకం డొ,కండు గోదానమునకన్న♦ఘనతరములు.

ఉ.§శ్రోత్రియుఁ డగ్నిహోత్రుఁడు వి♦శుద్ధచరిత్రుఁడు రిక్తుఁడున్ సతీ
పుత్రసమేతుఁ డుత్తముఁడు ♦ పుణ్యపదైకవిహారచిత్తుఁడున్
బాత్రుఁడు నైనవిప్రునకు ♦ భక్తి మెయిం గపిలాప్రదానమున్
ధాత్రిజనుం డొసంగి సుకృ♦తంబునఁ జేరెడుఁ బాపదూరుఁ డై. 164

చ.¶ఒకనికి నొక్కగోవు నిడ ♦ నొప్పును బెక్కుర కొక్కఁ డిచ్చినన్
దికమక యౌను దాని విడఁ♦దీయఁగ నేరక విక్రయింత్రు వా
రకట మహోఘు మై కులము♦లం దిరువాఁగుఁ ద్రిపూరుషంబుగాఁ
దుకతుక దుఃఖ మందెదరు ♦ దుర్గతి దాత ప్రతిగ్రహీతయున్. 165

* ఉపచరించు = సేవించు. కళ్ల = కఫము. ‡ కునఖి = పుప్పిగోళ్లవాఁడు. కుష్ఠి = కుష్ఠరోగి. గోళకుఁడు = తండ్రి చచ్చినవెనుకఁ బుట్టినవాఁడు. కుండుఁడు = తండ్రి యుండ మఱియొకనికిఁ బుట్టినవాఁడు. కాండపృష్ఠుఁడు = ఆయుధజీవి. అపాఙ్క్తేయుఁడు = పఙ్క్తికిఁ దగనివాఁడు.

† ఆకల్పసేవ = చిరకాలసేవ; "ఆకల్పపరిచర్యాచ" అని మూలము. § రిక్తుఁడు = దరిద్రుఁడు.

¶ ఇరువాఁగు = రెండువైపుల. దుర్గతి = నరకము.

సీ.*కలవాని కిచ్చినఁ ♦ గలుగదు ఫలము పేదల కీయ వలయును ♦ దానములను
దన కుపకారి గాఁ ♦ డని తెలిసినవాని, నరసి చేసినదాన ♦ మనువుపడును
స్వర్ణదానము చేసి ♦ జన్మాంతరమునందు, వేయిగద్యాణముల్ ♦ వేడ్క నొందుఁ
గాఁడిఁ గట్టఁగ నైన ♦ గంఢుకెద్దు నొసంగి, వడయు స్వర్లోకంబు ♦ నిదుమ లరుగ
తే, మఱియు గోభూసువర్ణముల్ ♦ మహిసురులకు, దాన మొనరించునుత్తమ ♦ మానవునకు
ముజ్జగంబు లొసంగిన ♦ పూర్ణ ఫలము, వచ్చుఁ గోరిక లన్నియు ♦ వరుస నగును.

చ.†అధికతపంబునం బడల ♦ నట్టిటు సోలుచు నధ్వఖిన్నుఁడై
పథికుఁడు సేర వచ్చినను ♦ బట్టెడుబోనము పెట్టి వానికిన్
క్షుధ యుడిగించెనే గృహికిఁ ♦ గొంచెము గాదు ఫలంబు గొప్పదై
విధిసవిధంబునన్ సతము ♦ వెల్గుచునుండఁగఁ జేయు వింటివే. 167

తే. అన్న మగు బ్రహ్మ మని వస్సు ♦ రాఖ్య నలరు,వత్సరముయజ్ఞ మగు నందు ♦ వఱలు సర్వ
మన్న మద్దాన ముత్తమ ♦ మన్నదాత, నరసి యన్నదానఫలంబు ♦ నందు నరుఁడు.

క. దానము లన్నిటికంటెం, దా నెక్కువ యగుచు న న్న ♦ దానము పొదలున్
దాన నగుఫల మనంతము, మానసమున నరసి దాని ♦ మహిమము వింటే. 169

తరువోజ.‡ప్రసవించుతఱిఁ గోవు ♦ పాదముల్ శిరము ♦ పరికింప నైనట్టి ♦ పట్టున నావు
నసి మించుభూమికి ♦ సరివచ్చు నంచు ♦ శాస్త్రము వచియించు ♦ నరగ నప్పుడిఁ
బొనఁగెడునుభయతో ♦ ముఖధేను వుత్త ♦ మున కిచ్చినం దాని ♦ మూర్తికి దాని
నిసువుమూర్తికి నెన్ని ♦ రెఱు లన్నియేండ్లు ♦ నెఱి మీఱి దివి దాత ♦ నిలిచిసుఖించు.

తే. గొరిజలం గొమ్ములం బైఁడి ♦ గొడుగు లునిచి, తిలలతోఁ గప్పి నల్లని ♦ ధేను వొవఁడు
నిచ్చు వానికి భూతలం ♦ బెల్ల నిచ్చి,నట్టిపుణ్యము లభియించు ♦ నందురి బుధులు.

సీ. పుష్కరగోదాన ♦ పూర్ణఫలం బబ్బుఁ, గడుభక్తి విప్రుని ♦ కాళ్లు గడుగఁ
బుడమి విప్రునికాళ్లు ♦ గడిగినజలమునఁ, దడిసి పవిత్ర మై ♦ తనరుచుండు
నిలు సేరునతిథికి ♦ నెదు రేగి స్వాగతం, బడిగినఁ దృప్తి యా ♦ నగ్నులకును
నాదరంబున వాని ♦ కాసనం బిచ్చినఁ, జెకరు లిందాదులుఁ ♦ బ్రీతు లగుదు
తే, రన్నపానీయము లొసంగ ♦ నజుఁడు దనియు, వానితో ననువర్తించి ♦ వచ్చియమరు
లర్చలం జేసి సంతుష్టు ♦ లగుదు రతిథి,నింద పాపప్రదం బయి ♦ నెగులు దెచ్చు.

* గద్యాణము = వరహా. † తపంబు = వేసవికాలము. బోనము = అన్నము. గృహి = గృహస్థుఁడు. విధిసవిధము = బ్రహ్మచెంత. ‡ వసి = సస్యము. రెఱులు = రెండ్రుకలు.



తే. తరుతటాకాదిసప్తసం ♦ తతులకన్న, నన్నదానము మిన్న యా ♦ నన్నదాత
మొదల పున్నియమున కేగుఁ ♦ బిదప సత్య,వాది లోనగువా రేగు ♦ వారు తలఁప.

క. న్యాయార్జిత మగుధాన్యము, పాయక సేవించి భూసు ♦ పర్వున కిడినన్
శ్రీయొదాయక మగు నా,రాయనికిన్ భూమిదేవి ♦ ప్రమదం బొసఁగున్. 174

క. ఆపత్కాలమ్మునయుం, దేపురుషుఁడు తెలిసి దాన ♦ మిచ్చునొ వానిన్
దేవ యయి దాన మద్ది భ,వాపాంపతి నుద్ధరించు ♦ నరుదారంగన్. 175

వ. దానంబు పర్వంబుల ద్విగుణంబు ఋతుసంధియందు దశగుణంబు వత్సరసంధియందు శతగుణంబు సంక్రమణాయనగ్రహణాదులం దుత్తరోత్తరాధికఫలప్రదంబు లోకంబునం బెట్టనివాని కెద్దియునుం బుట్టఁబోదు గావున దానంబుకన్నఁ దారకం బొండొక్కండు గానరా దని దానమహిమయు దానపాత్రతయు దానయోగ్యతయు వివరించినఁ బాండవేయుండు మార్కండేయుం జూచి. 176

ఆ. ఎంతదవ్వు గలుగు ♦ నిట కంతకునిలోక, మెట్టు లుండు దాని ♦ నెట్లు దాఁట
నగునొ తెలుపు మనుచు ♦ నడిగిన మునులకు,త్రాత యిట్టు లనియెఁ ♦ బ్రీతితోడ.

మార్కండేయుండు యమలోకపరిశారం బభివర్ణించుట.

సీ. విను మాయమునిలోక ♦ మెనుబదియాఱు వే,లామడల్ దూరమం ♦ దలరుచుండు
నద్దారిఁ ద్రావ నీ ♦ ళ్లలర నింపును నిల్వ, నీడయు లేకుండు ♦ నీరస మయి
యమదూత లాదారి ♦ నఖిలజంతువులను, నడపించుకొని పోదు ♦ రడరుబలిమి
నడచునప్పటికస్తి ♦ నెడువ నలవి గాదు, కార్చిచ్చులోఁ బడ్డ ♦ కరణి నుండుఁ
తే,*దనకుఁ గలభంగి విప్రులఁ ♦ దగ భజించి, దానము లొసంగి రేని యు ♦ మ్మానవులకు
నెదురుగావచ్చితత్ఫల ♦ మెలమిఁగూర్చు,నంయమని కేగుచున్న యా ♦ సమయమందు.

సీ.‡హస్త్యశ్వదాతలు ♦ హస్త్యశ్వముల నెక్కి, వస్త్రప్రదాతలు వస్త్ర ♦ వంతు లగుచు
ఛత్రప్రదాతలు ♦ ఛత్రంబులను దాల్చి, భూమిదాత లభీష్ట ♦ భూము లగుచు
స్వర్ణప్రదాతలు ♦ స్వర్ణభూషలు దాల్చి, యన్నదాతలు తృప్తు ♦ లగుచుఁ దనరి
స్యందనదాతలు ♦ స్యందనంబుల నెక్కి, వారిదాతలు తృషా ♦ భావు లగుచు
తే, సస్యదాతలు సుఖు లయి ♦ శాశ్వతగృహ,దాతలు విమానగులయి గో ♦ దాత లఘువి
దూరులై దీపదాతలు ♦ భూరిదీప్తి, మంతు లై యుత్తరింతు రా ♦ మార్గ మధిప. 179

వ. మఱియు మాసోపవాసులు హంసవాహనంబుల నెక్కియు షడ్రాత్రోపవాసులు మయూరరథాధిరూఢు లయ్యును నేకభక్తనియమంబునఁ ద్రిరాత్రవ్రతంబు

* సంయమని = యమపురము. ‡ తృషాభావులు = దప్పిలేనివారు.

*లొనరించినవారు నిఃఖేదు లయ్యనుం బోయి యమలోకంబునఁ బుష్పోదకా నదీతీరంబున నమృతోపమశీతలామృతపానంబు సేయుచు సుఖంబుండురు దుష్టకార్యంబు లొనరించినదుష్టాత్ములు పూయగంధబంధురజలంబులం ద్రావుచు నందు దుఃఖంచుచుందురు గావున నీ వెప్పుడు హవ్యకవ్యంబుల నుత్తమబ్రాహ్మణారాధనంబు గావించుచుండు మనిన ధర్మతనయుండు శౌచం బన నెట్టిది బ్రాహ్మణుండు ప్రతిగ్రహదోషంబు విడి శుద్ధుం డెట్లగుం జెప్పు మనిన మార్కండేయుం డి ట్లనియె. 180

—●●◆ మార్కండేయుండు ధర్మజానకు శౌచప్రకారం బెఱింగించుట. ◆●●—

మ. ‡చను వాక్శౌచము కర్మశౌచము పయఃశ్శౌచంబు నా శౌచముల్
గనుఁగో వానిని రేఁబవల్ విడక వేఁడ్క న్వార్చియు న్వేదమా
త నుపాసించుద్విజుండు పాపములపొంతం బోక పూతాత్ముఁ డై
కొను నత్యుత్తమలోకముల్ త్రిదశముఖ్యు ల్గొల్వ సౌఖ్యంబునన్. 181

సీ. †భూప్రతిగ్రహదోష•మును బాసి శుద్ధుఁ డై, యొప్పును వాఁ డగ్ని•హోత్ర యనంగ
నర్కుఁడు లుగ్రగ్ర•హము లైన సౌఖ్యంబు, లగు వానికి శుభంబు •లతిశయిల్లుఁ
జెనక నేరవు వానిఁ • జెనుగులు వానికి, యాజనాధ్యాపనా•ద్యఘము రాదు
దుర్వేదుఁ డైనను • దుష్టుఁ డైనను వాని,యందు మహత్వంబు•పొంది యుండుఁ
తే. జదివినను జదువక యున్న•జగతివాఁడు,విబుధుఁ డన నొప్పు నెవ్వాఁడు•విప్రునింటఁ
బాడమి యజ్ఞోపవీతంబు•మెడను దాల్చి, చెవిని గాయత్రి నొకమాఱు•చేర్చెనేని.

ఉ. §మేడలు మాడుగుల్ మిసిమి • మించినమిద్దెలు దద్దడంబులున్
వేడుక గూర్చుమేల్విపణి•వీధులు సాధుపురోపకంఠముల్
పీడని వైభవంబు గల•వీడును విప్రులు లేమి హీన మై
పా డగు వేదవిప్రుఁ డగు•పాడును బట్టణమట్లు భాసిలున్. 183

ఆ. ధర్మరక్ష సేయు•ధరణీధవునిఁ దపో,నిరతుఁ డైనవిప్ర•వరునిఁ గొలిచి
దురితదూరుఁ డగును • నరుఁడు తీర్థస్నాన,సాధుకీర్తనములు • చను నొనర్ప. 184

వ. చిత్తనైర్మల్యంబు లేనివానికిఁ ద్రిదండధారణంబును మౌనంబును జటాభరంబును ముండనంబును వల్కలాజినసంవేష్టనంబును వ్రతాచరణంబును దీర్ఘస్నానంబును

* పూయగంధము = పీనుఁగువాసన. ‡ వార్చు = ఆచమించు. వేదమాత = గాయత్రి.
† యాజనాధ్యాపనాద్యఘము = ధనము గొని యజ్ఞము చేయించుట వేదము చెప్పుట వలన నైనదోషము. దుర్వేదుఁడు = వేదబాహ్యుఁడు. § మాడుగు = హర్మ్యము. దద్దడంబు = బోడిమిద్దె లేక చిన్నగుడి. పాడు = పల్లియ. వీడు = పత్తనము.



నగ్నిహోత్రంబును వనవాసంబును శరీరపరిశోషణంబును వ్యర్థంబులు చక్షురాదీంద్రియశుద్ధియు మనశ్శుద్ధియు దుష్కరంబులు గాని వ్రతాదులు దుష్కరంబులు కావు వినుము. 185

చ. మనమున వాక్కునం గ్రియల • మాన్యుల కేరికి నగ్గు సేయ కె
ప్డును దురితంబులం దలఁపఁ•బోవక భూతదయ న్మెలంగుచున్
దనగృహమంద యుండియును • దాపసి నాఁబడు విప్రవర్యుఁ డా
యనఁ దఱియంగ రా వెఱచు • నాధియు వ్యాధియుఁ బాపతాపముల్. 186

సీ. జ్ఞానశుద్ధుఁడు గాని•జనునిఁ గాల్చినయేని, నలకంతయును శుద్ధి • గలుగఁబోదు
జ్ఞానికి సంసార•సంగశోకాదులు, కల నైన లే వని • పలుక నొప్పుఁ
దత్త్వం బెఱింగి మి•థ్యాబుద్ధి జగము నీ,క్షించు టే మోక్ష మా • జీవులకును
సతతంబు సంశయా•త్ముండు నాస్తికుండై, నమ్మని,కష్టున కుభయలో•కములు సెడును
తే. వేద మెఱిఁగినపురుషుఁ డి•ద్విధ మెఱుంగు
ఖలుఁడు వహ్నికిఁ బలె వేద•ములకు వెఱచు
వేదతత్త్వం బెఱింగిన•విప్రుఁ డాత్మ
తత్త్వము నెఱుంగఁ బని లేదు • ధారుణీశ. 187

వ. నీవు శుష్కతర్కంబులం బరిత్యజించి శ్రుతిస్మృతులు ప్రమాణంబులుగ నంగీకరించి ప్రవర్తింపుము దానం జేసి కర్మఫలంబును బ్రభావంబు నగ్గలం బగుఁ జిత్తశుద్ధి ప్రధానంబు గావునఁ జిత్తశుద్ధిం జేసినకర్మములు ఫలప్రదంబు లగుఁ దపంబున స్వర్గగమనంబును దానంబున భోగంబును దీర్ఘస్నానంబున నక్షయంబును జ్ఞానంబున మోక్షంబును సిద్ధించు ననిన విని రాజచంద్రుండు మునిచంద్రుం జూచి వయోవృద్ధుండవు జ్ఞానవృద్ధుండవు నగునీవు సర్వజ్ఞుండవు నీ వెఱుంగరాని దింతయును లేదు దేవదానవయక్షరాక్షసరాజర్షివంశంబులు నీకుఁ గరతలామలకంబు లిక్ష్వాకువంశసంభవుం డయినకువలాశ్వుండు ధుంధుమారుం డెట్లయ్యె వినవలతుం జెప్పు మనిన నతం డతని కి ట్లనియె. 188

—●●◆ కువలాశ్వునిచరిత్రము. ◆●●—

చ. ఒకమరుభూమి యందుఁ గల • దొప్పగునాశ్రమ మం దుదంకుఁ డన్
బ్రకటితనామధేయుఁడు చి•రవ్రతుఁ డుత్కమహర్షి మున్ను నై
ష్ఠికుఁ డయి దేవదేవుఁ డగు•శ్రీహరిఁ గూర్చి తపించెఁ బెక్కు లేం
డ్లకలుషభక్తితత్పరత • నంతయునుం దను నిచ్చ మెచ్చఁగన్. 189

క. అతనితపంబున కెంతయు, మతి మెచ్చి జనార్దనుండు • మమత దలిర్పం
గత మెఱిఁగి పొలుచుచుం యతిపతి యాతని కెఱిఁగి యిట్లు • ప్రస్తుతి చేసెన్.

శా. ఈవే లోకములన్ సృజించితివి నీ • వే లోకజాలంబులన్
గావం బ్రోవఁగఁ గర్త వైతి ప్రమథులం • గావించి నాభీసరో
జావిర్భూతునకు న్విధాత కిడి లో • కారాధ్యుఁ డై యుంటి వో
దేవా! నీవె విరాట్స్వరూపుఁడవు నీ • దేహంబె లోకం బగున్. 191

సీ. †నీయుత్తమాంగము • నింగి నీకనుదోయి, రేవెలుంగును మఱి • వేవెలుంగు
గాలి నీనిట్టూర్పు • కీలి నీతేజంబు, నీరాకరం బెన్న • నీదుకుక్షి
నీబాహువులు దెసల్ • నీయూరువులు గిరుల్, నీపాదములు ధర • ణీతలంబు
నీదురోమంబులు • నిఖిలౌషధులు నీదు, మే నీప్రపంచం బ • మేయమూర్తి

తే. నిన్ను నింద్రాగ్నివరుణాది • నిర్జరేంద్రు, లెపుడును స్తుతించి సేవింతు • రీసమస్త
భూతములు నీవలనఁ బుట్టు • వీతరాగు, లై ఋషీంద్రులు నినుఁ గొల్తు • రాత్మలందు.

చ. అలరితి వేని లోకము లి • వన్నియు స్వస్థము లై తలిర్చు నీ
వలిగితివే నొకింతన మ • హాభయ మెల్లచరాచరాళికిన్
గలిగెడు శిష్టులన్ మనుపఁ • గష్టులఁ ద్రుంపఁ ద్రివిక్రముండ వై
పొలిచితి మూఁడుపాదముల • మూఁడుజగంబుల నాక్రమించుచున్. 193

తే. వివిధజంతువుల సృజించి • పెంచి త్రుంచి, లోకముల నుద్ధరింతు వో • లోకనాథ
నీకుఁ గా కింతయును లేదు • నీవె హరుఁడ, వీవె బ్రహ్మవు విష్ణుఁడ • వీవె తలఁప.

వ. అని ప్రార్థించినఁ బ్రసన్నుం డై పుండరీకాక్షుండు వాత్సల్యంబున వరంబు వేఁడు మనుటయు నుదంకుండు దేవా! నీవు ప్రసన్నుండ వై నాకు దర్శనం బిచ్చి తింత కన్న వరం బొం డేమి గావలయు నైన నాచిత్తం బెప్పుడు దయాసత్యశౌచధర్మ దమంబులం దగిలి నీయందు భక్తిభరితం బై యుండ ననుగ్రహింపు మనిన నతం డట్ల యగుం గాని వినుము ధుంధుం డనుదానవుండు పుట్టి ఘోరతపంబు చేసి లోకంబుల కుత్పాతం బొదవించు నట్టిచో బృహదశ్వసూనుం డైన కువలాశ్వుం డనువాఁడు భవన్నియోగంబునం జేసి మామకం బైనయోగబలంబు గలిగి వాని నుక్కడంచి ధుంధుమారుం డనఁ బ్రఖ్యాతిం గాంచు దీన నీవు కీర్తిమంతుండ వగుదు వని చెప్పి యతం డంతర్హితుం డయ్యె ననంతరంబ. 195

† ఉత్తమాంగము = శిరస్సు. రేవెలుంగు = చంద్రుఁడు. వేవెలుంగు = సూర్యుఁడు. కీలి = అగ్ని.



సీ. ఇక్ష్వాకుతనయుఁ డై • యెసఁగె శశాదుండు, తత్పుత్త్రుఁడు కకుత్స్థ • ధరణినాథుఁ
డతని కనేనసుం • డాత్మజుం డతనికిఁ, బృథుఁడు వానిసుతుండు • విష్వగశ్వుఁ
డాతని కుదయించె • నద్రి వానికి యువ, నాశ్వుఁ డాతనికి శా • వస్తుఁ డుదయ
మందెను వానికి • నాత్మజుఁ డయ్యె • శావస్తి వానికి, బృహదశ్వుఁ డుదయించి • పెంపు గాంచె

తే. నతనికొమరుండు కువలాశ్వుఁ • డతని కేక, వింశతిసహస్రపుత్రులు • వెలసి సర్వ
విద్యలను నేర్చి భుజబల • విక్రమమునఁ, బేరు గాంచిరి తమతొంటి • వారి మించి.

వ. అంత బృహదశ్వుండు తనకొడుకు కువలాశ్వునకు రాజ్యపట్టంబుఁ గట్టి తాను దపోవనంబునకుం బ్రస్థితుం డయ్యె నని విని యుదంకుం డయోధ్యాపురంబున కరుదెంచి బృహదశ్వుం గాంచి. 197

చ. వనముల కేల పోయెదవు • వానవసన్నుత పూజ్యరాజ్యపా
లన మిది వీడి తేఁడులకు • లాఁతివిధంబునఁ బుణ్య మొందుకం
టెను బ్రజ నేలుచుంటయ క • డింది ఫలం బని పెద్ద లండ్రు మే
మొనరుచునీతపంబుఫల • మొందఁగ నీకును జాలు లేదొకో. 198

వ. ‡వినుము మదీయాశ్రమంబు చెంగట సముద్రతీరంబున బహుయోజనవిస్తీర్ణం బై వాలుకాపూర్ణం బై యుజ్జాలకం బనుమరుప్రదేశంబు గల దందు మధుకైటభ నందనుండు ధుంధుం డనుదారుణకర్ముండు త్రిజగజ్జనవినాశనార్థ మంతర్భూమిగతుం డై శయనించి ఘోరతపం బొనరించుచున్నవాఁడు వాఁడు పితామహవరప్రసాదంబున దేవదానవాదిదుర్జయుం డై గండుమిగిలి యున్నవాఁడు వాలుకాంతర్హితుం డగువానినిట్టూర్పు హాయనంబునకొక్కపరి యావిర్భవించి సరయంబును సరజంబును సధూమంబును సస్ఫులింగంబును సజ్వాలంబు నై దారుణక్రమంబున నాదిత్యపథం బాక్రమించు నద్దాన నేడుదినంబులు కులపర్వతంబు లెల్ల నుఱ్ఱూఁత లూఁగ నుర్వీతలం బెల్లఁ దల్లడిల్లుచుండు దానం జేసి మేము మాయాశ్రమంబున నుండఁ జాలకున్నవారము గావున సమర్థుండ వైన నీ వాదేవవైరిం దెగటార్చి మాకును లోకంబులకును స్వాస్థ్యంబు గల్పించి తపోవనంబునకుం బొ మ్మని మఱియును. 199

క. ఏవాఁడు వానిఁ జంపఁగ, భూవలయమునందుఁ గలఁడొ • భూయిష్ఠయశుం
డై వెలయువానియందున్, శ్రీవైష్ణవతేజ మెల్లఁ • జెచ్చెర వచ్చున్. 200

వ. ఇట్లు శ్రీమహావిష్ణుని శాసనంబున నీవు వైష్ణవతేజస్సంపన్నుండ వై ధుంధునిం జంపఁ గడంగు మనినం గృతాంజలి యై బృహదశ్వుం డతని కిట్లనియె. 201

‡ వాలుక = ఇసుక. హాయనము = సంవత్సరము.

తే. ‡న్యస్తశస్త్రాస్త్రుఁడ నయి నేఁ ♦ నైహికసుఖ, మెల్ల విడనాడి వని కేఁగు ♦ నుల్లమున మె
లంగుచుంటి న న్నాఁగకు ♦ మింగితజ్ఞ, నా కనుజ్ఞ యి మ్మివె నాదు ♦ నతులఁ గొమ్ము.

వ. ఏకవింశతిసహస్రసంఖ్యాకపుత్త్రపరివృతుం డయిననాపుత్త్రుం డిక్కార్యంబు దీర్ప సమర్థుం డని కువలాశ్వుం బిలిచి ధుంధుం జంప నియోగించి తాను దపోవనంబునకుం జనియె ననిన యుధిష్ఠిరుండు మునికుంజరుం జూచి ధుంధుండు మధుకైటభపుత్త్రుం డని విన నయ్యె నామధుకైటభు లెట్టివారు వారివృత్తాంతం బెఱింగింపు మనిన నతం డి ట్లనియె. 203

మధుకైటభులవృత్తాంతము.

చ. ప్రళయమునం బ్రపంచములు ♦ పాడఱిపోయినవేళ నెల్లెడన్
జలమయ మైనవేళ హరి ♦ సాగరమధ్యమునం దనంత మై
వెలసినభోగిభోగమున ♦ వేడ్క మెయిం బవళించి యోగముం
గలుగఁగ నిద్రవోయె నొక ♦ కాలమునాఁటికి లేవనట్లుగన్. 204

ఆ. అట్లు యోగనిద్ర ♦ ననుభవించెడుజగ, న్నాథునాభినుండి ♦ నళిన మొండు
మొలచె సూర్యతేజ ♦ మున వెలుంగుచు నందు, నలువ జనన మొంది ♦ మెలఁగుచుండె.

వ. అయ్యవసరంబున. 206

చ. మధుఁ డని కైటభుం డని స ♦ మాఖ్యల నందినవార లయ్యపాం
నిధిఁ గలయంగఁ గ్రుమ్మరుచు ♦ నెమ్మి మెయిం జనుదెంచి భోగి పై
నధికవిభావిభాసి యగు ♦ నాహరిఁ గన్గొని విస్మితాత్మ లై
రధరితసూర్యతేజ మగు ♦ నాతనితేజము పిక్కటిల్లఁగన్. 207

ఉ. అంతట వార లాహరిమ ♦ హాద్భుతనాభిసరోజమధ్యమం
దెంతయు సంతసించుచు న ♦ హీనగతిన్ వెలుఁగొందుభారతీ
కాంతునిఁ గాంచి కోపమునఁ ♦ గ్రౌర్యముఁ జూపుడు దద్దఱిల్లి లో
శాంతి చెడం బితామహుఁడు ♦ చాఁగి కదల్చెను బద్మనాభమున్. 208

వ. దాన మేల్కాంచి కాంచనచేలుం డెదుర నున్నమధుకైటభులం జూచి స్వాగతంబు వలికి. 209

ఉ. మీరు మహాబలాఢ్యులరు ♦ మీపయిఁ బ్రీతి జనించె నా కెదన్
గోరుకొనుం డొసంగెదను ♦ గోరిక దీర వరంబు నావుడున్
వారలు నవ్వి దర్పమున ♦ వారిజనాభునిఁ జూచి నీవా కో
కోరిక దీర నిచ్చెదవు ♦ కోటులు మేటులు వచ్చె బాపురే. 210

‡ న్యస్తశస్త్రాస్త్రుఁడు = విడిచినశస్త్రాస్త్రములు గలవాఁడు.



తే. చాలు మా కిచ్చునీబాస ♦ పోలునయ్య, దాతలము మేము వలయునే ♦ నీతఱి మముఁ
గోరుకొ మ్మభీష్టమ్ముల ♦ వార కిత్తు, మనుచు నా నని మెచ్చి యి ♦ ట్లనియె నతఁడు.

చ. పురుషవరేణ్యులార! మిముఁ ♦ బోలినపూరుషుఁ డొండొకండు లేఁ
డరయఁగ మీరు దాతలు మ ♦ హాబలవంతులు సత్యసంధులున్
వర మొకఁ డేను వేఁడెదను ♦ వాంఛితముల్ ఫలియింపఁ జేయుఁడీ
నిరతము మీయశోగరిమ ♦ నిల్చు జగత్త్రయమందుఁ బొందుగన్. 212

క. నావుడు మధుకైటభు లా, నా వేఁడుము వరము లిత్తు ♦ మన ముదమున న
ద్దేవుఁ డను లోకహితమున, కై వేఁడెద మీరు ద్రెళ్లఁ ♦ గా వలె నా చేన్. 213

వ. అనిన మధుకైటభు లి ట్లనిరి. 214

మ. కల నైనన్ నవుటాల నైన నొకన ♦ ల్కం తే మృషావాక్యముం
బలుకంబో మెపుడున్ వసించెదము ధ ♦ ర్మంబందు ధైర్యంబునన్
బలశౌర్యంబుల రూపసంపదల నె ♦ వ్వాఁడున్ మముం బోలఁ డె
వ్వలనం గాలము దాఁటగాని దగుటన్ ♦ వమ్మయ్యెఁ జు మ్మింతయున్. 215

మ. అగుఁ గా కాడినమాట తప్ప మగుటం ♦ బ్రాణంబు లర్పించి పో
వఁగ నున్నారము కాని యొంపోకఁడు నీ ♦ వాంఛింతు మీదేహముల్
దెగనేయం దగు నిర్జలం బగులస ♦ ద్దేశంబునన్ మేము నీ
దగుపుత్త్రత్వము నొందఁగాఁ దగు నవన్ ♦ హర్షప్రకర్షంబునన్. 216

వ. సంకర్షణుండు నట్ల యగుం గావుత మని. 217

పంచచామరము. †జలావృతంబు గానిచోటు ♦ సంభవింపమిన్ మహో
జ్జ్వలంబు లై వెడంద లై జ ♦ వ న్నిజోరువుల్ దగన్
వెలుంగుచుంటఁ జూచి వారిఁ ♦ బెట్టి వానిపైఁ బసం
జెలంగుచక్రధారఁ ద్రుంచె ♦ శీర్షముల్ రయమ్మునన్. 218

వ. ధుంధుం డామధుకైటభాసురుల కాత్మజుం డాతం డట్లు తండ్రులచావు విని వారిం జంపినవానిం జంప నెంచి మించినక్రౌర్యంబున ధైర్యంబున నేకపాదస్థితుం డై ఘోరతపంబు గావించి దేవదానవయక్షరాక్షసగరుడగంధర్వాదులవలనఁ దనకుఁ జావు లేకుండ నప్పరమేష్ఠివలన వరంబు వడసి యఖర్వగర్వదుర్విదగ్ధుం డై హరిహరపురందరాదులం దొట్టి భువనత్రయంబు బెట్టుగ బాధించుచుండె నని మార్కండేయుండు మధుకైటభులవృత్తాంతం బిట్లు సెప్పి మఱియు ని ట్లనియె. 219

† జవ = బలిమి.

కువలాశ్వుఁడు ధుంధుం బరిమార్చి ధుంధుమారుం డగుట.

సీ. అట్లు చేసినపితృ♦నాదేశమునఁ గువలాశ్వుం డుదంకవి♦ప్రాన్వితుం డయి
యిరువదియొక్క వే♦గురుపుత్రులును బరివేష్టింపఁ బ్రస్థాన♦శీలి వైచి
బలములు గొలువంగ ♦ బలసి కదలె నప్డు, చనుదెంచి విష్ణుతే♦జంబు పొందెఁ
దేజోంచితుం డయి ♦ రాజేంద్రుఁ డలరార, దివి దేవదుందుభుల్ ♦దివిరి మొరసెఁ
తే. బుష్పవర్షము గురిసె నీ♦భూతలమున, శీతవాతము ప్రసరించెఁ ♦ జెన్ను మీఱి
దెసలువిశదంబులై తోఁచెఁ♦దేజమెసఁగ, సురవిమానములొప్పెఁ గ్రి♦క్కిఱిసి చదల.
వ. అంత. 221
మ. కువలాశ్వుండు కుమారవారయుతుఁడై ♦ గోవిందునిం బోలి మే
లవుతేజంబున నొప్పి ధుంధుదనుజేం♦ద్రావాసముం జేరి యు
ర్ణవముం ద్రవ్వఁగఁ బుచ్చెఁ బుత్రకుల వా♦రల్ తత్ప్రదేశంబునన్
దవులం ద్రవ్విరి సప్తవారములు నా♦నా శాతశూలాదులన్ 222
ఆ. అట్లు త్రవ్వ వాలు♦కాంతర్హితుం డయి, సుప్తుఁ డయినధుంధుఁ ♦ జూచి సూర్యుఁ
డనఁగ వెలుఁగువాని♦ఘనదేహమున కెద, నబ్రపడుచు వార ♦ లత్తిరయమున. 223
వ. వానిం బరివేష్టించి పరశుపట్టసముసలముద్గరగదాసిఖడ్గపరిఘప్రాసకుంతతోమరభిండివాలశూలాదులం బ్రహరించుటయు ధుంధుం డావులించుచు లేచి చూచి క్రుద్ధుండై.
మ. తనపైఁ బాఱెడునస్త్రశస్త్రముల నా♦దైత్యేంద్రుఁ డొక్కుమ్మడిన్
దిని సంవర్తసదృశ మైనవిపులా♦గ్నిం గ్రక్కి నిట్టూర్చుచున్
జననాథాగ్రిమపుత్రు లెల్లరును దా♦నం ద్రెళ్లి భస్మాకృతిన్
గొని రక్కాపిలకోపవహ్ని సగర♦క్షోణీశపుత్రుల్ బలెన్. 225
వ. అంత నాధుంధుండును. 226
ఉ. మాఱటకుంభకర్ణుఁ డన ♦ మంటుచు లేచి మహీశుమీఁదికిన్
గాఱియవెట్ట వచ్చుటయుఁ ♦ గన్గొని కన్గవ నిప్పు లొల్కఁగాఁ
గోఱడ మోడి భూవిభుఁడు ♦ కోపము పెంపునఁ దన్మహానలం
బాఱఁగఁ జేసి యోగమహి♦మాతిశయంబున నొక్కప్రేల్మిడిన్. 227
తే. కడఁగి బ్రహ్మాస్త్ర మడరించి ♦ వడిగ ధుంధుఁ, జేరి నీఱుగఁ జేసి త♦ద్ఘోరవహ్ని
నఖిలలోకభయంబు చ♦ల్లార్చి ధుంధుమారుఁ డనుపేరఁ బరఁగె నా♦భూరమణుఁడు.
వ. ధుంధుండు పడినప్పు డింద్రాదిబృందారకులును మహర్షిబృందంబులును బ్రసన్నులై వచ్చి రాజేంద్రునకు దర్శనం బిచ్చి వరంబు లిచ్చెదము వేడుకొమ్మనిన నతండు



ప్రాంజలి యై నాకు బ్రాహ్మణభక్తియు దానధర్మాసక్తియు శత్రుదుర్జయత్వంబును విష్ణుసఖ్యంబును సర్వభూతహితంబును స్వర్లోకవాసంబునుం గలుగ ననుగ్రహింపుఁ డనిన వా రట్ల యగుం గావుత మని యాశీర్వదించి నిజనివాసంబులకుం జని రంత నసంతాకాంతుండు నుదంకాదుల నామంత్రణంబు చేసి హతశేషు లగుదృఢాశ్వకపిలాశ్వచంద్రాశ్వు లనుమువ్వురుకొడుకులం గూడి వేడుక లొడిక లెత్త నిజపురంబునకుం జనియె నిది ధుంధుమారోపాఖ్యానం బని మఱియును. 229
ఉ. మానుగ విష్ణువైభవస♦మంచిత మై నుతి గాంచునియ్యుపా
ఖ్యానము విన్నవారలకు ♦ నాయువు శ్రీయుఁ బ్రజాసమృద్ధియున్
గానఁగ వచ్చు నాధులును ♦ గల్గవు వ్యాధు లడంగు లోకస
న్మానితవైభవంబును గ్ర♦మంబునఁ బొందఁగఁ గల్గు నుర్వరన్. 230
వ. అనినం బాండవేయుండు ధర్మాఖ్యాపకుం డయినమార్కండేయుం జూచి. 231

మార్కండేయుండు ధర్మాఖ్యానంబు సేయుట.

సీ. *ప్రత్యక్షదేవతల్ ♦ భాస్కరుం డిందుండు, గాలియుఁ గీలియు ♦ గహ్వరియును
దలిదండ్రులును గురు♦వులు నీల్వు గలసతుల్, మాననీయులు గదా ♦ మానవులకు
స్వాంతంబుతో నింద్రి♦యగ్రామ మరికట్టి, పతిని దైవతముగా ♦ మతిఁ దలంచి
త్రికరణశుద్ధిమైఁ ♦ దేజరిల్లుచు భర్త, కత్తమామలకును ♦ నతిథులకును
తే. సేవ సేయుచు సతతంబు ♦ శ్రేయ మంద, నిలిచి పరమోత్తమాచార♦ముల నెసంగి
సాధ్వు లని పేరు వడసిన♦చాన లరుదు, వారిచరితంబు లాలింపఁ ♦ గోరియుంటి. 232
క. సుతుల కజస్రము మాతా, పితృశుశ్రూషయును వేద♦విహితక్రియలున్
సతులకుఁ బతిశుశ్రూషయు, నతిథిసమర్చనము సేయ ♦ నగు నండ్రు బుధుల్. 233
తే. మఱియుఁ దలిదండ్రులందు నీ♦మహితలమున, నధికు లేరు? సుతుఁడు వారి♦యందు నెట్టి
భక్తి మెలఁగంగ నగు హీన♦వర్ణజులకు, నెట్టిధర్మ మనుష్ఠేయ ♦ మెఱుఁగఁ జెపుమ.
వ. అని యడిగిన మార్కండేయుం డి ట్లనియె. 235
తే. ఉదరమున మోసి కని పెంచు♦నదియ కానఁ, దల్లి పెద్ద యటండ్రు కొం♦డఱు తపంబు
దేవపూజలు చేసి పొం♦దియును వాని, వృద్ధి నెంచుఁ గావునఁ దండ్రి ♦ పెద్ద యండ్రు.
చ. తనయునిఁ గాంచి తల్లియును ♦ దండ్రియు నీనిసుఁ గెవ్వఁ డేనియున్
ఘనుఁ డయి విద్యలం గఱచి ♦ గాథయశంబునఁ దేజరిల్లుచున్
జనసుతుఁ డై ప్రియం బడసి ♦ సౌఖ్యమునం దులఁదూఁగుచుండఁ గ
న్గొనియెడుభాగ్య మబ్బెడునొ♦కో యని చూచుచునుందు రాశమై. 237

* నీల్వు = పాతివ్రత్యము.

క. వారల యాశల్ సఫలముఁ, గా రహిఁ గావించువాఁడె ♦ తజ్జాతలమందున్
జేరంది కొడుకు నాఁగన్, భూరియశం బొంది పుణ్యు ♦ మునఁ బోవుఁ దుదన్. 238

తే. భర్తృశుశ్రూష చేసెడు ♦ పద్మముఖికి, దీర్ఘయాత్రాదికంబులు ♦ దేవపూజ
లధ్వరంబులు చేసిన ♦ యట్టివారు, నైనఁ దుల్యులు గారని చెప్పు ♦ నాగమములు.

వ. ఇవి యన్నియుం దేటపడ నొక్క యితిహాసంబు గలదు చెప్పెద విను మని మార్కండేయుండు వెండియు. 240

మార్కండేయుండు ధర్మజునకుఁ బతివ్రతామాహాత్మ్యము సెప్పుట.

చ.*కలఁడు మహీసురుం డొకఁడు ♦ కౌశికనాముఁ డతండు శీర్షముల్
గలిగియు నంగషట్కమునఁ ♦ గ్రాలెడువేదము లెల్ల నేర్చి శి
ష్టుల కగు నొక్క గ్రామమున ♦ సూరెలఁ గాఁపురముండు నెప్పుడున్
బాలుపుగ నున్న తాధ్యయన ♦ ముం బొనరించుచు నిష్ఠఁ బెంపునన్. 241

క. ఒకనాఁ డతఁ డాగ్రామము, నికటంబున నొక్క చెట్టు ♦ నీడ నొకండున్
సుకముగ నాసీనుం డై, వికసింపఁగ శ్రుతులు వల్లె ♦ వేయుచు నుండెన్. 242

వ. అప్పు డాచెట్టుపై నున్న కొక్కెర యొక్కం డాతనిపై రెట్ట వేయుటయు నతండు క్రుద్ధుం డై తల యెత్తి దానిం జఱచుఱం జూచె నంతలో నది విగతప్రాణం బై నేలం బడుటయుం దిలకించి కరుణాభిసంతప్తచిత్తుం డై. 243

మ. కినుకం జేసి యకార్యమున్ సలిపితిం ♦ గిం చేను నా కించుకే
మనమం దక్కటికంబు లేదు బకమున్ ♦ బ్రమందించితిన్ నాతపం
బును స్వాధ్యాయము రిత్తవోయె శమముం ♦ బూనంగ లేనైతి నిం
క నెనర్పం దగు నెద్ది పాపగతికిం ♦ గాకుండు టెట్లయ్యెయో. 244

వ.†అని బహుభంగులం బలవించుచు నతండు కుతపకాలం బగుడుఁ గాల్యకరణీయంబులం దీర్చి గ్రామంబున కరిగి విప్రగృహంబులందు భిక్షాటనం బొనరించుచు. 245

ఆ.‡ఒక్క విప్రగృహము ♦ చక్కి నిలిచి భిక్షఁ, బెట్టు మనుచు నడిగె ♦ నట్టియెడల
వత్తు నుండు మనుచు ♦ వనిత యొక్కతె భిక్ష, యిడఁగ భాజనంబు ♦ కడుగుచుండె.

వ. అయ్యవసరంబున. 247

* శీర్షముల్ = వేదశీర్షములు (ఉపనిషత్తులు); అంగషట్కము = శిక్ష వ్యాకరణము ఛందస్సు నిరుక్తము జ్యోతిషము కల్పము ననునాఱును.

† కుతపకాలము = దినముయొక్క యెనిమిదవభాగమం దయినకాలము.

‡ భాజనము = పాత్రి.



ఉ.*ఆహరిణాక్షి భర్త దవ ♦ మట్టిమహాతపమందు మెట్టుచున్
దేహము దూల దాహమునఁ ♦ దేలుచు నాఁకట సోలుచున్ వడిన్
గేహముఁ జేరవచ్చుటయు ♦ గేహళిఁ గన్గొని సంభ్రమించుచున్
గేహిని భిక్షుకున్ మఱచి ♦ కేవలభక్తి భజించె వల్లభున్. 248

సీ.‡వడి వడి నెదురేగి ♦ తోడితెచ్చి యొక్క చో, సుచితాసనంబున ♦ నుండఁ జేసి
విరిసి చెమ్మట లాఱ ♦ వీచి వీవనలతోఁ, గాళ్లును జేతులు ♦ నీళ్ళఁ గడిగి
చలువ లీనెడునీట ♦ జలక మార్చి ప్రియోక్తు, లాడుచుఁ దడి యొత్తి ♦ వేడుక మెయి
నాచమింపఁగఁ జేసి ♦ మోచాఫలరసమ్ము, ము న్నిడి కలమాన్న ♦ ముల నొసంగి

తే, భోజనానంతరంబునఁ ♦ బువ్వుఁబోఁడి, మృదులశయ్యాతలంబున ♦ హృదయదయితుఁ
బవ్వళింపఁగఁ జేసి క ♦ ప్రంపుఁదమల, మొసఁగి యెసక మెసఁగఁ గాళ్లు ♦ లొత్తుచుండె.

చ.†త్రికరణశుద్ధిగాఁ బతియె ♦ దేవత యంచుఁ దలంచుచు న్మహో
త్సుకత మెలంగుచున్ గరిమ ♦ తో నిలు దీర్చుచు నత్తమామలన్
బ్రకటితభక్తిఁ గొల్చుచుఁ బ ♦ రంగెడు నంగనఁ బోల రెవ్వ రా
సతియ పతిన్ భజించె నటు ♦ సర్వవిధంబుల సన్నుతింపఁగన్. 250

తే.¶పాదసంవాహనము సేయు ♦ పద్మగంధి, కంతలో భిక్ష కరుదెంచి ♦ నట్టిద్విజుఁడు
తలఁపునకు రాఁగ లజ్జించి ♦ తనదుచేఁత, కవుడు వడి వచ్చి భిక్షఁ గొం ♦ చతనికడకు.

కౌశికుం డనుబ్రాహ్మణుండు పతివ్రతం గర్హించి పలుకుట.

వ. కౌశికుండును గోపారుణితనయనయుగళుం డయి యప్పతివ్రతాజనమతల్లిం గాంచి కటకటం బడి యిట్లనియె. 252

చ.∥ఉవిద! యి టేల చేసితి ద్విజోత్తముఁడన్ గని పోవ కుండు మం
టివి తడ వయ్యె వచ్చినపుడే ననుఁ బొమ్మనఁ బోవ కుందు నే
భవనము లిందు శూన్యములె ♦ భైక్ష్యము పెట్టెడువారు లేరొకో
యువ! నను నిల్వఁబెట్టి తుర ♦ వా యిది నీమది నెంచి చూడవా. 253

వ. అనిన నమ్మహాపతివ్రతావతంసం బాబ్రాహ్మణోత్తముం గ్రోధసంతప్తచిత్తునిగా నెఱింగి సాంత్వనపూర్వంబుగా నిట్లనియె. 254

* దవము = కారుచిచ్చు; గేహళి = కడప.

‡ మోచాఫలరసము = అరటిపండ్లపానకము. కలమాన్నము = వరియన్నము.

† త్రికరణములు = మనోవాక్కాయములు. ¶ పాదసంవాహనము = కాళులొత్తుట.

∥ ఉరవు = ఔచిత్యము.

మ. *అపరాధం బగునేని నావలన లోనై కేడ్య మన్నించి నా
గృహకోడా నయిరించి మంచు మతిభక్తిన్ నిన్ను సేవింతు నా
తపమందుం బశి వాడి వత్తయయి నాదైవంబు ప్రాణేశ్వరుం
డివు డేతే నతనిన్ భజించుటకునై యే నిన్ దలంపం జుమీ. 255

చ. అనవుడు బ్రాహ్మణుం డెడఁద నాగ్రహ మెచ్చఁగ నిట్లు పల్కె నో
వనిత! మహీసురప్రు లగువారలు తక్కువయున్ మగండు నా
మొన లేడునాతఁ డెక్కువయునో తలపోయవు ధర్మసూక్ష్మతన్
మనమున బ్రాహ్మణోత్తముల మన్నన సేయవు నీకుఁ బోలునే. 256

ఉ. ఎల్లిద మైరి నీ కిటు మహీదివిజోత్తము లేమి సెప్ప వా
రెల్ల దవానలంబునకు నిత్తయి లోకము లెల్ల సేర్తు రో
పల్లవపాణి! యింద్రుఁడును వారికి మ్రొక్కుచునుండు నెప్ప డో
చెల్ల! మనుష్యులం దడవఁ జెల్లునె తెల్ల మెఱుంగ వింతయున్. 257

వ. అనిన నయ్యహంనులాశిరోభూషణం బాభూసురాగ్రణిం జూచి యిట్లనియె. 258

పతివ్రత కౌశికు వనుతయించి ధర్మోపదేశంబు సేయుట.

ఉ. క్రోధము సంహరింపు మిటు క్రుద్ధుఁడవై నను నేమి సేయు దో
క్రోధన నీదుచూపుమొనకుం గులికి గావుట కే బకంబనో
నాథునిఁ గొల్చున న్నిటు లనం దగ దెప్పుడు నేను విప్రులన్
బోధము గానమిం దెగడఁ బోవ నెఱుంగుదుఁ దన్మహత్వమున్. 259

మ. ఒకవిప్రుండు సముద్రమున్ సలిపె క్షారోదం బపేయంబుగా
నొకవిప్రుం డలదండకం బడవిగా నుండంగఁ గావించె వే
ఱొకవిప్రుం డుదరంబునం దఱిగిపో నూహించె వాతాపి దే
వకళాభూషణు లైనవిప్రులమహాత్వం బెన్న సామాన్యమే. 260

తే. నిగ్రహానుగ్రహసమర్థు లగ్రజన్ము, లరయఁ గ్రోధప్రసాదము లధికతరము
లగును వారికి వారిమాహాత్మ్య మెఱిఁగి, కొలుతు సతతంబు వేల్పులఁ గొలిచినట్లు.

వ. అని మఱియును. 262

చ. సతికిఁ బతిం భజించుటయె సన్నుతధర్మము గాన నేను నా
పతి నతిభక్తి దైవముగ భావన సేయుచు నన్యకార్యసం
గతులఁ బరిత్యజించి కుతుకంబునఁ గొల్చుచునుందుఁ దత్ఫల
స్థితి గలుగంగఁ గాదె మదిఁ దెల్ల మగున్ భువనత్రయార్థముల్. 263

* మంచుము = రక్షించుము.



వ. నీవు స్వాధ్యాయసంపన్నుండ వైనను మహాక్రోధనుండ వసియు నీకోపానలంబున కొంకకొక్కెరాలు మెర యయ్యె ననియు నే నెఱుంగుదును క్రోధంబు మనుష్యుని శరీరస్థం బయినమహాశత్రు వాకర్ణింపుము. 264

సీ. క్రోధమోహములను గొనఁబోక సత్యంబు, పట్టు వీడనివాఁడె బ్రాహ్మణుండు
గురుభక్తి గలిగి సద్గుణఖని యై ధర్మ,పరుఁ డై మెలఁగువాఁడె బ్రాహ్మణుండు
పరులు హింసించిన మరల హింసింపక, పరఁగుచుండెడివాఁడె బ్రాహ్మణుండు
నిర్జితేంద్రియుఁ డయి నిరతంబు స్వాధ్యాయ,పరత నొప్పెడివాఁడె బ్రాహ్మణుండు

తే. భూతదయ గల్గి షట్కర్మములను దగిలి, సర్వధర్మవిధిజ్ఞుఁ డై గర్వ ముడిగి
భువన మాత్మసమంబుగా బుద్ధి నెంచి, పండితోత్తముఁ డగువాఁడె బ్రాహ్మణుండు.

వ. మఱియు బ్రాహ్మణుం డయినవాఁడు యజనయాజనాదిషట్కర్మనిరతుం డై యత్రపమత్తుం డై శమదమాదులం దగిలి పరుసంబు లాడక దురితంబులం గూడక ధార్మికుం డై యుండునది వానికి సత్యార్జవేంద్రియనిగ్రహంబులు పరమధర్మంబు లని పెద్దలు చెప్పుదురు. 266

తే. ధర్మ మతిసూక్ష్మ మై యొప్పు దానితత్త్వ,మీ వెఱుంగుదు వనినాకు నెఱుకపడదు
ధర్మతత్త్వం బెఱుంగఁగఁ దలఁతువేని, కలఁడు వ్యాధుఁ డొకఁడు వానిఁ గడకుఁ బొమ్ము.

వ. వాఁడు జితేంద్రియుండును సత్యవాదియు నయి మాతాపితృశుశ్రూషం జేయుచు నివుడు మిథిలానగరంబునం గాఁపురంబున్నవాఁడు నీవు ధర్మవిదుం డగునావ్యాధుని పాలి కరిగిన నీ కతండు ధర్మోపదేశంబు సేయుం బొమ్ము స్త్రీస్వభావంబునం జేసి చేసిననాయధికప్రసంగంబునకు నన్యథా భావింపక నన్ను మన్నింపుము స్త్రీలు తప్పు చేసినం గాని మన్నింపవలయును కదా యని విన్నవించిన నయ్యన్నుమిన్న కౌశికుం డి ట్లనియె. 268

ఉ. ప్రీతుండ నైతి నీవలనఁ బెద్దనెగుల్ విడె నీదుపల్కులన్
జేతము నిష్కలంక మయి చెన్నలరారుచు నున్న దిన్నఁగాఁ
బూతచరిత్ర నీవు నినుఁ బోలరు పొల్తుక లెవ్వరేని నే
నీతిమెయిం బ్రవర్తిలుదు నీకు శుభం బగుఁ బోయివచ్చెదన్. 269

కౌశికుండు తత్త్వజ్ఞానార్థముగా ధర్మవ్యాధునొద్దకుఁ బోవుట.

వ. అని యతం డామె వీడ్కొని తనమనంబున నవ్వచనంబులం దలంచుకొని విస్మయం బందుచుఁ దన్నుఁ గృతాపరాధునిగ నెన్ని నిందించుకొనుచు ధర్మగ్రహణతత్పరుం

*డును శ్రద్ధధానుండు నయి ధర్మవ్యాధునియొద్దకుం బోవ నెంచి కృతప్రయాణుండై నానావిధనదీనదారణ్యగ్రామనగరజనపదంబు లతిక్రమించి జనకరాజపాలితం బగు మిథిలాపురంబునకుం జనియె నదియును. 270

సీ. ‡ధర్మ సేతుసమావృ♦తంబు జగద్వర్ధి, తామలయజ్ఞోత్స♦వాంచితంబు
గోపురాట్టాలక♦కుడ్యోన్నతంబును, ధవళహర్మ్యసమాస్ర♦దర్శితంబు
బహువిమానయుతంబు ♦ ఫలితరసాలాది,వననమంచితము వి♦భక్తపథము
గజవాజిరథయోధ♦కలితచతుష్పథ, మున్నతోన్నతసాల♦సన్నుతంబు
తే, హృష్టపుష్టజనాకీర్ణ ♦ మిష్టగంధ,బంధురలతాంతకాంతంబు ♦ పండితజన
మండితము నిత్యకళ్యాణ♦మహిత మొప్పు, భూపతిసురక్షితము మిథి♦లాపురమ్ము.

వ. †అట్టిమహోన్నతశోభాసనాథం బయినమిథిలానగరంబు సొచ్చి ధర్మవ్యాధుఁ డెచ్చట నుండు నని పౌరుల నడిగి వానియున్నచో టెఱింగి సూనాపణమధ్యంబున మార్గమాహిషమాంసంబుల విక్రయించువానిం గాంచి విక్రేతృజనాకులం బై జుగుప్సితం బైనయటఁ జన నొల్ల కెడగలుగ నొక్కచో నిలిచె నంత ధర్మవ్యాధుండును వానిరాక యెఱింగి సంభ్రమించుచు లేచి వానియున్నచోటికిం బోయి చేదోయి జోడించి వినయవినమితోత్తమాంగుం డై యి ట్లనియె. 272

ఉ. మ్రొక్కెద నీకు స్వాగతము ♦ భూసురసత్తమ నేను వ్యాధుఁడన్
నిక్కపుభక్తిఁ గొల్చెదను ♦ నీ వలసాధ్వి వచింప వచ్చి తీ
చక్కికి నా కెఱుంగ నగు ♦ సర్వము నీదుమనోరథంబు ర
మ్మిక్కడ నుండ నేమిటికి ♦ నింటికిఁ బోవుద మిష్టమేనియున్. 273

వ. విప్రుండును వానివాక్యంబులు విని విస్మితుం డై యిది రెండవయాశ్చర్యం బనుకొనుచు వానివెంబడిఁ దదీయగృహమ్మునకుం జని పూజితుం డై యర్ఘ్యపాద్యాచమనీయంబులం బరిగ్రహించి సుఖోపవిష్టుం డై ధర్మవ్యాధుం జూచి యి ట్లనియె. 274

ఆ. అకట ధర్మబుద్ధి ♦ వగునీకు నీఘోర,కర్మ మొప్పి యున్న ♦ కనిననాకుఁ
దత్తఱంబు వొడమెఁ ♦ జిత్తంబునన్ జీవ,హింస పోల దనుచు ♦ నెంచ నయ్యె. 275

చ. అనవుడు వ్యాధుఁ డి ట్లనియె ♦ నయ్య కులోచితధర్మమందుఁ బెం
పొనరెడునాపయిన్ గినియ ♦ నొప్పదు తాతయుఁ దండ్రి యెత్తఱం

* శ్రద్ధధానుఁడు = శ్రద్ధగలవాఁడు. ‡ ఇష్టగంధము = సుగంధము, లతాంతము = పుష్పము.
† సూనాపణము = వధస్థానము. మార్గము = మృగసంబంధము. విక్రేత = అమ్మువాఁడు.
జుగుప్సితము = రోఁతగాఁ జేయఁబడినది.



గునఁ జని రేను నత్తెఱఁగుఁ ♦ గోరి పొనర్చుచు నుంటి నిట్లు గా
జనులకు నెల్లకర్మములు ♦ సాగ విధించె విధాత తొల్లిటన్. 276

సీ. జపమును దపమును ♦ స్వాధ్యాయమును వేల్మి, బ్రహ్మచర్యంబును ♦ బ్రాహ్మణులకు
దండనీతియు ధరా♦మండలవిలసత్ప్ర,జాపాలనంబును ♦ క్షత్రియులకుఁ
గృషియు గోరక్షయు ♦ నెసఁగువాణిజ్యంబు, వర్ణవివేకంబు ♦ వైశ్యులకును
ద్విజసేవయును బుణ్య♦వృత్తశ్రుతియు సాధు,శుశ్రూషయును భక్తి ♦ శూద్రులకును
తే, స్వీయధర్మము లైనట్లు ♦ క్షితితలమున, మాంసవిక్రయణం బిది ♦ మాకు ధర్మ
మయ్యెఁగలవృత్తి మీఱిన♦యట్టివాఁడు, చెడునిహమునందుఁ బరమందుఁ♦ జెన్ను దఱిఁగి.

చ. *జనులకు స్వస్వవృత్తులు పొ♦సంగ మహీతల మేలువాఁడె రా
జనఁ బడు నందు లోప మగు♦నట్టిది యైన నృపుండు దోషి యా
జనకుఁడు మాకు రా జతఁడు ♦ శాస్తి యొనర్చెడు వృత్తి మీఱినన్
దనయునినే ననుగ్రహము♦సం గనఁ డించుక తప్పు చేసినన్. 278

క. వర్ణాశ్రమధర్మంబుల, నిర్ణయమున నిలిచి యిచట ♦ నిఖిలప్రజలున్
బూర్ణానందసుఖంబున, వర్ణితు లగుచుండ్రు జనక♦పాలితు లగుచున్. 279

సీ. ఇది యిట్టి దగుఁ గాన ♦ నేను నాకులధర్మ,మును వీడ నోడుదు ♦ మనమునందు
జీవహింస పొనర్పఁ♦బోవ నొరులు చంపి, తెచ్చినమాంసమే ♦ నిచ్చలు నిట
నమ్ముచుందును మాంస ♦ మెమ్మెయి భుజియింప, సత్యంబ పలికెద ♦ సంతతంబు
పరులకల్మి కసూయ♦పడను శక్తికొలంది, నొరుల కిచ్చెదఁ దాల్మి ♦ నొంది యుందు
తే, వృద్ధు లగుతల్లిదండ్రుల ♦ ద్విజులఁ గొల్తు, దేవతాతిథిపూజలు ♦ దినదినంబుఁ
జేయుదును దృష్ణ నామదిఁ ♦ జేరనీయ, సతత ముపవాసనియమంబు ♦ సలుపుచుందు.

చ. పరవనితాప్రసంగ మొక♦పట్టుననేఁ బొనరింప నొల్ల నా
గరితను గూడిమాడి ఋతు♦కాలములంద రతిప్రసంగతిన్
బరఁగెద నన్ను మెచ్చుకొను♦వారలయందును దిట్టువారియం
దరయఁగ నొక్కచక్కి మన ♦ మయ్యెడు వింటివె విప్రపుంగవా. 281

వ. ఇ ట్లుండుటం జేసి నేను ధర్మవ్యాధుండ నాఁ బరఁగితి నింతవట్టు ప్రసంగవశంబునం జెప్ప వలసి వచ్చె నది యట్లుండ నిమ్ము నీవు నాకడ ధర్మంబు లెఱుంగ వచ్చినాఁడవు గావునఁ జెప్పెద దత్తావధానుండ వై విను మని మఱియును. 282

* శాస్తి = శిక్ష.

ధర్మవ్యాధుండు కౌశికునకు ధర్మములు బోధించుట.

చ. తనకులధర్మముల్ విడక ♦ త్యాగము భోగము గల్గి నెమ్మనం
బు నెవుడు లోభమోహములఁ ♦ బొంతను బోవఁగ నీక ధార్మికుం
డనఁబడి తృష్ణతోడ విష ♦ యంబులవాంఛను వీడి పహ్నులన్
దనిపెడువాఁడు సజ్జనుఁడు ♦ నా నుడి కెక్కుఁడు నిందు నందునన్. 283

సీ. *తితిక్ష బోలినతితిక్ష ♦ చిత్తంబున న్నిల్పి, ధర్మనిత్యత గల్గి ♦ తనరువాఁడు
నఖిలభూతముల యం ♦ థాస్థపూజలఁ దన్పి, నిరతాన్నదాతయై ♦ నెగడువాఁడు
విడిచి మృషావాద ♦ విధము నెప్పుడు ప్రియ,వచనంబు నేయుచు ♦ వఱలువాఁడు
ప్రియ మైన హర్ష మం ♦ ప్రియ మైన దుఃఖంబు, మదిఁ బొదలఁగ నీక ♦ మసలువాఁడు
తే, కామమునఁ గాని సంరంభ ♦ గతిని గాని, మోహమునఁ గాని విద్వేష ♦ బుద్ధిఁ గాని
మఱియు నెందునేఁ గాని ధ ♦ ర్మంబువిడక, కడఁకఁజనువాఁడుపరమోత్త ♦ ముఁడుదలంప.

క. కృత మెఱిఁగి సేయ నొ నుప,కృతి యపకారులకును నప ♦ కృతి సేయఁగ రా
దితరులకుఁ గీడు సేయఁగ, మతి నెంచినవాఁడు తాన ♦ మడియుఁ జెడి వడిన్. 285

క. ధర్మము విడ కొనరుపఁ దగుఁ, గర్మ మ్మద్దాన మేలు ♦ గలుగక యున్నన్
ధర్మవిరుద్ధము లగుదు,ష్కర్మము లొనరింప రాదు ♦ కలుగు నఘంబుల్. 286

తే. ‡కష్టుఁ డగువాఁడు చేసిన ♦ కర్మ మరయ, భ్రష్ట మగు ధార్మికుల దూఱు ♦ వాఁడు ధర్మ
మందు నశ్రద్ధ గలవాఁడు ♦ నిందకుఁడును, జెడుదురిహపరదూరులై ♦ యెడరు గుడిచి.

చ. సుజనులధర్మకర్మములఁ జూచి ♦ సహింపఁగ లేక మూఢు లై
వృజినము లంద నిందలను ♦ వీఁగక చేయుదు రిందుఁ గొంద ఱా
కుజనులపాపజీవపరి ♦ కుత్సిత దేహము లాశుగంబుచే
గుజగుజ లైనభస్త్రి లను ♦ కొంఁ దగి తేళ్ళు నిరర్థకంబు లై. 288

మ. తమకావించినకర్జముల్ గని జగ ♦ ద్వర్ణ్యంబు లం చెంచి య
ర్యముఁ డాత్మాంశువులం బలెం బుడమిపై ♦ వ్యాపింపఁగాఁ జేయుచున్
దమకుం దామ స్తుతించుకొంద్రు ఖలు లం ♦ ద్దానం బ్రకాశంబు లే
దమితాఘం బది వచ్చి హెచ్చి పడుఁ జు ♦ మ్మవ్వారిశీర్షంబుపై. 289

సీ. ఆత్మసంస్తుతిఁ బావ ♦ మగు నట్లె పరనింద, పాపప్రదం బయి ♦ పరిభవించు
ధనము లేకుండిన ♦ వినుతగుణము గల్గి, పూజ్యుఁ డౌ విబుధుండు ♦ భూతలమున

* తితిక్ష = ఓర్పు.

‡ ఎడరు = ఆపద.



ధనత ప్పెఱిఁగి వెన్కఁ ♦ దాపనంతప్తుఁ డై, పూతుఁ డౌ మఱి తప్పఁ ♦ బూనకున్న
నుదితార్కుఁడు తమస్స ♦ ముదయ మడంచున, ట్లఘముల సుకృతి దా ♦ నడఁచివైచు
తే, బాపములకెల్ల లోభంబు ♦ పట్టుఁగొమ్మ, దాని విడి పుణ్యవంతుఁ డౌ ♦ మానవుండు
శిష్టనుతగతి ధర్మ మా ♦ ర్జింప వలయు, దాన నిహపరసౌఖ్యంబు ♦ గాన వచ్చు. 290

వ. తృణావృతంబు లైనకూపంబులు వోలెఁ దమఃప్రవిష్టంబులై యధర్మంబులు కొన్ని ధర్మంబులవలెం గన్పట్టు నట్టివాని శిష్టాచారంబులం దెలియ నగు ననినఁ గౌశికుండు శిష్టాచారంబు లెట్టివి చెప్పు మనిన వ్యాధుండు వెండియు. 291

శిష్టాచారకథనము.

ఆ. విప్రకులవరేణ్య ♦ వేదబోధితములు, శాస్త్రబోధితములు ♦ సాధుజనని
షేవితంబు లనఁగఁ ♦ జెల్లు శిష్టాచార,ములు వచింతు వానిఁ ♦ దెలియ వినుము. 292

సీ.* ఆర్జవంబు తపంబు ♦ యజ్ఞంబు శౌచంబు, దానంబు ధర్మంబు ♦ దమము శమము
నాచార మక్రోధ ♦ మధ్యయనంబును, దీర్ఘసంసేవ యా ♦ స్తిక్యబుద్ధి
సత్యవాదిత్వము ♦ సంతోష మనసూయ, దైన్యరాహిత్యము ♦ దైవభక్తి
గురుజనశుశ్రూష ♦ వరశీలగుప్తియు, నఖిలభూతదయయు ♦ నార్యసేవ
తే, ప్రియవచన మనహంక్రియ ♦ నయము నాశ్రి,తార్థిరక్షణము నహింస ♦ యక్షనిగ్ర
హము నదంభము విద్య కా ♦ మాదిశత్రు,జయము నివి శిష్టసన్నుతా ♦ చారము లగు.

వ. మఱియు దీనానుగ్రహము కులోచితకర్మానుష్ఠానము నానృశంస్యము నద్రోహము తితిక్ష లోనగునవియును శిష్టాచారంబు లిందు నహింసాసత్యదానంబులు నుత్తమోత్తమంబులు. 294

మ. ఇవి యెల్లం గలవాఁడ వై గురుల నెం ♦ తే భక్తి సేవించుచున్
దవుధర్మంబున సంచరించుచును జ్ఞా ♦ నంబున్ సమార్జించి ధై
ర్యవరిష్ఠప్లవముం గ్రహించి వడి మో ♦ హాంభోధిపై నీఁదుచున్
భవదుర్గంబులు దాఁటి యుత్తమపద ♦ ప్రాప్తిం బ్రకాశింపుమా. 295

తే. ధర్మముల దూఱువారిఁ గ్రో ♦ ధమునఁ జేసి, పాపములు చుట్టి వెనుదన్ని ♦ బాధపెట్టు
ధర్మములఁ బోవువారిఁ దా ♦ త్పర్యమునను,బుణ్యములుముట్టి వెనుదన్ని ♦ ప్రోదిపుచ్చు.

శా. శిష్టాచారములందు సత్యము ప్రశ ♦ స్తిం గాంచు నెల్లప్పుడున్
శిష్టుల్ దానిని వాజిమేధములకం ♦ టె న్మేటిగాఁ జెప్పి సం
తుష్టిం బూనుచు నుంద్రు సత్యముననే ♦ తోఁచున్ జగచ్ఛ్రేష్ఠు వు
త్కృష్టప్రస్థితి నాకసంబునఁ గడుం ♦ దే జందు నెల్లప్పుడున్. 297

* అక్షము = ఇంద్రియము.

వ. సదాచారంబు ధర్మం బనియు ననాచారం బధర్మం బనియు శిష్టవచనంబు గావున. 298

తే. ఉత్తమాచారవంతుఁ డత్యుత్తమార్థ
ములను బరమార్థచింతమై • మెలఁగి తాను
బ్రజ్ఞ యనుమేడపై నెక్కి • విజ్ఞుఁ డయి జ
గమ్ము లరయుచుఁ బుణ్యమార్గమునఁ జనును. 299

వ. ఇంత వట్టు నాకనివిని యెఱింగిన తెఱంగున శిష్టాచారంబు లెఱింగించితి నని మఱి
యును. 300

ధర్మవ్యాధుఁడు కౌశికునకు హింసాద్యాచారం బెఱింగించుట.

ఉ. ఏను బొనర్చుకర్మ మిది • యెంతయు ఘోరము నా నెఱుంగుదు
న్మానక నాపురాకృతము • నా కిటు పాపపుఁగర్మరూప మై
తానఁగ నయ్యెడిన్ విధి యొకండు గదా బలవత్తరం బయో
దీనివినాశనార్థము మదిం బొనరింతుఁ బ్రయత్న మెంతయున్. 301

తే.* తమయొనర్చినకర్మంబు దారివలన, జంతువులు చచ్చు విధిఁ జేసి • చంపువారు
నట్టినంజుళ్ల నంగళ్ల • నమ్మువారు, నరయఁగ నిమిత్తమాత్రులు ధరణిదేవ. 302

వ. మఱియు నాయాజంతుమాంసాదికంబు దేవతాతిథిపితృపూజార్థం బుపయోగింపం
బడుఁ గావున వానికిం బుణ్యంబు గలదు. 303

తే. లతలు నోషధులును మృగతతులు పసులు, పక్షులును భూతకోటికి • భక్ష్యము లని
వేదములయందు వినఁబడు • వేయుగతుల, వానిఁ గాదన వశమె యెవ్వానికైన. 304

సీ.† ఔశీనరుండు మున్నాత్మమాంసప్రదానమ్మునఁ బ్రబలి పుణ్యమ్ముఁ గొనఁడె
రంతిదేవునియింటఁ • బ్రతిదినంబును రెండు,వేలగోవులఁ జంపి • పెట్ట లేడ
విప్రు లధ్వరముల • విశసించి పశువులఁ, గ్రందుగా స్వర్గంబు • నొంద రైరె
మఖములం బశువులు • మంత్రసంస్కృతము లై, పుణ్యంబుగతులకుఁ బోవ వినమె

తే, సవనవహ్నులు మాంసాశఁ • దవులవేని, మాంసభక్షణ మేరికి • మనసుపడక
యుండు దాని నిషేధింప • ఋత్విజనులు, విధివిహిత మంచుఁ జెప్పిరి • వింటివయ్య.

తే. దేవకార్యములను బితృదేవకార్యములను మాంసముఁ బెట్టుట • ముఖ్య మనియు
శేష మగుదాని భుజియింపఁ జెల్లు ననియు,శ్రుతులు ఘంటాపథంబుగాఁ జెప్పవినమె.

మ. ఋతుకాలంబునఁ బత్నిఁ గూడుచుఁ బరస్త్రీఁ జూడఁగాఁ బోనిన
స్నుతచారిత్రుఁ బ్రహ్మచారి యని వేనోళ్లం బ్రశంసింతు ర

* వంజుళ్లు = మాంసములు. † ఔశీనరుఁడు = శిబి.



* ట్లతిభక్తిం బితృదేవకార్యములయం • దర్పించి శేషామిషం
బిత మంచుం దినియున్ ద్విజుండు తిననట్లే చెప్ప నొప్పున్ మహిన్. 307

వ. తొల్లి సౌదాసుం డైనకల్మాషపాదుండు మునిశాపంబున రాక్షసుం డై మానవపిశిత
భక్షణంబు చేసియుఁ బాపంబునం బొరయఁ డయ్యె నని మఱియును. 308

సీ. కృషి యుత్తమం బంద్రు కృషికులు దున్నుచో, ధర నెన్నియో జంతుతతులు దెగును
ధాన్యబీజములను • దంపి భక్షింతు ర,య్యవి జీవనంబుల • నలరుచుండుఁ
జెట్లు నోషధులును • ఛేదింత్రు ఫలములు, నమలుదు రది హింసనంబు సువ్వె
జలము ద్రావుదు రందుఁ • గలవు ప్రాణులు గాలిఁ, గలవు పీల్చెద రది గాదె హింస

తే, జగమునం దెందుఁ జూచిన జంతుకోట్లు, లలరుచుండు నొండొంటి కాహార మగుచుఁ
జేప చేపను మ్రింగును • జిత్ర మిట్లు, చేసెఁ బరమేష్ఠి యే మని • చెప్ప వచ్చు. 309

వ. ఇదియునుం గాక మనము నడచునప్పుడును గూరుచున్నప్పుడును బండుకొనినప్పు
డును నెన్నియో జీవజాలంబుల నెఱింగియు నెఱుంగకయుఁ జంపుచుందు మిట్లు జీవ
హింస చేయనివిజ్ఞానవంతులుం జేయుచుండునదియ కావున నత్యంతంబు గానియ
ప్పుడు హింసయు నహింసయు నాఁబడుఁ గొందఱు కులీనులును ఘోరకృత్యంబులం
జేసి లజ్జింపరు కొందఱు బందుగులకలిమి కసూయపడుదురు కొందఱు పండితంమ
న్యు లై గురుధిక్కారంబు గావింతు రిట్లు విపర్యాసంబు గానఁబడుచుండుఁ గాన
మానవులు దుర్గుణంబులపొంతఁ బోక వారివారికులధర్మంబులం బ్రవర్తించుచుండ
వలయు ధర్మం బధర్మంబువలెను నధర్మంబు ధర్మంబువలెను గానిపించుం గావున
ధర్మాధర్మవివేచనంబు దురవగాహం బై యుండు దానిని శ్రుతిప్రమాణంబులవల
నను వృద్ధాచారంబువలనను దెలియం దగు. 310

ధర్మవ్యాధుఁడు కర్మగతు లెఱింగించుట.

ఉ. సత్యము వల్కఁ జెల్లెడు నసత్యము చెల్లదు నా వినంబడున్
నిత్యము ధర్మశాస్త్రముల • నీవు నెఱుంగుదు విట్టు లున్న నౌ
చిత్య మెఱింగి పెండ్లియెడ • జీవముపట్లను బొంక నౌ నసత్
సత్య మసత్య మై చను నసత్యము సత్యమ యై చనుం గదా. 311

ఆ. ఇంత యేల భూతహిత మగునన్ృతంబు, సత్యమట్ల యగును • సత్యమేని
భూతహితము గామిఁ • బోయెడు నన్ృతమై, ధర్మ మిట్లు సూక్ష్మతను వహించు.

చ. తనపొనరించుకర్మమునఁ • దాను శుభాశుభ మౌ ఫలంబు నొం
ద నగును బౌరుషం బనుట • తప్పు శుభం బగుచో స్వకర్తృకం

* ఇతము = హితము.

బని జనుఁ డుబ్బు లో నశుభ ♦ మైనను దైవకృతం బటంచు నే
డ్చును నిజకర్మదోష మని ♦ చూడ నెఱుంగఁ డొకించుకేనియున్. 313

సీ. పురుషకారమున నెప్పుడుఁ గార్యసాఫల్య, మగునేని భూతల♦మందు జనులు
చావు పుట్టులు లేక ♦ సకలేచ్ఛలును దీర, సతతసౌఖ్యంబున ♦ సాగుచుండ్రు
నిపుణు లుత్తములును ♦ నెంజిలిం జెడుటయు, నధము లత్యధికు లై♦యలరుటయును
గనుఁగొందు మిటు కర్మ♦గతులఁ గా కొంటను, బరఁగ నేర్చునె యెంత♦పాటుపడినఁ
తే. దవ మొనర్చియు వేల్పులఁ ♦ దనిపి సుకృతు, లందఁ జాలరు బిడ్డల ♦ నందిరేని
కించు లగుదురు వార లం♦కించనులకు, నుత్తమోత్తము లౌదవెద ♦ రుర్వియందు. 314

ఉ.* ఉదరమునిండ మెక్కుటకు ♦ నుండినవారలు రోగవంతు లై
మెదు కొకఁ డైనఁ గాని కొని ♦ మ్రింగఁగ నేరరు లేనివారికిన్
బదుగురు మెక్క నుండెదరు ♦ బాహుబలాఢ్యుఁ డలంతిచేఁ డెగున్
గడుఁగొని నీచుఁ డాఢ్యుఁ డయి ♦ క్రాలఁ గనుంగొనుచుందు మెందునన్. 315

ఉ. సాధ్యము కానిరోగము వె♦సన్ దనయంత నదే నివృత్త మౌ
బాధ్యము గానియింత యగు♦వ్యాధియు నశ్వినదృష్టవైద్యనం
బోధ్యము గాక మందులను ♦ బోసిన లొంగక స్వాశ్రయప్రజన్
వధ్యునిఁ జేయు నే మనుచుఁ ♦ బల్కఁగ వచ్చును గర్మచిత్రమున్. 316

వ. మఱియు నొక్కలగ్నంబునం బుట్టినవారును భిన్నభిన్నఫలంబులం బొందుచున్నవారిందులకునుం గారణంబు ప్రాక్తనకర్మంబ కాని వేఱు కాదు జీవుండు నిత్యుండు కర్మబంధనిబంధనంబున ననిత్యంబు లైనదేహంబులం జొచ్చి వచ్చుచుండు ననినఁ గౌశికుండు జీవుం డెట్లు నిత్యుండు చెప్పు మనిన ధర్మవ్యాధుండు వెండియును. 317

—♦ ధర్మవ్యాధుఁడు కౌశికునకు జీవలక్షణము చెప్పుట. ♦—

ఉ. జీవునకున్ వినాశనము ♦ చెప్పఁగ రా దతఁ డెప్డు నిత్యుఁ డా
జీవుఁడు కర్మవాసనను♦జేసి శుభాశుభదేహధారి యై
పోవుచు దానిని న్విడిచి ♦ పొందు మఱొక్కఁడు తద్విధంబు మూ
ఢావళి మృత్యు వంచు నిసు♦మంత యెఱుంగక పల్కు వింటివే. 318

క. మును దనచేసినకర్మము, మనుజుఁడు తా నొందవలయు ♦ మఱియొకమార్గం
బునఁ బోము దాన సదస, జ్జననంబుల నెత్తుచుండు ♦ జన్మాంతరమందున్. 319

వ. అనినఁ గౌశికుండు జీవునకుఁ బుణ్యపాపసంబంధం బెట్లు గలుగుం జెప్పు మనిన ధర్మ

* కడుఁగొని = అతిశయించి.



వ్యాధుం డిది గర్భాధానప్రభృతికర్మసంచయంబునం గలుగుచుండు నాప్రకారంబంతయు సంక్షేపంబునం జెప్పెద విను మని మఱియును. 320

చ. సతతము పుణ్యకర్మములు ♦ సల్పిన వేల్పగుఁ బుణ్యపాపసం
గతి మనుజుండ యై తనరుఁ ♦ గష్టములం బడి భ్రష్టుఁ డైన దు
ష్కృతమునఁ దిర్యగాదులను ♦ జేరు నటన్ బహుమోహబద్ధుఁ డై
స్థితి చెడి నారకవ్యథలఁ ♦ దేలుచు నుండు నిరంతరంబునన్. 321

క. రోగార్తునకు నపథ్యము, బా గని మదిఁ దోఁచునగిదిఁ ♦ బాపాత్ముం డై
వేగుచుఁ బాపక్రియలన్, వీఁగక పొనరించు సౌఖ్య♦విధు లనుకొనుచున్. 322

వ. ఇట్లు జీవుండు కర్మబంధనిబంధనుం డై జననమరణజరాధివ్యాధిబాధితుం డై సుఖంబు లేక సంసారచక్రంబునం బరిభ్రమించి దుఃఖించుచుఁ బారంబుఁ గానకుండు నని వెండియు. 323

ఉ.* దుష్కృతు లాచరించినను ♦ దోషపథంబున గ్రుంగి దుఃఖముల్
నిష్కృతి లేక పొంద నగు ♦ నిక్కము దీని నెఱింగి నిచ్చలున్
బుష్కలపుణ్యమార్గమునఁ ♦ బోవుచు భూతదయాపరుండు నై
నిష్కలుషస్వభావమున ♦ నిల్చినఁ బుణ్యపదంబు నొందెడిన్. 324

ఆ. జగము సంతసింప ♦ సతతంబు కామ్యకర్మము లొనర్చి జనుఁడు ♦ మమత మీఱ
స్వర్గలోకమునకుఁ ♦ జని సౌఖ్యమును బొందఁ, గలఁడు కర్మఫలము ♦ గలుగువఱకు.

చ.‡ కనుఁగొనఁ గామ్యకర్మములఁ ♦ గల్గుఫలం బలుపం బనిత్య మం
చును దనజ్ఞానదృష్టి మెయిఁ ♦ జూచి ఫలంబున కాస సేయ కె
ప్డును దపముం జపంబు శమ♦ముం దమ మింద్రియనిగ్రహంబు గ
ల్గినజనుఁ డెన్నఁడున్ జెడని♦లీలల బ్రహ్మపదంబు నొందెడిన్. 325

తే. అనినఁ గౌశికుఁ డను నింద్రి♦యంబు లనఁగ, నెవ్వి తన్నిగ్రహము సేయు♦టెట్లు దాన
నగుఫలం బెట్టియది చెప్పు ♦ మనుఁడు వ్యాధుఁ, డి ట్లనుచుఁ జెప్పె విప్రున♦కిచ్ఛఁ జేసి.

తే. విషయవిజ్ఞానమునకు మున్ ♦ వెలయు మనము, మనము కామరోషవశంబు♦నను దలిర్చి
నేసి యింద్రియలోలుఁ డై ♦ యెవుడు జనుఁడు, రూపరసగంధములఁ జిక్కి ♦ యేపుమీఱు.

సీ. విషయలోలుం డైన ♦ వెస రాగము జనించుఁ, బిమ్మట ద్వేషంబు ♦ పెచ్చుపెఱుగుఁ
దదనంతరము లోభ ♦ ముదయించు నంతట, మోహ మగ్గల మయి ♦ మోసు లెత్తు

* నిష్కృతి = ప్రాయశ్చిత్తము. పుష్కలము = అధికము.
‡ అలుపము = అల్పము; లీల = విధము.

లోభమోహాదుల ♦ లోఁ దగుల్కొని ధర్మ, బుద్ధి లేక నరుండు ♦ పొడవడంగు
వాఁడు ధర్మార్థముల్ ♦ వ్యాజంబునం బూని, పాపకృత్యములకుఁ ♦ బాలుపడును
తే, విజ్ఞు లిది కా దటన్నను ♦ వినక తనకుఁ, దోఁచినది వేదసమ్మత ♦ మైచను నని
పలికి దుర్వాదములు చేసి ♦ పాపకర్మ, ములు పొనర్పఁ గడంగును ♦ బురుషుఁ డెవుడు.

ఉ. పాపములం దగుల్కొనిన ♦ వాఁడు గుణంబులఁ దప్పఁ దప్పగాఁ
ద్రోవడఁ జేసి సంతతము ♦ దుష్టులచెల్మిని దుఃఖభాజ మై
కాపురుషుండు నాఁబడి సు ♦ ఖం బన నెట్టిదియో యెఱుంగ కెం
తే పరితాప మంది చెడు ♦ నిందును నందును గాక నిందకై. 330

ఆ. సజ్జనుండు దోష ♦ సముదయంబుల నెల్లఁ, బాఱఁ దోలి శ్రుతుల ♦ పరిచయమున
నిర్మలాత్ముఁ డగుచు ♦ ధర్మతత్పరుఁ డయి, తగ సుఖించు లోక ♦ తత్త్వ మెఱిఁగి.

తే. అనిన బ్రాహ్మణుఁ డనియె నో ♦ యయ్య ధర్మ, తత్వమెల్లఁ బలుకుచుంటి ♦ సత్వమూర్తి
వీవు ఋషి వంచు నెంచెద ♦ నే ననంగ, బోయ యిట్లని పలికె నా ♦ భూసురునకు.

వ. అయ్యా! బ్రాహ్మణులు మహాభాగులు సర్వవిధంబుల బ్రాహ్మణప్రియం బవశ్య కర్తవ్యంబు గావున నేను బ్రాహ్మణోత్తములకు నమస్కరించి నీకు బ్రహ్మవిద్యా ప్రకారం బించుక యెఱిఁగించెద విను మని యిట్లనియె. 333

—◆ ధర్మవ్యాధుఁడు కౌశికునకు బ్రహ్మవిద్యాప్రకారం బెఱింగించుట. ◆—

సీ. *మఱుఁగుమహాభూత ♦ మయమైజగముభూత, ములుబ్రహ్మమయములై ♦ చెలఁగుచుండు
నాకసం బనిలంబు ♦ ననలంబు నప్పు న, వనియు భూతము లనఁ ♦ దనరు నివ్వి
యనులోమమున నిట్టి ♦ వై ప్రతిలోమగ, తి లయంబుఁ గాంచు నా ♦ సృష్టియందు
భూతగుణంబు లై ♦ పొనరు శబ్దస్పర్శ, ములు రూపరసగంధ ♦ ములు దలంప
తే, మఱియు భూతము లొకఁ డొకఁ ♦ డఱిమి గుణము
లొక్కటొక టెక్కువగ నోలి ♦ నొందు నెల్ల
భూతములు సమంబులు భూత ♦ ముల నెసంగు
స్థూలదేహసమూహ మీ ♦ క్షోణియందు. 334

క. జీవుఁడు కర్మవశంబున, నీవెలసిన దేహమందు ♦ నెసఁగుచు నవలం
దా వెడలు నదియ తన్మా, త్రావిష్కరణం బటందు ♦ రరయుమి నజ్ఞుల్. 335

వ. శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణపంచకం బొక్కటియును భూతంబు లైదును విషయంబు లైదును షష్ఠం బైనమనంబును సప్తమాష్టమంబు లైనబుద్ధ్యహంకారంబులును

* మఱుఁగు = లీయమగు.



సత్వరజస్తమోగుణంబులు మూఁడును గూడినరాశి సప్తదశకం బనియు నవ్యక్తం బనియు నొప్పు మఱియుఁ బంచభూతంబులును బంచతన్మాత్రలును దశేంద్రియంబులును త్రిగుణంబులును నంతఃకరణంబును గూడినరాశి చతుర్వింశకం బన నొప్పు నిట్లు సమష్టివ్యష్టిభేదంబున ననేకప్రకారంబు లైనవీనివలన స్థావరజంగమాత్మకం బయినలోకం బెల్లఁ బ్రతిష్ఠితం బై వ్యక్తావ్యక్తం బైనతత్వంబున నావిర్భావతిరోభావంబులం బొరయుచుండు. 336

తే. ఇంద్రియంబులు విషయేచ్ఛ ♦ నెవ్వఁ డగులు
నింద్రియవశంవదుండయి ♦ యెసఁగి జనుఁడు
సంసృతిం బడి తపియించు ♦ జ్ఞాని యైన
వాఁ డతీంద్రియుఁ డై సుఖ ♦ వంతుఁ డగును. 337

ఉ.* సత్యము జ్ఞానవైభవము ♦ సద్గురుసేవయుఁ గల్గి బ్రహ్మముల్
నిత్యము నిర్వికల్పమును ♦ నిర్గుణముల్ నిరపాయ మంచు ని
ప్రత్యయ మైనవిష్టపము ♦ సర్వ మనిత్య మటంచు నెంచి లో
నత్యయశూన్య మై తనరు ♦ నట్టివెలుంగున నిల్చి పొల్చెదుల్. 338

సీ. అఖిలలోకమునందు ♦ నాత్మస్వరూప మా, నాత్మయం దఖిల మా ♦ నని యెఱింగి
తత్పరత్వమున భూ ♦ తములందు సక్తుఁ డై, యద్వైతభావంబు ♦ నధిగమించి
బ్రహ్మభూతుం డయి ♦ ప్రజ్ఞానముగ్రుఁ డై, విజ్ఞానమున మించి ♦ ప్రాజ్ఞుఁ డగుచు
నవ్యయు నాత్మేశు ♦ నర్చించి శాశ్వతా, నందసౌఖ్యంబునఁ ♦ బొంది పొసఁగు
తే, నింతకుఁ దపంబు మూలమా ♦ నింద్రియజయ, మే తపం బది గలిగిన ♦ యేని స్వర్గ
మగును లేకున్న నరకంబ ♦ యగు ననర్థ, ములు జితేంద్రియు నంట వె ♦ వ్వుడును గాని.

చ. పురుషునకుల్ శరీర మది ♦ పోల్ప రథం బగు నాత్మ సాది యా
నరయఁగ నింద్రియంబులు ర ♦ థాశ్వము లెప్పుడు ధైర్యరశ్ములన్
గర మరుదండఁగాఁ దిగిచి ♦ కమ్రపథంబును బట్టి పోయినం
దెరలక యాతఁ డుత్తమగ ♦ తిం బడయుల్ రథికుండొకో యనల్. 340

ఆ. పురుషుఁ డింద్రియములు ♦ పోవుత్రోవను మదిఁ, బోవనిచ్చె నేని ♦ నావ వాయు
వశమునల్ భ్రమించి ♦ వనధి మున్గెడునట్లు, దుఃఖవార్ధి మునిఁగి ♦ త్రుంగిపోవు. 341

వ. కావున విజితేంద్రియుం డయి విషయసుఖంబులం దగులక సమాధినిష్ఠాగరిష్ఠుం డైనవాఁడు నిర్వాణానందంబు నొందఁగలఁ డనినఁ గౌశికుండు సత్వరజస్తమో

* ప్రత్యయము = విశ్వాసము; ప్రసిద్ధి. అత్యయము = చేటు.

గుణంబులతత్త్వం బెఱిఁగింపు మనుటయు నతండు వెండియు. 343

ధర్మవ్యాధుఁడు సత్త్వరజస్తమోగుణతత్త్వం బెఱిఁగించుట.

తే. తమస్సు మోహాత్మకంబు సత్త్వంబు కాంతి, బహుళము రజంబు ప్రీతిప్ర♦వర్తకంబు
మర్త్యకోటియందును సత్త్వంబు♦ముఖ్య మరయ, వానిలక్షణ మెఱిఁగింతు♦వరుస వినుము.

ఉ. ఆలసతయు న్విమోహము మ♦హాక్రోధ నిద్రయుఁ దామసప్రవృ
త్తులు జడతాభిమానము ల♦సంతుష్టియు రాగము లోభమోహముల్
తెలియఁగ రాజసంబు లగు ♦ ధీరత విద్యయు నార్జవంబు ను
జ్జ్వల మగుబుద్ధి బుద్ధియును ♦ జ్ఞానము నివ్వివి సాత్త్వికార్థముల్. 344

ఉ.*సాత్త్వికుఁ డెల్లకాలమును ♦ శాంతియు దాంతియుఁ గల్గి లోకపుం
దత్త్వ మెఱింగి తద్గతు ఖే♦దం దగులంబడనీక నిత్యసా
ధుత్వము నిర్మలత్వమును ♦ దోషుగఁ జేకొని సత్యవాది యై
యత్యనురక్తి ద్వంద్వముల ♦ కందనివాఁ డయి నిర్వృతిం గొనున్. 345

చ.‡ ఇలపయి శూద్రయోని జని♦యించినవాఁడును సాత్త్వికుండుగా
నలరినయేని వైశ్యుఁ డగు ♦ నంతట క్షత్త్రియుఁ డై యనంతరం
బలకన విప్రుఁ డై సుకృత♦మందు మెలంగుచు జ్ఞాని యై యతం
డలమట లేక తా భవల♦తాదులఁ ద్రెంచి సుఖించు నెప్పుడున్. 346

వ. అని చెప్పి మఱి యేమి చెప్పవలయు నడుగు మనినఁ గౌశికుండు ధర్మవ్యాధునకు-
మొగం బై పార్థివధాతువు నాశ్రయించి శారీరాగ్ని యె ట్లుండు వాయు వెట్లు
ప్రవర్తించుం జెప్పు మనిన నతం డి ట్లనియె. 347

ధర్మవ్యాధుఁడు శారీరలక్షణం బెఱిఁగించుట.

సీ.‡ దేహాగ్ని నాభిప్ర♦దేశాశ్రయంబుగా, మూర్ధముపై నంటి ♦ మొనసి యుండు
నొడలి నోమెడుదాని♦కడ రక్షకం బయి, ప్రాణవాయు వెసంగి ♦ వర్తించుచుండు
నాప్రాణవాయువు♦నందు సర్వము సుప్రతిష్ఠిత మగుఁ దానిఁ ♦ దెలిసికొనిన
భూతాత్మకం బది ♦ బుద్ధియు నది యహంకార మయ్యాది చిదా♦కార మద్ది
తే. వస్తి మూలగుదంబు లా♦వాసములుగఁ, బావకు సమాశ్రయించి య♦పానవాయు
వెసఁగు మూత్రపురీషాప్తి♦హేతు వగుచు, సర్వజంతువులందు నో♦యుర్వీదేవ. 348

క. జనకంఠదేశగత మై, ఘనబలకర్మప్రయత్న♦కారణ మగుచున్
దనరారు నుదానాఖ్యం, బనువాయు వటంచు సూరి♦జను లండ్రు దగన్. 349

* ద్వంద్వము=లాభాలాభములు, సుఖదుఃఖములు మొదలగునవి.

‡ అలకన=చులకనగా (ఇట్లు నైజాము మండలమున వాడుదురు). † వస్తి=పొత్తికడుపు.



క. మేనఁ గలసర్వసంధులఁ, దా నై వ్యానానిలంబు ♦ దనరుచు నుండున్
బ్రాణాపానాగ్నిహితం, బై నెగడు సమానవాయు ♦ వది నాభిగ మై. 350

తే. నాభిమధ్యమునందుఁ బ్రా♦ణంబు లెల్ల, నిలిచి క్రిందికి మీఁదికి ♦ మెలఁగుచుండు
హృదయమున నుండి పది యయి♦పొదలునట్టి, నాడులను బట్టి ప్రేరేచి♦నాఁడు నాఁట.

సీ. భుక్తాన్నమును బ్రాణ♦భూతవాయువు నాభి, పై నున్నకోశము ♦ నానఁ జేయు
దాని ధాత్వగ్ని స♦మానాదిసహకారమున జ్వలించుచుఁ బక్వ♦ముగ నొనర్చు
నది నాభిక్రిందఁ బ♦క్వాశయమం దపానమునఁ గిట్టం బయి ♦ యమరి పడును
మేనఁ బ్రధానంబు ♦ లౌనాడు లయ్యన్న, రసమున ధాతువు ♦ లెసఁగఁ జేయుఁ

ఆ. బరమయోగు లిట్లు ♦ పరఁగు శారీరలక్షణ మెఱింగి యోగ♦గరిమవలన
మారుతములఁ గట్టి ♦ కోరి మూర్ధస్థానమందు నాత్మఁ జూచు♦చుందు రెపుడు. 352

క. జీవాత్మయుఁ బరమాత్మయు, నేవలనం గాని యొక్కఁ♦డే యని యెపుడున్
భావించునట్టియదియే, కైవల్య మటంచుఁ దెలియఁ ♦ గలరు మహాత్ముల్. 353

శా. మేనన్ ధాతుజ మూష్మ మగ్ని యది పే♦ర్మిం బ్రాణవాతేరితం
బై నానాస్థలులన్ జ్వలించుచును భు♦క్తాన్నంబు పక్వంబుగా
నానందం బొనరించు నయ్యదియు జీ♦వాత్ముండు నా నొప్పుచున్
దా నం దుండియు నీటినిం గమలప♦త్త్రం బట్టు లంటం డొటన్. 354

ఆ. పుడమి బీజములను ♦ బుట్టించున ట్లెల్ల, పుణ్యపాపకర్మ♦ములకు హేతు
వగుట మేను క్షేత్ర♦ మయ్యె క్షేత్రజ్ఞుఁ డై, చెలఁగె దాని నెఱిఁగి ♦ జీవుఁ డరయ.

ఆ. తత్త్వరూప మిట్లు ♦ తగ బ్రస్ఫుటం బయ్యె, నెఱుకపడక యుండు ♦ నెల్లయపుడుఁ
గాన నుత్తమగతిఁ ♦ గన నెంచువారలు, సేయఁ దగినదానిఁ ♦ జెప్పెద వినుము. 356

వ. అని మఱియును. 357

సీ. మానావమానముల్ ♦ మత్సరక్రోధముల్, మానసంబునయందుఁ ♦ బూనకెపుడు
నియతభోజనుఁడును ♦ నిర్జితేంద్రియుఁడు నై, యొగి రేబవ ల్తపో♦యోగమునను
దీపించుప్రజ్ఞాన♦దీపంబునం జేసి, పరమాత్మ నాత్మలోఁ ♦ బరఁగఁ గనుచు
నిర్వాతదీపంబు♦నెఱి నిర్మలాత్ముఁ డై, గాఢసుషుప్తిలోఁ ♦ గల్గునట్టి
తే. సౌఖ్యమును బోలుసౌఖ్యంబు ♦ సంతతంబు
నుత్తమానందమును బొంది ♦ యోగివర్యుఁ
డమృతమయ మగునిర్వాణ♦మందుఁ దనరుఁ
గొరలి నిరుపద్రవుండు ని♦ఃఖేదుఁ డగుచు. 358

తే. పరమసుఖదంబు తప మిది ♦ పండితుండు, దగును రక్షింప దీని గ్రోధంబువలన
మత్సరంబున ధర్మంబు ♦ మనుప వలయు, నన్నిటను జ్ఞానరక్షణ ♦ మగు నొనర్ప. 359

వ. మఱియు నానృశంస్యంబ పరమధర్మం బనియు క్షమయ పరమబలం బనియు నాత్మ జ్ఞానంబ పరమజ్ఞానం బనియు నిరాశత్వం బుత్తమోత్తమం బనియు సత్యవ్రతంబ పరమవ్రతం బనియు భూతహితంబ పరమతపం బనియు నెంచి పరిగ్రహంబులం బరిత్యజించి ద్రోహచింతనంబుం ద్రుంచి స్నేహభావంబు నంతరించి విజ్ఞానం బధిగమించి హింస సేయక పాపకర్మంబులం డాయక సుకృతంబునకు రోయక త్యాగియై యోగియై యతవ్రతుండై గురుప్రసాదంబునం జేసి దుఃఖరహితం బానందజనకంబు నుత్తమంబు నగుబ్రహ్మతత్త్వం బనుసంధించుచు బ్రాహ్మణుండు పరబ్రహ్మసాయుజ్యంబునం బొంది పరమసుఖం బనుభవించు నని చెప్పి బ్రాహ్మణోత్తమా! యిది బ్రహ్మవిద్యాప్రకారంబు సంక్షేపించి చెప్పితి నింక నేమి చెప్పవలయుం జెప్పు మనినఁ గౌశికుండు ప్రీతమనస్కుం డై ధర్మవ్యాధుం జూచి యి ట్లనియె. 360

మ. బళి రే! యే మని చెప్పువాఁడను భవత్ప్రజ్ఞాప్రభావంబు నా
కు లలిం జెప్పితి వెల్లధర్మములు నీకుం గాక లోకంబులోఁ
గలదే ధర్మ మొకండు విజ్ఞుఁడవు నీకంటెన్ విశేషజ్ఞుఁ డి
య్యిలపై నొక్కమహర్షి యుండు నని యూహింపంగరా దెవ్వడున్. 361

వ. అనిన ధర్మవ్యాధుం డి ట్లనియె. 362

—•—♦ ధర్మవ్యాధుఁడు కౌశికునిఁ దనతల్లిదండ్రులకడకుఁ దోడ్కొని పోవుట. ♦—•—

ఆ. ఇట్టిసిద్ధి నాకు ♦ నెసఁగుట కేధర్మ, మొప్పుచున్నయదియొ ♦ యోద్విజేంద్ర!
దాని నీకు నివుడు ♦ తార్కాణ గావింపఁ, దలఁచి యున్నవాఁడఁ ♦ జెలిమిఁ జేసి. 363

ఉ. రమ్ము మదీయవాసగృహరాజముఁ జూడఁగ నందు నెంతయే
నమ్మతి మూఁడుకాళ్ళముదుసళ్ళయి నాతలిదండ్రు లున్నవా
రుమ్మలికంబు లేక యని ♦ యొప్పుగఁ జెప్పి ధరామరాగ్రణిన్
ముమ్మర మైనభక్తిఁ గొనిపోయె నతం డతిసత్వరంబుగన్. 364

మ. చని దేవాయతనోపమంబును జతుశ్శాలాకృతిభ్రాజితం
బును శయ్యాసనభాసురంబు విలసత్పుష్పేష్టగంధావృతం
బును నానామణికాంచనాంచితము సంపూర్ణప్రభాభావితం
బును రమ్యం బగుహర్మ్యముం గనియె నప్పుణ్యాత్ముఁ డం దొక్కచోన్. 365

వ. అట్లు ధర్మవ్యాధుండు నిజసౌధంబునకుం జని. 366



మ. అట శుక్లాంబరభూషణాఢ్యులు కృతాహారుల్ సుఖాసీనులున్
స్ఫుటసంతోషులు నైనవారి మునికిం ♦ జూపించి తా నమ్మహో
త్కటతేజస్వులపాదపద్మములకున్ ♦ దండప్రణామంబు ల
క్కటికం జేర్పడఁ జేసెఁ జేసిన మహోత్కంఠన్ మున ల్లిద్దఱున్. 367

వ. కౌమారుం బొదివికొని యి ట్లనిరి. 368

తే. లెమ్ము లెమ్ము కుమార ధర్మమ్ము నిన్నుఁ, గాచుఁ జిరజీవి వగుము నీశౌచమునకుఁ
బ్రీతులము మేము నీయట్టిసూతి గలుగఁ, గడమ యేమిట నగు మాకు నెనుఁబవ నేల.

సీ. విజ్ఞానమును బ్రజ్ఞ ♦ వెలయ సత్పుత్రుఁడ, వగుటీవలనఁ గులం ♦ బతిశయిల్లెఁ
దనిసిరి నీపూజఁ ♦ దగిలి పితృపితామహాదులతో నస్మదన్వయభవు
లీవు సేవింతు మ ♦ మ్మెపు డిచ్చమెయి మనోవాక్కర్మములఁ గొలువ ♦ వడఁగ నీక
కల నైనఁ బెరబుద్ధి ♦ కలుగఁబోవదు నీకుఁ, గరుణాళుఁడవు నీవు ♦ కన్నతండ్రి

తే. యవనిపైఁ బితృశుశ్రూషయందు నిన్నుఁ, జెప్పి పిమ్మట భృగురాముఁ జెప్పవలయు
గుణగణం బెల్లఁ బ్రోవుగాఁ ♦ గూడి నీదురూపునన్ జన్మ మెత్తంగ ♦ నోపు నిట్లు.

వ. అనునంత ధర్మవ్యాధుం డత్తల్లిదండ్రుల కక్కౌశికుం జూపి యిమ్మహాత్ముండు మన యింటి కతిథి యై విచ్చేసె ననుడు నావృద్ధదంపతు లావిప్రు నతిభక్తి నర్చించి కుశలం బడిగి పూజించి రవుడు ధర్మవ్యాధుండు కౌశికుదిక్కు మొగం బై. 371

సీ. వీరు నాతలిదండ్రు ♦ లారయ నాపాలిపరదైవతము వీరె ♦ ధరణిసురుఁడ
వాసవప్రముఖదేవవ్రాతముం గొల్చుకంటె వీరలసేవ ♦ ఘనము నాకు
శ్రుతులు నేరిచి యజ్ఞతతి నగ్ని వేల్చినఫలము వీరిని గొల్వఁ ♦ బడయ వచ్చుఁ
బుత్రమిత్రకళత్రములుఁ బ్రాణములును వీరలపరిచర్యకే ♦ నిలుపుకొంటి

తే. వీరియడుగులు గడిగి గోర్వెచ్చనీట, జలకమార్చించి భోజన ♦ మెలమిఁ బెట్టి
మెత్తల శయింపఁగాఁ జేసి ♦ చిత్త మలరఁ, గాళు లొత్తి సేవింతు నేవేళ నేను. 372

చ. అనిశము విప్రియంబు లగునట్టివి మాని మనఃప్రియంబు లై
చనియెడుమాట లాడెదను ♦ సారెకు వీరికి నిష్ట మైనచో
నొనరుతు దుష్ట మైనయది యయ్యును మదిఁ గొంకక జంక కింతయున్
విను పితృవాక్యపాలనమె ♦ విశ్రుతధర్మముగాఁ దలంచుచున్. 373

క. జననియు జనకుఁడు నాత్ముఁడు, ననలుఁడు గురు వనెడునేగు ♦ రర్చింపఁగ నై
చనుగురువులు వారలనే,వనమే పురుషునకు నెల్లవ్రతములు తలఁపన్. 374

సీ. *హరిహరాదిసురాళి ♦ నర్చించుకంటె న,త్యధిక మౌఁ జువ్వె పిత్రర్చనంబు
గంగాదితీర్థావ♦గాహనంబునకంటె, నధిక మౌఁ జువ్వె పిత్రర్చనంబు
పౌండరీకాదిస♦వనకాండకృతికంటె, నధిక మౌఁ జువ్వె పిత్రర్చనంబు
సప్తసంతానప్ర♦శస్తనిష్కృతికంటె, నధిక మౌఁ జువ్వె పిత్రర్చనంబు

తే. వటుపరివ్రాజకజటికా♦పాలికాద్య,నాథకోటుల కవిరతా♦న్నప్రదాన
మిడి భజించుట కంటెను ♦ గొడుకులకును, నధిక మౌఁ జువ్వె భువిని పిత్రర్చనంబు.

వ. ఇది యిట్టిది కావునఁ దల్లిదండ్రులం గొలిచెడువారికి సర్వదేవతలునుం బ్రీతులై శాశ్వతైశ్వర్యంబు లొసంగుదు రిది సనాతనధర్మం బని పెద్దలుం జెప్పుదు రని చెప్పి ధర్మవ్యాధుండు తనగురువుల నాతనికి మఱియు నివేదించి నాకు వీరిసేవంజేసియే యిట్టివిజ్ఞానంబు చేకూరె నీ వాపతివ్రతాశిరోవతంసంబుపంపునంజేసి నాకడకు వచ్చితివి గావున నేనుం దత్ప్రియార్థం బింత చెప్పితిం గాని మఱియొక్కహితంబు చెప్ప వలసియున్నది వినుము. 876

చ. నిరతము వేదపాఠమున ♦ నీ వనురక్తుఁడ వై యొకప్డు మా
తరపితలన్ భజింప వెడఁ♦దన్ దయఁ జూనవు వారిఁ బల్కకే
యిరవు త్యజించి వచ్చితివి ♦ హీ! పొనరించి తయుక్త మిట్టినీ
విరహమునం దపించుచును ♦ వృద్ధులు వారలు చీకు లై రహో. 877

తే. తల్లిదండ్రుల సేవింప ♦ కెల్లవేళ, నీతపోధ్యయనాదులు ♦ నిష్ఫలములు
నానుడులు విశ్వసించి యిం ♦ కైనఁ బోయి, వారి నూరార్పవయ్య సే♦వం బొనర్చి.

తే. చెప్పితిని నీకు శ్రేయ మౌ♦చొప్పుఁ జెప్పి,నట్లు చేసితివేని యి♦హంబు నందుఁ
బరమునందును మే లందు ♦ దరుగు మనినఁ, గౌశికుం డిట్లు లుబ్ధకుఁ ♦ గాంచి పలికె.

శా. ఈనీచెప్పిన దెల్ల సత్య మెద నా ♦ కెంతే ముదం బయ్యె వి
జ్ఞానానందమయస్వరూపు నిను ని♦చ్చం గాంచి భాషించితిన్
మానింపన్ నినుఁ బోల రిట్టిఁ డౌశధ♦ర్మజ్ఞుండు లోకంబునన్
గానన్ రాఁ డటనేని నాసుకృత మిం♦కం జెప్ప సామాన్యమే. 880

ఉ. క్షత్రియుఁ డయ్యయాతి మును ♦ స్వర్గపదచ్యుతుఁ డైన వాని దౌ
హిత్రులుఁబోలె దుర్గతుల ♦ నెంతయుఁ జింతిల నున్న నన్నిటన్
మిత్రుఁడ వీవు కాచితి వ♦మేయదయారస మావహిల్ల నే
నాత్రము లేక నీనొడివి♦నట్లికఁ గొల్చెదఁ దల్లిదండ్రులన్. 881

శా. ధర్మాధర్మవినిశ్చయజ్ఞ నిను నే♦తన్మాత్రుఁగా నెన్న నీ
ధర్మజ్ఞత్వ మలంతిజాతి కరు దై ♦ దర్శింప నౌ నట్టిదు

* పిత్రర్చనము = మాతాపితరులసేవ.



ష్కర్మంబుం బొనరింప నిట్టిభవ మెం♦చం బొంది యేతెంచె నీ
మర్మం బింతయు దావ కంతయును ధ♦ర్మవ్యాధ! బోధింపవే. 882

క. అనవుడు ధర్మవ్యాధుం, డనతిక్రమణీయ మూర్వ♦రామరవరశా
సన మట్టిది గావున నే, వినిపించెద వినుము నాదు♦వృత్తాంతంబున్. 883

—•◆ ధర్మవ్యాధుఁడు కౌశికునకుఁ దనపూర్వజన్మవృత్తాంతముఁ జెప్పుట. ◆•—

మ. *మును నే నొక్కధరామరోత్తమునకుం ♦ బుత్రుండ నై పుట్టి న
ట్టన వేదంబులు శాస్త్రముల్ గఱచి వే♦డ్కం బొల్చితిన్ నాఁడు నా
కనుఁగున్నచ్చెలి యయ్యె రాసుతుఁ డొకం ♦ డాతండు విల్విద్య నే
ర్చిన నే నాతనితోడ నేర్చితి నరుల్ ♦ జేవట్టుపట్టంబు గన్. 884

తే. అప్పు డొకనాఁడు మృగయార్థ ♦ మతఁడు వింటు
లంటి కొలువఁగ వని కేగె ♦ నతనితోడ
నేను నేగి మృగంబులఁ ♦ బూని యేయు
చుండ నొకయమ్ము వడిఁ దాఁకె ♦ నొక్కమునికి. 885

ఉ. †తాఁకిన దాన హా యనుచుఁ ♦ దాపసవర్యుఁడు నేలఁ గూలె న
ప్డాకడ కేగి నేను వ్యధి♦తాత్ముఁడ నై పడియున్నవానినిన్
వీఁకతొయిం గనుంగొని ద♦వీయపదం బగుటన్ మృగంబు నా
సీకరణి న్వధించితి నొ♦కించు కెఱుంగను దప్పు చేసితిన్. 886

చ. తెలియనినన్ను సైఁపు మెద ♦ దేవర! నావుడుఁ గ్రోధమూర్ఛితుం
డలఘుతరప్రభావుఁ డగు♦నమ్ముని నన్ గని యిట్లు వల్కె నో
వలువ! ద్విజుండ వయ్యు నిటు ♦ పాడిఁ దొఱంగితి కాన బోయ వై
పొలు పఱి పుట్ట నయ్యెదవు ♦ పొమ్మని కెట్టుగఁ దిట్టెఁ దిట్టినన్. 887

వ. నే నమ్మునికి వెండియు దండప్రణామంబు చేసి. 888

ఉ. ‡అగ్గతి సేయ నేటికి ముని♦నీంద్ర! ప్రసన్నుఁడ వై క్షమింపు న
న్నగ్గల మైనపాపమున ♦ కగ్గము సేయకు మోప లేను నీ
వగ్గిఁ బోనికోపమున ♦ నార్పఁగఁ బోవకు మే నెఱుంగ కీ
యొగ్గు పొనర్చితిన్ గరుణ ♦ నేలుము మ్రొక్కెద భక్తిపెంపునన్. 889

వ. అని ప్రార్థించినం బ్రసన్నుం డై మునీంద్రుండు నా కిట్లనియె. 890

* పట్టంబు = విద్య. † వీఁక = దైన్యము. దవీయపదము = దూరదేశము.
‡ అర్పు = ఆఱింపఁజేయు.

ఉ. శాపము గ్రమ్మఱించుటకుఁ • జాలన నీపొనరించినట్టియీ
పాప మెఱుంగమిం గలిగెఁ • బల్కఁగ నేటికిఁ బుల్కసుండ వై
యీపుడమిన్ జనించియు నహీనగుణంబుల కాలవాల మై
తాపసిఁ బోలి యుండెదవు • ధర్మవిధిజ్ఞుఁడ వై నుతింపఁగన్. 391

క. మాతాపితృసేవామతి, వై తన్మాహాత్మ్యమున సమంచితసిద్ధిన్
జాతిస్మృతియుం గొని విఖ్యాతిన్ వర్తింతు బోయ • వయ్యు ధరిత్రిన్. 392

వ. అపరజన్మంబున మరల నుత్తమబ్రాహ్మణుండ వై పరమపదంబు నొందెద వని యను
గ్రహించుటయు నే నమ్మహామునిమేనం గలవాల మ్మల్లనం బెఱికి వాని నఱకడం
బెట్టుకొని తదాశ్రమంబునం బెట్టివచ్చితి నతండును నాభాగధేయంబునం జేసి ప్రాణం
బులం బాయఁడయ్యె నే నాశాపంబునం జేసి యిట్లయితి నింక మీఁదిజన్మంబున
బ్రాహ్మణుండ నయ్యెద నిది నాపూర్వవృత్తాంతం బనినఁ గౌశికుండును. 393

తే. తెలియ నీరీతి సుఖదుఃఖములు పొసంగు, జనుల కందునఁ జింతింపఁ • జనదు సకల
ధర్మవిదుఁడవు నీ కేల • తగిలి చెప్ప, నవల నింతలో బ్రాహ్మణుఁ • డయ్యె దీవు. 394

తే. ఎప్పుడో మీఁద విప్రుఁ • డయ్యెద వనంగ, నేల నీ విప్డె విప్రుఁడ • వెన్ని చూడ
నీదుధర్మవేతృతయును • నీదుపుణ్యవృత్తమును జాటుచుండవె • వేయిగతుల. 395

ఆ. నీచకర్మగతుల • నిలిచి దాంభికుఁ డయి, నిరతదురితరతుఁడు • నీతిబాహ్యుఁ
డయిన బ్రహ్మజాతుఁ • డరయ శూద్రునికన్న, వేమఱుంగు లలఁతి • యై మెలంగు.

తే. దయయు సత్యంబు ధర్మంబు • దమము శమము, దానమును బుణ్యకార్యచిం • తనము గలిగి
సజ్జనుం డనఁబడు శూద్ర • జాతుఁ డైన, బ్రాహ్మణునికన్న మిన్న యై • పరఁగుచుండు.

తే. కర్మదోషమునం జేసి • కలుగు నిట్టి, విషమగతు లీవు దోషముల్ • విడిచినట్టి
పుణ్యమూర్తివి నినుఁ బోలు • పురుషు లెపుడు, దేనికిని జింత సేయరు • మానసమున.

ధర్మవ్యాధుఁడు సుఖదుఃఖనిరూపణంబు సేయుట.

వ. అనిన ధర్మవ్యాధుండు కౌశికుం జూచి యిట్లనియె. 399

సీ. రెండుతెఱంగుల • నుండు దుఃఖములు శారీరమానసము లన్ • పేరు గాంచి
శ్లేష్మపైత్త్యాదులం • జేసి రోగంబులం, దొడరిన శారీర • దుఃఖ మగును
బ్రియవిప్రయోగ మ • ప్రియసంప్రయోగముఁ, దోడ్పడ్డ మానస • దుఃఖ మగును
శారీరదుఃఖ మౌ • షధముల మానస, దుఃఖంబు ప్రజ్ఞచేఁ • దొలఁగఁ బాఱు
తే. నిది యెఱింగి ప్రతీకార • మొసఁగఁ జేసి, విజ్ఞు లెప్పుడు దుఃఖంప • రజ్ఞు లెఱుఁగఁ
జాల రెపుడు దుఃఖంబుల • పా లగుదురు, పరఁగ నిగ్గతి పండిత • పామరులకు. 400



చ. ముగి సుఖదుఃఖముల్ గలుగ • మోదము ఖేదము నొందనట్టివా
రగుదురు జ్ఞాను లంచనఁగ • నట్టిమహాత్ముల కెప్డు సంతసం
బగణిత మై ప్రవర్తిలెడు • నజ్ఞుల కెప్పుడు నిట్లు గాక లోఁ
దగులుసుఖంబు దుఃఖమును • దారి యెఱుంగఁగ నీని తేఁకువన్. 401

క. సంతుష్టి పరమసుఖ మగు, సంతోషము గలుగువాఁడు • సద్గతిఁ బడయున్
జింత మహాజ్వర మెప్పుడుఁ • జింతించుచు నున్నవాఁడు • చెన్నఱి పోవున్. 402

చ. వగఁ దగులంగనీఁ దగదు • స్వాంతమునం దది వైరి దానిచేఁ
దెగుఁ బురుషార్థముల్ మఱియుఁ • దేజము మాయును డాయుఁ బాపముల్
వగ విషసర్ప మై వగచు • వానిని మానక చంపుఁ గావునన్
వగవక దేనికిన్ నరుఁడు • వర్తిలుచుండినఁ గీర్తిఁ గాంచెడున్. 403

తే. వగపునం జేసి తేజంబు • వమ్మగు నది, వమ్మయిన నెట్టికార్య మే • వాఁడుఁ జేయఁ
జాలఁ డందున రిత్తయై • కూలుఁ గాన, వగపు విడి సౌఖ్య మందఁగ • వచ్చు జనుఁడు.

తే. భూతములయం దభావపు • బుద్ధిఁ జేసి, జగమునం దింతయును గోర్కి • దగులనీక
నిరతపరతత్త్వచింత మైఁ • బరఁగునరుఁడు, పరమగతిఁ గాంచి సుఖియించుఁ • బరముఁ డగుచు.

వ. ఇది యంతయు నెఱింగి నేను దేనికిని శోకింపక కాలంబు ప్రతీక్షించుచున్నవాఁడ ననిన
బ్రాహ్మణుండు వ్యాధుం జూచి. 406

శా. నిన్నుం బోలిన జ్ఞానతృప్తునకు నెం • దే కల్గునే శోక మీ
వెన్నన్ ధర్మవిదుండ వయ్యెదివె ని • న్నే వేళ రక్షించుఁ జు
మ్మన్నా! లగ్గగుఁ బోయివచ్చెదను నే • నాజ్ఞం బ్రసాదింపవే
యన్నన్ లుబ్ధకుఁ డంజలిన్ సలిపె న • ట్లానంచు వాక్రుచ్చుచున్. 407

వ. కౌశికుండును వానికిఁ బ్రదక్షిణంబు గావించి వేడుక మెయి వీడుకోలు వడసి ప్రస్థితుం
డై నిజగృహంబునకుం జని జననీజనకుల నర్చించుచుఁ గృతార్థుం డయ్యె ననిన
ధర్మనందనుండు బ్రాహ్మణప్రభావంబును బతివ్రతామాహాత్మ్యంబును మాతా
పితృశుశ్రూషావిశేషాధికంబును విని మనంబున సంతసించుచు మార్కండేయుం
జూచి మహాత్మా! పరమాద్భుతం బగునీధర్మాఖ్యానంబు వినుచుండ నిక్కాలం
బొక్కముహూర్తమాత్రంబుగాఁ గడచి పోయె నింకను ధర్మశ్రవణంబునం దనివి తీర
కున్నయది గావున. 408

మార్కండేయుండు ధర్మరాజున కంగిరసుఁ డగ్ని యైనవిధము చెప్పుట.

సీ. అగ్ని తపోవని • కరిగె మున్నేమిటి, కవ్వ డంగిరసుఁడు దా • నగ్ని యగుచు
హవ్యము లొసఁగుట • కమరె నేటికి నొక్కఁ, డగువహ్నికి బహుత్వ • మబ్బు టెటుల

కొమ రొప్ప నగ్నికిఁ ♦ గొమరుసామి కుమారుఁ, డై పుట్టె నని విందు ♦ మాతఁ డవలఁ
గృత్తి వాసునకును ♦ గృత్తికలకును గంగ,గావగకును బుత్త్రుఁ ♦ డగుట యెట్లు

తే. విన నభిలషింతు నెంతయు ♦ విపులముగను,నెనరు దళుకొత్తఁ జెప్పవే ♦ మునివరేణ్య
యనుచు నర్థించుడు మృకండు♦తనయుఁ డిట్టు,లనుచు వాక్రుచ్చె నెల్లరు ♦ నౌ ననంగ.

తే. క్రతుభుజులతోడఁ గొండొక ♦ కారణమున,హవ్యవాహుఁడు కలహించి♦యలుకవొడమఁ
దప మొనర్పఁగ వని కేఁగి ♦ దాఁగె నవుడు, తిమిరములు గ్రమ్మె జగ మెల్ల♦స్థితి చెడంగ.

వ. అయ్యవసరంబున హిరణ్యగర్భుం డయ్యుపద్రవం బెఱింగి నిజప్రభావంబున జాతవేద
సుండు వోలె వెలుంగుచున్న తనయనుంగుపుత్త్రు నంగిరసు నగ్నిపదంబున నిలుపు
టయు నతండు తనప్రభాజాలంబునఁ దిమిరంబులం బాపి లోకంబు లెల్లఁ బ్రకాశింపఁ
జేయుచుండె నట ఘోరతపంబు సేయుచుఁ గృశీభూతుం డయిన వైశ్వానరుం డంగిర
సుండు తనస్థానంబునఁ బ్రతిష్ఠితుం డయి ప్రకాశించుట విని చింతాక్రాంతచిత్తుండై.

ఉ. *అలరిబ్రహ్మ నాపదము♦నందు మఱొక్కని నిల్పె నెంతయుం
బోలిననాశుచిత్వ మది ♦ పోయెఁ దపం బిది రిత్త యయ్యె నే
లీల వెలంగి వెండియు వె♦లింగెదనో కద పావకుండ నై
చాలు నికం దపం బనుచు ♦ స్వాంతమునం దలపోసి చయ్యనన్. 412

వ. నిజతపఃప్రభావంబున విష్టపంబు లెల్ల వెలింగించుచున్నయంగిరసుపాలికిం జని తత్తే
జంబుఁ గని భయంపడి మగుడ నున్నయెడ నంగిరసుం డతని కి ట్లనియె. 413

మత్తకోకిలము. ఈవ వెండియు నగ్ని వై జగ ♦ మేలు మెల్ల సురాళికిన్
నీవ మేటివి బ్రహ్మదేవుఁడు ♦ నిన్ను మున్ను కృశానుఁ గాఁ
జేవమై సృజియించెఁ గావునఁ ♦ జేరి నీదుపదంబునన్
నీవు నిల్వుము సంతసింతుము ♦ నేను నీభువనంబులున్. 414

ఉ. నావుడు వహ్ని యి ట్లనియె ♦ నష్టయశుండను నేను లోకమం
దెవ్వ హుతాశనుండ నయి ♦ తెల్లరు నిన్ను భజింతు రగ్నిగా
నావలనన్ భజింపరు మ♦నమ్మున నా కది సమ్మతమ్ము గా
దీవ వహింపు మాపదవి ♦ కేనును నిన్ను బ్రతిష్ఠ సేయుదున్. 415

వ. అట్లు గా దం టేని నీవు ప్రథమాగ్ని వై యుండు మేను ద్వితీయుం డై నప్రాజాప
త్యాగ్ని నై యుండెద ననిన నంగిరసుండు వెండియు నద్దేవు నుద్దేశించి యి ట్లనియె.

* శుచిత్వము = అగ్నిత్వము.



తే. అగ్నిభట్టారకా! యిట్టు ♦ లనఁగ వలవ, దీవు ప్రథమాగ్ని వై లోక ♦ మేలి నన్ను
నీప్రథమపుత్త్రుఁగాఁ గరు♦ణించి కొనుము, వరుస నేను బ్రాజాపత్య♦వహ్ని నగుదు.

ఆ. అనుడు నగ్నిసూత్రుఁ ♦ డంగాత మని తాను, నాదివహ్ని యగుచు ♦ నంగిరసు ద్వి
తీయవహ్నిఁ జేసెఁ ♦ దెలియఁ దత్సుతుఁ డాబృ,హస్పతియును నవల ♦ నగ్ని యయ్యె.

మార్కండేయుం డగ్నులనానావిధత్వం బెఱింగించుట.

వ. మఱియు నగ్నులనానావిధత్వం బెఱింగించెద నాకర్ణింపు మంగిరసునకు శుభ యను
దానియందు బృహస్పతి బృహత్కీర్తి బృహజ్జ్యోతి బృహద్బ్రహ్మ బృహన్మన
సుఁడు బృహన్మంత్రుఁడు బృహద్భానుఁడు నన నేడ్వురుపుత్త్రులును భానుమతి రాక
సినీవాలి యర్చిష్మతి హవిష్మతి మహామతి కుహువు నన నేడ్వురుపుత్త్రికలునుం బుట్టి
రందు బ్రహస్పతికిఁ జాంద్రమసి యనుదానియందు శంయుఁడు విశ్వజిత్తుఁడు విశ్వభు
జుఁ డూర్ధ్వభాక్కు స్విష్టకృత్తు మన్యువు నన నార్వురు కొడుకులు నొక్కకూఁతునుం
బుట్టి రందు. 419

తే. అధికతేజస్వి యై శంయుఁ ♦ డశ్వమేధ,యాగముల నగ్రపశుహవి♦ర్భాగములను
గలిగి వెలుఁగుఁ జాతుర్మాస్య♦ములనునిష్టు,లందు హవిరాజ్యభాగము♦లతని కయ్యె.

వ. ఆశంయుఁ డనునగ్నికి సత్య యనుదానియందు భరద్వాజ భరతు లనునిద్దఱుకొడుకులు
మువ్వురుకూఁతులుం బుట్టిరి భరతునకు భారతుం డనుపుత్త్రుండును భారతి యను
పుత్త్రికయునుం బుట్టిరి భరద్వాజుండు పౌర్ణమాస్యయాగంబులందు స్రుక్సమోద్య
తంబును బూజ్యం బగుప్రథమాజ్యహవిర్భాగంబు వడయుచుం దేజరిల్లె నాభర
ద్వాజునకు వీర యనునారియందు వీరుం డనుసుతుండు పుట్టి రథప్రభువు రథాధ్వా
నుఁడు కుంభరేతసుఁడు ననునామంబులం దనరి సోమునితోడం జతగ నధ్వరం
బుల నాజ్యభాగంబు గ్రహించుచుం బూజ్యుం డయ్యె నావీరునకు సరయు వనున
తియందు భానుండు పుట్టి యాగ్నేయహవిర్భాగాహ్వానపాత్రుం డయ్యె నాభాను
నకు నెందును ఖ్యాతిం బొందనినిశ్చ్యవనుం డనువాఁడు జనించె వానికి నిష్కృతి
యనుపుత్త్రుండు పుట్టి సర్వభూతపాపనిష్కృతిం జేసి వాసిఁ గాంచె వానికి రుజస్కరుం
డనుపుత్త్రుండు పుట్టి యార్తత్రాణపరాయణుం డై దీనజనస్వనంబునకు విషయ
భూతుం డగుటం జేసి స్వనుం డనం బ్రసిద్ధుం డయ్యె మఱియు బృహస్పతితనుజు
లును శంయునతనుజులు నగువిశ్వజిదాదులవృత్తాంతంబు చెప్పెద వినుము. 421

సీ. ధీశక్తి విశ్వం బతిక్రమించుట విశ్వ,జిన్నాముఁ డై యొకం ♦ డెన్నఁ దగియె
నాహార మఱిగించు♦నంతర్గతాగ్ని యై, విశ్వభుజుండు నా ♦ వెలసె నొకఁడు

బడబాగ్ని యై మీఁది ♦ కడరి నీర్ గ్రోలుట, నూర్ధ్వభాగాఖ్యచే ♦ నొకఁడు దనరెఁ
దన కొసంగెడునాజ్య♦మును స్విష్టముగఁ జేసి, స్విష్టకృ త్తనఁగ నై ♦ చెలఁగె నొకఁడు
తే, భూతములు శాంతిఁబొందుఁ♦ భూరిమన్యు, వునజనించుటమన్యుఁడై ♦ పౌనరేనొకఁడు
మన్యునకు స్వాహయనుకూఁతు♦ కన్యక యును, గాముఁడనెడుకుమారుండు♦ గలిగి రెలమి.

వ. నిజరూపంబునం జేసి నిఖలజగంబులం బేరు వహించినట్టికామునకు శత్రుంజయుం డగునమోఘుండును సుకృతప్రియస్తుతుం డగునుక్థుం డనువాఁడునుం బుట్టె రుక్థునకు మహావా క్కనువాఁడు పుత్రుండు పుట్టె మఱియును. 423

సీ. ఆంగిరసుండుఁ గా♦శ్యపుఁడు వాసిష్ఠుండుఁ, బ్రాణుండు చ్యవనుఁ డ♦నైదుగురును
బరమేష్ఠి కనపచ్చ♦వరతనయునిఁ గన, నెంచి వ్యాహృతులు స్మ♦రించుచుఁ గడు
నిష్ఠాగరిష్ఠు లై ♦ నెఱపిరి పరమోగ్ర,తపము పెక్కేఁడులు ♦ తత్పరతను
దత్తపంబునఁ జేసి ♦ తనయుండు వారికిఁ, బంచవర్ణంబులఁ ♦ బరిఢవిల్లె
ఆ, నగ్నిఁ బోలుశిరము ♦ నర్కుని కీ డగు, బాహుయుగ్మకంబు ♦ బంగరునకు
వన్నె వెట్టినట్టి♦త్వక్నేత్రములు కృష్ణ, వర్ణజంఘ లొప్ప ♦ వాఁడు దనరె. 424

వ. ఇట్లు పంచమహాజనపరికల్పితుండును బంచవర్ణసమంచితుండు నగునక్కుమారుండు పాంచజన్యుం డనం బ్రసిద్ధి గాంచి పంచవంశకరుం డై పదివేలవర్షంబులు బహుల తపంబు చేసి పితృప్రీతికరంబుగా శిరంబున బృహద్రథంతరంబులను ముఖంబున హరి నిం బొక్కిట హరుని బలంబున నింద్రుని బ్రాణంబుల వాయ్వగ్నులను బాహు యుగ్మదంతపుటంబుల విశ్వభూతంబులను వెలయింపం జేసె నాబృహద్రథునకుఁ బ్రణిధి పుట్టెఁ గశ్యపునకు మహత్తరుండు పుట్టె నంగిరసునకు భానుండు పుట్టె బృహద్భానుండు నాఁబడెఁ జ్యవనునకు సౌరభుండు పుట్టెఁ బ్రాణున కనుదాత్తుండు పుట్టె ననుదాత్తునిపరంపరయందు నిరువదియేగురు మహాపురుషులు పుట్టిరి. 425

క. అందుఁ దపుం డనునొక్కరుఁ, డెందుం బ్రఖ్యాతిఁ గాంచి ♦ యేనులు మూఁడై
పొందువడఁ గాంచె నందనుఁ, లం దన దగుభూరియశము ♦ లావతి పోవన్. 426

వ. ఆపమునేవురం గ్రమంబున సుభీ మాతిభీమ భీమ భీమబ లాతిబలులొక్కమొగియును సుమిత్ర మిత్రవ న్మిత్రజ్ఞ మిత్రవర్ధన మిత్రధర్మ లనువా రొక్కచక్కియును సుర ప్రవీర వీర సువేష సువర్చ స్సురహరితు లనువా రొక్కతెగయు నై. 427

ఉ. వారలు భూరితేజమున ♦ వహ్నులతోఁ గలహించి నిచ్చలున్
బోరుచు యాయజూకులు స♦మున్నతయాగములందు విఘ్నముల్



వారకచేయుచుం బ్రబలి ♦ వారిఫలంబు హరించుచున్ ధరన్
గ్రూరత సంచరింతు రతి♦ఘోరతరం బగువర్తనంబునన్. 428

క. *తచ్ఛాంతికి యజ్ఞతం♦త్రంబులందు, నగ్నిచయనంబు గల్పించి ♦ రందు గరుడ
పక్షిపక్షాభిహతులచేఁ ♦ బఠితమంత్ర, శక్తిచే భీతు లై వారు ♦ చనుదు రవల.

వ. మఱియుం దపునకు బృహదుక్థుండును రథంతరుండును భరతుండును బుట్టె మఱియు శివుండు ననునేవురు యజ్ఞప్రవర్తకు లగుపుత్రులును నానావిధరాక్షసులును మను ష్యులుం బుట్టి రందు. 430

సీ. అగ్రజుం డాఢ్యుఁ డై ♦ యగ్ని వేల్చెడుతఱి, గలిగినయ ష్టాగ్ర♦గణ్యుఁ డయ్యె
మిత్రవిందుం డన ♦ మెలఁగి రెం డగునాతఁ, డధ్వర్యుకృతహవి ♦ స్సంద నయ్యె
మూఁడవవాఁ డెల్ల♦భూములయందును, నియమవ్రతస్థుఁ డై ♦ నెగడ నయ్యె
నాలవవాఁడు తా♦నన్నింటిఁ గొల్చెడివారి, కిష్టుఁ డై బహుపుష్టి ♦ నీయ నయ్యె
తే, నే నగునతండు శివపూజ ♦ లెపుడు చేసి, భక్తు లగువారిదుఃఖముల్ ♦ పాయఁ ద్రోచి
యఖిలలోకములకు శివం ♦ బాచరించి, ఘనయశం బంది జగతి వి♦ఖ్యాతుఁ డయ్యె.

మ. †పురుహూతుండు తపఃఫలం బెఱిఁగి పెం♦పున్ సొంపుఁ గాంచంగ ను
స్థిరుఁ డై చేసి తపంబు గాంచె మనువుం ♦ దీపించి యాతండు భా
స్వరతేజుం డయి బ్రాహ్మణుల్ గొలువఁ బ్రా♦జాపత్యునిం గాంచె న
ప్పురువంశంబునఁ బుట్టి రగ్ను లయి సం♦భ్యుం డావసథ్యుండునున్. 432

వ. మఱియు నంగిరఃపుత్రుం డగుబృహద్భానునకు సూర్యపుత్రిక లగుబృహద్భానయు నిశయు ననువారు భార్య లై రందు బృహద్భానకు బలఁడుఁ మన్యువు విష్ణువు నాగ్రయణుండు ననునల్వురుకొడుకులును నిశకు నగ్నీషోము లనునిర్వురుకొడుకులు నొక్కకూఁతునుం బుట్టిరి వారివృత్తాంతం బెట్టి దనిన. 433

సీ. దుర్బలత్వంబునఁ ♦ దొడరుభూతములకు, బల మిచ్చి ప్రథముండు♦ బలదుఁ డయ్యె
భూతముల్ నశియింపఁ♦ బుట్టి ద్వితీయుండు, మన్యు వెసఁగ మన్యు♦మంతుఁ డయ్యెఁ
బర్వములన్ హవి♦ర్భాగార్హుఁ డై ధర, వెలసి తృతీయుండు ♦ విష్ణుఁ డయ్యె
నింద్రుతోఁ జతుర్థుఁ♦ డెపుడాగ్రయణముఖ, క్రతుభుజుం డగుట నా♦గ్రయణుఁ డయ్యెఁ
తే, గడమయిర్వు రగ్నీషోము♦ఘనసవములఁ, బరఁగెడుప్రధానపశుహవి♦ర్భాగములను
గొనఁగనగుచు నగ్నీషోము♦ లనఁగ వెలసి, యిందఱును వహ్నిపదమునఁ♦బొందుపడిరి.

* చయనములలో గరుడచయన మన నొకటి; అందు నిష్టకలతో గరుడాకృతిం జేయుదు రది యెఱుంగునది. ‡ పురువంశము=గొప్పవంశము.

వ. మఱియు నాబృహద్భానున కింశోకదేవేరియం దేవురగ్నులు పుట్టి రం దగ్రిజుం డైన వైశ్వానరుండు చాతుర్మాస్యంబులం బర్జన్యసహితుండై బ్రాహ్మణార్చనంబు గ్రహించు ద్వితీయుం డైనవిశ్వపతి విశ్వంబునకుం బతి యై స్విష్టకృదభిఖ్యుండు బ్రాతుం డయ్యెం దృతీయుం డైనప్రజాపతి సకలప్రాణిలోకసమాశ్రయుం డై శబ్దరూపసాధనుం డై సన్నిహితుం డై యుండు నతండు హిరణ్యకశిపుపుత్రిక యగురోహిణీకన్యం బెండ్లియాడి పుత్రులం గాంచి హుతంబులు వహించి హుతవహుండు హుతాశనుండు నన బ్రసిద్ధిం గాంచెం జతుర్థుం డైనకపిలుండు సాంఖ్యయోగప్రవర్తకుం డై జగన్నుతుం డయ్యెం బంచముం డైనయగ్రణి సర్వకర్మాగ్రణి యై దీపించె నని మార్కండేయుండు వెండియు. 435

క. ఇప్పాట నంగిరఃకుల, మొప్పఁగ భువనంబునందు ♦ హుతభుక్పదముల్
దప్పక కొని త్రిజగజ్జన, మెప్పుడు వినుతించునట్టి♦యెసక మెసంగన్. 436

తే. గార్హపత్యాదివహ్ను లేఁ♦కారణమున, నైన దుష్టంబు లై చను♦నేని వాని
కలరునట్లు ప్రాయశ్చిత్త♦ములు వచింపఁబడియె వివరింతు విను మిట్టి♦బడినివాని.

వ. అగ్నిహోత్రంబు లన్నియు నాశుగవశంబున నొండొంటితో నంటినను దావంబున నావరింపంబడినను శుచి యనునగ్నికిని దక్షిణాగ్నిగార్హపత్యాహవనీయాగ్నులతోడం గూడిన వీతి యనునగ్నికిని రజస్వలాజనం బగ్నుల స్పృశించెనేని దస్యుమంతుం డనునగ్నికిని జాతాశౌచమృతాశౌచంబులు గలిగినప్పుడు సురమంతుం డనునగ్నికిని దిరాత్రంబు లార్తుం డై జనుం డగ్ని వేల్వఁడే నుత్తరాగ్నికిని దర్శపూర్ణిమానేష్టిలోపంబునఁ బథికృదగ్నికిని సూతికాగ్నిసంపర్కంబున నగ్నిమంతుఁ డనునగ్నికిని నష్టాకపాలపురోడాశనిర్వపణంబు చేసి యిష్టి చేయునది యని చెప్పి మార్కండేయుండు మఱియు నిట్లనియె. 438

అద్భుతాగ్నివృత్తాంతము.

తే. అపుఁ డనువహ్ని సహునకు ♦ నాత్మజాత, యైనముదితను బెండ్లి యై ♦ దానియందు
నద్భుతునిఁ గాంచె నయ్యగ్ని ♦ యతిశయిల్లె, నెల్లభూతంబులకును దా♦ నేలిక యయి.

చ. అహరహ మింద్రముఖ్యులకు ♦ నాతఁడు హవ్యము మోచి యిచ్చుచున్
గృహపతి నాఁగ లోకములఁ ♦ గీర్తితుఁ డై ప్రథమాగ్ని యై మహా
మహుఁ డయి సర్వపూజ్యుఁ డయి ♦ మర్త్యమునం దగియున్ హుతంబులన్
వహనమునం దశక్తుఁ డయి ♦ వాడి బడల్పడి గోడు మూఁదఁగన్. 440

వ. అధ్వరుం డనువానిం బిలిచి యొక్కనాఁ డిట్లనియె. 441



తే. హవ్యవహనమునందు నే ♦ నలసినాఁడ, దుర్బలుఁడ నైతి వేల్పుల♦తోడ వేఁగ
నోప నిఁక నీవు హవ్యవ♦హుండ వగుము, కొంత యేనియు నాకు వి♦శ్రాంతి గలుగ.

వ. అని వాని నొప్పించి పంచి తా నేరికిం జెప్పకుండం బోయి సముద్రంబునం జొచ్చె నంత వియచ్చరు లాతనిగతి నన్వేషించుచు నెల్లకడలం బరిభ్రమించుచుండ మీనంబు లాహవ్యవాహనునునికి వారికిం దెలియం జెప్పుటయు నప్పు డప్పావకుండు. 443

చ. అలసి సముద్రమధ్యమున♦యందు సుఖంబుగఁ డాఁగి యుండ నీ
జలచరముల్ ననుం దెలిపె ♦ జాలి యొకింతయు లేక వేల్పుమూఁ
కల కదిగాన వీనిని జ♦గంబునఁ దెల్లముగా వధించి పె
క్కు లగుతెఱంగుల న్మనఁగి♦కొందు రటంచు శపించెఁ గ్రుద్ధుఁ డై. 444

తే. హవ్యవహనమునకుఁ దన్ను ♦ నమరు లెల్ల, వేవిధంబులఁ బ్రార్థింప ♦ విసివి నేను
జాల ననుఁ జంపకుం డని ♦ సాఁరెబలికి, వారినిర్బంధమునఁ జేసి ♦ వాయుసఖుఁడు. 445

వ. ఎల్లవారుం జూచుచుండ శరీరపరిత్యాగంబు చేసి ధరాతలంబునం బ్రవేశించె నంత నతనిశరీరమందలిపూయగంధంబున గంధకంబును నస్థుల దేవదారువులును శ్లేష్మంబున స్ఫటికంబును జిత్తంబున మరకతంబును యకృత్తునఁ గృష్ణాయసంబును నఖంబుల నభ్రకపటలంబును సిరాజాలంబున విద్రుమంబును మఱియుఁ దక్కనుం గలశరీరభాగంబుల ననేకధాతువులును బుట్టె న ట్లద్భుతుండు శరీరపరిత్యాగంబు చేసి భూతలంబునం దపంబు సేయుచుండ భృగ్వంగిరఃప్రముఖు లైనమహర్షు లాతనినిజతపఃప్రభావంబున నాప్యాయితుం జేయుటయు నతండు తేజస్వి యై తపంబునుండి విడివచ్చి ఋషులతేజంబునకు వెఱచఱచి మఱియు మహార్ణవంబునం బ్రవేశించి యడంగి యుండె నంత. 446

ఆ. అట్లు వహ్ని నష్టుఁ ♦ డైన నధర్వుని, నాశ్రయించి కొలిచి ♦ రఖిలజనులు
నతఁడు నగ్నికార్య ♦ మాచరించుచు నబ్ధిఁ, ద్రచ్చి యద్భుతాగ్నిఁ ♦ దెచ్చె వేఁడి. 447

తే. తెచ్చి పూజించి మితమా ♦ దేవకార్య, మీవు చెల్లించు టొప్పు నీ♦యిచ్చినట్టి
పదమునీవందుమనుటయు♦మొదటియట్లు, హవ్యవహుఁడయ్యెజగమెన్న♦నద్భుతుండు.

వ. అతండు నిజోద్యోగంబు నిరసించి వివిధదేశంబులం బరిభ్రమించునాఁడు సింధువు పంచనదము దేవిక సరస్వతి గంగ శతకుంభ సరయువు గండకి చర్మణ్వతి మహి మేధాతిథి తామ్రపర్ణి వేత్రవతి కౌశికి తమస నర్మద గోదావరి వేణ యుపవేణ భీమ బడబ భారతి సుప్రయోగ కావేరి ముర్మర తుంగభద్ర కృష్ణవేణి కపిల శోణ లోనగునదీపదంబులం బ్రవేశించెఁ గావున నవి పవిత్రంబు లై ప్రశస్తంబు లయ్యె నయ్యద్భుతు

నకుఁ బ్రియ యనుదానియందు విభావసి యనుపుత్రుండును బుట్టె నిట్లు ప్రభూతం బైనపావకవంశంబునకుఁ బ్రతివచ్చి సోమవంశంబు నసంఖ్యాకం బయ్యె మఱియు నత్రివంశంబున మానసపుత్రులు పెక్కండ్రు పుట్టి సృష్టి గావింపం గడంగిన నత్రి వారి వారించె నవు డతనిగాత్రంబునుండి వేనవేలు హుతాశనులు పుట్టి రిట్టి రెండ త్రైనం గాని తేజం బొక్కటియ యగ్నిష్టోమంబున ననేకయజ్ఞంబు లుత్పన్నంబు లైన ట్లంగిరసుతేజంబున ననేకాగ్ను లుత్పత్తిల్లి రిది యాగ్నేయవంశప్రకారం బింక నద్భుతునకు నద్భుతపుత్రుం డగుకార్తికేయువృత్తాంతంబు చెప్పెద దత్తావధానుండ వగుమని మార్కండేయుండు వెండియుఁ బాండవేయున కి ట్లనియె. 449

ఇంద్రుఁడు కేశ్యాసురుం దోలి దేవసేనం గాచినకథ.

తే. దేవతలు పూర్వదేవతల్ ♦ తెగి రణంబు, చేసి రొకకాలమున మున్ను ♦ వాసి మీఱు
నీసునం జేసి భుజబల ♦ మినుమడింప, వేల్పు లోడి రవుడు తొంటి♦వేల్పులకును. 450

చ.*తనబల మట్టు లోటువడి ♦ తత్తఱిలం గని పాకశాసనుం
డనుపమదైన్యదుఃఖమున ♦ నాఱడివోయెను దేవసైన్య మె
య్యనువున దీని నోమ నగు♦నట్టిఘనుం బడవాలు నొంద నౌ
నని మదిఁ జింతసేయుచుఁ బ్రి♦యం బఱి పోయెను మానసాద్రికిన్. 451

వ. కార్యచింతాపరుం డై యతం డేమియుం దోఁప కందు నితస్తతఃపరిభ్రమణంబు గావించుచుండె నంత. 452

శా. పాపాత్ముం డొకరాక్షసుం డొకఁడు నన్ ♦ బల్మిం జెఱం బట్టె మీ
రీపాపంబును బాపి నన్నుఁ గరుణ ♦ న్వీక్షింపరే కావరే
మీపాలం బడితిన్ మహాత్ము లెవరే ♦ మీలోన లేకుందురే
యాపద్బాంధవులార! పుణ్యధనులా♦రా! మీకు నే మ్రొక్కెదన్. 453

క. అనునాఁడుకూయి దీనం,బును హీనం బగుచు వచ్చి ♦ పురుహూతునకున్
విన నయ్యె నవుడు తనమదిఁ, గనఁబడుదిగు లినుమడింపఁ ♦ గలయది యగుచున్

వ. అంతఁ గరుణాతరంగితాంతరంగుం డగునాపురందరుండును. 455

మ. ఇదె నే వచ్చెద నోడ కోపడఁతి నీ♦యిక్కట్టు లిప్పట్టునన్
దుది ముట్టించెద నంచు సంభ్రమముతోఁ ♦ దోఁగాడునంత న్మహా
గదఁ జేఁ బూని కిరీటియుం గవచి యై ♦ గ్రావంబు నా నొప్పి భీ
ప్రదుఁ డై యొక్కలతాంగి నీడ్చుకొని పోవం గాంచెఁ గేశ్యాసురున్. 456

* బడవాలు = సేనాని.



వ. వాని నెలుంగెత్తి పిలిచి యి ట్లనియె. 457

చ. నిలు నిలు రాక్షసాధమ! వి♦నీలకచన్ లలితాంగి దీని ని
ట్టులమటపాలు చేసి యెట ♦ కాఁగతి నీడ్చెదు పట్టి చెట్ట వై
తెలియుదు గాదె నన్ను జగ♦తీధరకోటుల నుగ్గునూఁచగాఁ
జలిపినయట్టివజ్రము భు♦జంబునఁ దాల్చినవాఁడ జిష్ణుఁడన్. 458

తే. బుద్ధి గలవాఁడవేని నా♦బుద్ధి విశ్వ,సించువాఁడవయేని యీ♦మించుఁబోఁడి
వీఁడి పొ మ్మట్లు గాకున్న ♦ పీడిపోవు, నుసురు నీమేనినుండి నా ♦ నసుర కనలి. 459

శా.*గీర్వాణేశ్వరుఁ గాంచి యి ట్లనియె నో♦కిగ్గాడి! యెగ్గాడి తీ
పర్వాబ్జానన నే వరించితిని నా♦ప్రాణేశ యీ నడ్డు రా
కార్వేరం బొనరింప కే నరిగెదన్ ♦ ప్రాణంబు రక్షించుకో
మ్మార్యాగ్నిం బడ కేగు మన్న నమరా♦ధ్యక్షుం డు రూక్షంబుగన్. 460

తే. దనుజుఁ డలకొని మాఱొడ్డి ♦ దర్ప మేర్పడంగ నిల్చినఁ బెల్చఁ గ♦డంగి కేళి
మిడుఁగుఱులు రాల గదఁద్రిప్పి ♦ వడిగ విసరి, వైచె నార్చుచు నింద్రుపై ♦ వైరమునను.

సీ. నడుమఁ దుత్తునియలై ♦ పడ దాని ఖండించె, వజ్రి వజ్రంబున ♦ వాఁడి మెఱసి
క్రుద్ధుఁ డై సోఁ కొక్క♦కుధరకూటం బెత్తి, శతమన్యు నెత్తిపైఁ ♦ జిఱుక వైచె
నేది వచ్చెడుదాని ♦ నింద్రుండు దంభోళి, నేసె నేసిన నది ♦ యుడిసి పడియెఁ
బడియెడునప్పు డా♦భగ్నశృంగము దాఁకి, నొచ్చి నక్తంచరుఁ ♦ డుచ్చలించి

తే, చేయునది లేక కన్నియ♦చేయి విడిచి, వెగడు గుడుచుచు వడివడి ♦ వెడలి నడచె
నవుడు దేవేంద్రుఁ డాయమ ♦ నరసి పలికె, నవ్వ యెవ్వరిదాన వీ ♦ వెవ్వ రనుచు.

తరు. అనుడు నాయమ యను♦నమరేంద్రుపాలి♦కరుదెంచి మ్రొక్కి న♦యమున నోయయ్య
దినకరాభుం డయి ♦ తిరుప్రజాప♦తికిఁ బిడ్డ నగుదాన ♦ దేవసేనాఖ్యఁ
దనరినదాన నే♦ దైత్యసేనాఖ్యఁ ♦ దగు నాభగిని మేము ♦ తండ్రినిదేశ
మున నిమ్మహాశైల♦మున విహరింప ♦ మును వచ్చియుంటిమి ♦ ముద మొప్ప నిటకు.

ఉ. అప్పుడు వీఁడు నిచ్చలు న♦మాగతుఁ డై మముఁ గాంచి మోహపుం
జొప్పునఁ గప్పఁగాఁ బడి ప్ర♦సూనశరాసనసాయకవ్యథన్
దప్పి వివేకముం దనకుఁ ♦ దన్వులఁగా వరియించె నంత మా
యప్ప మనం బొసంగెఁ దగ ♦ దంచని నేను దిరస్కరించితిన్. 464

* కిగ్గాడి = అంబేద. ఆర్వేరంబు = ద్వేషము.

వ. అంత నాదైత్యాధముం డాదైత్యసేనం గొని చనియె నంతనపోక వెండియు వచ్చి
న న్నిట్లు బలాత్కారంబునం బట్టుకొని పోవుచుండఁ గృపాళుండ వై నన్నీ విట్లనుగ్రహిం
చితే నింక నీనిర్దేశించినవరుని వరించుదాన ననిన దేవేంద్రుండు దాని కిట్లనియె. 465

తే. అమ్మ! మాతృష్వసేయ వౌ ♦ దరయ నీవు, నేను దాక్షాయణులబిడ్డ ♦ లైనవార
మేది నీకు హితం బగు ♦ నేను దానిఁ, గడఁగి చేయంగ నుంటి న ♦ గ్రజుఁడఁ గాన. 466

వ. నీయభీష్టం బెఱింగింపు మనిన దేవసేన దేవేంద్రున కిట్లనియె. 467

క. నే నబల నగుట నన్నుఁ, గా, మానుగఁ బాలించునట్టి ♦ మాన్యుఁడు బలియున్
మానధనుం డై యుండఁగ, గా నాజనకుండు వరము ♦ కరుణించె నెడన్. 468

వ. కావున నామగం డెట్టి బలాఢ్యుండు గావలయునో చెప్పెద నవధరింపు మని మఱి
యును. 469

ఉ. *అట్టడలై సురాసురులు ♦ యక్షులు రాక్షసులుం బిశాచముల్
కట్టడఁ గట్టి వచ్చినను ♦ గాని రణాంతరమం దజయ్యు డై
నెట్టన బెట్టిదుం డగుచు ♦ నీ కనుఁ గా జెగజెట్టి జోదు నా
నట్టిఁడు నాకు భర్త యగు ♦ నట్టులుగాఁ గరుణింపు మగ్రజా. 470

వ. అనిన దేవేంద్రుం డట్టివాఁ డెవ్వం డగునొక్కొ యని యొక్కింతవడి స్వాంతంబునం
జింతించునంతలో నది రౌద్రిముహూర్తంబును సోమసూర్యసంగమం బగునమా
వాస్య యగుటయు నవుడు సాంద్రసంధ్యారాగరంజితం బై సాగరం బొప్ప సురాసుర
సంగ్రామరంగం బై లోహితప్రభాభాసమానం బై నపూర్వభూభృచ్ఛిఖరంబున నరుణ
కిరణుం డుదయించుచుండ భృగ్వంగిరఃప్రభృతులు పృథగ్విధమంత్రంబులు వ్రేల
వేల్చినహవ్యంబులు వహించి హుతవహుండు ద్రుహిణమండలంబు సొచ్చుటయుం
గని యిది సూర్యచంద్రాగ్నిసంగమం బగురౌద్రముహూర్తం బివుడు సూర్యాచంద్ర
మఃపరివేషంబునుం గానిపించు నిట నీసింధునదియుఁ బ్రత్యస్రగ్వాహిని యై యున్న
యది నిప్పు లుమియుచు నీనక్క యుదయార్కు నెదుర్కొని వాపోవుచున్న దీ
శుపాంతంబున ఘోరయుద్ధం బగున కాఁ దోఁచెడిని. 471

శా. ఏతాదృగ్విధకాలశక్తియును నేఁ ♦ డిం దానిమిత్తంబులుం
జేతోవీథిఁ దలంచుకోఁ దెలియ నా ♦ శీతాంశుసూర్యానలో
ద్భూతుం డైనమహామహుం డొకరుఁ డీ ♦ పూఁబోఁడికిన్ భర్త యై
ప్రీతిం గూర్చును నెల్లలోకములకుం ♦ బెంపొందు దేవాఘముల్. 472

* అట్టడలు = గుంపులు. కట్టడ = నియమము



క. అని నిశ్చయించి కన్యం, దనవెంటం గొని గమించి ♦ తామరచూలిం
గని మ్రొక్కి దేవసేనకు, ననురూపేశ్వరు నొసంగు ♦ మని వేఁడుటయున్. 473

మ. శతమన్యుం గని బ్రహ్మ యి ట్లనియె నీ ♦ సంకల్ప మైనట్టు ల
ద్భుతచారిత్రుఁడు విక్రమాస్పదుఁడు సం ♦ పూర్ణప్రభావోదయుం
డతిమాత్రప్రభ నొక్కరుం డెసఁగు నీ ♦ యబ్జాక్షికిన్ భర్త యా
ధృతి సేనాని యగున్ భవద్ధ్వజినికిం ♦ దీపించు లోకంబులున్. 474

ఆ. అనినఁ బ్రీతుఁ డగుచు ♦ నమరాధినాథుఁ డ, క్కంజగర్భు మ్రొక్కి ♦ కన్యతోడ
మరలి వచ్చె ధరణి ♦ మండలంబున వసి, ష్ఠాదిమునులు చేయు ♦ యాగమునకు. 475

వ. ఆసప్తర్షు లమావాస్యహోమంబు సేయుచుండ నందు హవిర్భాగంబు లందుకొన
నెల్లవేల్పులు నాసన్ను లై రప్పుడు. 476

—♦ అద్భుతాగ్ని సప్తర్షిపత్నులం గని మోహించుట. ♦—

క. సుసమిద్ధుఁ డగుచు హుతవహుఁ, డెసఁగన్ మును లిష్టి చేసి ♦ యెల్లసురలకున్
బ్రసమీక్షించి హవిస్సులు, వెస నిచ్చిరి వేదమంత్ర ♦ విహితక్రియలన్. 477

తే. మునిసమాహూతుఁ డై హవ్య ♦ ముల వహించు
నద్భుతుఁడు సూర్యమండల ♦ మందు నుండి
వచ్చి యాహవనీయమం ♦ దిచ్చ వేల్చు
హుతముల గ్రహించి దేవళ్ల ♦ కొసఁగె నవుడు. 478

మ. హుతముల్ వాఙ్నియమంబులోఁ బడసి యెం ♦ తో నిష్ఠమై సేగున
ద్భుతనామాగ్ని తదాశ్రమంబున లస ♦ ద్రూపంబులం బొల్చుత
త్సతులన్ మన్మథరాజ్యలక్ష్ము లన నై ♦ తళ్కొత్తువారిన్ సదా
పతిసేవాంచిత లైనవారిఁ గనియెం ♦ బ్రాంతంబునం జూడఁగన్. 479

సీ. బంగారువేదుల ♦ సింగారమును గల్గి, పొంగారుచున్నట్టి ♦ పువ్వుఁబోండ్లఁ
బండువెన్నెలలతో ♦ నిండుజాబిలిసొంపు, గండరింపఁగఁ జాలు ♦ క్రాలుఁగంట్ల
వేల్పునప్పును పసం ♦ బొల్చెడునవలార్చిఁ, బెల్చ నోర్చెడు చంద్ర ♦ బింబముఖుల
మొక్కవోవనికాంతి ♦ దిక్కుల వెలిఁగించు, చుక్కలో యన నొప్పు ♦ సుందరులను

ఆ. గాంచి వారివాలుఁ ♦ గన్నులతీరును, జన్నుదోయిసొగసు ♦ జడలబారు
తనమదిం గలంపఁ ♦ దహతహ పడి మారు, బారి కగ్గ మయ్యెఁ ♦ బావకుండు. 480

చ. కలఁగును బెచ్చు నూర్చును వి ♦ కారములొందును గన్ను మోడ్చు లోఁ
దలఁచును దద్దఱిల్లును వి ♦ తాకుపడు న్వగఁ డొందుఁ గుందు న

ర్మిలిఁ గొను సొక్కుఁ గ్రుక్కిళులు ♦ గ్రింగుసు బొంగు నలంగుఁ గాని లోఁ
గలవెత యేరికిం దలఁపఁ ♦ గాఁ దలపోయఁడు కాలనిర్మితిన్. 481

చ. సరగున లేచి నాళసము ♦ సందిటఁ జేర్చెడు మోవిపానకం
బరయఁగ మోముఁ ద్రిప్పెడుఁ బ్రి♦యంబున నేమియొ పల్కరించెడున్
సురుఁగఁగఁ జూచెడుం గినిసి ♦ సోలెడు వ్రాలెడు నవ్వెడుం గడున్
విరహము నొందెడుం దెలివి ♦ వీడి యతండు దురంతచింతమై. 482

వ.*ఇట్లు మునిపత్నులం గని సంక్షుభితాంతరంగుండై వైశ్వానరుండు వారిసమాగ
మం బభిలషించి వీరి నెట్లు దక్కఁగొందునో యని కొందలంపడుచు గార్హప
త్యంబునం బ్రవేశించి. 483

చ.†పిలఁదుక లెప్పు డెప్డు నిజ♦వేది నలంకృతి సేయ రా మదిం
దలఁచు ననుక్షణంబు ముని♦దారగతిం గనుఁ జెప్ప వేయ కా
పొలఁతుక లొక్కయప్డు తన♦పొంతకు వచ్చిన హెచ్చి యర్చులన్
నిలువునఁ గౌఁగిలించునటు ♦ నిక్కును బొక్కును సొక్కు నొక్కటన్. 484

వ.‡ఇట్లు మోహపరవశుండై పరశురాముం డకామ లగుమునిరామలసమాగమంబు
దుర్లభంబ కా వగచి కామసంతప్తచిత్తుండై తత్తఱంపడి దేహత్యాగంబు సేయ
నిశ్చయించి కాననాంతరంబునకు నిర్గమించి పరిభ్రమించుచుండె నాక్షణంబున దక్ష
పుత్రి యగుస్వాహాదేవి హవ్యవాహునిచెయిదం బెల్ల నెఱింగి తాన వాని వరించి
యున్నయది యగాన నది యద నని కామార్తయై కామార్తుండైనవీని నే నాస
ప్తర్షిపత్నులవేషంబునం జేసి వంచించి నామనోరథం బీడేర్చుకొందుం గాక యని
తలంచి మును మున్నంగిరఃపత్ని యగుశివ యనుదానిరూపుఁ దాల్చి పావకాభ్యాశం
బునకుం జని యిట్లనియె. 485

—♦— స్వాహాదేవి మునిపత్నులరూపుఁ దాల్చి యగ్నిం గూడుట. —♦—

చ.§శివ యనుదాన నంగిరసు♦చెల్వను నీ దగుచెల్వ మారయన్
దవిలె మరుల్ నినుం గలయఁ ♦ దత్పరతం జనుదెంచితి న్మని
ప్రవరులపత్ను లెల్లరును ♦ బంపఁగ వచ్చితి నామనోరథం
బవు నని తీర్పకున్న మద♦నానలపాతఁగ నెన్ను మద్భుతా. 486

* గార్హపత్యము = ఒకానొకవహ్నికుండము. † ఒక్కటన్ = ఏకకాలమందు.
‡ పరశురాముఁడు = వేదియందు రమించువాఁడు; అగ్ని. అభ్యాశము = సమీపము.
§ మరుల్ = మోహము. తత్పరత = ఆసక్తి.



ఆ. అనుడు నాతఁ డనియె ♦ నతివ నేఁ గామార్తిఁ, దవిలి యుంట నీవుఁ ♦ దక్కనుగల
నారు లెల్లెఱింగి ♦ రోరమణీ! వార, లేరి యనుడు నామె ♦ యిట్టు లనియె. 487

చ. వలచితి మేము నిన్ను జన♦వత్సల నీపయి మాకుఁ గూర్మియుం
గలుగును గాని నీవలనఁ ♦ గల్గెడునో యొకనేగి యంచు నిం
దెలియక మున్ దలంకితిమి ♦ దేవరచిత్తము కేటతెల్లమై
తెలియఁగ వచ్చె నేఁటికి మ♦దిం గలకొం కది దీర నయ్యెడిన్. 488

వ. అని మఱియును. 489

చ. అనఘ! మదీయమానస మ ♦ దంతయు నీపయిఁ జిక్కెఁ దాళలే
ననువఱి పోయితిన్ మదను♦నమ్ములవేఁడికి వేఁడుచుంటి నన్
గనికర మొప్ప నీదుబిగి♦కౌఁగిటఁ జేర్పుము తీర్పు మీవ్యథల్
చనియెద వేదియందు రల♦చానలును న్నినుఁ గూడువేడుకన్. 490

సీ.*అనుటయు నొం డాడ ♦ కనలుండు దాని న,నుగ్రహబుద్ధిఁ బ♦రిగ్రహించె
నదియు నయ్యద్భుతు ♦ నతులరతులఁ దేల్చి, తత్తేజము గ్రహించి ♦ తరల నెంచి
య ట్లొగునెడల ము♦న్యంగనలకు రట్టు, చుట్టఁ బెట్టించిన♦చెట్ట నగుదు
ననుచు సుపర్ణియై ♦ చనియె వనాంతర,ములనుండి వడి శ్వేత♦భూధరమున
తే. కదియు రక్షఃపిశాచభూ♦తావృతంబు, వివిధమృగపక్షిగణపరి♦వేష్టితంబు
సప్తశీర్షమహానాగ♦సంభృతంబు, రత్నకాంచననిస్తుల♦ప్రస్తరంబు. 491

వ. ఇట్లు జగద్విఖ్యాతం బగుశ్వేతాచలంబునకుం జని దానిపృష్ఠభాగంబున శరవణస్తంబ
సంభృతం బగునొక్కస్వర్ణకుండంబున నాశుక్రంబు నిక్షేపించియు. 492

చ. గరితలమిన్నయై యశము ♦ గాంచు నరుంధతిరూపు గాక త
త్తరుణి తపఃప్రభావమునఁ ♦ దక్కటివా రగుమానిపత్ను లా
ర్వురవరరూపముల్ వరుస ♦ నొకొక యుండ ధరించి యిట్లు నే
ర్పరితన మేర్పడన్ గదిసి ♦ పావకుతో రమియించె నెంచఁగన్. 493

వ. ఇట్లాఱుమాఱు లగ్నిం గూడి క్రీడించి ప్రస్కన్నం బయినతదీయతేజంబుఁ బ్రతి
గ్రహించి కాంచనకుండంబునఁ బ్రతిపద్దివసంబునం దాని నిక్షేపించుటయు నందు.

—♦— కుమారస్వామియవతారము. —♦—

తే. విదియ వ్యక్తిభవించి య♦వ్విర్య మొల్లఁ, దదియ శిశువై చవితి నంగ♦తతిఁ జెలంగ
లోహితాభ్రంబుపై నొప్పు♦లోకచక్షు,వట్లు దీపించుచుం గుహుఁ ♦ డవతరించె.

* సుపర్ణి = మంచి ఱెక్కలు గలది (గరుడి).

తే. ఆఱుశిరములు పదియురెం ♦ డైనకన్ను,లన్ని చెవు లన్ని చేతులు ♦ నన్ని చెక్కు-
లొక్క కడుపొక్క కంఠము♦నొక్క ఱొమ్ము, రెండుకాళ్లును గలిగి స్కం♦దుండు పొదలి.

సీ. అటఁ దొల్లి త్రిపురఘ్నుఁ ♦ డై హరుం డిడినవి, ల్లది గొని సారించె ♦ నారవంబు
బహుభైరవం బయి ♦ పర్వ నటకు వచ్చెఁ, బ్రిబలి చిత్రంబు నై♦రావతంబు
నా రెండుహస్తుల ♦ హస్తద్వయిం బట్టి, యొకశయంబున శక్తి ♦ నూని మఱియుఁ
గుక్కుటం బొక్కటిఁ ♦ గొని యొక్కకరమున, రెండుచేతుల శంఖ ♦ మొండుపూని

తే, యదరి పూరించి యాకస ♦ మప్పళించి,కేలుదుగఁ దిప్పి యాడుచు ♦ లీలఁ దనదు
నాఱునోళ్లను లోకత్ర♦యంబు మ్రింగు,నట్లు తెఱచి బి ట్టార్చె భ♦యంకరముగ.

గీ. మించి కూరాస్త్రముల నేసి♦ క్రౌంచశిఖరి,వ్రక్కలించి యంచలకు మా♦ర్గం బొనర్చె
మేరుగిరి కేగ నాతఁడు ♦ భూరిశక్తి,శ్వేతగిరిశృంగమును గూల్చి ♦ పేర్చి యార్చె.

వ. అమ్మహాసంరంభంబున. 499

శా.*ఉర్వీధ్రంబులు మూఁడు నాల్గు వడిమై ♦ నుఱ్ఱూఁత లూఁగెం బ్రభూ
తోర్వాగ్నిప్రభతోడ రేఁగి కలఁగెన్ ♦ హా హా యనన్ సంద్రముల్
సర్వాశల్ కను వ్రయ్య లయ్యె ధరణీ♦చక్రంబు కంపించె స
ప్తార్వుండుం గతి దప్పె లోకములఁ జీఁ♦కయ్యెం భయభ్రాంతిమై. 500

క. అట్టిమహోత్పాతంబులు, పుట్టుట గని మాను లెల్లఁ ♦ బ్రోగయి యొకచో
దిట్టపడి శాంతివిధు ల,ప్పట్టునఁ గావించి రొగి శు♦భం బొడఁగూడన్. 501

వ. అప్పంచమీదినంబున నెల్లపంచజనులుం బఱతెంచి క్రౌంచారిం గాంచి శరణంబు వేఁడి భయంబు వీడి రుర్వియు నుర్వీధ్రంబులు నతని సేవించి ప్రకృతిం గాంచె నయ్యవసరంబున. 502

తే.‡చైత్రరథవాసు లెల్లరు ♦ నాత్రముపడి, యొక్కచోఁ గూడి మన కిట్టి♦యుక్కుపాటు
చెడిప లగుమానిపత్నుల♦తోడుసువలనఁ,గలిగెఁబో యని మిక్కిలి ♦ కలఁగి రవుడు.

వ.†అంతఁ గొంద ఱిది యగ్నివలనం బొడమినయనర్థం బనియు మఱికొందఱు సుపర్ణి వలన నైనయుపప్లవం బనియు నందఱు నన్నిచందంబులం గుందిరి కాని కొంద ఱైన నది స్వాహా చేసినసాహసం బని తలంపం జాలరై రప్పు డది యంతయును విని గరుడి కుమారుపాలికిం జని. 504

క. నా కీవు కొడుక వైతివి, నీ కే జనయిత్రి నైతి ♦ నీతివిధమునన్
జేకొను మన నాతం డొ,గా కని మన్నించెఁ దల్లిఁ ♦ గా నెంచి మదిన్. 505

* చీఁకు = గ్రుడ్డి. సప్తార్వుండు = సూర్యుఁడు.
‡ చైత్రరథము = కుబేరోద్యానము. తోడుసు = సంబంధము. § గరుడి = వినత.



వ. అనంతరంబ. 506

కవిరాజవిరాజితము. తమనతు లగ్నికిఁ♦దార్కొని క్రౌంచవి♦దారణుఁ గాంచిరటంచుజనుల్
గుమిగొని తా రను♦కొంట చెవిం బడఁ ♦ గోపముఁ దాపము హెచ్చఁగ నా
యమివరు లార్వురు ♦ నానతుల న్విడ♦నాడిరి త ప్పిట లేదు గుహుం
డమరెను నా కని ♦ యచ్చటికిం జని ♦ యగ్ని నెలంతుక దెల్పెననున్. 507

తరువోజ. అనఘుండు ఘనుఁడు వి♦శ్వామిత్రుఁ డంత♦నట కేగి మీపత్ను♦లందు దోషంబు
గనుఁగొన విసుమంత ♦ గాని లే దగ్ని♦కలవృత్త మెల్లను ♦ గంటి నే నంటి
మునులార! స్వాహా దా ♦ ముదమొప్ప నిట్లు ♦ పొనరించె నామె కా♦పుత్రుండు పుట్టె
నని చెప్పిన న్వార ♦ లతివల నొల్ల ♦ రైరి లోకాపవా♦దాతిభయమున. 508

విశ్వామిత్రుఁడు కుమారస్వామికి జాతకర్మాదిసంస్కారంబు లొనరించుట.

వ. అంత విశ్వామిత్రుం డయ్యగ్నిపుత్రునిపాలికిం జని స్తోత్రపాఠంబుల వానిమైత్రికిం బాత్రుం డై తదాదేశంబున నతనికిఁ ద్రయోదశకౌమారమంగళంబులును జాతకర్మాదివిధులుం గావించె నది యంతయుం దెలిసి దేవతలు దేవేంద్రునిసవిధంబునకుం బోయి.

మ. అమరాధీశ్వర బాహులేయుఁడు గుహుం ♦ డత్యంతశౌర్యోదయుం
డమితౌజోయుతుఁ డాతనిం గెలువు కా♦దైనం గడంక న్నినున్
మము నీ రేసుజగంబులం గెలిచి సం♦పత్సాంద్రుఁ డై యింద్రుఁ డై
యమరు న్వానికి నెల్లవారుఁ బరిచ♦ర్యం జేసి జీవింప నా. 510

సీ. అనవుడు నమరేంద్రుఁ ♦ డమరులం గని యిట్లు, పలికె నాప్రోడ నే ♦ గెలుచు టెడ
యతఁడు నిక్కువముగా ♦ నలిగెనేనియు లోక,ములు సృజించిన వేల్పుఁ♦దలఁతుఁగాన
వానితోఁ బోర నా♦మానస ముత్సహింపదు నావుడును సురల్ ♦ మఱియు నిట్లు
పలికి రట్లేని యో♦పాకశాసన లోక,మాతృకలం బుత్తు ♦ మాతనికడ

ఆ,*కతనిఁ గామవీర్య ♦ లగువారు నిర్జింపఁ, జాలి యుందు రనుచుఁ ♦ జాలఁ బలికి
వానియాజ్ఞఁ బూని ♦ వారిని బిలువంగ,నంచిపుచ్చిరి గుహు ♦ నొంచుటకును. 511

వ. లోకమాతృకలు నాశరస్తంబసంభవునిపాలికిం జని వానిలోకోత్తరగుణోత్తరశౌర్యధైర్యాదులం బరికీలించి విషణ్ణవదన లై వీనిని వినిర్జించుట మముబోంట్లకు శక్యంబు గా దని తలంచి యొండు దలంపక తఱియ వచ్చి వానిశరణు సొచ్చి. 512

తే. లోకమాతల మేము లో♦కైకవినుత, నీవు మాకుఁ గుమారుఁడ ♦ వై వెలయఁగఁ
గోరుచున్నార మీకోర్కి ♦ దీర మమ్ము,నక్కటికమునం గన నెంచు ♦ మయ్య మదిని.

* కామవీర్యలు = కోరినబలము గలవారు.

చ. అనుడుఁ గుమారుఁ డట్లగుత ♦ మంచు వచించి కుమారభావముం
గొని చనుఁబాలు గ్రోలియును ♦ గోరిక లీరిక లెత్త నత్తఱిన్
మనమునఁ బూజ చేసె నిజ♦మాతృక లంచుఁ దలంచి వారునుం
దనయుఁ డటంచు నెంచుచు ము♦దంపడి రెంతయు వింత దోఁపఁగన్ 514

వ. అట్టియెడ నగ్నిభట్టారకుండు కుమారు నారయ వచ్చి మాతృగణపరివృతుండై తన్నుఁ బూజించునతని నతిప్రీతిం గౌఁగిటం జేర్చియు మేషవక్త్రుండై బాలుం గూడి బాలక్రీడలం దేలె నంత మాతృగణక్రోధంబునం బుట్టినలోహితాస్య యనునది ధాత్రి యై శూలంబు కేలం గీలించి బాలుం బరిరక్షించుచుండె నవ్వు డెల్లభూతంబులును గ్రహంబులు నుపగ్రహంబులును మునిముఖ్యులు లోనగువారు వచ్చి వానిం బరివేష్టించి రంత జంభాంతకుండును. 515

ఇంద్రుఁడు కుమారస్వామిపై నెత్తివచ్చుట.

శా. డింభుం డిట్లినుమంత యయ్యె దివి కు♦డ్డీనంబు గావించుచున్
జృంభించెం బ్రతివీరు నారసి యుపే♦క్షింపంగరా దంచుఁ దా
దంభోళిం గరమం దమర్చి మదమా♦తంగంబుపై నెక్కి సం
రంభం బేర్పడ నిర్జరుల్ గొలిచి రాఁ ♦ గ్రొంచారి నోర్వం జనెన్. 516

చ. *రథగజవాహముల్ ప్రబలి ♦ క్రాల విచిత్రపతాక లాడఁగన్
బృథులధనుఃపృషత్కములు ♦ పెల్లుగ నల్లెడ నిండ హేతులన్
బృథివి దివంబు నొక్కటఁగ ♦ వెల్గుచునుండఁ బదాతిఘోషముల్
కథనము సేయ రానిగతిఁ ♦ గ్రమ్మఁ దలిర్చె సుపర్వసైన్యముల్. 517

తే. దేవవాహినితో నిట్లు ♦ దేవనాథుఁ, డగ్నిభవు నోర్చునిచ్చమై ♦ యతనిచెంత
కరుగుదెంచి మహాక్రోధ♦మతిశయిల్ల,సింహనాదము గావించెఁ ♦ జెవులువడఁగ. 518

మ. తనపై వచ్చెడుదేవవాహినులశ♦బ్దంబున్ మహేంద్రుండు కో
యని కావించినసింహనాదమును దా ♦ నాలించి క్రౌంచాద్రిభే
దనదక్షుం డగుషణ్ముఖుండు భయద♦ధ్వానంబు రోదోంతరం
బున నిండన్ వడి నార్చెఁ బేర్చి ప్రళయాం♦భోదంబుచందంబునన్. 519

శా. అద్దారాళమహారవ మ్మమరసై♦న్యమ్మందుఁ గ్రమ్మంగ నా
వృద్ధిన్ సైఁపక మూఁక లెంతయును ని♦ర్వీర్యంబులై తూలె నం



* క్రుద్ధుండై గుహుఁ డంత నొద్దెఱచి పెం♦క్కుల్ నిప్పులం గ్రక్కుచున్
దద్ధట్టంబునఁ జిక్కి రిల్గిరి మహా♦దాహంబునం గ్రాఁగుచున్. 520

ఆ. వేల్పుమూఁక లవు డ♦నల్పశిఖజ్వాల,లందుఁ జిక్కికొని త♦దన్యశరణ
మరయఁ జాల కమ్మ♦హాసేనశరణంబు, వేఁడి బ్రతికి రట్టి♦వేఁడినుండి. 521

సీ. †అప్పు డప్పాకారి ♦ ముప్పిరిగొనుశౌర్య,మున వజ్ర మెత్తి మొ♦త్తెను గుమారు
నది వానికుడిపక్క♦మందుఁ దాఁకుడు నందుఁ, బుట్టె ఛాగాస్యుండు♦ పురుషుఁ డొకఁడు
స్వర్ణవర్ణుఁడు దివ్య♦శక్తికుండలధరుం, డగునాతఁడు విశాఖుఁ ♦ డనఁగ నొప్పె
మఱియును గన్యాకు♦మారగణంబు లం, దుదయించెఁ గాలాన♦లోపమములు

ఆ, నంత హరిహయుండు ♦ నతిభీతుఁడై గుహు, శరణుఁ జొచ్చి కొలిచెఁ ♦ గరుణఁ జేసి
యభయ మొసఁగి కాచె♦నతఁ డాతనిం దాన,ముదము నొంది రెల్ల♦మునులు సురులు.

సప్తమాతృకాదులు కుమారస్వామి నాశ్రయించుట.

వ. అట్లు వజ్రప్రహారంబునం జేసి శరజన్మునిదక్షిణపార్శ్వంబునం బుట్టి ఘోరాకారులగువారు గణంబులై ఛాగముఖుం డగువిశాఖుండు తమకున్ గురువుగాఁ గొని జగంబులం బడి పుట్టియుంబుట్టనిశిశువులం జంపం దొడంగి రద్దానఁ బుత్రికాములగువారు వారినిన్ గుమారాగ్నిరుద్రులన్ స్వాహాపార్వతులన్ సేవించుచుందు రంతఁ దవ్వుం డనువానికిం బుట్టినకన్య లక్కుమరుసామిచక్కికిం జనుదెంచి. 523

తే. లోకమాతలమై మేము♦నీకుఁబూజ్య,రాండ్రమైయుండఁ జూడు మో♦తండ్రియనుచు
వేవిధంబులఁ బ్రార్థింప ♦ విని గుహుండు,వారి కట్టివరం బిచ్చెఁ ♦ గోరినట్లు. 524

వ. తత్ప్రసాదంబునం జేసి వారు కాకి హలిమ మాలిని బృంహిళ యార్య పలాల మిత్ర యనం బొలిచి రిట్లేడ్వురును స్కందప్రసాదజుం డగులోహితాక్షుండును మాతృగణోద్భవుం డగుఛాగవక్త్రుండును గూడి తొమ్మండ్రయి లోకంబులం గ్రుమ్మరుచుందు రనంతరంబ. 525

ఉ. బంగరుబొందళంబుఁ దొడి ♦ బంగరుభూషణముల్ ధరించి సా
రంగధరుండు నాఁ గళలఁ ♦ గ్రాలుచు నెక్కెడఁ గూరుచున్నవా
నిం గుహునిం గనుంగొని ము♦నిప్రవరుల్ జయపెట్ట వానిస
ర్వాంగములందుఁ బొందుకొన ♦ నబ్జనివాసిని వాసి మీఱఁగన్. 526

క. సిరిచే వరింపఁబడుటన్, గర మరు దగుకాంతి గలిగి ♦ కను వెలిఁగెడునా
శరవణసంభవుఁ గని ముని,వరు లెల్లం గొలిచి యిట్లు ♦ పలికిరి భక్తిన్. 527

* వృషత్కములు = బాణములు.

* ధట్టము = సమూహము. † పక్కము = ప్రక్క. ‡ కన్యాకుమారగణంబులు = కన్నెలయొక్కయుఁ గుమారులయొక్కయు గుంపులు.

మ. *శిఖిసూతీ! శివతాతి నీ వుదయముం ♦ జేకొన్నయార్నాళ్ళనే
భువనంబుల్ పదునాల్గునుం గరమునం ♦ బొందించుకొం జెన్న నీ
జవముం సత్త్వమునుం మహత్త్వమును ని♦శ్శేషస్తుత్యము ల్గాన నీ
వివతాళించెదుదృష్టిం జూచి త్రిజగం ♦ బింద్రుండ వై యేలుమా. 528

క. అభయ మొసంగితి వగుటం, విభవంబుం గొనియు మాకు ♦ విప్లవములకుం
విభుఁడ వయి కరుణతోడం, శుభముల్ ప్రాప్తించునట్లు ♦ చూడుము తండ్రీ. 529

వ. అనిన షడాననుం డా దేవర్షులం గాంచి దేవేంద్రపదంబున నున్నవా రెట్లు ప్రవర్తింప వలయు నెఱింగింపుఁ డనిన వారు వెండియు. 530

తరువోజ. విను మింద్రపదమున ♦ వెలయు నాతండు ♦ విష్టపప్రజలకు♦వీర్యంబు సుఖముఁ
బొనరింపవలయును ♦ భూతపంచకముఁ ♦ బూపాజ్ఞలను శక్తిఁ ♦ బొంది దీపించు
నను వొడఁగూర్పంగ ♦ నగు శిష్టజనుల ♦ నరసి రక్షించుచు ♦ ననిశంబు దుష్ట
జనుల శిక్షించుచు ♦ జగము లేలంగఁ ♦ జను నీవు తగుదు వో♦స్కంద! యింద్రతకు.

వ. అని పలుకుచున్న సమయంబున నింద్రుండును. 532

శా. ‡వీరాగ్రేసర వీరు చెప్పినటులీ♦వే చాలియున్నాఁడ వా
స్వారాజ్యంబు వహించి మంచుటకు నేఁ ♦ జాలం మదీయార్థనం
గారాబంబున విశ్వసింప విభుతం ♦ గైకొమ్ము లోకమ్ములం
ధీరత్వంబున నేలు మన్న గుహుఁ డ♦ర్థిం బల్కె నిట్లింద్రునిం. 533

క. పరిపాలింపుము నీ వా,సురరాజ్యము నిచ్చగింపఁ ♦ జు మ్మేను భవ
త్పరిచర్య సేయుచుండెద, నిరతము మఱి యొంపుచింత ♦ నిలుపకు మెడఁదం. 534

చ. అనవుడు నింద్రుఁ డి ట్లనియె ♦ నయ్య బలాఢ్యుఁడ వీవు నిన్నుఁ గా
దని బలహీనుఁ డే నచట ♦ నైతి నరయ జను లాదరింప రె
వ్వును మనకు న్విరోధ మది ♦ పుట్ట నొనర్తురు వైర మైన ని
న్ననిమొనఁ దాఁకి గెల్వఁ దగు♦నట్టి నాకంబును లేఁడు కావునం. 535

వ. ఈవిచారంబు దక్క త్రిదివపదంబునం దీ వభిషిక్తుండ వై మమ్ముం బనిగొను మనిన మందహాసభాసురవదనారవిందుం డై యిందున్న కాస్కందుం డి ట్లనియె. 536

మ. పొర వుట్టించెదువాఁ డొకండె మన కో♦పూర్వామరారాతి నీ
వరిం సాంద్రయశంబు నింద్రపదముం ♦ బ్రాపించి త్రైలోక్యముం

* శివతాతి = శివంకరుఁడు. కరమునం బొందించుకొంటివి = అనఁగా స్వాధీనము చేసికొంటి వని తాత్పర్యము. ఇవతాళించు = చల్ల నగు. † అర్థన = ప్రార్థన.



*పరిపాలింపుము నేను నీ కెలన మొం♦పం దీర్తు నీయాత్మకుం
బరితోషంబును గూర్తు నాజ్ఞయిడు మే♦ బాలిం బ్రవర్తింతునో. 537

వ. అనిన నిందుండి ట్లనియె. 538

ఇంద్రుఁడు కుమారస్వామిని దేవసేనాధిపత్యమున నభిషేకించుట.

ఉ. నీవొడి నాపయిం బ్రియత ♦ నిల్చెను గావున నీదుపంపునం
నే నమరేంద్రతం దగుదు ♦ నీ వమరధ్వజినీంద్రతం దగం
బూని జగద్భయం బుడుగఁ ♦ బ్రోవవె నావుడు సంతసిల్లి నే
నానిగ నన్నుఁ గైకొనుము ♦ నావలనం బనిఁ గొమ్ము వాసవా. 539

క. దేవతల కర్థసిద్ధిం, గోవులకుం వృద్ధి విప్ర♦కులులకు బుద్ధిం
భావమునం గోరి సురసే,నావారంబులకు నెల్ల ♦ నాయకుఁ డగుదుం. 540

తే. అనుడు మే ల్మే లటంచు నా♦హరిహయుండు, దేవమునిగణపరివృతుం ♦ డై కుమారు
సింగపుంగద్దెపై నిల్పి ♦ చేసెఁ దనదు, సేనలకుఁ బతిఁగా నభి♦షేక మపుడు. 541

క. సురసిద్ధసాధ్యవిద్యా,ధరగంధర్వాదు లెల్ల ♦ తాపసులును నా
శరవణసంభవుఁ గొలిచిరి, పరిపరిగతులం స్తుతించి ♦ బహుతరభక్తిం. 542

ఉ. ‡వేలుపు లగ్నిసంభవుని ♦ వేగతుల న్వినుతించి జాళువా
మేలిపసిండిఛత్రమును ♦ మిమ్మటపుంబస మీఱఁ బట్టి ర
వ్వేళసమిద్ధపావకుని♦విశ్రుతమండలసారమో యనం
బోలుపనయ్యె నయ్యది ప్ర♦భూతహిరణ్మయకాంతిసంపదం. 543

ఉ. ఆసమయంబునం దటకు ♦ నబ్ధినిషంగుఁడు గోవృషధ్వజుం
డాసుతునిం గనుంగొనఁగ ♦ నాసమయుం జనుదెంచి గోత్రపు
త్రీసహితంబుగా నఖిల♦దేవమునీంద్రులు సాంద్రమైనసం
తోసముతోఁ భజించి తన♦తోఁ బఱతేఁ బరితోవృతంబుగం. 544

తే. ఇట్లు చనుదెంచి క్రౌంచారి ♦ నీశ్వరుండు
కౌఁగిటం జేర్చుకొని విశ్వ♦కర్మనిర్మి
తము హిరణ్మయ మగుమాల్య ♦ మమితకుతుక
మున నతనికిఁ గట్టి మన్నించె ♦ మనమునందు. 545

వ. అ ట్లర్చితుం డయిన బాహులేయుండు సహజకవచకలితుండును రక్తాంబరధరుండును ఛత్రచామరాంచితుండును నై శక్త్యాయుధంబును జరణాయుధధ్వజంబునుం గ్రాల

* కెలను = అక్కఱ, పని. ‡ మిమ్మటము = మిక్కుటము.

నిజపారిషదపరివృతుండై దేవసేనానాయకత్వముం బూని నిగ్రహానుగ్రహసమర్థుం డై ప్రకాశించుచుండె నక్కుమారుండు రుద్రరూపుం డగునగ్ని తనవీర్యంబు స్వాహాదేవియం దిడిన నామె కృత్తికారూపంబున దాని గ్రహించి రుద్రవీర్యంబున నైన శ్వేతపర్వతంబున శరవణస్తంబంబున నిక్షేపించె నందుఁ బుట్టుటం జేసి రుద్రతనయుం డనియు నాగ్నేయుం డనియు గాంగేయుం డనియును శరవణోద్భవుం డనియు స్కందుం డనియుఁ జెప్ప నొప్పె నప్పుడు. 546

మాలిని. సురలు విరులవానల్ ♦ సోన లై కుప్పతిల్ల
న్గురిసిరి ధర యెల్లన్ ♦ దుందుభిధ్వాన మొప్పెన్
విరిసెఁ జదలు కాంతిన్ ♦ నిర్మలం బై శివం బై
సరవి గుబులుకొంచుం ♦ జల్లఁగా గాలి వీచెన్. 547

క. అభిషేకానంతరమున, విభవాంచితుఁ డై నగుహుని వీక్షించి మరు
ద్విభుఁ డాత్మ దేవసేనన్, శుభగాత్రిం దలఁచుకొనియె ♦ సురుచిరలీలన్. 548

—•◆ కుమారస్వామి దేవసేనం బెండ్లియాడుట. ◆•—

ఉ. ఆయమ వీనికిం దగిన ♦ యట్టి దితండును దాని కైనవాఁ
డీయెడఁ బెండ్లి సేయ నగు ♦ నియ్యది బ్రహ్మవినిర్మితం బగుం
బో యని దానిఁ దెచ్చి మణి ♦ భూషణభూషితఁ జేసి స్కందునిన్
డాయఁగఁ బోయి యి ట్లనియెఁ ♦ దామరనేత్రుఁడ వేడ్కఁ జూపుచున్. 549

శా. ఈకన్యామణి నీవు పుట్టుటకుము ♦ న్నే నీకు నర్ధాంగిగా
లోకేశుం డగుసృష్టికర్త వలనన్ ♦ లో నెన్నఁగా నయ్యె నో
నాకానీకపతీ! గ్రహింపు మెద నీ ♦ నారీశిరోరత్నమున్
నీకుం గూర్చెను నిద్ది యొద్దికను దీ ♦ నిం బోల రెవ్వారలున్. 550

మహాస్రగ్ధర.†అని పల్కన్ సంతసం బా ♦ స్యమున మొలవఁగా ♦ నంతరంగంబునం దా
తనికోర్కిం గన్నుదోయిం ♦ దనరఁ దెలుపుచున్ ♦ దైవతానీకినీశుం
డను మోదం బొప్ప నక్క ♦ న్యకరముఁ గొని పెం ♦ డ్లాడె స్వారాడమాత్యుం
డనువొందన్ వహ్నియందున్ ♦ హవన మొనఁగి మం ♦ త్రాళి వాక్రుచ్చుచుండన్.

తే. అక్కుమారుఁడు దేవసే ♦ నాబ్జపాణి,పాణిపీడన మొనరించి ♦ రాణ లెసఁగఁ
బొసఁగుదిన మది షష్ఠియై ♦ పూజ్యమయ్యెఁ,బంచమియు శ్రీవరించుట ♦ భవ్యమయ్యె.

వ. ఇట్లు దేవసేనం బరిణయం బై మహావైభవంబునం బొదలుమహాసేనునిసముఖంబున కాక్షణంబున భర్తృపరిత్యక్త లగుమహర్షిపత్ను లార్వురును వచ్చి త మ్మెఱింగించి యి ట్లనిరి. 551

† స్వారాడమాత్యుఁడు = బృహస్పతి.



మ.‡అకటా! యంతలపొంతలాఁ డయినఁ గాఁ ♦ డన్యుం డెవండో ఖలుం
డకటుండుం బతుఁ డైనయొకరుం ♦ డన్నంబు పున్నం బెఱుం
గక మాకర్మమునంద మే మయి జగ ♦ త్కర్మంబులం జూడఁ బో
వక యున్నం గని సైఁపలేనిమది మా ♦ పై మోపె నిప్పాపమున్. 554

సీ. వీతిహోత్రుని నంటి ♦ ప్రీతిమెయి న్మేము, నినుఁ గంటి మని విని ♦ నింద కోడి
నిజ మారయఁగ లేక ♦ నిష్కారణముగ మా,పతు లుజ్జగించిరి ♦ ప్రతిభు మాని
పుణ్యంబునకుఁ గాక ♦ పోతిమి మే మిట్లు, మముఁ దల్లులుగ నీవు ♦ మదిఁ దలంచి
కరుణమైఁ బుణ్యలో ♦ కప్రాప్తి గలిగింప,వే బిడ్డ వని నిన్ను ♦ వేఁడుచుంటి
తే, మనుచు వేల్పులదళవాయి ♦ యనియె వారి, కమ్మలార వినుఁడు మీకు ♦ నాత్మజుండ
నేను నాకీరు తల్లులు ♦ గాన మీరు, కోరినట్ల యగుత మింకఁ ♦ గుందకుఁ డెద. 555

వ. అని యంతఁ జెంత నున్నవృత్రారాతికిం జూచి యి ట్లనియె. 556

ఆ. వీరు నాకుఁ దల్లు ♦ లైరి వీరికిఁ దగు, తానకంబు మనకుఁ ♦ గాన నొప్ప
నేమి సేయుద మన ♦ నింద్రుఁ డాతనితోడ, నిట్టు లనుచుఁ దెలిపె ♦ నింత యరసి.

తరువోజ. వినుము రిక్కలలోన ♦ వెలసిరోహిణికి ♦ వెనుకనభిజిదాఖ్య ♦ వెలుఁగొందుచుక్క
తనమదిం గలహించి ♦ తారకలందుఁ ♦ దాఁ బెద్దతికమునఁ ♦ దనరంగ నెంచి
ఘనతపం బొనరింపఁ ♦ గా నొక్కవనికిఁ ♦ గడఁగి పోయెం దాని ♦ కలపద మిప్డు
కనఁబడు రిత్త యై ♦ కావున వీరిఁ ♦ గరుణ నటకుఁ బుచ్చఁ ♦ గాఁ దగు మనకు. 558

వ. అనిన నౌఁ గాక యని యతం డాకృత్తికలం బోయిరం డని వీడ్కొల్పుటయు వారు నటఁ జని సప్తశీర్షాభంబును వహ్నిదైవత్యంబు నగునక్షత్రం బై వెలింగి రంత.

సీ. వినత యేతెంచి గు ♦ హునిపాలి కోయయ్య, నీవు నాసుతుఁడవు ♦ గావున నిట
నీతోడ నివసింప ♦ నే నెంతు నావుడు, నతఁ డట్ల యగుఁ గాత ♦ మమ్మ నేను
నీకన్నబిడ్డ నై ♦ నీనుడి నుండెదఁ, గోడలు భక్తిమైఁ ♦ గొలుచుచుండు
నని బుజ్జగించుచు ♦ నాయమం దనచెంత, నెఱి మీఱఁ బూజించి ♦ నిలుపుకొనియె

—•◆ కుమారస్వామి సప్తమాతృకలను బాలగ్రహములుగఁ జేయుట. ◆•—

ఆ, నంత మాతృగణము ♦ నరుదెంచి లోకమా,తలము మేము నీకుఁ ♦ దల్లులుగను
గోరియుంటి మనుచుఁ ♦ గొమరుండ నే మీకు,నేమిసేయవలయు ♦ నెఱుఁగఁ జెపుఁడ.

చ. అనవుడు సప్తమాతృకలు ♦ నాతనిఁ గన్గొని యిట్లు వల్కి రో
తనయుఁడ పూర్వమాతృకల ♦ తానము మా కిడి వారిఁ గాక మ

‡ అంతలపొంతలాఁడు = సమీపస్థుఁడు; అకము = పాపము.

* మ్మనిశము లోకముల్ గొలుచు♦నట్లును నీకయి వారు మా ప్రజ
మనుఁగ నొనర్చి రా ప్రజను ♦ †మా కిడునట్లు వరం బొసంగవే. 561

ఆ. అనుడు స్కందుఁ డనియె ♦ నమ్మలారా! మీకు, మరల మీ ప్రజ నిడఁ ♦ దరముగాదు
మఱియొకండువరము ♦ తఱి వేఁడుఁ డిచ్చెద, ననిన మాతృక లని ♦ రతనితోడ. 562

తే. నీకుఁబాసట గలిగి మే ♦ మేదినంబు, వఱలి మాతృకలయు లాతి♦వారలయును
బ్రజల మెసవంగ వర మిమ్ము♦ బాహులేయ, నావుడు నతండు గర్జించి♦ భావమందు.

ఉ. ‡వారలఁ గాంచి యి ట్లనియె ♦ వా యిటు లాడునె మీకు నైన మీ
కోరిక దీర్తు లోకమున♦కుం బగ తీరు పదాఱువర్షముల్
చేరెడుదాఁక బిడ్డలను ♦ జేకొని మ్రింగుఁడు మిమ్ముఁ గొల్తు రే
వారలు వారి వారిప్రజ ♦ వారక కాచుచునుండ్రు గావుతన్. 564

వ. ¶మీరు నానావిధరూపంబులం బ్రవర్తింపుఁడు మీకు బాసటగా నొక్క రౌద్రునిం బుట్టించి యిత్తు వానిం గూడి సుఖంబుండుఁ డని పలుకుచుండునంత నతనిశరీరంబు నుండి పావకాభుం డగునొక్కపురుషుండు వాడమి కడువడి నాఁకటం బడి యొండ లెఱుంగక పుడమిం బడియె నపుడు గుహుండు వానిం గరంబున నంటి చైతన్యం బొసంగి నీవు స్కందాపస్మారం బన రౌద్రగ్రహంబ వై యీమాతృకల ననుసరింపు మనిన నతం డట్ల కావించె నంత శకునిమాత యగువినతయు దేవమాత యగు దితియు గోమాత యగుసురభియు శునకమాత యగుసరమయు వృక్షమాత యగు కరంజయు సర్పమాత యగుకద్రువయు నప్సరోమాతయు గంధర్వమాతయు స్కందధాత్రి యగులోహితాస్యయుఁ బూతనయు ననువారు శకున రైవత ముఖముండితాదిగ్రహంబు లై సప్తమాతృకలం గూడి పదునేనమం డ్రయి లోకంబులం గల గర్భంబులనర్భకులం జంపి తినుచుందు రందు. 565

బాలగ్రహస్వరూపనిరూపణము.

సీ. ‖కద్రువ గనరాక ♦ కడుపునఁ జని గర్భ, మపహరించుచు సర్ప ♦ మందుఁ బొడము
గంధర్వమాతయు ♦ గర్భంబు హరియింపఁ, గ విలీనగర్భ యై ♦ కాంత యొప్పు
నప్సరోమాతయు ♦ నటు గర్భమును డింప, నయ్యది యుపసష్ట ♦ మయ్యె నండ్రు
స్కందునిధాత్రియై ♦ చనులోహితాస్యయుఁ, గడిమిపూవుల మెచ్చి♦ విడుచుఁ బ్రజల

తే. వృక్షముల కెల్ల మాతయై ♦ వెలయునక్క, రంజ యొక్కరుకృపగల్గి ♦ ప్రజకుహింస
చేయనీయక చేయక ♦ చెలఁగుచుండు, సౌమ్య మగుదానిఁబూజింత్రు ♦ జగతిజనులు.

* మనుఁగు = వచ్చు. ‡ పగలు = శత్రువులు. † శకుని = పక్షి.
‖ కడిమిపూవుల మెచ్చి = అనఁగాఁ గడిమిపూవులపూజచే మెచ్చి యని తాత్పర్యము.



వ. ఈచెప్పినవారును గుహుదేహంబునం బుట్టినస్త్రీపురుషజనంబును నూతికాగృహంబును విడువక పదునాఱ్లు కాచికొనియుందు రిందఱును స్కందగ్రహంబు లనంబడి పదునాఱేండ్లు వచ్చుదనుక శిశువులం బీడించుచుందురు తద్గ్రహశాంతిం గోరువారు కుమారాదుల బలికర్మోపహారధూపదీపదానతర్పణాదులం బూజింపవలయు దాన వారు సంతసించి జనులకాయురారోగ్యసుఖంబు లిచ్చుచుందు రందుమీఁదం గొన్ని గ్రహంబులు గల వాకర్ణింపుము. 567

సీ. కలనొండె జనుఁడు మేల్కనియొండె వేల్పులఁ, గని వెఱ్ఱులునది దైవి♦కగ్రహంబు
పండియొ లేకకూ♦ర్చుండియొ పితరులఁ, గని వెఱ్ఱులునది పైతృ♦కగ్రహంబు
సిద్ధుల నోయ వారి ♦ క్రుద్ధులై శపియింపఁ, దగుఁ బిచ్చి యది సిం♦ద్ధగ్రహంబు
రసగంధములను నా♦ఘ్రాణించి మత్తుఁడై, చనిన నయ్యది రాక్ష♦సగ్రహంబు

తే. బ్రిమసిగాంధర్వమొనరించి♦క్రీమను దప్ప, జనుఁడుదానదిగాంధర్వ♦మనుగ్రహంబు
గాలి సోఁకిన నున్మాద♦గతి వహించి, కడు బడలునది పైశాచి♦కగ్రహంబు. 568

తే. అరయఁ గాలవిపర్యయ ♦ మైనయపుడు, జనుఁడు బమ్మరిలునది యక్ష♦గ్రహంబు
పిత్తవాతాదులం జేసి ♦ చిత్తవిభ్రమం బయిన నది యొక్కగ్ర♦హంబయండ్రు. 569

వ. ఈగ్రహంబులు సోఁకినప్పుడు శాస్త్రచోదితం బయినప్రతివిధానంబు సేయవలయు మఱియు ఘోరవస్తుదర్శనంబుననొండె వైక్లబ్యంబుననొండె భయంబుననొండె నరుం డున్మాదంబునం బొందెనేని వాని సాంత్వనంబునం దేర్చుటయ సాధనం బిట్లు గ్రహంబులు క్రీడించునప్పుడును భుజించునప్పుడును స్వేచ్ఛం బ్రవర్తించునప్పుడును మూఁడుతెఱంగుల మనుష్యుల నావేశించి బాధించుచుండు. 570

ఉ. డెబ్బదియేండ్లదాఁకఁ గడు ♦ డెప్పర మై గ్రహబాధ లోకమ
బ్బబ్బ యనంగ వేఁచెడి న♦నంతర మాగ్రహబాధకన్నఁ బే
రిబ్బడి యంచుఁ జెప్పఁ దగి ♦ యెంతయు మర్త్యుల నావహించెడున్
బెబ్బులియో యనంగ నది ♦ పెద్దజరాభర మేమి చెప్పఁదున్. 571

తే. *ఆస్తికుని శ్రద్ధధాను జి♦తాక్షు శాంతు, దాంతు శివభక్తినత్తు న♦తంద్రితు నివు
డేగ్రహంబులు కన్నెత్తి♦యైని చూడ, జంకు నని నీ వెఱుంగుము ♦ శంక విడిచి.

వ. అని చెప్పి మార్కండేయుండు వెండియు నిట్లనియె నట్లు కార్తికేయుండు మాతృగణంబునకుఁ బ్రియంబు నేసి యున్నసమయంబున స్వాహాదేవి వచ్చి యిట్లనియె.

* శ్రద్ధధానుఁడు = శ్రద్ధ గలవాఁడు.

స్వాహాదేవి కుమారునొద్దకు వచ్చుట.

ఉ. ఔరసపుత్రరత్న మగుదయ్య కుమారక నీవు నాకు నా
కోరినకోర్కి దీరుచుటకుం దగు దన్న నతండు తల్లి! నీ
కోరిక యేమి చెప్పు మది ♦ కూరిమిపుత్రుఁ డితండు నీకుఁ జే
కూరఁగఁ జేయు నుండె నని ♦ కోరిక లీరిక లెత్తఁ బల్కుడున్. 574

వ. స్వాహాదేవి మహాసేనునకు యిట్లనియె. 575

చ. ‡వినుము కుమార దక్షునకు ♦ వేడుక లొడిక లెత్త బిడ్డ నై
పొనరితి న న్నతండు మును ♦ పోలిచి కీలికి నిచ్చె బాల్యమం
దనిశముఁ గోరి యున్నదను ♦ నాఱడిగా నతఁ డొల్లఁ డేమి చె
ప్పినఁ జెడపినులం జొనుపుఁ ♦ బిల్చిన మార్పలుకం డొకింతయున్. 576

క. †ఎడ లేనిపొందుఁ గోరితి, జడజుం డగునతనితోడ ♦ సహధర్మిణి నై
కొనుకా కృపఁ జూడుము నా,వ్రుసు నౌనని వహ్నిసంభవుం డిట్లనియెన్. 577

తే. హవ్యకవ్యములందు బ్రాహ్మణులు నేఁడు,మొదలుగా నగ్ని వేల్చెడునదను వడిన
యావుడు స్వాహాయనుచుఁబల్కి సుపరిశుద్ధ,మంత్రములనుచ్చరింతురో మాతవింటె.

వ. దానంజేసి నీకు లోకపూజ్యం డగుహవ్యవాహునితోడ నెల్లపుడుం గూడియుండి
యుండం గలుగు ననిన నామె డెందంబున నానందించుచు నందను నభినందించె
నవుడు దేవగణపరివృతుం డై బ్రహ్మదేవుండు వచ్చి మెచ్చుచుం గుమారుం
జూచి చెంత నున్నపార్వతీపరమేశ్వరుల నిరూపించుచు ని ట్లనియె. 579

ఆ. యోగబలమువలన ♦ నుగ్రుం డనలమందు, నుమయు స్వాహయందు ♦ నమరి సంగ
మింపఁ బుట్టి తీవు ♦ మించి లోకహితార్థ, మెఱిఁగికొనుము దీని ♦ నెడఁదయందు.

వ. మఱియుం బార్వతీపరమేశ్వరసంగమకాలంబున. 581

సీ. చెదరి తత్తేజ మిం♦క్షితిధరంబునయందు, లోహితోదధియందు ♦ లోకచక్షు
కిరణసంచయమందు ♦ ధరణిజంబులయందు, నవనియందును బడె ♦ నైదుగతుల
నందు ఘోరాకారు ♦ లై పిశితాశను, లైదుగణంబు లై ♦ యవతరిల్లి
నీకుఁ బారిషదు లై ♦ నిలిచి రీగిరి మించి, కామించికము దానఁ ♦ గలిగె ననుచుఁ

తే. దెలిపి పరమేష్ఠి చనుటయు ♦ దేవవాహి,నీశ్వరుఁడు భక్తి నప్పార్వ♦తీశ్వరులకు
మ్రొక్కి పూజించె మిక్కిలి♦మోద మలరఁ, దల్లిదండ్రు లటంచులోఁ♦దలఁచుకొంచు.

† అగ్ని తన్నిట్లు చేసినాఁడు గనుకనే స్వాహాదేవి మునిపత్నులరూపముఁ దాల్చి యగ్నిం గూడె
నని యెఱుంగునది. ‡ జడజుండు = నీటఁ బుట్టినవాఁ డనియు గర్భించుటయును.



వ. మఱియు నీధరణితలంబున ధనార్థులును వ్యాధిశమనార్థులు నాపంచగణంబులవారి
నర్కపత్రపుష్పంబులం బూజించి సేవించునది బాలహితార్థు లామింజికామింజిక
మిథునంబు నర్చించునది వృక్షంబులందలిరుద్రవీర్యంబునం బుట్టినవృద్ధిక లనుస్త్రీలు
మానుషమాంసాశను లైరి వారలం బ్రిజాకానులు నేమంబునఁ గొలుచునది యి
ట్లసంఖ్యేయపిశాచగణంబు లుత్పన్నంబు లయ్యె ననంతరంబ. 583

మ. *పురుహూతుం డురుగౌరవంబునను వేల్పుంగారుకంఠంబునన్
గరిమం బొల్చెడువై జయంతు లనుఘంటల్ రెండు దా నమ్మహే
శ్వరసంజాతున కిచ్చె నాతఁ డొకఁ డిచ్చుం గొంచుఁ డెక్కెంబునన్
గర మర్థిం జను నవ్విశాఖునకు నొక్కం డిచ్చెఁ బెం పెచ్చఁగన్. 584

వ. †అట్లు దేవదత్తాలంకారాలంకృతుం డై షాణ్మాతురుండు దేవపిశాచగణంబులం
గూడి కరవీరపారిజాతసంతానజపాశోకాదితరువరవిరాజితంబును మృగపక్షిగణపరి
వృతంబును దేవర్షిజనసమంచితంబును నగునాశ్వేతపర్వతమున గంధర్వగానంబును
నప్సరోజననృత్యంబును నాదరించుచు నిచ్ఛావిహారంబు గావించుచుండె నాసమ
యంబున. 585

ఈశ్వరుఁడు కుమారస్వామితో భద్రవటముఁ జేరఁ బోవుట.

మ. శితికంఠుండు సతీసమేతుఁ డగుచున్ ♦ శ్రీదేవసేనానను
న్హితునిం బుత్రునిఁ గౌఁగిటం దనువుచున్ ♦ వేగంబునందు న్సదా
గతికిం బోనిసహస్రసింహముల వేడ్కం బూన్పఁ బొల్పొందును
న్నతగాంగేయరథంబు నెక్కి చనియెన్ ♦ దా నభ్రమార్గంబునన్. 586

ఆ. ‡మోర లెత్తుకొనుచుఁ ♦ బోవునప్పంచాస్య,ములు నభంబు మ్రింగుఁ♦బో యనంగఁ
బోలఁ దోఁచి నిఖిల♦భూతభయంకర,గర్జనము లొనర్చి ♦ కదలెఁ జదల. 587

చ. §కనకరథంబునందు గిరి♦కన్యకతో నివసించి యున్నయ
మ్మనుసిగవేల్పు పొల్పునను ♦ మించినమించును గూడి పోఁడిమిన్
బొనరెడుచిత్రభానుఁడు ప్ర♦భూతరుచిం దగి సేంద్రచాప మై
కనఁబడుకాలమేఘమునఁ ♦ గ్రాలెడునో యనఁ బోలఁ దోఁచెడిన్. 588

వ. ఇట్లు మహేశ్వరుండు మహైశ్వర్యంబున మహాసేనుం దోడ్కొని చనునెడ వాస
పురోభాగంబున గుహ్యకపరివారపరివృతుం డై పుష్పకం బధిష్ఠించి మనుష్యధర్ముం

* గారు = ఏనుఁగు. † షాణ్మాతురుఁడు = కుమారస్వామి.
‡ పంచాస్యములు = సింహములు. § చిత్రభానుఁడు = సూర్యుఁడు.

చును బశ్చాద్భాగంబున దేవగణసంసేవ్యమానుండై యైరావణంబు నెక్కి దేవేం ద్రుండును దక్షిణభాగంబున జృంభకయక్షరాక్షసపరిరక్షితుం డైనమహాయక్షుండును మహాయక్షునిదక్షిణంబున వసురుద్రాదిదేవయోనులును నుత్తరమున ఘోరరోగ వ్యాధిసమాక్రాంతుండై మృత్యుసహితుండై యముండును యమునిపిఱుంద ఘోరం బును ద్రిశిఖరంబు నగుశూలాయుధంబును దానిపరిసరంబున వివిధయాదస్సందోహ సమంచితుండై పాశహస్తుండై వరుణుండును వాని వెనుదన్ని పరశుపట్టసముసలగ దాసిశక్త్యాదిప్రహరణస్తోమంబును వానిపక్కంబున మహాప్రభాభాసమానం బగున నూనఛత్రంబును దానివలపట భృగ్వంగిరఃప్రభృతిమునిజనమండితంబు లగుదండకమం డలువులును వానిదాపట మూర్తీభవించిననదీనదసముద్రంబులును వానిం దగిలి మొక్కులిడుచుఁ బర్జన్యుండును మఱియుం గలదేవతలు ఋషులు గంధర్వులు భుజంగులు నప్సరసలు నక్షత్రంబులు గ్రహంబులుం బలసి నడచి రప్పుడు దేవతా స్త్రీసముదయంబు పుష్పవర్షంబు గురిసె రాక్షసగ్రహం బైనపింగళుం డగ్రభాగంబున వృషభకేతనంబు పట్టెఁ జంద్రుండు శ్వేతచ్ఛత్రంబు పట్టె వాయ్వగ్నులు వింజామ రలు వీచి రింద్రుండు రాజర్షిపుంగవులం గూడి స్తోత్రపాఠంబులు చదివె గౌరియు గాంధారియు విద్యయుఁ గౌశినియు మిత్రయు సావిత్రియు ననువారు పార్వతి ననుసరించి సేవించి రిట్లు దేవవారసేవ్యమానుండై చని చని దేవదేవుం డగువామ దేవుండు రుద్రుండు భద్రవటంబు దఱియం జేరి కుమారుం జీరి మేఘగంభీరవచ నంబుల ని ట్లనియె. 589

తే. నిత్యము నతంద్రితుండ వై • నీవు సప్త,మం బయినమారుతస్కంద • మింబు మీఱఁ
గాచుచుండుము కార్యంబు•గలిగినపుడు, కనుము నను దాన శ్రేయముల్ • గలవు నీకు.

వ. అని వానిం గౌఁగిలించుకొని దీవించి విడిచిపుచ్చె నంత. 591

మహిషాసురుండు సేనలతో వచ్చి చుట్టుముట్టుట.

ఉ. పుత్రునిఁ బోయిర మ్మనుచుఁ • బుచ్చినయప్పుడ పుట్టెఁ జెట్ట లీ
మాత్రము నాగరాశ సుర•మండలిగుండెలు తల్లడిల్లె నీ
ధాత్రి చలించె నాకసము • దద్దయు మ్రోసెను దిక్కు లెల్లఁ జే
రాత్రము గాఁగ సంధత మ•హాతివృతంబుల యయ్యె నయ్యెడన్. 592

క. ఆయుత్పాతంబులఁ గని, పాయనివెఱఁ గంది రపుడు • పశుపతియును గా
త్యాయనియు ఋషులు వేల్పులు,నీయది యేమొక్కొ యనుచు • నెంతయుఁ జింతన్.



శా. *ఉత్పాతంబులు పెక్కు లిట్లు గన నై • యుండంగ నుద్ధండతా
భృత్పూగంబులు రేఁగి భూతలముపై • భీతిప్రభూతోద్యమం
బుత్పాదింపఁగఁ జాలి నాఁ గవిసె ఘో•రోద్ధక్షయాంభోధరో
ద్యత్పూర్వారవ ముప్పతిల్లఁగ ననం•ఖ్యాకోగ్రసైన్యావళుల్. 594

మ. ‡ప్రళయంబో యన నట్లు మూఁగినమహా•రక్షోబలంబుల్ భుజా
బల మొప్పన్ మహిషాసురావితము దృ•ప్తంబై జగజ్జాలముల్
లలి నొక్కుమ్మడి మ్రింగున ట్లడరి నా•నాశస్త్రముల్ గ్రోల నా
ర్పులు రోదోంతర మందుఁ బూరటిల నే•పుం జూపె నాపట్టునన్. 595

వ. †ఇట్లు గూక్షం బై నరక్షోబలం బాక్షణంబ ముక్కంటిమూఁకలం జుట్టుముట్టి పరశు పట్టసప్రాసాసి ముసల ముద్గర కరవాల భిండివాల తోమర కుంత పరిఘ శతఘ్ని ప్రముఖ నానావిధాయుధంబులు ప్రయోగించుటయుం బేర్చి కార్చిచ్చు దాఁకినం దగ్ధభూయిష్ఠం బగుమహాద్రుమవనంబువలె విభిన్నదేహావయవం బగుదేవసైన్యంబు దైన్యంబు నొం దియుఁ గుందియు డిందియు గ్రుందియుఁ ద మ్మోమ్మునాథుం గాన కార్తింబడి సిం హంబులబారిం బడినమృగంబులతెఱంగునఁ జెదరి పాఱినం జూచి పాకశాసనుం డెలుం గెత్తి యెల్లవారి నాశ్వాసించుచు ని ట్లనియె. 596

ఉ. పోటరులార సాధ్వసము • పోలదు గోలలరీతి జేల లై
పాటి యొకింత లేక యిటు • పాఱెదరే పడవైచి శస్త్రముల్
చాటుపడం బరాక్రమము • చాలుఁ బురే మరలుండు సంభ్రమం
బేటికి నేఁ గల న్వెఱవ • కీసురవైరులఁ దాఁకుఁ డుక్కునన్. 597

తే. శక్రువచనంబు విని దేవ•చక్ర మెల్ల, నూఱటం బడి మరలి స•ముద్ధతేజు
లగుచు శస్త్రాస్త్రముల్ దాల్చి • యమరనాథు,నండఁ గై కొని పోరి రు•ద్దండరీతి. 598

మహా‡వసురుద్రాదిత్యగంధ•ర్వముఖసురవర•వ్రాతముల్ విక్రమాప్తిన్
బ్రబమిూక్షింపంగ నై ధై•ర్యము మెఱయ ననిం • గ్రాలి నానాస్త్రశస్త్ర
ప్రసరం బత్యుత్కటం బై • పఱవ మహిషగు•ప్తధ్వజిన్యోఘముం దాఁ
కి సహస్రాక్షుండు మెచ్చం • గెరలువొడిచి లోఁ • గింకిరిం గేలఁ జూపెన్. 599

మ. క్రతుభుగ్వారవిముక్తమార్గణము లా•క్రవ్యాదదేహాంతర
స్థితరక్తౌఘము నెల్లఁ గ్రోలి మిగులన్ • దీపించి తత్పాన ము

* ఉద్ధతము = బయలుదేరినది, క్షయాంభోధరము = ప్రళయమేఘము. పూర్వారవము = గొప్పధ్వని.
‡ అవితము = రక్షింపఁబడినది. బూరటిలు = నిండు. † ఓము = రక్షించు.
‡ గెరలువొడిచి = విజృంభించి. కింకిరి = కోపము.

* త్యతిమాత్రిం బగుదానఁ గ్రక్కుకొనుచుఁ • హా హా యనం దైకివ
చ్చి తలిర్చిం బృథివీధ్రకోటులపయిఁ • నీద్రింపుతేండ్లో యనన్. 600

ఉ.‡దుర్జయులై రణంబునను • దోర్బలదర్పము తేర్పడంగ నా
నిర్జరు లుగ్రులై నిలిచి • నిష్ఠురబాణము లేసి నొంచుచుఁ
జర్జరితాంగులై దనుజసైన్యమునం గలయోధు లెల్ల లో
నార్జవ మేగఁ గూలి రిల • నాశుగసంహతిఁ నబ్దముల్ బలెన్. 601

వ. ఇట్లు దేవత లుక్కుమిగిలి పూర్వదేవతలం బరాఙ్ముఖులం జేసి వాసి కెక్కి పేర్చి యార్చుచుం దూర్యమ్ములు మ్రోయించి రది సహింపక దానవులు తామును దిట్టపడి నానావిధాయుధంబులు మెఱయ సింహనాదంబులు సేయుచు శౌర్యధైర్యంబు లినుమడింప గీర్వాణవారంబులం దాఁకుదెంచి రప్పు డుభయసైన్యంబు లభయప్రకారంబునం బోరినపోరు ఘోరంబై సమరాంగణంబంతయు దేవదానవమాంసశోణితకర్దమం బయ్యె నయ్యవసరంబున. 602

మహిషాసురుండు దేవసేనల నోడించుట.

చ. అధికబలాంచితుండు మహిషాసురుఁ డీ నది మోను లెత్తఁగాఁ
గుధర మొకండు కేలఁ గొని • కో యని యార్చుచుఁ దాఁకుదెంచి తాఁ
బ్రధన మొనర్చునిర్జరులపైఁ బడవైచుచు దాన నత్తఱిన్
విధివశతన్ గలంగి పది వేవురువేల్పులు ద్రెళ్లి రార్తులై. 603

తే.†దానవులఁ గూడి మహిషుఁ డహీనసత్త్వుఁడై కసిమసంగి సింగము • వీఁక తుదరి
మృగములం బోలెఁ దోలుచు నింద్రముఖ్యులూడనిం బాడి రెంతయు నుదిలకొనుచు.

ఉ. అడ్డొకయింత లేకసురుఁ • డాహవదోహలమత్తచిత్తుఁడై
యొడ్డినసేనతోడ నని • నోహరిసాహరి సంచరించుచున్
జెడ్డఁ దలంచి క్రుద్ధుఁడయి • చెచ్చెర రుద్రుని డాసి తద్రథం
బడ్డుచుఁ గూబరంబుఁ గొనె • నార్పుల దిక్కులు పిక్కటిల్లఁగన్. 605

తరళము. తెగియె రుద్రుఁ డటంచు దైత్యులు • దిక్కు లెల్లను మ్రోయఁగా
మిగుల నార్చిరి దేవమానులు • మే నెఱుంగక మూర్ఛలోఁ
దగిలి రెల్లజగంబునుం గతి • దప్పిన ట్లయి కుందె నా
నగవిభేదియుఁ జచ్చినట్లు కనంబడె న్వడి వజ్రమున్. 606

* నీద్రంపుతేండు = పాము. ‡ ఆశుగము = గాలి.
† ఊడనిం బాడు = పొంగు. ఉదిలకొను = చలిపించు.



వ. అయ్యవసరంబున నుగ్రుం డుగ్రమూర్తి యగు కార్తికేయుం డలంచుటయు నతండును.

ఉ.*ఎఱ్ఱనిభూషణాంబరము • లెఱ్ఱనిపూవులు దాల్చి మేనియం
దెఱ్ఱనిగుఱ్ఱముల్ గలిగి • యొంతయు విం తగు తేరు నెక్కి పై
నెఱ్ఱనిబొందళంబురుచు • లీనఁగ మోములు జేవురింపఁగా
నెఱ్ఱనివేల్పు నాఁ దనరి • యేడ్తెఱఁ జూచె నరాతి నాతఁడున్. 608

శా. కల్పానల్పదివాకరుం డనఁగ నుగ్రస్ఫూర్తిమై మించుచున్
వేల్పుంజోదుల కీశ్వరుం డతఁడు దోరీశ్వర్యం బవార్యంబుగాఁ
బొల్పుం గాంచిన వానిఁ గాంచి దనుజుల్ • పోఁ డీఁగి వేగంబునన్
స్వల్పస్థైర్యమునేని బూనక భయభ్రాంతాత్ములై రెంతయున్. 609

వ. ఆసమయంబున. 610

కుమారస్వామి మహిషాసురుం జంపుట.

మత్త. అగ్నిసంభవుఁ డుగ్రుఁడై మహిషాసురుం గుఱి చేసి పె
ల్లగ్నిమంటలఁ గ్రక్కుశక్తి మహాజవంబున నేయ ను
ద్విగ్నుఁడై మహిషాసురుం డతిదీనతం బడె శక్తియున్
భగ్నకాయునిఁ జేసి త్రుంచెను • వానిశీర్షము వ్రేల్మిడిన్. 611

తే. తలయు నట్టయు వేఱుగాఁ దొలఁగి జీవితముల మహిషాసురుఁడు వోయెం దచ్ఛిరంబు
పదియునాఱామడలమేరఁ • బర్వెఁ బర్వతమ్మువలె నుత్తరకురుదేశమ్ము దారి. 612

వ. దానం జేసి యుత్తరకురుభూము లగమ్యంబు లయ్యె. 613

తే. శక్తిధరుఁ డంత మాటి కాశక్తి వైచి, వేనవేలుగఁ దునిమె నా దానవులను
గుహునిపారిషదుల్ వారిఁ • గూల్చి పలను, దినియు నెత్తురు ద్రావిరి తనియునట్లు.

వ. ఇట్లొక్కముహూర్తమాత్రంబున మిత్రుండు తమిస్రంబులం బోలె నగ్ని వృక్షంబులం బోలె గాలి మేఘజాలంబులం బోలెఁ గార్తికేయుం డెల్లదానవుల నుగ్గునూచంబు గావించి దేవ లెల్లఁ దన్నుఁ బ్రశంసించుచుండం జని దేవదేవునిపాదారవిందంబుల కభివందనం బాచరించె నవుడు దేవేంద్రుండు వానిఁ గౌఁగిలించుకొని యి ట్లనియె. 615

మ.†అహహా! యే మని చెప్పవాఁడ రణధుర్యా! నీదుశౌర్యం బిటన్
ద్రుహిణప్రాప్తవరప్రభావమున నీదుష్టుండు కన్గాన క

* బొందళము = కవచము.; ఎఱ్ఱవేల్పు = సూర్యుఁడు.
† ద్రుహిణుఁడు = బ్రహ్మ.

స్వాహామున్ హుమ్ముఁ దృణీకరించు బలగర్వాధిక్య మేపారి వీ
ని హారుం డాత్రిపురంబులుం బతె నని స్పర్ధించి తీ విత్తతిన్. 616

మత్తకోకిలము. వీనిఁ బోలినవారి చేవుర విక్రమాఢ్యుల దైత్యులన్
బూని నీయనుయాయు లెల్లరు పోవనీయక ప్రమింగి రే
మీనగుల్ విడఁ గంటి మెచ్చుచు నీవ మా కొడయుండ వో
మానినన్నుత నీదుసేవ ప్రథమ్మప్రయత్నమ యిట్లగున్. 617

వ. నీ వజేయుండవు నీకీర్తియు జగత్త్రయంబునం దక్షయం బగు నీకు మే మెప్పుడును వశంవదుల మని యనేకవిధంబులం బ్రశంసించుచుఁ బాకశాసనుండు పరమేశ్వరానుజ్ఞాతుం డై స్వర్గంబునకు నిర్గమించె నాదిదేవుండు నవు డాదిత్యులం బిలిచి మీరీకుమారు నాకు మాఱుగాఁ జూచునది యని చెప్పి పార్వతీసహితుం డై భద్రవటంబునకుం జనియె వేల్పులు ననల్పకౌతూహలాయత్తచిత్తు లై తమతమపొందు పట్లకుం బోయి రని మఱియును. 618

శా. స్కందుం డట్లమరారులం దునిమి యొక్కండై వనాటన్ జగ
ద్బృందంబున్ స్వవశంబునంద కొని సందీపించె నేతత్కథన్
సందేహం బరుగన్ బఠించిన మహైశ్వర్యంబులం బొందుచున్
స్కందానుగ్రహపాత్రు లై జనులు భాస్వత్కీర్తి నుం బ్రొప్పుదుర్. 619

వ. అనిన ధర్మనందనుండు మార్కండేయుం దిలకించి. 620

క. స్కందుం డేయేపేళ్లం, బొందుపడు న్వాని వినఁ బుద్ధి యగు న్వా
డెందమున మెచ్చి మునిజనబృందారకుఁ డిట్లు వలికెఁ బేర్మి దలిర్పన్. 621

—— మార్కండేయుండు కుమారస్వామిపేళ్లు చెప్పి స్తుతించుట. ——

సీ. స్కందుఁ డాగ్నేయుండు చండుండు రౌద్రుండు, శుచి దీప్తకీర్తి విశుద్ధమూర్తి
శరవణోద్భవుఁడు క్రౌంచధ్వంసి ధర్మాత్ముఁ, డనఘుఁ డనామయుం డప్రమేయుఁ
డసురసేనాని మండాననుం డంబికాసుతుఁడు షాణ్మాతురుం డతిబలుండు
స్వాహేయుఁ డీశ్వరసంభవుండును మహాపార్షదుండును మాతృగాంచితుండు
తే. కార్తికేయుండు సువ్రతుఁ డార్తిహరుఁడు, బాహులేయుఁడు గుహుఁడు దేవప్రియుండు
శక్తిధరుఁడు కుమారుండు శాంతమూర్తి, శ్రీనివాసప్రియుండు షష్ఠిప్రియుండు. 622

తే. నైగమేయుఁడు దేవసేనాప్రియుండు, శోభనాంగుండు రేవతీసుతుఁడు కనక
కేశ్వరుఁడు మహాసేనుఁ డహీనశక్తి, లోనగునభిఖ్య లాతని కౌను వెలయ. 623



క. ఈవరనామము లెవ్వఁడు, భావమునం దెంచి నిష్ఠఁ బఠియించునో వాఁ
డీవసుధ ధనముఁ గీర్తియు, నావల స్వర్గమును బొందు నానందమునన్. 624

వ. అని చెప్పుచు మార్కండేయుండు కార్తికేయు నుద్దేశించి. 625

సీ. బ్రహ్మణ్యుఁడవు నీవ బ్రహ్మజ్ఞుఁడవు నీవ, బ్రహ్మవేత్తవు నీవ బ్రహ్మ నీవ
బ్రహ్మేశుఁడవు నీవ బ్రహ్మప్రియుండ నీవ, బ్రాహ్మణాన్వయులకుఁ బ్రభువ నీవ
స్వాహాస్వధావషట్కారంబులును నీవ, మంత్రతంత్రము నీవ మఖము నీవ
సంవత్సరము నీవ షడృతువులును నీవ, మాసాయనము నీవ వాసరములు
ఆ. నీవ పుష్కరాక్షుఁ డీవ సహస్రాక్షుఁ, డీవ పద్మవక్త్రుఁ డీవ సర్వ
దేవరక్షకుండ వీవ సేనాపతి, వీవ లోకవిభుఁడ వీవ దేవ. 626

ఉ. నీవ సహస్రశీర్షుఁడవు నీవ సహస్రపదుండ వారయన్
నీవ సమస్తలోకములనేతవు త్రాతవు సంవిధాతవున్
నీవ సహస్రభానుఁడవు నీవ విరాట్పురుషుండ విన్న నో
దేవ నినున్ భజించెద మదిం గరుణింప ననుగ్రహింపవే. 627

శా. గంగాపుత్రుఁడవై మహీతలమునం గన్పట్టి షట్కృత్తికల్
రంగారం గొమరుం జటంచుఁ దలఁపన్ రంజిల్లియుం దేవసే
నం గామించి యభీష్టరూపముల నౌన్నత్యంబునం గ్రాలుచున్
సంగాతంబు సమస్తలోకములకున్ సంధించుచు న్నుంచెదన్. 628

ఉ. ఈవ సనాతనంబులకు నెన్న సనాతనుఁ డై సనాఁడ వై
భావితప్రభావమునఁ బూజ్యుల కెల్లను బూజ్యుఁ డై జగ
జ్జీవనభూతుఁ డై ప్రజకు శ్రేయము లిచ్చుచు నెల్లలోకముల్
దేవుఁడ వై భరించెదవు దీనులపాల వసించి యెప్పుడున్. 629

శా. సర్వజ్ఞుండవు సర్వరక్షకుఁడ వీసర్వంబు నీచే నగున్
సర్వేశాత్మజ వేఁడు నిన్నుఁ బొగడన్ శక్తుం డగున్ వేదముల్
నిర్వీర్యత్వము నొందుచుండు ననుచో నే నెంత నాస్తోత్ర మీ
యుర్విం బ్రస్తుతి సేయఁ జేయవె దయాంభో! నిన్నుఁ బ్రార్థించెదన్. 630

వ. అని ప్రస్తుతించి మార్కండేయుం డీస్తోత్రంబు పఠించి వినినవారి కాయురారోగ్యైశ్వర్యాభివృద్ధియు స్కందసాలోక్యంబు నగు నని చెప్పిన విని యుధిష్ఠిరుండు సంతుష్టహృదయుం డై తమ్ములుం దాను దామోదరుండు నమ్మునిని నుపాసించి ప్రశంసించె నిట్లు రెల్లరు నిష్టకథానులాపంబులం బ్రొద్దు పుచ్చుచున్నసమయంబున సత్యభామయు

ద్రౌపదియు నొక్కెడం గూరుచుండి ప్రియసల్లాపంబులం దేలుచుండి రహఃప్రదేశాం
తంబున సత్యభామ ద్రౌపదిం జూచి యి ట్లనియె. 631

—ద్రౌపదీసత్యభామాసంవాదపర్వము.—

మ. *తరుణీ నీవిభు లేవురుం భుజబలో◆ద్యద్విక్రమారంభులుం
దరుణుల్ వేల్పులఁ బోనివారు వరదుల్ ◆ తా రెప్పుడు న్నీపయిం
గరుణం బూనియ యుందురు గాని కినుకం ◆ గైకోరొకింతేనియుం
నిరతంబుం నగుమోము వారల కగుం ◆ నీవట్లు సెప్పట్టునం. 632

మ. వ్రతమో కాక తపంబొ లేక జపమో ◆ వశ్యౌషధంబో మహో
న్నతవిద్యామహిమంబొ మంత్రమొ లస◆న్నైపథ్యకర్మంబొ నా
మతికిం దోఁపదు కారణంబు తెలుపం ◆ బ్రార్థింతు నే నట్లు చే
సి తగం గృష్ణు వశీకరించుకొన నా◆సింతుం సరోజాననా. 633

వ. అని పలికినం బాంచాలి సత్యభామం గాంచి యి ట్లనియె. 634

చ. కులటలవృత్త మి ట్లడుగఁ ◆ గూడునొకో నను లోకవంద్యుఁ డై
వెలసినవాసుదేవునకు ◆ వేయివిధంబుల గారవింపఁ గా
నలరెడునాల వయ్యు నిటు ◆ లాత్మఁ దలంచి వచించితే మనం
గల నిను నిట్టు లొప్పునది ◆ గా దని మాత్రము గాక కామినీ. 635

ఉ. మందులు మాకులుం మఱియు ◆ మంత్రములుం బచరించి నాథునిం
బొందికఁ జేతఁ బెట్టుకొని ◆ బొమ్మ తెఱంగునఁ ద్రిప్పఁ జూచుటల్
మందమతుల్ పొనర్చునవి ◆ మానిని దానన తొంటిప్రేమయుం
మ్రిందును దాని నింట నగు◆నాగము నాఁ గను దా నెఱింగినం. 636

తే. మందులును మంత్రములు పెట్టు◆మగువఁ గాంచి
వెఱచఱచుచుండు నెప్పుడు ◆ విభుఁడు వాని
మదికి శాంతియు సుఖమును ◆ మాయు నట్టి
డెట్లు వశగుఁ డగునొ చెప్పు ◆ మిందువదన. 637

మ. ప్రియునిం గైవసమందు నిల్పుకొన న◆ర్థిం మందులం బెట్టునా
మ యథార్థంబ యెఘూంను వాఁ దలఁప నా◆మందె విషప్రాయ మై
ప్రియునిం జంపును జంప కున్నను మెయిం ◆ బ్రేరేచి రోగంబులం
భయదుఃఖాదుల నెల్లకాలము గడుం ◆ బాధించు నెంతేనియుం. 638

* తరుణులు = పిన్న వయసుగలవారు; వరదులు = వరమిచ్చువారు.



తే. *మగువ పెట్టినమందున◆మగఁడు చెవుడు, గ్రుడ్డియును మూఁగయును గల్గి◆జడ్డియగు న
పుంసకుం డగుఁ గుష్ఠి యౌఁ ◆ బొడవడంగుఁ, గానఁ గావింపఁ దగ దట్టి◆కర్మ మెపుడు.

తే. ధవుని విప్రియమునఁ గూర్చు◆దానఁగ్రోలుఁ,గంటియిహమందుఁబరమందుఁ◆గాకపాప
కూపమునఁ గూలఁగానయి◆ఘోరదుఃఖ, మనుభవించెడునని శ్రుతు ◆ లను నెలంత.

వ. అని మఱియు నోసత్యభామా! పాండవేయులపాల నే నెట్టివృత్తిం బ్రవర్తించుచుంటినో
సత్యంబు చెప్పెద నాకర్ణింపుము. 641

—ద్రౌపది సత్యభామకుఁ దనప్రవర్తనం బెఱిఁగించుట.—

తే. కామమును గ్రోధమును నహం◆కార మాత్మఁ,గడుర నీయక నే నెప్డుఁ ◆ గడఁకతో న
దారు లగుపాండుపుత్రులఁ ◆ గారవించి, సేవ సేయుచునుందు నో◆పూపుఁబోఁడి. 642

ఉ. ‡నెయ్యము తియ్యముం గలిగి ◆ నేరిమి పెంపున భర్తృచిత్తమం
దెయ్యెడ నాదుచిత్తము నొ◆కిం తెడ గల్గకయుండ నిల్పి నా
దయ్యము భర్తలే యనుచుఁ ◆ దత్పరతం భయభక్తియుక్తులం
వ్రియ్యక సంచరించెదను ◆ వారక వారలమేనినీడ నాం. 643

మత్తకోకిలము. దేవుఁ డైన మనుష్యుఁ డైనను ◆ దివ్యభూషణభూషితుం
డై వెలుంగుచునున్న సుందరుఁ ◆ డైన మిక్కిలి యొక్కఁడుం
జేవయుం గలకోడెకాఁ డయి ◆ చెన్ను మీఱుచునున్న నే
భావమందుఁ దలంప నన్యునిఁ ◆ బాడి వీడి పడంతుకా. 644

సీ. నాథులకన్న ముం ◆ స్నానభోజనశయ,నాదికర్మములు నే ◆ నాచరింపఁ
బతు లొంటుకడనుండి ◆ పఱతేర నెదు రేగి, తోడి తెచ్చి పూజింతు ◆ నడఁకువమెయి
జీవేశ్వరులపాద◆సేవాదికృత్యము, లేన తీర్తును బుచ్చ ◆ కితరజనుల
ధవు లెపుడుం ముట్ట◆నివి కట్టనివి నేను, ముట్టంగఁ గట్టంగ ◆ బుద్ధిసేయఁ

తే. బ్రాణనాథుల కేకాల◆మందు నేది, హిత మగునొ దానిఁ జేయంగ ◆ నిచ్చగింతు
మగలకన్నను వేఱొక్కఁ ◆ డగుచు దేవుఁ, డుండు నని నేఁ దలంపఁబో ◆ నుల్లమందు.

మ. ధనధాన్యంబులు వస్తువాహనములుం ◆ దత్సన్మహాగేహముల్
దనరం జూచుచునుందు నెల్లపు డమం◆దం బై నడెందంబునం
జనులం బుచ్చక నేన వంటకము ని◆చ్చం జేసి నిచ్చల్ గృహం
బునకుం వచ్చినవారి కిచ్చెదను సం◆పూర్ణాతిథేయంబులం. 646

* జడ్డి = జడుఁడు (ఇట్లు గంజాముమండలమున వాడుదురు.)
‡ వ్రియ్యు = చీలు; వ్రియ్యక (అనఁగా విడక యని తాత్పర్యము).

క. *తలఁకొటిఁ బలుకరా దే, నిలువక చెరవారి కెలన ♦ నిగిడింపను జా
తులఁ గతము లేనినవ్వున, మలఁగక లెంకలను నైన ♦ మదిఁ గోపింపన్. 647

చ. ములుగొనమాత్ర సత్యపథమును న్విడనాడినపొంతఁ బోవ భ
ర్తల విడి కొంతసే పయినఁ ♦ గ్రాలఁ దలంపను బ్రోషితత్వముం
గలిగిన వారు వచ్చుదనుకం గయిసేయక సద్వ్రతంబులన్
మెలఁగుదు నేఁ దదాగమనమే మదిఁ గోరుచు నెల్లప్రొద్దులన్. 648

మ. మును మాయత్త వచించినట్లు నిరతంబున్ సత్కుటుంబంబులన్
ఘనతం గాంచినధర్మముల్ విడక భిక్షాశ్రాద్ధబల్యాదులన్
వినయంబు న్నియమంబు పేర్పడఁగఁ గావింతుం దగ న్నేన స
జ్జనులన్ భక్తి భజింతు భర్తలయనుజ్ఞం బూని యెల్లప్పుడున్. 649

తే. మృదువులున్ సత్యశీలు రమేయవిక్ర, మాఢ్యు లాశీవిషోపము ♦ లైనపతులఁ
దవిలి వారిమాటల జవదాఁట కెపుడు, మెలఁగుచుందు శుశ్రూష ♦ లలరఁజేసి.

ఉ. అత్తకు స్నానపానములయందును భోజనభాజనాదులం
దొత్తులఁ బుచ్చకేన చని ♦ తోరపుభక్తి భజింతు నామె వా
యెత్తక మున్న సన్నలనయే నగునన్నియుఁ దీర్తుఁ దత్ప్రియం
బెత్తఱిఁ గూర్తుఁ జిత్తమున నేనియు విప్రియ మొంద కింతయున్. 651

వ. తొల్లి యింద్రప్రస్థపురంబున ధర్మనందనునిబంతి నిత్యంబును రుక్మపాత్రంబుల నెన్మిదివేలబ్రాహ్మణులును ముప్పండ్రు ముప్పండ్రు దాసులు గలయెనుబదియెనిమిదివేల స్నాతకవ్రతులును బదివేవు రూర్ధ్వరేతస్కు లగుయతులును భుజింతురు వారి కెల్ల యథార్హంబుగ భోజనాచ్ఛాదనాదు లేన విచారించుచుందు మఱియు మణిమయాలంకారాలంకృతులును నృత్తగీతవిశారదలు నగునూఱువేలదాను లీధర్మతనయునింట దివారాత్రంబును బాత్రహస్త లై యభ్యాగతజనభోజనంబు లొడఁగూర్చువారు వారిం బేర్వేరువరుస నెఱింగి పరామర్శించి పనిఁ గొనుచుందు నాకర్ణింపుము. 652

సీ. నూఱువే లేనుఁగులు ♦ నూఱువే లుత్తమముల్, పొదలుచుండును ధర్మపుత్రునింట
వాని నన్నింటిని ♦ వలయువిధంబున, నేఁ బరామర్శింతు ♦ నెల్లప్రొద్దు
నంతిపురిం గల్గుకాంతాజనంబుతో, భృత్యవర్గం బెల్ల ♦ నేన ప్రోతు
నర్థపూర్ణములు కోశాగారములలోన, నాయవ్యయంబు లే ♦ నరయుచుందు

* లెంక = భృత్యుఁడు.



తే. నిట్టినామీఁదఁ బాండవు ♦ లెల్లకుటుంబ, భార మంతయునుం బెట్టి ♦ వారు సౌఖ్య
గరిమఁ దేలుచునుందు రెక్కాలమందుఁ, గష్టపా టన్న దెంతయుఁ ♦ గలుగకుండ.

మ. అటులే రేలుఁ బవళ్ళు నిద్రయును సాహారంబునుం బొంద కె
ట్టికిన్ సౌఖ్య మనంగ నెట్టిదియొ కానం బోక తద్భారమున్
బటుశక్తిన్ భరియించి భర్తల నెదం ♦ భావించి సేవించి నే
నిటు వర్తింతును గాని నీ వనినయ ♦ ట్లింతే నెఱుంగం జుమీ. 654

ఆ. అనుచుఁ గృష్ణ వలుక ♦ విని కృష్ణభామిని, మనమునందు సిగ్గు ♦ మనల నామెఁ
దఱిసి తెలియ కిట్లు ♦ తప్పు చేసితి నిది, సాపహాస మనుచు ♦ సైఁపు మమ్మ. 655

వ. అనుటయుం బాంచాలి యించుక మందహాసంబు గావించి యింపొంబోఁడీ! ప్రాణనాథు వశీకరించుకొనం దలఁచితేని తన్మార్గంబు గల దెఱింగించెద విను మని మఱియును. 656

ద్రౌపది సత్యభామకుఁ బతివ్రతాధర్మములు సెప్పుట.

చ. మగఁ డొకరుండు గాక మహిమండలమందు మఱొక్క దైవతం
బగు నని వేదశాస్త్రములయందుఁ గనంబడ దట్టివానికిన్
మగువ సదా భజించిన మనంబున నాతఁడు సంతసించి పెం
పగుదయఁ గాంచు నొందుఁగతి ♦ యైనఁ గ్రుధ న్నిరసించు నెంచఁగన్. 657

తే. భర్త సంతుష్టుఁ డగునేని ♦ భార్య కఖిల, కామములు దీరు సంతతి ♦ గలుగు వివిధ
భోగములు వచ్చు స్వర్గంబుఁ ♦ బొంద నగును, శాశ్వతం బగుకీర్తియు ♦ సంభవించు.

క. మగఁ డలిగెనేని సౌఖ్యము, డగుఁ గూటికి గుడ్డ కెపుడు ♦ దేవురు వడ నా
జగమున నిందాపాత్రమ, యగు మగువకు నిరయ మంద ♦ నౌ నిది వింటే. 659

ఉ. మిక్కిలి కష్టముల్ పడినమీఁదటఁ గాని సుఖంబు గల్గఁబో
దొక్కసుమంతలోన నిది ♦ యుల్లమునం దలపోసి సత్య! నీ
వెక్కువభక్తి కోర్చి హృదయేశ్వరు నీశ్వరుఁ గృష్ణు జిష్ణునిన్
మక్కువ చేసి కొల్వుము క్రమంబున నీ కనురక్తుఁ డాతఁ డౌ. 660

క. నీచేత నతఁడు తృప్తుం, డై చెలియరో! నిన్ను వలచి ♦ యధికప్రేమన్
జూచుచు నిఖిలార్థంబుల్, దాఁచక నీ కిచ్చు ననుచు ♦ దాక్షిణ్యమునన్. 661

ఉ. ద్వారగతుండు గా స్వరము ♦ వచ్చినయేనియు లేచి యంత లోఁ
జేరిన నీమనోహరుని ♦ చెల్మికిఁ బాత్రమ వై ప్రియంబునన్
గూరిచి యర్ఘ్యపాద్యములఁ ♦ గోరిక మీఱ శుభాసనంబునం
జేరిచి కొల్వఁగాఁ దగును ♦ చేడెలఁ బుచ్చక నీవ నిచ్చలున్. 662

మ. కమలాక్షుం డెదిరేనియుం బనికి నై కాంక్షించి దూతిన్ వినో
గమునం గూర్చిన యంతలో నెఱిఁగి యక్కార్యంబు నీవే ప్రాన
ర్ప్యము దాన న్మది సంతసించి యతఁ డెప్డున్ నిన్నుఁ బ్రేమించి నీ
సముఖంబందె వసించు వశ్యుఁ డగుచున్ సర్వప్రకారంబులన్. 664

తే. సాంబకందర్పముఖ్యులై చనెడునీదు,పుత్రకులతోడ నైన నేప్రొద్దుఁ గలసి
యేకతమ మాటలాడుట లోకమందుఁ, జెల్ల దని నీ వెఱుంగు మోహాల్లకళయ.

సీ. పతి నీకడఁ జెఱుంగఁ బలికినయది రహస్యము గాకయున్న దాఁచంగ వలయు
సవతి యెవ్వతియేని దవ్వ నెదిరించి పల్కిన నట్లుగా కీవు చనఁగ వలయు
విభున కనుంగులు ప్రియు లగువారి భోజనభాజనాదులఁ దనుప వలయు
మగనికిఁ గానివా రగుదురే వారు నీ నెఱచుట్ట లైనను దొలఁగ వలయుఁ

తే. బరపురుషగోష్ఠి మానంబు పఱఁగఁ వలయుఁ
గులట లగువారలతో మాట తొలఁచ వలయు
నుత్తమస్త్రీలతో మైత్రి నుండ వలయుఁ
సాధు వగుచిత్తవృత్తిమైఁ జనఁగ వలయు. 665

వ. ఇట్లు ప్రవర్తించుట కులాంగనోచితధర్మంబు గావున నీ విట్లు ప్రవర్తింపుము దాన నీ
కిహపరసౌఖ్యంబుఁ బొందఁ గలుగు ననిన సంతసించుచు సాత్రాజితి పాంచాలిం
బ్రశంసించె నంత. 666

శ్రీకృష్ణుఁడు సత్యభామతోఁ బాండవుల వీడ్కొని చనుట.

మ. యదువంశాభరణాయమానుఁ డగు నయ్యబ్జాక్షుఁ డక్షీణసం
పద పెంపొందఁగ నుండి పాండవులతో మౌనీంద్రవారంబుతో
హృదయానందకరంబుగాఁ గథల నెన్నే విన్నవాఁడై సుసం
విదముం జేసి మునీంద్రులం బయనమై వేడ్కన్ సతిం బిల్చుడున్. 667

వ. సత్యభామయు ద్రౌపదిం గాంచి సంభావించి యిట్లనియె. 668

మ. వనులం దిట్లు సుఖంబు గాన కెపుడున్ వర్తింతు మంచు న్మదిన్
వనటం బొందకు దేవతుల్యు లగు నీ భర్తల్ సపత్నావళిం
దునుమం జాలి ధరిత్రి నేలుదురు నీ దుఃఖంబు చల్లారు నీ
వనయుంబున్ సుఖియింపఁ జూచెదము మే మత్యంతహర్షంబునన్. 669

తే. అడవులకు నేగుతఱి నిన్ను నరసి నగిన,కురుకులాంగన లెల్ల రంధిరమ పరమ
దుఃఖ మందెద రిట్టిమా దుఃఖములకు,హేతు లగువారు చచ్చి రం చెంచు మింక.



వ. నీపుత్రులు ప్రతివింధ్యాదు లైదుగు కుశలులై ద్వారవతియం దభిమన్యుతో ధను
ర్వేదం బభ్యసించుచున్నవారు సుభద్రయు రుక్మిణియు వారి నీవుం బోలెఁ బోషించు
చున్నవారు రామకృష్ణాద్యంధకవృష్ణిప్రవరు లెల్లరుఁ బ్రద్యుమ్నాదులకన్న మిన్నగా
వారిం గౌరవించుచున్నవారు మామామయు నహర్నిశంబు వారిభోజనాచ్ఛాద
నాదు లారయుచున్నవాఁడు నీ వాకుమారులచెనఁ జింత దక్కి యుండు మే నిదె పోయి
వచ్చెద ననుజ్ఞ యొసంగు మని కృష్ణవల్లభ కృష్ణకుం బ్రదక్షిణంబు చేసి వీడ్కొని
వాసుదేవరథం బధిష్ఠించె వాసుదేవుండును ద్రౌపది నూఱడించుచు సతీసహితుం
డై నిజపురంబునకుం జనియె నంత మార్కండేయుండును నిజాశ్రమంబునకు నిర్గ
మించె నని చెప్పిన విని జనమేజయుండు వైశంపాయనుం జూచి. 671

క. ఘనశీతాతపవాత,ప్రణిహతతను లగుచుఁ బాండుపరపుత్రకు లా
వనమం దుండి యనంతర, మొనరించిన దేమి చెప్పు మో మునినాథా. 672

వ. అని యడిగిన నతండు చెప్పినట్లు. 673

ఆశ్వాసాంతము.

చ. కదలఁగనీక నన్నెపుడుఁ గామముఁ గ్రోధము లోభ మోహముల్
మదమును మత్సరంబును గ్రమంబున శాత్రవులట్లు చుట్టుకో
గ్రాదకొని ఘోరసంసరణకూపమునం బడి మున్గుచుంటి నో
సదయ! సముద్ధరింపవె ప్రసన్నుఁడవై సకలేశ్వరేశ్వరా. 674

గద్యము.

ఇది శ్రీమదఘునాతనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్త్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునం
దారణ్యపర్వంబున సప్తమాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీ

బాలాత్రిపురసుందర్యైనమః.

# శ్రీకృష్ణభారతము

## ఆరణ్యపర్వము.—అష్టమాశ్వాసము.

—:o:—



లకు నాలయ మగుచున్
మే లందిననందిగామ ♦ మేదినియందున్
లీలాకర మై తగుము
క్త్రీలాపురి నేలుదొరను ♦ నేలుము దేవా. 1

### ఘోషయాత్రావర్ణనము.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కి ట్లనియె నట్లు వాష్ణేయుండు చనినవెనుకఁ బాండవేయు లక్కామ్యకకాననంబు విడనాడి నానానదీనదవనపర్వతంబు లవలోకించుచు ద్వైతవనంబునకుం జని యట నాశసరోవరతీరంబున నుటజంబులు గావించుకొని త మ్మనుసరించుకొని వచ్చినతపస్స్వాధ్యాయసంపన్ను లగుబ్రాహ్మణోత్తముల సత్కరించుచు నివసించి యుండి రట్టియెడ. 2

తే. అందుఁ గలబ్రాహ్మణుం డొక్కఁ ♦ డచ్చోటు వాసి, కరిపురంబునకుం జని ♦ కౌతుకమున
నాంబికేయునిఁ గని తత్స ♦ మర్చితుఁ డయి, తెలివిమెయి నిష్టగోష్ఠులఁ ♦ దేల్చుచుండె.

వ. అట్టియవసరంబున నానావిధకథాకథనకుశలుం డగునాతనిం గని ధృతరాష్ట్రుండు పాండవేయుల నెఱుంగుదే యనిన నతం డతనిదిక్కు మొగం బై యి ట్లనియె. 4

చ.*నృపవర! నే నెఱుంగుదు న ♦ నింద్యచరిత్రులఁ బాండుపుత్రులన్
వ్యపగతవైభవార్థు లయి ♦ వాసిఁ దొఱంగి వనాంతరంబులన్
గృపణులు వోలె దుఃఖమునఁ ♦ గీల్కొని పొక్కుచుఁ జిక్కియున్నవా
రిపు డలవీరవర్త్ని యగు ♦ కృష్ణవెతల్ వివరింప శక్యమే. 5

* కృపణులు=దరిద్రులు. కీల్కొని=తగులుకొని.



వ. అనిన విని వైచిత్ర్యవీర్యుండు కృపాభిభూతుండును దైన్యాభిహతాంతరాత్ముండు నై నిట్టూర్పు నిగిడించుచుం దనచేతకుం దాన తిట్టుకొనుచు నెట్టకేలకుం గట్టువడి యి ట్లనియె. 6

### ధృతరాష్ట్రుండు పాండవులవనవాసక్లేశము విని విచారించుట.

శా.*పుత్రాగ్రీయుఁ డజాతశత్రుఁడు జగ ♦ త్పూజ్యుండు దా నెప్పుడున్
వృత్రారిప్రతిమానవైభవమునన్ ♦ వెల్గొందుచుం దొల్లి రేల్
స్తోత్రార్హం బగుశయ్యఁ బండుకొని వం ♦ దుల్ పాడ మేల్కాంచు భూ
పత్రాళిం బడి యిప్డు పుల్గు లవి లే ♦ వన్ లేచు రే పాడఁగన్. 7

ఉ. ఆపగిదిన్ వనాంతరము ♦ లం దగుగాలికి నెండ కోర్చి తాఁ
గోపపరిప్లుతాంగుఁడును ♦ ఘూర్ణితనేత్రుఁడు నై వృకోదరుం
డాపుడమిం బడల్పడి ని ♦ జాంగనచెంగట సింహమట్లు లో
నోపక రోఁజుచుండెడి నొ ♦ కో తమపాటు దలంచుచు న్వగన్. 8

మ. సుఖ మింతేనియు లేక కాఱడవులన్ ♦ శోకించుచున్ సోదరుల్
సఖియుం గాఁపుర ముండి కాఱియపడన్ ♦ స్వాంతంబునం దెన్నుచున్
సుకుమారుం డగుసవ్యసాచి కినుకం ♦ జూపట్టియున్ ధర్మజ
ప్రికటాజ్ఞం బడి రోఁజుచుండుఁ గద స ♦ ర్పంబట్లు దర్పంబునన్. 9

తే. రూపవంతులు కవ లమ ♦ రోపము లట, ధర్మసత్యప్రబద్ధు లై ♦ ధర్మసుతునిఁ
దగిలి శాంతి యొకింతయుఁ ♦ దగులఁబోక, యిడుమలఁబడుచునుంద్రు ర ♦ య్యడవులందు.

ఆ. అకట ధర్మపుత్త్రు ♦ నకు నాకుమారుల, మీఁదఁ గోప ముండఁ ♦ బోదు వాని
ననుసరించు నెట్టు ♦ లైన ధనంజయుం, డింక భీమసేను ♦ నేమి చెప్ప. 11

శా. ఆవాయుప్రభవుండు ధర్మజునివా ♦ క్యంబందుఁ దా బద్ధుఁ డై
చేవం బూనియు నేమి సేయుటకునుం ♦ జిత్తంబునం దోఁప కం
డేనేళ్ళ శయనించియుం గునుక కిం ♦ తే క్రోధి యై నాపత్రిజన్
జావం జేయఁగఁ గాల మూరయుఁ గదే ♦ చర్చింప నిం కేటికిన్. 12

ఉ.‡ద్యూతమునందు ధర్మసుతుఁ ♦ డోడినయప్పుడు దుస్ససేనుఁ డే
త్రో తలకొట్టమారి యయి ♦ నోటికి వచ్చినయట్లు కూసిన
కూఁతలు కారుచిచ్చు తృణ ♦ గుచ్ఛముఁ బోలె వృకోదరాంగమున్
బ్రాఁతిగ నేర్చు నిప్డు వన ♦ వాసము పేర్చినగాలి దానికిన్. 13

* రేపు=ప్రాతఃకాలము; అడఁగన్=ప్రవర్తింపఁగా. ‡ తలకొట్టమారి=అవినీతుఁడు. ప్రాఁతి=అధికము.

తే. ఆట్టికోపాగ్ని మండెడు♦నట్టిభీము, నేనుఁ దత్యుష్ణముగ నూర్చు ♦ నీనరేంద్ర
సూనులం బట్టి కాల్చెడు ♦ వాని కపుడు, శోమనీ దగుఁ గవ్వడి ♦ వేఁడివిఁగుఁ. 14

ఉ. *అంతకకాలకల్పు లగు♦నావవనాత్మజుఁడు న్నరుండుఁ దా
నెంతయుఁ బంత మేర్పడ న♦హీనపరాక్రమవిక్రమంబునన్
గొంతటిలోన శాత్రవుల♦కుం దమచేతులలావు చూపుచున్
వింతగ నంతకాలయని♦వేశ మొనంగరె వాఁడితూపులన్. 15

ఉ. †తొల్లిటివాఁడు గాఁ డిపుడు ♦ దోర్బలశాలి సురేంద్రసూతి పెం
పుల్లసిలంగ నిప్పుడమి♦నుండి శరీరముతోడ స్వర్గమున్
దెల్లము గాఁగఁ జేరి యట ♦ దివ్యము లైనచతుర్విధాస్త్రముల్
వల్లభతన్ గ్రహించుకొని ♦ వచ్చె నతండు మనుష్యమాత్రుఁడే. 16

తే. కార్ముకము భీమవేగ మా♦గాండివంబు, జగతి విలుకాఁడు మేటి యా♦సవ్యసాచి
దేవదత్తంబు లస్త్రముల్ ♦ దివ్యతరము, లిట్టివానిని మార్కొను ♦ నెట్టివాఁడు. 17

క. తగ ననుభవించి తీరఁగ, నగుఁ గర్మఫలంబు లెల్ల ♦ నకటా మధు వం
దగ నెంచి పా లెఱుంగక, తెగువం జనుజనుఁడువోలెఁ ♦ దెగుఁ గోడు కయయో.

సీ. ‡దుర్యోధనాదులు ♦ దుర్ద్యూత మొనరించి, పాండవరాజ్యంబు ♦ బడి హరించి
పగతు లై వారికిఁ ♦ బరిపరిదుఃఖముల్, కుడువంగ వలసిన♦కూళ లైరి
ధర్మపుత్రుం డైనఁ ♦ దగదు జూదం బని, యాడి యాడక యుండఁ ♦ డయ్యె నకట!
నేను దుష్పుత్రవ♦శానుగుం డైతిని, గాని కాదన నైతి ♦ దానిఁ దెగడి

తే. తలఁప నిది యంతయును గౌర♦వులకు నంత,కాలముం బలెఁ దోఁచెడుఁ♦గాదె యేమి
చేయువాఁడను నే నిపు ♦ డేయెడలను, గాఁగ నున్నది యె ట్లైనఁ ♦ గాక యున్నె.

వ. అని మఱియును. 20

తే. క్షేత్రమును లెస్సగా దున్ని ♦ చేనుఁ జేసి, కర్షకుఁడు విత్తులం జల్లఁ ♦ గాలవర్ష
మున నది ఫలింపకే లుండుఁ♦బుడమియందు, దైవము ఘటించునది దాఁటి♦తప్పించునె.

తరువోజ. ఒకఁడు ప్రేరేపింప ♦ కుండినఁగాని♦యొయ్యెఁ దనంత వా♦యువు వీచు నెవుడు
కరిత నీరోన్మిసి తాఁ ♦ గను బిడ్డ నిసికిఁ ♦ గలుగు నాశము పవల్ ♦ గనుపింప నిసియుఁ
బరఁగ నశించును ♦ బవలట్లు సుఖముఁ ♦ బడయంగ దుఃఖముఁ ♦ బడయంగఁ గర్త
నరుఁడు గాఁ డది కాల♦నైజము కావు♦నం దేనికిం జింత♦నం గుంద రాదు. 22

* నివేశము = ఇల్లడ; స్థానము. † వల్లభత = ప్రియత్వము. ‡ బడి = క్రమము, శ్రేణి.



ఉ. కాలవిపర్యయం బిటులు ♦ గల్గినదాన మదీయనందనుం
డేల వినున్ హితోక్తు లిటు ♦ లేల పొనర్చు దురోదరంబు తా
నేల పృథాతనూజులమ♦హావిభవంబు హరింప నెంచు నిం
కేల వచింప నిట్లు విధి ♦ యె ట్లగునో మనకర్మ మ ట్లగున్. 23

వ. అని పలుదెఱంగులఁ బలవించుచుం బలికినపలుకు లెల్ల నట నున్నశకుని విని తూర్ణం
బునఁ గర్ణునిసమక్షంబునకుం జని తదుదంతం బంతయు నెఱింగించిన నతండు వానిం
దోడ్కొని దుర్యోధనునిచెంతకుం బోయి ధృతరాష్ట్రునిపరిదేవనం బెల్లఁ దెల్లంబు
గావించి యి ట్లనియె. 24

కర్ణశకునులు పాండవులఁ బంచింప దుర్యోధనునితో దురాలోచనము చేయుట.

సీ. నిజవీర్యమునఁ జేసి ♦ నిలిపితి పాండుపుత్త్రుల మహారణ్యభూ♦ముల మహీశ
రాజ్య మేలుము శంబ♦రద్వేషి తెఱఁగున, వివిధవైభవములు ♦ విస్తరిల్లఁ
బ్రాచ్యుల్ ప్రతీచ్యు లు♦దీచ్యులు దాక్షిణా,త్యులు నీకు నరిగాఁపు♦లుర్విపతులు
ఖాండవప్రస్థమం ♦ దుండినప్పుడు పాండ,వుల కున్నసిరి నిన్నుఁ ♦ గలసె నిపుడు

తే. శోకకర్శితు లైరి నీ♦సూను లెల్ల, సకలసాగరాంబరమహీ♦చక్ర మెల్ల
నీవశం బయి యున్నది ♦ నీవు నేఁడు, వేల్పులం దర్యముఁడు నాఁగ ♦ వెల్గుచుంటి.

ఉ. భూవలయేశ రుద్రగణ♦పూజితుఁ డైనకృతాంతుపోలికన్
దేవగణాంచితుం డయిన♦నిర్జరనాథునిమాడ్కిఁ దారకా
ఘావృతుఁ డైనచంద్రముని♦యట్టులు కౌరవసంవృతుండ వై
నీవ మహావిభూతి గల♦నేతవు నా సుఖముండు మెప్పుడున్. 26

వ. నీయాజ్ఞం బాటింపనిపాండవు లిపుడు సంపదలం బెడఁబాసి వనేచరులతోడం గూడి
ద్వైతవనంబున నున్నవా రని విన్నవాఁడ నీవు మహారాజవై భవంబునం బోయి
సంపద్విహీను లైనవారిం జూచి నీతేజఃప్రభావంబునం జేసి వారిం దపింపఁ జేయుము
వారు భద్రగజాధిరూఢుండ వై యయాతిం బోనినిన్నుం జూచి మిగుల వగలం
బొగలెదరు గాక వినుము. 27

క. అలరించుట మిత్రులమదిఁ, గలఁగించుట శత్రుకోటిఁ ♦ గని యీ రెండున్
గలిమికి ఫల మని తెలియఁగ, వలయున్ లోకైకవల్ల♦భా మనమందున్. 28

చ. †గిరిశిఖరంబు నెక్కికొని ♦ క్రింద మెలంగెడువారిఁ దేఱఁగా
నరసెడురీతి నుచ్చపద♦మందుఁ దలిర్చెడువాఁడు నీచు లై

† తేర = తేట.

కరము కృశించు శాత్రవులఁ గాంచుటకంటెను సుఖం బొకం డిలన్
దొరకదు పుత్త్రుఁ డున్ ధనముఁ దొయ్యలియున్ సరి గావు దానికిన్. 29

శా. తోళ్లుం దొక్కలుఁ గట్టి కాఱడవులం దుంబిందులం దున్నలున్
లేళ్లుం దుప్పులు లోనుగా నగుమృగాళిం గూడి యేడుంపలో
త్రుళ్లో తిండికిఁ గా వగం బొగులు శత్రుం బార్థు వీక్షించుటల్
వ్రేళ్లం జేయుటకంటె మించినది గాదే మోద మూహింపఁగన్. 30

చ. జిలజిలలాడుమేల్మడుఁగు జీరలఁ గట్టి మణీవిభూషణం
బులు మెయినిండఁ బెట్టి బలుముచ్చట లెచ్చఁగ నీనెలంతుకల్
పొలముల నారఁ గట్టి పొలుపు న్విడు ద్రోవదిఁ జూతు రామె నీ
నెలఁతలఁ జూచి చిత్తమున నెంజలి నొందెడుఁ గాత మయ్యెడన్. 31

తే. చదురునం జీర లొలుచుటఁ గదిరినట్టి, దుఃఖమునకన్న మిన్నగు దుఃఖమునను
వైమనస్యంబు నొందు నీవారి నరసి, పాండవాంగన కట్లు గావలదె చెపుమ. 32

వ. అనిన విని సంతసించియు సంతసింపక సుయోధనుండు కర్ణుం జూచి యిట్లనియె. 33

——— దుర్యోధనుం డడవుల నున్న పాండవుల వంచించుట దుర్లభం బని చింతించుట. ———

మ. ఇది నాచిత్తమునం దెసంగునద కానీ దీనికిన్ వృద్ధరా
జెద నీకోలు పొసర్పఁ డెప్పటికి నెంతే వారికిం గూర్చెడిన్
విదితం బయ్యెను గాదె వారలపయిం బ్రీతిం బ్రవర్తించుటల్
తుద కాతండు తపోబలాఢ్యు లని భీతుం డెందు నప్పట్టునన్. 34

క. మన మెట్టియుపాయము న్నిన దానికి మాఱు వన్ని నిలిపెడు మనలన్
జనవచ్చు నెట్టు లచటికిఁ, గనరా దన్యార్థ మొండు గల్పింపంగన్. 35

తే.† ఎఱుఁగుదురు కాదె విదురుని తెఱఁగు లెల్ల, నిన్ను నన్నును వీనిని నెన్నిగతుల
నాడిపోసెనొ జూదంబునాఁడు మీరు, మఱచితిరె వానిచైదముల్ మనమునందు.

క. వయసంపుఁ జిన్నసన్నుఁ, వినియెనే నాతండు చెఱుపనే చూచెను నే
నయమునఁ జూచినఁ గార్యం, బయమున నౌ నని వచింప నౌనే యిచటన్. 37

సీ. అడవుల నిడుమలఁ గుడుచు దాయలఁ జూచు,కంటె నాకుఁ బ్రియంబు గాదు రాజ్య
మజినంబు ధరియించి గజిబిజిపడువారిఁ, గనుట నాబ్రదుకుటకును ఫలంబు
వని నాకలంబులఁ దిని కష్టపడు కృష్ణ, నగుచు వీక్షించుట నాదు దివ్య
మిష్టులతోఁ జని కష్టు లౌవారల, నుల్లసమాడి నేఁ జెల్లియుందు

† అడిపోసె = తిరస్కరించె; తిట్టె.



తే.* నెట్లు లభియించునో నాకు నేగుటకు నుపాయ మెట్లగునో తోఁప దోయికర్ణ
నీవు నామామయును గూడి నెమ్మి నెంచి, కల్యమున వచ్చి చెప్పుఁడు కార్య మెల్ల.

వ. నేను మీరు చెప్పిన చొప్పునం జేసి కురుపితామహాదులతోఁ గురురాజు నొప్పించి గమన వ్యవసాయంబు గావించెద నని కర్ణసౌబలుల నంపి పుచ్చుటయు వారును వారివారి దుపట్లకుం బోయి యారేయిం గడపి రంత మఱునాఁ డరుణోదయంబునఁ గర్ణుండు శకునిదుశ్శాసనసహితుం డై దుర్యోధనునిపాలికిం జని నవ్వుచు నిట్లనియె. 39

——— కర్ణశకునులు దుర్యోధనునితో ఘోషయాత్ర కార్యసాధన మని చెప్పుట. ———

మ. కనుఁగొంటిం గద నే నుపాయ మొకఁ డోతుష్మాపాల వాక్ప్రచ్ఛదన్
విను మాద్వైతవనంబునందుఁ గల వాల్ వీక్షించు వ్యాజంబునన్
జనవచ్చున్ మన మందు నీజనకుఁ డాజ్ఞం జేయుఁ దా నందునన్
మనసంకల్పము సిద్ధిఁ బొందు ననుచు న్నాచిత్తముం దయ్యెడిన్. 40

వ. అనినంత శకునియు నగుమొగంబున నిట్లనియె. 41

క. విను మిది నిరపాయం బయి, పొసగు నుపాయంబ యిట్లు పొడకట్టెను నా
కును ధృతరాష్ట్రుఁడు దీనికి, ననుమతి గావించు మనకు ననుకూలముగన్. 42

వ. అంత వారు మువ్వురుం బ్రహసితముఖు లై యన్యోన్యకరతలస్పర్శంబు చేసి యట్లు సేయుటకు నిశ్చయించుకొని ధృతరాష్ట్రునిసమక్షంబునకుం జని సముచిత పరికారంబులం బ్రవర్తించుచుండి రాసమయంబున. 43

తే.‡ మును సుయోధననియమితుం డనుసమంగ, నాముఁ డను నగువల్లవుఁ డొక్కఁ డామహీశు
పాలి కరుదెంచి గోవుల పాటు చెప్పి, నవుడు రాధేయసౌబలు లనిరి యిట్లు. 44

చ.† నృపవర! గోగణంబు లవి యెల్ల సమీపవనాంతరంబునం
దిపుడు మెలంగుచున్న వని యాతఁడు చెప్పుటఁ జేసి చిత్తమం
దపరిమితానురాగమున నావసి నారసి వాని కంకముల్
సుపరిచితిం బొనర్చుటకుఁ జూచెను నీ తనయుండు వింటివే. 45

క. మృగబాధ వడల నచ్చట, మృగయాఖేలనము సలిపి మిసిమిఁ బొనంగన్
దగువారి నిలిపి గోవుల, కగురక్షణ చేసిరాఁగ నాజ్ఞ యొసఁగవే. 46

వ. అనిన ధృతరాష్ట్రుం డిట్లనియె. 47

* కల్యము = ప్రాతఃకాలము. ‡ వల్లవుఁడు = గొల్లవాఁడు.

† అంకము = గుర్తు; (పశువులు గుఱ్ఱములు మొదలగువాని కిట్లు కాల్చి గుర్తులు వేయుట యిప్పటికిని అచారమై యున్నది).

కర్ణాదులు ధృతరాష్ట్రునకడకుఁ జని ఘోషయాత్ర కనుజ్ఞ గొనుట.

ఉ. గొల్లఁడు చెప్పినట్లు మన ♦ గోగణముం గన నెంచు టొప్పు నం
దెల్లమృగంబులుం దునుఁగ ♦ నీ ర్మృగయుం జను టొప్పుఁ గాని యో
చెల్ల! వసింతు రప్పొలము ♦ చెంగటఁ బాండవు లేవు రందునన్
జెల్లదు మీకుఁ బో నటకుఁ ♦ జెప్పఁ జనుంటి వినుండు నానుడుల్. 48

ఉ. వంచితులై వనంబుల ని ♦ వాసము చేసి తపోధనాఢ్యులై
మించి సమర్థులై యిపుడు ♦ మీపయిఁ గోపము పూనియుందు రా
సంచితపుణ్యు లాఘనులు ♦ చాలుఁ బురే మిముఁ గాంచినంతలో
నెంచఁగరానికిన్కఁ బెయి ♦ నేమి పొనర్పఁగ నోప రక్కటా. 49

ఆ. అం దజాతశత్రుఁ ♦ డంత క్రుద్ధుఁడు గాఁడు, కాకయున్న నేమి ♦ కాఁక గలిగి
భీముఁ డేమి చేసి ♦ యేమి చేయఁగనుండుఁ, దగ్గిమంట కృష్ణ ♦ యతని నంట. 50

శా. పెక్కం డ్రేమని మీరు వారిఁ జెనకం ♦ బ్రోత్సింతు గర్వంబునన్
ముక్కంటిం దలఁపించు తేజ గలవా ♦ రున్మున్న మి మ్మందఱన్
జక్కాడం గల రొక్కట్రేల్మిడిఁ దప ♦ స్సారప్రభావంబునన్
మొక్కల్లో వనియస్త్రశస్త్రములు సొ ♦ మ్ముల్ వారికి న్వింటిరే. 51

క. దాన ననర్థము పుట్టెడుఁ, గాన స్మిగమన మాఁగఁ ♦ గా నగు ననుచున్
మానసమున నా కయ్యెన్, మానుఁడు మీఘోషయాత్ర ♦ మన మున సైనన్.

మ. అకృతాస్త్రుం డగునర్జునుండు మును స ♦ ర్వాంభోధిమధ్యోర్వరం
గకుబంతంబులు మ్రోయఁ గీర్తి గలిచెం ♦ గాదోటు నేఁ డింద్రుపో
లికి నీమేనునఁ బోయి భవ్యతరముల్ ♦ దివ్యాస్త్రముల్ దెచ్చినాఁ
డాకమర్త్యుం డన నొప్ప వానికడ నేఁ ♦ డోర్వన్ రణం బూనఁగన్. 53

తే. మీరు నామాట పాటించి ♦ వారి కెగ్గు, సేయ రేనియు మిక్కిలి ♦ నేనలోన
నవ్వఁ డే తప్పు చేసిన ♦ యేని మీర, చేసినట్లెంచి మిము నొంతు ♦ రీసుఁ జేసి. 54

క. కావున నేవిధిఁ జూచిన, నావని కీ రేగు టొప్ప ♦ దనియే తోఁచెం
గోవుల నరయఁగ నన్యుల, నేవారలనేని బుచ్చ ♦ నిష్టము నాకున్. 55

వ. అనిన శకుని వాని కిట్లనియె. 56

ఉ. ఎగ్గిసుమంత సేయఁ జన ♦ మే మటఁ జేసినయేని ధర్మజుం
డగ్గతిఁ గొల్వుకూటమున ♦ నాడినయట్టిప్రతిజ్ఞ మీఱి మా
కెగ్గు పొనర్పఁ బోఁ డనుజు ♦ లెల్లరు నాతనిమాట నుంద్రు మే
మెగ్గతి నున్న మాకు భయ ♦ మింతయు లే దని నమ్ము మెమ్మదిన్. 57



మత్తకోకిలము. ఏము పాండవులం గనుంగొన ♦ నేగుచుంటుట లేదు గో
ష్ఠము మారసి తద్వనంబును ♦ జేరి వేఁటల నాడుచుం
బ్రేమ మీఱఁగఁ గొన్నినాళ్లట ♦ విశ్రమించెదు నిచ్చమైఁ
బో మనం బని విన్నవింతుము ♦ పో ననుజ్ఞ యొసంగవే. 58

క. *పరిజను లెవ్వరు నవ్వన,చరులకు నపచార మింత సలుపక యుండం
బరికింతు మేము వారల,పరిసరమున కేని బోము ♦ పనివడి యైనన్. 59

దుర్యోధనుండు సపరివారుండై ఘోషయాత్రఁ బోవుట.

వ. ‡అని చెప్పిన ధృతరాష్ట్రుం డెట్టకేల కనుమతించి మీపలికినట్టిద యైనం బోయిరం డని పలుకుటయు దుర్యోధనదుశ్శాసనకర్ణశకునిప్రభృతు లెల్ల స్త్రీసహస్రపరివృతులై సంతసించుచుఁ బౌరులును బరివారంబును బరివేష్టింప ద్వైతవనంబునకుం బయనంబయి రప్పు డెనిమిదివేలరథంబులు ముప్పదివేలగజంబులును దొంబదివేల హయంబులును బహుసహస్రపదాతివర్గంబును వందిమాగధసందోహంబులును శకటసముదాయంబును వివిధవిధాపణవేశంబులును నాటికేటినవేఁటకాండ్రును వేలకు వేలై వెంట నంటి నడువఁ బ్రావృట్కాలసముద్ధతమహావాయుస్వనంబుపోలెం బరిజనకోలాహలంబు మిన్నుముట్టం గదలి రెండుక్రోశములుమాత్రం జని నాఁ డట విశ్రమించి మఱునాఁడు వివిధవనంబు లతిక్రమించి ద్వైతవనంబునకుం బోయి కీలారంబులకు సమీపారణ్యంబున. 60

మ. రమణీయంబును సోదకంబును సమ ♦ ప్రస్థంబునున్ సోన్నత
ద్రుమమున్ సర్వగుణాభిశోభితము సం ♦ తోషావహం బైనదే
శమునందున్ శిబిరంబులన్ సలుప ని ♦ చ్చన్ ధార్తరాష్ట్రాదు లా
క్రమణంబుం బొనరించి రందు విడిదుల్ ♦ గావించి మోదంబునన్. 61

వ. తదనంతరంబ భ్రాతృపరివృతుం డగుదుర్యోధనుండు. 62

సీ. అం దందుఁ గెం పొంది ♦ మందలై వేలకు,వే లయి యున్నట్టి ♦ యాల నెల్ల
లక్షించి తగునంక ♦ లక్షములన్ వత్స,ముల కడియాలముల్ ♦ పొసఁగఁ జేసి
బాలవత్సంబుల ♦ లీలమైఁ బరికించి, వత్సతరాదుల ♦ వరుస నెఱిఁగి
గోపాలగణముల ♦ కుం ధన మిడి వారి,నృత్యవాదనముల ♦ నెఱి వహించి
తే. పుత్రమిత్రకళత్రాది ♦ పూజ్యుఁ డగుచు, గోరసాస్వాదనపరుఁడై ♦ కొన్నినాళ్లు
తద్వినోదంబులం బుద్ధి ♦ దగులఁ జేసి, యభిమతవిహారములు సల్పె ♦ నట్టియెడల.

* పనివడి = అక్కఱపడి. ‡ కీలారము = పశువులమంద, ఘోషము.

వ. అనంతరం బాతం డాఖేటఖేలనంబునం దగిలి గజగవయర్క్షతరక్షువరాహమహిషహరి
ణాదినానావిధమృగంబుల సంహరించుచు వనంబులు నుపవనంబులుం గలయం దిరు
గుచు మత్తమయూరనృత్యంబులకును ద్విరేఫగానంబులకు నలరుచుం బోయి పోయి
పత్త్రచ్ఛదసమాకీర్ణంబును బున్నాగవకుళచంపకసముంచితంబు నగు ద్వైతవనంబున
నొక్కరమణీయసరోవరంబు సేరం జనియె నయ్యవసరంబున. 64

శా. వన్యంబుల్లోని ధర్మజుండు త్రిజగద్వంద్యప్రభావుం డసా
మాన్యప్రక్రియ దీక్షితుం డయి సరోమార్గంబునం గృష్ణతో
నన్యాసాధ్యము పుణ్యదం బయినసాద్యస్కాఖ్యయజ్ఞంబు ప్రా
ధాన్యం బేర్పడఁ జేయుచుండె మునిబృందం బెన్న మాన్యస్థితిన్. 65

క. అంత సుయోధనుఁడు సరఃప్రాంతంబున విడిద లొనరుపం బరిజనులన్
సంతసమునఁ బుచ్చెను వా, రంతయు వడి నచ్చోటుఁ జేరి రింతటిలోనన్. 66

చిత్రసేనుఁడు గంధర్వులతో ద్వైతవనంబున విహరింప వచ్చుట.

ఆ. చిత్రసేనుఁ డనఁగ నెల్లగంధర్వరా, జచ్చరలును నమరు లంటి రాఁగ
నాసరోవరంబునందుఁ గ్రీడింపఁగ, వచ్చి విడిసియుండె నిచ్చఁ జేసి. 67

తే. అపుడు దుర్యోధనుఁడు పంచినట్టిభటులు, వచ్చి గంధర్వులం గాంచి వారిచేతఁ
ద్రోయఁగాఁబడి యేమియుఁ జేయలేక, మగిడి చని చెప్పి రంతయు నగవు దోఁప.

వ. అంత దుర్యోధనుండు నాయోధనదుర్మదు లగుతనసేనాగ్రియాయులం బిలిచి మీరు
పోయి గంధర్వులం బాఱఁ దోలి రం డని పంచుటయు వారు నటఁ జని వారిం
గాంచి యి ట్లనిరి. 69

తే.* ఘనుఁడు ధృతరాష్ట్రసూనుఁడు మనుజవిభుఁడు
బలియుఁడు సుయోధనుం డను భరతకులజుఁ
డిచట విహరింప వచ్చెను నీరు కొలఁకు
విడిచి యొండెడఁ దొలఁగి పొం డు వడిగ వడిగ. 70

ఉ.† నా వుడు వారు వారిఁ గని నవ్వుచుఁ బల్కిరి వేల్పులై నమ
మ్మివగ నాజ్ఞ వెట్టెడి నొకింతయు మీయెకిమీనికి న్మనీ
షావిభవంబు గల్గదొకొ చాలు నిసీ యిటు లేటి కేగుఁ డే
మీవచనంబులం జడిసి యేఁగఁగ నెంతుమె వైశ్యులుం బలెన్. 71

* ఈరు = మీరు. † వైశ్యులుంబలెన్ = కోమటి పిఱికి యనుమాటంబట్టి ఇట్లు మూలమునఁ బ్రయోగింపఁబడియె.



ఆ. అనవలదు మీకు ప్రాణంబులకు వెఱ్ఱి, వానిమాట నిట్లు వత్తురొక్కొ
పెదఁగులార! పొండు వడి వానిపాలికి, గాని ధర్మసుతునికడకుఁ గాని. 72

వ. అని కనలి పలికిన నులికిపడి వారు వడివడిం బాఱి దుర్యోధనున కెఱింగించిన నతండు
కడుం గినిసి సేనలం జూచి యి ట్లనియె. 73

మ. వినుఁడో సైనికులార! నా కవమతిన్ వేడ్కం బొనర్పంగ నుం
డినగంధర్వుల నెల్ల నొంపుఁడు సురానీకంబుతోఁ బాకశా
సనుఁడుం బాసట యైనఁ గొంకక భవచ్చౌర్యం బవార్యంబుగా
నని సేయుం డని యాన వెట్టుటయు సైన్యాగ్రేసరుల్ ధీరులై. 74

క. నానావిధాయుధంబు లనూనప్రభ వెలుఁగ నెల్ల రొక్కుమ్మడి న
క్కాననము సొచ్చి రార్పులు, భూనభముల నిండి మాఱుమ్రోయ రయమునన్.

తే. అంతఁ గొందఱు గంధర్వు లరుగుదెంచి, సామమునఁ జేసి ధార్తరాష్ట్రప్రధాన
యోధులం గాంచి వారింప నుక్కుమిగిలి, వారి మెచ్చక నడచిరి వారు తిరి. 76

వ. గంధర్వులునుం దమమాట పాటింపక పోటరులై తఱియ వచ్చు ధార్తరాష్ట్రసైని
కుల నుపలక్షించి వీరు పోటులం గాని మాటలం దీరువారు గా రని తదుదంతం
బంతయు గంధర్వవల్లభునకుం దెల్లంబు గావించుటయు నతండు గండుమిగిలి. 77

క. శిక్షింపుఁ డనార్యుల మీ, రక్షణమున ననుచు నాజ్ఞ యిచ్చుటయును వా
రాక్షణము గృహీతాయుధు, లక్షీణపరాక్రమక్రమాంచితు లగుచున్. 78

కౌరవగంధర్వయుద్ధము.

మ. కురురాజన్యసైన్యము నడ్డ దొడ్డకడిమిన్ ఘోరాస్త్రశస్త్రాదులన్
బరిమర్దింపఁ దొడంగినం గలఁగి గర్వం బేగ వెన్నిచ్చి చె
చ్చెరఁ దత్సైనికు లెల్లఁ బాఱిరి నృపశ్రేష్ఠుండు వీక్షించుచుం
డ క్షణంబు న్విడి చట్టొకం డగుచుఁ గష్టం బంచుఁ గుయ్యోట్టుచున్. 79

వ.* అట్టియెడఁ గర్ణుం డొక్కరుం డోహటింపక గండుమిగిలి గంధర్వసేనల నెల్ల నెదిరించి
కరలాఘవంబు మెఱయ క్షురప్రాయసవత్సదంతవిశిఖప్రముఖవివిధాయుధంబులం బఱపి
పఱి పై నసురధ్వజినిం జిందువందు గావించి మించి మొలలు త్రెంచి తలలు ద్రుంచి
కాయంబులు ఖండించి కాంచుచుండునంతలో సమరాంగణంబు శూన్యంబు గావించె
నంతఁ గాలాంతకయమోపము లగుగంధర్వవర్యులు గర్వోద్రేకంబునఁ జెచ్చెఱఁగి
వేనవేలు వచ్చి కవిసి రపుడు భూమి యంతయు గంధర్వభూతం బై కాన నయ్యె
నయ్యెడ. 80

* పఱిపఱి = విరివి. సురధ్వజిని = సురసేన

మ.‡ప్రళయంబో యన వచ్చి హెచ్చి రవిజుం డ్రాసాదకుంతాదులన్
బలియం గొట్టుచుఁ జుట్టుముట్టునరులన్ గన్గొంచు దుర్యోధనా
దులు సైన్యావళితో రణాంగణమునం దున్నిల్చి పెల్చన్ భుజా
బల మేపారఁగఁ బోరి రంగపతికిన్ జాటింపఁ బెక్కాననై. 81

వ. ఇట్లురువడించి గరుడనిస్వనంబు లగుమహాస్యందనంబు లధిష్ఠించి ధార్తరాష్ట్రు లెల్లరుం గర్ణపురస్సరంబుగా నిలిచి పెలుచం బోరినపోరు ఘోరం బయ్యె నయ్యెడ.

తే.†క్రోధతామ్రాక్షు లగుకురుయోధవరుల, ఘోరనారాచహతిఁ జేసి కొండొకవడి
కెల్లగంధర్వులును డిల్లి వల్లటిలిరి, లోమహర్షణ మైనసంగ్రామమందు. 83

క. తెల్లినగంధర్వులఁ గని, తుల్లుచుఁ గురుసేన లెల్ల దోర్గర్వమునన్
బొల్లముగ నార్చి రాధ్వని, తెల్లంబుగ దివియు భువియు దిక్కులు నిండెన్. 84

గంధర్వులు కర్ణుని విరథుం జేసి దుర్యోధనాదులం జెఱవట్టుట.

వ. అంతఁ జిత్రసేనుండు. 85

క. త్రాసితులై గంధర్వులు, గాసింబడఁ జూచి రోషకలుషితమతియై
యాసనము డిగ్గి కురుసేనాసముదయ మున్నకడకు నడచెం గడిమిన్. 86

వ. అట్లు సన్నద్ధుండై కురుసేనం దఱియ వచ్చి. 87

శా.‡మాయాస్త్రం బరివోసి యేసె రిపులన్ మాత్సర్య మేపార న
మ్మాయ న్మోహము నొంది రెల్లరుఁ గురుక్ష్మాపాలసైన్యంబునం
దాయుద్ధంబున నుద్ధతాస్త్రు లయి శౌర్యం బొప్ప గంధర్వు లెం
తో యుత్సేధము నొంది పొందుపడి రత్తోయంబునం దోయమై. 88

క.¶ఒక్కనికిం బదుగురుగా, నక్కురుసైన్యంబుతోడ నని సేయుటయుం
బొక్కుచు నందలియోధులు, పిక్కబలము చూపి రపుడు భీతహృదయులై. 89

ఆ. వెఱచి కురుసేన లిట్లు విఱిగి పఱవ, నుక్కు చెడక యొక్కకర్ణుఁ డాయోధనంబు
సలిపె గిరివోలె నిలిచి సౌబలుఁడు దుస్స, సేనుఁడు సుయోధనుండుఁ దోడై నిలంగ.

ఉ. అలము భీకరం బగుచు నయ్యిరువాఁగులఁ జెప్ప నొప్పె న
క్కాలమునందుఁ గల్ప మనఁగాఁ బ్రజ వోయెను నుగ్గునూచమై
వేలకు వేలుగా నవుడు వేల్పులు మ్రాఁగి దివాకరాత్మజున్
శూలగదాసివారముల ప్రక్కలఁ జేసిరి యుక్కుపెంపునన్. 91

‡ ప్రాసాదము, కుంతము:—ఇవి ఆయుధవిశేషములు. † వల్లటిలిరి = చలించిరి.
లోమహర్షణము = భయంకరము. ‡ ఉత్సేధము = పొడవు. తోయము = సమయము; సమూహము.
¶ పిక్కబలము చూపిరి = పాఱిరి అని యభిప్రాయము.



తరళము.‖యుగముఁ గొందఱు నీషఁ గొందఱు యుగ్యయుగ్మముఁ గొందఱున్
నొగలు కొందఱు గిల్లఁ గొంద ఱనూనదండముఁ గొందఱున్
బొగ వెలుంగెడునూతుఁ గొందఱు ప్రోయుటెక్కముఁ గొందఱున్
దగిలి త్రుంచి రథంబు వోయినధన్విఁ జేసిరి కర్ణునిన్. 92

ఆ.†విరథుఁడై రవిజుఁడు వీతమనోరథుఁడై, వికర్ణురథమునందుఁ జేరి
తొలఁగి చనియె ననికి వెలిగాఁగ వడి వడి, ఘోటకములఁ దోలుకొనుచు నలికి. 93

వ. ఇట్లు కర్ణుండు పరాఙ్ముఖుం డైనం గని ధార్తరాష్ట్రబలం బెల్ల భయంబునం బరాఙ్ముఖం బై పఱచె నవుడు దుర్యోధనుం డొక్కరుం డుక్కు మెఱసి చక్క నిలిచి తనపై వచ్చుగంధర్వచమూసమూహంబుల నెల్ల బాణవర్షంబున ముంచి మించె నయ్యవసరంబున. 94

మ.‡సురసేనల్ రథరథ్యసూతతనువుల్ చూర్ణంబు గావించుచున్
విరథుం డై ధరణీస్థలిం బడియెఁ బృథ్వీనాథుఁ డాలో భయం
కరలీలం జని చిత్రసేనుఁ డతనిం గట్టల్క బంధించి ప
ట్టి రయం బేర్పడఁ జావకుండునటు లుడ్డీనంబు గావించుచున్. 95

వ. అంత గంధర్వులుం జలపట్టి చుట్టుముట్టి దుశ్శాసన దుర్విషహ దుర్ముఖ వివింశతి చిత్రసేన విందానువిందులను వారిభార్యలం బట్టి బంధించి నిగ్రహించుకొని పోవుచుండఁ దత్సైన్యం బంతయు దైన్యంబు నొంది కాందిశీకం బయ్యె నవుడు సుయోధు లగుసుయోధనామాత్యు లత్యంతరయంబున నాక్రోశించుచుం బాండవులమఱువు సొచ్చి శరణు వేఁడి. 96

కురుసైనికులు ధర్మరాజునొద్దకు వచ్చి శరణంబు వేఁడుట.

మ.§అయయో యే మని విన్నవించెదము లోకాధీశులారా భయో
దయ మిం దయ్యె సుయోధనాదులను గంధర్వుల్ ప్రబంధించి దు
ర్నయవృత్తిం గొనిపోవుచుండి రరులన్ మర్దించి మీభ్రాతలన్
దయ దైవార ననుగ్రహించుటకుఁ బ్రస్థానంబు గావింపుఁడీ. 97

క. అని యంతఁ బోక ధర్మజు, ననునయవాక్యముల వేఁడు నాదీనులఁ గ
న్గొని నవ్వుచు భీముం డి, ట్లనియెఁ దగం ధర్మసూతి కభిముఖుఁ డగుచున్. 98

ఆ. మన మతిప్రయత్నమునఁ జేయువనిని గంధర్వు లిట్లు చేసి నిర్వహించి
రిట్టు లున్న మనకు నేభారమును లేక, చులక విజయలక్ష్మి గలుగ నయ్యె. 99

‖ యుగము = కాఁడి; ఈష = ఏఁడికోల; యుగ్యము = గుఱ్ఱము; నొగలు = కూబరము; గిల్ల = చక్రము.
† అలికి = భయపడి. ‡ ఉడ్డీనము = ఎగురుట. § ప్రస్థానము = ప్రయాణము.

చ. మనకుఁ బ్రియంబు సేయఁగలమాన్యుఁ డొకానొకఁ డిజ్జగంబునన్
దనరెడుఁ గాడె యిప్పటికి ♦ దైవవశంబునఁజేసి శత్రులం
దనుమఁగ లేక డిందుపడి ♦ దుఃఖములం గడుఁ గుందువారికిన్
జనులు సహాయు లయ్యెదరు ♦ నా నది సత్యమ యయ్యె నియ్యెడన్. 100

తే. నికృతి జూదంబుఁ గల్పించి ♦ సకలధనము, నొడిచికొని కాఱుకోనలోఁ, బడఁగఁ ద్రోసి
యును విషమగతిమై నిట్టు ♦ లున్నమనల, నపహసింపఁగ వచ్చె నాక్రృపణుఁ డరయ.

తే. ఒకఁడు దలఁచిన నొకఁ డయ్యె ♦ నకట వాని, దుష్టమంత్రము తా నిట్లు ♦ కష్టపాటు
దెచ్చె వానికి నిట్లొప్పదే మహాత్మ, ఖలులయెడఁ గృపఁ బూనుట ♦ కానిమాట.

క. తెగువకుఁ జొరకుండినమన, కగచా ట్లొనరించెఁ దెక్క ♦ లాదుర్మతికిం
దగు నిట్లు వానిమతమునఁ, దగిలినవారలును వగవఁ ♦ దగు నివ్వేళన్. 103

వ. అని యుపస్వరంబునం బలుకుచున్నతమ్మునకు ధర్మజుం డి ట్లనియె. 104

—●●◆ ధర్మరాజు తమ్ములకు బోధించి దుర్యోధనాదులచెఱ వాపఁ బుచ్చుట. ◆●●—

మ.‡తతి గా దియ్యది నిష్ఠురోక్తులకు వత్సా ధార్తరాష్ట్రిల్ కనుక్
వెఱమైఁ బ్రోవుఁ డటంచు వేఁడుకొనుచున్ ♦ నీ విట్లు దీండ్రించి చు
చ్చుఱుకు ల్పల్కెడె కారణాంతరములం ♦ జూపట్టెడిన్ జ్ఞాతులం
దుఱవై వైరము దానఁజేసి కులధర్మోద్బోధము ల్మాయునే. 105

క. కులమున కితరులవలనన్, గలుగఁగ నున్నట్టిచేటు ♦ గని జ్ఞాతులు వా
రలలోనికలఁతలన్ విడి, కలసి కులం బుద్ధరింపఁగా నెంతు రగడే. 106

సీ.†దుర్యోధనుం డతిదుష్టుఁ డై మనల ని, ట్లపహసింపఁగ వచ్చె ♦ టది నిజంబ
యైన దాని న్మదిఁ ♦ బూని యిప్పుడు మన, మొప్పరికించుట ♦ యొప్ప దరయఁ
బరు లభిమర్శింత్రు ♦ పడఁతుల నద్దాన, నన్వయంబున కపయశము వచ్చుఁ
గావున శర ణన్నకౌరవులం గావఁ, గుల ముద్ధరింపఁగ ♦ వెలలుఁ డిపుడ

తే. నీవు నర్జునుఁడును యమల్ ♦ చేవ మెఱసి, సర్వశస్త్రాస్త్రములఁబూని స్యందనముల
నింద్రసేనాదులం గూడి ♦ యెక్కిపోయి, మనసుయోధనుచెఱ వాపమలయుఁ డాజి.

వ. అని మఱియును. 108

తరువోజ. శర ణన్నవాని రాజన్యుఁ డేఁ డైన ♦ శక్తి రక్షింపంగఁ ♦ జను నన్న నిన్ను
వరబలుఁ జెప్పంగవలయునే. విన్మ ♦ వరదానమును రాజ్యవైభవము సురు

‡ చుచ్చుఱుకు = మిక్కిలితీక్ష్ణము. ఉఱవు = అధికము. ఉద్బోధము, తలఁపు.
† యమల్ = కవలు, నకులసహదేవులు. ఒప్పరికించు = ఉపేక్షించు.



చిరపుత్రజన్మంబు ♦ చెప్ప నైనట్లు ♦ స్థితి చెడి కడుఁ గష్టిఁ ♦ జెందినవైరి
నరసి రక్షించుట ♦ యది ముదంబునక ♦ యగు నని చెప్పిరి ♦ యార్యులు వినవె.

చ.*అరులకుఁ జిక్కి మిక్కిలిగ ♦ నావడి నొందుసుయోధనుం డయో
దరితుఁడు గాన మీబలముఁ ♦ దా నివు డానపడున్ దలంప న
క్కురువరుఁ గాచుకంటెను నొకొం డగునే సుకృతంబు నేన పో
స్థిరమతి నుంటిఁ గాని మఖదీక్ష నెనంగుట రిత్తవోయితిన్. 110

ఉ. కావున మీ రవశ్యముగఁ ♦ గౌరవబంధవిమోక్షకార్యమున్
జేవమెయిం బొనర్పుఁ డటఁ ♦ జేవడి నూపకయున్న సామముం
గావలె నంతమాత్రమునఁ ♦ గార్యము పుట్టకయున్న విక్రమం
బావల నింత నూపి తుద ♦ కంతకు లై విడిపింపుఁ డుందఱున్. 111

ఆ. పరులవలనఁ బరిభవము గల్గ నూటయేవురము మనము మనకు ♦ దురము పడిన
యెడల వారు నూర్వు ♦ రేవురమే మన, మింతమాత్ర మెఱుఁగ ♦ నెంచుఁ డీరు. 112

వ. అని చెప్పుచున్న విని ధనంజయుం డన్నకుం గేలు మోడ్చి కౌరవమోక్షణంబునం
బ్రతిజ్ఞ చేసి యి ట్లనియె. 113

క. సామమునం గంధర్వులు, తా మెట్లును దీరకున్నఁ ♦ దద్రుధిరంబున్
భూమిసతి ద్రావుఁ దృప్తిగ, నామహితాస్త్రములు సాధనంబులు గాఁగన్. 114

వ.‡ఇ ట్లర్జునుండు పలికిన భీమసేనుండును నకులసహదేవులును దాని కియ్యకొని రవుడు
శరణాగతు లగుకౌరవపురోహితులనెమ్మది నెమ్మదిం బొదివె నంత వారు నలువురు
నభేద్యకవచంబులు దొడిగి నానావిధాయుధంబులు సంగ్రహించి సకేతనంబులును
సోత్తమాశ్వంబులు నగుమహారథంబు లధిష్ఠించి ప్రవర్గ్యాగ్నులో యనం బ్రజ్వరిల్లు
చు నగ్రజుల వీడ్కొని కౌరవసైన్యంబునఁ బెద్దకోలాహలం బెసంగ నతిత్వరితగతిం
గదలి గంధర్వవర్యులం గూడముట్టుటయు వారునుం దమ్ముఁ దఱిమివచ్చుచున్నవారి
లోకపాలోపము లగువారిం జూచి నిలిచిన సవ్యసాచి వారిం జేరఁ జని సాంత్వపూ
ర్వంబుగా ని ట్లనియె. 115

—●●◆ అర్జునుఁడు గంధర్వులకడ సామం బుపయోగించుట. ◆●●—

ఆ. ఖేచరేంద్రులార ♦ భూచక్ర మేలుమా, భ్రాత ధార్తరాష్ట్రు ♦ బ్రాఁతిఁజేసి
విడిచిపుచ్చుఁ డయ్య ♦ విక్రమాఢ్యుఁడు ధర్మ, రాజుశాసన మిటు ♦ ప్రబలుఁ గాన. 116

* దరితుఁడు = భయపడినవాఁడు. ‡ నెమ్మది = చిత్తము, శాంతి. ప్రవర్గ్యాగ్నుల = ప్రవర్గ్యకా
లమునందలి యగ్నులు; ప్రవర్గ్యమునందు నగ్నిలో నేయి మిక్కిలి పడును గావున మండుచుండు
నని యెఱుంగునది.

వ. అనిన నవ్వుచు నవ్వియచ్చరు లవ్విజయుదిక్కు మొగంబై. 117

ఉ. *మా కొకవేల్పుఱేఁ డెనఁగు ♦ మాన్యుఁడునుం బ్రభుఁ డేము వానికిం
గాక మఱొక్కవానికిని ♦ గైవసమం దయి శాసనాదులం
గైకొనఁ బోము చెప్పితిమి ♦ గావున నింకిట నిట్టిమాటలన్
గాకు మనం ధనంజయుఁడు ♦ క్రమ్మఱ నిట్లని పల్కె వారికిన్. 118

తే. ‡మనుజులం గూడి పరదార♦లను గ్రహించి, బందివెట్టంగఁ దలపోసి ♦ పాఱు టరయఁ
దగదు గంధర్వరాజున ♦ కిఁక మదీయ, వచనమునఁ జేసి విడుఁడు మా♦వారి చెలులు.

ఉ. †బిరుసుం బూనఁగ రాదు మున్ననుచు నే ♦ బీరంబులం బల్కి కీ
వరుసన్ సామము పల్కుచుంటి నిది మీ♦వాటంబు గాకుండినన్
గరిమం బూని పరాక్రమించి యిదె నా♦గాండీవనిర్ముక్తదు
ర్భరకాండంబుల ధార్తరాష్ట్రు విడిపిం♦పం బూనెదం జూడుఁడీ. 120

వ. అని పలుకుచు ధనంజయుండు తన్ను నిరాకరించి నడచు ఖేచరగణంబులపై నానా విధనిశితమార్గణంబు లనర్గళప్రచారంబునం బ్రయోగించె నంత వారు నవక్రవిక్రమ క్రమంబున శరవర్షంబు గురిసి రప్పు డప్పాండవులకును బహుసహస్రసంఖ్యాకు లగు గంధర్వులకును బోరు ఘోరంబయ్యె నట్టినతులసమరంబున గంధర్వు లుక్కుమిగిలి.

మ. ✠ధృతరాష్ట్రాత్మజకర్ణముఖ్యులరథ♦క్షోభంబులం జేసిన
ట్లతివీర్యంబునఁ బాండుపుత్రరథముల్ ♦ వ్యర్థంబులై పోవఁ జే
యుతలంపుం గొని గుంపులై కదిసి యొం♦తో వంత మొప్పం బృష
త్కతతిం గప్పిరి నల్గడం దెఱపి న♦ల్కంతేని లేకుండఁగన్. 122

ఉ. వేలకు వేలుగా ఖచర♦వీరగణంబులు చుట్టుముట్టి బె
ట్టాలము సేయుచుండఁ గని ♦ యన్నయుఁ దమ్ములుఁ దోడు సూప న
వ్వేలుపురాసుతుండు తన♦వేఁడిశరంబులపోఁడిఁ జూపుచున్
దూలఁగఁ జేసె నీసునను ♦ దోర్బల మేర్పడ వేల్పుమూఁకలన్. 123

వ. అంత నగ్గంధర్వులును. 124

అర్జునాదులు గంధర్వులతో యుద్ధము సేయుట.

ఆ. ¶ఓసరిల్లి కొంత ♦ యువ్వెత్తుగా వచ్చి, హెచ్చి విజయుమీఁద ♦ విచ్చలవిడిఁ
గఱకుటమ్ము లేసి ♦ కవిసిన గాండీవి, కొండవోలె నిలిచి ♦ కోప ముడర. 125

* వేల్పుఱేఁడు = దేవేంద్రుఁడు. ‡ ఇఁక = ఇఁకకు రూపాంతరము. † వాటము = మార్గము.
✠ పృషత్కము = బాణము. ¶ ఓసరిల్లు = తొలఁగు.



స్రగ్ధర. *గాండీవజ్యారవం బుత్కటమయి కడలం ♦ గ్రమ్మ నానావిధాస్త్ర
ఖండప్రజ్ఞాప్రశస్తిన్ ♦ గని జగము గడుం ♦ గంపముం బొంద నప్పు
ద్దండచ్ఛవ్యాంచితంబై ♦ తనరెడునసలా♦స్త్రంబు సంధించి వింటన్
జాండాడన్ వేసవేలై ♦ స్థితిఁ గొనుఖచర♦శ్రేష్ఠులన్ నిష్ఠురార్చిన్. 126

క. భీముఁడును గవలు నత్తఱి, భీమభుజాబలము మెఱయ ♦ భీభత్సునకున్
దీమసముతోడఁ దోడై, భూమిం బడవేసి రరుల ♦ భూయస్సంఖ్యన్. 127

వ. ఇట్లప్పాండవులదివ్యాస్త్రంబుల వధ్యమానులై గంధర్వు లాయుద్ధం బసాధ్యం బని సంభ్రమించి ధార్తరాష్ట్రులం గొని నభంబునకు రభసంబున నెగసిపోవ నుంకించినం దిలకించి సవ్యసాచి తనయక్షయతూణీరంబులం గలశరజాలంబుల గుప్పి రోదసీ కుహరంబునం గప్పి నీరంధ్రంబు గావించె నంత. 128

ఉ. పంజరమందుఁ జిక్కికొని ♦ పాఱఁగ నేరనిపక్షులట్లు శ
త్రుంజయుఁ డైనఫాల్గునుని♦తోరపుటమ్ములవాములందు నెం
దుం జనలేక యుండియును ♦ దోర్బల మొప్ప వియచ్చరుల్ నరున్
సంజనితవ్రణార్తునిఁగ ♦ సల్పి రనల్పపృషత్కసంహతిన్. 129

వ. సర్వశస్త్రాస్త్రవిదుం డగునర్జునుండును గంధర్వప్రయుక్తంబు లగు గదాశక్తిముసల ముద్గరపరిఘాదిసాధనంబుల నడుమన ఖండించుచు. 130

మ. శరముల్ వింట నమర్చి పేర్చి రిపులన్ ♦ శౌర్యం బవార్యంబు గాఁ
బరిమర్దించుచు మింటినుండి పడియెన్ ♦ బాధస్వనం బేర్పడన్
గరముల్ పాదములున్ శిరంబు లురముల్ ♦ ఖండంబులై వెండులై
పరికింపం దగె భీతిదం బయి శిలా♦వర్షంబుచందంబునన్. 131

వ. మఱియు నతండు స్థూలాకర్ణేంద్రజాలసౌరసౌమ్యాద్యస్త్రంబులఁ బ్రయోగించి గంధర్వసేనల నీఱుసేయఁ దొడంగినం గని కనలి చిత్రసేనుండు గదాదండమండితకరుండై నరుం దాఁకు దెంచుటయును. 132

క. నరుఁ డెదిరి వాఁడితూపుల, సరభసమున వచ్చువ్యోమ♦చారికరములం
బరఁగెడునాయసగదఁ జెచ్చెర ఖండము లేడు గాఁగఁ ♦ జేసెన్ వాసిన్. 133

చ. తనగద భగ్న మైనఁ గని ♦ దర్పము పేర్పడఁ జిత్రసేనుఁడున్
ఘన మగువిద్య పెంపునను ♦ గాఢతరాస్త్రము లేసి నొంచినం
గినిసి ధనంజయుం డతని♦కిం బదు లాడఁగ నేసి కైవడిం
గనుఁగొనఁజేయ నాఁతఁడును ♦ గానఁగ రాక పెనంగె మాయమై. 134

* ఛవి = కాంతి. అర్చి = జ్వాలము.

తే.*శాసనరా కట్లు ప్రహరించు♦వాని నెఱిఁగి, విఱుగనియమర్త్యమున శబ్ద♦వేధు లైన
పత్రముల నేసి నొప్పించెఁ ♦ జిత్రసేనుఁ, జిత్రసేనునిపౌత్రుండు ♦ చిత్రగతుల. 185

వ. ఇట్లు చిత్రయుద్ధంబు గావించినం జిత్రసేనుండు చేయున దెద్దియు లేక వీఁక విడి పాక శాసనికిం బొడసూపి యనుంగుసంగాతి నన్నెఱుంగు దే యనిన నతం డతని నుపలక్షించి తనయేయునస్త్రం బుపసంహరించె నది గాంచి భీమసేనాదులును సమరంబు చాలించి తమతమరథంబుల నిలువరించి రపుడు వారి కన్యోన్యకుశలప్రశ్నంబు ప్రవర్తిల్లె నంత సుత్రామసూనుండు చిత్రసేనుదిక్కు మొగంబై యి ట్లనియె. 186

ఉ. కట్టితి ధార్తరాష్ట్రులను ♦ గాంతలతో నిటు లేమికారణం
బిట్టియెడం బ్రవర్తిలెనొ ♦ యీ విధి యంతయు నానతీయవే
నెట్టన నావుడుఁ ఖచర♦నేత సురాధిపసూతిఁ జూచి తా
ని ట్లని పల్కె నేరుపుమెఁ♦యిం గలకారణ మెల్లఁ దెల్లగన్. 187

మ. విను మోమిత్రమ రాజ్యలాభమున మీ♦విద్వేషి దుర్యోధనుం
డనయంబుం గనుగాన కుండును ఖలుం ♦ డై నేఁడు రాజ్యచ్యుతిన్
వనులందున్ విమమస్థు లై వనటలన్ ♦ వర్తించుమి మ్మందఱిన్
గని నవ్వం జనుదెంచె నివ్వనికి లో ♦ గర్వం బఖర్వంబుగన్. 188

సీ.‡ఇది యంతయు నెఱింగి ♦ త్రిదశేశ్వరుఁడు నన్నుఁ, బిలిచి యి ట్లనియె నీ ♦ విలకు నేగి
ఖలుని దుర్యోధనుఁ ♦ గాంతలతో భ్రాతృగణముతో నిచటికిఁ ♦ గట్టి తెమ్ము
కల నైనఁ దోడఁబుట్టులతోడ నరుఁ గావు, మతఁడు మిత్రుఁడు శిష్యుఁ ♦ డగును నీకు
నని పనిచిన వచ్చి♦తి నిట వానిం బట్టితిని గొనిపోదు నా♦త్రిదివమునకు

తే. నిం ద్రుశాసన మిది దీని ♦ కేమియు నన, వలవ దన నాతఁ డను నన్ను ♦ వలతువేని
విబుధపుంగవ ప్రార్థింతు ♦ విడు సుయోధనుని యుధిష్ఠిరశాసన♦మును గ్రహించి.

చ.|అనుటయుఁ జిత్రసేనుఁ డను ♦ నయ్య సుయోధనుదుశ్చరిత్రమి
ట్లని యెఱుఁగంగ గాక శమ♦నాత్మజుఁ డింత యొఱింగినేని యి
ట్లనఁ డనుకొందు నె ట్లయిన ♦ నక్కట దుర్మనుఁ డైనవీనికిన్
గచుకని నీవు టొప్పనిద ♦. కాదె యిఁకన్ సురరాజనందనా. 140

* పత్రములు = బాణములు. చిత్రసేనునిపౌత్రుఁడు = అర్జునుఁడు; చిత్రసేనుఁడు పాండురాజు పెదతండ్రి గావున నిట్లు వ్యవహరింపఁబడిరి. ‡ కలను = యుద్ధము. వలతువేని = కోరితివేని. దుర్మనుఁడు = దుష్టుఁడు. కచుకనిన్ = పట్టు(?)



—●●◆ చిత్రసేనుఁడు ధర్మరాజునొద్దకు వచ్చి దుర్యోధనాదుల విడిచి పోవుట. ◆●●—

వ. అనినం బార్థుం డది య ట్లయిన మన మాధర్మనందనుండు చెప్పినట్లు సేయఁ గల వారము కావున వానిపాలికిం బోవుద మనిన వల్లె యని యతం డెల్లరం దోడ్కొని చని యజాతశత్రుం గని తదుదంతం బంతయు నెఱింగించిన నతండు వాని నభినందించుచు ని ట్లనియె. 141

తే. చిత్రసేన! మాపుణ్యము ♦ చెప్ప నేల, బలపరాక్రమవంతు లై ♦ చెలఁగునట్టి ఘనులు మీ బారిఁబడినుయో♦ధనుఁడుచావ,కున్న వాఁ డంటయేచెప్ప♦ చున్నదప్పా హా.

సీ. దుర్యోధనుం డెట్టి♦దుర్వృత్తి మై నున్నఁ, గాని విమువఁ దగు ♦ దాన మాకు
నుపకార మెంతయు ♦ నొనరించిన ట్లగుఁ, గులపరిఘాతంబు ♦ తొలఁగి పోవు
మీదర్శనంబున ♦ మేము కృతార్థుల, మేప్రొద్దు మీయిష్ట ♦ మేము గూర్తు
మిందఱుచెఱ వీడ ♦ నెంచుఁడు ప్రార్థింతు, మనవి యాలించి నన్ ♦ గనుఁడు కరుణ

ఆ, ననినఁ జిత్రసేనుఁ ♦ డౌఁగాత మని ధార్తరాష్ట్రుల విడి యప్పు♦రస్సమేతుఁ డగుచు స్వర్గమునకు ♦ నరిగి య దంతయుఁ నెఱుఁగఁ జెప్పె నిర్జ♦రేంద్రునకును.

వ. అతండును ధర్మతనయుధార్మికత్వంబున కభినందించుచు నమృతవర్షంబునం జేసి యాయాయోధననిహతు లయినగంధర్వుల నెల్లం బ్రదికించె నిట నజాతశత్రుండును ధృతరాష్ట్రపుత్రాదులబంధంబు లెడలించి సర్వజనస్తోత్రపాత్రుం డై వేదీమధ్యంబున నున్నపీతిహోత్రుండో యన వెలుంగుచు దుర్యోధనునిఁ జేరం బిలిచి ప్రియపూర్వకంబుగా ని ట్లనియె. 144

ఉ.‡సాహస మి ట్లొకప్పటికి ♦ సల్పకుమయ్య జగత్త్రయంబునన్
సాహసకారికిన్ సుఖ మె♦సంగమి నిక్కువమయ్య యిప్డు నీ
వీహ చెడంగ ని ట్లగుట ♦ కింతయుఁ గుందకుమయ్య బంధుసం
దోహముతోఁ బురంబుఁ జని ♦ తుష్టి సుఖింపఁగదయ్య తమ్ముఁడా. 145

వ. అని యాఱడం బలికి యుధిష్ఠిరుండు వాని నంపిపుచ్చి తమ్ములం గూడి తదాశ్రమంబున సుఖంబుండె నంత భ్రాతృజనప్రేషితుం డగుధృతరాష్ట్రనందనుండు ధర్మనందనున కభివందనం బాచరించి వ్రీడావిదీర్యమాణుం డగుట విమనస్కుం డై వీడుకోలు వడసి చతురంగబల సమేతుం డై హాస్తినపురమార్గంబు పట్టి చింతించుచుం గొంత చని తృణజలకాష్ఠభూయిష్ఠం బగునొక్కరమ్యప్రదేశంబున బలఁగంబుల నెల్ల నిలువ నియమించి తా నొకచో నొకపర్యంకంబునం బడి రాత్రిసంతమయంబున రాహుగ్రస్తం

‡ ఈహ = కోర్కి. తుష్టి = సంతోషము.

దునిచందంబున నందంబు దఱిఁగి చింతాశోకవ్యాకులహృదయుం డై యుండె నా
సమయంబునఁ గర్ణుండు వచ్చి వానిం గాంచి యి ట్లనియె. 146

క. దిష్టమున బ్రదికి వచ్చితి, దిష్టమునన్ రిపుల నోర్చి తిరిగితి పురికిన్
దిష్టమున నిన్నుఁ గంటిన్, దిష్టమునన్ మనకు మరలఁ దియ్యం బెసఁగెన్. 147

ఉ.‡అకటా! యేమని చెప్పువాఁడ గురునాథా నీవు చూడ న్భయా
నక మై పర్విన సాంపరాయికమునన్ గంధర్వు లుక్కెక్కి మా
మకగాత్రంబుల నెత్తురేఱు ప్రవహింపం జేయ నే నిల్వఁ జా
లక పోరీఁగి పరాఙ్ముఖుండ నయితిన్ లక్షించి ప్రాణంబులన్. 148

మ. ఇది యత్యద్భుత మిట్టిపోరునను మీ రింతేనియు న్నొవ్వ కా
పదకుం గాక సభృత్యవర్గముగ నొప్పం గంటి నేనిట్టి పెం
గదనంబుం బొనరింపఁ గాఁ దగినవిల్కాఁ డొక్కరుం డుండునే
త్రిదశప్రస్తుత నీప్రభావము జగద్గేయం బగున్ బాపురే. 149

వ. అని పలికినం దల వాంచి దుర్యోధనుండు కనుల నీరు గ్రుక్కుకొనుచు గద్గదస్వరం
బున ని ట్లనియె. 150

దుర్యోధనుఁడు కర్ణునితోఁ దనపరిభవము చెప్పుకొనుట.

చ.%ఎఱుఁగ వొకింత యేనియును నే నలఖేచరకోటి నోర్చి యి
త్తెఱఁగున నైతినో యని మదిం దలపోయుచు నుంటి వేమొ నీ
యెఱుఁగనిదానికిం బలికి తిట్టులు దీని కసూయ నంద నేఁ
గఱకతి నొందితిం దెలియఁగా విను మాదురవస్థ యంతయున్. 151

సీ. అట్లు తమ్ములు నేను నాలంబునకుఁ జొచ్చి, గంధర్వసేనతోఁ గసిమసంగి
పోరితి మంతలో ఘోరాహవం బయ్యె, నుభయబలంబులు నొల్లఁబోయె
నాయేటులకు నొచ్చి మాయమై గంధర్వపతి వచ్చి నాతోడఁ బట్టి పెనఁగె
నకట యే మందు నా కైనపరాభవ, మది దలంచిన గుండె లవియుచుండె
గీ. దారపుత్రాదివర్గంబుతో రయంబు, మెఱయ ననుఁ గట్టుకొనిపోయె మింటి కయయొ
చిత్రసేనుం డవుడు మనసేన లెల్లఁ, బఱచి వేఁడిరి ధర్మజుమఱువుఁ జొచ్చి. 152

క. కురురాజున్ గంధర్వులు, గరితలతోఁ గట్టి దివికిఁ గడు రభసగతి
స్ఫురణమున నరుగుచుండిరి, కరుణ న్విడిపింప వలయుఁ గదె దాయాదుల్. 153

వ. అని ప్రార్థించుచు. 154

‡ సాంపరాయికము = యుద్ధము. % కఱకతి = [illegible]



ఉ. శరణముఁ జొచ్చినట్టిమనపై నికవర్గము నాదరించుచుం
బరమదయాసమగ్రుఁ డగుపాండుసుతాగ్రజుఁ డప్పు డాత్మసో
దరులను దేర్చి పుచ్చెఁ జెఱ దప్పఁగ నంతటఁ దేఱి వారు చె
చ్చెరఁ జను దెంచి చిత్రరథుఁ జేరి వచించిరి సామవాక్యముల్. 155

శా. దానం దీరనివాని వానిజనమున్ దర్పంబునం దాఁకి నా
నానేకాస్త్రము లేసి నొచ్చునట్లు సేయ న్వారు పోరీఁగి పై
పై నేగం గని మార్గరోధముగ భీభత్సుండు బహ్వస్త్రముల్
దా నాకాశమునందు నించుమును గంధర్వు ల్భయభ్రాంతులై. 156

వ. చేయున దెద్దియును లేక చెన్ను దఱిఁగి యుండి రప్పుడు చిత్రసేనుం డర్జునునకుం
బొడసూపి కుశలం బడిగిన నతం డతని ననునయించి మాభ్రాత యగుదుర్యోధ
నుని విడిచిపుచ్చు మీపాండవులు జీవించియుండ నొరులు వీనిం జెనకఁ బోలునే
యనినఁ జిత్రసేనుండు వానికి మనదురాలోచనం బంతయుం దెలిపి యిది యిందుని
నివం పని చెప్పుచు మమ్మాకట్లతోడం గొనిపోయి యుధిష్ఠిరునకుం బొడసూపు
టయు నతండు నాకుఁ బెద్దయుంబ్రొద్దు బుద్ధిసెప్పి విడిపించి పుచ్చె నని మఱియు.

ఆ. అపుడు భూమిఁ జొరఁగ నరసితి వివరంబు, దొరక దయ్యె నాకు దొరకెనేని
యందుఁ జొచ్చి లజ్జ కైనయీకాయంబు, నుజ్జగింప కుందునోయి కర్ణ. 158

క. తలవంపు లయ్యె నాకుం, బలుపురిలో మనతలంచుపని తెలియుటయున్
జెలులసమక్షమునందుం, బల మఱి పగతురకుఁ జిక్కఁ బడుటయు నయ్యో. 159

చ. ఇవియును గాక యిట్టిమఱియెన్నియు నేనియు నొక్కయెత్తు శా
త్రవు లగుపాండుపుత్రులు నిరాకృతు లట్టిరు నన్ను ఖేచర
ప్రవరులబారినుండి సుకరంబుగఁ గాచుట యొక్కయెత్తు గాఁ
దవిలి మదిం దహించెడిని దద్దయు దావముకన్న మిన్న యై. 160

తే.%పేరు గలమాని పరిభవదూరుఁ డగుచు, జగతి జీవించుకంటెను జచ్చు టొప్పు
నరయ గంధర్వవరులచే ననిఁ దెగిన, యైనఁ గీర్తియు స్వర్గము నందుదు నరయొ.

చ.¶అకటకటా! మహీతలమునందు మహాప్రతిభం దలిర్చునే
నొకయధముండు నా బ్రదికియుంటి నను న్గన నీమహీపతుల్
ప్రకృతిజనంబులుం గొలువ రారు యశంబునుఁ బూజ్య మిట్లు పూ
రికి నయి రెంటికిం జెడినరేవఁడ నైతి నిఁ కేమి సేయుదున్. 162

% మాని = మానవంతుఁడు. ¶ పూరి = తృణము. ఇటఁ దృణప్రాయుఁడ నై యని చెప్పుకొనవలయును.

వ. ఇప్పు డిట్టిదురవస్థకుం బాలుపడితిని గావున నే నీమేనితో హస్తినపురంబునం దడుగు వెట్టువాఁడఁ గా నిచటన ప్రాయోపవేశంబు సేసి ప్రాణంబులు పరిత్యజింతు నింక మీ రెల్ల దుశ్శాసనుం బురస్కరించుకొని పురప్రవేశంబు సేయుండు మిత్రమా! శత్రుమానాపహుండ నై మిత్రుల కానందం బాపాదించునే నిపు డే మని పోయి తండ్రితో నే మని విన్నవించెద భీష్మద్రోణవిదురబాహ్లీకసోమదత్తాదివృద్ధుల నేరీతిం బలుకరించెదను శ్రేణిముఖ్యు లగుద్విజవర్యు లెట్లు సంభావించెదరు నే నెట్లు వారిని సంభాషించెద నక్కటా! సపత్నులనెత్తిపై నెక్కఁ ద్రొక్కఁ గలనే ని ట్లాత్మదోషంబునం జేసి పరిభ్రష్టుండ నైతి నయ్యో! దుర్వినీతునకు విద్యయు నైశ్వర్యమునుం బట్టినను వాఁడు చిరకాలంబు దక్కించుకొన నేరం డట్టిదాని కేన తార్కాణంబ నాయంత నేనే మోహంబున నిట్టియనర్హం బగుకార్యంబుఁ జేసి యిట్టు దెచ్చుకొంటి నేను బ్రదికి యెట్టిపెంపు ననుభవింపఁగలను? ప్రాయోపవేశమే పరమశ్రేయము పరులచేతం బరిహసింపఁబడినమానవంతుఁ డెట్లు జీవింప నెంచు నాకిపుడు పరాక్రమవంతు లైనపాండవులవలన నవమానంబు వాటిల్లె నని నిశ్వాసంబు నిగిడించుచు దుశ్శాసనుం బిలిచి యి ట్లనియె. 163

సీ. వత్స! దుశ్శాసన! ♦ వగవక చని నీవు, పట్టభద్రుండ వై ♦ వసుధ నేలు
మీకర్ణసౌబలు ♦ లేప్రొద్దు నినుఁ గూడి, నీకుఁ జేదోడ యి ♦ నిలిచియుంద్రు
నీతమ్ముఁగుఱ్ఱల ♦ నెనరుసం గనుచుండు, మెల్లచుట్టాలకు ♦ నీవ దిక్కు
పాలుకోలముపాల ♦ భయభక్తియుక్తుండ, వగుము గురులఁ గొల్వు ♦ మనుదినంబు
తే. మిత్రులకు మోదమును గూర్చి ♦ శత్రులకును, ఖేద మొనరించి పాలింపు ♦ మీదినంబు
కడ యగును గాన నను గ్రుచ్చి ♦ కౌఁగిలింపు, మిపుడ చనుము పురంబున ♦ కెనక మొనఁగ.

చ. అనుటయు దుస్ససేనుఁడు భ♦యంబును భక్తియు దుఃఖ మొక్కపె
ట్టన మది సంకురింపఁ బ్రక♦టంబుగ నశ్రులు జాలువాఱఁ గ్రి
క్కనఁ బులకాంకురంబులును ♦ గంపము పెంపర మైన దీనుఁ డై
కనుకని యన్నకాళ్లఁ బడి ♦ గాద్గదికంబునఁ జేసి యి ట్లనున్. 165

ఉ. నేలయు నింగియుం బగిలి ♦ నిల్వనఁ గూలిన ప్రోలి దూలినన్
గీలియుఁ జల్ల నైన శశి♦కిం గడు వెచ్చగ వెచ్చ నైనఁ బెం
గాలికి వేగ మేగినను ♦ గంధులు వట్టిన శీతభూధరం
బోలిఁ జలించినన్ విభుత ♦ నొందునె ని న్విడనాడి యీఁ డయో. 166

తే. నన్ను దయఁ జూడు మయ్య ప్ర♦సన్నుఁ డవయి, యేలు మీనేల నీవ నూ♦ఱేండ్లదాఁక
నాకు నీదాస్య మొసఁగుము♦నీకుఁ గూర్తు,ననుచుఁ గాళులఁ బడి యేడ్చె♦నతఁడు విడక.



వ. ఇట్లు దుఃఖించుతమ్మునిం జూచి దుర్యోధనుండును దుఃఖించుచుండె నంత రాధేయుండు దతియు వచ్చి గాంధారేయున కి ట్లనియె. 168

కర్ణసౌబలులు దుర్యోధను నూరార్చుట.

ఉ. ప్రాకృతులట్లు మీ రకట ♦ బాలిశతం గొని శోక మొందుచున్
వాకొన కున్నవా రిటులు ♦ వర్తిలుచుండిన మిమ్ము విద్వద
ల్లోకము చూచి నవ్వు మది♦లో ననుతాపము హెచ్చుఁ గావునన్
శోకము మాని నాపలుకు ♦ శ్రోత్రయుగంబునఁ జొన్పుఁడీ ధృతిన్. 169

సీ.*ఖేచరుల్ చెఱఁగొన్నఁ ♦ జూచి పార్థులు విడి,పించిరి నన్నంచుఁ ♦ గించ వలదు
విధివిహితార్థ మై ♦ వెలయుఁబో మ్మది రాజు, నేల్బడి నుండిన♦యెల్లప్రజలు
వానిబంటులు సూవె ♦ వారు రాజునకుఁ దీ,ఱమి వచ్చినపుడు క♦ర్జమును దీర్చి
కృతకృత్యు లగుదు రం ♦ దతిముఖ్య మని నిట్లు,పొసఁగినప్పుడు తోడు ♦ వోవు టరయ
తే.†నీవిషయమంద యుండియు ♦ నీకు లెంక, లై తదీయార్థముల నీకు ♦ నపుడ యిచ్చి
రట్టిపాండవు లిపుడు నీ ♦ కిట్టు చేసి, రనఁగఁ దత్స్వామిభక్తిఁ దె♦ల్పును గదయ్య. 170

వ. కావున నీ విట్టివలవనివగలం బొగులక పురప్రయాణంబు సేయుము నీవలనఁ బాండవుల కెంతలెంతలు వచ్చినను వారు నీవలెఁ బ్రాయోపవేశంబు చేసి యెఱుంగరు నీయుద్యమంబు విన్నవా రెల్ల నిన్నుఁ బరిహసింతు రీవు నామాట వినకుంటివేని నేనును నీసేవ సేయుచు నీపాదంబులకడన యుండెదం గాని నిన్ను విడిచి జీవింప నోప నని యెంత చెప్పినను వినక సురలోకప్రయాణోన్ముఖుం డయి యున్నసుయోధనుం జూచి సౌబలుం డి ట్లనియె. 171

ఆ. పలికెఁ గర్ణుఁ డిపుడు ♦ పులఖండ మొలుకంగ, పలుకు లింత యొప్పు ♦ గలవె వానిఁ
జెవుల నిడఁగఁ బూన ♦ వెవరు నీ కిమ్మయిఁ, జెప్పువారు గలరొ ♦ చెప్పు మయ్య.

మత్తకోకిలము. కోరి నేన గడించి యిచ్చితిఁ ♦ గొమ్మటంచును నీకు నీ
భూరిరాజ్యము దాని లెస్సగఁ ♦ బొంద నేరక మందమై
కోరఁగించెడుబుద్ధి మోహము ♦ గూరఁ గూళ తెఱంగునన్
ధారుణిం బెడఁబాయ నెంచితి ♦ దారి తప్పి ధరాధిపా. 173

ఆ. వృద్ధసేవ చేసి ♦ యెఱుఁగవుగా కీవు, హార్షదైన్యము లవి ♦ యైన వాని
నిల్పుకొనఁగ లేని♦ఖలులబ్రతుకు నీటఁ, బచ్చికుండవోలె ♦ విచ్చిపోవు. 174

* కించ = విచారము; (ఇట్లు గోదావరీమండలముల వాడుదురు).

† తదీయార్థములు = వారిధనాదికము.

వ. మఱియు నాకర్ణింపు మతిభీరువు నతిక్లీబుఁడు దీర్ఘసూత్రుఁడు ప్రమత్తుఁడు వ్యసనసమాక్రాంతచిత్తుఁడు ననునీయేవురురాజులఁ బ్రజలు సేవింపరు గావున నీవు కార్యజ్ఞుండ వై యుండు మిదియునుం గాక. 175

ఉ. *ఉపకారం బొనరించినట్టిజను నెంతో ప్రేముడిం జూతు రీ
వుపకారంబున కైనపాండవులపై ♦ నుక్కుఁడ వై కీడుగాఁ
విపరీతస్థితిమై ననూయపడి యి♦వ్వేళన్ వృథాశోకభా
రపరీతాత్ముఁడ వై తపింతు తగునే ♦ రాజాన్వయగ్రామణీ. 176

చ. చెడకుము దుఃఖపూరమునఁ♦జేసి కృతంబు నెఱింగి నెయ్యమున్
నడపి ప్రసన్నచిత్తమున ♦ నట్టడవిం బడి యున్న పార్థులన్
దొడుకొనివచ్చి మెచ్చి దయ♦తోఁ గని వారికిఁ బైతృకార్థ మై
పొడమినరాజ్య మిచ్చి సుఖ♦మున్ యశముం గొని సంతసింపుమా. 177

వ. వత్సా! నీవు నామాట విని సౌమనస్యంబున సౌభ్రాత్రంబు నడపితివేని కృతకృత్యుండ వై సుఖింతు వని చెప్పుచుండ దుర్యోధనుండు తనపదంబులం బడి లేవకున్నదుశ్శాసను సౌహృదంబునం జేసి బాహుయుగళంబునం బ్రుచ్చియెత్తి కవుంగిలించుకొని మూర్ధాఘ్రాణంబు చేసి నిర్వేదించుచుఁ గర్ణసౌబలులం జూచి వ్రీడావిహ్వలచిత్తుం డై యి ట్లనియె. 178

తే. ధనము సౌఖ్యంబు నైశ్వర్య♦ధర్మములును, భోగ మాజ్ఞయుఁ బనిలేదు♦పొండుమీరు
చంపకుఁడు నన్ను నా కడ్డు♦చెప్పకుఁ డింక, వినుఁ డదియను ప్రాయోప♦వేశమునకు. 179

ఆ. అనుఁడు వార లక్కటా! నీకు నగుగతి, మాకు నగును గాని ♦ మానవేంద్ర
యీవు లేనిపురికి ♦ నే మెట్టు లొంటిమైఁ, బోవువార మయ్య ♦ భూవరేణ్య. 180

ప్రాయోపవిష్టుం డైనదుర్యోధనునిఁ గృత్య పాతాళంబునకుఁ గొనిపోవుట.

సీ. అని పల్కి రటు చుట్టములును మంత్రులును జెప్పి, రెవ రెన్ని చెప్పిన♦యే నతండు
తనపట్టు విడువక ♦ ధైర్యంబునం గుశ,చీరాంబరంబులు ♦ కోరి తాల్చి
దర్భాస్తరణమున ♦ నిర్భీకుఁ డై నిల్చి, నియతవ్రతంబున ♦ నొగడి వార్చి
బాహ్యేంద్రియంబుల♦వ్యాపార మంతయుఁ, నరికట్టియు నిమీలి♦తాక్షుఁ డగుచు
తే. నూపిరిం బిగఁబట్టి తా ♦ నోపి యెటులు, దెరల కేకాగ్రచిత్తుఁడై ♦ దృఢసమాధిఁ
దవిలి యుండె సుయోధన♦ధరణివిభుఁడు, చూచువారిమదులఁ †జుమ్మ ♦ చుట్టుకొనఁగ.

* ఉక్కుఁడు = మూర్ఖుఁడు. † చుమ్మ = వేదన.



వ. ‡అంత నది యంతయు నెఱింగి దేవనిర్జితు లై పాతాళవాసు లై యున్న పూర్వదేవత లాదుర్యోధనుండు ప్రాణత్యాగంబు చేసిన నిజపక్షక్షయం బగు నని తలంచి తదుద్యమం బుడుప నెంచి వాని నటకు రప్పింప నథర్వవేదప్రోక్తంబు లగుమంత్రంబుల వేల్చి రవు డావులించుచు నొకకృత్య వెలువడి వచ్చి యేమి సేయుదు నని వారియనుమతంబు వడసి ప్రాయోపవిష్టుండై యున్నధార్తరాష్ట్రు నెత్తుకొని నరయంబున రసాతలంబునకు మరలివచ్చి దైత్యులకు నివేదించుటయు వా రారాత్రి వానితోడం గలసి మెలసి మెలంగుచు ని ట్లనిరి. 182

సీ. †ఓహో సుయోధన ♦ సాహసం బిటు లేల, తలఁచితి శూరుండ ♦ వలఘుమతివి
దీన నాత్మత్యాగ ♦ మాను దానన్ మహా,పాతక మై కీడు ♦ వచ్చుఁ జూవె
నినుఁ బోఁటివా రిట్టు ♦ నీచకర్మములందుఁ, దగిలి దుర్గతు లంద ♦ నగుదు రటవె
ధర్మార్థసుఖయశో♦దారకం బరిహార్య,దాయకం బై నయీ♦తలఁపు విడుము
తే. వినుము నీతత్త్వ మెఱుఁగవు ♦ వినుతు మేము, తపమునం దొల్లి మెప్పించి♦స్థాణువలనఁ
గాంచితిమి నిన్ను నీపూర్వ♦గాత్ర మయ్యెఁ, శస్త్రదుర్భేద్య మై వజ్ర♦శకలములను.

క. ప్రనవమయం బై దేవీ,ప్రసమీక్షణమహిమవలన ♦ భాసిల్లె భవ
త్సుసమృద్ధోత్తరకాయము, ప్రసిద్ధరమణీమనోహ♦రవిలాసమునన్. 184

ఉ. ఈ వొకదివ్యపూరుషుఁడ ♦ విన్న మనుష్యశరీరధారి వై
భూవలయంబునం డిటుల ♦ పుట్టితి నీ కనిఁ దోడుగా రిపు
క్ష్మావరులన్ వధించుటకు ♦ క్షత్రియు లై భగదత్తముఖ్యు లై
దేవవిరోధు లెల్ల జగ♦తిం బ్రభవించిరి విక్రమంబునన్. 185

క. వారలు దివ్యాస్త్రవిదుల్, శూరులు నీశత్రుకోటి ♦ నుక్కింతు రనిన్
వీరాగ్రేసర నీ కీ,తీరున ఖేదమును భయము ♦ దివురఁగ నేలా. 186

వ. మఱియు భీష్మద్రోణకృపాదుల నాదిదేవత లావేశించుటం జేసి వారు మోహావశంబున నీకుఁ దోడ్పడి తండ్రులు కొడుకులు నన్నలు దమ్ములు బంధులు శిష్యులు జ్ఞాతులు బాలురు వృద్ధులు నని గణింపక నీదాయలతో నాలంబు గావింతురు పాండవేయు లెవ్వరును దేవాంశజు లగురాజులం గూడి వీరితోఁ బోరితంబు సేయుదురు దానంజేసి జనక్షయం బగు నాకర్ణింపుము. 187

‡ కృత్య—[illegible]దులు చేయువారి కిష్టము నెఱవేర్చుటకు వచ్చునట్టిదేవత.
† దారకము = పోఁగొట్టునది.

సీ. కలదు నీమదిఁ గఱ్ఱి♦వలనిభయము దాని, నంగదేశాధీశుఁ ♦ డపనయించు
వారినిహతుం డైన♦నరకునివిమలాత్మ, యరుదెంచి యంగేశు ♦ నాశ్రయించె
నతఁడు తద్ద్వారంబు ♦ మతిఁ దలంచుచుఁ గేశ,వార్జునులం దొట్టి ♦ యరులఁ గెల్చు
నిది యెఱింగియె సిద్ధ♦రేంద్రుఁ డర్జునుఁ గావఁ, గొను వానికవచంబుఁ ♦ గుండలములు
ఆ. నసురు లెల్ల శతస♦హస్రసంఖ్యలుగ సం,శప్తకు లనఁ బుట్టి ♦ జగతి నొప్పు
చున్నవారు వారు ♦ నన్నరు నిర్జింప, నున్నవారు సూవె ♦ యుర్వినాథ. 188
మ. నిరమిత్రంబుగ రాజ్య మేలఁ గల వీ♦సీచింతకుం గారణం
బరయం ద్రోపదు కాక నీవు దెగిపో ♦ నద్దాన మాపక్షముల్
బరిభూతం బగు నీవ మాకు గతి వా♦పాంసుప్రజల్ వేలుపుం
బరికిం బోలె నిఁ గొంచు గాక చనుమా ♦ మామాట పాటింపుమా. 189
మ. అని గాఢాదర మొప్పఁ జెప్పియును గం♦తాశ్లేషముం జేసియున్
దనుజానీకము పోయిర మ్మనుచుఁ బుం♦త్రప్రేమ వీడ్కొల్పుడున్
గనుసన్నం గొని వారియాజ్ఞ నతనిం ♦ గైకొంచు నాకృత్యయుం
గనుచుండన్ మును పున్నచో నిలిపి వే♦డ్కం బోయెఁ దా నిచ్చమై. 190
వ. అంత నతం డది యంతయు స్వప్నభూతంబుగా నెంచియుఁ గర్ణసంశప్తకులమూ
లంబునఁ బాండవులం జయింతుఁ గాక యని నిశ్చయించి దురాశాకృష్టమానసుం
డై మరణవ్యవసాయంబు మానియుండె నరకునంతరాత్మ గలియుటం జేసి కర్ణుండు
కృష్ణార్జునులం జంపుదు ననియు నసురాంశసంభవు లగుటం జేసి సంశప్తకు లర్జును
నోడింతు మనియు దైత్యదానవావేశంబునం జేసి భీష్మాదులు పార్థులయెడ మైత్రి
నడపు టేటి కనియు నుండి రట్లు దుర్యోధనుం డది యింతయు నేరికిం జెప్పఁ దలం
పక తొంటియట్ల ప్రాయోపవేశంబు చేసె నంతఁ గొంతవడికిఁ బ్రభాతం బగు
టయు రాధేయుండు గాంధారేయుపాలికిం జని మోడ్పుఁగేలు ఫాలమునం గీలించి
యి ట్లనియె. 191

—◆ కర్ణాదులు వేఁడ సుయోధనుఁడు ప్రాయోపవేశము మాని పురి కరుగుట. ◆—

ఉ. ‡బిచ్చెము లేకిలం బ్రదికి♦యుండిన భద్రము లందవచ్చెడిం
జచ్చినవెన్క నిం తయిన ♦ సంతస సేయఁగ నుండునయ్య నీ
కిచ్చట భీతికిన్ మృతికి ♦ హేతు వొకింతయు లేదు గావునన్
వెచ్చినసేనలం గలసి ♦ యేగుము నాగపురంబుఁ జేరఁగన్. 192

‡ బిచ్చెము = కొఱఁత.



చ. *అని తనహస్తయుగ్మమున ♦ నాతనిమే నమరించి యెత్తుచున్
ఘనభుజుఁ డంగభూవిభుఁడు ♦ గౌరవ మారఁగ వెండియున్ నరేం
ద్రున కను లెమ్ము లె మ్మధిప ♦ దుఃఖము నొందుచు నిట్లు ప్రాయముం
గొన గమకించు టొప్పునె య♦కుంఠితతేజుఁడ వీవు తక్కవే. 193
తరువోజ. అరులను మ్రందించి ♦ యైశ్వర్య మంది ♦ తథిప నీ కెవ్వఁ డీ ♦ డగును ధరిత్రిఁ
బురుహూతపుత్రునిఁ ♦ బోడఁగని యిట్లు ♦ పౌడవడం గెదో పదు♦మూఁడవవర్ష
మరిగినపిమ్మట ♦ నాతని నాల♦మందుఁ దున్మి తదీయు ♦ లగువారి నెల్ల
శరణంచు నినుఁ గొల్వ ♦ సంధింతు నంచు ♦ శస్త్రంబు ముట్టి నే ♦ సలిపెద బాస.
మ. †అనుచుం గర్ణుఁడు పల్కుపల్కు విని దే♦వారాతివాక్యంబులున్
మనమందుం దలపోసి ధైర్యగరిమన్ ♦ బ్రాయోపవేశంబు మా
ని నరేంద్రుం డటనుండి లేచి బలము ♦ న్నేమింపఁ బ్రస్థానముం
బొనరింపన్ నిజరాజధానికి జగ♦త్పూజ్యప్రభావంబునన్. 195
వ. అయ్యవసరంబున. 196
చ. ద్విరదములుం బదాతులును ♦ దేరులు వారువముల్ ప్రవర్తిలన్
బరఁగినభూరిసైన్య మది ♦ ప్రస్థితమై సురనిమ్నగాప్రవా
హరయమునం గనుంగొనఁగ ♦ నై విలసిల్లె ననారతారవం
బరమర లేక దిక్తటము♦లందు భయంకరరీతి మ్రోయఁగన్. 197
శా. ‡శ్వేతచ్ఛత్రపతాకచామరములం ♦ జెన్నొంది మి న్నంది సు
స్ఫీతం బై చనుధార్తరాష్ట్రనిమహా♦సేనాసమూహంబు వి
ద్యోతించెన్ శరదాగమంబున సము♦ద్భూతపరిభ్రం బొల్చి ని
ర్యాతం బై విడి కూడుమేఘసమితిం ♦ గ్రాల్మింగిచందంబునన్. 198
వ. అంత. 199
సీ. అగ్రభాగమున వి♦ప్రాగ్రణుల్ సేయునా,శీర్వచనంబులు ♦ స్వీకరించి
పక్షములం బరా♦బరు లయి పచరించు,వందిమాగధులకై ♦వార మంది
వెనుదన్ని సామంతు ♦ లనుసరించుచు నల్పు,కేలుమోడ్పుల నెల్ల ♦ లీలఁ గాంచి
సన్నికృష్టస్థులై ♦ సౌబలకర్ణాదు, లాచరించెడునుతు ♦ లాలకించి
తే. బాహ్లికుండును భూరిశ్ర♦వస్సు సోమ, దత్తుఁడును గోలెఁ గురువృద్ధు ♦ లత్తి నడువ
భాగ్యకలితయుక్తుఁ డై ధార్త♦రాష్ట్రుఁ డెలమి,వాదల దివ్యరథం బెక్కి ♦ కదలె నపుడు.

* ప్రాయము = మరణవ్యవసాయముచే నశనవ్రతము పట్టి యుండుట.
† ప్రస్థానము = ప్రయాణము. ‡ విద్యోతించెన్ = ప్రకాశించెను.

వ. ఇట్లు కదలి కౌరవేంద్రుం డత్యల్పకాలంబునన కరిపురంబునకుం జని యున్నంత గాం
గేయుండు గాంధారేయుం గానం జని యి ట్లనియె. 201

భీష్ముఁడు దుర్యోధనునిఁ దిరస్కరించి పలుకుట.

ఉ. పోవల దావనంబునకుఁ • బోయిన మోసము వచ్చు నంచు నే
నావలికత్తునిం దెలిసి • యంటిని నాయనుమాట యింతయుం
నీవు గణింప వైతి వట • నీకును వీరికి నెట్టికాస్తి యై
దేవుర పుట్టెనో తెలిసి • కే యిపు డైనను బుద్ధి వచ్చెనే. 202

తరలము.* అకట యే మని చెప్పువాఁడ రణవంత యేనియు వైరముం
సకలుఁ డాశమునాత్మజుం డెదఁ • జూడఁబోవక ఖేచరుల్
నికృతిమైఁ జెఱవట్టఁ దమ్ముల • నిల్పి నిన్ విడిపించఁడే
శిఖ విడంగఁ జరింతు వింతయు • సి గ్గెఱుం గవు దుర్మతీ. 203

మ. నిను నీతమ్ములఁ గొట్టి కట్టి దివికిన్ • హేలాగతిన్ ఖేచరుల్
గొనిపో నుండినయప్డు పోరు విడి నీకుం గూర్చువిల్కాఁడు పో
యెను నేఁ డవ్వ పలాయితుం డగుచు నీ • వీక్షింపఁగా లేదె యే
మను దాసూతసుతుం భయాతుఁ డని నేఁ • డైనం దలంతే మదిన్. 204

తే. పాండుపుత్రులశౌర్య మేపాటియదియొ, సూతపుత్రునిధైర్య మేసూటియనియొ
కన్నులారంగఁ జూచితి • కాదె వారి,తారతమ్యము తెలిసెనే • తాత! నీకు. 205

తే. అస్త్రమందును శస్త్రంబునందు శౌర్య,మందు ధైర్యంబునందు స్థైర్యంబునందు
ధర్మమందును గర్ణుఁ డాకర్మతులకుఁ, బోలఁ డొకపాదమాత్రమేఁ • బోల వింటె. 206

వ. కావున నీ విప్పటి కైనం బుద్ధిమంతుండ వై పాండవులతోడ సంధి చేసి కులంబు
రక్షించుకొను మని చెప్పుచుండ నవ్వి యవ్వన లేచి శకునితోడం గూడి వెడలిపోయెఁ
గర్ణదుశ్శాసనులును వాని ననుసరించిరి కురుపితామహుండును సిగ్గుమాలినవారిం జూచి
సిగ్గుపడి దిగ్గన లేచి నిజనివాసంబునకుం జనియె నంతలో ధార్తరాష్ట్రుండు వెండియు
నట వచ్చి మంత్రులం గాంచి యి ట్లనియె. 207

చం.‡ మన కికఁ జేయ నైనపని • మంత్రివతంసములార! యెద్ది? దే
నిని బొనరించి శ్రేయముల • నొక్కని యుందుమొ చెప్పుఁడీ యనన్
విని వినయంబు తోఁప నవె • వీరవరేణ్యుఁడు కర్ణుఁ డెల్లరున్
వినఁగ సుయోధనుం దటిసి • విష్ణుపదీసుతుఁ డెందనాడుచున్. 208

* శిఖవిడంగఁ జరింతువు:–అనఁగా జుట్టు విడం దిరుగుదు వని, [illegible] నిం బలుకుదురు.   ‡ విష్ణుపది = గంగ.



మ.‡ జగతీనాథ నదీసుతుండు మన కత్యంతంబునున్ వైరి యై
పొగడున్ పాండవులం దదర్థ మయి నే • మోమోడ కేమే ననం
దెగుదుం దాన నతండు నీసముఖమందే నన్ను దూఱున్ సహిం
పఁగ రాన ట్లిఁక నేమి సేయఁ దగు నా•ప్రామానిసిన్ బ్రామిడిన్. 209

ఉత్సాహము. పోల నంపు మే నొకండ • పోయి మున్ను పాండవుల్
చాలి కొన్నయట్టిదేశ•సంచయంబుతోడ నీ
నేలనాల్గుచెఱఁగు లిపుడ • నీకుఁగా జయింతు నా
చాలికుండ భీష్మువల్కు•పాటి చూతు మెట్టిదో. 210

క. నింద్యపురస్కారంబు న,నింద్యతిరస్కార మెపుడు • నియతిం గొనునా
నింద్యచరిత్రుఁడు తన్నున్, నింద్యునిఁగా నెంచకుండునే యిపు డైనన్. 211

ఆ. కత్తి ముట్టి యిదిగొ • కలరూపు చెప్పెద, నీకు విజయలక్ష్మి • నిక్క మగును
నాకు నాజ్ఞ యిడుము • నావుడు సంప్రీతిఁ, నిట్టు లనియెఁ గౌర•వేశ్వరుండు. 212

శా.‡ అహా! యే మని చెప్పువాఁడ నిఁక నీ•యట్టిండు నా కిట్టిచో
సాహాయ్యం బొనరింప నుండె నట నీ•తన్మామండలంబందు నే
నీహామాత్రిన సర్వమున్ సఫల మై • హేమింపఁగా నుందు నం
దేహం బింతయు లేదు ధన్యుఁడను నా•దిష్టంబు సామాన్యమే. 213

వ.‡ నేను నీశాసనంబునం జేసి ప్రవర్తించువాఁడ నీ వెప్పుడ పోలు నప్పుడ ప్రాయాత్రికంబు
గావింపుము నావుడు నౌఁగాత మని కర్ణుండును. 214

దుర్యోధనానుమతంబునఁ గర్ణుండు దిగ్విజయంబు సేయుట.

సీ. శుభముహూర్తంబున • విభవసమేతుఁ డై, భూసురాశీర్వాద•పూజ్యుఁ డగుచుఁ
జతురంగబలము త • న్ననుతులితగతి నంట, జైత్రయాత్రార్థము • చక్క వెడలి
రథఘోషమున దెసల్ • ప్రతిశబ్దముల నీన, నలువుచుఁ బాంచాల•ములకు నరిగి
తొలుదొల్త ద్రుపదుని•తో సంగరముఁ జేసి, నిజవశానుగునిఁగా • నిలిపి వాని
తే. వలన వెండియు బంగారు • వలసినన్ని, రతనములు గప్పముగఁ గొని • యతనియనుచ
రు లగుసామంతుల నరిగాఁ•పులుగఁ జేసి, తరలిపోయె నంత నతఁ డుత్తరము పట్టి. 215

దెగుదు = సాహసింతు. ప్రామానిసి = ప్రాఁతమనుష్యుఁడు; ముదుసలి. బ్రామిడి = [illegible]. తలఁపు = ఇచ్చ. హేమించు = [illegible]. దిష్టంబు = భాగ్యము.
ప్రాయాత్రికంబు = దిగ్విజయప్రయాణము.

వ. భగదత్తప్రభృతు లైన రాజులం జయించి హిమవత్పర్వత ప్రాంతంబున కరిగి యందు నందుం గల నృపతుల నెల్ల నదిమి కప్పంబులు గొని పోయి ప్రాగ్దిశం గలయం గ్రుమ్మరుచు నంగ వంగ కళింగ శుండిక మగధ మిథిలాది దేశంబుల రాజులం గెలిచి దక్షిణంబునకుం జని. 216

సీ. దాక్షిణాత్యుల నెల్ల ♦ నక్షీణశక్తి ని, ర్జించి సువర్ణ మా ♦ ర్జించి మించి
కుండినపురమున ♦ కుం జని రుక్మితో, స్సని సేసి తత్సఖ్య ♦ మును మతించి
తత్పురస్థితరత్న ♦ తతి నేకరించి త, త్సహితుం డై పాండ్యదే ♦ శమున కేగి
తద్వివయాధీశు ♦ దక్షిణ కేరళరాజు, గెలిచి నీలుని తోడ ♦ గల నొనర్చి

తే. వేణుదారిసుతుండు గోలె ♦ వివిధదేశ, పతుల నిర్జించి కప్పముల్ ♦ వడసి శైశు
పాలుని నవంతిభూపాలు ♦ లీల గెలిచి, వృష్ణివీరులతో మైత్రి ♦ విస్తరించి. 217

వ. పశ్చిమంబునకుం జని శక యవన బర్బర మ్లేచ్ఛాటవిక భద్ర రోహిత కాగ్నేయ మాళవ నగ్నజిత్ప్రముఖుల సంగరంబున నోడించి యంత భూతలం బంతయు నిజ వశంబున నిలుపుకొని రాధేయుం డమేయపరాక్రమంబు మెఱయం గరిపురంబునకుం జేర నరుగుటయు నది విని దుర్యోధనుండు సభ్రాతృపితృబాంధవుం డై వాని నెదుర్కొని సంభావించుచుం బ్రీతిపూర్వకంబుగా ని ట్లనియె. 218

—◆◆◆ దిగ్విజయంబు చేసి వచ్చినకర్ణుని దుర్యోధనాదులు సంభావించుట. ◆◆◆—

మ. ‡మన మెంతేనియు సంతసించెడిని భీష్మద్రోణముఖ్యు ల్వొసన
ర్పనిమే లీవు పొనర్చి తేమిటికి జెప్పం జొక్కలే నీకతం
బున రారా జనం జేరు గాంచితి నిలం ♦ బోలింప నప్పాండునం
దనులుం దక్కిన తేండ్లు నీకళకు నై ♦ నం జాల రాలించితే. 219

వ. మిత్రరత్నమా నీ వీదారినపోయి యదితికశ్యపులం బురందరుండుం బలె గాంధారీధృతరాష్ట్రులదర్శనంబు గావింపు మని చెప్పి పుచ్చె నంత దంతిపురంబున. 220

క. కొందఱు భూషించిరి మఱి, కొందఱు దూషించి రతనిం ♦ గొందఱు తమ రే
చందమునం బడ కుందిరి, క్రందై హాహారవంబు ♦ కడలన్ మ్రోయన్. 221

తే. అట్లు కర్ణుండు దుర్యోధ ♦ నానుమతిని, వృద్ధరాజులపాలికి ♦ వేడ్క నరిగి
దిగ్విజయసంచితార్థముల్ ♦ తెలియ వినిచి, తత్కృతప్రీతిపాత్రుం డై ♦ తనరె మిగుల.

వ. అది మొదలు సుయోధనాదు లెల్లరుం గర్ణునికతంబునం జేసి పాండవేయుల జయించితిమి కా యని సంతసించుచుండి రంతం గర్ణుండు దుర్యోధనునికడకుం జని యి ట్లనియె.

‡ నీకళకు = నీపదియాఱవవంతునకు.



ఉ. నిన్నపత్న మయిన ♦ నేల యంతయు నీవ, శంబ యయ్యె నేఁడు ♦ జనవరేణ్య
దాని నేలు మింక్రమఁ ♦ జానాకమునుబోలె, నన సుయోధనుండు ♦ ననియె నిట్లు.

శా. నీయట్టిండు ధనుర్ధరుం డొకరుఁ డుం ♦ డేఁ గూర్మి లాలింప నా
కీయుర్విన్ లభియింపరాని దొకఁ డే ♦ నీక్షింపఁగా నుండునే
నాయందున్ సకలార్థసిద్ధు లగు నై ♦ నం గాని నాలో నభి
ప్రాయం బొండొకఁ డొప్పుఁ జెప్పెద దయం ♦ బాలించి యాలింపవే. 225

ఆ. పాండురాజసుతుని ♦ పరమపవిత్ర మై, పరఁగు రాజసూయ ♦ మరసినట్టి
నాఁడుగోలె నాకుఁ ♦ గూడియుండెను రాజ, సూయమందుఁ జిత్త ♦ మోయికర్ణ. 226

ఉ. అనుటయుఁ గర్ణుఁ డి ట్లనియె ♦ న ట్లయినం గడు సంతసంబ యీ
వననిధికాంచి నీ కిపుడు ♦ వశ్యులు పార్థివు లెల్లఁ జొక్క నై
ధనమును ధాన్యముం గలుగుఁ ♦ దత్క్రతుతంత్ర మొనర్ప విప్రులం
గనుఁగొని పిల్వ నంపుము జ ♦ గంబునఁ గీర్తి గణింపు మీఁదువన్. 227

వ. అనిన దుర్యోధనుండు మెండుగ సంతసించుచుం దనపురోహితునిం బిలువ నంచి.

తే. రాజసూయంబు చేసెద ♦ రాజు లెల్లఁ, దవిలి కొలువంగ మీ రెల్లఁ ♦ దద్విధాన
మరసి కావించునది యథా ♦ న్యాయముగ న, నవుడు ని ట్లను భూవిభు ♦ నకు నతండు.

మ. *జనకుం డుండ విరుద్ధ మావరస ♦ స్థం జేయుటల్ కాక నీ
కు నరిత్వంబునఁ బార్థు లుండ నది గా ♦ కో నా నశక్యంబు కా
వున నోభూవర రాజసూయసమ మై ♦ పుట్టిన్ మహావైష్ణవం
బనునత్రిం బది చేయ నెంచుఁడు ప్రభూ ♦ తాన్నంబుగా నిమ్యెడన్. 230

మ. హరి గా కొక్కరుఁ డైన న్క్రతువుఁ జే ♦ యం జిత్తముం జేయ లే
దరు దై శ్రీయ మొసంగు నయ్యది నరేం ♦ ద్రా! నీకుఁ బోలు న్నరే
శ్వరు లర్పించినకప్పముల్ గొని తగన్ ♦ స్వర్ణంపునాఁగేటితో
దొరలన్ వైష్ణవయజ్ఞవాటధరణిం ♦ దున్నింపఁగా నొప్పెడున్. 231

—◆◆◆ దుర్యోధనుఁడు వైష్ణవ మనుయజ్ఞముఁ జేయుట. ◆◆◆—

వ. అని పురోహితుండు సెప్పిన విని కర్ణాదులయనుమతంబునఁ దత్తదధికారులం బుచ్చి యజ్ఞసంభారంబు లెల్ల సమకట్టించి తదుద్యమం బంతయు జననీజనకులకును భీష్మద్రోణవిదురాదులకును జెప్పి వారియనుమతంబు వడసి శిల్పివరుల రావించి పురసమీపంబున నొక్కరమణీయప్రదేశంబు సువర్ణలాంగలంబునం దున్నించి యటశా

* సవస్థ = క్రతువు.

లానిర్మాణాదికంబు గావించి దేశదేశంబులం గల బ్రహ్మక్షత్రియాదులం బిలువ దూతలం బుచ్చి తాను విధివిధానంబున యజ్ఞదీక్షితుం డయ్యె నయ్యెడ దుశ్శాసనుం డొక్కదూతం బిలిచి నీవు ద్వైతవనంబునకుం జని పాపపూరుషు లగుపాండవులం బిలిచి ర మ్మని పంచుటయు వాఁడు పాండవులపాలికిం బనివిని యజాతశత్రునిం గని ప్రణతుం డై యి ట్లనియె. 232

మ. నిజవీర్యార్జితవిత్తసంచయమున ♦ న్విఖ్యాతికిం బాత్ర మై
సుజనస్తుత్యచరిత్రుఁ డుత్తరకురు♦క్షోణీశ్వరుం డిప్పు డె
ల్లజనుల్ మెచ్చఁగఁ జేయునధ్వరము లీ♦లన్ దాని వీక్షింపఁగా
ద్విజులున్ రాజులు వచ్చుచుండి రటకున్ ♦ దేదీప్యమానప్రభన్. 233

క. నిన్నుం దమ్ములఁ బిలువఁగ, న న్నానరనాథుఁ డంచి♦నన్ వచ్చితి నే
నిన్నే లవ్విన కోనరవర, కన్నులు గలఫలము దానిఁ ♦ గాంచుట తెలియన్. 234

వ. కావున నీవు భ్రాతృసహితుండ వై యట వచ్చి యజ్ఞంబుఁ బ్రతీక్షించి దుర్యోధనునికోరికం దీరుపు మనిన ధర్మనందనుండు వానిం జూచి యి ట్లనియె. 235

ఉత్సాహము. †మానుయోధనుండు సుజన♦మాన్యుఁ డై మహాధ్వరం
బీసమయమునం దొనర్ప ♦ నెంచు టుత్తమంబు మా
దోసముల్ నశించుఁ గనిన♦తోన నైన బాస నేఁ
డ్రోసి యచట రాఁగ నొప్పఁ♦దో యటంచు నెంచెదన్. 236

వ. అని పలుకుచున్నసమయంబున భీమసేనుం డి ట్లనియె. 237

తే. సమయ మిది చెల్ల మారాజు ♦ శౌర్య మొప్ప, నస్త్రశస్త్రప్రదీప్తాగ్ని♦యందు ధార్త
రాష్ట్రపశుహవిస్సును వేల్చి ♦ రణమఖంబు,సేయ నట వచ్చు నని నీవు♦ చెప్పుమయ్య.

క.‡తక్కిన పాండవు లెవ్వరు, నొక్కంతయుఁ బలుక కూర♦కుండిరి దూతుం
డక్కజపడి చని యంతయు, నక్కడ నెఱిఁగించెఁ గౌర♦వాధీశునకున్. 239

వ. తదనంతరంబ. 240

తరువోజ. చనుదెంచి రెల్ల దే♦శమ్ములనుండి ♦ క్ష్మాసురుల్ క్ష్మావరుల్ ♦సంతతప్రీతిఁ
గని కౌరవేంద్రుఁ డా♦గతు లైనవారి ♦ గౌరవించి భజింపఁ♦గా బంచె విదురు
ఘనుఁ డగునాతండు ♦ గడు భక్తి వారి ♦ గంధమాల్యాదులఁ ♦ గై సేయఁ బుచ్చి
నను వొప్ప నన్నపా♦నమ్ము లొసంగి ♦ నడపె భక్తిం బూజ♦నము లట్టివేళ. 241

---

† బాస=ప్రతిన. ‡ అక్కజము=ఆశ్చర్యము.



వ. అట్లు దీక్షితుం డై నదుర్యోధనుండు వైష్ణవయాగం బుపక్రమించి యథాశాస్త్రంబుగా సమాప్తప్రయోగంబు గావించి యాగదర్శనసమాగతు లగువారి నెల్ల నంపి పుచ్చి భ్రాతృజనపరివృతుం డై కర్ణసౌబలపురస్సరంబుగా వందిమాగధస్తోత్రంబు లాలకించుచుఁ బురప్రవేశంబు గావించె నప్పుడు. 242

చ. పురమున కేగునానృపతి♦పుంగవుఁ జందనచూర్ణలాజలన్
గర మరుదారఁ జల్లుచు జ♦గన్నుత! విఘ్నము లేక నీమహా
ధ్వరము సమాప్త మొందెనె ము♦దంపడి పోయిరె బుత్విజుల్ మహీ
శ్వరులును మేలు మే లని ప్ర♦శంస యొనర్చిరి కొంద ఱొందుగన్. 243

తే. తొల్లి యాక్రతు వొనరించి ♦ తెల్లముగను
నహుషుఁడును యయాతియును మాం♦ధాతయును బ
విత్రగాత్రు లై త్రిభువన♦విశ్రుతయశు
లై దివికి నేగి రేతన్మ♦హాత్వమునను. 244

క. పరమోత్తమ మీక్రతువర, మరయఁగ నీక్రతువుఁ బోల ♦ వాయాక్రతువుల్
కురువంశ మెల్ల దీనన్, బరమపవిత్రంబ యయ్యెఁ ♦ బరికింపంగన్. 245

వ. ఇట్లు పలుకుచున్నంత నందు మఱికొందఱు. 246

తే. అయ్యుధిష్ఠిరరాజసూ♦యంబునందు, షోడశాంశమునకుఁ బోల్చి ♦ చూడఁ బోల
దీసుయోధనుమఖ మింత ♦ యేటి కనుచుఁ, దెగువ నాడిరి నిర్భీకు♦ లగుచుఁ దొడి.

వ. అ ట్లందఱు నన్నిచందంబులం బలుకుచుండ దుర్యోధనుండు రాజభవనంబునకుం బోయి తల్లిదండ్రులకును భీష్మద్రోణకృపవిదురాదులకు నభివందనం బాచరించి తనకు మ్రొక్కువారి నభినందించి తమ్ము లెల్లఁ బరివేష్టింప నొక్కభద్రాసనంబున నాసీనుం డై యుండె నప్పుడు కర్ణుండు లేచి యి ట్లనియె. 248

చ. భరతకులావతంసమ! భ♦వన్మఖ మిప్డు సమాప్త మై శివం
కర మయి క్రాలె నిట్లు రణ♦కౌశల మేర్పడ నెల్లపార్థులన్
దురమునఁ జంపి పెంపునను ♦ దోఁగుచు వీఁగక రాజసూయమున్
గరిమ నొనర్పు మప్డు గద ♦ కల్గెడు మాకు ముదంబు నాపున్. 249

చ. కురుపతి కర్ణుఁ గౌఁగిటను ♦ గ్రుచ్చి ప్రియం బెనలార ని ట్లనున్
బురుషవరేణ్య! నీ వనిన♦పోలికఁ బార్థుల నోర్చినంతటన్
నెరయును రాజసూయ మది ♦ నీకరమం దగు నట్టిభాగ్య మిా
నరునకుఁ బట్టునో యని మ♦నంబునఁ జింతిలె నెంతయేనియున్. 250

ఉ. నావుడుఁ గర్ణుఁ డిట్లనియె ◆ నాప్రియమిత్రమ! పాండుపుత్రులన్
జావఁగ నేసి తత్క్రతు వె ◆ సంగఁగఁ జేసెద సవ్యసాచిపై
నీ వెదఁ జింతసేయకుము ◆ నే నరుఁ గూల్చినదాఁకఁ గాళ్లులన్
ధావన మాచరింపఁ బలి ◆ తంబు భుజింపను బాన చేసితిన్. 251

వ. ఇట్లు ప్రతిజ్ఞవట్టిన విని ధార్తరాష్ట్రు లెల్లరుం బాండవులు దెగిరకా తలంచి సంత
సించి రంత సుయోధనుండు రాధేయు నగ్గించుచుం గొలువు చాలించి యభ్యంతర
భవనంబునకుం జనియె సభాసదులును వాని వీడ్కొని తమతమపొందుపట్లకుం
బోయి రిది యంతయు దూతముఖంబున నజాతశత్రుండు విని చింతాక్రాంతచిత్తుం డై
తదద్భుతప్రభావాభేద్యకవచాదులం దలంచి తలంకుచుండె నిట దుర్యోధనుండును
గర్ణసౌబలానుమతంబున భీష్మద్రోణకృపాదులం దక్కటివారిం గౌరవించి పూజిం
చుచు నిరంతరత్యాగభోగపరుం డై యుండె నంత నటఁ గౌంతేయాగ్రజుండును.

మృగస్వప్నోద్భవపర్వము.

ఉ. ఆతతచింతలం దగుల ◆ నారట మొందుచు నందు నుండి యొం
డో తరలం దలంచు చొకం ◆ తో యమునన్ నిదురించుచుండ నా
ద్వైతవనీమృగంబు లవి ◆ స్వప్నమునం బొడసూపి బాష్పకం
ఠావిలదుస్స్వరం బెసఁగు ◆ నట్లుగ ని ట్లను బొట్లు కోట్లుగన్. 253

సీ. ఏ మీవనంబున ◆ నేనుఁగుమృగంబుల, మెకమీఁడ! మా మొత్తు ◆ లెల్ల వినుము
శస్త్రాస్త్రకోవిదుల్ ◆ శౌర్యనిధులు నీదు,తమ్ములు వారిశ ◆ స్త్రములవలన
నల్పావశిష్టము ◆ లై మాకులంబులు, కడచని పోయె నో ◆ కౌరవేంద్ర
దయచేసి బీజభూ ◆ తముల మై యిటు లున్న, మానుడి విని మమ్ము ◆ మనుపవయ్య
తే. యనుచుఁ బ్రార్థింప నా ◆ గాత మనుచు ధర్మ,తనయుఁ డన్నిటికభయప్ర ◆ దాన మొసఁగి
మేలుకని తమ్ములను బిల్చి ◆ పోలఁ జెప్పె, స్వప్నవృత్తాంత మంతయు ◆ జాలి పుట్ట.

తరువోజ. అని మఱియు నిట్లు ◆ లనియె నో తమ్ము ◆ లార! హాయనముపై ◆ నష్టమాసములు
చనియె నిం దిఁక నుండఁ ◆ జనదు కామ్యకముఁ ◆ జనియందుఁ దృణబిందు ◆ సరమునయందు
దినములు పుత్త మా ◆ దేశ మొప్పు నని ◆ తెలిపి తమ్ములతోడ ◆ దేవేరితోడ
మునులతో ద్విజులతో ◆ మొగి నింద్రసేన ◆ ముఖులతో నేగి న ◆ ప్పొలమును జేర.

వ్రీహిద్రౌణికపర్వము.

వ. ఇట్లు చని కామ్యకవనంబున సకలపరివారపరివృతుం డై ధర్మసుతుండు ఫలమూ
లంబు లశనంబుగా నుండి తమవనవాసక్లేశంబునకు వగచుచుం దనచేసినచేఁతకుం దాన



నిందించుకొనుచు సూతసుతునిపౌరుషాక్షరంబులు దలంచి నిశ్వాసంబు నిగిడించు
చుఁ బరిపరివిధంబులం బలవించుచు రే లెల్ల నిదుర గానక దీనుం డై యెట్ట
కేలకుం బదియొక్కండవయేఁటం గడవ నీదె నవుడు భీమార్జుననకులసహదేవులును
ద్రోవదియు సమయవత్సరంబులు కడసనవచ్చె నని యుత్సాహక్రోధంబు లినుమ
డింప నుండి రంత నొక్కనాఁడు. 256

శా. సారాచారవిశారదుండు త్రిజగ ◆ చ్ఛస్త్రప్రభావుండు వి
ద్యారాజీవభవుండు భావుకపద ◆ వ్యాపారపారీణుఁ డి
చ్ఛారాజత్కవితావిలాసుఁడు తప ◆ స్సామ్రాజ్యపూజ్యుండు న
ప్పారాశర్యుఁడు వచ్చె నచ్చటికి ది ◆ వ్యప్రాభవం బేర్పడన్. 257

ఉ. వచ్చినమానితల్లజుని ◆ వాసవవందితకీర్తివైభవుల్
సచ్చరితుల్ పృథాసుతులు ◆ సాధుమతు ల్గని దవ్వుదవ్వులన్
హెచ్చినభక్తితోడ నెదు ◆ రేగి నమస్కృతు లాచరించి తో
తెచ్చి భజించి రెంతయు ను ◆ తించి సపర్యల సత్కరించుచున్. 258

వ. అతండును వనవాసాయాసకర్శితు లై నమనుమలం గాంచి యనుకంపాతరంగితాంత
రంగుం డై ధర్మరాజాదిక్కు మొగం బై బాష్పగద్గదస్వరంబున ని ట్లనియె. 259

వ్యాసుండు ధర్మరాజునకుఁ గొన్నిధర్మంబు లుపదేశించుట.

మ. సుఖముం బొందఁగ లేఁ డతప్తతనుఁ డై ◆ చూపట్టు నెట్టింటనున్
సుఖదుఃఖంబుల నోలి నొంద నగు నెం ◆ దుం బూరుషుం డెంతయే
సుఖముం బొందఁగఁ జాలఁ డెప్పుడును బ్రా ◆ జ్ఞుం డిట్లు లో నెంచి త
త్సుఖదుఃఖంబుల మోదఖేదములకుం ◆ జొత్తిల్లఁ బోఁ డెత్తఱిన్. 260

చ. తఱి వడఁ గల్గునన్యములఁ ◆ దత్పరతం గొనుకర్షకుండు నా
నెఱిఁగినయట్టిఁ డెప్పటికి ◆ నేది లభించునొ దాని నొందుఁ గా
కెఱుక చెడన్ బ్రవర్తిలఁగ ◆ నెంచఁ డొకప్పిది సత్త్వంబునన్
వఱలెడు దాని కెందును గ ◆ సంబడ డొక్కయసాధ్య మేనియున్. 261

తే. సత్య మార్జవ మక్రోధ ◆ సంవిభాగ,శమదమంబులు ననసూయ ◆ శౌచ మింద్రి
యార్థనిగ్రహము నహింస ◆ యనెడు నివ్వి, గలిగియుంట తపం బని ◆ తెలియవలయు.

క. ఇవి గావనుచు నధర్మము, లవి చేయుచునుండు మూఢు ◆ లజ్ఞానమునం
దవులంగ నీచజన్మము, లవనిం బొందెదరు సూవె ◆ యతిహీనగతిన్. 262

క. ఇందుం జేసినకర్మము, లందుఁ ఫలదంబు లగుచు ♦ నలరుం గానన్
సందేహ మెది తపముం, బొందం దగు మానవుండు ♦ పుణ్యపథమునన్. 264

సీ. సత్యవాదికి నాయు ♦ వత్యంతవృద్ధి యగు, నార్జవంబున ననాయాస మెసఁగు
నక్రోధనుఁడు పొందు ♦ నతినివృత్తి సతంబు, శాంతునకు సుఖంబు ♦ సంభవించు
దాంతుండు గొనఁడు సంతాప మెప్పుడు సంవి,భక్తభోగములను ♦ బడయు మిగుల
దాతకు సకలంబు ♦ చేతి దౌను నహింస,కునకు నారోగ్యము ♦ కొనలుసాఁగు
తే. దేవతాతిథిపూజల ♦ భావశుద్ధిఁ,జేసి లోభమోహాదులఁ ♦ జెందనట్టి
పురుషునకు సంతతానందమును సుఖంబు, గలుగు నిందును నందు నోనలలితాత్మ.

క. ఏవంవిధసత్కర్మము, లేవలనం జేసి మనుజుఁ ♦ డీల్గియు మరలన్
భూవలయమందు నుత్తముఁ, డై వెలయున్ సకలశుభము ♦ లందఁగ నగుచున్.

తే. అనుడు ధర్మసుతుం డిట్టు ♦ లనియె నయ్య, దానధర్మములందుఁ ద♦పోనియమము
నందు నెయ్యది గుణవంత ♦ మగునుదుష్క,రమునునగునద్దిచెప్పవే♦సుమహితాత్మ.
వ. అనిన నతం డతని కి ట్లనియె. 268

క. దానముకన్న మ ఱొక్కం, డీనిఖిలమునందు లేద ♦ యిది నిక్కవ మో
భూనాథ! తదర్థము ధన, మూనఁగ నగు దాని కెంత♦యో శ్రమ వలయున్. 269

సీ. ప్రాణంబులకు దీటు ♦ వచ్చుప్రియుల నైనఁ, బ్రాణంబులను నైనఁ ♦ బాయ విడిచి
గహనాంతరములందుఁ ♦ గాల్కొలందిని మెట్టి, గంభీరవార్ధుల♦కడలు ముట్టి
యాలఁ గాచియు దున్ని ♦ యధమాధములయిండ్లఁ,గూలినాలియుఁ జేసి♦కుతిలఁగుడిచి
యన్నవిక్రయమును ♦ గన్నెవిక్రయమును, గావించి మిక్కిలి ♦ దేవురుపడి
తే. ధనము గడియింప నగునట్టి♦దాని విడుచు,టరయ దుష్కరమని వేఱ ♦ యనఁగ నొక
కాన యన్నింటికిం బెద్ద♦దాన మొకఁడ, దానికంటె మ ఱొక్కఁడు ♦ గానరాదు. 270

తే. తలఁప న్యాయార్జితం బగు♦ధనము దేశ,కాలపాత్రము లెఱిఁగి జ♦గంబునందు
దాన మిడ నద్ది ఫలద మై ♦ కానిపించు, నితరదానము చెడు ఫల♦హీన మగుచు. 271

వ. ఈయర్థంబు తేటపడ నొక్కపురాతనేతిహాసంబు గల దాకర్ణింపుము. 272

—♦— ముద్గలుం డనుమునివృత్తాంతము. —♦—

సీ. కలఁడు మున్ననసూయుఁ♦డలఘువ్రతుఁడు జితేం,ద్రియుఁడుధర్మాత్ముఁడు♦ దేవసముఁడు
ముద్గలుం డనియెడు♦ముని పుత్రదారసమేతుఁడై నివసించె ♦ భూతలమునఁ
గీర్తితం బగుకురు♦క్షేత్రమందుఁ గపోత,మ ట్లుంఛవృత్తి స♦మాశ్రయించి
ప్రతిపత్తు మొదలు ప♦ర్వముదాఁక నొక్కొక,గింజగా రాలిన♦గింజ లేఱి



తే. *వడ్లు తూమెఁడు నేసి ప♦ర్వంబులందు, వండి యిష్టికృతం బన ♦ నుండుసత్ర
మాచరించుచు వేల్పుల ♦ కతిథులకు నొ,సంగి శేషాన్నమునఁ జేయు ♦ నంగయాత్ర.

మ. ప్రతిపర్వంబున సమ్మహాత్ముఁ డొనరిం♦పం బొల్చునయ్యిష్టులన్
శతమన్యుం డమరాంచితుం డగుచు సా♦క్షాత్కారముం జేసి య
ప్రతిమప్రాభవ మొప్ప నెప్పుడు హవి♦ర్భాగంబులం బొంది వి
స్తుతిపాత్రుం డయి పోవు నమ్మునికి సం♦తోషంబు సంధిల్లఁగన్. 274

క. మునిముద్గలుమాహాత్మ్యం,బున వ్రీహిద్రోణమంచుఁ ♦ బొలుపొందఁగ వం
డినయన్న మతిథిజనులకు, ననువుపడం బెరుఁగుచుండు ♦ నక్కాలమునన్. 275

వ. ఇట్లుండి పక్షోపవాసంబు నలుపుచున్నముద్గలుని విని దుర్వాసుం డొక్కపర్వ
దినంబున. 276

మ. ‡కనుఁగొన్నంతన రోఁత పుట్టెడుగతిం ♦ గల్పించువేషంబుఁ గై
కొని వ్రేలాడుచుఁ గేశపాశ మవనిం ♦ గ్రోడాడఁ గ్రూరధ్వనిన్
వని మార్మ్రోయఁగ నార్చుచుం బ్రబలి దు♦ర్వాసుండు దిగ్వాసుఁ డై
కన నయ్యో వెడఁగో యనంగ నచటం ♦ గ్రామ్యోక్తులం బల్కుచున్. 277

ఆ. పిచ్చివానిఁ బోలి ♦ వచ్చి యన్నార్థి నే, ననెడువాని కెదురు ♦ చని మునీంద్రుఁ
డర్ఘ్యపాద్యము లిడి ♦ యతిభక్తిఁ బూజించి, తెచ్చి పెట్టె నన్న ♦ మిచ్చకొలఁది.

తే. దాని నంతయు మెసఁగి య♦మ్మౌని మఱియుఁ, గావలయు నన్న ముద్గలుఁ♦డేవగింప
కంతయును బెట్టఁ బెట్టిన ♦ దంతయుఁ దిని, మిగిలినది మే నలఁదుకొని ♦ మగిడిచనియె.

క. ♣వ్రీహిద్రోణ మ దంతయు, స్వాహాకారంబు చేసి ♦ చనుటయు మదిలో
నీహ చెడక ముద్గలుఁడు ని,రాహారుం డగుచు మఱియు ♦ న ట్లుంఛవిధిన్. 280

శా. వ్రీహిద్రోణముఁ గూర్చి తొల్లిటివలెన్ ♦ వ్రేల్గొందుసుం బర్వము
త్సాహంబుం గొని వేల్పు విప్రులకు ని♦చ్చం జూచుచున్నప్డు నం
దేహం బింతయు లేక తొంటియతఁ డే♦తే బెట్ట సర్వంబుఁ దా
నాహారం బది లేక ముద్గలుఁడు ని♦ష్టావాప్తి వర్తించుచున్. 281

వ. ఇట్లు దుర్వాసుం డాఱుపర్వంబులు వచ్చి ముద్గలునికుటుంబయాత్ర కొక్కమొదు
కైన మిగులకుండునట్లు వ్రీహిద్రోణాన్నం బంతయుఁ దాన తిని యప్పటికిని ముద్గలుని

---

* అంగయాత్ర = దేహయాత్ర; శరీరమును పోషించుకొనుట.
‡ క్రోడాడు = పొడుచు; ♣ స్వాహాకారంబు చేసి = అంతయు నసుభవించి యనుట కిట్లు వాడుదురు.
ఈహ = ఇచ్ఛ. ఉంఛము = ఒక్కొకగింజచొప్పున నేఱినగింజలు పండి భుజించువృత్తి.

చిత్తంబు క్రోధమాత్సర్యసంభ్రమదుఃఖాదులం దగులక శుద్ధసత్వంబున నున్నం గాంచి సంతసించి యి ట్లనియె. 282

శా. *నీకుం జాలినదాత లేఁ డెవఁడుఁ గా♦నీ లోకమం దెన్న ను
శ్లోకుం డీవు క్షుధాభరంబునఁ గడుం ♦ శోషించియుం నాకుఁ గా
నీ కై యున్నది పెట్టినాఁడ వినుమం♦తేఁ గాని సందేహముం
జేకో నేమని చెప్పువాఁడ నిను నీ♦చెయ్దంబు సామాన్యమే. 283

ఉ. ‡ఆఁకలి ధర్మబుద్ధిఁ దెగ♦టార్చును ధైర్యము సాహసంబునుం
బోకడఁబెట్టు జిహ్వ రస♦పూరములం గొనఁ జేరిముడించు నీ
లోకమునందుఁ బ్రాణములు ♦ లోఁగును దిండి లభింపకుండినన్
నీ కిటు చెల్లెఁ గా కెవఁడు ♦ నిం బురుడింపఁగ వచ్చు నిచ్చటన్. 284

తే. మనము నరికట్టు టది తపం♦బనఁగవచ్చు, జనుఁడు కష్టార్జితం బిడఁ♦జాలఁ డొరుల
కితరదుష్కరకార్యము ♦ లెల్ల నీకు, సుకరముల యయ్యె నీయొప్పుఁ ♦ జూడ నొప్పు.

చ. దయయును సత్యముం శమము ♦ దానము ధర్మము సంవిధానముం
నయమును గోలెనుత్తమగు♦ణంబు ల వన్నియు వన్నె గాంచెఁ బు
న్నియమున నుత్తమంపుగతి♦నిం గయికొంటివి మంటి వెన్న నీ
మెయి విడ కింత లోనన గ♦మింతువు గావుత దేవభూమికిన్. 286

ముద్గలునికడకు దేవదూత వచ్చి దేవలోకములతెఱం గెఱింగించుట.

తరువోజ. †అని పల్కుచున్నంత ♦ నట దేవదూత ♦ హంససారసయుక్త ♦ మగు దేవయాన
మనఘంబు కామగం ♦ బామోదకలిత ♦ మధికకింకిణిమాలి♦కాలంకృతంబు
గొని ముద్గలునికడ♦కుం జనుదెంచి ♦ గుణనిధి వగు నీవు ♦ గొన నైతి స్వర్గ
మును విమానం బెక్కు♦ముమునీంద్ర యనుడు♦ముద్గలుం డిట్లని♦ముద మొప్పఁ బలికె.

తే. తెలియ సఖ్యము సాప్తప♦దీన మగుట, మైత్రి నిం జేసి యడిగెద ♦ మిత్ర దివము
నందు గుణదోషములఁ జెప్పు♦మవిహితంబు, లైన నరసెదననుటయు♦నతఁడు మఱియు.

తే. బుద్ధిమంతుఁడ వయ్యు నో♦యిద్ధచరిత, పాత్ర మగు స్వర్గసౌఖ్యము ♦ ననుభవింప
కిట్లు గుణదోషచింతన ♦ యేల సేయఁ, దలఁచితివో కాని చెప్పెదఁ ♦ దెలియ వినుము.

సీ. ఈలోకమునకు నెం♦తే మీఁదుగా నుండు, నాకలోకము దేవ♦యానచరము
నాస్తికు లనృతు ల♦నాహితాగ్ను లతప్త,తపసు లాలోకముఁ ♦ దవుల లేరు

† ఎవఁడుఁ గానీ = ఎవఁడైనను; చెయ్దము = కృత్యము. ‡ లోఁగు = అడఁగు.

† దేవయానములకు హంసలను సారసములను గట్టుదు రని యెఱుంగునది; ఇది చిత్రము లైన కావ్యమును.



* ధార్మికుల్ శాంతులు♦దాంతులు విజితేంద్రి,యులు శూరులును దాని ♦ నొందఁగలరు
సురలు గంధర్వు ల♦ప్సరసలు సాధ్యులు, విశ్వులు ఋషు లందు ♦ వెలయుచుండ్రు

తే, ముప్పదియుమూఁడువే లన ♦ నొప్పు యోజ,నములు గలిగిన మేరుకూ♦టమున నంద
నాదు లుద్యానములు వొల్చు♦నందుఁ బుణ్య,వంతు లైనవారలు విహ♦రింతు రెపుడు.

చ. †వివిధలతాంతవాసనల ♦ విశ్రుత మై సుఖహేతుభూత మై
తవిలి నిరంతరంబును ము♦దం బిడుచు న్ననుగాలి వీచెడిన్
శ్రవణరసాయనం బగుచు ♦ సంతతము న్వినవచ్చు నచ్చటన్
బ్రవిమలదేవగానము ప♦రప్రకరప్రకటీకృతాంగముల్. 291

సీ. క్షుత్పిపాసలు జరా♦శోకాదులును గ్లాని, శీతోష్ణబాధలు ♦ చెలఁగ వందు
మలమూత్రములును జ♦మ్మటలును గొలును, గానంగ రావు స్వ♦ర్గతుల కెపుడు
శుక్లశోణితములఁ ♦ జూపట్ట కట వారి,తనువులు తేజఃప్ర♦ధానము లగు
వారివస్త్రములందుఁ ♦ జేరఁ బోదు రజంబు, వారిపూదండలు ♦ వాడఁబోవు

తే, మోహ మీర్ష్యయు మాత్సర్య♦మును క్లమంబు, శోకమును లేక యిక్కలి♦సుకము గదుర
దేవయానము లెక్కి దే♦దీప్యమాన,వైభవంబున విహరింత్రు ♦ వార లింపు. 292

వ. మఱియు నాలోకంబునకు మీఁద బ్రహ్మలోకంబువఱకును దేజోవంతంబు లగు మఱి కొన్నిలోకంబులు గల వాలోకంబులందు దేవతలకుం దేవత లై త్రయస్త్రింశత్సంఖ్యాకు లైన ఋభువులును ఋషులును జేరి నిరంతరానందం బనుభవించుచుందు రాకర్ణింపుము. 293

ఉ. స్త్రీకృతతాపముల్ దరికిఁ ♦ జేరవు వారికి మత్సరాదులన్
బోకడఁబెట్టుశక్తి యగుఁ ♦ బోల్ప హవిర్గ్రహణామృతంబులం
జేకొన కున్నతాంగములఁ ♦ జెన్నలరారుచు నుందు రెప్పుడున్
శోక మనంగ నట్టిదిరయో ♦ చూచి యెఱుంగరు వారు ముద్గలా. 294

ఆ. ‡జరయు మృతియు లేక ♦ సౌఖ్యంబు దుఃఖం బెఱుఁగక కల్పమైనఁ ♦ దెగక వార
లనుభవింత్రు శాశ్వ♦తానంద మప్పద, మభిలషింతు రమరు ♦ లైనఁ గాని. 295

క. అవి యందఱునుం బొందని,యవి సత్తపముం బొనర్చు♦నట్టిమునులకున్
సువిశేషసిద్ధి యొదవం, దవులంబడుఁ గాక వింటె ♦ తాపసవర్యా. 296

వ. ఇవి గుణంబు లింక దోషంబులుం గల వవధరింపుము. 297

* శూరులు = ఇట రణనిహతశూరు లని గ్రహించునది. † లతాంతము = పుష్పము. పరప్రకరము = శృంగారాదిరసమునుదయము. ‡ కల్పము = ప్రళయము.

మత్తకోకిలము. *ఇందుఁ జేసినపుణ్యకర్మము ♦ లెల్లఁ బొందఁగ వచ్చుఁ గా
కందుఁ జేయఁగ లే దొకంచు ఫలాదికం బది చెల్లినం
గ్రిందికిం బడఁద్రోతు రావలకించు నెందువికారముల్
డెందమందు భయంబుఁ గన్పడెడిన్ ఘనం బగుదోష మై. 29

తే. పెద్దకాలము సుఖ ముండి ♦ పిదప నిట్లు, దీనుఁ డై క్రిందఁ బడునట్టి ♦ వానిఖేద
మమి యని చెప్పవచ్చుదు ♦ నో మునీంద్ర, దోషముల కెల్ల నది పెద్ద ♦ దోష మరయ.

ఆ. వినుము బ్రహ్మలోక ♦ మునఁ దక్కఁ దక్కిన, లోకముల నెసంగు ♦ లోకులకును
బరులకలిమిఁ జూచి ♦ పరితపించుటయును, దమను వగచుటయును ♦ దగిలియుండు.

తే. ఊర్ధ్వలోకములందుండి ♦ యుర్విఁ బడెడు, వాఁడు తనపుణ్యకర్మము ♦ వలన మనుజుఁ
డై సుఖించును దుష్కర్మ ♦ మైన నధముఁ, డై చెడుం గర్మగతు లిట్టు ♦ లగుఁ జుమయ్య.

క. ఇది కర్మభూమి యగు న, య్యది ఫలభూమి యగుఁ దెలియ ♦ నడిగితి కానన్
మదిఁ గరుణఁ జేసి చెప్పితిఁ, బద పోవుద మింకఁ దడయఁ ♦ బని లే దనుడున్. 302

వ. ముద్గలుండు కొండొక చింతించి దేవదూతం గాంచి యి ట్లనియె. 303

చ. పురుషవరేణ్య మ్రొక్కెదను ♦ బొ మ్మిఁక నీ వెటువంటివానికిన్
సురపద మంది వెండియును ♦ క్షోణిపయిం బడ నౌను గావునన్
గురుతరదోష మాదివముఁ ♦ గోరను గోరెద శాశ్వతస్థితిన్
దొరలఁగఁ జేయుతాన మని ♦ తోఁపఁగఁ జేయవె నీకుఁ దోఁచినన్. 304

తరువోజ. అన దేవదూత యి ♦ ట్లను నప్పితామ ♦ హాసదనంబునకుఁ బై ♦ నయి విష్ణుపదము
దనరు నయ్యది సనా ♦ తనము శుద్ధంబు ♦ తత్త్వవిద్ధ్యేయంబు ♦ దర్శనీయంబు
మునిజనస్తుత్యంబు ♦ పుణ్యజనైక ♦ పూజితం బుత్తమ ♦ భూషణం బధమ
జనదర్శనాసాధ్య ♦ సాధుమార్గంబు ♦ సర్వలోకోన్నత ♦ సల్లక్షణంబు. 305

వ. అని ప్రశంసించుచున్న మెచ్చి దేవదూత నంపివుచ్చి ముద్గలుం డెప్పటి యట్ల శిలోంఛవృత్తిం జేయుచు శమపరుండును సమలోష్టకాంచనుండును దుల్యనిందాస్తుతియు నై క్రమంబున జ్ఞానయోగంబున ధ్యానయోగంబును ధ్యానయోగంబున నిర్యాణలక్షణం బైన శాశ్వతసిద్ధియోగంబునుం బొందె నో ధర్మనందనా! తపోయోగం బిట్టిది కావున రాజ్యపరిభ్రష్టుండ నైతినని చింతింపకుము సుఖదుఃఖంబులు రెండును బర్యాయంబున బండికంటియాకులవలెం బరిభ్రమించుచుండు నీ వీపదుమూఁడేం డ్లపిదపఁ బితృపైతామహం బయినరాజ్యంబు నొందఁగల వని చెప్పి యవ్వారాశర్యుండు నిజాశ్రమంబునకు నిర్గమించె ననంతరంబ. 306

* కించునివికారములు పొందు నవఁగా వానికి వికారములు వచ్చు నని యభిప్రాయము.



ద్రౌపదీశరణకర్వము.

తే. ఇ ట్లరణ్యంబునందుఁ బు ♦ రీంద్రమందుఁ, బోలె సర్వవైభవములఁ ♦ గ్రాలుపాండ
వులను విని ధార్తరాష్ట్రులు ♦ కలఁకఁ బొంది, డెందమునఁ గుందుచుండి రా ♦ నందమెడల.

వ. *అయ్యవసరంబున దుర్వాసుం డొక్కనాఁడు పదివేలమందిశిష్యులు వెంట నంట నన్నార్థి యై దుర్యోధనునిపాలి కరుదెంచిన నతం డతని నతిభక్తి నర్చించె నప్పుడు.

సీ. ‡ఆఁకొంటి నశనంబు ♦ నతిశీఘ్రముగఁ బెట్టు, మని చెప్పి జలమాడ ♦ నరిగి మసలు
నటఁ బెద్దప్రొద్దున ♦ కరుదెంచి నా కిష్టు, క్షుధ లే దని వచించి ♦ సురుఁగు నెందొ
డబ్బాటుగా వచ్చి ♦ గొబ్బున భుజియింపఁ, బెట్టు మా కని చాల ♦ వేగిరించు
నడికేయి లేచి యి ♦ ప్పుడ వంట చేయింపు, మని చెప్పి తినక త ♦ ప్పరయుచుండు

తే. నిట్లు దుర్వాసుఁ డాతని ♦ నెన్నియేని, తెఱఁగులం బరీక్షించియుఁ ♦ దెఱఁగు దప్పు
టెప్డుఁ గానమికి ననుగ్ర ♦ హించి యేమి, వలయునో కోరు మిచ్చెద ♦ వరముఁ డనయ.

వ. అనిన దుర్యోధనుండు సంతసించుచు మంత్రులమంతనంబునం జేసి దుర్వాసుదిక్కు మొగంబై మ్రొక్కుచు ని ట్లనియె. 310

శా. దేవా! నీదగునంతరంగము దయో ♦ ద్రిక్తంబ యైనన్ మహా
భావుం డై వని నున్నపాండవునకుం ♦ బ్రీత్యర్థ మై యెల్లరుం
దేవ న్మెక్కినవెన్క నీ వచటికి ♦ న్వచ్చేయు మన్నార్థి వై
మావంశంబు పవిత్ర మై వెలయ నీ ♦ మాద్రిం గృపం జూపినన్. 311

వ. అనిన నతం డట్లయగుం గావుత మని సుయోధనుని వీడ్కొని యథాగతకృతగమనుం డయ్యె నయ్యెడఁ గర్ణుండు కురురాజుకరంబు కరంబునం గీలించి సంతసించుచు ని ట్లనియె. 312

క. మనకోరిక ఫలియించెను, ఘనకోపనుఁ డితఁడు వారికడఁ జని కోపా
గ్నిని ముగ్గఁ జేయుఁ దమచే, సినదానన వారి కెగ్గు ♦ సిద్ధం బగుతన్. 313

దుర్యోధనునిపంపున దుర్వాసుండు పాండవులయొద్ద కతిథియై వచ్చుట.

వ. †అని సంతసించుచు నక్కించులు తమతమపొందుపట్లకుం జని రట దుర్వాసుం డొక్కపగటఁ బాంచాలి యందఱకుం బెట్టి తానుం దిని యున్నవెనుకఁ దనపదివేవురంతేవాసులతోడం గూడి పాండవాశ్రమంబునకుఁ బోవుటయును. 314

* ఇట దుర్యోధనునికడ కన్నార్థి యై దుర్వాసుండు వచ్చుటయుఁ గొంతకాల ముండి పిమ్మట వారి పంపునం జేసి పాండవులకడ కతిథి యై పోవుటయు శ్రీకృష్ణుండు ద్రౌపదికిఁ బ్రత్యక్షం బగుటయు లోనగుకథ కొన్నిప్రతులందు లేదు; పెక్కుప్రతులం దుండుటం జేసి యిట్లు వ్రాయఁబడెను.

‡ డబ్బాటు=అకస్మికము. † కించు=అల్పుఁడు.

తే. పాండవాగ్రజుఁ డదు రేగి భక్తిఁ దెచ్చి, దేవ మీ రాయాహ్నికం బది తీర వచ్చి
కొనుఁడు మాకడ నాతిథ్య మనుడు వల్లె, యని యతఁడు శిష్యసమితితో నరిగె నదికి.
శా. అంతన్ ద్రౌపది వీరి కిందఱికి నేఁ డాతిథ్య మెట్లిత్తు లే
దింతే నన్నము భాజనంబునకు రేవే గాని రా దంచు లో
నెంతే చింతిలి యింతయే వెరవు నూహింపంగ లే కార్తయై
స్వాంతంబందుఁ దలంచెఁ గృష్ణునిఁ గృపావర్ధిష్ణునిన్ జిష్ణునిన్. 316
శా. ఓకారుణ్యపయోబ్ధి యోవరద యోయోగీంద్రహృద్ధ్యాన యో
లోకైకస్తుత యోరమారమణ యోలోకత్రయాధీశ్వరా
యోకంసాంతక యోసురేంద్రవరదా యోదైవచూడామణీ
యోకృష్ణా మధుసూదనా యదుపతీ యోవాసుదేవా హరీ. 317
మ. మును దుశ్శాసనుఁ డాసభాస్థలమునన్ ముట్టంగ నున్నట్టిచో
నను రక్షించితి నీవు నీకరుణచేన్ లక్ష్యంబనై యుంటి నే
నన ఘా! నేఁ డిటు వచ్చె నొచ్చెము కృపాయత్తుండవై వచ్చి నా
వనటం దీర్పవె పేర్మిఁ గూర్పవె నిమం బార్థింతు నశ్రాంతమున్. 318
వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై పాంచజన్యధరుండు ప్రత్యక్షంబై నమస్కరించు
పాంచాలిం గాంచి తదుదంతం బంతయు నాలించి మించినక్షుధాభరంబు నభినయిం
చుచు నాఁకటం దూలుచుంటి నా కించుకభోజనంబు వెట్టు మనంతరం బంతయుఁ
జూచుకొంద మనిన లజ్జించుచు నామె యి ట్లనియె నయ్యా నాభుజించుటం జేసి
తామ్రపిఠరంబున నన్నంబు శూన్యం బయ్యె నిపు డెట్లు భోజనంబు వెట్టఁగలదాన
ననిన నతం డాపాత్రంబుఁ దెప్పించి దానికంఠంబున లగ్నంబై యున్నయొదు
కొక్కండు నెమకి తీసి నోట వేసికొని దీన విశ్వాత్ముండు విశ్వేశ్వరుండు నగుశ్రీహరి
సంతుష్టిం బొందుఁ గావుత మని భీమసేనుం బిలిచి నీవు వోయి భోజనార్థ మాము
నులం దోడితె మ్మని నియోగించుటయు నతండు గంగానదీమార్గంబు వట్టి పోయిన
దుర్వాసఃప్రభృతులం దేరఁ బోయె నంతలోన. 319
ఉ. ప్రీతమనస్కులై మునివరేణ్యులు గాంగజలంబులందు న
త్యాతతభక్తి మున్గి జప మానినమాత్రన చేసి మృష్టసో
పేతముగా భుజించినటు లెచ్చయి త్రేఁపులు రాఁగఁ జొచ్చె వా
రాతతి దేశికాభిముఖులై యెఱిఁగించిరి కొంచ కంతయున్. 320

* భాజనము = పాత్రము. ‡ ఒచ్చెము = న్యూనత. § తామ్రపిఠరము = రాగిపాత్రము.
† దేశికుఁడు = గురువు.



వ. దుర్వాసుండు దనకును దక్కినవారికిం బలె నెక్కువతృప్తి కలిగియుండు టెఱింగి
మనము వృథాపాకంబు సేయించి ధర్మరాజున కపచారంబు గావించితి మంబరీషుని
మహిమంబు దలంపునకు వచ్చినప్పు డెల్ల నాకు హరిభక్తు లనం దలం కగుచుండుఁ
బాండవులు నట్టిసదాచారసంపన్నుల కావున మన మెల్లరము వారలకంటం బడకుండఁ
బాఱుటయ పరమశ్రేయం బని చెప్పిన నాఁ గాత మని వారంద ఱట్లు గావించిరి
భీమసేనుండు నది యంతయు నెఱింగి వచ్చి ధర్మజున కెఱింగించుటయు నతండు
మునులవలనిభయంబు శంకించుచుండె నపుడు కృష్ణుం డది యంతయుం బోకడంచి
వారి నాశ్వాసించి నిజపురంబునకు నిర్గమించె నంతఁ బాండవులు పాంచాలీసహితు
లై సంతోషించుచు నక్కామ్యకంబుననుండి యొక్కనాఁడు తృణబిందునాశ్రమంబున
ధౌమ్యరక్షకంబుగా ధర్మపత్నిం బెట్టి వా రేవురును వేఁటలాడం జని రాసమయంబున.

సైంధవుఁడు ద్రౌపదిం జూచి మోహించుట.

ఉ. సైంధవుఁ డర్జునద్విషుఁడు సాళ్వసుత న్వరియించు నిచ్చమై
గంధగజాశ్వయుక్తమయి కాల్బలువరూథినిఁ గూడి వేడుకన్
బంధుజనంబు మున్ దగిలి పాసట యై తనుఁ గొల్వ నేగుచుం
బంధుర మైనకామ్యకము మార్గవశంబునఁ జొచ్చి యచ్చటన్. 322
శా. నీరంధ్రంబును నిర్జనంబు నగుచుం దీపించునయ్యాశ్రమ
ద్వారంబందుఁ గదంబశాఖపయి హస్తద్వంద్వముం జేర్చి వి
స్ఫారాంగప్రభఁ జేసి కారుమెఱుఁ గబ్దంబుం బలెం దద్వనో
ర్వీరంగంబు వెలుంగఁ జేయుగరితన్ వీక్షించె నాద్రౌపదిన్. 323
ఉ. ఆవనసీమ నట్లవయవాభఁ దలిర్పఁగఁ జేయుద్రౌపదీ
దేవిని గ్రేవలం గని తదీయులు కొందఱు దేవమాయయో
దేవపురంధ్రియో యని నతిం బొనరించి నుతించు చున్నచోఁ
గావరుఁ డాజయద్రథుఁడు కాంతఁ గనుంగొని విస్మితాత్ముఁడై. 324
ఆ. కామమోహితాత్ముఁడై మఱి మఱి మించుఁ,బోఁడిఁ గాంచి దుష్టబుద్ధిఁ జేసి
కోటికాస్యుఁ డనెడుకువలయేశ్వరసూతిఁ, బిలిచి యిట్టు లనియెఁ బ్రీతితోడ. 325
మ. అడ కన్గొంటివె దేవకాంత యన నై హర్మ్యేందునాసుందరిన్
హృదయానంద మమందమై పొదలె నీయిందీవరాక్షిం గనన్
ద్విదశారాజ్ఞాక్షులు వచ్చినన్ వలదినన్ నే నిచ్చగింపంగఁ బో
నిది నాకై వన మైన జన్మ మిది యెంతే సార్థకం బయ్యెడిన్. 326

† వరూథిని = సేన. ‡ కావరుఁడు = దుర్మదుఁడు.

క. వయనంబు మాని దీనిం, బ్రియమునఁ జేకొంచు మనవు◆రికిఁ బోఁ జిత్తం
బయినది కందర్పుఁడు నా,పయి దర్పంబునను బడియె ♦ వడి సాయుధుఁ డై. 327

వ. కావున నోవయస్యాగ్రణీ. 328

ఉ. ఎవ్వనికూఁతు రివ్వనిత ♦ యెవ్వనిజవ్వని యేటి కివ్వనిన్
నెవ్వగ పుట్ట మెట్టెడినొ ♦ యెవ్వరగేహము దీనిమన్కి యై
నివ్వసుధం దలిర్చెడినొ ♦ యివ్వరవర్ణిని నన్నుఁ గూడునో
యెవ్విధి నేఁ గృతార్థుఁడనొ ♦ యీవు కనుంగొని రమ్ము పొమ్మటన్. 329

వ. అని పంచిన మించినవేడ్కం గోటికాస్యుండు దిగ్గన రథంబు డిగ్గి సృగాలంబు కో
లువులిపాలికిం బోలె ద్రోవదిపాలికిం బోయి యి ట్లనియె. 330

ఆ. కడిమికొమ్మఁ గేలఁ ♦ గదువుచు నీ వేల, యుంటి విచట నొంటి ♦ నోట లేక
రేయి గాలివలన ♦ రేఁగుపావకశిఖ,వోలె వెలుఁగుచుంటి ♦ వోలతాంగి. 331

క. సౌందర్యవతివి నీ వో,మందగమన యీయరణ్య◆మధ్యమునందున్
బొందువడి యుంటి వొంటిన్, వందుర వినుమంత నీ వె◆వతెవో చెపుమా. 332

తరువోజ. అరయంగ విస్మయం ◆బగు నిన్నుఁ జూడ◆నమరివో గరుడివో ◆యక్షకామినివొ
యురగివో యచ్చర◆వో దైత్యకాంత◆వో దానవాబ్జాక్షి◆వో వనచరివో
వరుణాంగనవొ సోమ◆వనితవో విత్త◆పతిసతివో శక్ర◆పత్నివో ధాతృ
వరవర్ణినివొ యమ◆భామినివో వి◆వస్వత్సతివొ చెప్పు ♦ వనజాయతాక్షి. 333

ఉ. సందియ మొందు డెంద మెల◆జవ్వని! యెవ్వనిదాన వేకొలం
బందు జనించి తిందు నడ◆యాడఁ గతం బది యెట్టి దానొ నీ
బందుగు లెవ్వరో తెలియఁ ♦ బల్కుము నే సురథోర్విభర్తకున్
నందనుఁడన్ ధరాతలము◆నం గొమరొందెదఁ గోటికాస్యుఁడన్. 334

సీ. అస్వర్ణరథముపై ♦ నగునతండు త్రిగర్త,రాజు క్షేమంకర◆ప్రథితనాముఁ
డన్మదాదులకన్న ♦ నధికుఁ డై మేటివిల్, గొనినవాఁడు కుళింద◆కులవిభుండు
కొలఁకుకడన్ నిల్చి ♦ తిలకించు చున్నాఁడె, సుభగుఁ డిక్ష్వాకురా◆ట్సుబలసుతుండు
శోణాశ్వరథముల ♦ సొంపొందువారు పన్నిద్దఱు సౌవీరు ♦ లిద్ధమతులు

తే. కుంజ రాంగార గుప్తక ♦ సృంజయ రవి,సుప్రవృద్ధ భయంకర◆ శూర సుహస
(భ్రమర శత్రుంజయ ప్రతా◆ప ప్రసిద్ధ,నామముల వారు పొల్తు రో◆కోమలాంగి.

మ. అదె సర్వోన్నత మైన తేరిపయి ది◆వ్యప్రాభవం బేర్పడన్
సదయుం డై నినుఁ జూచుచుండె నతఁ డా◆సౌవీరదేశేశ్వరుం



డుదితైశ్వర్యుఁడు సైంధవుండు మొన సొం ♦ పున్నట్టివా రందఱున్
ద్రిదశేశప్రతిమాను లై భవమునం ♦ దీపింత్రు తత్సోదరుల్. 336

తే. అజయదృఢుఁ దమ్ము లై ♦ యలరునట్టి,తా ర్బలాహ కానీక వి◆దారణాద్యు
లాఱువేలరథికులు హ◆యములునుం బ,దాతులును గొల్వఁ జెల్వొందు◆నాతఁ డెపుడు.

వ. అమ్మహారథుండు నీ తెఱం గెఱుంగం దివిరి న న్నిట కనిచె నీ వెవ్వరు నీవృత్తాంతంబు
సవిస్తరంబుగం జెప్పు మనిన నప్పాంచాలరాజతనయ తనచేతికదంబశాఖ నల్లన విడిచి
చేలచెఱంగు సవరించుకొని శిబిప్రవరుం డైనకోటికాస్యుం జూచి యి ట్లనియె. 338

ఆ. ఒంటి నున్నదాన ♦ నొరులతో భాషింప, దగ ద టైన నీ వ◆డిగినదాని
కుత్తరంబు సెప్ప ♦ నొరులఁ గానమి నాక, చెప్పవలసివచ్చె ♦ నిప్పు డిచట. 339

వ. నీవు సురథపుత్త్రుం డయినకోటికాస్యుండవు శైబ్యుండ వని నే నెఱుంగుదు నగు
టం జేసి నీయడిగినదాని కుత్తరంబు సెప్పెద నవహితుండ వగుము. 340

సీ. ఏను బాంచాలేశుఁ ♦ డైనసోమకునప,త్యంబను ననుఁ గృష్ణ ♦ యండ్రు జనులు
ఖాండవప్రస్థమం ♦ దుండి రాష్ట్రము లేలు,పంచపాండవులు నా◆పతులు సూవె
వా రిందు ననుఁ బెట్టి ♦ వనముల కేగిరి, మృగయావినోదంబు ♦ దగుల నిపుడు
ప్రాచి ధర్మసుతుండు ద◆వాచి భీముండు ప్రతీచి భీభత్సుఁ డు◆దీచిఁ గవలు

ఆ. పట్టి పోయి రింత◆వట్టులో వత్తురు, వారు వచ్చుదనుక ♦ మీర లుండి
యతిథిపూజ లంది ♦ యరుగుఁడు మిముఁ గాంచి, శమనసుతుఁడు చాల ♦ సంతసించు.

వ. అని పలికి వారి కాతిథ్యధర్మంబు నెఱవేర్ప నెంచి పాంచాలి పర్ణశాలాభ్యంతరంబున
కరిగె నంతఁ గోటికాస్యుం డటఁ జని యంతయుం జెప్పిన సైంధవుండు మదనబాణ
పీడితుం డై వాని కి ట్లనియె. 342

మ. ఎటు రాఁ గల్గితొ నీవు దాని విడి నే ♦ నిచ్చోటనే యుండి యె
ప్పటికిన్ దృష్టి మరల్పలేని కతనం ♦ బా టొందుచున్నాఁడ నం
కట మయ్యో జుమి దానిఁ గన్నకనులం ♦ గన్గొన్న నేనాతియున్
గట కట్టా! కనుపట్టుఁ గోఁతివలె ని◆క్కం బిట్లు వాక్రుచ్చితిన్. 343

ఆ. †చూచినంత డెంద ◆మాఁచికొనం జెలి, తెలియఁ బలుకవయ్య ♦ కలతెఱంగు
మనుజకాంత యవునొ ♦ మనము సందియపడు,చున్న దనుడు వెండి◆యును నతండు.

చ. నృపవర సంశయింపకుము ♦ నే విని వచ్చితి సర్వవృత్తమున్
ద్రుపదునికూఁతు రాతరుణి ♦ దోర్బలగేయులు పాండవేయు లా

† ఆఁచికొను = అపహరించు.

నృపసుతభర్తలేవురును • నీ విధి నమ్మి పరాక్రమమ్మునన్
జపలత వీడి చేడెఁ గొని • చయ్యనఁ బొమ్ము పురమ్ముఁ జేరఁగన్. 345

వ. అని పలికిన విని వివేకశూన్యుండగువాఁ డామెం జూతుఁ గాక యని తనవెంట నార్వురురాజకుమారు లంటి రాఁ జని సింహగోష్ఠంబును వృకంబు సేరినతీరునఁ బాండవాశ్రమంబునఁ జొచ్చి పాంచాలిం గాంచి యి ట్లనియె. 346

సైంధవుండు ద్రౌపదికడకుం జని సంభాషించుట.

చ. కుశలమె నీకు నీపతులకు న్నిరతంబు ననామయంబె యో
విశదవిశాలఫాలముఖి! • వేడ్క మెయి న్వచియింపవే యనన్
గుశలమ నాకు నాపతులకుం గుశలంబ కదయ్య నీకు నీ
వశమున నున్నవారికి భవత్స్థితి సెప్పుడు ధర్మ మొప్పునే. 347

తే. పాద్యము గ్రహించి విశ్రాంతిఁ బడయు మిందు, వరకుశాసన మొప్ప నో నరవరేణ్య
ప్రాతరాశార్థమే నిత్తుఁ • బంచశతమృగములఁగమి నేకరింపుము • కరుణఁజేసి. 348

వ. ఇంతలోనన యుధిష్ఠిరుండు వచ్చి నీకు నైణేయ పృషత న్యంకు హరిణ శరభ శశ ఋక్ష రురు శంబర గవయ వరాహ మహిషాదినానావిధమృగజాతులం దెచ్చి యిచ్చి పూజించు నని పాంచాలి వచించిన జయద్రథుండును. 349

మ. వెలఁదీ! యిచ్చెద నంటి చాలు నదె వేవే లిచ్చిన న్లేను లో
పల సంతోసము నొందితిన్ ధరణి నేభద్రార్థమే నుద్దియై
తెలియన్ వచ్చెనె ప్రేమకుం దడయ కేతె మ్మెక్కు మస్మద్రథం
బిలపై సౌఖ్యము నొందు మేమిటికి నీ • విం దుండి కుం దండఁగన్. 350

మ. §సిరి వో రాజ్యము వో వనిం బడి కడున్ • సి ల్గందుచున్ దీను లై
పరివర్తించెడుపాండుపుత్రులను లింప్సం గూడి దుఃఖించుటల్
పరికింపం దగ దిట్టిభర్తలను భూభాగంబునం దెట్టివెం
బరవి త్తైనను గూడిమాడునె యిసీ • భావింప వై తింతయున్. 351

క. సిరి గలమగనిన్ మగువలు, కర మరు దగుభక్తిఁ జేసి • కాంక్షింతు రిలన్
సిరి చెడినమగని మగువలు, పొరిఁబొరి నిందించి విడిచి • పోయెద రతివా. 352

వ. లోకక్రమం బిట్లున్నను గతశ్రీకు లై యడవులం బట్టి యున్నపాండవులం బాయకున్న దానవు నీ వింక నైనఁ గ్లేశంబులపాలు గాక నాకు భార్య వై సింధుసౌవీరదేశంబుల నేలుకొని సుఖంపు మనుటయుఁ బాంచాలి ప్రకంపితచిత్తయై తత్తఱంపడి కొండొక

§ లిప్స = కోరిక; శంబరవిత్తు = శల్తీవాఁడు; శల్తీది.



తొలంగి మనంబునం దనపతులరాక కోరి కాలక్షేపంబు సేయునది యై తలంగని కోపంబునఁ గుటిలభ్రూకుటి యై కటంబు లదర ని ట్లనియె. 353

ద్రౌపది సైంధవునకుఁ బ్రతిహాలోత్తరంబు లిచ్చుట.

చ. అతిరథులు న్మహారథు లనంతయశస్కులు తీక్ష్ణకోపులున్
బ్రతిహతయక్షరాక్షసవరప్రకరుల్ రణశూరు లార్యసం
స్తుతసుచరిత్రు లై తనరుశోభనమూర్తులఁ బాండుపుత్రులన్
మతిఁ దలపోయఁ జాల కవమానము సేయుచు నుంటి వక్కటా. 354

ఉ. సి గ్గొకయింత లేదొకో యిసీ! యిసీ! నీ కిటు లొప్పునే తపో
వాగ్గతి గ్గుఱ వారడవి • వర్తిలుచుండిన వారి దూఱఁ బో
రిగ్గతిఁ బండితప్రవరు • లెవ్వరు నేనియుఁ గుక్క లట్టివా
రిగ్గక నోట వచ్చినటు • లెప్పుడుఁ గూయుచునుందు రి కూళ లై. 355

ఆ. పాండుసుతుల కెగ్గు • పలికి పాతాళము, ఖమునఁ బడెడునిన్నుఁ • గని యొకండు
నుద్ధరించునట్టియోడయుండు లేఁ డని, తలఁచుచున్నదానఁ • దెలియ వినుము. 356

చ. *హిమవదధిత్యకం జెదరి • యి ట్టటు మొట్టుచు ఘీంకరించుచున్
సమదగజాధినాథ మది • సారెకుఁ గోరిక వ్రప మేయుచోఁ
గ్రోధు మతి దానినిన్ సిములఁ • గట్టఁగ నెంచినయట్టు లోఁ జూమీ
యమతనయున్ వ్యపేతభయు • నాలమునం జెనకం దలంచుటల్. 357

మ. †భువనం బల్లలలాడ నూర్పుగములం • బుట్టించుచున్ బెట్టుగా
గవిలో నిద్దురవోవుసింహము నువేడ్క న్మట్టి బాల్యంబునం
దవి తన్పక్షము లూడ లాగికొని పేందం బోలి నీ వీఁదవ
ట్టి వడి న్మట్టి దురంబునం గవియ నుడ్డీనంబు గావిం తయో. 358

మ. క్షితిభృత్కందరమందిరాంతరమునం • గీర్తింప నై విక్రమో
ద్ధతి నంగారకణంబులం గురియుచుం • దళ్క్తున్నేత్రంబులం
బ్రతిపాదింపఁగ నై నకోలువులిఁ గూల్పం గాలఁ దాటించున
ట్లతికోపుం డగునర్జునుం జెనక నెం • తే రార నీ వెంతవో. 359

ఉ. నాల్కలు గ్రోయుచు న్నిగుల • నాదు పొనర్చుచుఁ గూన మూడ్చి పే
రల్క మెయి న్మహోగ్రగతి • న ట్టిటు మెట్టెడుకోడెత్రాచులం
గీల్కొని త్రొక్కఁ ద్రొక్కెడునటించనుఁడుంబలె మాద్రిపుత్రులన్
జుల్కనఁ దాఁక నెంచితివి • చు మ్మవివేకివి నీవు చూడఁగన్. 360

* అధిత్యక = కొండమీఁది నేల. సిములు = సిల్లు; బరిగోల. † తవి = తసి.

తే.†కదళి గెలవేసిన ట్లెండ్రి ♦ గర్భమొంది,నట్లు వేణువు ఫలియించి♦నట్లు నాశ
కాలమాసన్న మగుట నీ♦లీల నీవు, పాండవపరిరక్షిత నన్నుఁ ♦ బలికి తిట్టు. 361

వ. అనిన జయద్రథుండు. 362

చ.*ఎఱుఁగక పోము మేము బల♦హీనులఁ బాండునరేంద్రపుత్రులన్
వెఱవము నీబిభీషికలు ♦ వే లిటు విన్నను నన్నుఁ దాఁగి నీ
వెఱుఁగుము మేము సప్తదశ♦పృథ్వీపవంశములందుఁ జేర్మికై
వఱలినవంశమం దయిన♦వారము వంద్యుల మెట్టివారికిన్. 363

ఆ. సంధివిగ్రహాది♦షడ్గుణంబుల నధిపతులము మేము పాండ♦వులకు సర్వ
మంగళంబ గుణము ♦ లంగనామణి మాఱు, పలుక కెక్కు మరద ♦ మెలమి గదుర.

క. వలవనిపలుకులు వలుకక, వలవదు లే లెమ్ము మమ్ము ♦ వలచి ప్రియంబుల్
వలికి మదీయస్వాంతం, బలరింపుచు వేడుకొనుము ♦ హల్లకపాణీ. 365

వ. అనినం గనలి పాండవధర్మపత్ని సైంధవాపశదుని దెసం గని యి ట్లనియె. 366

—•—♦ ద్రౌపది తనవారిబలం బగ్గించి చెప్పుట. ♦—•—

తరళము. వరబలాఢ్యులు పాండవేయులు ♦ వారి కేను నెలంత నై
యొరుఁ డొకం డనుదానికిన్ భయ ♦ మొంది కుందుచు దీన నై
శరణు వేఁడెడుదానఁ గా నొక♦చక్కి నైనఁ బ్రమాదవుం
దెరువు వట్టియు నైన నిం కిటఁ ♦ దెల్ప నేటికి సైంధవా. 367

ఉ.‡ఏకరథాధిరూఢు లయి ♦ యేడ్తెఱఁ జూపుచుఁ గృష్ణుఁ డర్జునుం
డేకమలాక్షిమార్గము స♦మీక్షణముం బొనరించుచుండురో
లోకమునందు నట్టినను ♦ లోలమతిం గనఁ జాలఁ డింద్రుఁడే
నేకరణిన్ మనుష్యుఁ డగు♦హీనుఁ డొకండు గొనంగఁ జాలెడిన్. 368

చ. అరదము నెక్కి నీబలము♦లందుఁ జొరంబడి ఫాల్గునుండు సం
గరమునఁ గారుచిచ్చువలెఁ ♦ గ్రాలఁగ నొత్తుచు దేవదత్తమున్
గర మరుదార నారి మొఱఁ♦గం బటుతీవ్రశరంబు లేసి నీ
యురము వగిల్చి నవ్వ డెటు ♦ లుండెదవో యిపు డేమి చెప్పఁగన్. 369

శా. ఆశ్చర్యంబు జనింప దండధరుఁ ♦ డై దండముం ద్రిప్పుచున్
బశ్చాద్భాగమునుండి వచ్చి నిజకో♦పస్ఫూర్తి భీముండు తే

† ఎండ్రి = ఎండ్రికాయ, కర్కటకము. * బిభీషికలు = బెదరింపుమాటలు. ‡ ఏడ్తెఱ = వరుసక్రమము.



* జకోచ్ఛితత్వముఁ జూపునప్పు డయినన్ ♦ స్వాంతంబునం దాపముం
బశ్చాత్తాపము నొందకుందువె దురా♦త్మా! యింత కే మయ్యెరా. 370

క. కోపము వెలివడఁ బార్థులు, నీపరివారమ్ముతోడ ♦ నిను ముట్టి వడిం
జూపినపు డయిన నీవరి,తాపముతోఁ ద్రుళ్లడంగి ♦ తరలదె తులువా. 371

వ. మఱియును. 372

చ.†అరిబలమర్దనుం డగుజ♦నార్దనుఁ డుద్ధవిడిం జరించుచున్
దురమున వృష్ణికేకయుల♦తోఁ జతురంగచమూసమేతుఁ డై
యరదము నెక్కి వచ్చి నిశి♦తాస్త్రములన్ నిను ముట్టడించుచున్
మరణము గాక నీ కెవఁడు ♦ మార్గము సూపఁగ నుండఁబోవునో. 373

మ. విను మోసైంధవ! దుష్టబాంధవ! జగ♦ద్విఖ్యాతకీర్తిచ్ఛటా
ప్రియుఁ డై కవ్రిభావ్రిభావు లగుమ♦త్ప్రాణేశులంగాక నే
మన మం దెవ్వరిసిం దలంప నిట నా♦మాహాత్మ్యమే పార్థశ
స్త్రనికృత్తాంగుని నిన్నుఁ జూవఁ గలుగుం ♦ జర్చింప నిం కేటికిన్. 374

తే. కాన నీవలనన్ భయం ♦ బేను బొంద, నీవు గ్రహియించుకొని చన్న♦యింతలోన
నిన్నుఁ దుదముట్టఁగాఁ జేసి ♦ నన్ను మరలఁ, బార్థు లిటఁ దేరనోపిన♦బాహుబలులు.

వ. అని భర్జించి పలుకుచున్నంతం దదీయు లాయమం బట్టుకొన నెందినం గాంచి పాం
చాలి వారి వారించుచుఁ దమపురోహితుం డగుధౌమ్యుం జేర్కొని యాక్రో
శించె. 376

—•—♦ సైంధవుండు ద్రౌపదిని బలాత్కారంబుగం గొనిపోవుట. ♦—•—

ఉ. ఆతఁడు వచ్చులోపల జ♦యద్రథుఁ డొం డరయంగ లేక తా
నాతరలాక్షిపయ్యెద ర♦యంబునఁ గైకొని లాగె లాగినం
నీ! తగ దిట్లు పొ మ్మనుచుఁ ♦ జెల్వ క్రుధ న్వదలించి వైచుడున్
భూతలమందుఁ ద్రెళ్లఁ బడె ♦ బూరువు నాఁగ నతండు బోరనన్. 377

వ.‡ఇట్లు పడియుం దడయక లేచి వాఁ డాచేడెం బట్టుకొని రథంబుపైఁ బెట్టుకొని చనియెఁ
జనునప్పు డప్పతివ్రతాశిరోవతంసం బేమియుం జేయఁజాల కీరెలుంగునం బురోహితు
నకు నమోవాకంబు దెలిపిన నాకరుణాసముద్రుఁ డాపుద్రునిం జేర్కొని. 378

ఉ. ఓరిజయద్రథా! తెలియ ♦ వుల్లమునం దిది రాజధర్మమే
క్రూరత నిట్లు సేయుటలు ♦ కూడునె పాండవు లుగ్రమూర్తు లీ

* చోచకత్వము = తీక్ష్ణత్వము. † ఉద్ధవిడిన్ = మిక్కిలివరాక్రమముతో. ‡ ఈరెలుంగు = హీనస్వరము.

తీరున నున్నని స్మరసి ◆ తెల్లఁగ నేయక మాన రింతలోఁ
జేరఁగవత్తు రీల్గుటయ ◆ సిద్ధము నీ కెటు చూచెనేనియున్. 879

వ. అని చెందనాడుచు ధౌమ్యుం డప్పదాతిమధ్యగుం డై పాంచాలి ననుసరించి చనియె నిటఁ బాండవులును నానావిధమృగంబుల వధియించి వేట చాలించి మగిడి యం దఱు నొక్కచోఁ గూడి వచ్చునెడ ధర్మతనయుండు కొన్ని శకునంబు లుపలక్షించి తమ్ములకి ట్లనియె. 880

సీ. ఎలుఁగింపఁ దొడఁగెఁ బక్షులుమృగంబులు భయంకరముగా రవియున్న ◆ కడనయుండి మన మున్దువనమున ◆ కు నరాతు లరుదెంచి, దునుకు నూవినయట్లు ◆ తోఁచుచుండె మనము తపించెడి ◆ మరలుండు మృగము లే,మిటికి నాబుద్ధియు ◆ మిసిమి దప్పె నొడలునం బ్రాణము ◆ వెడలిపోయెడునట్లు,చెదరియున్నవి మన్యు ◆ వృదయమ్ముండె

తే, నని వచించెడునంతలో ◆ ననిలవేగ,మునఁ దురంగము లరదముల్ ◆ వూని నడువ నింతలోపల నుటజంబు ◆ చెంతఁ జేరి,రెల్లపాండవులును దిగు ◆ లెచ్చికొనఁగ. 881

క. *దాపటిదెన గోమాయువు, గోపమునంబోలె మిగుల ◆ ఘోరరవమునన్ భూవుమ్కరంబు లవియం, దేవకు వాపోవుచుండె ◆ దేవురు వుట్టన్. 882

వ. ‡ధర్మతనయుం డాదుర్నిమిత్తంబు నెఱింగి భీమార్జునులం గాంచి దుష్టు లగుదుర్యోధనాదులు వచ్చి మనకు నవమానంబు నేసియుందు రని తోఁచుచున్న దని వలుకుచు నాశ్రమంబు సేర నంతలో నటఁ బాంచాలీధాత్రేయిక వడి యేడ్చుచున్నం గని సంభ్రమంబున నింద్రసేనుండు రథంబు డిగ్గి దానిచెంతకుం జని యూరార్చుచు ని ట్లనియె. 883

సీ. ఏల నీ విట్టు లీ ◆ నేలపైఁ బడి యేడ్తు, వదనంబు కడు వాడి ◆ వత్త లయ్యెఁ బాండవప్రాణ మా ◆ పాంచాలి నేఁ డైనఁ, జెన్నుటి యై వచ్చి ◆ చెనకఁడుగద యెవఁ డెఱుంగఁడొ తద ◆ హీనపరాక్రమ, మేనికి బ్రతికంగ ◆ నిచ్చ లేదొ వేఁడిపిడుగు లైన ◆ వీరిబాణము లేని,మేనినె త్రావంగఁ ◆ బూనుకొన్నొ

తే, చెప్పు మనుటయు ధాత్రేయి ◆ సింధురాజు,దుండగం బంతయుం జెప్పి ◆ దుఃఖపడఁగ నాతఁ డను నామె యొం దున్న ◆ నధిపు లరిగి, వగఱ సాధించి తెత్తు ర ◆ మ్మగువమిన్న.

వ. అని దుఃఖోపశమనంబు సేయుచున్నయింద్రసేనుదిక్కు మొగం బై ధాత్రేయి వెండియును. 885

చ. అడుగులు మాయ వింతకు వ ◆ నాంతరమం దిట వానిదాడికిన్ బడినలతావితానములు ◆ వాడవు గావున వాఁ డొకింతద

* భూవుమ్కరంబులు = భూమ్యాకాశములు. ‡ ధాత్రేయిక = పరిచారిక.



* వ్వడవి నడంగనోవు సక ◆ లాయుధముల్ ధరియించి వీరు రట్టన్ వడివడి నేగి తున్మి పగ ◆ వారిజనేత్రను దెండు పొం డిఁకన్. 886

పాండవులు సైంధవునిపై నెత్తిపోవుట,

వ. ‡అని మఱియు భస్మనిక్షిప్తం బైనహవిస్సుమాడ్కిని శ్మశానంబునం బడినమాల్యంబు వైవడిని గుక్క మూర్కొన్నపురోడాశంబువగిదినిం బాంచాలి బాలిశుం డగు వానికడనుండినఁ బవిత్రత చెడుం గావున నెడనేయక వేగమ వాని నెయిదవలయు ననినఁ బాండవులు దాని నాశ్వాసించి తత్క్షణంబ కదలి వాఁడు పోయినదారిం బట్టి పోవుచు మాటిమాటికి నాశీవిషంబులవలె రోఁజుచు సారెసారెకు నారి మ్రోగించుచుఁ దెపతెపకు సింహనాదంబు సేయుచు వెన్నడి కూడముట్టి యట సేనామధ్యగతుండై భీమసేను నెలుం గెత్తి పిలుచుచు నాక్రోశించుచున్నధౌమ్యుం గాంచి నమస్కరించి వీరు రింక నొయ్యన రం డని చెప్పి వా రెఱుఁ జూచి వఱచుడేగలచందంబునం జని ద్రౌపదీపరిసరంబున రథస్థుం డై యున్నజయద్రథుం గాంచి కోపఘూర్ణమానమానసు లై మండిపడి మహేంద్రవిక్రము లగువా రేవురు నాకసంబు బీటలు వాఱఁ బేరెలుంగున నాక్రోశించి రమ్మని హుంకారవంబు చెవులం బడినంతన బలం బంతయు వెఱచఱచి వఱచె నంత సైంధవుండు బెండువడియు మొండితనంబునఁ బాండవాంగనం గనుంగొని యి ట్లనియె. 887

ఉత్సాహము. అతివ రథము లెక్కి వచ్చు ◆ నట్టిదిట్టలే భవ త్పతులు వారి వినఁగ నాకు ◆ భావ మయ్యెఁ గావునన్ హితము పొదల వేఱువేఱ ◆ నేర్పరించి వారలన్ స్తుతి యొనర్ప విందు ననినఁ ◆ దోయజాక్షి నేర్పునన్. 888

మత్తకోకిలము. ‡వార నాపతు లేవు రల్లదె ◆ వచ్చుచుండిరి వారి నో క్రూరచిత్త యెఱింగి యిప్పుడు ◆ కొంత నేయఁగ నున్న నీ ఘోరకృత్యము నీకు నీపజ ◆ కు న్మహాపద దెచ్చు నీ పోరున న్మగలంగఁబోఁ డొక ◆ పొల్లయేనియు వింటివే. 889

వ. అయినం జా నున్ననీవు న న్నడిగితి వగుటం జేసి చెప్పుట ధర్మంబు గావునం జెప్పెద నింతియకాని నీవలనభయంబునం గా దని మఱియును. 890

మ. †ఘన ఘోణంబు సువర్ణవర్ణతనువుం ◆ గంజాయతాక్షద్వయం బును నాజానుభుజంబులుం గలిగి పెం ◆ పుం జెంది నందాఖ్యల

◆ వగ = విరోధి. ‡ ఎఱచి = మాంసము. ‡ పొల్ల = వ్యర్థము. † ఘోణము = ముక్కు.

* స్థాని నాదించెడుమర్దలంబు లవి రెం♦డుం గై జయంతిం దగం
జను నాతండె యుధిష్ఠిరుండు కురువం♦శశ్రేష్ఠుం డగ్గింపంగన్. 391

క. శరణన్నం బగఱ నైనం, గరుణించెడునతఁడు వాని ♦ ఘను లనువర్తిం
తురు నీవు శరణుచొరుమా! కరుణాళుండు గాచివుచ్చుం ♦ గడ ని న్నిచటన్. 392

మ. పటుబాహాబలశాలి సాలమహిరు♦ట్ప్రాంశూర్జ్వలద్గాత్రుఁ డు
త్కటతేజోనిధి ఘోరవర్తనుఁడు సం♦దష్టోష్ఠుం డత్యుగ్రుఁడున్
గుటిలభ్రూకుటి భీమసేనుఁడు రణ♦క్రూరుండు దా నల్లప్ర
స్ఫుటశస్త్రాస్త్రసమగ్రకాంచనరథ♦స్థుం డై యదె వచ్చెడిన్. 393

తే. ‡బిరుదనామము గలయట్టి♦భీమసేను, నెదిరి బ్రదుకంగలే రెట్టి ♦ రెట్టి రైనఁ
బగఱ శాస్తి యొనర్చియుఁ♦బగను మఱవఁ, డతఁ డమానుషకృత్యుఁడా♦హవములందు.

శా. †విల్లుం బట్టినవిక్రమాంచితులలో ♦ విఖ్యాతికిం బాత్ర మై
ప్రోల్లాసంబున నాజుల న్విజయ మొ♦ప్పం గాంచుచు న్మేటి యై
చెల్లం దేజము ధైర్యమున్ యశము వా♦సిం గన్నవాఁ డర్జునుం
డుల్లోకంబున కేగివచ్చినతపో♦యుక్తుం డతం డల్పుఁడే. 395

ఆ. అనలతుల్యతేజుఁ ♦ డతఁడు యుధిష్ఠిరు, ననుఁగుదమ్ముఁ డార్య♦జనులఁ గొలుచు
నట్టిఁ డతనిఁ గన్న♦నట్టిఁడై న నరిత్వ, మెది కొలుచుచుండు ♦ రెఱుఁగ వోటు. 396

ఉ. సుందరమూర్తులందుఁ గడు ♦ సుందరమూర్తి భయార్తభూమిభృ
ద్బృందమునోముపంట రిపు♦భీషణవేషుఁడు శాస్త్రవిద్వరుం
డిందుకులుండు సాంద్రదయఁ ♦ డీశ్వరభక్తిసమంచితుండు సం
క్రందనతుల్యవైభవుఁడు ♦ గ్రాలెడుఁబో నకులుండు గంటివే. 397

క. §వాపురము నెక్కి ఖడ్గము, చే వెలయఁగఁ దాల్చి రణము ♦ సేయుచునున్నన్
దేవేంద్రుఁ డైన వానిని, గావరమున నొడ్డి గెలువఁ ♦ గలఁ డనఁ గలమే. 398

చ. ⊥చదివినవాఁడు వేదములు ♦ శాస్త్రములు న్మతిమంతుఁ డిట్టివా
ఁడిద మగునంశ మైనఁ బరిక♦టించెడుచో బుధులెల్ల మే లనన్
బదురునఁ దీర్పఁగాఁ గలఁ ద♦సాధ్యుఁడు సాధ్యుల కే నెఱుంగ న
ద్వితీయపరాక్రముండు సహ♦దేవుఁడు దేవుఁడుగాక మర్త్యుఁడే. 399

తే. పాండవులకూర్మితమ్ముఁడ♦ఖండవిక్రమాంచితుఁ డధర్మమును బల్కఁ ♦ డగ్నిచల్ల
నైన నిట్టిముద్దులపట్టి ♦ నాత్మ నరసి, గొంతియెంతయుఁ బ్రేమించుఁ ♦ గొడుకులందు.

* వైజయంతి = టెక్కెము. † ఉల్లోకము = ఊర్ధ్వలోకము, స్వర్గము. ⊥ చదుర = వెర.
‡ ఎదిరి ఎదిరించి, మార్కొని. § వాపురము = వారువము, గుఱ్ఱము.



పాండవులు సైంధవసేనం దలపడి పోరాడుట.

వ. *అని చెప్పి మఱియు నప్పాంచాలి యోరీ యీ రేవురు మహారథులు వీరిబారిం బడి నీ సేన యంతయు మహార్ణవంబున మకరపృష్ఠంబునం బడినకలంబుపోలె నవిసి వికలం బై పోవం జూడకుండు వే నీ విపుడు నీప్రాణంబులు దక్కించుకొంటివేని వెండియుం బుట్టినట్టివాఁడ వగుదు వని పలుకుచున్నంతలోఁ బంచేంద్రకల్పు లగు పంచపాండవులును వెఱచి కృతాంజలు లగువారినెల్ల విడిచి పుచ్చి హెచ్చినవేగంబునఁ దఱియవచ్చి రోదోంతరం బెల్లఁ జీకట్లు గ్రమ్మునట్లు బాణవర్షంబు గురిసినం గని సైంధవుండు చెదరి పాఱుతనవారి నెలుంగెత్తి పిలిచి యి ట్లనియె. 401

క. ‡పఱవకుఁడు నిలుఁడు పొదువుఁడు, నెఱిఁ జూవుం డేయుఁ డనుచు ♦ నిజసైనికులన్
వెఱపరి యై పురికొల్పుచు, గుఱికొని కఱదలు వచించెఁ ♦ గుదురుకొనంగన్.

వ. ఇ ట్లెల్లర నిలువరించి సైంధవుండు సింధురంబుచందంబున నిలిచి పోరం జొచ్చె నప్పు డిరువాగుయోధులుం గలియఁబడి సంకులసమరంబు గావించి రయ్యవసరంబున.

చ. †అనిమొన ఘోరశబ్ద మొకఁ ♦ డబ్బుర మై జనియించె నంతటన్
ఘను లగుపాండవేయులను ♦ గన్గొని కొల్పులిఁ గన్నలేళ్లు నా
మనమున నివ్వెఱంపడి క్రమం బఱి సింధుశిబిప్రధాను లై
తనరెడుతచ్చమూపులు య♦థాయథలై పరువెత్తి రత్తఱిన్. 404

ఉ. అంతట భీమసేనుఁడు భ♦యంకరలీల రథంబు డిగ్గి కా
లాంతకుఁడో యనం గరము♦లందు నమర్చి పసిండికట్లతో
నెంతయు నొప్పునిన్పుగుదె ♦ నింతలనంతల నేసి సైంధవున్
బంతముతో నెదుర్కొనియెఁ ♦ బ్రస్ఫుటకోపపరీవృతాత్ముఁ డై. 405

వ. అలోఁ గోటికాస్యుం డనువాఁడు మహారథికసమూహంబుతో వృకోదరున కడ్డపడి దొడ్డనారాచంబులును శక్తితోమరాదిసాధనంబులుం బ్రయోగించి నొప్పించుటయు నంత నాసేనాముఖంబున. 406

సీ. పార్థమధ్యముఁ డొక్క♦భద్రగజంబును, బదునల్వురం గాలిబంట్లఁ ♦ దునిమె
విజయుండు సైంధవు ♦ వెదకుచుం జని పంచ,శతపార్వతీయులఁ ♦ జక్కడంచెఁ
ఖాండవాగ్రజుఁ డొక్క♦పట్టున సౌవీర,వరుల నూర్వురఁ గూల్చె ♦ వరబలమున
నకులుండు వాల్గొని ♦ నఱికె పత్తులతలల్, వెదచల్లిన ట్లిలఁ ♦ బొదలఁ జేసె

* మకరపృష్ఠంబు = తిమింగిలముతోఁక యని యర్థము. కలంబు = ఓడ. ‡ వెఱపరి = భయముగలవాఁడు. గుఱికొని = లక్ష్యించి. కఱదలు = బుద్ధులు. † యథాయథలై = చెల్లాచెదరై.

తే. నంతసహదేవుఁ డరదముం ♦ దధివసించి, ఘోరనారాచముల నేసిఁ ♦ గూల్చె హస్తి
యోధులఁ గా మహీరుహములఁ ♦ నుండి బర్హి, నసముదయంబును బోలినా ♦ సమయమందు.

ఉ. అంతఁ ద్రిగర్తనాథుఁడు ర ♦ యంబునఁ దేర్దిగి వచ్చి కూల్చె న
త్యంతకనూతిరథ్యముల ♦ నాతఁడుఁ గ్రోధపరీవృతాత్ముఁడై
యంతికవర్తియై మెలఁగు ♦ నాతని వక్షముఁ గాడ నేసె దు
ర్దాంతదురంతవేగమునఁ ♦ గ్రాలెడుశక్తి మొగంపుటమ్మునన్. 408

క. ముక్కుల నోటను నెత్తురుఁ, గ్రక్కుచు వక్షంబు వగులఁ ♦ గఁ ద్రిగర్తవిభుం
డుక్కురుపతిమొదుటం బడె, నక్కజముగ మొదలు నఱక ♦ నవనిజముగతిన్. 409

వ. ఇంద్రసేనద్వితీయుండై యుధిష్ఠిరుండు హతరథ్యం బగునిజరథంబు డిగి సహదేవుని రథం బెక్కె నంత. 410

తే. అలిగి క్షేమంకరమహాము ♦ ఖులునకులునిఁ, బొదివి కాలాబ్దములుపోలెఁ ♦ బొదలిబాణ
వర్షముం గురిసి రతండు ♦ వారి నొక్క, పెట్ట గిట్టించె వాలమ్ము ♦ లట్టె యేసి. 411

వ. అవ్వల వారియనుజుం డగుసురథుం డనువాఁ డమ్మహారథునిరథంబుమీఁదికిఁ దన గంధగజంబుం డీకొల్పుటయును. 412

చ. *మదగజ మమ్మహారథుని ♦ మార్కొని తద్రథముం బడల్పఁడన్
జదిపిన మాద్రినందనుఁడు ♦ చయ్యన వాలును డాలు నంది పై
కదటున వచ్చునగ్గజము ♦ నారసి కొమ్ములతోడఁ దుండముం
జిదురుపలై పడన్ నలిపి ♦ చిత్రవిహార మొనర్చె నత్తఱిన్. 413

ఉ. ఘోరనినాద మేర్పడఁగ ♦ ఘూర్ణిలుచున్ నడగొండయో యనన్
వారణ మూర్విపైఁ బడె నం ♦ వాక్ఫురమై పయివారు ద్రెళ్లఁగన్
శూరుఁడు మాద్రినందనుఁడు ♦ చూపఱు మే లనునట్లు చేసి యు
మ్మారుతితేరిపై కరిగె ♦ మారుతియు న్వడిఁ గోటికాస్యునిన్. 414

క. తలపడి సూతుం దునుముచుఁ, దొలఁగన్ రథ మీడ్చుకొనుచుఁ ♦ దురగంబులు వేఁ
దల యుక్రపానంబునఁ, దెలిసి యతం డలుక నేసెఁ ♦ దెగ శిబికులజున్. 415

సీ. †తదనంతరము తన్నుఁ ♦ దాఁకుదెంచినవారి, సౌవీరపుత్రుల ♦ సవ్యసాచి
లక్షించి నిశితభ ♦ ల్లములఁ దద్ధనువులు, శీర్షంబులుం దుంచి ♦ చిత్రగతులఁ
బొనరి శిబిక్ష్వాకు ♦ లను ద్రిగర్తుల సైంధ, వుల నొంచి క్రూరాస్త్ర ♦ ములఁ గడంగి
తలల నట్టలఁ బరా ♦ కల రథరథ్యాద్యు, లం గప్పె నాపటు ♦ రాంగణంబు

* వాలు = కత్తి. డాలు = ఖేటకము. చిదురుపలు = సూక్ష్మఖండములు. †అట్టలు = తల లేనిశరీరములు.



తే. నవుడు కంకకాకోలవా ♦ యసనృగాల, గృధ్రకుర్కురవర్గంబు ♦ తృప్తినొందె
హతనరేభాశ్వమాంసశో ♦ ణితము లాని, భూతబేతాళగణములుఁ ♦ బ్రీతినొందె.

సైంధవుండు ద్రౌపదిం దిగవిడిచి పాఱిపోవుట.

వ. ఇట్లు సంకులంబై ప్రాణసంకటం బయినసమరంబున సైన్యం బంతయు దైన్యంబు నొందుటయుఁ దాను బలహీనుం డగుటయు నెఱింగి సైంధవుండు తన ప్రాణంబులు దక్కించుకొన నెంచి ద్రౌపదిం దిగ విడిచి వడివడిం బఱచె నంత నజాతశత్రుండు ధౌమ్యసహిత యగునామెం దనతో సహదేవుతే రెక్కించుకొనియె నప్పుడు. 417

ఉ. విచ్చి చమూసమూహములు ♦ వెన్నిడి పోవుటయున్ జయద్రథుం
డెచ్చినభీతునం దొలఁగి ♦ యేగుటయుం గని వీరుఁడై నవి
వ్యచ్చుఁడు సైనికావలిని ♦ బట్టి వధించెడుగాలిపట్టికిం
జె చ్చగుభక్తి ని ట్లనుచు ♦ విన్నపముం బొనరించె నెంచఁగన్. 418

మ. మన కెగ్గు ల్పొనరించి పాపపరుఁడై ♦ మర్యాదకుం దప్పి త
ప్పునడం జొప్పడుసైంధవుండు కలనం ♦ బోలింపరాఁ డెందొ పా
ఱె నరయో యీపానుఁగుంబ్రజం దునిమి కాఁ ♦ జెంపంగ నే మయ్యె దు
ష్టుని వానిన్ వెనుదన్ని మన్నిగొన నెం ♦ చు న్నామనం బియ్యెడన్. 419

వ. నీమనం బెట్టిదియో యని గుడాకేశుండు వినిచిన విని వృకోదరుం డాఁగాత మని ధర్మతనయునిదిక్కు మొగంబై. 420

శా. దేవా! యీద్రుపదాత్మజాతఁ గరుణం ♦ దేలించుచుం దీనితో
జీవుం బోలినధౌమ్యుతోఁ గవలతో ♦ శీఘ్రంబ విచ్చేయు మీ
క్రీవన్ స్వాశ్రమభూమి, కేను భుజశ ♦ క్తిం జూపుచున్ సైంధవున్
బ్రావీణ్యంబునఁ జంపి వత్తును వడిం ♦ బాతాళముం జొచ్చినన్. 421

తరళము. అనుడు ధర్మజుఁ డిట్లనున్ ఖలుఁ ♦ డైనవాని వధింపఁ గాఁ
జనదు దుశ్శలకారణం బది ♦ సంభవించుటఁ జేసి త
జ్జననియున్ వలవంత నందురు ♦ సంతతం బది మూలమై
మనకుఁ గీ డగుఁ గానఁ జెప్పితి ♦ మాట విన్మ కుమారకా. 422

తే. అనుడుఁ బాంచాలి యను ఖలుం ♦ డైనవానిఁ, గూల్పఁ దగు మీరు నాకెదఁ ♦ గూర్తు రేని
రాజ్యమును భార్యను హరించి ♦ ప్రబలు దుష్టుఁ, వేఁడినను వీడ నొప్పదు ♦ విగ్రహమున.

వ. అనంతరంబ కౌంతేయాగ్రజుండు కాంతాసహితుం డై మాద్రేయధౌమ్యులతో నిజాశ్రమంబునకు నిర్గమించె నిట భీమార్జునులును వడివడి రథంబులు దోలుకొనుచుం

జని రవు దర్జునుం డస్త్రానుమంత్రితశరంబులఁ గ్రోశమాత్రదూరంబున నున్న జయద్రథరథరథ్యంబులం గూల నేసి శరవేగంబున వెన్నుదన్ని చేరవచ్చుటయును. 424

మ. *నిహతాశ్వుం డగుసైంధవుండు త్రిజగన్నిర్ధార్యుఁడై యొప్ప శ్వే
తహయుం గాంచి వెఱుంగుటన్ వెఱగునుం ♦ దబ్బిబ్బునుం బొంది వి
గ్రహముం జేయఁగ శక్తిలేమి రథప♦ర్యంబున్ వడిం డిగ్గి ని
స్పృహుఁడై పాఱుచు వానిఁ జూచి యనిలోన్ ♦ జిష్ణుండు రోచిష్ణుఁడై. 425

క. వెఱచెఱచి పఱచె దేటికి, నెఱుఁగవె మున్నిట్టు లాట ♦ యింతటినీ వీ
తెఱవం జెఱగొని పోదువు, మఱకువఁ గొని యుంటి వోరి ♦ మాత్సర్యమునన్. 426

చ. †పలువుర బందులన్ విడిచి ♦ పంద తెఱంగునఁ బాఱుచుంటి వే
చలము బలంబుఁ జూపు మన ♦ సైంధవుఁ డాం డొకఁ డాడ కేగుచో
నిలు నిలు సైంధవాపశద ♦ నేను హిడింబబకాంతకుండ న
న్దెలియు మటంచు భీముఁడు వ♦డిం బరువెత్తెను వానివెంబడిన్. 427

వ. జయద్రథుండు పఱచివచ్చువాయునందనుం దిలకించి జీవేచ్ఛం జేసి కాలికొలందిఁ బఱవఁ జొచ్చె నప్పుడు భీమసేనుం డెయిది వానిం గూడముట్టి. 428

భీమసేనుండు సైంధవుం బరిభవించుట.

క. సిగఁ బట్టి వాని మీఁదికి, నెగయించి ధరిత్రిఁ బడఁగ ♦ నేసి యఱచుచున్
బగ దీఱఁ దన్ని నొదల, సగపా ల్మరణించి వాఁడు ♦ సన్నచెడంగన్. 429

వ. మఱియు నతండు వానిసర్వాంగంబులును నొక్కటిగా ముడియం గట్టి బిట్టెత్తి వైచి యొక్కపెట్టు పెట్టుటయును వాఁడు వివశుం డై పుడమిం బడియె నవు డర్జునుం డోహో చాలు నింకఁ బరువంబు దప్పినఁ బాశంబు చెడు వీఁడు దుశ్శలాగాంధారులకుఁగా ననుగ్రహింప నర్హుం డని యగ్రజునాదేశంబు గావున విడిచిపుచ్చు మనిన వృకోదరుండు కటంబు లదరఁ గటకటంబడి కరుణాళుం డగునజాతశత్రుం డిట్లాన పెట్టిన నే నేమి సేయఁ గలవాఁడ నిట్టి పాపుం డెట్టిచేఁతకునైనం జెల్లియుండెం గదా యని యంత వోక. 430

తే. అర్ధచంద్రబాణంబున ♦ నాజయద్రథునిశిరము చెక్కలెగయంగ ♦ ద్రోఁచి గొఱిగి
కలయ సటలై దుగాఁ బెట్టి ♦ కదుఁ గురూపమలవడఁగఁ జేసి మదిరోసి ♦ పలికె నిట్లు.

తే. బ్రదుకవలతేని యీనాఁడు ♦ మొదలు సభల, యందుఁ బాండవదాసుండ ♦ నైతి ననుచు
నాడవిక్రొను మట్లయిన నే ♦ విడిచిపుత్తుఁ, బ్రథనజితులకు నిటు చేఁత ♦ విధియసుమ్ము.

* నిర్ధార్యుఁడు = ధానిఁపని విడువక చేయువాఁడు. శ్వేతహయుఁడు = అర్జునుఁడు.
† ఒండొకడాడక = మాఱాడక.



సీ. అని పల్కుటయు వాఁడు ♦ ప్రాణభీతిం జేసి, యట్లగుం గావుత ♦ మని యొడఁబడె
నంత వానిం దార్ప్ల ♦ నంటఁ గట్టి రథంబుపైఁ ♦ బెట్టికొనిపోయి ♦ పార్థివునకు
భీమార్జునులు చూపి ♦ రామహీంద్రుండును, వీక్షించి భీమని ♦ విడువుఁ డనియె
ననినఁ బాండవదాసుఁ ♦ డైనవీనిని ద్రుపదాత్మజాతకుఁ జెప్పు ♦ మనిరి వార

ఆ. వికృతరూపువాని ♦ వీక్షించి ద్రౌపది, దాసుఁ డగుట విడువఁ ♦ దగును వీని
ననుచు విడిచిపుచ్చి ♦ రనఘులు వా రంత, వాఁడు మ్రొక్కి యెల్ల ♦ వారి కపుడు. 433

వ. అంతఁ బరమకారుణికాగ్రగణ్యుం డయినపాండవాగ్రజుండు జయద్రథు దెసం గనుంగొని యిట్లనియె. 434

ఆ. అధముఁ డైన నిట్టు ♦ లాచరింపఁడు లోల, మతివి నీచరిత్ర ♦ మతినికృష్ట
మెపుడు నేని కాకు ♦ మిట్లు నీదాస్యంబు, నెడయుబుద్ధి గలిగి ♦ యేగు మింక 435

వ. అని వీడుకొలిపిన వాఁడును లజ్జావనతవదనుం డై కదలి గంగాద్వారంబునకుం బోయి యచ్చట. 436

సైంధవుం డీశ్వరుని గుఱించి తపస్సుచేసి వరంబు వడయుట.

ఉ. పురహరునిం ద్రిలోచనుని ♦ భూతపతిన్ భువనైకవందితున్
వరమునిమానసాంతరని♦వాసుని వాసవముఖ్యదేవతా
వరదుని వామదేవుని శి♦వంకరు శంకరు నాత్మ నిల్పి సు
స్థిరుఁ డయి నైష్ఠికుం డగుచుఁ ♦ జేసెఁ దపం బతిదారుణంబుగన్. 437

మ. వరదుం డీశ్వరుఁ డాజయద్రథునకుం ♦ బ్రత్యక్షమై వేఁడు మే
వర మీ వచ్చితిఁ గోర్కి యే మనవుడున్ ♦ వాఁ డానతుండై మహే
శ్వర నా కెవ్వరుఁ బాండవేయులను గె♦ల్వన్ శక్తి సంధిల్లఁ గా
వర మీవే యనఁ గృత్తివాసుఁ డనియెన్ ♦ వాత్సల్యముం జూపుచున్. 438

ఉ. దుర్జయు లాపృథాసుతులు ♦ దోర్బలశాలులు వారిఁ గెల్వఁ గా
నిర్జరులైనఁ జాల రొక♦నీ వన నెంత వరింతు కాన న
య్యర్జును నొక్కని న్విడువ ♦ నావలి నల్వుర నొక్కనాఁట నీ
వార్జవ మొప్ప నడ్డపడు♦నట్లు వరం బిడ నీకొనంగితిన్. 439

వ. అర్జునసింహంబు నడ్డగించుట త్రిభువనంబునుం జాల దాకర్ణింపుము. 440

మ. నరుఁ డాతండు మహామునీశ్వరుఁడు మున్ ♦ నారాయణుం గూడి సు
స్థిరుఁ డై చేసెఁ దపంబు తత్ఫలము గా ♦ సిద్ధించె నీజన్మ మే

వరుడారంగ ననుగ్రహించితి మదీయం బైనదివ్యాస్త్ర మి
చ్చిరి వేల్పుల్ తమదివ్యశస్త్రములు సుస్త్రీశంబుగా వానికిన్. 441

వ. దానంజేసి వాని కట్టిప్రభావోదయం బయ్యె నిదియునుం గాక. 442

మ. జగదారాధ్యుఁడు వాసుదేవుఁ డగుచున్ ♦ జన్మించె నారాయణుం
డగు నీవిశ్వము వానికారణమునన్ ♦ వ్యక్తుండు నవ్యక్తుఁ డై
తగునవ్వానిమహత్త్వముం దెలియఁ గాఁ ♦ ద్రైలోక్యమం దెవ్వరే
ని గలారే ఘనుఁ డాతఁ డాతని కనిన్ ♦ మిత్రుం డఁటే వింటివే. 443

వ. మఱియు నమ్మాధవుండు. 444

సీ. ప్రళయకాలంబునఁ ♦ బదునాల్గులోకముల్, ఘోరానలంబునఁ ♦ గూలినపుడు
పుష్కరావర్తకాం♦భోదముల్ విడివడి, కుంభవర్షము పెల్లు ♦ గురిసినపుడు
నేలయున్ నింగియుం ♦ బోలింపఁగా రాని,యట్టు లేకార్ణవ ♦ మయినయపుడు
సకలచరాచర♦జంతుజాలము లెల్ల, దేవళ్లపిండులోఁ ♦ ద్రెళ్లినపుడు

తే. చిమ్మచీఁకట్లు విడ కెప్డు ♦ గ్రమ్మినపుడు, వేయికన్నులు పాదముల్ ♦ వేయితలలు
గ్రాల నారాయణుండు నా ♦ లీల నలరు,భోగిపర్యంకశాయియై ♦ యోగనిద్ర. 445

వ. అంతఁ గొంతకాలంబున కతనినాభిపద్మంబునఁ జతుర్ముఖుండు వొడమి తదాదేశం
బునంజేసి జంగమస్థావరాత్మకంబు లైనయఖిలప్రపంచంబులును వినిర్మించు నిట్లు
త్రిమూర్త్యాత్మకుండై సృష్టిస్థితిలయకారణభూతుం డయ్యె నతండుమఱియును. 446

సీ. మున్ను మున్నీటిలో ♦ మునిఁగిపోయెడునేలఁ, గోల నై కొమ్మున ♦ నేలినాఁడు
లోకకంటకుఁ డైన ♦ సోఁకుమూఁకలఱేని, నరసింహమూర్తి యై ♦ నలిపినాఁడు
వటు గై బలిని వేఁడి ♦ పుడమి మూఁ డడుగులు, మించి ముజ్జగ మాక్ర♦మించినాఁడు
ధర్మసంరక్షణా♦ర్థము మర్త్యమున నిట్లు, వాసుదేవుం డయి ♦ వఱలినాఁడు

తే. అతఁడుకృష్ణుఁడువిష్ణుఁడ♦వ్యయుఁడనంతుఁ,డాద్యుఁడమరేంద్రవందితుం♦డజితుఁడజుఁడు
విజయునకు సంగడీఁ డయి ♦ వెలయుచుండ,వాని గెలువంగఁ గలరె యె♦వ్వారలైన. 447

వ. కావున వాఁడు దక్కఁ దక్కినపాండవుల నొక్కనాఁటికయ్యంబునం గెలువ నీకు వరం
బిచ్చితి నని పలికి పారిషదపరివృతుం డై పరమేశ్వరుం డంతర్ధానంబు నొందె నంత
మందాత్ముం డగుజయద్రథుండును దపంబు చాలించి నిజపురంబునకు నిర్గమించెఁ
బాండవేయులును బ్రాహ్మణపరివృతు లై కామ్యకకాననంబున నివసించియుండి
రనిన జనమేజయుండు వైశంపాయనుం గని యి ట్లనియె. 448



క. ఘను లగుపాండవు లవ్వనమున వనితయుఁ దాము విప్రముఖ్యులతోడన్
వనటం బొందుచు నవ్వల, నొనరించిన దేమి చెప్పు ♦ మోమునినాథా. 449

వ. అనిన నతం డతనికిం జెప్పినచొప్పున. 450

—•◆• ఆశ్వాసాంతము. •◆•—

చ. పరులధనంబుఁ గోరి పర♦భామల కాస యొనర్చి నిచ్చలున్
దురితము లాచరించుచును ♦ దుర్జనుఁ డన్నడి కోర్చి కంతకా
వరమునఁ గన్నుఁ గాన కిల ♦ వర్తిలువానికిఁ బోలె నాకును
దురితముఁ గట్ట కోముము నిన్నున్ భజియించెద నోపరాత్పరా. 451

క. నీకరుణం గాంచినవాఁ, డేకరణిఁ జేతు లొగ్గఁ ♦ డెవుడేఁ గానీ
లోకైకనాథ నన్నున్, నీకరుణం గలుగఁ జేసి ♦ నెఱిఁ బ్రోవఁ గదే. 452

గద్యము.

ఇది శ్రీమదఘనాతనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్త్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతం బయిన శ్రీ కృష్ణభారతంబున
నారణ్యపర్వంబునం దష్టమాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీ

బాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

## అరణ్యపర్వము.—నవమాశ్వాసము.

—:o:—



మున్మల్కిశీలాఖ్య
గ్రామంబునఁ గవులపాలి • కల్పద్రుమ మై
ప్రేమ నెసంగెడుసుకృతిన్
భూమిపతిం జంద్రమౌళిఁ • బ్రోవుము దేవా. 1

—రామోపాఖ్యానపర్వము.—

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు జయద్రథుఁ జయించి ద్రౌప దీమోక్షణంబు గావించి యుధిష్ఠిరుండు మునిగణపరివృతుం డై యున్నసమయంబున.

సీ. పండఁ బాఱినమేన • బసుమంబునిగనిగ, మెఱసి కన్నులఁ గ్రొమ్మెఱుఁగు మిట్లు గొలువఁ
బల్లవారుణజటా • పటలంబు భరముగా, నేలపై జీరాడి • వ్రేలుచుండ
మెడను జందెములతో • మెలికలు గొనుభద్ర, రుద్రాక్షమాలలు • యాధి మెఱయఁ
గుశపవిత్రము వ్రేలఁ • గొమరొప్ప సాంగకృ, ష్ణాజిన మొకచక్కి • నతిశయిల్లఁ
తే. గేల దండకమండలుల్ • గ్రాలుచుండ, శిష్యులకు వేదశిఖలను • జెప్పికొనుచు
మహిమ మీఱ మార్కండేయ • మానివరుఁడు, లీలఁ జనుదెంచె ధర్మజు • పాలి కపుడు.

వ. ఇట్లు సమాగతుం డైన మార్కండేయమునీంద్రునకుఁ బ్రత్యుత్థానాభివందనంబు లాచ రించి తమపాటు విన్నవించి వినయవినమితోత్తమాంగుం డై మీరు భూతభవిష్య ద్వేదులరు మాడెనం బ్రసన్నుల రై మాసంశయంబు లెల్లం దీర్ప నోపుదు రని యి ట్లనియె. 4

చ. విదళితదోషుఁ డాద్రుపదు • వేది నయోనిజ యై జనించి సం
పదలకు నాలవాల మగు • పాండునివంశమునందుఁ గోడ లై



విదితయశస్కురా లయిన • వీరపతివ్రత ని ట్లొరుండు దు
ర్మదుఁ డయి ముట్టఁ గల్గె నిది • మా దురదృష్టము గాదె చూడఁగన్. 5

తే. కాఁ దలఁచి యున్నశుభ మైనఁ • గాని యశుభ
మైనఁ గాని భూతముల కె • ట్లయినఁ గాక
పోదు బలవత్తరం బిది • భూతలమునఁ
దద్వ్యతిక్రమ మింతయుఁ • దలఁప రాదు. 6

మ. మృగయాజీవనముల్ గ్రహించి వనులన్ • మే మెద్దు వర్తించుచున్
మృగజాతిన్ మడియించుచున్ వనచరా • నీకంబుతో నెప్పుడున్
దగులంబుం గొని వైభవంబు హితులన్ • దాయాదుల న్వీడి క
ష్టగతిం గాలముఁ ద్రోచుచుంటి మిటు చూ • డం గల్గునే యొందునన్. 7

క. నాయట్టియల్పభాగ్యుం, డేయుగమునఁ గనియు వినియు • నెఱుఁగఁగ నుండం
డోయయ్య యనుడు మార్కం, డేయుం డానృపతి కిట్ల • నియె నెయ్యమునన్. 8

—మార్కండేయుఁడు రామాయణకథ చెప్పుట.—

ఉ. రాముఁడు మున్ను నీవలె న • రణ్యమునం గడు దుఃఖ మొందె నా
రామునిజాయ జానకిని • రావణుఁ డన్సురవైరి యొక్కరుం
డామహి మాయ మైఁ గొనియె • నంతఁ గపీంద్రులచెల్మి సంద్రమున్
రాముఁడు గట్టి కొట్టి యసు • రన్ జనకాత్మజఁ దెచ్చె వెండియున్. 9

చ. అనుడు యుధిష్ఠిరుం డనియె • నామునిఁ గన్గొని రాముఁ డేకులం
బున జనియించె రావణుని • పుట్టుక యెట్టిది వారివైర మే
యనువున నయ్యెఁ దచ్చరిత • మంతయు నంతన మొప్పఁ జెప్పవే
యని వినయమ్మునం బలుక • నమ్ముని యి ట్లనియె న్నయమ్మునన్. 10

మ. కలఁ డిక్ష్వాకుకులంబునం దజుఁడు నా • త్మానాథుఁ డొక్కండు ము
న్నతఁడుం డాతనికిం దగన్ దశరథా • ఖ్యాతుండు పుత్రుండు ని
స్తులచారిత్రుఁడు పుట్టె వానికి జగ • త్స్తోత్రాతిపాత్రుల్ పవి
త్రులు పుత్రుల్ శుభగాత్రు లై నలువు రిం • దుం బొంది రానందమున్. 11

వ. ఆదశరథనందనులు నల్వురును గ్రమంబున రాముండు భరతుండు లక్ష్మణుండు శత్రుఘ్నుండు నాఁబడి రందు రాముండు కౌసల్య యనునామెకును భరతుండు కైకేయి యనునామెకును లక్ష్మణశత్రుఘ్నులు సుమిత్ర యనునామెకునుం బుట్టిరి వారిలో రాముండు విదేహరాజనందిని యగుసీతామహాదేవిం బెండ్లియాడె నింక రావణాసు రునిజన్మప్రకారంబును జెప్పెద నవహితుండ వగుము. 12

రావణకుంభకర్ణాదులవృత్తాంతము.

ఉ. మానుగ సర్వలోకముల ♦ సృష్టిఁ జేయువిధాతకుం దగన్
మానసపుత్రుఁడై పొడమె ♦ మాన్యయశుండు పులస్త్యనాముఁ డా
మానితమూర్తి సన్మునిసమంచితుఁడై పొలుపొంది గోవునం
దానఁ గాంచె వైశ్రవణుఁ ♦ డన్ యశ మందినయట్టిసూనునిన్. 13

వ. ఆవైశ్రవణుండు తండ్రిం గాదని తాత నాశ్రయించి తదనుగ్రహంబున నమరత్వ ధనేశ్వరత్వ లోకపాలత్వ యక్షేశ్వరత్వంబులును యక్షరాక్షసగణాన్వితం బగులంకారాజ్యంబును శంకరునితోడిసఖ్యంబును గామగం బైనదివ్యవిమానంబును రాజరాజనామంబును నలకూబరుం డనుకుమారునిం బొంది పొందుపడి యున్నం గని కరం బలిగి పులస్త్యుండు నిజశరీరార్ధంబునం జేసి విశ్రవసుం డనువాని నొక్కనిం బుట్టించి వైశ్రవణునకుం గీడు సేయం బుచ్చుటయు నది యెఱింగి వైశ్రవణుండును.

చ. జనకునియర్ధదేహమున ♦ సంభవ మందినవిశ్రవోమునిం
గనుఁగొని వానికోపమునఁ ♦ గంపితవిగ్రహుఁ డై భయంబునన్
జనకుఁడ వీవు నా కని ప్రశంస యొనర్చుచుఁ దత్ప్రసాదమున్
గొనుటకు మార్గమున్ వెదకికొంచు నొకించుక సంశయించుచున్. 15

వ. పుష్పోత్కటయు రాకయు మాలినియు ననుమూవురు నక్తంచరాంగనలం దెచ్చి పరిచర్య సేయ వాని కొసంగుటయు వారు నొండొరులం గడచి నృత్తగీతాదిచాతుర్యంబున విశ్రవసుం గొలిచిన నాతండు ప్రీతుండై వారికి లోకపాలోపము లగు నాత్మజుల ననుగ్రహించె. 16

సీ. అందుఁ బుష్పోత్కట ♦ యవతరించిరి సుతుల్, కడిమి రావణకుంభ♦కర్ణు లనఁగ
రాకకుం బుట్టిరి ♦ లేఁకువ ఖరుఁ డను,కొడుకు శూర్పణఖ యన్♦కూఁతు రొకట
మాలిని కుదయించె ♦ లీల విభీషణా,ఖ్యాకుండు సుతుఁడు లో♦కైకనుతుఁడు
వారిలో నగ్రజుఁ ♦ డై రావణుఁడు మహా,సత్త్వపరాక్రమ♦శాలి యయ్యెఁ
తే. కుంభకర్ణుఁడు మత్తుఁడు ♦ క్రూరచిత్తుఁ, డుగ్రుఁ డాలంబులన్ ఖరుం ♦ డుగ్రమూర్తి
బ్రహ్మవిద్వేషి ఖలుఁడు శూ♦ర్పణఖ దుష్టమతి విభీషణుఁ డుత్తమ♦మానసుండు. 17

క. వారెల్ల వేదవిద్యలు, నేరిచి వ్రతముల్ పొనర్చి ♦ నేర్పునఁ దండ్రిం
జేరుకొని గంధమాదన,భూరిగ్రావమున సుఖము ♦ పొందుచు నుండన్. 18

వ. వైశ్రవణుం డొక్కనాఁడు నరవాహనుం డై వచ్చి మహావైభవంబునఁ దండ్రికడం గూరుచుండి తపోలబ్ధం బగుతత్ప్రభావంబుం జూచి చూపోపక కోపంబున విశ్రవ



సుతులు బ్రహ్మదేవుంగూర్చి దారుణతపంబు గావించి రాకర్ణింపుము 19

ఆ. వాయుభక్షుఁ డగుచు ♦ వేయివత్సరములు, పంచవహ్నిమధ్య♦వర్తి యయ్యు
నొంటికాల నిలిచి ♦ యొనరించె దారుణ,తపము పఙ్క్తికంఠుఁ ♦ డవుడు కడఁగి. 20

క. నియమవ్రతము పొనంగన్, నియతాహారుండు ధార♦ణీశయనుండున్
భయరహితుఁ డుగ్రకర్ముం, డయి చేసెం గుంభకర్ణుఁ ♦ డధికతపంబున్. 21

క. రాలినపర్ణం బొక్కఁడు, వేళకుఁ దిని యుపవసించి ♦ విమలాత్ముం డై
శీలము మెఱయ విభీషణుఁ, డాలోనం దప మొనర్చె ♦ నత్యధికముగన్. 22

క. ఖరుఁడును శూర్పణఖ తపం, బరుదారం జేయువారి ♦ కనిశము రక్షా
పరిచర్యలు సల్పుచు నుండిరి హృష్టమనస్కు లై క♦డింది ప్రియమునన్. 23

శా. వేయేం డ్లిట్లు తపించి పఙ్క్తిముఖుఁ డా♦వేశన్ దురాధర్షుఁ డై
స్వీయత్తేజమునం దలల్ నఱికి వే♦ల్వన్ మెచ్చి పద్మోద్భవుం
డాయుర్వీం జని రాక్షసేంద్రునకు నిష్టార్థప్రదుం డయ్యె భ
క్తాయత్తుం బగుదివ్యచిత్తమున సా♦హార్దంబు సంధిల్లఁగన్. 24

వ. అంత బ్రహ్మదేవుండు ప్రత్యక్షుండై రావణుం గని యి ట్లనియె. 25

బ్రహ్మదేవుండు రావణాదులకు వరంబు లిచ్చుట.

మ. అమరత్వం బది గాక కోరుకొను మే ♦ వైనన్ వరంబుల్ ప్రియ
త్వమున న్నే నిడ వచ్చినాఁడ నిట వం♦శాన్నీతలల్ తొంటియ
ట్లమరున్ రూపము కోరిన ట్లగును నీ ♦ కాలంబునన్ విద్విష
త్సముదాయమ్మును గెల్వఁగాఁ దగుమహా♦సామర్థ్యమున్ గల్గెడున్ 26

వ. నావుడు రావణుండు. 27

తే. గరుడగంధర్వకిన్నరా♦సురసుపర్వ, యక్షరాక్షససిద్ధవి♦ద్యాధరోర
గాదులవలనఁ బరిభవం ♦ బందకుండునట్లు వర మీవె దేవ నా♦కనిన ననిన.

వ. చతురాననుండును మనుష్యజాతివలనం గాక వాఁ డడిగినయెల్లవారివలన భయంబు లేకుండ వరం బిచ్చితి ననుటయు వాఁ డెద ముదం బంది మదంబునం జేసి మనుష్య లోకలెక్క యని తలంపఁ డయ్యె నయ్యెడ. 29

క. పరమేష్ఠి కుంభకర్ణుని,పరిసరమున కేగి వరము ♦ వాంఛింపు మనన్
దురితాత్ముఁ డతఁడు గోరెన్, గురుతరనిద్రం దగంబుఁ ♦ గొనుచిత్తమునన్. 30

మ. అనిన హిరణ్యగర్భుం డట్ల యగుంగావుత యని విభీషణునిచెంతకుం జని. 31

ఉ. ప్రీతుఁడ నైతి నే వరముఁ ◆ బేర్కొనఁ గాంగిద వేఁడు మెచ్చి దం
చేతము వచ్చిన ట్లని వచించుటయుం విని వీతమత్సరుం
డాతఁడు మోడ్పుఁగేలు శిరమం దమరించి మదీయమానసం
బేతఱి ధర్మసంగతి వహింపఁ జేయునట్టు లనుగ్రహింపవే. 32

వ. మఱియు నీకు నాపై ననుగ్రహంబు గలదేని భవదీయం బైన బ్రహ్మాస్త్రం బొసఁ
గం దగు నా కెందుం దోఁచునట్లు వరం బొసంగు మనిన నతం డట్లు కావుత మని
వానిం జూచి. 33

తే. అరయ రాక్షసికి జనించినట్టి దయ్యు, ధర్మసంగతిఁ బాయని దారిఁ బట్టి
ధార్మికుఁడ వైతి మెచ్చితిఁ ◆ దాత నీకు, నిచ్చితిని నమరత్వ మే ◆ నిచ్చఁ జేసి. 34

వ. అని చెప్పి యప్పితామహుం డంతర్హితుం డయ్యె నంత. 35

సీ. వజ్రకంఠుం డట్లు ◆ వడసి వరంబులు, గర్వాంధకారంబు ◆ గప్పికొనఁగ
ధనదుమీఁదికి దాడి ◆ చని వాని నోడించి, లంక వెడలఁ గొట్టి ◆ శంక విడిచి
పుష్పకారూఢుఁ డై ◆ పోవు యక్షేశ్వరు, తనుదన్ను పుష్పకంబును హరించి
యక్షరక్షస్సాధ్యుఁ ◆ డై రాక్షసస్తోత్రి, ప్రాతుఁ డై పెంపొందెఁ ◆ బ్రజకలిమి
తే. వైశ్రవణుఁ డట్లు నిర్జింపఁ ◆ బడియుఁ గినుక, దశవదనుఁ గాంచి గురుని నగ్రజుని యిట్లు
నర్చితివి గావునన్ విమానంబు నీకుఁ, గాక నిన్నోర్చువాని కగుఁగాత మవల. 36

వ. అని శపించి యక్షరాక్షసపరివృతుం డై గంధమాదనంబునకుం జనియె నంత. 37

క. ధర్మాత్ముఁ డగువిభీషణుఁ, డర్మిలి వైశ్రవణుఁ గొల్చి ◆ యరిగె నరిగినన్
ధార్మికుఁ డాతం డాతని, నిర్మలమతి నధిపుఁ జేసె ◆ నిజబలములకున్. 38

వ. అంత రావణుండును. 39

శా. శంకాతంకవిహీనుఁ డై ప్రబలి రక్షస్సైన్యముల్ గొల్వ నా
లంకారాజ్యమునందుఁ బొందుపడి లీలావిభవం బేర్పడన్
బంకం బొంకు నెఱుంగఁ గెల్లకడలన్ ◆ శౌర్యంబున న్మెట్టుచున్
శంకల్ గాఁ గొని దేవదానవుల నేలన్ దున్నహప్రక్రియన్. 40

ఆ. వ్యోమచారి యగుచు ◆ గామరూపంబున, నెల్లవారిసిరుల ◆ నెగిచి దోఁచి
ప్రబలి లోకములను ◆ రవలింపఁ జేయుట, రావణుం డనంగఁ ◆ గ్రాలె నతఁడు. 41

వ. ఇట్లు దశగ్రీవుండు దేవదానవాద్యఖిలలోకభయంకరుం డై సందుమిగిలి యుండె
నయ్యవసరంబున దేవర్షులు బ్రహ్మర్షులు సిద్ధులు సాధ్యులు హవ్యవాహుం బురస్క
రించుకొని పరమేష్ఠిపాలికిం జని శరణంబు వేఁడి రప్పు డగ్నిదేవుం డి ట్లనియె. 42



రావణునకోర్చి దేవతలు బ్రహ్మతో మొఱపెట్టుట.

మ. అవధారో జగదీశ మా మొఱలు ఘోరాకారుఁ డై రాక్షస
ప్రవరుం డై దనువిశ్రవస్తనయుఁ డాస్త్రశ్రేణులం గూడి నేఁ
డు వరప్రాప్తి నవధ్యుఁ డై ప్రజకుఁ గీడుం గూర్పఁగాఁ జొచ్చె నీ
భువనంబుల్ పదునాలుగుం జెడియెఁ బెంపుం దక్కె యొక్కుమ్మడిన్. 43

శా. పాలన్ ముంచిన నీళ్ల ముంచినను దేవా నీవ మాదిక్కు నీ
పాలం జేరితి మెట్లు చూచెదవొ మా భారంబు నీమీఁదనే
పోలం వైచితి మార్తి నొందితిమి మమ్ముం గాచి కోనం జెల్లు నీ
వేళన్ సాంద్రదయారసంబు చిలుకన్ ◆ వీక్షించి రక్షించుచున్. 44

వ. అనిన బ్రహ్మదేవుం డి ట్లనియె. 45

సీ. వాని సురాసురుల్ ◆ పూని చంపఁగ లేరు, గావ నుపాయ మేఁ ◆ గంటి నొకఁడు
మన్నియోగంబున ◆ మధుసూదనుఁడు మర్త్యమునఁ దన్ను బహాణములనకుఁ బుట్టు
నని యింద్రుఁ బిలిచి మీ ◆ రందఱు హరికి సాహాయ్యంబు వొనరింప ◆ నగును గాన
ఋక్షవానరులందు ◆ దక్షులం గామరూపుల బిడ్డలం గన ◆ వలయు ననుచుఁ
తే. బిలిచి గంధర్వి యగుదుందుభియనుదాని, దేవకార్యార్థ మిలఁ బుట్టు మీ వటనుచుఁ
బనిచెఁ బనిచిన నది మర్త్యమున జనించెఁ, గుబ్జయై మంథరాభిఖ్యఁ గొమరుమిగుల.

వ. అంత నింద్రాదిబృందారకబృందంబులును జని ఋక్షవానరాంగనలయందు నిజాం
శంబుల నాత్మజులం బుట్టించిరి వారును. 47

మ. బలశౌర్యాదుల మించి తండ్రుల గిరిప్రాంశూగ్రగాత్రంబులన్
బలభిచ్ఛత్రుపరాక్రమప్రతిభలన్ ◆ నాగాయుతప్రాణముల్
గలుగన్ సాలశిలాయుధప్రథితు లై ◆ గర్వోన్నతిం బొల్చి కొం
డల నైనం బగులింపఁ జాలు కడిమిన్ ◆ గన్పట్టి రప్పట్టునన్. 48

తే. మంథరయు నిందు నందు భూమండలమునఁ, దిరుగుచుం జేరి కైకేయిదిక్కు దాని
కాత్మజునిఁ బోలు రామునియందు వైర, మంకురింపఁగఁ జేసెఁ గార్యార్థ మపుడు.

క. ఆవైరకారణంబున, ధర్మావరతనయుండు రామచంద్రుఁడు వనికిన్
బో వలసి వచ్చె నావుడు, భూవరుఁ డెఱిఁగింపు మనియెఁ ◆ బోయినవిధమున్. 50

వ. అనిన మార్కండేయుం డతని కి ట్లనియె నట్లు జాతపుత్రుం డయిన దశరథుండు వృద్ధ
సేవియుం ధర్మరతుండు నై వేదవేదాంగవేత్తలును ధనుర్వేదపారగులు నగు తనపు
త్రులు చరిత్రబ్రహ్మచర్యు లై యున్నంత. 51

క. నలువురుకొడుకులు ముగ్గురు, పొలఁతులునుం దన్నుఁ గొలిచి ♦ పొలుఁగుచు నుండన్
బలువైభవ మెసఁగ ధరా, తల మేలుచు దశరథుండు ♦ తనరుచునుండెన్. 52

సీ. అపుడు కౌశికుఁ డధ్వ♦రావనార్థము వేఁడి, తన్నృపానుమతి సుల♦క్షణుల రామ
లక్ష్మణులను గొని ♦ లలిఁ జను చధ్వమ,ధ్యమున మహావిద్య ♦ లన్నియుఁ గృప
నుపదేశ మొనరించె ♦ నొగి రాముఁ డటఁ గోప,కంతముఁ జని తాట♦కను వధించి
మఱి సుబాహుని ద్రుంచి ♦ మారీచుఁ దోలి ని,రంతరాయమ్ముగ ♦ యజ్ఞ మరసి

తే. సానుజుఁడు రాముఁ డంత న♦మ్మౌనివెంట, మిథిల కరుదెంచి సీత కై ♦ ప్రథితమైన
యీశుచాపము వేగుఱు ♦ నెత్తరాని, దాని నవలీలఁ గొని సభ♦లోన విఱిచె. 53

శా. *రారాజుల్ వినుతించుచుండ శుభతూ♦ర్యంబుల్ సెలంగన్ విదే
హారాధ్యేశుఁడు కాళులం గడిగి క♦న్యాదానముం జేయఁగా
శ్రీరాముండు పరిగ్రహించి శుభదృ♦ష్టిం బెండ్లియాడె న్వరా
కారోపేత మఖోర్విజాత సుగుణౌ♦ఘస్ఫీత సీతం దగన్. 54

వ. అంత సపరివారుండై రాముం డయోధ్యఁ జేరుటయును. 55

ఉ. రాముఁడు శౌర్యలబ్ధగుణ♦రాముఁడు సువ్రతకాముఁ డై ప్రజా
స్తోమసమంచితం బగువి♦శుద్ధచరిత్రము గల్గి తండ్రికిం
బ్రేమకుఁ దావలం బగుచుఁ ♦ బేర్మిని మించి కుమారశేఖరుం
డై మహిమోన్నతిం గనియె ♦ నయ్యెడ నెయ్యము తియ్య మేర్పడన్. 56

తే. అంత మతిమంతుఁడగుమహీ♦కాంతుఁ డెడఁద, వయసు మీఱంగ నుండిన♦వానిఁ దన్ను
వయసునకుఁ జేర నుండిన♦వాని రాము, నరసి ధర్మజ్ఞ లగుమంత్రి♦వరులఁ బిలిచి. 57

తే. మంతనము చేసి సర్వస♦మ్మతుని సుతుని, దీర్ఘబాహు మహోరస్కు ♦ దేవసదృశు
సర్వవిద్యావిశారదు ♦ సదయు రాము, యౌవరాజ్యమునన్ నిల్ప ♦ నాత్మఁ దలఁచి.

మ. ‡పరమానందము నొంది డెందమున భూ♦పాలుండు సంతోషమున్
సొరిదిం జెప్పుచు సత్పురోహితులకున్ ♦ శోభావహం బీనికిం
బరఁగుం బుష్యమి పుణ్యయోగ మగుచున్ ♦ మా రామునిన్ యౌవరా
జ్యరమాధీశునిఁగాఁ బొనర్చెదము త♦త్సంభారముల్ దార్పుఁడీ. 59

మంథర కైకేయికి దుర్బోధ చేయుట.

వ. ఈశుభవృత్తాంతంబు రామచంద్రునకుం దెలియఁ జెప్పుఁడని చెప్పిన విని మంథర
పాపబంధుర యై కేకయరాజనందినిపాలికిం జని యి ట్లనియె. 60

* విదేహారాధ్యేశుఁడు = విదేహదేశములచే నారాధింపఁబడిన ప్రభువు, జనకుఁడు; ‡ సొరిది = క్రమము.



శా. అయోధ్యా ధయ్యాముని త్రికోలు విమదం♦కై యుండె నీవట్ల నే
నెయ్యంబుల్ వచియింప నేమిటికి దే♦వీ! నీదుదౌర్భాగ్యమున్
నయ్యాటం బ్రకటించె నీమగఁ డెదన్ ♦ సర్వంబు నా భీమణుం
డయ్యున్ నెయ్యము నూఁపు మీఁది కిది నీ♦ కంతర్హితం బెంతయున్ 61

తే. సవతిసౌభాగ్య మెంతవఁ ♦ జాలుదానఁ, గోసలాత్మజపుత్రిన♦కుం బ్రియమునఁ
యౌవరాజ్యాభిషేక మ♦య్యవనినాథుఁ, డొనరుపఁగఁ బూని నెడ యైతి ♦ వనిత నీవు.

క. నీకొడుకు రాజ్యహీనుం, డై కూటికిఁ బాసినట్టి ♦ డై యుండుగతిన్
గై కొనఁగ వచ్చు రాముం, డే కువలయ మేలుచుండె♦నేని నెలంతా. 63

వ. అనినం గాని మ్మని కైకేయి లోకం బెన్నఁ గై నేసి మంజులరూపంబు మెఱయం
జని యేకతమ యున్నపతిం గాంచి నగుమొగంబున నిజప్రణయంబు ప్రకటించుచు
మధురస్వరంబున ని ట్లనియె. 64

మ. మును నా కీవు వరం బొసంగుటకుఁ గా ♦ ముమ్మాటికిన్ బాస నే
సి ననుం దేర్చితి కూర్చి నెయ్యము నృప♦శ్రేష్ఠుండ వానాఁటి బా
సను నీడేరఁగఁ జేసి నేఁడు జగతిన్ ♦ సత్యప్రతిజ్ఞుండ వై
దినముల్ పుచ్చవె సచ్చరిత్ర యనఁ బ♦ల్కె న్స్యందనుం డర్మిలిన్. 65

ఆ. వనితఁ గాంచి యనియె ♦ వనజాక్షి వర మిత్తు, నేమి వలయుఁ దెలుపు♦ మిపుడు నాకుఁ
జంప రానివానిఁ ♦ జంపఁగ వలయునో, చంప నైనవానిఁ ♦ జంపవలదొ. 66

వ. అని మఱియు బ్రాహ్మణధనంబు గాక వేనిధనంబు హరింప వలయునో నీవరం బెట్టి
యదియో తెలుపుఁగఁ జెప్పు మది యెట్టిది యైనం గాని రాజరాజనై చాతుర్వర్ణ్యం
బునుం బ్రోచునేను దాని నీడేర్చి సత్యప్రతిజ్ఞుఁడ నయ్యెద ననిన దిట్టపడి భరత
మాత భూనేత కి ట్లనియె. 67

తే. అధిప రాముని గొనరింప ♦ నైనయాభి,షేచనిక మెల్ల భరతునిఁ ♦ జెందునట్లు
నవల రాముఁడు వనమున♦కరుగునట్లుఁ, జేయు మిది నాకువర మని♦చెప్పుటయును.

తే. దారుణము విప్రియం బగు♦దాని వినిన,మాత్ర నరనాథుఁ డెంతయుఁ ♦ నాతురపడుచు
నొండువలుకక ప్రాణస్పడి ♦ యుండె నపుడు,కన్నుఁగవ నశ్రువులు దేరి ♦ కాల్వగట్టె.

రాముఁడు సీతాలక్ష్మణులతో నడవి కేగుట.

సీ. అద్ది యంతయు నెఱిఁగి ♦ సదమలాత్ముఁడు రాముఁ, డయ్యసత్యమునిల్ప♦నడవి కేగఁ
దాని వెన్నంటిరి ♦ జానకియును సుమి,త్రానందనుఁడును ద♦త్పరత మీఱ.

రామునివలనిభయంబునం జేసి తపసి యై యున్నతనతొంటిమంత్రి మారీచునికడం
బొడసూపుటయు నతం డతనిం గని సంభ్రమించి పూజించి విశ్రమించినవెనుక విన
యంబున ని ట్లనియె. 84

చ. ప్రకృతిఁ గాక నీ విటు వి♦వర్ణత నొంది తి దేమిహేతువో
సుకముగ నెల్లవారలును ♦ జూడఁగ నొప్పిరె నీపురంబునన్
బ్రకృతిజనంబు నిన్గొలువ ♦ వచ్చునె ముచ్చట లేమి చెప్పు మో
ప్రకటితకీర్తి నీ విటకు ♦ వచ్చుట లచ్చెరు వయ్యె నియ్యెడన్. 85

క. నీవచ్చినకార్యము గో, త్రావలయమునందు దుష్క♦రమ యగునేనిన్
నావలన సఫల మగు నని, భావింపు మటన్న దనుజ♦వల్లభుఁ డంతన్. 86

ఉ. *రాముఁడు లక్ష్మణుం డనఁగ ♦ రాజకుమారులు మారసుందరుల్
కామినితోడ నేఁడు కుతు♦కంబున దండకకాననంబునన్
దామ వసించి శూర్పణఖఁ ♦ దాచి ఖరాదుల రాచి నారఁ టీ
యీమెయి నాకుఁ దోడ్పడితి♦వే బగ దీఱుతు వారి నోరుతున్. 87

వ. అనుడు మారీచుం డేచినభయంబున. 88

ఉ. ‡చాలుఁ బురే సురారివర ♦ సద్గుణధాముఁడు రాముఁ డన్న నా
హేళికులప్రదీపకున♦హీనపరాక్రమ మే నెఱుంగుదున్
బోలనివాక లేమిటికిఁ ♦ బొమ్ము పురారియు నేని తచ్ఛరో
ద్వేలజవంబు సైఁపఁ గల♦ధీరుఁ డొకో యని సంశయించెదన్. 89

మ. అతఁడే నాదగుతాపసిత్వమునకై ♦ నట్టిండు మున్ వానితోఁ
బ్రతిరోధించినదాన నా కిటులు సం♦ప్రాప్తించె లక్షించితే
ప్రతిపక్షుం డెవఁ డిట్లు నీకుఁ గలఁపెన్ ♦ శాపంబు నీ వింక లో
బ్రతుకు గాసింతువ యేని యిత్తెఱఁగునన్ ♦ రాకుండుమా రావణా. 90

వ. అనినం గ్రోధతామ్రాక్షుండై రాక్షసేశ్వరుండు మారీచుం జూచి భర్త్సించుచు
ని ట్లనియె. 91

క. నామాట వినవ యేనియు, నీమెయి ప్రాణములతోడ ♦ నిలువదు నన్నున్
సామాన్యునట్టు లెంచితి, వేమో నాశౌర్యసార ♦ మిా వెఱుఁగ వొకో. 92

తే. అనుడు మారీచుఁ డుల్లము♦నందు వీని, చేఁ దెగుట కన్న రాఘవు♦చేతఁ దెగుట
మే లని తలంచి రావణు♦మ్రోల నిలిచి, యటులగ వల దేను నీయాజ్ఞ♦ దలఁగువాఁడ.

* తాచు = ఖండించు, చెక్కు. రాచు = చెఱుచు. ‡ హేళి = సూర్యుఁడు.



చ. హితమును గోరి చెప్పితి న ♦ దిష్టము గాక మఱొక్క రీతి నీ
మతి కగు నేని నీదయిన♦మార్గమునం బ్రచరింతు నేను నో
హితుఁడ యిఁకం బొసర్ప నగు ♦ నెయ్యది నెయ్యము మిాఱఁ జెప్పు మా
గతిఁ బొసరింతు నన్నుఁ గుతు♦కంబున నాతని కాతఁ డి ట్లనున్. 94

ఆ. నీవు కనకమృగమ ♦ వై వడిఁ జని సీత, మోహపెట్టు మామె ♦ మోసపోయి
పట్టి తేర నిన్నుఁ ♦ బనుచు రాము నతండు, పెద్దదవ్వు నిన్ను ♦ వెన్నుదన్ను. 95

శా. *తలో లక్ష్మణుఁ డొంటు వోయెనుసహా♦యంబుం బ్రతీక్షించి నీ
హేలం జూపుము దాఁ నోట యినుమం♦తే లేక తత్పత్ని నా
పాలా లీలమెయిన్ గ్రహించుకొని పో♦వన్ వచ్చెదు దాన దు
శ్శీలుం డై విరహాగ్ని మ్రగ్గ నరి నా♦చిత్తంబు రేకెత్తఁగన్. 96

తే. అని వచించిన మారీచుఁ ♦ డపుడు తనకుఁ, దాన కావించుకొని తిలో♦దకము లిచ్చి
రావణునివెంట నడచె నా♦రాజవరుల, పర్ణశాలకు నొక్కింత♦ప్రాంతముగను. 97

వ. ఇట్లు నడచి యచ్చట. 98

మారీచుండు మాయామృగమై సీతకడకు వచ్చుట.

సీ. ‡పదియాఱువన్నె మేల్♦పసిఁడిసిగ్గులసంచుఁ, గాదు తా దనిపించు♦కాయ మలర
నంజకెంజాయల ♦ రంజిల్లి దివి వెల్గు, చుక్కలు నా మేనఁ ♦ జుక్కలమరఁ
బసిపచ్చతాపెంచు♦మిసిమికి నెనవచ్చు, కొన దేరి మెలి గొను♦కొమ్ము లెసఁగఁ
గొదమరత్నంబులఁ ♦ బొదలింపఁబను బాకు, పిల్లు నా డెక్కల♦కాల్లు దనర

తే. నీలములఁ బోలుకన్నులు ♦ నెఱిఁ దలిర్పఁ, బసుపునిగ్గులు గలమోర ♦ పస నెసంగ
నిలుకడలు లేనిబెదరుచూ♦పులు పొసంగ, నేచి మగలేడి యయ్యె మా♦రీచుఁ డపుడు.

వ. ఇట్లు మారీచుండు మాయామృగంబై జనకభూపాలనందినిపాలం బొడసూపుటయును.

చ. †రతనము లెల్లెడన్ నిలిపి ♦ రాజిలఁ జేసినపైఁడిబొమ్మ నా
నతికుతుకంబు గూర్చుచు వి♦హార మొనర్చెడుమాయలేడి నం
చితగతిఁ గాంచి చెంగటన ♦ సీత మహీతలనేత కమ్మహా
ద్భుతమును జూపి యి ట్లనియెఁ ♦ దొరవువేడుక లోడిగిల్లఁగన్. 101

తే. కనకమృగ మిద్ది యిట్టిది♦కలుగు ననుచుఁ, గనియు వినియు నెఱుంగ లో♦కమునఁ నెందుఁ
బ్రాణవల్లభ! దీనిని ♦ బట్టి తేర, మనసు పుట్టెను గాన నా♦మనవి గొనుమ. 102

* హేల = విలాసము: ఓట = పరాజయము. రేకెత్తు = వర్ధిల్లు. ‡ సంచు = అందము.
† ఓడిగిల్లు = ప్రవహించు, పఱుగెత్తు.

వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై రామచంద్రుండు చంద్రవదనప్రియంబు దీర్ప సమకట్టి దేవీరక్షణార్థ మట సౌమిత్రి నునిచి తాను ధనుర్బాణతూణీరఖడ్గాదిసాధనంబులు సంగ్రహించి మించినవేడ్క రుద్రుండు యజ్ఞమృగంబునుం బోలె నమ్మాయామృగంబు వెంట నంటి తఱుముచుం జనియె నదియును. 103

మ. బెదరుం బెన్వడిఁ బాఱుఁ జేరుఁ గడలన్ ◆ బిట్టాడు మట్టాడుఁ బెం
బొదలన్ డాయుఁ దృణంబు మేయు దివిపైఁ ◆ బొల్చున్ భువి న్నిల్చు లో
నాడుగుం బై కెదుగున్ మనోహరముగా ◆ నూఁగాడుఁ దోఁగాడు నూ
ర్చుఁ దగం బేర్చుఁ గనున్ వినున్ ముదము వొం◆చు న్నించు విద్వేషమున్. 104

వ. ఇట్లమ్మాయామృగంబు కొండొకవడి వ్యవహితంబును సన్నిహితంబును దిరోహితంబును దృశ్యంబు నదృశ్యంబు నై యవ్వనాంతరంబునం బరిభ్రమింప రామభద్రుండు దానివెంట నంటి పెద్దదవ్వు చని చని కొంతవడికిఁ దనమనంబున. 105

తే. మృగము గా దిది రాక్షస◆మృగము గాని,దీనిఁ బట్టెద ననునాన ◆ కాని దనుచు
నమ్ముగా నట్టియొక్క వా◆లమ్ముఁ దిగిచి , యేసె మాయామృగంబుపై ◆నేసుఁ జేసి.

తే.*రామబాణాభిహతుఁ డయి◆రాక్షసుండు,లాగి రామస్వరమును హా ◆ లక్ష్మణా! య
టనుచు హా సీత! యనుచు మ◆హార్తి నఱచి,ధరణిఁ బడిచచ్చెవిలవిలఁ◆దన్నుకొనుచు.

తే. ఆమెలుఁగు సీత విని భీత◆యై సుమిత్రా,పుత్రునిం గని యీయన్న ◆ రాత్రిచరుల
వలనఁ దగిలెనో నీ వేగి ◆ వనటఁ బాపు,మనుచుఁ దన్మార్గమునఁదాను◆నరుగఁజొచ్చె.

వ. సుమిత్రాసుతుం డామె వారించుచు ని ట్లనియె. 109

తే. ఏల శంకింతు భయశీలు◆రాల, రాము,నెవఁడు ప్రహరింప నోపు నీ◆భువనమందు
డెందమునఁ గుంద కిటు లూఱ◆డిల్లు మూతఁ, డింతలో వచ్చు నానంద◆మిచ్చునీకు.

వ. అని చెప్పిన నప్పూవుంబోఁడి పోఁడి గల దయ్యును స్త్రీస్వభావంబునం జేసి చేలయై దుఃఖించుచు నతిరూక్షాక్షరసమన్వితంబుగ లక్ష్మణుం జూచి యి ట్లనియె. 111

చ. వలవదు నీదుకోర్కి యిది ◆ వమ్మగు నోరి జడాత్మ! నేను నా
తలఁ దెగఁ గోసికొందు నసి◆ధార హుతాశనునందుఁ జొత్తు నీ
బలునగ మెక్కి క్రిందఁ బడి ◆ ప్రాణము వీడుదుఁ గాని రామునిన్
దొలఁచి నిను న్వరింపఁ బులి◆తొయ్యలి నక్క వరింప నెంచునే. 112

క.‡అని పలికినపరుషంబులు, తన చెవులన్ జూఁడినట్లు ◆ తాఁక సుమిత్రా
తనయుండు హరి హరీ! యని, విన నొల్లక మూసికొనియె ◆ వీనుల నంతన్. 113

* లాగు = ఆకర్షించు; అనఁగా రామునిస్వరమువంటిస్వరమును కలిగించుకొని యని భావము.
‡ చూఁడు = కాల్చు.



తే. కనఁగ నొల్లక మానిని ◆ ఘనభుజుండు, విల్లు నమ్ములుఁ గైకొని ◆ వెడలి పోయె
నన్న పోయినమార్గంబు◆నవుడు పట్టి, దొసఁగు శంకించియును బల్కఁ◆దోఁచ కపుడు.

రావణుండు మాయామునియై వచ్చి సీత నెత్తికొనిపోవుట.

సీ. కిసలయారుణసాంద్ర◆విస్ఫురద్వరజటా,పటలంబు సంజకెం ◆ పటమటింపఁ
జరమావలగ్నసుం◆దరతరైణాజినాం,తరరుంద్రకాలాభ ◆ మిరుల నీన
హారిదంశుకాంశుసం◆కరవిరళార్కాక్ష,మాలికోడుగణంబు ◆ లోలి వెలుఁగ
నతిశాంతరసలస◆దతులితాభిజ్ఞాన,చంద్రోదయవ్యాప్తి ◆ చదలఁ బొదల
తే. నాచరణశిరోంగనిరంత◆రావలిప్త,కలితసితభూతి పండువె◆న్నెలలు గాయ
రాక్షసుల కెల్లఁబ్రియమైన◆రాత్రియనఁగ, మాయకేరవై దశాస్యుఁడు◆మౌనియయ్యె.

వ. ఇట్లు యతివేషధరుండై రావణుండు నివుఱు గప్పిననిప్పువలె నొప్పుచు నప్పతివ్రతావతంసంబు నపహరింప నెంచి మించుఁబోఁడికట్టెదుటం బొడకట్టుటయును. 116

క. నిక్కపుముని యని తలఁచుచు, నక్కోమలి వాని ఫలజ◆లాదులఁ బూజన్
మక్కువఁ జేసిన నాతం, డక్కాంతయు దాని నొల్ల ◆ కొండొకలోనన్. 117

మ. పదిశీర్షంబులు నిర్వదై నకనులున్ ◆ బహ్వాయుధాఢ్యంబు లి
ర్వదిబాహార్గళముల్ దృఢం బగుపద◆ద్వంద్వంబు రత్నాంచితాం
గదహారాదివిభూషణంబులు మెయిం ◆ గ్రాలన్ మనుష్యాదుఁ డై
మదమాతంగము నాఁగ నొప్పి యతఁ డా◆త్మాపుత్రితో ని ట్లనున్. 118

ఉ.*రావణనామధేయుఁడను ◆ రాక్షసనాథుఁడ నేను మానినీ
నావరపత్తనం బది గ◆నం దగు లంక యనం బ్రసిద్ధమై
జీవనరాశిమధ్యమున ◆ జీవమణీగణమందిరాంచితం
బై వసుపూర్ణమై వసుధ◆యందుఁ బొసంగెనుస్వర్గమో యనన్. 119

మత్తకోకిలము.‡నాకు వల్లభవై జగత్త్రయ◆నాథకాంతలు గొల్వఁ గా
లోకసుందరి వైననీ వాక◆లోపముం గనఁ బోక సు
శ్రీకమై తగుమత్పురంబునఁ ◆ జె ల్వెసంగెదు చెల్వ లం
దాఁక లేక నమస్తభోగము ◆ లందు చుండుము మెండుగన్. 120

క. పుడమియుఁ గడిమియు సిరియున్, విడి మృగములచెలిమి యేవుడు ◆ వినుమక యిట్టి
య్యడవుల నిడుమలఁ గుడిచెదు,జడదారిం దగిలి యుంట ◆ చనునే నీకున్. 121

వ.†అని పలికినపలుకు లెల్ల ములుకు లైన నలుకుచుం జెవులు మూసికొని జానకి వాని
కి ట్లనియె. 122

* జీవనరాశి = సముద్రము. జీవమణి = కాంతిచేఁ బ్రకాశించురత్నము. వసువు = ధనము.
‡ ఆఁక = అడ్డగింత. † అలుకు = భయపడు.

ఉ. అక్కట యిట్టులాడుదె కులాంగన నన్నిదె నింగి యంతయుం
గ్రిక్కిలితోడఁ గూలిన ధరిత్రి సపర్వతకాననంబు గా
ముక్కలు ముక్క లైనను సముద్రము లింకిన వీతిహోత్రుఁడుం
జిక్కిలిచల్ల నైన నెలమిం విడి రాఘవు వీడుదాననే. 123

తరళము.*మదకలంబును మాని ధేనుక ♦ మంటిపందిని నంటఁ గా
నెదఁ దలంచున ద్రాక్షతేనియ ♦ లెంచి క్రోలెడుతేఁటి దా
నదటునం జని రేఁగుపూరస ♦ మానునే దురితాత్మ! నే
మదిఁ గలంగి నినుం వరింతునె ♦ మాట లేటికిఁ బొమ్మిఁకన్. 124

వ. అని క్రోధావేశంబున నధరం బదర బదరి పలికి కరంబులు విదిల్చికొనుచు నాశ్రమాభ్యంతరంబునకుం జనియె నంత రావణుండు నామె వెన్నుదన్ని చని పరుషస్వరంబునం భర్జించుటం జేసి మూర్ఛం బడి యున్న యయ్యన్నుమిన్న కొప్పు పట్టి తిగిచి పట్టుకొని నెట్టన నుప్పరంబున కెగసె నప్పుడు. 125

ఉ. హా రఘురామ! హా త్రిజగదంచితసువ్రతకామ! హా మహో
దారగుణాభిరామ! యిదె ♦ దైత్యకులాధముఁ డొక్కరుండు నీ
దార ననుం గ్రహించుకొని ♦ దక్షిణమార్గము పట్టి పోయెడిన్
గారుణికత్వ మేర్పడఁగ ♦ గ్రన్నన నన్ విడిపింప రాఁ గదే. 126

వ. అని మఱియును. 127

సీ. వేల్పులారా! నేలతాల్పులారా! మీరు, నావెతల్ దెల్పరే ♦ నావిభునకు
సిద్ధులారా! సుప్రసిద్ధులారా! మీరు, నావెతల్ దెల్పరే ♦ నావిభునకు
యక్షులారా! కార్యదక్షులారా! మీరు, నావెతల్ దెల్పరే ♦ నావిభునకు
సాధ్యులారా! పరాసాధ్యులారా మీరు, నావెతల్ దెల్పరే ♦ నావిభునకు
తే, తుషితులారా! జగత్త్రయహృషితులార!, విశ్వులారా! సురక్షితవిశ్వులార!
వసువులారా! మహాతపోవసువులార!, నావెతల్ మీరు దెల్పరే ♦ నావిభునకు.

జటాయువు రావణున కడ్డుపడి పోరుట.

ఉత్సాహము. అని యెలుంగు రాలుపడఁగ ♦ నద్ధరాత్మజాత యే
డ్చునెడ దదార్తరవము వినుచుఁ ♦ జెచ్చెరన్ జటాయు వన్
ఘనుఁడు గృధ్రరాజనూరునందనుండు దశరథే
శునకు సఖుఁడు వచ్చి చూచె ♦ గ్రుక్కి యున్న జానకిన్. 129

* మదకలము = మదపుటేనుఁగు; ధేనుక = ఆఁడేనుఁగు; మంటిపంది = మట్టిగొట్టుకొనినసూకరము. అదటు = గర్వము.



వ. క్రోధమూర్ఛితాంతరంగుండై వనం బెల్ల మార్మ్రోయ గర్జించుచు రాక్షసేశ్వరు దిక్కు మొగంబై యి ట్లనియె. 130

చ.*విడు విడు రాక్షసాధమ! పవిత్రచరిత్ర నరేంద్రపుత్రికన్
ముడిగొని పోవుచుంటి వెట ♦ వోయెదవో యెద యేద నిల్వు మే
నొడలను బ్రాణముల్ గలిగియుంటినయే నినుఁ బోవ నిత్తునే
మడిసితి వంచుఁ జెప్పితిని ♦ మానిని వీడక యున్న నిం కటన్. 131

వ. అని పలికి క్రోధతామ్రాక్షుం డై. 132

సీ. పక్షచ్ఛదాక్షేపవిక్షేపములచేత, నఖలాస్త్రశస్త్రాళి ♦ నపహరించి
తుండదండాఘోద్దండచండిమచేతఁ, దుండెతుండెములుగాఁ ♦ జెండి వైచి
ముఖవాస్త్రదృఢఖరనఖరాగ్రములచేత, రక్తప్రవాహంబు ♦ వ్యక్తపఱిచి
యంఘ్రిప్రఘాణబాధాఘాతములచేత, దిమ్మఁ దిరుగునట్లు ♦ ద్రెళ్లఁ జేసి
తే, తెగక సవ్యాపసవ్యముల్ ♦ తిరిగి తిరిగి, పైకిఁ గ్రిందికిఁ బేరెముల్ వాఱి పాఱి
పేర్చి యార్చుచుఁ బట్టి పల్లార్చి చేర్చి,చించి చెండాడె సురవైరిఁ ♦ జెన్ను దఱుఁగ.

మ.†ఘనదంభోళినదృక్షరూక్షతనుదక్షాయోగ్యగపక్షాంఘ్రిఘితుం
డనఘాత్యంతవిదారితాంగుఁ డగుచున్ ♦ రక్షోవిభుం డాక్షణం
బున భూరిక్షతజాంచితుం డయి తటోద్భూతేద్ధధాతుప్రరా
గనిబద్ధోన్నతనిర్ఝరావృతమహాగ్రావం బనన్ జొప్పడెన్. 134

వ. ఇట్లు ప్రహరింపంబడి రావణుండు. 135

ఆ. ప్రళయకాలరుద్రుపగిదిఁ గ్రోధవిఘూర్ణమానమానసుఁ డయి పూని ఖడ్గ
మండజేంద్రుగఱులు ♦ ఖండించె నాతఁడు, పవిహతాద్రిపోలెఁ ♦ బడియెఁ గ్రింద. 136

సీ. ఇటు జటాయువుఁ దెగ ♦ నేసి రావణుఁ డూర్ధ్వగతి సీతఁ గొనిపోయె నతిరయమునఁ
జనునప్పు డందందుఁ ♦ గని సాధ్వి నదులాశ్రమములు కోలంతు లమ్మార్గమందుఁ
దనభూషలం దీసి ♦ ధరఁ బడ విసుచుచు, దిక్కెవ్వరును లేక ♦ పొక్కిపడుచు
నొకకొండనెత్తమం ♦ దున్న యేవురు వానరశ్రేష్ఠులం గాంచి ♦ రమణ మించి
తే, శేషభూషణముల నూడ్చి ♦ చేలచెఱఁగు
నందు బంధించి పడ వైచె ♦ నదియు వాయు
వశమునం జేసి పడియె నవ్వారినమును
వారిదమునందు మెఱుఁగుఁదీవవలె నపుడు. 137

* ముడిగొను = ముడివెట్టు. ఎద = భయము. ఏదు = నశించు, పోవు.
† దంభోళి = వజ్రము. దక్షాయ్యము = గ్రద్ద. క్షతజము = నెత్తురు.

వ. అంత సీతాసమేతుండై రావణుం డతిరభసంబున సముద్రంబు దాఁటి బహుద్వార గోపురప్రాకారవప్రప్రాసాదభాసురంబును విశ్వకర్మనిర్మితంబును మనోహరంబు నగు లంకాపురంబునకుం జనియె నిట రామభద్రుం డామాయామృగంబు నట్లు మడియించి మరలి వచ్చువాఁ డెదురుపడినతమ్ముని గని యుదరిపడి యిట్లనియె. 138

రాముఁడు లక్ష్మణునితోఁ గలసి జటాయువున కుత్తరక్రియలు సేయుట.

ఉ. తమ్ముఁడ! తప్పు చేసితివి ♦ దారుణ మైనవనాంతరమ్మునం
దెమ్మెయిఁ జూతుమన్న భయ♦మే కనిపించెడు నిట్టిచో విచా
ర మ్మది లేక మీావదిన ♦ రక్కసిపా ల్పడ నొంటి డించి నీ
విమ్మహి కేల వచ్చి తిఁక ♦ నేమను వాఁడ విధాతృచేష్టికిన్. 139

క. రక్కసునిమాయ నే నిటు, మిక్కిలి ద ప్పైతి నీవు ♦ మీాఁ దెఱుఁగక యీ
చక్కి విడి వచ్చి తాసతి, దిక్కఱి యే మగునొ నాకు ♦ దిగు లయ్యె నయో.

తే. అనుచు వడివడి వచ్చెద♦నన్ను నరసి, సీత గర్హించి పలుకుట ♦ చెప్పి తప్పు
సైఁచుమనుటయు శ్రీరామ♦చంద్రుఁ డరిగె, నడలుగుడుచుచు నాశ్రమ♦ప్రాంతమునకు.

తే. ఉసురు వోయినమేన్వలె ♦ నువిదఁ బాసి
శూన్యమై యున్నయుటజంబుఁ ♦ జూచి మూర్ఛ
మునిఁగి రాముఁడు సౌమిత్రి♦మూాలమునను
సేదఁ దేఱెఁ గొండొకవడి ♦ కాదరమున. 142

వ. అంత రామలక్ష్మణు లిరువురును దరలి యిందు నందు సీతాన్వేషణంబు సేయుచు ముందఱ. 143

తరువోజ. పెనుగొండ వలెఁ గూలి ♦ భీమాకృతిని ♦ బృథివిపయిం బడి♦ బెట్టూర్పువానిఁ
గని గృధ్రరాజు రా♦క్షసుఁ డంచు నెంచి ♦ ఘనభుజా లస్త్రముల్ ♦ గైకొని డాయఁ
జనుటయు నతఁ డే ద♦శరథసఖుండ ♦ సంపాతితమ్ముఁడఁ ♦ జను న న్నెఱుంగ
నన వారు పితృనామ ♦ మాలించి వీని ♦ నరయుద మని చెంత ♦ కరిగి రొకింత.144

వ. అంత జటాయువు వారిం జూచి తనవృత్తాంతం బంతయుం జెప్పి. 145

తే. రావణుఁడు సీతఁ జెఱఁగొని ♦ పోవుటయును, దారిఁ దా నడ్డుపడి వానిఁ♦ దగులుటయును
దనదుగఱికోయి నాతండు♦తఱుగుటయును, నించు కించుక గా విన్న♦వించుటయును.

క. ‡ఆదశరథరాముఁడు కడు, సాదరముగ వానిఁ జూచి ♦ జానకిఁ గొని వాఁ
డేదెనకు నరిగె ననుడున్, రా దని నోర్ దెలిపెఁ దా శి♦రఃకంపమునన్. 147

† రాదనినోరు = అనఁగా మాట రాదు లే నని యభిప్రాయము.



వ. ‡అట్లు సూచించి జటాయువు విగతాయు వగుటయు రామలక్ష్మణు లింగితజ్ఞు లగుటం జేసి యది దక్షిణం బని యెఱింగి పితృసఖుం డగువానికిఁ బితృమేధవిధానంబున నగ్నిసంస్కారాద్యౌర్ధ్వదైహికం బంతయు నాచరించి దక్షిణమార్గంబు పట్టి చనుచు నపవిద్ధంబు లగుకుశాస్తరణంబులును విధ్వస్తంబు లగుకమండలువులును సన్నద్ధంబు లగు గోమాయుశతసహస్రంబులునుం గలిగి జనశూన్యం బై యున్నదండకారణ్యంబునందు ముందు దావాగ్ని దరికొన్నయట్లు వెఱచెఱచి పఱచుమృగయూథంబులమహాకోలాహలరవంబు శ్రవణకఠోరం బై తోఁచునంతలో నెట్టయెదుట. 148

రామలక్ష్మణులు కబంధుని సంహరించుట.

శా. కొండం బోనిమహోన్నతాంగము మహా♦ఘోరస్వరూపంబు ను
ద్దండోరస్స్థలసంస్థితాక్షులు సమిం♦ద్ధస్కంధయుగ్మంబు బ్ర
హ్మాండోద్యత్పృథులోదరాంతరమునం ♦ దాస్యంబునుం గల్గి రు
దురింద్రై మండుచు నుండఁ గాంచిరి కబం♦ధున్ బద్ధదుర్గంధునిన్. 149

ఆ. వాఁడు దావవహ్ని♦వలె వచ్చి యాదృచ్ఛికముగ నూర్మి శేష♦కరముఁ బట్టెఁ
బట్టినన్ విషాద♦భరితుఁడై యావీరుఁ, డన్న మొగముఁ జూచి ♦ యనియె నిట్లు.

మ. కనుఁగొంటే యిటు దైవసంఘటన మో♦కాకుత్స్థ సంక్రాగణీ
ప్రణుతింపం దగునీకు నాపదలె సం♦ప్రాప్తించుచుండెం గటా
మును రాజ్యచ్యుతి తాతపాదనిధనం♦బుం గాననావాసమున్
జనకక్ష్మావరకన్యకాహరణమున్ ♦ నా కిప్పు డిప్పాటునున్. 151

వ. అని మఱియును. 152

చ. జనకజతోడఁ గూడుకొని ♦ సాధుజనస్తుతవైభవంబునన్
దనరునయోధ్య కేగి వినుతంబుగ భూవలయాధిరాజ్యముం
గొని యభిషిక్తుఁ డై ననినుఁ ♦ గోరిక లీరిక లెత్త హర్షబా
ష్పనిభృతదృష్టులం గనెడు♦భాగ్యము వీనికి లేక పోయెఁ గా. 153

మ. †కుశలుల్ లాజలునున్ శమీాదళములున్ ♦ గూడం గుబాళించున
త్యుత్కశపూరంబుల రాజుగాఁగ నభిషి♦క్తుండై పరికాశించునీ
విశదాస్యంబు ఘనావరోధమునకున్ ♦ వే తైనరే వెల్గు నా
యశ మొందం గనువారు ధన్యతములై ♦ హర్షింతు రెల్లప్పుడున్. 154

వ. అని పలుఁదెఱంగులం బలవించుతమ్మునిం గని రామదేవుండు సంభ్రమసమయంబునందును సంభ్రమింపనిచిత్తంబు గలధీరోదాత్తుండు గావునఁ దత్తఱంపడ కిట్లనియె.

‡ ఔర్ధ్వదైహికము = చచ్చినవానికిఁ జేయుకర్మము.
† గుబాళించు = పరిమళించు. ఉత్కశపూరము = జలసమూహము.

తే. అన్న యోడకు మన్న నేఁ ♦ నున్నవాఁడ, నిటనచూడుమటంచుఁ బ్ర ♦ స్ఫుటముగాఁగఁ
బలికి శితఖడ్గమున వాని ♦ వామభుజము, నఱికి దక్షిణభుజ మీవు ♦ నఱకు మనియె.

వ. అనుడు లక్ష్మణుండును స్వార్థానుముఖవిముక్తుం డగుశీతభానుండో యనఁగ బంధభుజబంధవినిర్గతుం డై నిజాత్మద్రికౌక్షేయకంబున రాక్షసునిదక్షిణభుజంబుఁ దెగనఱికి పార్శ్వద్వంద్వంబు ఛేదించుటయు గతాసుండై కబంధుండు నేలం గూలె నంత వానిదేహాంతరమునుండి సూర్యాగ్నిసదృశదేహుం డగునొక్కదివ్యపురుషుండు పొడకట్టి నెట్టన నభంబునకు నెగయుచుండ రఘుకులతిలకుండు. 157

క. కని వాని నీ వెవండవు, మనమున నాశ్చర్య మయ్యె ♦ మాకు నెఱుంగన్
వినిపింపు మనుడు నాతఁడు, వినుతించుచు వాని కనియె ♦ విశ్రుతఫణితిన్. 158

సీ. జననాథ నేను విశ్వావసుం డనియెడు, వాఁడను గంధర్వ ♦ వంశజుండ
బ్రాహ్మణశాపంబు ♦ పరఁగినకతమునఁ, బస చెడి యిట్లు రా ♦ క్షసుఁడ నైతి
రావణాసురుఁడు సీ ♦ తాదేవి నపహరించి, లంకాపురి వసించె ♦ జంకు విడిచి
నీవు సుగ్రీవుని ♦ తో వఱలం జెల్మి, సేయు మాతఁడు నీకు ♦ సాయపడును
తే. విను మిటన ఋష్యమూకాద్రి ♦ దనరు దాని, కెలనఁ బంపాసరోవర ♦ మలరుచుండు
హంసకారండవాంచిత ♦ మగుచు నచట, నాతఁడుండును నల్వురు మంత్రు ♦ లంటికొలువ.

వ. మఱియు నాసుగ్రీవుం డన్నయగువాలివలన నాలిం గోలుపోయి నీవలె వనటం బడుచున్నవాఁడు వాఁడు రావణాదులవృత్తాంతం బంతయు నెఱింగి యున్నవాఁడ కావున నీ వాతనిం జేరి నీదుఃఖమూలం బంతయు నివేదింపుము నీకుఁ గార్యసిద్ధి యగుం బొమ్మని విశ్వావసుం డంతర్హితుం డయ్యె నంత. 160

రామలక్ష్మణులు పంపాసరోవరంబుఁ జేరి సుగ్రీవునితో సఖ్యము చేయుట.

మ. §చని వీక్షించిరి రామలక్ష్మణులు పంక్జ సజ్జలౌఘార్యమున్
ఘనసౌగంధికగంధబంధురతరం ♦ గప్రోచ్చలద్వ్రాజహం
సనితాంతారవతూర్య మార్యనుతచం ♦ చచ్చంచరీకోన్నత
స్వనసామశ్రీసారధుర్యము మహా ♦ పంపాసరోవర్యమున్. 161

వ. ఆపంపాసరోవరతీరంబున శ్రీరామచంద్రుండు సీతావిరహదుఃఖార్తుం డై విహరించుచు సరోజగంధబంధురంబును శిశిరంబు నైనవాతపోతంబు తుషారసమేతం బై వచ్చి తనమే నల్లనం దాఁకుటెంచి చిత్తజానలంబు దరికొల్పినఁ దాల్మి నిల్పఁ జాలక చిత్తంబునఁ దత్తఱంపడి మత్తకాశినిం దలంచుచు మిగుల వగలం బొగిలి సొగిలి విలపింపం దొడంగె నప్పుడు సౌమిత్రి రామమూర్తి దిక్కుమొగం బై.

§ ఆర్యము = పూజ్యమైనది, మంచిది.



చ. నిరుపమతత్త్వవేత్త వగుంసీ యిటు లజ్ఞునిఁ బోలి బేలవై
దురపిలఁ బోలునే దురిత ♦ దూరుని బ్రహ్మవిదగ్రగణ్యునిం
బురుషుని వ్యాధు లాధులును ♦ బొందుట లబ్రము సూవె దేవ నీ
వరయుము తాల్మిఁ జేసి హృద ♦ యంబునయందు జగత్ప్రవృత్తమున్. 163

చ. తెలియఁగ విన్ము నాపలుకు ♦ దేవరకుం జనకాత్మజాతవా
ర్తలు విన వచ్చె నిచ్చటన ♦ తచ్చన లాడుచు నుండ కామెఁ దేఁ
దలఁపుము శౌర్య మేర్పడఁగ ♦ దాపున నుండు హరీశ్వరుం డటన్
జెలిమిఁ బొనర్పు మేఁ గలను ♦ శిష్యుఁడ నీ కిటు చింత యేటికిన్. 164

వ. అని విన్నవించిన రామచంద్రుండు ప్రకృతిధర్మంబు నొంది కార్యాలోచనతత్పరుం డయ్యె నంత వా రిరువురును బంపాసరోవరసలిలంబులం గృతస్నానులై దేవర్షిపితృతర్పణంబులు గావించి కదలి నానావిధఫలానోకహం బగుఋశ్యమూకంబుఁ జేరం జని యున్నంతఁ దదగ్రభాగంబున ధీసచివచతుష్కసమేతుం డై విహరించు సుగ్రీవుండు వారిం జూచి తదుదంతం బంతయు నెఱుంగం గోరి. 165

మ. పనిచెన్ మంతుని బుద్ధిమంతుని జగ ♦ ద్వర్ణ్యప్రభావంతునిన్
మునిలోకాదృతశాంతునిన్ త్రిభువన ♦ ప్రోద్యద్యశఃకాంతునిన్
ఘనవృత్తాంతుని దాంతునిన్ సుజనప ♦ క్షస్వాంతునిన్ శౌర్యవం
తుని నక్లాంతుని ధైర్యవిద్ధహిమవం ♦ తున్ శ్రీహనూమంతునిన్. 166

క. పనిచిన హనుమంతుఁడు చని, తన తెఱఁ గెఱిఁగించి వారిఁ ♦ దా నెఱిఁగి తగం
గొనిపోయి నృపకుమారుల, వనచరపతి కెఱుఁగఁ జేసె ♦ వాత్సల్యమునన్. 167

సీ. సుగ్రీవుఁడును నృప ♦ సుతులతో సఖ్యంబు, గావించి యెంతయుఁ ♦ గౌతుకమున
ననురాగపూర్ణ యయి ♦ వెసఁ బోవుజానకి, విడినట్టితొడవుల ♦ ముడియఁ దెచ్చి
రాముని కిచ్చిన ♦ నామహాత్ముఁ డా, భూషలం గని సూర్య ♦ పుత్రు మెచ్చి
ప్లవగాధిపత్య మీఁ ♦ బలికి వాలిని జంపఁ, బ్రతిన పట్టుటయు నా ♦ భానుజుండుఁ
తే. బ్రతిన వట్టను జానకి ♦ వెతకి తేర, నట్లు సమయంబు నడిపి వా ♦ రపుడు విడని
కరణి విశ్వాసమును జేసి ♦ కదిసి వాలిఁ, జంపఁ గిష్కింధకరిగి రా ♦ సమయమందు.

సుగ్రీవుఁడు వాలితోఁ బోర నరుగుట.

వ. సుగ్రీవుండు కిష్కింధానగరోపకంఠంబునకుం బోయి రోదసీకుహరం బవియ రంహంబుగ సింహనాదంబు సేయుటయు వాలి వానిం దెలిసి సమరసన్నాహం బమరించుకొని దాడి వెడలం దలంచి యున్నప్పుడు తార వారించి యి ట్లనియె.

శా. కీశాధీశ్వర! నీకు నోడి మును సుగ్రీవుండు గ్రావంబులం
బ్రాశస్త్యం బఱి యుండువాఁ డిపుడు పూర్వం బట్లు గాఁ గొక్క భూ
మీశప్రాగ్ర్యుని ప్రాపునం బ్రబలి తా నీరీతి నిన్ మార్కొనం
గా శంకింపక వచ్చె నిచ్చటికి నిక్కం బిట్లు వాక్రుచ్చితిన్. 170

చ. *మునుపటివాఁడు గాఁ డగుటఁ బోరున కీవు గడంగి పోవుటల్
వనచరనాథ! కీడునకు వచ్చును గావునఁ జెప్పుచుంటి నా
విని వనచారి తారఁ గని వేఱిఁడి వాఁ డిపు డేరిపంపునన్
ననుఁ జెనకంగ వచ్చె నెలనాఁగ! యెఱుంగుదు వేనిఁ జెప్పవే. 171

తరువోజ. అనఁ దార యిట్లను నంతరంగమున నరసియొక్కింతలో నధిప! దశరథ
తనయుండు రాముఁ డనఁ దలితారి యొకఁడు తమ్ముఁడు సౌమిత్రి తన్నంటియుండ
వని వాలిఁ గోల్పోయి వనటఁ గ్రుమ్మరుచు వచ్చి సుగ్రీవునివలన సఖ్యంబు
పొనరించినందునఁ బురికొని యతఁడు పోరొనర్పఁగ వచ్చెఁ బూని నీతోడ.

తే. మేటివిలుకాఁడు కోసలమేదినీశ,నందనులు ఘనుల్ ద్వివిదుండు మైందుఁ డనిల
తనయుఁ డనుజాంబవంతుఁడుఁ దనకుఁదోడు,పడుట సుగ్రీవుఁ డిప్పుడు ప్రబలుఁడయ్యె.

క. అని విన్నవించి తన్నటఁ, జనవల దనుతారమాట సరకు గొన కెదన్
వనచరుఁడు దాని సుగ్రీవుని దానిగ నెంచుచుం దవ్వుం దవు ననుచున్. 174

వ. †పరుషాక్షరంబుల నధిక్షేపించి తత్క్షణంబ గుహాముఖంబునుండి వెడలి మాల్యవ
దభ్యాశంబున నున్న సుగ్రీవునికడం బొడసూపి కోపంబున నిట్లనియె. 175

చ. తడవలు పెక్కు నన్ గలనఁ దాఁకి జయం బన నెట్టిదో వినం
బడమి వడంకుచున్ వెఱచి పాఱితి సిగ్గు దలంప కీను న
ప్పుడు సహజుండ పొమ్మనుచుఁ బుచ్చితి నిన్ గరుణించి చంప కి
ప్పుడు బ్రదుకంగ నాస విడిపోయెనె వచ్చితి విట్లు వేఱిఁడీ. 176

వ. అనిన సుగ్రీవుండు వాని కిట్లనియె. 177

తే. ప్రాణములకన్నఁ బ్రాణమై ప్రాలునాలు
రాజ్యమును గోలుపడి యిలం బూజ్యత చెడి
యున్నవా కీయెడల్ కాల్పనో యటంచుఁ
దెగువమెయి వచ్చితిని నిన్నుఁ దగిలి పోర. 178

వ. అంత వారొండొరుం గవిసి. 179

* వేఱిఁడి = అవివేకి, † అభ్యాశము = సమీపము, దాపు.



## వాలిసుగ్రీవులయుద్ధము.

మత్తకోకిలము. సాలతాలశిలాయుధంబు లెసంగఁ దాలిచి లీలమై
నోలి వ్రేయుచు డాయుచుం గడునుద్ధతిం గొని క్రుద్ధులై
కోలుపోవక కోల్పులు ల్బలెఁ గ్రోల్చి కోల్తల హెచ్చఁగా
నాలముం బొనరించి రెల్లరు నద్భుతంపడి మెచ్చఁగన్. 180

శా. కొండం గొండయుఁ దాఁకి పిండియగుచుం గుండల్ బలెం గూలుచో
మొండై చప్పుడు పుట్టి బిట్టవిసె నా మిన్నంతయున్ బ్రోసె నొం
డొండై లేచిననిప్పు లుప్పరమునం దొప్పెన్ గడున్ మంటలై
గుండెల్ దీసినబంటు లయ్యిరువురున్ గోరాడి పోరాడఁగన్. 181

వ. అంతం గొంతవడికి మల్లయుద్ధసన్నద్ధులై. 182

ఉ. ఒండొరు ముష్టిఘాతముల నుద్ధతిఁ జూపుచు బిట్టు మట్టుచున్
గొండొక త్రోయుచుం దిగిచి కొట్టుచుఁ బట్టుచుఁ బెట్టు వెట్టుచు
ద్దండపరాక్రమంబునను ధారుణి గ్రక్కదలంగ మెట్టుచున్
గొండయుఁ గొండయుం బలెను గూడుచు వీడుచుఁ బోరి రార్చుచున్. 183

శా. పక్షిద్వంద్వము వ్రాలె బిట్టగయుచుం బాదమ్ములం గొట్టుచున్
బక్షోచ్ఛేదము సేయుచున్ విసరి క్రిందన్ ద్రేయుచుం ద్రోయుచున్
రక్షప్రక్రియఁ బెద్దప్రొద్దిటులు పోరన్ రక్తసిక్తాంగులై
వీక్షింపం దగి రిద్దఱున్ సుమచయావేల్లత్పలాశక్రియన్. 184

వ. ఇట్లు వాలిసుగ్రీవు లిద్దఱును బద్ధమత్సరు లయి నియుద్ధంబు సేయుచుండ రాఘ
వుండు వారి నేర్పరింపఁ జాల కూరకున్న నెఱింగి హనుమంతుం డభిజ్ఞానార్థం బొక
సుమదామం బా సుగ్రీవునఱుతం బెట్టె నంత రఘురాముండునుఁ గొండలుమాఱు
మ్రోయ ధనుష్టంకారంబుఁ గావించుచుఁ గోదండంబున నమోఘం బగు నొక్క
దివ్యబాణం బరివోసి వాలివక్షస్స్థలంబు వ్రక్క లగునట్లు లేసె నేసిన నతండు
ముక్కుల నోట నెత్తురు గ్రక్కుకొనుచు నేలం గూలి కట్టెదుర నున్న దాశరథిం
దూల నాడుచుఁ బ్రాణంబులు విడిచె నంత. 185

క. ఇనసుతుఁడు రామునను మతిఁ, జని కిష్కింధాపురంబు సంతోసమునం
గొని తొంటియట్ల తారం, దనవసితఁగఁ జేసికొనియెఁ దత్పరతమెయిన్. 186

వ. రామదేవుండును సుగ్రీవసేవితుం డై మాల్యవత్పృష్ఠంబున వర్షాగమంబు నన
నాల్గుమాసంబు లధివసించె నంత నక్కడ రావణుండును. 186

మత్తకోకిలము. తాపసాశ్రమసన్నిభం బయి ♦ తద్దయుం బొలుపొంది లం
కాపురంబున నౌనశోకసు♦కాననంబునఁ దాపసీ
రూపముం గొని చిక్కి మిక్కిలి ♦ రోఁజుచున్న మహీసుతం
దాఁపి కాపుగఁ బెట్టెఁ జుట్టును ♦ దైత్యదానవకాంతలన్. 188

వ. వారును బ్రాసాసి శూల పరశు పట్ట సాలాత ముసల ముద్గర పరిఘాద్యాయుధంబులు ధరించి పరివేష్టించి యుండి రందు నేకాక్షి ద్వ్యక్షి త్ర్యక్షి లలాటాక్షి దీర్ఘజిహ్వ యజిహ్విక త్రిస్తని యేకపాద యేకలోచన లోనగువారు వికృతాకారంబులు గ్రాల రేఁబవ:శ్లిడయకి పరుషవ్యంజనస్వరంబున భర్జించుచు నమ్మించుఁ బోఁడిం గాంచి. 189

ఉ. సుందరి నీవు మాప్రభుని ♦ సుందరవిగ్రహు రావణేశ్వరుం
బొందవ యేని కత్తులను ♦ మొత్తుచు నిత్తఱి నిన్నుఁ బట్టి మే
మందఱ మొక్కపెట్ట తిల♦లంతలు గా విభజించి నీయొడల్
తిందుము నల్లఁ ద్రావుదుము ♦ తీఱెను నీబ్రతు కింతమాత్రలోన్. 190

వ. అని తర్జనభర్జనంబులం గర్జించి పలుకుచున్న వాండ్రపలుకుల కళుకుఁ జెందక భర్తృశోకసమాకీర్ణ యగుసీత బెట్టు వెట్టనిట్టూర్పు నిగిడించుచు నిట్లనియె. 191

ఆ. తల్లులార మీరు ♦ తడయక ననుఁ జంపి, తినుఁడు బ్రదుకునాన ♦ తీఱె నాకు
ఘనునిఁ రామచంద్రుఁ ♦ గాక వేఱొక్కని, నేను వినఁగ నొల్ల ♦ నిది నిజంబు. 192

వ. ఇంక మీకుఁ బోలినభంగిం జేయుం డని చెప్పిన విని రాక్షసాంగన లెల్లరు నామెనిశ్చయంబు రాక్షసేశ్వరున కెఱుంగఁ జెప్పుటకుం జని రప్పుడు త్రిజట యనురాక్షసాంగన వైదేహిం గని సాంత్వనపూర్వంబుగా నిట్లనియె. 193

త్రిజట తనస్వప్నవృత్తాంతము సీతతోఁ జెప్పుట.

ఉ. అమ్మరొ నమ్ము నానుడి భ♦యమ్మది వీడు మపంథ్యుఁ డన్ నెఱిన్
బమ్మినవాఁడు రాక్షసుఁడు ♦ భవ్యమనస్కుఁడు నిన్నుఁ దేర్పఁ గా
సిమ్మెయి నీకుఁ జెప్ప మని♦యెన్ విను రాముఁడు లక్ష్మణుండు నే
మమ్మున నున్నవారు గరి♦మం గపిరా జొకరుండు తోడు గన్. 194

తే.* వారు వనచారిపింకుతో ♦ వామనేత్ర, నిన్ను విడిపించువనికినై ♦ యున్నవారు
వత్తు రట బల్మిఁ జేసి రా♦వణుఁడు నిన్నుఁ, బట్టఁ బోఁడు కౌబేరిశా♦పంబు గలదు.

* కౌబేరి = కుబేరునికొడుకు నలకూబరుఁడు; పరస్త్రీని బల్మిమెయిం బట్టినప్పుడు చత్తు వని రావణుని నలకూబరుఁడు రంభకారణంబున శపించె నని కథ కలదు.



క. వలవదు భయపడ నీకుం, గలఁ గంటిన్ మఱియు వినుము ♦ గరితరొ దానన్
గులపాంసనుండు రావణుఁ, డలజడిఁ బడి తెగుట నిక్క ♦ మన్నులమిన్నా. 196

చ.* కల విను మెట్టిదో తెలియు ♦ గర్దభయుక్తరథంబు నెక్కి దు
ర్నిలయుఁడు రావణాసురుఁడు ♦ నృత్యము సేయుచు దక్షిణంబుగా
నిలుగుచు నేగె వెంబడిన ♦ నిల్వక పోయిరి కుంభకర్ణము
ఖ్యులు నెఱి పీడ నగ్నులయి ♦ కొం చరుణాంబరపుష్పగంధముల్. 197

ఉ. తెల్లనిపాగఁ జుట్టుకొని ♦ తెల్లనిదండలు దాల్చి మేనునం
దెల్లని వస్త్రముల్ దొడిగి ♦ తెల్లనిపూఁత విభీషణుండు దాఁ
దెల్లనికొండ యెక్కి తన♦ధీసచివుల్ వెనువెంట నంట మా
కెల్లభయంబు వాపి నటు ♦ లేఁ గలఁ గంటిని వింటివే సతీ. 198

సీ. రాముఁడు తనయశో♦రాశి దిక్కులఁ బర్వ, శరవర్షమున నించె ♦ ధరణి యెల్లఁ
నస్థిసంచయ మెక్కి♦సుస్థితిం గొని లక్ష్మణుఁడు పాయసాన్నముఁ♦గుడుచుచుండె
రక్తసిక్తాంగి వై ♦ రక్షింపఁ బడి •పులి, రాజుచే నీ వుత్త♦రముగ నరిగి
తిటులు నేఁ గలఁగంటి ♦ నిది నిక్కలయె సుమ్మి, నీ వింతలోనన♦నీదువిభునిఁ

తే. బొందిహర్షంబు నొందెద♦విందువదన, కుందకు మటంచుఁ♦ దెలిపినఁ♦గొంతవనట
దక్కియుండెను జానకి ♦ తనకు విభునమాగమం బగు నని యెసు♦నాసఁ జేసి. 199

సీతారావణసంవాదము.

వ.† అట దశగ్రీవుండును సీతవృత్తాంత మంతయును విని దేవదానవయక్షరాక్షసగరుడగంధర్వకిన్నరకింపురుషాదులం గెలిచియుఁ గందర్పుం గెలువఁ జాలక దివ్యమాల్యాంబరాభరణాదులు ధరించి సంకల్పవృక్షసదృశుండై‡ యుండియు శ్మశానవృక్షంబుచందంబున భయంకరుండై శనైశ్చరుండు రోహిణిం బోలె రాక్షసాంగనాజనపరివృత యగుసీతాదేవిం జేర వచ్చి కొలువులిం జూచిన లేటిబోటివలెఁ దన్నుం జూచి సంభ్రమించుచున్న మించుఁబోఁడిం గాంచి యిట్లనియె. 200

క. నీపతిపయిఁ గలకూరిమి, నాపయి నీవ నిలునఁ జేసి ♦ నన్నుఁ బ్రసన్న
శ్రీపరివృతదృష్టిం గని, నాపడఁతులమిన్న వగుచు ♦ నలువొందఁ గదే. 201

మ. నను సేవించుచు నుండ్రు నిచ్చలును గం♦ధర్వాంగనల్ దైత్యమా
నినులున్ దానవకామినీమణులు స్వ♦ర్ణీలాలకల్ నాగభా
మినులుం గిన్నరకాంతలున్ మిగుల నా♦మే లెంచి పీ రందఱున్
నిను సేవింతురు నాకు దేవి వయినన్ ♦ నీరేజపత్రేక్షణా. 202

† నగ్నులు = దిస మొలవారు. ‡ సంకల్పవృక్షము = కల్పవృక్షము;

చ.*భువనములెల్ల నేలఁ దగి • భూరిభుజాబలశాలినై సుర
ప్రవరులఁ దోలి తోరముగఁ • బ్రస్తుతి కెక్కినన న్నుఁ బ్రేముడిం
దవులక కూటిపేద యయి • దారి యెఱుంగక కాఱుకానలో
నవమతి నున్న యొక్క మనుజాధముపైఁ దగు లొందు టర్హమే. 203

వ. త్రిలోకేశ్వరుండ నగునాకుఁ గింకరులై పదునాలుగుకోట్లు పిశాచములును నిరువది యెనిమిదికోట్లు రాక్షసులును నెనుబదినాలుగుకోట్లు యక్షులును గలరు వారెప్పుడును నన్ను సేవించి జీవించుచుందురు మఱియును. 204

సీ. అఖిలధనాధ్యక్షుఁ • డైనయక్షేశ్వరుఁ, డగ్రజన్ముఁడు నాకు • నతివమిన్న
బ్రహ్మర్షియై మహా•ప్రతిభ గాంచినవిశ్రవసుఁడు నాజనకుండు • వనజనేత్రి
పంచముఁ డగులోక•పాలుఁ డితం డని, సన్ను జగం బెంచు • నన్నతాంగి
ధనదుఁ గొల్వఁగఁ బోని•ఘనులు గంధర్వులు, ననుఁ గొల్వ వత్తురు • నలినపాణి
తే. భక్ష్యభోజ్యాదివస్తువుల్ • వాసవునకు, బలెను నాకును నక్షయ•మ్ములు తలంప
నిట్లు వనులనుండి కృశింప • నేల నాకు, నీవు మందోదరింబోలి • దేవి వగుము.

తే. ఇట్లు ప్రలవింప సీత క•న్నెఱ్ఱఁ జేసి, పెడమొగము వెట్టి తృణ మడ్డు • పడఁగఁ దాల్చి
కన్నుఁగవ నీరు కాల్వలై •కాఱుచుండ, హీనుఁ డగువానిదెసఁ జూడ•కిట్టులనియె.

మ.‡పలుమాఱిట్టులు పల్కరానిపలుకుల్ • పల్కంగ నీ వేను నా
తలవ్రా లిట్టులు తప్పి యున్నకతనన్ • దాల్మి న్విసం గల్గితిం
దెలియం జెప్పెద నాలకింపు మెద నం•ర్థింతేని భద్రంబులం
గలఁగంబాఱిననీదుచిత్తమును జం•క్కం జేసి కో నొప్పెదున్. 207

చ.†గరితఁ బరాగనం బరులఁ • గానఁ దలంపనిసువ్రతంబునం
బరఁగినదాని మానవతి • మానవజాతికి నైనదాని న
న్నరతి నెనంగుదానిఁ గల•యంగ మనం బెటు నీకుఁ బుట్టెనో
కర మరయంగ నా నిట సు•ఖం బన నెట్టిదొ రాక్షసేశ్వరా. 208

చ.§అదియును గాక బ్రహ్మసముఁ • డై మహిమోన్నతి ముజ్జగంబులం
బొదలినవిశ్రవోమునికిఁ • బుత్త్రుఁడ వయ్యు మహేశుమిత్త్రుఁ డై
త్రిదశసమర్చితుం డయిన•దేవునకున్ సయిదోడ వయ్యు నీ
వెడఁ దల పోయవైతి గద•వే యిసుమంతయు నేని ధర్మువున్. 209

* అవమతి = అవమానము, లేక బన్నము. ‡ తల(వ్రాలు = తలయందు వ్రాసినయక్షరములు. అనఁగా నదృష్ట మని భావము. † అరతి = అనిష్టము. § మహేశుమిత్త్రుఁడై త్రిదశసమర్చితుఁడైన దేవుఁ డనఁగాఁ గుబేరుఁ డని యర్థము.



వ. అని పలికి భయాతిశయపరికంపితశరీరయై చేలచెఱంగున మొగంబు గప్పుకొని యేడ్చు చున్నయది రావణుం డానిష్ఠురోక్తులు విని పరిత్యాఖ్యాతుం డయ్యు దుర్మేధసుం డగుటం జేసి వెండియును. 210

చ.†అతికుపితుండు మన్మథుఁ డ•హర్నిశము న్నను నొంపఁ జొచ్చె నా
బ్రతు కిది సంశయింప నయి • బామున కయ్యె నిఁ కేమి సేయుదున్
మతి చెడి నిన్ను వేఁడితిని • మానిని! నీమది నావయిం బడం
గొతికెదు మాకుఁ దిండి యగు•కొంచెపుమానిసి నెంచు నక్కటా. 211

వ. అని పలికి రాక్షసేశ్వరుం డటయేనియుం బోయె నటన వైదేహి రాక్షసీగణపరివృత యై త్రిజటాభిసేవ్యమాన యై యుండె నంత నక్కడఁ గౌసల్యానందనుండు మాల్యవత్కందరమందిరాంతరంబున దున్నహంబు లగుఘనసమయవాసరంబు లెట్టకేఁ గడవ నీఁది పిదప వినిర్మలాకాశమండలంబును సాంద్రచంద్రాతపసమంచితంబును నక్షత్రతారాభిరమ్యంబును గుముదోత్పలగంధబంధురగంధవాహసంభృతంబును నతిదీర్ఘయామంబును విరహోద్దీపకంబు నగుశారదనిశాసమయం బపనయింప నోప కొక్క ప్రభాతంబున సౌమిత్త్రిం బిలిచి యి ట్లనియె. 212

రామచంద్రుండు సుగ్రీవునికడకు లక్ష్మణుం బుచ్చుట.

తరువోజ.‡కనుఁగొంటె తమ్ముఁడా • కపిరాజ్యపట్ట•కముఁ గొన్నసుగ్రీవు•కఱటితనంబు
ఘనభుజు వాలిని • గడతేర్చి తనకుఁ • గనువైభవం బిడఁ • గలిగినమనలఁ
గన రాఁడు విన రాఁడు • గామ్యధర్మములఁ • గలసి కృతఘ్నుఁడై • కనుగానకుండెఁ
గనుకట్టు చేసిన•కరణిఁ గన్పట్టెఁ • గడఁకఁ జేసినవాని•ఘనసమయంబు. 213

మ. చని కిష్కింధకు నీవు స్వార్థపరతం • జర్చింపఁగా నున్నమ
త్తుని సుగ్రీవుని వాలిమార్గమునయం•దుం బోఁ బొనర్పంగ నొ
ప్పును దా నింతకుమున్న నాదుపనిపైఁ • బొల్పొంది యున్నం దయం
గని తోడ్తె మ్మిట కొంచు పల్కి కతనిం • గాకుత్స్థవంశోదయా. 214

వ. అని పనిచిన లక్ష్మణుం డప్పుడ విల్లు నమ్ములుం గొని కిష్కింధాపురమ్మునకుం జని లోకభీకరమ్ముగ ధనుష్టంకారమ్ము గావించుటయు సుగ్రీవుం డతనికోపం బెఱింగి సదారుండై యెదురు వచ్చి వినయం బినుమడింపఁ బూజించినం బరిగ్రహించి సుమిత్త్రాసుతుం డార్యవచనం బెఱింగించిన విని కృతాంజలియై ప్లవగేశ్వరుండు వాని కి ట్లనియె. 215

† కొతుకు = సంకోచించు.

‡ కఱటితనంబు = వంచన; కనుకట్టు = జాలవిద్యావిశేషము; కనుచుండఁ గన్నుం గప్పుచున్నది.

ఉ.*ఏటికి నేఁ గృతఘ్నుఁడ నె ♦ యేటికిఁ బల్కఁగ రామచంద్రుఁ డే
నేటికి నిర్ఘృణుండ విను ♦ మెల్లకడల్ గలయంగఁ గ్రిమ్మరన్
బోటరులన్ వనాటులను ♦ బుచ్చితి వారొకమాస మేగులోఁ
బాటిగ నేల యెల్లఁ గని ♦ వచ్చెద రిచ్చితి నాజ్ఞ వారికిన్. 216

ఉ. ఆనెల కేనువాసరము ♦ లంతరమందుఁ గొఱంత యుండె నా
పై నెలనాఁగ వార్తఁ గొని ♦ వచ్చిరఘూద్వహుఁ గొల్చువాఁడ నై
నేను దలంచి యుంటి నిది ♦ నిక్కము నా విని సంతసించి రా
మానుజుఁ డన్నసన్నిధికి ♦ నాతనిఁ దోడ్కొని పోయెఁ గ్రన్ననన్. 217

తే.‡రాముఁడును వానిచేఁతకు ♦ రమణ మెచ్చి, యంతరంగమునం గడు ♦ సంతసించి
కపివరులరాకకై వేచి ♦ కాచి యుండె, నంతఁ గతిపయవారము ♦ లరిగినపుడు. 218

క.†దక్షిణదిశకుం బోయిన,వృక్షచరుల్ గాక వచ్చి ♦ రెల్లరు సీతన్
లక్షింపఁ జాలకయ్యది, రూక్షాశని నోలె రాము ♦ రూపఱఁ జేసెన్. 219

వ.%అంత నంతకాశాగతు లగువా రాగతులై నై దేహివార్తం దెత్తు రనునాసం జేసి కౌసల్యానందనుండు తనప్రాణంబు లుగ్గఁబట్టుకొని యుండె నవ్వల మఱియునొక్కమాసంబు కడచనినప్పుడు కొందఱు వనపాలురు వచ్చి సుగ్రీవుం గాంచి యి ట్లనిరి.

ఉ.§వాలియు నీవు నీప్రజలు ♦ వావిరిఁ బెంప జగత్ప్రసిద్ధికిన్
దాలిక యైననీమధువ♦నంబునకుం బవమానసూనుఁడున్
వాలిసుతుండు లోనయిన♦వారలు వచ్చి మధుద్రవంబునున్
మే లగువంట్లును న్మెసవి ♦ మెచ్చక పోయిరి మన్నుమ వింటివే. 221

చ. అనవుడు వారు దక్షిణది♦శాగతు లై నప్లవంగసత్తముల్
జనకజఁ జూచి వచ్చి రిది ♦ సంతసముం గొని చేసినట్టిదే
యన నగుఁ గార్యసిద్ధిఁ గొని♦నట్టిభటాలికి నిట్టు లెల్లు నం
చని తలపోసి సూర్యసుతుఁ ♦ డంతయును న్వివరించె జేనికిన్. 222

వ. రామచంద్రుండును వారు మైథిలిం జూచినవారొకో యని యనుమానించె నంతఁ గొంతవడికి హనుమదాదు లరుదెంచి రామలక్ష్మణసుగ్రీవులం గని మ్రొక్కిన వారు

* వనాటులు = వానరులు. ‡ వేచు = ప్రతీక్షించు; కాచు = సహించు.
† రూక్షాశని = తీవ్రమైనపిడుగు. % అంతకాశ = దక్షిణప్రదిక్కు; ప్రాణంబు లుగ్గఁబట్టుకొని యుండె = అనఁగా నెట్లో కష్టమై జీవించియుండె నని యభిప్రాయము. § వావిరి = క్రమము. తాలిక = చాలినది.



వారిముఖవర్ణవిలాసంబు లరసి వీరు జానకిం జూచి వచ్చినవారకా యని తలంచుచుండె నపుడు రఘురాముండు ధనుర్బాణంబులు ధరించి వారిం గాంచి యి ట్లనియె.

ఆ. అన్నలార! మీర ♦ లనద నన్ బ్రదికింతు,రే? కృతార్థు లైతి♦రే? యయోధ్య
యందు మరల రాజ్య ♦ మంది నాచేత నే,లింతురే? వచింపుఁ ♦ డింతలోన. 224

చ. అనిమొన శత్రులం దునిమి ♦ యాజనకాత్మజఁ దేక యున్నచో
వనితను బాసి రాజ్యమును ♦ బాసి సగోత్రులఁ బాసి జోగి నై
తనువునఁ బ్రాణవాయువులు ♦ దాల్చి వగ న్మొగులంగ లేను నే
ననవుడు సంజనీతనయుఁ ♦ డాదల నంజలిఁ జేర్చి యి ట్లనున్. 225

హనుమంతుఁడు రామునితో సీతం జూచినవృత్తాంతము చెప్పుట.

క. కనుఁ గొంటి సీత దక్షిణ,వననిధి కవ్వల మహాప్ర♦భం దగి రక్షో
జనసంభృత మై నుత మై, చనులంకాపురమునందు ♦ జననాథమణీ. 226

సీ. అవధరింపుము దేవ ♦ యస్మత్ప్రయాణప్ర,కారము మే మెల్లఁ ♦ గదుపు గట్టి
కదలి దక్షిణపుమా♦ర్గము పట్టి చని చని, యడవులుఁ గొండలు ♦ సరసి యరసి
బడలి కొన్నాళ్ళకు ♦ బహుయోజనాయతం,బును గీటసేవితం♦బును గహనము
నంధకారోత్కటతర♦బంధురం బగుకొక్క,ఘనగహ్వరంబును ♦ గాంచి యందుఁ
ఆ. జొద్దదవ్వు నడవఁ ♦ బిదప నందర్కప్ర,కాశ మైనపురము ♦ గానఁబడియె
నద్ది మయునిటెంకి ♦ యటఁ బ్రభావతి యను,తాపసీవరేణ్య ♦ తనరు నొకత. 227

వ. ఆయమ్మ మాకు భక్ష్యభోజ్యపానీయంబు లిచ్చినం బుచ్చుకొని తిని నేదఁ దేఱి బలంబు గలిగి మే మామె చెప్పినచొప్పున నాగుహాగేహంబు వెడలి సహ్యదర్దుర పర్వతంబు లతిక్రమించి మించినవేడ్క మలయపర్వతంబునం దధివసించి ముందఱ. 228

మహాస్రగ్ధర. కనదుగ్రగ్రాహచక్ర♦క్రమభయదమహా♦గర్తగంభీరనీరం
బును గల్లోలాగ్రనృత్య♦త్స్ఫురుహుజలకణ♦ప్రోక్షితాభ్రం బదభ్ర
స్తనితప్రాయానిశప్రా♦ప్తభువనపతన♦ప్రస్ఫుటధ్వానధామం
బనవద్యానంతమార్గం ♦ బయి భయకర మా♦నబ్ధిఁ గన్గొంటి మంతన్. 229

చ. పెనఁగి జగంబు లల్లుమగ♦బిడ్డను బోడునఁ గన్నదొడ్డవే
ల్పున కిడి లిబ్బిఁ బ్రిబ్బుతన♦ముద్దులకన్నియఁ బెండ్లిచేసి పెం
పనువడఁ గూఁతుతోడఁ దన♦యల్లుని నిల్లట నుంచుకొంటి నే
నని కడు సంతసించు నన ♦ నంబుధి మిన్నుల ముట్టి బెట్టుగన్. 230

వ. ఇట్లనేకశతయోజనవిస్తీర్ణం బగునయ్యర్ణవంబుఁ గని దాని దాఁటు టెట్లు సీతం గాంచు టెట్లు గాంచక పోవు టెట్లని విషణ్ణహృదయుల మై. 231

ఉ. దక్కిన చొక్కపూనమునఁ ♦ దక్కక కన్గొని గం డటంచు నాఁ
డక్కట రామభూమివిభుఁ ♦ డంపఁగ వచ్చితి మిట్లు సీత దా
నెక్కడఁ గాన రా దనుచు ♦ నేలికతో వచియించుకంటె నీ
చక్కిన చచ్చు టొప్పు నని ♦ స్వాంతములం దలపోసి మే మటన్. 233

వ. అనశనవ్రతంబున నొడలు విడుచుటయ మన కిపుడు కర్తవ్య మని నిశ్చయించి మే మెల్లరము నొక్కచోటం గూరుచుండి రామకార్యార్థంబు దెగినజటాయువట్లు మన మును గృతార్థుల మగుదు మని తలంచి ప్రాయోపవేశంబుఁ జేసి యున్న సమయంబున.

సీ. కుధరశృంగాభుఁడు ♦ ఘోరరూపుఁడు భయా,వహుఁ డొక్కఖగరాజు ♦ వడిగ వచ్చి
వైనతేయుఁడు నాఁగఁ ♦ బూని మ మ్మందఱ, నొక్కుమ్మడిని మ్రింగ ♦ నూహ చేసి
కదిసి జటాయువు ♦ కథ విని కరుణించి, మీ రెవ్వరయ్య యో ♦ధీరులార
మాతమ్ముఁ గుఱ్ఱను ♦ స్మరియించుచుంటి రా,తఁడు నేను నరుణపు♦త్రకుల మరయ
తే. నందుఁ సంపాతి నాఁ బను♦నట్టివాఁడ, నేను నతఁడును రవిఁ జేర ♦ నెంచి మింటి
కెగసితిమి వేడ్కఁ గమకె నా♦దుగఱు లతని, గఱులు కమరవు వేఁడికిఁ ♦ దొఱఁగుచోవ.

క. నే నిందుఁ బడితిఁ దమ్ముఁడు, దా నెందుం బడెనొ కాని ♦ తద్వార్తలు నా
వీనులకుఁ గావు మీ రగు, నేని విన్పింపుఁ డయ్య ♦ హితవచనములన్. 235

వ. అనిన మే మెల్లవృత్తాంతంబు నెఱింగించిన నతండు తనతమ్మునిమరణంబునకుఁ గరంబు పరితపించి మాప్రాయోపవేశం బవనయించువాఁడై యి ట్లనియె. 236

మత్తకోకిలము. ఏ నెఱుంగుదు రావణాసురుఁ ♦ డిద్ధతేజుఁడు వానికిన్
గాన వచ్చుఁ బురంబు లంక య♦నం ద్రికూటమహీధర
స్థానమం దది కంధి కవ్వలి♦చక్కి దవ్వుల నుండు నం
దాన కెశ్వరుదేవిఁ గానఁగ ♦ నౌ నటంచుఁ దలంచెదన్. 237

క. అని చెప్పి చనియె నంతన్, వననిధి దాఁటంగ మేము ♦ వగచుచు నుండన్
జనవర మాలో నొక్కరుఁ, డును నే నని కడఁగఁ డయ్యె♦డున్ గడగడగన్. 238

శా. అంతం గొంతటి కేను బూని భవదీ♦యాజ్ఞాప్రభావంబునన్
స్వాంతాధిష్ఠితుఁ డైనమజ్జనకుపూ♦ర్ణానుగ్రహప్రస్థితిన్
సంతోషంబును సత్వముం గలుగ లోఁ ♦ జర్చింప కావంతయే
నింతం తం చనరానిసాగర మహీ♦నేహాగతిం దాఁటితిన్. 239

క. నా కపుడు ప్రతిఘటించిన, రాకాసుల నెల్లఁ ద్రుంచి ♦ రమ్యాగార
ప్రాకారగోపురం బయి, లోకోత్తర మైనలంక♦లోఁ గంటి సతిన్. 240



వ. అమ్మహాదేవియు. 241

సీ. ఘనతరాంగారక♦గ్రహపీడఁ బడినరో,హిణితెఱంగున పెంచ్చు ♦ నెడలి యెడలి
సితపక్షముఖమందుఁ ♦ జెలువొందుశశిరేఖ, చక్కి నొక్కింతగాఁ ♦ జిక్కి చిక్కి
స్వగణంబు విడనాడి ♦ శ్వగణాభివృత యగు, మృగివలె వగలకై ♦ పొగిలి పొగిలి
పుడమిపైఁ బొరలాడి ♦ బూడె బ్రుంగుడువడు, కనకశలాక నాఁ ♦ గనిసి కనిసి
తే. కప్పు వడియున్నవహ్నిశి♦ఖయును బోలెఁ, గావిరిఁ గ్రొడిగట్టినదీప♦కళిక వోలెఁ
బూరిలోఁ బడ్డరతనంపు♦మొలక వోలెఁ, జెన్ను విడి కంటఁ దడి పెట్టు♦చున్న దందు.

వ. ఇట్లు భర్తృదర్శనకుతూహలాయత్తచిత్తయై యున్న వైదేహిం జూచి నానావిధనిమిత్తవిశేషంబుల సాభిజ్ఞానంబుగా నెఱింగి యితరు లెవ్వరును లేకున్నయప్పు డామెసదేశంబునకుం జని నమస్కరించి వినయవినమితోత్తమాంగుండనై. 243

ఆ. మాత నేను రామ♦దూత మారుతసూతి, హనుమ యనెడువాఁడ ♦ వనచరుండ
నిటకు వచ్చినాఁడ ♦ నిపుడు నీదర్శన, మభిలషించి గగన♦యానమునను. 244

ఆ. రాజపుత్రు లయిన♦రామలక్ష్మణులకుఁ, గుశల మచట నీదు♦కుశల మడిగి
రఖిలవనచరాళి ♦ కధినాథుఁ డైనసు,గ్రీవుఁ డిపుడు వారి♦ కేవ నుండె. 245

ఉ. నీహృదయేశ్వరుం డిటకు ♦ నిక్కముగాఁ జనుదెంచి వానర
వ్యూహముతోడ రక్కసుల ♦ నుక్కడఁగించి నినుం గ్రహించి యు
త్సాహముతో నయోధ్యఁ జను ♦ సందియ మందకు మిం దొకింతయున్
ద్రోహము లేదు నేఁ గపివ♦రుండను దైత్యుఁడఁ గాను నమ్ముమా. 246

క. అని చెప్పిన నయ్యమ తన, మనమున నయం దొకముహూర్త♦మాత్రఁ దలఁచి నన్
గని యి ట్లనియె నవిందు, విపిపించెన్ నాకు సర్వ♦వృత్తాంతంబున్. 247

తే. నీవు హనుమంతుఁ డగుదు సు♦గ్రీవునకును, రామునకు మైత్రి యయ్యె నీ♦రాక వింటి
నింకఁ జని నీవు రఘుపతి ♦ కింతయు నెఱిఁగించి నావెత లుడిగింప ♦ నెంచు మయ్య.

వ. అని ప్రత్యయార్థం బీశిరోరత్నం బిచ్చి చిత్రకూటంబున నీచే నిషీకంబున నొంపఁబడినకృతకకాకంబుకథయుం జెప్పి యంపి పుచ్చుటయు నే నద్దేవియనుజ్ఞ వడసి లంకాపురం బెల్లఁ గాల్చిపుచ్చి వచ్చితి నని చూడామణి రామున కిచ్చిన నతండు దానిం గాంచి సీతం గాంచినట్ల సంతసించి కన్నులఁ గప్పిగొని హనుమంతుం బ్రశంసించె నంత సుగ్రీవశాసనంబున. 249

నానాదేశములనుండి వానరవీరులు సుగ్రీవునొద్దకు వచ్చుట.

సీ. వాలిమామ సుషేణుఁ ♦ డోలిఁ గోటిసహస్ర, పరివారపరివృతుం ♦ డరుగుఁ దెంచెఁ
జనుదెంచి రటఁ గోటి♦శతము కోటిశతమ్ము, కపిసమూహము గొల్వ ♦ గజ గవయులు

షష్టికోటిసహస్ర♦సంవృతుఁ డై పఱ,తెంచె గవాక్షుండు ♦ ధీరవరుఁడు
గంధమాదనవాసి ♦ గంధమాదనుఁ డేగు,దెంచెను శతసహ♦స్రాంచితుఁ డయి
తే. పనసుఁ డేఁబదియేఁడుకో♦ట్లనఁగఁ దగిన,దళము తనుఁ గొల్వ వచ్చె నా♦దధిముఖుండు
బహుసహస్రవనేచర♦పరివృతుఁ డయి,భక్తి విచ్చేసె రామభూ♦పాలుకడకు. 250
క.†బల్లిదులు వేయికో ట్ల,త్కుల్లకబలు లాజిఁ గృతము♦ఖులు నల్లనిమేన్
దెల్లనిమోముల్ గలిగిన,భల్లుకములు గొలువ జాంబ♦వంతుఁడు వచ్చెన్. 251
ఉ.*వీరును వీరు గాక మఱి ♦ వేలకు వే లయినట్టివారునున్
వీరులు ధీరులుం బ్లవగ♦వీరులు భూరిబలప్రకారులున్
ఘోరమృగేంద్రసారు లట♦కుం బఱతెంచిరి పర్వతోపమా
కారులు శారదాభ్రముల♦కాల్వలకున్ బ్రతివచ్చువార లై. 252
వ. ఇట్లు వచ్చి వానరసైన్యం బంతయు దైన్యంబుఁ గాన కచ్చట పెద్ది విచ్చలవిడిం
దిరుగుచుఁ బెరుఁగుచుఁ దారుచుం బాఱుచు నానాప్రకారప్రవర్తనంబుల నందు
నందు విహరించుచుండె నంత నొక్కనుముహూర్తంబున. 253
ఉ. దేవనిభుండు రాఘవుఁడు ♦ దిక్కులు పిక్కటిలంగఁ బొంగి సు
శ్రీవిభవాభిశోభిత మ♦శేషవిశేషసమంచితంబు నై
శీవి నెసంగి సాగరము♦తేపఁ బొసంగెడుసేనతోడ సు
గ్రీవుఁడు బాస టై తనదు♦త్రోవఁ జనం జనె సానుజన్ముఁ డై. 254
మానిని. ఆకపిసేనల కన్నిటికి న్మొగ ♦ మై హనుమంతుఁడు పంతమునన్
గైకొని నిల్చె రఘూద్వహుఁ గొల్చుచుఁ ♦ గైదువులం గొని యంగదుఁడున్
వీఁకమెయిన్ ద్వివిదుండును మైందుఁడు ♦ నీలసుషేణనలాదులు న
స్తోకపరాక్రమ మేర్పడ నయ్యయి♦చోటుల నిల్చిరి మేటులు గన్. 255
ఉత్కలిక. అటులు తఱలినసైన్య మంతయుఁ ♦ బటుజవంబున నడచు చెంతయు
సంతసంబున నదులపొంతను ♦ వింతవింతనగాళిచెంతను
విడియుచుం జని కొన్నినాళుల ♦ కడరునంబుధికడకుఁ జాళులఁ
గప్పి రెండవసాగరంబుగఁ ♦ జెప్పఁ జొప్పడె నచ్చు డంబుగ. 256
వ. అప్పుడు సర్వవానరసేనాంతరగతుం డగురామచంద్రుండు సుగ్రీవుం జూచి యి ట్లనియె.
క. జడనిధి దాఁటునుపాయము, పొడకట్టదు మనబలంబు ♦ భూయిష్ఠం బై
యడరెడుఁ గడలియు నిక్కలి, పొడ్డు గై కనిపించు మిన్ను ♦ ముట్టి కపీంద్రా. 258

† ఆజి = యుద్ధము, కృతముఖులు = సమర్థులు. * ప్లవగవీరులు = వానరశ్రేష్ఠులు; కాల్వ = వరుసగ.



వ. అని పలుకుచున్నసమయంబున. 259
ఉ. కొండ తిరిదెంతపాటియది ♦ గోష్పదమట్టులు దాటి పోవ నా
నిందఱ కంచుఁ బల్కి రొక♦యింతటిలో మఱికొంద ఱేది పో
పం దగుఁ దెప్పలం గొని జ♦వంబున నంచు వచించి రంతలోఁ
గొందఱు నావలం గడచి♦కొంద మటంచు వచించి రంతటన్. 260

రాముఁడు దర్భశయనుం డై సముద్రుని బ్రార్థించుట.

సీ.*అనవుడు రఘురాముఁ ♦ డనియె మీమీమాట,లెల్లఁ జెల్లవు వినుఁ ♦ డెల్లవారు
శతయోజనంబుల ♦ మితి గలమున్నీరు, కడచనుట కడింది♦కర్జ మరయఁ
గలములుం దేపలు ♦ బలఁగంబులకుఁ జాల, నమకట్టు టరిది యీ♦సమయమందుఁ
గలయోడ లన్నియుఁ ♦ గైకొన్న వణిజుల, కుపఘాత మగు టొం డ♦గుం దలంప
తే.†మఱియు నీర్వామిలో నిట్లు ♦ మున మరుగుట
తెలిసి వైరులు నుగ్గాడఁ ♦ గలరు గాన
నొప్ప దిటు లే నొకయుపాయ ♦ మిప్పు డెడఁద
నెఱిఁగికొంటిని మీర లిం♦దఱును వినుఁడు. 261
మ.‡ఉపవాసవ్రత మేను బూని నియమం ♦ బొప్పన్ సరస్వంతునిం
గృపఁ బుట్టంగ భజించి వేఁడెదను నా ♦ కీతండు తె ర్విచ్చు నీ
కుపరోధించినయేని మామకము లై ♦ యుగ్రంబు లై కల్పవ
హ్నిపటిష్ఠాజము లైనబాణముల నే ♦ నింకింతు నొక్కుమ్మడిన్. 262
వ. అని పలికి సానుజుం డగురాముండు జలోపస్పర్శంబు చేసి కుశసంస్తరణశయనుం
డై జలనిధిం బ్రార్థించుటయు నతం డొకింతవడి కతనికిం గలలోనం బొడకట్టి
యి ట్లనియె. 263
శా. నీ విక్ష్వాకుకులోద్భవుండ వగుటన్ ♦ నీజ్ఞాతి నో తండ్రి నే
నీవేళన్ బొనరించు కార్య మది యే♦దీ నాకు వాకిమ్ము నా
నావీరాగ్రణి సంతసించి యను మా♦కారావణుం ద్రుంపఁ బో
భావం బయ్యెను మార్గ మిమ్ము కరుణా♦స్వాంతుండ వై సాగరా. 264
తే.§ఇడక నాప్రార్థనముఁ ద్రోసి♦యేయు దేని, నాదుదివ్యాస్త్రముల నిన్నుఁ♦బాముతోడ
నెండిపోఁజేయుదునుఁ జూడు♦మిపుడ నంగ,నుదరిపడి మ్రొక్కి యిట్లను♦నుదధిమఱియు.

* ఉపఘాతము = బాధ † నీర్వామి = సముద్రము.
‡ సరస్వంతుఁడు = సముద్రుఁడు. § పాదు = మూలము

సీ.‡రామ నే నీ కంత♦రాయంబుఁ దలఁపను, గాని నాచెప్పెడి♦దాని నరసి
పోలినట్టుల చేయఁ బూనుము నీకు నేఁ, డెరు వి త్తునే నిట్లు ♦ తెగువఁ జేసి
లాఁతివాఁడును నన్ను ♦ లాఘవంబునఁ జూచి, శరబలంబున నాజ్ఞ ♦ సెరపఁ బూను
వినుము మీలోఁ గపి♦వీరుఁడు నలుఁ డనఁ, గలఁ డొక్కరుఁడు విశ్వ♦కర్మసుతుఁడు
ఆ. వాఁడు శిల్పవేది ♦ వడిఁ దరుల్ గిరులును, బైవఁ దాల్తు నేను ♦ వారధి యన
నది యెసంగు నందు ♦ నరుగ మీ కగు నని, యొడఁబడంగఁ జెప్పి ♦ వెడలె నతఁడు.
వ. అంత రఘుకులతిలకుండు నలుం బిలిచి సేతువుఁ గట్ట నియోగించుటయు నతం డతని యాజ్ఞం బురస్కరించుకొని వానరులం బుచ్చి గిరినికరంబులం దెచ్చి నీరాకరంబున దశయోజనవిస్తారంబును శతయోజనాయతంబు నగుసేతుబంధంబుఁ గావించె నది యిప్పటికిని నలసేతునామంబునం బ్రసిద్ధం బయ్యె నయ్యెడ. 267

విభీషణుండు రాముని శరణుఁ జొచ్చుట.

చ. తెలిపిన నా నటంచుఁ దలఁ ♦ ద్రిప్పక ముప్పు ఘటిల్లఁ జేయున
త్తులువను రావణాసురునిఁ ♦ దో డని యెంచక వీడి పోఁడిమిఁ
నలువురు మంత్రులుం దనకు ♦ నాలుగు చేతులు గా నెసంగ రా
ములఁ గన వచ్చె నిచ్చ గుణ♦భూషణుఁ డైనవిభీషణుం డటన్. 268
ఆ. వచ్చి నృపతిశరణుఁ ♦ జొచ్చిన సుగ్రీవుఁ, డరిగి శంక సేయు ♦ టది గణింప
కినకులాధినాథుఁ ♦ డింగితజ్ఞుఁడు వాని, నరసి శ్రితుఁడ యనుచుఁ ♦ గరుణ చేసె. 269
ఉ. స్వాగత మొప్పఁ బల్కి తన♦వారల కందఱకున్ విభీషణుం
బాగుగఁ జెప్పి లక్ష్మణుని♦మైత్రికిఁ బాత్రునిఁ జేసి వాసిఁ గై
కోఁ గని సర్వరాక్షసుల♦కుం బతిగా నభిషిక్తుఁ జేసి యెం
తో గరిమన్ గ్రహించెఁ దన♦తో నగుమంత్రులలోన మంత్రిఁ గన్. 270
వ. అంత రఘూద్వహుండు సర్వసేనాసమేతుం డై విభీషణుం బురస్కరించుకొని తదనుమతంబున నలసేతుమార్గంబున మహార్ణవంబు దాఁటి దక్షిణతటంబున నానావిధ ఫలసలిలబహుళం బైన లంకోద్యానంబున విడిసి యున్నయెడ శుకసారణు లనురావణమంత్రు లిర్వురు వానరరూపంబులు దాల్చి సేనావారంబుఁ జొచ్చిన నెఱింగి విభీషణుండు రామునకు నివేదించుటయు నతండు ప్రకృతిరూపంబు నొందినవారి నాదరించి వారికిఁ దన సైన్యవిభవం బంతయుం జూప నియమించి విడిచిపుచ్చె ననంతరంబ. 271
ఆ. శుకుఁడు సారణుండు ♦ ప్రకటించి శ్రీరాము,బలఁగములతెఱంగు ♦ కలతెఱఁగునఁ
దెలియ విన్నవింపఁ ♦ దలఁక కారాక్షసే.శ్వరుఁడు నాహరించె ♦ సమరమునకు. 272

‡ సెరపు = నెరవేర్పు.



సీ. పరిఖావృత మ్మగు♦ప్రాకారసప్తక,మ్మునఁ జంద్రశంకువుల్ ♦ మొనయ నాటి
కోటకొమ్మలమీఁద ♦ మేటిశతఘ్నులు, వివిధాయుధమ్ములు ♦ వెలయఁ జేసి
ద్వారదేశములందు ♦ భూరిగిరులఁ బోలు,మత్తేభముల నిల్పి ♦ మొత్తములుగఁ
బిడుగుల కైత్తైన♦వడి గలయోధుల, నియమించి నలుగడ ♦ నిలువరించి
తే.‡సర్వగుల్మంబులన్ ♦ యంత్ర సాధనములు, సంతరించి మహాకేతు♦శతసహస్ర
సంభృతంబుగఁ జేసి ర♦క్షావిధాన, మాచరించెను లంకయం ♦ దసురవిభుఁడు. 273

అంగదురాయబారము.

వ. ఇట రామచంద్రుండును యథావిధసంవిధానంబున సేనాపరిరక్షణంబును గావించుచు నంగదుం బిలిచి నీవు సందేశహరుండ వై రావణుపాలికిం బోయి ర మ్మని పంచిన నతం డటఁ జని తనరాక యెఱింగించి తదనుమతిం బ్రవేశంబు గాంచి మేఘమాలాపరివృతుం డైనదివాకరునిచందంబున సకలపరివారపరివృతుం డై కొలు వున్నపౌలస్త్యుం గాంచి త న్నెఱింగించి యి ట్లనియె. 274
క. రావణ నీతో రాముం, డీవరుసం బలుకు మనియె ♦ నే నిపు డిచటన్
నీవారు నీవు విన నవి, వావిరి వచియింతు విన స♦వధరింప నగున్. 275
చ. అనయము హీనవృత్తి నన♦యంబున రా జొకఁ డున్నఁ దత్ప్రజల్
వినయము లేక యుండు రి సరవిం జెడు నాతనిరాజ్య మెల్ల న
ట్లనయరతుండ వీవు జన♦కాత్మజఁ దెచ్చితి దాన నీజనం
బు ననపరాద్ధ మైన వధ♦ముం గొనన ర్హమ యయ్యె నియ్యెడన్. 276
వ. ఇదియునుం గాక. 277
సీ. అడవి నాకు లలమ్ము ♦ లాహరించుచుఁ దపం,బున్నట్టివారల ♦ నొంచుచుటయును
దేవతలయు భూమి♦దేవతలయుఁ గ్రొత్త,ములఁ బట్టి చెఱఁ బెట్టి ♦ నలుచుటయును
మునుల రాజర్షుల ♦ ననపరాధుల నెల్ల, నక్కటికము లేక♦ నొక్కుటయును
నఖిలలోకములకు ♦ నలజడి గాఁ జెట్ట, లగుపను లెన్ని యేఁ ♦ దగులుటయును
తే. నేఁటికి ఫలించె నవి యెల్ల ♦ నీకు ననుభ,వించుకాల మాసన్న మై ♦ పొందియుండె
బుద్ధి గలవాఁడ వేని నా♦ముద్దరాలి, నెలమి నర్పించి ప్రాణముల్ ♦నిలుపుకొనుము.
తే. అట్లు కాదేని చూడు మా♦హవమునందు, నరుఁడ నగునాశరంబుల♦బిరుసుఁ జూపి
నిన్ను నీవారినిం జంపి ♦ నిఖలజగ ము,రాక్షసంబుగఁ జేసెద ♦ నీక్షణమున. 279
క. నీ వొకపురుషుఁడ వేనియు, లా వొక్కింతేని నీకు♦లంబునఁ గలదేఁ
జేవమెయిఁ జేయు మాల , మ్మే వీరుఁడ రిత్త వోవ ♦ నిత్తున నిన్నున్. 280

‡ గుల్మము = పురాభిముఖ మైనరాజమార్గము.

వ. అని చెప్పుచున్నప్పుడు రాక్షసేశ్వరుండు రూక్షేక్షణుం డై చుఱచుఱం జూచె నా చూ పెఱింగి యింగితజ్ఞు లగునల్వురు రాక్షసు లాక్షణంబ పక్షులు శార్దూలరాజంబునుం బలె నంగదు నంగసంధులం బొదివి పట్టుటయు నప్పట్టువోడ నవ్వాలిపట్టి మీఁది కెగసి ప్రాసాదతలంబుపై నధిష్ఠించె రాక్షసు లాక్షేపవేగంబునం జేసి క్రిందఁ బడి సంభిన్నహృదయు లై చచ్చి రచ్చతురుండు వియచ్చతురుండో యన నచ్చటినుండి నిజసేనామధ్యంబునకు లంఘించి కోసలేంద్రునకుం దనపోయి వచ్చినవృత్తాంతం బంతయుం జెప్పి మెప్పించె నంత. 281

— రాముఁడు నిజబలంబులతో యుద్ధమునకు సన్నద్ధుఁ డగుట. —

శా. వీరాగ్రేసరుఁ డై నరాఘవుఁడు దోర్వీర్యం బవార్యంబు గాఁ
ఘోరాస్త్రంబులు తూణయుగ్మమునఁ జెక్కుల్ నాల్కలం గ్రోయ గం
భీరస్వాంతతఁ గోల్తలం బొనరుపం • బిట్టార్చి యుచ్చైర్మహా
ఘోరాకారులు ఋక్షవానరుల కక్షుద్రప్రభావంబునన్. 282

మత్తకోకిలము. వాతరంహులు వీతజిహ్మలు • వానరుల్ కదుధీరు లై
స్ఫీతబాహుబలం బెలర్పఁగ • వృక్షపర్వతపంక్తులన్
బ్రీతిఁ గై కొని వీఁకమైఁ జని • పెచ్చుకోల్తల హెచ్చు లం
కాతతోన్నతసాలశృంగము • లావరించిరి మించఁగన్. 283

తే. *జాంబవద్విభీషణపురస్సరముగను, లక్ష్మణుఁడు వేనవేల్ సేన • లాసి పొదలఁ
గదలి దక్షిణద్వారముఁ • గడఁక మెఱయ, ముట్టడించెను సంతసకట్టి యపుడు.

స్రగ్ధర. †భూరిక్ష్మాభృత్సమాంగుల్ • భువనవిదితసంస్ఫోటశాలుల్ ప్లవంగుల్
పారావారంబు నాఁగం • బ్రబలి సకలభూభాగముం గప్పి మెప్పై
స్ఫారం బై యొప్పు లంకేశ్వరవరణము నల్పక్కలుల్ ముట్టి నెట్టుల్
మేరల్ మీఱంగఁ భిత్తుల్ • మిడిసి పడ నడి • న్మెట్టి మట్టాడి రంతన్. 285

వ. ఇట్లరుణగోత్రోన్నతగాత్రు లగువలీముఖప్రవరులు శతసహస్రకోటులును ధూమ్రవర్ణులు స్వర్ణగర్భులు నగునచ్ఛభల్లయోధులు ముప్పదివేలకోట్లునుం గూడి వేడుకమెయిఁ గూయుచు వీఁకుచు నిగుడుచు మగుడుచు మలయుచు సొలయుచు మత్తిల్లి మొత్తం బై లంకాపురప్రాకారం బాక్రమించి నానావిధనిజదేహప్రభాపటలంబున నాయాయికడలఁ గపిలంబు సేయుచు సూర్యాతపప్రచారంబున కెడ గలుగకుండ నంతటం దామ యై నిండి కోటకొమ్మలం గలమేటిరక్కసుల నుక్కడంచి ద్వారతోరణ మణిస్తంభగోపురాట్టాలక కుట్టిమ కర్ణాటశిఖరశృంగయంత్రాగారాదుల విఱిచి పురీమధ్యంబునం బడ విసరి వై చుచుఁ జక్రగుడోపలశతఘ్నీవ్రాతంబుల గదాపరిఘకుంతప్రముఖాద్యాయుధంబుల నెత్తి మొత్తుచు లంకాపురవాసుల కెల్ల గుండెతల్లడంబుఁ గావించుచుండి రవుడు వరుణరక్షకు లగురాక్షసవీరులు వెఱచఱచి పఱచి ప్లవంగవీరసంజనితం బగు నమ్మహోపప్లవం బంతయు దేవాంతకుం డగురావణునకెఱింగించిన నతండు గండుమిగిలి కామరూపులును వికృతాకారులును శతసహస్రసంఖ్యాకులు నగురాక్షసుల నియోగించిన నవా రవారితభుజబలపరాక్రమంబు మెఱయ నరిగి కోటకొమ్మలం దీటుకొని మేటు లై యున్నవనాటులపైఁ జిత్తజల్లువోలె మొత్తంబు లై పడ నానావిధాయుధంబులం బ్రయోగించి మించి వరణంబు నిర్వానరగణంబు గావించి మరలఁ గోటం గై వసంబుఁ గావించుకొని యుండి రప్పుడు.

చం. ‡మునువరణంబుపైఁ గపిసమూహము నిల్చుట రోచనాభ మై
కనుఁగవ కింపు సొంపెసఁగఁ • గానఁగ వచ్చెడునద్ది వెండియున్
మినుములరాశి చందమున • మిక్కిలి యై క్షణదాచరవ్రజం
బునుపపడం బయోధరసమంచిత మైనకెఱంగునం దగెన్. 287

ఉ. అంతట రామలక్ష్మణు లనంతపరాక్రమవిక్రమంబునం
గొంతలు గానిశస్త్రములు • కోటులు మేటులు వై చి యేచి దే
వాంతకులన్ వధించుటయు • నప్పుడు వెండియు మర్కటౌఘముల్
నంతులు మీఱ దుర్గమును • బట్టె నరాక్షస మైనపట్టునన్. 288

— రావణుఁడు యుద్ధంబునకుఁ బర్వతపతనాదులం బుచ్చుట. —

వ. అట రాక్షసేశ్వరుం డది యంతయును విని మనంబునం దలిగి తన కనుచరులును గణంబులు నై యున్నవారిఁ బర్వత పతన జంభ ఖర క్రోధవశ హరి ప్రరుజారుజ ప్రఘనస ప్రభృతు లైన క్షుద్రరక్షఃపతులం బుచ్చుటయు వారును నానావిధరక్షోగణపరివృతు లై మాయాబలంబున నదృశ్యాకారు లై వచ్చి కపిసైన్యంబు దైన్యంబు నొందించుటయును. 289

తరలము. అరివిభీషణుఁ డవ్విభీషణుఁ • డాసురం బగుమాయఁ దా
నరసి వచ్చి చలంబు మీఱ ని•జాస్త్రశస్త్రబలంబునం
బోరిఁ గుదింప వనేచరుల్ మదిఁ • బొంగి చెంగటఁ జూడ నా
సురతరాంగుల వారి బ్రేల్మిడి • నొంచి రందఱు నొక్కఁ డై. 290

* లాయు = విజృంభించు. సంతసకట్టి = సంతోషభవించి.
† నెట్టుల్ = ప్రాకారల్. మట్టాడు = సంచరించు, వ్యాపించు;

‡ క్షణదాచరవ్రజంబు = రాక్షససమూహము.

మ.*వినిశక్త్యంచరవల్లభుండు కినుకన్ వెల్గొందుచు న్వేఁడివే
ల్పన నానావిధఘోరరాక్షసయుతుం డై పోరఁ గాఁ బోయె నౌ
శనసవ్యూహము పన్ని రాముఁడును జెల్వొం దీర్చి మాఱొడ్డెఁ దా
ననికిన్ సైన్యబలంబునం దెసఁగ బార్హస్పత్య మన్ వ్యూహమున్. 291

వ. ఇట్లు సన్నద్ధం బైనయుద్ధంబున రామరావణులును లక్ష్మణేంద్రజిత్తులును సుగ్రీవవిరూపాక్షులును దారనిఖర్వులును నలతుండులును బనసపటుసులును దక్కనుంగలవారు దక్కనుంగలవారును గలియంబడి పోరినపోరు దేవదానవులపోరుం బోలె ఘోరం బై రోమహర్షణం బయ్యె నయ్యెడ. 292

క. ఇంద్రజియున్ సౌమిత్రియుఁ, దంద్ర దయొకింతయును లేక ధైర్యం బెసఁగన్
సాంద్రాంబకములఁ బఱపుచు, నింద్రాదులు మెచ్చఁ బోరి రిద్ధస్పర్ధన్. 293

ఉత్సాహము. రావణాసురుండు హెచ్చి రామచంద్రుమీఁదఁ దాఁ
జేవ సేసి శక్తిశూలశితశరాస్త్రశస్త్రముల్
దేవనిభుఁడు వాని నెల్ల దివ్యశరపరంపరన్
బోవ నేసి యసుర నొంచెఁ బోయె వాఁడు పొల్ల యై. 294

వ. అంత. 295

ప్రహస్తుం డెదిరించి పోరి విభీషణునిచేఁ జచ్చుట.

ఉ. ఆలము వీడి రావణుఁ డయత్నపరాఙ్ముఖుఁ డై చనంగ నా
భీలతరారిశస్త్రములవేఁడికిఁ జగ్గిలి తద్బలంబులున్
బోలనిపోకఁ బోవఁ గని పోఁడిఁ బ్రహస్తుఁడు హస్త మెత్తి చాల్
చాలుఁ ఋరే నిలుం డనుచుఁ జయ్యనఁ గోల్తలఁ జేసెఁ జేసినన్. 296

ఉత్సాహము. పెల్లగిలినమూఁక లెల్లఁ బెచ్చుపెరిగి వెండియున్
జెల్లుమూఁగి సాహసించి వీడ కసికిఁ బొదలి పెం
పుల్లసిల్లఁగఁ దొడరి పోరుచుండుఁడు న్విభీషణుం
డొల్లఁ బోవఁ జేసె నసురయోధులన్ రయంబునన్. 297

స్రగ్ధర. ‡క్రుద్ధుం డై యిట్లురక్షఃకులధరపవి యై క్రూరనారాచసాటో
ద్బద్ధుం డై యుద్ధశక్తిన్ బరఁగుదశముఖభ్రాత నీక్షించి రోషా
విద్ధాత్ముం డై ప్రహస్తాభిహితవిబుధవిద్వేషి దూషించి స్పర్ధన్
యుద్ధోర్విన్ నిల్చి పెల్చన్ హతవహుఁ డన నుజ్జ్వలత లూఁగించె వానిన్.

* ఔశనసవ్యూహము=ఉశనస్సంబంధ మైనది. ఇది తొల్లి శుక్రుఁడు నిర్మించి రాక్షసుల కుపదేశించిన దని తెలియం దగు. బార్హస్పత్యము=బృహస్పతిసంబంధ మైనది ఇదియుం బయిదానినంటిది.

‡ ప్రహస్తాభిహితవిబుధవిద్వేషి=ప్రహస్తుఁ డని చెప్పఁబడినరాక్షసుఁడు.



మ.†తొలఁగం బోవఁగ నీక పేకఁ గృతహస్తుం డాప్రహస్తుండు ని
స్తులనారాచములన్ జమూనివహమున్ శోధించి వేధించుచున్
జలముం జూపుచు నున్న వానిబలమున్ జక్కాడ నొక్కుమ్మడిన్
విలసత్కీర్తి విభీషణుం డెదిరె దోర్వీర్యం బవార్యంబు గన్. 299

చ. ఎదిరి మహాస్త్రముల్ వఱపునిర్దయశకుం గుఱి సేసి యేసె దు
ర్మదుఁ డగునాప్రహస్తుఁడు కరంబులఁ బట్టి కరంబు ద్రిప్పుచుం
గద నది తాఁకు డెంచినను గాని హిమాచలధైర్యశాలి యై
కదలక సుస్థిరుం డగుచుఁ గన్గొన నై యొకకొంత నవ్వుచున్. 300

మ. ప్రతిఘాంచన్మతి యై విభీషణుఁడు దర్పం బొప్పఁ గాలాంతక
ప్రతిమానంబు మహోన్నతంబు జ్వలనజ్వాలప్రభాభీలమున్
శతఘంటాంచిత మై వెలింగెడుమహాశక్తిం బ్రయోగించెఁ బ్ర
స్థితి మంత్రించి ప్రహస్తుశీర్షమునయున్ జేరం గపుల్ మెచ్చఁగన్. 301

ఆ.‡అశనివేగ మైనయమ్మహాశక్తిఁ గృత్తోత్తమాంగుఁ డగుచు నుర్విఁ బడియె
వాతరుగ్ణ మైనవసుమతీరుహ మట్లు, ప్రస్తుతింపఁ దగి ప్రహస్తుఁ డపుడు. 302

వ. ఇట్లు పడినప్రహస్తుం జూచి తత్సైన్యం బంతయు దైన్యంబు నొంది పాఱం దొడంగె నప్పుడు ధూమ్రాక్షుండు క్రోధతామ్రాక్షుం డై ప్రళయకాలమేఘోపమంబును భీమదర్శనంబు నగునిజసైన్యంబుతో వచ్చి కవిసినం గాంచి సేన లెల్ల నుల్లంబోయి వెఱచఱచి పఱచె నవుడు మారుతాత్మజుం డగుహనూమంతుఁ డెదిరించి నిలిచిన వలీముఖబలంబు లెల్ల నప్పటివలెం గూడికొనియె నప్పుడు. 303

హనుమంతుఁడు ధూమ్రాక్షుం జంపుట.

శా. ధూమ్రాక్షుండుఁ బ్రభంజనాత్మజుఁడు తద్ధూర్వావహు లై పర్వుచున్
ధూమోత్సృష్టదవాగ్నులుం బలెను దంతుల్ రెండును న్మండుచున్
దామ్రాక్షుల్ దగఁ గ్రాల నాలమును బ్రస్థాపించె నార్పు ల్వడిన్
గమ్రత్వం బఱ మ్రోఁగె దిక్తటుల నక్కాలంబునం దెంతయున్. 304

తే. ప్లవగరాక్షసయుక్తశవమయ మయి సు,దారుణం బయి రుధిరకర్దమ మయి ఘన
శరగిరిమహీరుహపతనశబ్దఘోర, మయి తనర్చె నవుడు సమరాంగణంబు. 305

మ.§అదనం బై చనునట్టియుద్ధమున ధూమ్రాక్షుండు తామ్రాక్షుఁ డై
గదలన్ శల్యములం బరశ్వథములన్ ఖడ్గంబులం బత్రులన్

† కృతహస్తుఁడు=గుఱి తప్పక యేయువాఁడు, నేర్పరి; ‡ కృత్తోత్తమాంగుఁడు=నఱకఁబడినశిరము గలవాఁడు. § పత్రి=బాణము.

† విదితాస్త్రంబులఁ గన్పుగొట్టుచు వడిన్ • విద్వేషులన్ డోలుచున్
జెదరెన్ దద్బలముల్ చమూపతులకుం • నిల్పంగ రా కత్తఱిన్. 306

మ. అసురోద్ధత్యముఁ జూచి సైన్యక మహాహంకారహుంకారశౌ
ర్యసమేతాననుఁ డంజనీతనయుఁ డాదైత్యాధముం దాఁకె న
య్యసురుండుం బిఱుతీయ కొడ్డె నపు డత్యంతోగ్రమై వారికిం
బోనఁగెన్ శక్రవిరోచనాత్మజులకుం • బోలెన్ సమీకం బటన్. 307

తే. గదలఁ బరిఘల మొత్తె రాక్షసుఁడు హనుమ, నతఁడు గిరిపాదపాదుల • నతని మొత్తెఁ
జిత్తజల్లుగ నొండొరు • చెలఁగి వేయు, నాయుధంబుల బ్రుంగ రణాంగణంబు. 308

వ. అంతం గొంతవడికి. 309

మ. హనుమంతుం డపు డుక్కుమీఱి భుజశౌర్యం బేర్పడం గిన్కమై
ఘనభూమీధ్ర మొకండు గైకొని వడిన్ • గల్పాంతకుండో యనన్
దనుజాధీశ్వరుమీఁద వేసె నతఁ డాతం జూచుచుండంగఁ దో
ళ్ళై నిలన్ సాదియు రథ్యముల్ రథమునున్ • లీనంబులై త్రెళ్ళఁగన్. 310

వ. ఇట్లు ధూమ్రాక్షుండు త్రెళ్ళినం గని వనచరు లార్చి పేర్చి రాత్రించరుల నెల్లం ద్రెళ్ళ నేసి రంత హతశేషులు వారికోల్తల కోహటించి వెఱచి పఱచి రావణున కంతయు నెఱింగించిన నతండు ప్రహస్తధూమ్రాక్షులచావునకుఁ బెద్దయుం బ్రిద్దు నిట్టూర్పు నిగిడించి. 311

తే. పోటుబంటు లెల్లఁ • బొలిసిరి సమరంబు, భీకరంబ యగుచుఁ • బెచ్చుపెఱిగెఁ
గడఁగి నిద్రనుండి • వడిఁ గుంభకర్ణుని, లేవనైన కాల • మేపుమీఱె. 312

వ. అని నిశ్చయించుకొని ఘోరస్వరంబున గుబ్బు వెట్టి గాఢనిద్రం బడియున్న కుంభకర్ణు ననేకవాదిత్రంబులు మొరయించుచు నతిప్రయత్నంబున లేపి యి ట్లనియె. 313

ఉ. ధన్యుఁడ విట్టినిద్ర యను • దగ్గఱచుట్టము నంటి యుంట నీ
వన్య మెఱుంగ విప్పుడు మ • హాభయదం బగుపాటు వచ్చె సా
మాన్యము గాద దంతయుఁ గ్రమంబునఁ జెప్పెద నాలకించి మా
హైన్యము వాయఁ జేయుటకు • నార్జవముం గొనుమయ్య తమ్ముఁడా. 314

సీ. వంచించి రాముని • వనితఁ దెచ్చినదాన, నతఁడు సుగ్రీవసహాయుఁ డగుచుఁ
గపిసేనతోఁ గూడి • కడలిని బంధించి, తన్మార్గమున వచ్చి • దాడివెట్టి
మనపురంబున మేటి • మగలను మడియించి, కలన నా కవమాన • గతిని గూర్చె
నంతరించిరి ప్రహస్తాదు లింతకు నీవు, గాకాతనిం ద్రుంపఁ • గలఁడె యొకఁడు

† కన్పుగొట్టు = ఖండించు;



తే. బొందళముఁ దొడి యాయుధంబులు గ్రహించి, వజ్రవేగప్రమాథు లన్ • వారుదూష
ణానుజులు భూరిసేనతో • ననుసరింతు, రన్న నీ వేగి శత్రుల • మన్నిగొనుము. 315

కుంభకర్ణుఁడు యుద్ధము చేసి చచ్చుట.

వ. అని చెప్పి రావణుండు కుంభకర్ణు నియోగించిన నతండు కట్టాయితంబై కదలి రామలక్ష్మణరక్షితం బగువృక్షచరసైన్యంబుపైఁ గవిసి దానిం జెరికింగొనక రామదర్శనలాలసుండై చనువాఁ డెదుర ధనుర్బాణపాణి యయి వచ్చుసౌమిత్రిం గాంచి.

చ. §వడివడి లక్ష్మణుం దఱియ • వచ్చెడువానిని జుట్టుముట్టి బి
ట్టడరి వనేచరుల్ తరులు • నద్రులు వైచుచు గోళ్ళ గిచ్చుచున్
నుడిసి రదంబులం గఱచుచుం బడలింపఁగ రక్కసుండు దం
దడిఁ బడ కుగ్రమూర్తి యయి • దారుణరోషపరీతాత్ముఁడై. 317

తే. ||ఎదుటఁ బడి నందిటం జిక్కు • నెల్లకపుల, మునుముకొని మ్రింగె రాక్షసపుంగవుండు
బలుఁడుఁ జండబలుండును • వజ్రబాహుఁ, డాది యగువారు పడిరి త • దాస్యమందు.

తరళము. %కొలఁది మీఱినకుంభకర్ణుని • ఘోరకర్మముఁ గాంచి సం
చలనముం గొని తారముఖ్యులు • సాధ్వసంబున నార్చుచుం
దొలఁగి పాఱఁగఁ జొచ్చి రాధ్వని • దొందడిం బడి మ్రోసె ది
క్కులు విదిక్కులు నిండి మెండయి • కొంతకొంతటియంతలోన్. 319

ఉ. దేవరుపాటు దోఁప నటు • దిక్కుల కూడనిఁ బాఱుమర్కటలం
బావులనుండి చూచి భుజ • దర్పవినిర్జితశాత్రవుండు సు
గ్రీవుఁడు సాలహస్తుఁ డయి • గిట్టిన మెట్టుచు వచ్చి చెచ్చెరం
దేవవిరోధి మార్కొనె సు • దీర్ఘపరాక్రమవిక్రమంబునన్. 320

వ. అట్లు మార్కొని ఘోరయుద్ధం బొనర్చుచు. 321

మ. కినుకన్ వృక్షచరేశ్వరుండు భుజశక్తిం బూన్చి వృక్షంబునన్
దనుజాధీశ్వరుఁ డీలునో యనఁగ మూర్ధంబందు నొద్ధత్య మిం
పెనయన్ వ్రేసెను వ్రేసినం జిద్రుపలై • వృక్షమ్ము వమ్మయ్యె వ
జ్రినిభాంగుం డగుకుంభకర్ణునకు స్పర్శజ్ఞానముం గల్గఁగన్. 322

స్రగ్ధర. ‡ధైర్యస్థైర్యంబు లొప్పం • దలఁకక నలకంఠం గృతాంతుండు నా దో
ర్వీర్యం బగ్గింప బల్మి • న్వడివడ నగతిన్ • వ్రేల్మిడిం బట్టి కొట్టన్
గ్రోర్యాంచచ్చిత్తు వానిన్ • గనుకని కని వీఁక న్సుమిత్రాసుతుం డా
శ్చర్యంబుం దోఁప నేసెన్ • శర మరివయి దోస్సార మేపార నంతన్. 323

§ నుడియు = మట్టుకొను; || మునుముకొను = ఖరువపెట్టు. % దొందడి = సందడి. సమ్మర్దము;
‡ కనుకని = సంభ్రమము;

క. ఉర మాడి వరశరం బది, కర మరుదుగ నుచ్చిపోయి ♦ క్షతజావృత మై
ధరఁ జొచ్చె భిన్నహృదుఁ డై, సురవైరి చలింప కవుడు ♦ చుఱుకుఁదనమునన్.
వ. సుగ్రీవుం దిగవిడిచి ప్రగృహీతశిలాయుధుం డై సౌమిత్రిపైఁ గవియుటయును.
సీ. అతఁడు శిలాగ్రంబు ♦ లగుభల్లముల రెంట, దైత్యేశ్వరునిభుజ♦ద్వయము నఱకె
నఱకిన మాయమై ♦ నాల్గుచేతులతోడ, నసుర శిలావర్ష ♦ మడరఁ జేసె
లక్ష్మణుండును గర♦లాఘవంబున వాఁడి,తూవుల నదియును ♦ ద్రుంగ వైచె
నవుడు వాఁ డతికాయుఁ ♦ డై బహుభుజపాద,మస్తకంబులుగ్రాల♦మలయఁజొచ్చె
తే.*నంత వీఁ డలంతులఁ బోవఁ♦డంచు నెంచి, భక్తితో నభిమంత్రించి ♦ బాణమందు
బ్రాహ్మాస్త్రంబు సంధించి ♦ రామదేవు, తమ్ముఁడమ్మనుజాశిపైఁ♦దడయ కేసె.
తే. ఏసినం గూలె వాఁడు గ♦తాసు వగుచు, నశనిపాతంబునం దగ్ధ♦మై ధరిత్రిఁ
గూలుభూరుహమును బోలి ♦ ఘోర మగుచు, నొక్క పెట్టునఁ జప్పుడు ♦ పిక్కటిల్ల.
వ. ఇట్లు బ్రహ్మాస్త్రాభిహతుం డై కుంభకర్ణుండు గూలిన నిశాచరసేనాసమూహంబు సాధ్వసంబున నూడనిం బాఱుచుండ దూషణానుజు లైన వజ్రవేగప్రమాథు లను వారు వారి నెల్ల వారించి రామానుజుం దలపడి పోరం దొడంగి రతండును శరపరంపరల వారిం బరిభవించె నప్పు డొక్కముహూర్తమాత్రంబు వారు పోరెడిపోరు ఘోరం బయ్యె నయ్యవసరంబున. 328
మ.‡ఒకకొండం గొని మారుతాత్మజుఁడు తా ♦ నుద్గ్రీవుఁ డై వచ్చి పై
చ్చి కడుం గ్రొవ్వినవజ్రవేగునిపయిం ♦ జేవాఁడిమై నేసె నిం
కొకకొండం గొని వచ్చి నీలుఁడు కడున్ ♦ హుంకారముం జేయుచున్
ద్రికకుద్గోత్రము నా మెలంగెడుప్రమా♦థిం గొట్టె బిట్టుల్కతోన్. 329
క. ఆలీల నసురు లిద్దఱు, శైలంబులక్రింద నలిగి ♦ జముప్రోలికిఁ బో
నాలము విడి పడి మూఁకలు, పోలిరి దనం బట్టె ప్లవగ♦పుంగవు లార్వన్. 330
వ. అంత నట రావణుండు తద్వృత్తాంతం బంతయు విని చింతాకులస్వాంతుం డై యింద్రజిత్తుం బిలిచి కార్యం బెఱింగించి యి ట్లనియె. 331

ఇంద్రజిత్తు రావణప్రేరితుం డై యుద్ధమునకు వచ్చుట.

సీ. నీవ కదా దేవ♦దేవుని మెప్పించి, వరము లందినయట్టి♦వరసుతుఁడవు
నీవ కదా తొల్లి ♦ దేవేంద్రు నోడించి, నాకు వేడ్క యొసఁగిన♦నందనుఁడవు
నీవ కదా యెల్ల♦దేవళ్లచే వరవృషము నందినయట్టి♦పుత్రకుఁడవు
నీవ కదా బహు♦భావంబులన్ మాయ, లన్నియు నెఱిఁగిన♦యాత్మజుఁడవు

* బాహ్మాస్త్రము = బ్రహ్మాస్త్రము; ‡ త్రికకుద్గోత్రము = అంజనాచలము;



తే. నీకు దివ్యాస్త్రములు ఘన♦మోకుమార, రామలక్ష్మణసుగ్రీవు♦లీమెయిఁ గడుఁ
గ్రొవ్వి కుంభకర్ణాదులఁ ♦ గూల్చినారు, వారి మార్కొన నీవు గా♦కేరు తండ్రి.
తే. వినుము నీబారిఁ బడి వారు ♦ మనఁగ నోప, రీవు కట్టాయితం బయి ♦ యేగి పగఱ
నేర్చి హతు లైన సఖ్వారి♦ఋణముఁ దీర్చి, నామనం బలరింపవే ♦ నాకుమార. 333
వ. అనిన నతం డట్ల యగుం గావుత మని మైమఱువుఁ దొడిగి ధనుర్బాణపాణి యై వలయుసాధనంబు లెల్ల నమకట్టుకొని రథాధిరూఢుం డై రణాంగణంబునకుం జని వైరి దిక్కుం జూడక సుమిత్రానందనుచక్కటికి రథంబుఁ బోవ నిచ్చి నిజనామసంకీర్తనంబు సేయుచు సంగరంబునకుం గట్టాయితం బై ర మ్మని పిలిచిన నవ్వీరవరేణ్యుండు ధనుష్టంకారంబు సేయుచు మృగేంద్రుండు క్షుద్రమృగంబుపయి నెగసినచందంబునం గవిసిన వా రిద్దఱకు నవుడు మహాస్త్రశస్త్రంబుల మహాయుద్ధంబు సిద్ధించె నందు.
మ.*విలువిద్యన్ రఘురాముతమ్ముననకు నే♦వెంటం బయిం బోవ లే
కలఘుం డాదశకంఠనందనుఁడు ది♦వ్యప్రాభవం బేర్పడన్
వలుఁదల్ తోమరముల్ పరశ్శతము లో♦ర్వన్ వైప నిం తింత లై
యిలపై రాలఁగఁ ద్రుంచె వాని రఘువం♦శేశానుజుం డుమ్మలన్. 335
వ. అట్టియెడ. 336
క. తలకడచి వాలినందనుఁ, డలుకం బాదప మొకండు ♦ హస్తయుగమునం
గలిగించుకొని రయమ్మునఁ, దల పగిలెడునట్టు లేసె ♦ దశముఖతనయున్. 337
ఉ.†దానఁ జలింపఁ డింతయును ♦ దానవనాథకుమారుఁ డంగదుం
బూని నధింపఁ బేరురము ♦ ముట్టఁగఁ జూచుచుఁ బ్రాస మొత్తుడున్
దాని రఘూద్వహానుజుఁడు ♦ దారిన భగ్నము సేసెఁ జేసినన్
దానవుఁ డిరనం బొడిచె ♦ దైత్యుఁడు దగ్గఱి యంగదున్ గదన్. 338
వ. వామపార్శ్వంబునం బడినగదాప్రహారంబున నంగదుండు గదలక చలంబై చలంబున నొక్కసాలస్కంధంబున నింద్రజిరథరథ్యసారథులం జదియ మొత్తుటయు నత్తఱి విరథుండును వీతమనోరథుండు నై మేఘనాదుండు మాయాప్రభావంబున నంతర్ధానంబు నొందె నంత. 339

ఇంద్రజిత్తు మాయాయుద్ధము చేయుట.

ఆ. పెక్కుమాయ లెఱిఁగి ♦ పెం పెక్కి యున్నట్టి,వానిఁ గానఁ బడని♦వాని నింద్ర
జిత్తు నెఱిఁగి రాముఁ ♦ డత్తఱిఁ జనుదెంచి, సైన్యరక్షణంబు ♦ సలుపుచుండె. 340

* వలుఁదలు = స్థూలములు; పరశ్శతములు = నూటికంటె నధికసంఖ్యగలవి;
† ఈరస = ఈర్ష్య, రోషము;

శా. ‡అంతర్ధానము నొంది నింగి వరల♦బ్ధానంతవీర్యంబునన్
బంతం బొప్పఁగ నిల్చి యింద్రజి వడిన్ ♦ బహ్వస్త్రశస్త్రంబులన్
గాంతాళమ్మున రామలక్ష్మణుల న♦ల్గం గొట్టినన్ వారు నా
శాంతమ్ముల్ ప్రతిశబ్ద మీన శరముల్ ♦ సంధించి రొక్కుమ్మడిన్. 341

వ. అప్పుడు. 342

సీ. †కండోపలంబులు ♦ గైకొని వానరవీరులు దివి కేగి ♦ వెదకుచుండ
నగపడ కతఁ డంత ♦ కగ్గలంబుగఁ గోలుతల చేసి యంపవా♦నలను గురిసె
నృపసుతు లద్దాన ♦ నెఱి చెడి పడి రిల, నుదయకాలమున సూర్య♦చంద్రు లనఁగ
నవు డార్చె నింద్రజి ♦ కృప లేక వరశక్తి, బంధించె శరపరం♦పరల వారిఁ

తే. బంజరంబునఁ జిక్కిన♦పక్షు లట్లు, కదల నేరక రామల♦క్ష్మణులు పడఁగఁ
గని ముదంపడి క్రొల్లుబ్బి♦తనజయంబు, తండ్రి కెఱిఁగింపఁ జనె దైత్య♦తనయుఁ డుఱికి.

వ. అంత సుగ్రీవాంగద సుషేణ మైంద ద్వివిద కుముద హనుమ న్నీల తార నల ప్రభృతు లెల్లరును విభీషణుం బొదిగికొని రామలక్ష్మణులు పడియున్నకడకు వచ్చి యేమియుం జేయఁ జాలక జాలిం బడుచున్నం గని విభీషణుండు ప్రజ్ఞాస్త్రంబున వారలం బ్రబోధితులం గావించె సుగ్రీవుండు దివ్యమంత్రప్రయుక్తం బగువిశల్యకరణిచే వారి విగతశల్యులం జేసె నపుడు విభీషణుండు లబ్ధసంజ్ఞు లగురాజనందనులం గని చేదోయి మోడ్చి యి ట్లనియె. 344

తరువోజ. §జననాథ! ధనదుని♦శాసనంబునను ♦ జనుదెంచె నిట శ్వేత♦శైలంబునుండి
ఘనుఁడు గుహ్యకుఁ డదె ♦ కైకొని దివ్య♦కమలంబులం దానఁ ♦ కనుదోయి గడుగు
కొనిన నదృశ్యమై ♦ కొదరెడుభూత♦కోటిఁ జూడఁగ వచ్చుఁ ♦ గొనకొని నీవు
ననుజుండు సుగ్రీవుఁ ♦ డాదిగాఁ గలుగు♦నందఱు నటు సేయుఁ ♦ డని చెప్పుటయును.

వ. ‖అప్పుంగాత మని రామలక్ష్మణులం దొట్టివా రెల్లరును విభీషణోక్తక్రమంబునం జేసి యతీంద్రియంబు లైనభూతంబులం జూచి రంత మందోదరీనందనుండు వచ్చి తొంటి యట్ల మింటినుండి పోరుచున్నం గని విభీషణుండు వాఁ డకృతాహ్నికుండని యెఱింగి లక్ష్మణుం బిలిచి నీవు వీని నిపుడు పోనీక పొదువు మనిన నతం డతనిం దలపడియె నపు డన్యోన్యవిజిగీషువు లగువా రిద్దరకును శక్రప్రహ్లాదులకుం బోలె మహాయోధనం బత్యంతాశ్చర్యకరం బయ్యె నయ్యెడ. 346

‡ కాంతాళము = ఈర్ష్య; † కోలుతల = ఎదుట నిలిచి యుద్ధముచేయుట;
క్రొల్లుబ్బు = అతిశయించు; § కొదరు = అతిశయించు.
కొనకొని = యత్నించి. ‖ అకృతాహ్నికుండు = చేయనినిత్యకర్మము గలవాఁడు.



### ఇంద్రజిత్తు లక్ష్మణునిచేఁ జచ్చుట.

క. వేఁడి గలవాఁడితూపులఁ, గాఁడఁగ లక్ష్మణుని వేసెఁ ♦ గ్రవ్యాదసుతుం
డోడక లక్ష్మణుఁ డగ్నికి, నీ డగువాలమ్ము లడర ♦ నీసున నేసెన్. 347

ఆ. వేఁడిపిడుగు లట్లు ♦ పెన వచ్చి సౌమిత్రి,మార్గణములు దాఁక ♦ మానుషాశి
క్రోధమూర్ఛితుఁ డయి ♦ కొట్టె నెన్మిదిశిత,సాయకముల నతనిఁ ♦ జండగతిని.

వ. అంత. 349

మ. అలుకన్ లక్ష్మణుఁ డంబకత్రితయమున్ ♦ హస్తంబునం బూన్చి జం
టలుగా దక్షిణహస్త మొంట మఱి యొం♦టన్ వామహస్తంబునుం
దలితం బై పడ నేసి వాసిఁ గడ నొం♦దానన్ సురారాతికుం
డలగండస్థలభాసమానశిరమున్ ♦ ఖండించెఁ జండక్రియన్. 350

వ. ఇ ట్లింద్రజిత్తుం బరిమార్చి వానికబంధంబుతోడ వానిసూతునికబంధంబు నిలఁ బడం జేయుటం జేసి రథికసారథివినాకృతం బైనరథంబు నారథ్యంబు లీడ్చుకొని లంకాభిముఖంబు గాఁ జనుటయుం గని రావణుండు పుత్రశోకార్తుం డై సంభ్రమించి జానకిం జంప నెంచి ఖడ్గహస్తుం డై యశోకవనమార్గంబు వట్టిన వాని వారించి వరగుణావంధ్యుం డైనయవింధ్యుం డి ట్లనియె. 351

మ. వలుమాఱు త్రిదశముఖామరప్రముఖులన్ ♦ భంజించి త్రైలోక్యరా
జ్యలసల్లక్ష్మి కధీశ్వరుండ వయి ప్ర♦ఖ్యాతిం బ్రవర్తించునీ
వలుకం జేసి నెలంతఁ జంపఁ జనుటల్ ♦ న్యాయంబె నీయంతవాఁ
డలఁతుల్ సేయునె రాముఁ డెంత యగు నీ ♦ కవ్వాని దోరింపవే. 352

తే. నీవు చెఱఁబట్టినప్పుడే ♦ నెలఁత మిన్న,చచ్చినది దానిఁ జంపుట ♦ చాలు నింకఁ
దత్ప్రయత్నము మాని యో♦దైత్యనాథ,కడిమి గలదేని శత్రులఁ♦బొడిచి గెలువు.

వ. అని యనేకవిధంబులం బలికినపలుకు లాలించి రావణుండు నిజనిర్యాణంబు నిశ్చయించుకొని పరిజనానీతంబును రత్నవిభూషితంబు నగుకనకరథం బధిష్ఠించి నానావిధాయుధపాణు లగుఘోరరాక్షసులు శతసహస్రంబులుగఁ బరివేష్టింప సంగ్రామరంగంబునకుం జనుదెంచుటయును. 354

### రావణాసురుండు వచ్చి యుద్ధము చేయుట.

మ. కని మైందాంగదజాంబవత్ప్రముఖు లా♦క్రవ్యాదసైన్యంబులన్
ఘనరోషాకలితాంతరంగు లగుచున్ ♦ గన్గో దశగ్రీవుఁ డా

* త్తనగానోకహభీషణాయుధులు నుద్యన్మూర్తులై చుట్టుము
ట్టి నెఱిం జూపుచుఁ జిందువందు◆లగుమార్కిం జేసి రొక్కుమ్మడిన్. 355

వ. ఇట్లు తనసైన్యంబు దైన్యంబు నొందినం గని కనలి రాక్షసేశ్వరుండు రాక్షసమాయం గావించె దానం జేసి వానిదేహంబునుండి పరశు పట్టస ముసల ముద్గర కరవాల భిండివాల శూలాద్యనేకాయుధంబులం దాల్చి శతసహస్రసంఖ్యాకు లగు రాక్షసవీరు లుదయించుటయు రఘురాముండు వారి నెల్ల దివ్యాస్త్రంబులఁ జంపి చెండాడిన వెండియు దశగ్రీవుండు రామలక్ష్మణులం బోలిన పెక్కురక్కసులం బుట్టించి తాను వారితోడం బోరుచున్నట్లున్నం గని సుమిత్రానందనుం డసంభ్రాంతుండై యగ్రజున కిట్లనియె. 356

మ. ‡మనరూపంబున సృష్టిఁ జేసె ఖలుఁ డీమాయావి రక్షోజనం
బును వీక్షించితె పాపయాత్మ మగునీయొత్తమ్ముఁ జిత్తమ్మునం
గొన కింతేఁ గరుణారసమ్ముఁ గడిమిం గ్రూరాస్త్రపాతమ్మునం
దునుమాడం జను నన్న రాముఁడు వడిం దూఁటాడె నమ్మాటులన్. 357

వ. అంత దేవేంద్రప్రేషితంబును హర్యశ్వయుక్తంబును నాదిత్యప్రభాభాసమానంబు నగుదివ్యరథంబుం గొనివచ్చి వియచ్చరాధినాథసారథి యగుమాతలి రామచంద్రుం గాంచి యి ట్లనియె. 358

చ. త్రిదశవిభుండు పంపఁ గొని తెచ్చితి నీహరివాహనాంచితం
బుదితదివాకరాభము సముజ్జ్వల మీరథవర్య మిందునం
బొదలి సురేశ్వరుం డసురపుంగవులం బరిమార్చె మున్ జయ
ప్రద మిది దీని నెక్కి రఘురామ జయింపుము నీవు రావణున్. 359

చ. అనవుడు రాఘవుండు నది యంతయు రాక్షసమాయ గాఁ దలం
చినఁ గని యవ్విభీషణుఁడు చేరఁగ వచ్చి మహీశ మాయ గా
మనమున నెన్నఁ బోకు మన మానవనాథుఁడు నంతసించి మే
లనుచు రథంబు నెక్కి చన నాదశకంధరుఁ డాఁక వీకమై. 360

తే. రామరావణు లిట్లు సంగ్రామమునకు, మొనయ హాహాకృతిం జేసె భూతచయము
దేవదుందుభినాదముల్ దివి నెసంగె, నుభయసేనలఁ గలకలం బుప్పతిల్లె. 361

వ. ఇట్లలబ్ధోపమంబుగా రామరావణులు మహాఘోరప్రకారసమరంబునకు డీకొని పోరాడుచున్న సమయంబున. 362

◆ చిందువందు = చెదరినది. ‡ తూఁటాడు = జర్జరితము చేయు.



రావణుండు రాముని తో యుద్ధము చేసి చచ్చుట.

మ. అధికక్రోధసమగ్రవిగ్రహుఁడు దైత్యాధీశుఁ డాశావకా
శధృతజ్వాలము శూలముం భుజబలస్ఫారప్రభాభ్రాజిత
ప్రధితప్రక్రియ నెత్తి యొత్త నశనిప్రఖ్యంబునుం బ్రహ్మదం
డధురీణం బగుదాని రాముఁడు వడిం ఖండించె రెండై పడన్. 363

తే. రాఘవునిదుష్కరం బయిన క్రాలుకర్మ, మరసి భయ మంది రావణుం డట్టె క్రుద్ధుఁ
డగుచుఁ దోమర భిండివాలాసి ముసల,ముద్గరాదుల నొంచె రాముని గడంక. 364

తే. శతసహస్రంబులుగ నిట్లు శస్త్రసమితి, రాఘవుని ముంచి మించిన రావణాసు
రునిఁ గనుంగొని భయ మంది కనుకనిపడి, పఱచె నఱచుచు వానరబలము లెల్ల.

వ. అంతఁ గొంతవడి కమ్మహీకాంతుండు. 366

మ. *సుముఖంబున్ సుమనస్సఖంబుఁ ద్రిజగత్త్రాసత్రాణపత్రం బను
త్తమగోత్రంబు సువర్ణపుంఖము మహోద్యత్ప్రేంఖమై యొప్పుబా
ణముఁ దూణమ్మున నుండి తీసి గరిమన్ బ్రహ్మాస్త్రమంత్రంబునన్
స్థిమితత్వంబు లభింపఁ జేసి మనుజాధీశుం డ్రేసె నేర్పడన్. 367

చ. అదియును భూనభోంతర మందంతయు నిండి సురారిగుండియల్
చెదరఁగ మండుచుం జదల జిష్ణుముఖామరు లెల్ల నుబ్బునం
బొదలఁగ రక్కసుల్ వెగడు వొంద సయంత్రరథాశ్వకంబు గాఁ
గదిసి నిమేషమాత్రమునఁ గాలిచిపుచ్చెను రావణాసురున్. 368

తే. అసుర బ్రహ్మాస్త్రనిర్దగ్ధుఁ డయ్యెఁ గాన, నరయ రా దయ్యె దేహమాంసాదికం బె
కాక భస్మంబు నాశ్చర్యకముగ నప్పు, డఖిలలోకంబులకు శాంతి యావహిల్లె.

సీ. అట్లు దశగ్రీవుఁ డంతరించిన వచ్చి, దేవర్షు లాశీర్వదించి రెలమి
దివి దుందుభులు మ్రోసెఁ దివిరి గంధర్వులు, పాడి రచ్చర లాడి రోడ కపుడు
దిశ లెల్ల నిర్మలదశ నొందెఁ దఱచగు, పుష్పవర్షంబుల భూమి నిండె
నాకాశము మహోత్సవాధికసంకాశ, మయ్యె నింద్రాదులు హర్ష మంది

తే. రంతసంతోషమున రాముఁ డనుజసహితుఁ, డగుచు లంకాధిరాజ్యమునందుఁ బొందు
పడ విభీషణునిం బట్టభద్రుఁ జేసి, విమలజలముల నభిషేకవిధులు దీర్చె. 370

వ. అనంతరం బవ్విభీషణుండు వృద్ధామాత్యుం డగునవింధ్యుం గూడి సీతాదేవిం బురస్కరించుకొని వచ్చి రామదేవునకు నివేదించె. 371

* పత్రము = ఱెక్క. అనుత్తమగోత్రము = మంచిపేరు గలది, మంచిబలము గలది.
ప్రేంఖ = పర్యటనము.

విభీషణుండు సీతం దెచ్చి రామునకు నివేదించుట.

క. పరమపతివ్రత యగునీ సరసీరుహపత్రనేత్రి ♦ సచ్చారిత్రిన్
గరుణించి చేకొనం దగు, శరణార్థులప్రార్థనంబు ♦ సర్వజ్ఞనిధీ. 372

చ. †అనుడు రథంబు డిగ్గి సుగుణాంచితుఁ డారఘురాముఁ డార్త యై
కనుఁగవ నుష్ణబాష్పములు ♦ కాలువ గట్టఁగ వెక్కి మ్రింగుచున్
వనటఁ గృశించి యున్నవద ♦ నం బది వంచి చలించుదాని మా
సినవసనంబుదానిఁ గని ✓ చేఁతతీకం బెనఁగంగ నిట్లనున్. 373

సీ. చెఱఁ బడి యున్నని ♦ న్నతి విడిపించితి, నిచ్చ వచ్చినచోటి ♦ కేగు మీవు
నకేఁ గోలుపోయె నన్ ♦ నడి కోర్వ కి ట్లరిఁ, గలనఁ గూల్చితిఁ బ్రీతి ♦ కారముగను
బరహస్తగత యగు ♦ పడఁతి నాయట్టిధర్మజ్ఞుఁ డెవ్వఁడు గొన ♦ మదిఁ దలంచు
నీవు సువృత్త వై ♦ తేని దుర్వృత్త వై, తేని పరిత్యాగ ♦ మే హితంబు

తే. కుక్క మూర్కొన్నహవ్యంబు ♦ గొనఁగ రాని, పగిది నీ వైతి పెక్కులు ♦ పలుక నేల
నరుగు మిట నుండి నీభోగ ♦ మభిలషింప, నామనోనిశ్చయం బిది ♦ నమ్ము మతివ.

వ. అని పలికినకర్ణకఠోరంపుఁబలుకులు విని వ్యథితచిత్త యై మత్తకాశిని మొదలు నఱికినకదళివలెం గంపించుచు లక్ష్మణసుగ్రీవాంగదాదులు నిశ్చేష్టు లై యుండ నేలం గూలె నంతఁ జతుర్ముఖుండును శక్రాగ్ని వాయు యమ వరుణులును యక్షాధినాథుండును సప్తర్షులును దివ్యమూర్తిధరుం డగుదశరథుండును దేవ గంధర్వాదిసేవితు లై హంసయుక్తవిమానంబు లధిష్ఠించి వచ్చి యంతరిక్షంబున శరన్నిశాసమయనక్షత్రంబులువలె వెలుంగుచు నయ్యంతయుం జూచుచుండి రంతఁ గాంతాజనమతల్లి యగు వైదేహి మెల్లమెల్లన లేచి రామచంద్రుం జూచి యి ట్లనియె. 375

ఆ. నిన్నుఁ గాక నన్యు ♦ నే స్వప్నమం దైనఁ, దలఁచి యుండినట్టి ♦ దానఁ గాను
దురిత మింత యెఱుఁగ ♦ నరనాథ పంచభూ, తములు సాక్ష్య మిచ్చుఁ ♦ దవిలి నాకు.

క. త్రికరణశుద్ధిగఁ బలికితి, నకలంకమనస్కురాల ♦ నని నే నిటఁ దా
వకపదము లంటి చేసెద, సకలజగం బెఱుఁగ బాస ♦ సదమలహృదయా. 377

చ. తగ దన కే నొకిం తయినఁ ♦ దప్పొనరించితి నేని రేపవల్
జగములలోపలన్ వెలుప ♦ లన్ వెలుఁగొందెడుచంద్రసూర్యులున్

† చేఁతతీకము = కీడు.



†మృగవాహుఁడు న్నను గినిసి ♦ మిత్తికి నిత్తురు గాక కానిచోఁ
దగవరు లై యథార్థమును ♦ దాఁపక తారు వచింత్రు గావునన్. 378

వ. అని పలుకుచున్నంత నంతరిక్షచరంబు లైనపంచభూతంబులు తమతమనామంబు లెఱింగించి రఘురాముం గాంచి. 379

ఉ. భూతలనాథ మే మఖిల ♦ భూతములందు మెలంగుచుండుటన్
భూతచరిత్ర మంతయును ♦ బోల నెఱుంగుదు మాలకింపు మీ
సీత సతీవతంస మగుఁ ♦ జేసి యెఱుంగ దొకింతతప్పు నీ
వీతఱిఁ గానిమాట లన ♦ కేలు మయోనిజ దీని నర్మిలిన్. 380

వ. అనునప్పుడు బ్రహ్మదేవుండు రామదేవుం బేర్కొని యి ట్లనియె. 381

సీ. భువనకంటకుఁ డైన ♦ దివిజారిఁ బరిమార్చి, సకలభూతహితంబు ♦ సలిపి తీవు
నావరంబున వాఁడు ♦ దేవతాసాధ్యుఁ డై, తనచావునకె జాన ♦ కినిహరించె
నలకూబరునిశాప ♦ కలనంబున న్వాఁడు, సతి బల్మి నంటినఁ ♦ జచ్చు నపుడ
దాన నంటఁడు సీత ♦ నే నెఱుంగుదు నిట, శంకింప కేలు మీ ♦ సాధ్విఁ బడసి

తే. యనుడు దశరథుఁ డరుదెంచి ♦ తనయ నేను, దశరథుండను నీచేతఁ ♦ దనిసి నాఁడ
సీతతో లక్ష్మణునితోడఁ ♦ బ్రీతి నరిగి, రాజ్య మేలు మయోధ్యాపు ♦ రంబునందు.

వ. అనిన రామచంద్రుండునుం దనతండ్రి కభివందనం బాచరించి దేవా నేను నాతండ్రి వైననీశాసనంబునం బ్రవర్తించెద నని విన్నవించి దేవతల కెల్ల మ్రొక్కి దేవేరిం బరిగ్రహించి శచీసహితుం డయినదేవేంద్రునిచందంబునం దేజరిల్లె త్రిజటావింధ్యులకు నభీష్టార్థంబులు సిద్ధింపఁ జేసి యున్నప్పుడు సురేశ్వరపురోగముం డై పరమేష్ఠి రఘురామపరిసరంబున కరుదెంచి యభిమతంబు లర్థింపు మనిన నతం డతని కి ట్లనియె. 383

క. దేవ వరంబులు నా కిడఁ, గా వలతే నిమ్ము ధర్మ ♦ కర్మస్థితియుం
దేవారినిహతవానర, జీవనముం జయము కరుణఁ ♦ జేసినబుద్ధిన్. 384

వ. అనిన నతం డట్ల యగుం గావుత మని వరం బొసంగి వలీముఖప్రవరుల నెల్లఁ బ్రతికించి నిజనివాసంబునకుం జనియె మాతలియు నింద్రాదిబృందారకబృందంబులును రామచంద్రు నామంత్రణంబుఁ జేసి స్వర్గంబునకు నిర్గమించె నప్పుడు జనకరాజనందిని వాయునందనుదిక్కు మొగం బై యి ట్లనియె. 385

† మృగవాహుఁడు = వాయువు.

ఉ. నాకు మహోపకారము నొనర్చినవాఁడవు ప్రోడ వన్న నే
నీకు వరం బొసంగెద ననింద్యచరిత్రుఁడు రాముకీర్తి యీ
లోకమునందుఁ బొందుగ వెలుంగుచు నుండెడునంతదాఁక నీ
వీకరణిం దలిర్చుచు రహిన్ జిరజీవివి గమ్ము నెమ్మదిన్. 386

శ్రీరాముఁ డయోధ్యాపురంబునఁ బట్టాభిషిక్తుం డగుట.

వ. అంత శ్రీరామచంద్రుండు సీతాలక్ష్మణసమేతుం డై సుగ్రీవాంగదజాంబవత్ప్రముఖ వానరపరివారంబు పరివేష్టింప విభీషణుం బురస్కరించుకొని పుష్పకాధిరూఢుం డై వెడలి సేతుమార్గంబున మకరాలయంబు దాఁటి కిష్కింధాపురంబునకుం జని యావరాజ్యంబున నంగదు నభిషేకించి యథాగతకృతగమనుం డై సాకేతంబున కరిగి హనుమంతుం బుచ్చి నందిగ్రామంబునఁ జీరవసను లై యున్న భరతశత్రుఘ్నులం దోడి తెచ్చి తత్సమర్పితం బైనరాజ్యంబుఁ బరిగ్రహించి తారాబలచంద్రబలయుక్తం బైనయొక్కశుభముహూర్తంబున. 387

సీ. ఉభయపార్శ్వమ్ములం దుండి తమ్ములు భక్తి, భరితు లై ఛత్రచామరము లిడఁగ
వామభాగమునందు వైభవం బెసలారఁ, గనుల నవ్వుచు సీత గరిమ మెఱయఁ
బ్లవగాసురేశ్వరుల్ పరివారయుక్తు లై, ముద మొప్ప నిటు నటు మూఁగి కొలువఁ
బవమానసూనుఁడు భయభక్తియుక్తుఁడై, పాదపీఠముకడఁ బాదు కొనఁగఁ
తే. గడలఁ బౌరులు బంధుగుల్ గనుచు నుండ
రమణ మెఱయఁగ వివిధతూర్యములు మొరయ
వామదేవవసిష్ఠులు వలుక శ్రుతులు
రాముఁ డప్పుడు పట్టాభిరాముఁ డయ్యె. 388

వ. ఇట్లు పట్టాభిషిక్తుం డైనరామచంద్రుండు విభీషణసుగ్రీవాదిసుహృజ్జనంబులం దగినవిధంబున సత్కరించి వారివారిపొందుపట్లకుం బుచ్చి యశ్వమేధాధ్వరుండు [?] పుష్పకం బర్పించి తాను గోమతీతీరంబున ననేకయాగంబులు సేసి నానావిధభోగంబులు గ్రాలఁ బెక్కేండ్లు రాజ్యపరిపాలనంబుఁ గావించి కీర్తిశేషుం డయ్యె.

మ. ఇది రామాయణసంగ్రహంబు విను మో యీ! రామచంద్రుండు ధాఁ
బదునాల్గేఁడు లరణ్యమందు వ్యసనప్రాప్తిం బ్రవర్తించె నీ
యది తత్తుల్యము గాదు సీతవలె నీయబ్జాక్షియుం బొంద దా
పద లంకేశ్వరుఁ బోలి సైంధవుఁడు పాపం బెంచలే దారయన్. 390

క. భూతల మెల్లన్ బాహు, స్ఫీతౌజశ్శక్తి గెలిచి చెన్నలరెడునీ
యాతోఁబుట్టువు లెప్పుడు, నీతోడం గూడి యుండ నెగు లేమిటికిన్. 391



క. నీ వింక వగవ కుండుము, ద్రోవది సాధ్వీమతల్లి తో డగుట శుభ
శ్రీ వెలయు మీకుఁ దొల్లిట, సావిత్రికతమున బంధుసమితికిఁ బోలెన్. 392

వ. అని చెప్పె నని చెప్పిన విని శౌనకాదు లవ్వలివృత్తాంతంబుఁ జెప్పు మని సూతు నడుగుటయును. 393

ఆశ్వాసాంతము.

మ. గ్రహచారం బపసవ్యమార్గగతి మైఁ గన్పట్టునప్పట్టునన్
సుహృదుం డైనను దుర్హృదుం డయి కడున్ శోచ్యార్థముం గూర్చెడున్
సహజుం డైన సపత్నసన్నిభుఁ డగున్ దత్సర్వమున్ నీయను
గ్రహ మున్నన్ను నేమిసేయఁ గలుగుం గారుణ్యవారాంనిధీ. 394

క. మనుజులచేతల కెప్పుడు, మనమున జంకంగ రాదు మనికితపముచున్
దనచేతలకున్ జంకఁగఁ, జను నీకృపఁ గోరునట్టిజనుఁ డఖిలేశా. 395

గద్యము.

ఇది శ్రీమదధునాతనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తికవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునం
దారణ్యపర్వంబున నవమాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీ

బాలాత్రిపురసుందర్యైనమః.

# శ్రీకృష్ణభారతము

## అరణ్యపర్వము.—దశమాశ్వాసము.

—:o:—



క. శ్రీ తత్త్వవేత్త యనినం
బ్రీతిమెయిన్ వానిఁ గొలిచి ♦ విఖ్యాతికి నై
పూతచరిత్రుం డై తగు
భూతలపతిఁ జంద్రమౌళిఁ ♦ బ్రోవుము దేవా! 1

### పతివ్రతామాహాత్మ్యపర్వము.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కి ట్లనియె నట్లు చెప్పిన మార్కండేయుం జూచి
పాండవాగ్రజుం డి ట్లనియె. 2

తే. దేవ సావిత్రి యనుమహా♦దేవి తొల్లి, ధరణిఁ బొలుపొందె ననియు నా♦తల్లి పుణ్య
వృత్త్ఁ గ్రాలె డి యనియు నే ♦ వింటిఁ దచ్చ,రిత్ర మంతయు విన విన♦రింపు మెలమి.

వ. అని యిట్లు పుణ్యకథాశ్రవణకుతూహలాయత్తచిత్తుం డై విన్నవించిన సత్తాపసో
త్తముం డి ట్లని చెప్పం దొడంగె. 4

ఆ. మద్రదేశమందు ♦ మాద్రి మీఱిన తేజ, సత్యసంధతయును ♦ నిత్యశౌచ
మాస్తికత్వ మమర ♦ నశ్వపతి యనంగఁ, గలఁడు పార్థివుండు ♦ ఘనయశుండు. 5

ఉ.*భూతహితుండు శాంతుఁడు ప్ర♦భూతహిరణ్యుఁడు పుణ్యశీలుఁ డా
భూతలనేత ప్రీతిమెయిఁ ♦ బూతచరిత్రను మాలవీసమా
ఖ్యాతులితాత్తగోత్ర వన♦జాయతనేత్రను బెండ్లియాడి ప్ర
ఖ్యాతికి నెక్కి నిక్క మగు♦నాదృతి నేలె ధరాధిరాజ్యమున్. 6

ఉ. పాఁడియుఁ బంటయుం గలిగి ♦ బల్సిరులం దులఁదూఁగుచుండునా
ఱేఁడు సభార్యుఁ డై తగుత♦ఱిం గురియ న్నెలమూఁడువాన లే

* మాలవీసమాఖ్యాతులితాత్తగోత్ర = మాలవి యని కీర్తిచేఁ బోలిక లేనట్లు పొందఁబడిన పేరు గలది; ఆదృతి = ఆదరము.



గౌమను లేక భూప్రజకుఁ ♦ గోరుసుఖంబులు దొప్పదోఁగఁ గాఁ
బాడిగ రాజ్య మేలుచును ♦ భాసిలుచుండె మహీతలంబునన్. 7

క. కమనీం డ్లిట్లాతఁడు దన,పడఁతుకతోఁ గూడి పంట♦వలఁతిని నెమ్మిం
గమకొని యేలుచు నుండియుఁ, గొమరులు లేనట్టిదగను ♦ గుతిలం బడుచున్. 8

చ.†కుమరులఁ గట్టఁ గల్గినను ♦ గోల్కొని సొమ్ములు దాల్చి పొల్చినన్
మడఁతులపిండు గొల్చి కడు ♦ మన్నన సేయుచు నంటి యుండినన్
గడఁ గొన నోములం జలిపి ♦ కాలెడువారయుసం దలంపఁ గాఁ
గొమరులు లేనిమానినుల♦కుం గుదు రింతయుఁ గాదు కావునన్. 9

తే.‡నడిక వయ సైనఁ గొమరులఁ♦బడయ కతఁడు,వగచి విజితేంద్రియుం డయి♦వనుల వన్య
ఫాలమితభోజనుం డయి ♦ కడఁగి వేల్చె, వహ్నిముఖమున వేనవేల్♦వారములుగ.

ఉ./పత్రము లప్పు లీఁదయును ♦ భక్షణముం బొనరించుచుండి సా
విత్రిని దివ్యగాత్రిని బ♦వి త్రజనేష్టవిధాత్రిఁ జిత్తమం
దాత్రము లేనిభక్తిఁ గొని ♦ యశ్వపతీశ్వరుఁ డంత యేనియుం
బాత్రిగరిష్ఠనిష్ఠమెయి ♦ భవ్యతపం బొనరించె మించఁగన్. 11

ఉ.%ఎంతయు భక్తి నిట్లు పదు♦నెన్మిది యేఁడులు నేకదీక్ష గా
నిం తనరానికస్తి వన♦మే వనమందున జీవనంబు గా
సంతస మందుమార్గము పొ♦సంగ సరస్వతి సేవ చేసి నా
చింతితముల్ ఘటింపు మని ♦ చేసె నతుల్ వినుతుల్ మహాకృతుల్. 12

వ. ఇ ట్లష్టాదశవర్షంబులు గడచినపు డావహ్నికుండంబునుండి. 13

### మద్రపతికి సావిత్రి ప్రత్యక్షం బగుట.

సీ. సిరముపూఁబూపచం♦దురునివెన్నెలతో ని,గారంపుఁ దెలిమేని♦కళలు నెఱయఁ
బాణి నాడెమచిల్క♦పల్కులు మీటువ,ల్లకి కనుగుణతాళ♦లయలు గాఁగఁ
నుపనిషత్తులు నిత్య ♦ ముడిగంపుఁ జెలియ లై, యిరుచక్కి పీవోపు♦లిడుచునుండ
నొంటొంటఁ బయ్యెంట ♦ నోరయుసంగీతసా,హిత్యాత్మకుచములు ♦ సొనఁగ సరము

తే. లంచవాహనమం దూర్మి ♦ సధినసించి, పంచమశ్రుతి వీణ వా♦యించు కొనుచు
వివిధవిద్యావిధాత్రి సా♦విత్రి రాజ,చంద్రునినముక్షమందు సా♦క్షాత్కరించె. 14

తే. అట్లు సాక్షాత్కరించిన♦యజునిరాణి, నీక్షణముఁ జేసి భక్తి మ♦ద్రక్షితీశుఁ
డంఘ్రిపద్మములందు సా♦ష్టాంగ మెఱఁగి, వినయవినమితగాత్రుఁ డై ♦ వినుతిఁ జేసి.

† కోల్కొను = ఉత్సహించు. కడఁగొన = చివరకుబొందునట్లు, అనఁగాఁ గడముట్ట యని యర్థము. అన్నియు నని తాత్పర్యము. ‡ వారములు = పర్యాయములు; / అప్పులు = ఉదకములు. ఈఁద = గాలి. % వనము = ఉదకము, అడవి;

ఉ. డెందము గందళింపఁగ గడెందినుతుల్ పచరించునత్తఱిన్
జెందినప్రేముడి న్వరము ♦ నేగి దలంగ నొసంగుదున్ మనం
బందలిదాని వేఁడు మివు ♦ డంచు సరస్వతి గారవంబుతో
డం దిలకించుచుం బలికె ♦ డగ్గఱి కౌతుక మావహిల్లఁగన్ 16

క. పలికినపలుకులు నృపతికిఁ, బులకండంబులను బోల ♦ ముద మొదఁ బొదలన్
నలువుచుఁ జవుల న్నింపం, బలికెన్ బుత్త్రిని నొసంగు ♦ మా కని భక్తిన్. 17

చ. అనవుడుఁ బుత్త్రి వుట్టు నని ♦ యాపరమేష్ఠికళత్రి మాన తీ
విని మనమందు సంతసము ♦ విచ్చి నరేశ్వరుఁ డమ్మరో భవ
ద్ఘనకరుణాకటాక్షమును ♦ గాంచినమాకుఁ గులంబుఁ దేర్పునం
దనుఁడు జనింపఁ గా వలదె ♦ దాసులకుం గృపసేయు మట్లు గాన్. 18

క. భూవిభువిన్నపమును విని, సావిత్త్రి దయారసంబు ♦ సంధిల మఱియున్
నీవాంఛితంబు ము న్నే, నావిధి కెఱిఁగింప నతఁడు ♦ నాత్మజ గాఁగన్. 19

క. ఉద్దేశించెను గావున, నద్దేవునిశాసనంబు ♦ వ్యర్థము గా ద
మ్ముద్దియకతమున నూర్వురు, ముద్దులసుతు లుద్భవింతురి ♦ మోహము దీఱన్. 20

వ. అని యనుగ్రహించి సావిత్త్రి యంతర్ధానంబు నొందె నంత మహీకాంతుండు కాం
తాసహితుండై పురప్రవేశంబు చేసి సుఖముండె ననంతరంబ. 21

క. నవరసికు లాలు మగఁడును, నవరత్నఖచిత మైన ♦ నవభవనమునన్
నివసించి యుండునప్పుడు, నవగర్భము తేటపడియె ♦ నవలాకుఁ దగన్. 22

క. †నెల దప్పెఁ గోర్కు లొప్పెను, బలుకులు నడకలును జాల ♦ బడలికఁ జెప్పెన్
బలువేవి ళ్ళొగిఁ గప్పెను, వెలవెలనై మోము కళల ♦ విప్పం గుప్పెన్. 23

వ. అంత. 24

—◆— మద్రపతికి సావిత్త్రి పుట్టుట. —◆—

క. §గుర్విణి యగుమాళవి యటు, గుర్వాప్తి న్నీరు మోసి ♦ గురులగ్నమునన్
సర్వశుభగ్రహములు గా, నుర్విజను ల్మెచ్చఁ గనియె ♦ నొ ప్పగుకూఁతున్. 25

క. ‡జననాథాగణి యంతన్, ధనములు ధాన్యములు భూమణంబులు భూముల్
ఘను లగువిప్రులకుం గలజనులకు నిడె జాతకర్మ ♦ సమయమునందున్. 26

క. సావిత్త్రికరుణ పెంపున, దేవత లగ్గింపఁ దనకుఁ ♦ దేజస్స్ఫూర్తిన్
భావింప నైనకన్యకు, సావిత్త్రి యటంచుఁ బేరు ♦ జనకుఁడు వెట్టెన్. 27

† విప్పు = బాహుళ్యము; గుప్పు = చల్లు; § గుర్విణి = చూలాలు. ‡ కలజనులు = ఉన్న యితరజనులు;



వ. అంత నాసావిత్త్రియు మాతాపితృపోషణంబునం జేసి యూపాంతరస్వీకారంబుఁ గావిం
చినశ్రీదేవియో యనం జెన్నలరారి శుక్లపక్షక్షపాకరరేఖచందంబునం దినదినప్రవర్ధ
మాన యై. 28

సీ. చిడిముడినడకలం ♦ జిన్నె లన్నియు నేర్చెఁ, బ్రోదిరాయంచలం ♦ బొందునలన
జిలిబిలిపలుకుల ♦ తళుకు లన్నియు నేర్చెఁ, బెనుచురాచిలుకలం ♦ బింఛువలన
నదరెనుపాటలం ♦ హాయిపు లన్నియు నేర్చెఁ, బొదల నల్లాడుతుం ♦ మ్మెదలవలనఁ
జిటిచిటినటనలం ♦ సిరు లన్నియును నేర్చెఁ, దడికారునెమ్ములం ♦ దళమువలన

తే. నిట్టు లారాజపుత్త్రి దాఁ ♦ బుట్టి నేర్చె, గాకొకఁ బుట్టక నేర్చె నొంకొకఁ యటంచు
జనులు నుతియించువసువున ♦ సకలధర్మ, ములును నేర్చెను దను దాన ♦ పొలుపుమీఱ.

క. బంగారుబొమ్మ వోలెన్, రంగారుచు నున్నయట్టి ♦ రాసుతఁ గని భూ
మిం గలవారలు సుకన్యం గాఁ దలపోసి రతులి ♦ తౌజస్స్ఫురణన్. 30

క. ఈరీతిని బాల్యంబునఁ, గోరిక లిగురొత్త మనుజ ♦ కోటికి ము ద్దా
కూరిమికూఁతుం గళల వి, శారదఁ జేయించెఁ దండ్రి ♦ శాస్త్రజ్ఞులచేన్. 31

క. నవయౌవనగతిచేతన్, సువిభక్తం బగుమృగాక్షి ♦ సుందర దేహం
బు విభాకరకరవికసిత, మవునసరుహ మట్లు దనరె ♦ నతికోమల యై. 32

వ. ఇట్లల్లవిధంబుల నల్లారుముద్దు గా నెనంగునాసావిత్త్రి దయాసత్యశౌచనిరతయు గురు
జనభక్తిభరితయు నై నిరుపేదల నాదరించుచుఁ గల నైనఁ గలుషంబులం బొరయక
సకలజనసంస్తవనీయచరిత్ర యై ప్రవర్తించుచు గుణవయోరూపలక్షణంబులఁ దన
కనుగుణుం డగుజీవితేశ్వరుం డెవ్వాలనఁ బడయఁ గలుగునో యని వితర్కించుచుండె
నంత. 33

తే. ప్రాప్తయౌవన యై యిట్లు ♦ వసుధయందు, దివ్యతేజంబునం జేసి ♦ తేజరిల్లు
నగ్నిశిఖవోలె నుండెను ♦ నామెఁ గాంచి, వెఱచి వరియింప నోడి రెవ్వారుఁ గాని.

ఉ. †కూరిమి నమ్మహీపతియుఁ ♦ గూఁతుఁ గనుంగొని పెంపుఁ జెందుసిం
గారము యోగ్యవర్తనము ♦ కాఁగలబుద్ధియు యౌవనంబునుం
గూరినరాజపుత్త్రుం డనుకూలుని వల్లభు దీని కెందు నే
నారసి కూర్తు నంచు జగ ♦ మంతయు రోయుచు నుండె నత్తఱిన్. 35

—◆— సావిత్త్రి నిజవరాన్వేషణంబు చేసికొనుట. —◆—

వ. అంత నొక్కపర్వదినంబున నప్పర్వేందుముఖి శిరస్స్నానంబు చేసి యుపవసించి వేల్పు
వేల్పులం బూజించి భూసురదివ్యశేషంబు నేకరించి తండ్రికడకుం జని ప్రొక్కి

† కూరు = పొందు. రోయు = వెదకు;

నిలిచినం గని యౌవనవతి యై దేవరూపిణి యైనదాని నెవ్వరును వరింపమికి వగచుచు
ని ట్లనియె. 36

సీ. తల్లిరో నీకు నుద్వాహంబు సేయంగ, ననువు పడినకాల ♦ మరుగుదెంచె
నెవ్వఁడునుఁ గాని ని ♦ న్నిమ్మని వరియింపఁ, డేమి సేయుదు నిందు ♦ నేను జాల
నీవ నీ కనురూపుఁ ♦ డై వెలసినవరు, వరియించి యెఱిఁగింప ♦ వలయు నాకు
నేను యుక్తాయుక్త ♦ మెఱిఁగి వానికి ని న్నొసంగి వివాహంబు ♦ సలుపువాఁడ

తే. నుచితకాలంబునం గన్య ♦ నొసఁగనిపిత, ఋతువులం బత్ని నంటని♦పతియుఁ దండ్రి
చనినపిమ్మటఁ దల్లిఁ బో♦వనిసుతుండు,నడిఁ బడుదు రంచు ధర్మశా♦స్త్రములు వలుకు.

వ. కావున నీవు నా కపయశంబు రాకుండం జూడు మని వృద్ధామాత్యుల రావించి
తో డిచ్చి పుచ్చుటయు నామె హేమరథాధిరోహణంబు చేసి కదలి పురంబులుఁ
దపోవనంబులు నాశ్రమంబులుం జని వరాన్వేషణంబు చేయుచుఁ బుణ్యతీర్థం
బుల నాడుచుఁ బెద్దల సేవించుచుం బోయి పోయి యొక్కతపోవనంబున సత్య
వంతుం డనువాని వరించి మరలి నిజపురంబున కరుదెంచి. 38

మ. పుడమిన్ సాళ్వకుమారుఁ డై యశమునం ♦ బొల్పొందు నాసత్యవం
తుఁడె ప్రాణేశ్వరుఁ డైన నావిభవ మెం♦దుం జెప్పఁ గా శక్యమే
నడుచు న్నాకతికష్ట మైన సుక మై♦న న్వానితో లోక మా
నడవు ల్వీడులు నొక్కరూప యగు నా ♦ కాతండు విన్నంటినన్. 39

వ. అని మనంబున నిశ్చయించుకొని జనకునకు నివేదింప నెంచుచుండె. 40

ఉ. అంతట నొక్కనాఁడు మను♦జాధిపుఁ డశ్వపతీశ్వరుండు సా
మంతపురోహితాప్తజన♦మండలి నిండి భజింపఁ జిత్రచి
త్రాంతరరత్ననిర్మితస♦భాంతరసీమఁ గవీంద్రవాగ్రవం
బంతట ప్రమోయఁ బెద్దకొలు♦వై చెలఁగెన్ ఘనవైభవంబునన్. 41

వ. అట్లు కొలువుదీరి యున్నంత. 42

—•—◆ అశ్వపతికడకు నారదుండు వచ్చుట. ◆—•—

క. తారకమంత్రధ్యానం, బారూఢిగఁ జేసికొనుచు ♦ నభ్రమునందున్
జోరుకలంగ వీణారుతి, నారదుఁ డరుదెంచె నపుడు ♦ నరపతియెడకున్ 43

వ. అతం డతని కభ్యుత్థానాభివందనంబు లొనరించి మధుపర్కం బొసంగి పూజించి
మించినవేడ్క నద్గోష్ఠీవిశేషంబులం బ్రొద్దుపుచ్చు చున్నసమయంబున. 44



సీ. †వలచునంపెఁగనూనెఁ ♦ దల రాసి నెఱికలు, కర మరుదందఁ గీ♦ల్కంటు వైచి
పున్నమజాబిలి♦పోల్కి నున్నటిన,మ్మోమునఁ గస్తూరి♦బొట్టు వెట్టి
కన్నాకురతనంపుఁ♦బొన్నసొమ్ములు వెట్టి, రాణించుపైఁ తాణి♦రవికఁ దొడిగి
మేల్మిబంగరుమిసి♦మిం గెరుజలతారుఁ,జెఱఁగుల నొప్పారు♦చీరఁ గట్టి

తే. యందెలంతంతగల్లుగ♦ల్లనుచు మ్రోయఁ,జెలఁగికుచ్చెళ్లు మీఁగాళ్లఁ ♦ జిందులాడఁ
గాను వసియాడఁ జెలులచే♦యూనిరచ్చ,కరుగుదెంచెను సావిత్రి ♦ గరిమ మీఱ.

వ. అట్లరుదెంచి తండ్రికి దండప్రణామంబుఁ గావించి నారదాదుల కంజలి మోడ్చి
యున్నయప్పుడు. 46

ఉ. తొయ్యలిఁ గాంచి యశ్వపతి♦తో నలనారదుఁ డిట్లు నల్క నే
మయ్య మహీశ నీసుతకు ♦ నైనవరుం దలపోసి పెండిలిన్
నెయ్యము మీఱఁ జేయ కిటు ♦ నిల్పితి వే లిటు సెల్లునయ్య నా
నయ్యొడయుండు నమ్రుఁ డయి ♦ యమ్ముని చంద్రునితోడ ని ట్లనున్. 47

ఉ. దేవమునీంద్ర యీతెలివి♦తేటల కీమహనీయవిద్య కీ
శేవకు నీవయస్సునకుఁ ♦ దీకలు వ్రాసెడు రాజపుత్రునిం
దేవలె నంచు లోకమునఁ ♦ ద్రిమ్మరి చూచితిఁ గాని యెందు నే
నే విని చూడ నైతి నెక♦నిం దగువానిని రాజమండలిన్. 48

వ. అని పలికి సావిత్రిదిక్కు మొగం బై. 49

శా. తల్లీ! నీకులశీలరూపములకుం ♦ దర్కింప నొవ్వాని నీ
యుల్లం బెక్కినరాజపుత్రకుని లో ♦ నూహించుచు న్నీవె నా
యుల్లంబుం గయి సేయఁ జూచుకొనుమా ♦ యస్మన్మనోభీష్టమున్
జెల్లింపం దలపోయుమా మనములో ♦ సిగ్గుం దొలంగింపుమా. 50

వ. అని పలికి యూరకున్న సావిత్రియుఁ గొంతవడికి. 51

క. అడిగినదానికి నుత్తర, మిడ వలయును గాన నాకు ♦ నెఱిఁగింపఁగ మీ
నుడివినపలు కానతి యని, తడఁబడ కాతన్వి పల్కెఁ ♦ దద్దయు వేడ్కన్. 52

—•—◆ సావిత్రి సత్యవంతుని వరించుట. ◆—•—

క. ఓనరనాయక సాళ్వమ,హీనాథుం డై పొగడ్త ♦ కెక్కఁ దగుద్యుమ
త్సేనుం డనురాజేంద్రుఁడు, మానితగుణుఁ డొక్కఁ డొప్పు♦మహిమాన్వితుఁ డై

ఉ. అమ్మనుజేశ్వరుండు సక♦లామరకీర్తితకీర్తి సర్వలో
కమ్ములఁ బేరుఁ జెందినయ♦ఖండపరాక్రమశాలి దానధ

† కన్నాకు=శ్రేష్ఠము.

ర్మమ్ములఁ గల్పవృక్షమును • మానఁ జేసినపుణ్యమూర్తి స
త్యము్మన శాలవాల మగు • నాతఁడు సంస్తవనీయుఁ డన్నిటన్. 54

చ. వనమున నున్నవాఁడు ముని•వర్యులవృత్తిని దుంపతూఁడులం
దినుచును నారచీరలును • దీర్ఘజడల్ వహియించి బీద యో
యన నటు లైననాన్నృపతి • కాత్మజుఁ డై నెగడొందునత్యవం
తుని వరియింతు నా కతని•తో నెనగూర్తువె పొత్తు సత్తమా. 55

తే. నాఁగ విని మద్రదేశాధి•నాథుఁ డైన, యశ్వపతి నారదమునిజ•నేశ్వరునకు
మ్రొక్కి వినయంబుదోఁపఁగ మోడ్పుఁ గేలు, ఫాలమునఁ జేర్చియిట్లని•పలికె నపుడు.

ఉ. ఓమునివర్య మీ రెఱుఁగి • యుండనివారలు లేరు లోకమం
దీమె వరించునట్టిపృథి•వీశ్వరపుత్రకుఁ డెట్టివాఁడొ యే
మేమిగుణంబు లౌను తను • వెట్టిదొ శీలముచంద మెట్టిదో
నామది సంతసించు విని•న న్వివరింపవె దాఁప కంతయున్ 57

వ. అనిన నారదుం డతని కి ట్లనియె. 58

తే. అనఘ సావిత్రి వరియించి•నట్టివాఁడు
సత్య మెప్పుడుఁ బూనుట • సత్యవంతుఁ
డనఁగ నొప్పెడుఁ జిత్రాశ్వుఁ • డనఁగ మఱియు
నామధేయాంతరంబున • నలువు మీఱె. 59

సీ. ‡పురుడించు వర తేజ•మునను విభాకరు, శూరత నిందుని•సొంపుఁ గాంచుఁ
దలఁపించు గురుబుద్ధి • దైవతాచార్యుని, దాలిమి భూదేవి • లీల గెలుచుఁ
బోలుపొందుఁ దనుకాంతిఁ • గలువలఱేఁడు నా, రూపున దస్రుల కేవుఁ జూపు
సరిపోలు ధైర్యంపు•సరణి హిమాద్రికి, గాంభీర్యమున దుగ్ధ•కంధిఁ బోలు

తే. దమము శౌర్యమునుఁ గాంతియు • దాంతి కరుణ
తపము దానంబు బ్రాహ్మణ•తత్పరతయు
శౌచము మహాప్రభావము • సాధువృత్తి
యతనియందె కా కన్యుల•యందు లేవు. 60

ఆ. అట్టివానియందు • నగు లోప మొకఁడు నీ, క దివచింప వలయు • నగుటఁ జేసి
యే వచించుచుంటి • నిపుడు వాఁ డీనాఁడు, గోలె నేఁటి కేఁడు•గుం దలంప. 61

ఉ. నా విని తేఁడు కూఁతువద•నంబుఁ గనుంగొని పల్కెఁ దల్లిరో
దేవరహస్యవేది గణు•తింప నితం డగు దైవ మిమ్మహా

† దస్రులు = అశ్వినీదేవతలు. దుగ్ధకంధి = పాలసముద్రము;



భావునివల్ల బోధ మటు•వంటివరు న్వరియింపఁ జెల్లునే
నీవు గడంక వేఱొకని•నిన్ వరియింపుము వంత యేటికిన్. 62

వ. అనినం గంట నీరు పెట్టుకొని యించుక విచారించి తండ్రిదిక్కు మొగం బై. 63

ఉ. అట్టిమహానుభావుఁ డచ•లాధిపుఁ డై భువి శాశ్వతుండు గా
కిట్టు లొకింతలోన దివి • కేగుఁ గదా యని నాయదృష్టముం
దిట్టుదుఁ గాని వేఱొకని • నే మది నెంచెదనే మహాత్మ! నీ
కిట్టు వచింపఁ బాడి యగు•నే యని కన్నుల నీరు నించుచున్. 64

చ. వినుము మనంబు వాక్కు మెయి • వీనిని మూఁడువిధంబుల న్మహా
మునులు వచింతు రందు సరి•పోల్పఁ బ్రధానము నెమ్మనమ్ము న
మ్మనమునఁ బెండ్లి యాడుపతి • మానఁగఁ జెల్లునె మానినట్టిమా
నిని కిహముం బరం బగునె • నీకు నెఱుంగనిధర్మ ముండునే. 65

పంచచామరము. సదా మదిం దలంతుఁ గాన • సత్యవంతుఁ డట్టియా
పదాస్పదుండు నైన నాకు • వానితోడిలోక మా
గదా ముదంబుతోడ నన్యు•కాయ మంటుదాననే
వదావదా మఱొండుమాటఁ • బల్కఁ బాడి యానతే. 66

క. అన విని మది దిగు లొదవినఁ, దన కేమియుఁ దోఁప కపుడు • ధరణీశుఁడు పొం
తను విలసిలునారదు దెసఁ, గనుఁగొన నతఁ డతని కనియె • గౌరవ మొప్పన్. 67

క. §మనుజేంద్ర నీకుమారిత, మనమున నర్థించుదాని • మరలింపం గా
మన మోప మెంతపడియును, మనికితపడ కాలకింపు•మా నానుడులన్. 68

క. అనుమానింపక గొనముల, గని యగుసీయనుఁగుఁగూఁతు • ఘనుఁ డాతనికిన్
గొన నిమ్ము సాధ్విపుణ్యం, బున నైనం బ్రతుకు నతఁడు • పూర్ణాయువుగన్. 69

చ. అనిన నృపుండు నారదున • కంజలి మోమున మ్రొక్కి మీకతం
బున మదిఁ దావ మాఱె శుభ•ముల్ వడయం గనుఁగొంటి నీవ మా
కనఘ! గురుండ వౌట భవ•దాజ్ఞఁ బొనర్చెద నన్న మౌని దీ
వన లిడి పోయివత్తు నని • వారల వీడ్కొని పోయె మింటికిన్. 70

ఉ. అంతట నాసభాసదుల • కందఱకున్ సెల విచ్చి రాజు శు
ద్ధాంతముఁ జూచువేడ్కఁ దన•యం దనపజ్ఞన రా నొనర్చి తా
నింతులు గొల్వ నేగి హృద•యేశ్వరితో నుగమౌని పచ్చుటల్
గాంతవివాహవృత్తమును • గాఁగలకార్యముఁ దెల్పెఁ దెల్పినన్. 71

§ మనికితపడు = దుఃఖపడు.

క. †మాళవి యిట్టట్టాడక, జాలిం బడి కొంత దేవసంయమివాకుల్
పోలించి వగపు విడి సుత, యేలినవరుఁ డట్టివాఁడైన నిష్టము నాకున్. 73

——మద్రరాజు సావిత్రిం దోడ్కొని సాళ్వపతికడ కేఁగుట.——

వ. అంత ధరాకాంతుండు మంత్రులమంతనంబున నుండి. 74

సీ.|| పరిణయోచితవస్తుపరికరంబులతోడ, వృద్ధపురోహితుల్ వెనుక నడువ
వివిధాయుధాళిదీప్తిని దెసల్ వెలిఁగించి, వీరభటులు ముందుఁ దీరి నడువ
నుతజనోపాయనోచితవస్తుసమితితో, మంత్రిసామంతులు మమత నడువఁ
బరిజనంబులు సేవఁ బోరిఁబోరిఁ జేయంగ, రాజబంధులు నడిరాజి నడువ

తే. దాసదాసీజనంబులుఁ దవిలి కొలువ, దారయును బుత్రికయుఁ దన దరిని నడువ
శుభముహూర్తమునం దతివిభవ మొప్ప, వెడలె మద్రేశుఁ డాసాళ్వవిభునిఁ జూడ.

వ. ఇట్లు కదలి కతిపయప్రయాణంబుల. 75

తే. మౌనిసేవితమై యొప్పుకాననమునఁ, బరఁగ జడదారిరాయలసరణిఁ దపము
సేయుచుండిన యాద్యుమత్సేనుపాంత, మునకుఁ జనియెను సావిత్రి వెనుక రాఁగ.

వ. ద్యుమత్సేనుండును నట్లు వచ్చిన మద్రపతి నర్ఘ్యపాద్యాద్యుచితోపచారాపచితుల సంభావించి కుశలం బడిగి యాగమనకారణం బడుగుటయు నతఁ డతని కంజలి ఘటించి సావిత్రిం జూపి యిట్లనియె. 77

ఉ. దేవర నాకుమారిత మదీయకులంబున కెల్లఁ దెప్ప యీ
పావనగాత్రి భారతిక్రుపం ప్రభవించెను నాకుఁ బుణ్యసం
భావనఁ జేసి దీనిని భవత్సుతరత్నము సత్యవంతుఁ డన్
పావనమూర్తి కిచ్చుటకు వచ్చితి నిచ్చటి కిచ్చ పెంపునన్. 78

క. దీనిని నీకోడలిఁ గాఁ, మానసమున నెంచి కొనుము మన్నించి ననున్
మానవనాథా వియ్యము, నేను నీవు నందఁ దగుదు మెల్లవిధములన్. 79

వ. అని ప్రార్థించుచున్న మద్రపతికి సాళ్వపతి యిట్లనియె. 80

శా. అయ్యా రాజ్యముఁ గోలుపోయి శుభహర్మ్యాదుల్ విసర్జించి యీ
దయ్యంబుల్ పెనుభూతముల్ దిరుగుకాంతారంబు వాసంబు గా
నిర్వ్యాజం గొని వల్కలాజినము లేమేఁ దించు వర్తింతు మే
మయ్యో యేమని నీదువాక్యమున కే నా నంచు వాక్రుచ్చెదన్. 81

చ. పులులు చరించు నట్టివనభూములఁ గాఁపుర ముండు మేడపై
న్నిల వడఁదాఁకుమేను గలనీసుకుమారి కుమారి యెడ కో

† ఏలం = పరిగ్రహించు. || నడిరాజి = మధ్యపంక్తి.



మలహృదయా! శిరీషకుసుమంబు మధువ్రత మానునంతనే
చలనము నొంది వాడు నది చాలును వుల్లులపోటులం బడన్. 82

వ. అని నిజరాజ్యపరిత్యాగవనవాసాదుల కుల్లంబునం దల్లడిల్లునతని కతం డిట్లనియె. 83

చ. అరయ సుఖంబు గల్గుతఱి హా యని యుంటయు దుఃఖవేళలం
బొరపొరఁ బొక్కుచుంటయుఁ దపోధన ధీరులరీతి గాదు ధీ
వరుఁడవు ధీరచిత్తుఁడవు పావనమూర్తివి నీవె యిట్లయో
పొరసి వివేకహీనులకుఁ బోలె విచారము సేయఁ బోలునే. 84

క. పిన్న యనఁగ నేటికి నా, కన్నియ ప్రజ్ఞాబలంబు గలిగిన దగుటన్
సన్నుతవృత్తమునఁ దలిర్చు న్నిమ్మది సమతఁ గనుచు సుఖదుఃఖములన్. 85

ఆ. ధనముకన్న మిన్నగను దపోధనమును, గవులు సెప్పుచుంద్రు గాదె ఘనత
పస్వివైననిన్నుఁ బరికించి నీతోడ, వియ్య మంద వత్తు నయ్య నేను. 86

——సావిత్రీసత్యవంతులవివాహము.——

వ. మద్రాధిపు ప్రార్థనంబు వృథ సేయక నాకూఁతు నీకొడుకునకుం బెండ్లి చేసికొన ననుగ్రహింపు మని సాళ్వపతి నొప్పించి యప్పుడమ్మద్రవసుంధరాధురంధరుండు రమణీయభద్రోటజాభ్యంతరంబు పరిణయోచితవస్తుపరిపూర్ణంబు గావించి పుంఖానుపుంఖశంఖ మృదంగ భేరీ పటహ కాహళ ఢక్కా హుడుక్కాద్యఖిలతూర్యనిక్వాణంబులు రాణలెసఁగ సావిత్రీసత్యవంతులకు మంగళాభిషేచనంబు లొనరించి భూసురాశీర్వాదనాదంబులు రోదసీకుహరంబు నిండ సాలంకృతుం డై మణిగణఖచితకాంచనపీఠికాతలంబున నాసీనుం డగువరుని శ్రీమహావిష్ణుస్వరూపునిఁ గాఁ దలంచుచు యథావిభవ విస్తరంబు గా నర్చించి మధుపర్కం బొసంగి నిజపితృప్రీతికరంబుగ దార వోసి సాలంకృతకన్యాదానంబుఁ జేసె నంత. 78

చ. కమలగృహాంగనాసుతునిఁ గైఁ దగునంతన బొమ్మఁ గట్టున
కమలదలాక్షికంఠమునఁ గట్టెను మంగళసూత్ర మద్ధరా
రమణసుతుండు మంత్రములు బ్రాహ్మణవర్యులు పల్కుచుండఁ గ
న్బొమ లదరంగఁ దూర్యములు మువ్వురున న్వడి మ్రోఁగుచుండఁగన్. 88

వ. ఇట్లు విధిదృష్టవిధానంబున వివాహంబు నిర్వర్తించి మద్రదేశాధీశుం డల్లునకుం గూఁతునకు ననేకమణిభూషణంబులు చీనిచీనాంబరంబులుఁ బురంబులు వాహనంబులు లోనగునానావిధవస్తుసముదయంబు లరణంబు గా నిచ్చి ప్రయాణాభిముఖుం డై సావిత్రిం బిలిచి తనతొడపైఁ గూరుచుండం బెట్టుకొని శిరంబు మూర్కొనుచు నుపలాలనంబు సేయుచు నిట్లనియె. 89

క. తల్లీ భద్రం బగు నీవల్లభునకు నీకుఁ బోయి ♦ వచ్చెద నిట నీ
వెల్లపుడు మగనిమాటల, నుల్లంఘింపక మెలంగు ♦ మొగి నీడవలెన్. 90

సీ. †ఎవుడుఁ భర్త్రాజ్ఞ లే ♦ కుపవసింపఁగఁ బోకు, కలయఁ బిల్చినయప్డు ♦ చెలఁగఁ జనుము
వలువ మాసిన నాడి ♦ వరుఁ జూడ కధిపతిఁ, జూచి దివాకరుఁ ♦ జూడక మును
రోటిపైఁ గడపపైఁ ♦ జేటపై కుమ్మకఁ, ణమ్ముపైఁ గూర్చుండ ♦ కిమ్ము విడకు
నెఱికలుఁ దడియంగ ♦ నీ రాడ కెపుడు డీసు, చరణతీర్థము గాంగ ♦ జలము సుమ్ము

ఆ. సతులు పతిని గాక ♦ శంకరు నేనియుఁ, దలఁపఁ జనదు జపము ♦ తపము తీర్థ
యాత్ర మంత్రసాధ ♦ నాదిక మెల్లను, సతికిఁ బతియ చూవె ♦ జగమునందు. 91

వ. *అని బోధించి బుజ్జగించుచుఁ బజ్జ నున్న శైబ్యాద్యుమత్సేనచిత్రాశ్వులకుం దన పుత్రి నప్పనంబు చేసి తాను జతురంగబలసమేతంబు గాఁ బయనం బై యథాగత కృతగమనుం డయ్యె ననంతరంబ. 92

—◆— సావిత్రి యత్తమామలకడ నతిభక్తిం బ్రవర్తించుట. —◆—

ఉ. అత్తకడన్ మెలంగుచు నయం బలరార వెలుంగుముద్రరా
జోత్తమకన్యకామణి నిజోచితరత్నవిభూషణాదికం
బత్తఱిఁ దాల్ప రా దని ప్రియంబునఁ దీసి వనోపయోగముల్
చిత్తమునం దలంచి కొనె ♦ శీర్ణజటాజినవల్కలాదులన్. 93

క. అశ్రాంతనుతసతీజన, విశ్రుత యై వన్నెఁ గన్న ♦ విద్యావతి దా
శ్వశ్రూశ్వశురుల కనిశము, శుశ్రూష యొనర్చుచుండెఁ ♦ జూపఱు వొగడన్. 94

తే. ఆయమ యొనర్చుశుశ్రూష ♦ కంతరంగ, ములను సంతోషవారిధి ♦ మునుఁగఁ జేసి
యుత్తమామలు కోడలి ♦ యుత్తమగుణ, ములనుఁ గొండాడుచుండి రే ♦ ప్రొద్దుఁ దవిలి.

వ. మహాసాధ్వి యగునాసావిత్రియుం దనపతియాయుఃప్రమాణంబునారదమునీంద్రుండు చెప్పిననాఁడుగోలె నొక్కొక్కదినంబు గా లెక్క పెట్టుకొనుచుం బ్రవర్తిల్లు చుండ నాలుగునాళ్లు కొఱంతగా నొక్కవత్సరంబు కడనన వచ్చె నప్పుడు. 96

క. తనవల్లభుండు నాలవ, దినమున మృతి నొందు ననుచుఁ ♦ దెలిసిన దగుటన్
వనిత త్రిరాత్రింబులు మెస, వనివ్రతముం బట్టె నెల్ల ♦ వారు నుతింపన్. 97

తే. దాని కబ్బురపడి ద్యుమ ♦ త్సేనుఁ డపుడు, పేర్మితో నలసావిత్రిఁ ♦ బిలిచి యిట్టు
లేల దుస్తరవ్రతభార ♦ మిపుడు తల్లి, తొడఁగి తీ వని కడుజాలి ♦ తోడఁ బలికె. 98

వ. అని పలికిన సావిత్రి మామం జూచి మీరు నావ్రతభారంబునకు వగవ వలదు వినుండు. 99

† ఇమ్ము = స్థానము. * శైబ్య = సత్యవంతునితల్లి;



పరమశుభప్రదం బఖిల ♦ పాపహరంబు వ్రతంబు దీని నే
గురుతరదుఃఖవారినిధి ♦ కూలముఁ జేరుకొనంగఁ దేప గాఁ
గరము దలంచి పూనితిని ♦ గారణ మొం డగు మీర లెల్లవా
రరయఁగ నొను మీఁద నది ♦ యంతయు నంతన మానవిల్లఁగన్. 100

సీ. అనుచు న ట్లైన మే లగు ♦ ననుచు సాళ్వ, భూధురంధరుఁ డుండంగ ♦ మూఁడునాళు
లామె వేగించె వ్రతనిష్ఠ ♦ నంతఁ దెల్ల, వాఱ నాలవదిన మన ♦ వచ్చురాత్రి. 101

స. ఒకగడెసేపునే నిదుర ♦ నొందక తాఁ గడుపెల్ల గుండె లై
కకవిక నొంది జా మొకయు ♦ గంబుగతిం గడతేర్చి యంత రే
వకడన మేలుకాంచి నిజ ♦ భర్తకు మృత్యుదినం బంటంచు నెం
చి కడు మనంబునం గదురు ♦ నేగిని లో నడఁగించి ధీరతన్. 102

తే. దినముఖోచితకృత్యముల్ ♦ దీర్చి పేర్చు, భక్తిఁ బరిచర్య లొనరించి ♦ భర్త కత్త
మామలకు వృద్ధులకు మ్రొక్కి ♦ మది గ్రహించె, వారు దీవించుమంగళ ♦ వచనములను.

తే. జాము ప్రొద్దెక్కుటయు నంత ♦ స్స్వాంతమందుఁ, జింత సేయుచు సావిత్రిఁ ♦ జేరఁ బిలిచి
పరమకారుణ్యవికచహృ ♦ త్పద్ము లగుచు, నత్తమామలు పలికి రి ♦ ట్లనుచు నెలమి.

చ. కడుఁ గఠినవ్రతం బిది య ♦ ఖండమనోనియమంబు పేర్పడన్
దొడఁగి యథావిధిన్ నడుప ♦ నోమితి నో మది యెల్ల నింతతోఁ
గడచెను మూఁడునాళ్లుసుత ♦ గాటము డస్సితి వింక నేనియున్
దడయక పారణావిధి యొ ♦ నర్పఁగఁ జెల్లదె నీకుఁ దల్లిరో. 105

వ. అనిన సావిత్రి వారి కి ట్లనియె. 106

ఆ. వ్రతము పట్టినపుడ ♦ పట్టితి నియమంబు, సూర్యుఁ డస్తగిరికిఁ ♦ జేరదనుక
నేఁడు గుడువ రాదు ♦ నెమ్మది దీన్నైకె, వలదు చింత సేయ ♦ వరదులార. 107

వ. అనిన వార లట్ల యగుం గావుత మని యుండి రప్పుడు. 108

—◆— సావిత్రి సత్యవంతునితో వనంబునకుఁ బోవుట. —◆—

క. అనఘుండు సత్యవంతుఁడు, చని వనమునకున్ సమిత్కు ♦ శఫలాదులు దే
నునమున సంకల్పించినఁ, గని సావిత్రియును జేరఁ ♦ గాఁ జని యనియెన్. 109

చ. వనమున కేను నీవెనుక ♦ వచ్చెదఁ దోడ్కొనిపొమ్ము వేడ్క నా
మనవిఁ బరిగ్రహించి మఱు ♦ మాటలు సెప్పక నాథ నా నతం
డనుఁ గడు డస్సి యుంటి వక ♦ టా యుపవాసముల న్నడంగ లే
వని మది సంశయింతు నన ♦ నంబుజలోచన వాని కి ట్లనున్. 110

ఉ. వల్లభ యాలకింపు ముప◆వాసభరంబొకయింత యేని నా
యుల్లమునందుఁ జొప్పడ ద◆హో యెవుడీవనరాజ ముజ్జ్వలో
త్ఫుల్లమరందకందళిత◆పుష్పగుళుచ్ఛలతావృతంబు నం
పల్లలనానివాస మని ◆ పల్వురుఁ జెప్పఁగ విందుఁ గావునన్. 111

తే. చూడ మనమయ్యె నీతోడఁ◆గూడి రా న్ననుజ్ఞ యొసఁగుము చనవి మ్మ◆భిజ్ఞ యనుడు
నతఁడు నీతలఁ పట్టిద ◆ యైన నాపితలకు నెఱిఁగింపు మపుడు నా◆తప్పు తలఁగు.

వ. అనిన సావిత్రి యత్తమామలపాలికిం జని తనమనోభీష్టం బెఱింగించి వరంబొసంగుఁ డని ప్రార్థించుటయు వారును. 113

తే. పడఁతి యెన్నఁడు నెయ్యది◆యడుగ దిత్తె,ఱంగు దీనికిఁ బ్రియ మై చె◆లంగఁ బోలు
మనకు వారింప నేల య◆టనుచు దాని, కియ్యకొన వారియడుగుల◆కెఱఁగి భక్తి.

ఉ. పిమ్మట నెమ్మదిం గలుగు◆పిమ్మట పెంపును లోనడంచి బల్
నెమ్మి దలిర్ప దిట్టపడి ◆ లేనిముదం బొకయింత సైకమా
న్యమ్మునఁ దెచ్చిపెట్టుకొని ◆ యాత్మమనఃప్రియు సంతసంపునం
ద్రమ్మునఁ దేల్చి వానివెఱఁ◆దం జనె భాసట గా వనాళికిన్. 115

వ. అట్లు చనుచున్న సమయంబున. 116

సీ. వన మెల్లఁ గేకార◆వంబున మారోత్రియఁ, బురి విప్పి యాడునె◆మ్ములవారంగు
తరఁగలఁ జెరలాడు◆వరహంసకులముల, నలరు నిర్మలనిమ్న◆గలఁ జెలంగు
శుకపికారవముల ◆ సురుచిరం బగుతరు,వులఁ దలిర్చు వనం◆బుల వెలుంగు
మృగవిహారములకుఁ ◆ దగినతానకము లై, లలి నొప్పుచుండుకొం◆డల వెడంగు
తే. వికచకమలోత్పలపరాగ◆విస్మరవిశ,దవరగంధబంధురమధు◆రవనపూర
భాసురసరోవరవిలాస◆వాసితప్ర,దేశములతీరు వేర్వేఱఁ ◆ దెలియు మిపుడు. 117

చ. అని వనశోభ లెల్లఁ గను◆మా వినుమా యని భర్త చెప్పుచుం
జనుటయు దుఃఖితే మనసి ◆ సర్వ మనమ్మ మనంగఁ దోఁప న
వ్వనితయు లేనిన వ్వాలయ ◆ వానిని గన్గొనుదానిఁ బోలి తాఁ
గనఁబడెఁ గాని వేడ్కమదిఁ ◆ గైకొనకుండెను వంత పెంపునన్. 118

వ. ఇట్లుండి నిజవల్లభున కెట్లగునో యని యుల్లంబునఁ దల్లడిల్లుచుం బై కతని యుల్లంబు పల్లవింపఁ బ్రవర్తిల్లుచుండె నంతఁ బ్రత్యవంసుడు మంచిమంచి ఫలంబులును బుష్పంబులును గోసి గరిడియ నించి గంధగోడ్డంటఁ గాష్ఠవిదళనంబుఁ జేయఁ బోయి శ్రమంపడి స్విన్నగాత్రుం డై నిట్టూర్పు నిగిడించుచుం గొడ్డలిఁ గ్రిందఁ బడవైచి పడఁతిం జూచి యిట్లనియె. 119



సావిత్రికి యముండు దర్శనం బిచ్చుట.

ఉ. ఇమ్మెయిఁ గొండవంటితల◆యేరు కఠోరకుఠారశూలవా
రమ్ముల నొంచునట్టులు శి◆రమ్మున నన్నుకొనె న్మనమ్మునుం
బమ్మర నొందునట్లు కలఁ◆పం బడి తూలెడు దేహ మెల్లఁ గం
పమ్మును బొందుచుండె నిలు◆వన్ నడువంగ నశక్య మయ్యెడిన్. 120

వ. కాంతా నే నొక్కింతసే పిటకయనించి కాని నడువ నోప ననిన సావిత్రి సంభ్రమించుచుఁ దనతొడ ప్రియునిశీర్షంబున కుపధానంబు గావించి శయనింపఁ జేయుటయును.

క. అట్టియెడ నాతఁ డార్తిం, దిట్టము చెడి వ్రాలి సోలి ◆ నిశ్చేతనుఁ డై
నట్టుల యుండుడు నాయము,కట్టెదుటం గొంతతడవు ◆ గడచినపిదపన్. 122

మ. ‡విలయాంభోదవినీలదేహుఁ డతులో◆గ్రోద్రేకోన్నతుం డుజ్జ్వల
జ్జ్వలనజ్వాలనిభాక్షియుగ్ముఁ డరుణ◆ప్రావారుఁ డాబద్ధకుం
డలకేయూరవిభూషితుండు శితదం◆ష్ట్రాభీషణాస్యుండు పా
శలసద్ధస్తుమహోగ్రుఁ డొకఁడు పెల్చం బొల్చి నిల్చెన్ వడిన్. 123

క. హెచ్చి యాటు లున్నవానిన్, జిచ్చుపిడుగట్లు దలఁచి ◆ చిత్తమునందున్
ఱిచ్చపడి గుండె జల్లన, నచ్చట నొడ లెఱుఁగకుండె ◆ నానతి భీతిన్. 124

వ. అంతం బతిరభసంబునఁ బ్రత్యుత్థానంబు గదియఁ దెంచుటయు నమ్మించుఁబోఁడి చంచలించుచుచిత్తంబుతో జీవితేశ్వరునిశిరంబు దిగువం బెట్టి మొదుపుఁగేలు ఫాలంబునఁ గీలించి మీ రెవ్వ రెయ్యది పని గా నిట్టెడ కరుదెంచితి రమానుషం బై నమీశరీరంబుఁ జూడం జూడ నొక్కదేవత యనుభావంబు వొడముచున్నయది వివరింపఁ ననుగ్రహింపుఁ డనిన నమ్మానినీమణికి నమ్మహాపురుషుం డిట్లనియె. 125

ఉ. కాలుఁడఁ జుమ్మి నేఁ గలువ◆కంటి పతివ్రత వీవు గానఁ గాఁ
జాలితి కాని లాతికి న◆సాధ్యము గానఁగ న్ప్రవర్తనం
బేల యెఱుంగు పెట్ట విను ◆ మిప్పుడు నీపతి కాయు వాట నేఁ
బోలఁగ నీని దోడుకొని ◆ పోవఁగ వచ్చితి నంచుఁ బల్కినన్. 126

తే. గరిత మ్రొక్కి యనున్ దేవ ◆ కాల మైన,జనుల దూతలు కొనిపోదు ◆ రనుచు విందు
నీవు రానేల యన ధన్యుఁ ◆ డితఁడు ◆ బంట్లఁ, బుచ్చ రా దగుట న్నేన ◆ వచ్చితి నని.

తే. అంతకుం డంత ధరణినా◆థాత్మజుమెయిఁ, దోడరి యంగుష్ఠపరిమితా◆త్ముండు జీవుఁ
డదరఁ గని పట్టి చెచ్చెర ◆ వెడలఁ దిగిచి, భయదపాశంబునం గట్టి ◆ పట్టి కడిమి.

‡ ప్రావారము = ఉత్తరీయము.

ఉ.†ఆఁక దొఱంగి దక్షిణదిశాభిముఖుం డయి ఘోరమార్గముం
గైకొని యేఁగఁ గాంచి తమకమ్మున నమ్మనుజేంద్రపుత్రి లో
శోకము పైకొనంగ నొకచోఁ బతిమే నిడి వానివెంబడిన్
మోకలు వాఱు భక్తిమెయి మోముపుఁగేల్మొని యేఁగ నేగినన్. 129

ఉ. తామరసాక్షి రాకఁ గని ◆ దండధరుం డనుకంప దోఁపఁ గా
నేమిటి కిట్లు వచ్చెదు సతీ యిటు రా వల దింక నిల్వుమీ
నీమది భర్తపై నిలువ ◆ నీ విటు వచ్చితి వోపినంతద
వ్వీవెయిఁ దీఱె నీదుఋణ ◆ మేఁగి యొనర్పుము ప్రేతకర్మమున్. 130

—— సావిత్రి యముని స్తుతించి వరంబులు వడయుట ——

సీ. అనిన సావిత్రి యి ◆ ట్లనియె నోదేవ నా,ప్రాణేశుఁ డెట కేగు ◆ నటకు నేను
నేఁగంగఁ దగుఁ గాదె ◆ యిది సనాతనధర్మ, మనుచుఁ బెద్దలు చెప్ప ◆ వినమె జగతి
వ్రతము తపము భర్తృ◆భక్తియు నీదయ, గలనాకు ప్రతిహత◆గతులు గలవె
తత్త్వార్థవేత్తలు ◆ తవిలి పేర్కొందురు, ధర్మంబ యుత్తమో◆త్తమ మటంచు
తే. నట్టిధర్మము దున్నవా ◆ రర్థకామ,ములను గోరరు ధర్మరా◆ముఁడవు నీవు
నీకుఁ దెలియనిధర్మ మే◆లోకమందు, నేనిఁ గలుగునె నామొఱ్ఱ ◆ లెఱుక పడవె. 131

తే. దేవ సఖ్యము సాప్తప◆దీన మనుచు, నానతిత్తురు పెద్ద ల◆ద్దాన నేను
జెక్కుపదములు గా నిన్నుఁ ◆ జేరుకొంటిఁ, గాన నీచుట్టమును నన్నుఁ ◆ గావ వలదె.

ఉ. నావుఁడుఁ దత్ప్రశస్తవచ◆నంబుల కచ్చెరు వొంది ధర్మరా
డ్దేవత యిట్లు పల్కెను సతీమణి నీనయవాక్యరీతికిన్
భావమునందు మెచ్చితి శుభంబుగ నే వర మొక్కఁ డిచ్చెదన్
నీవిభుజీవితం బొకఁడు ◆ నిల్పి మ ఱేదియు నేని వేఁడుమా. 133

తే. అనుడు సావిత్రి యిట్లను ◆ నయ్య రాజ్య,విభవ మంతయుఁ గోల్పోయి◆విపినమందు
గ్రుడ్డి వై యున్నమామామ◆కున్ భవత్ప్ర,సాదమునఁ జేసి కన్నులు ◆ లెసంగుఁ గాక.

వ. అనిన శమనుండు నీ వనిన ట్లవుఁ గావుత మని వరం బొసంగి. 135

క. ఇటు రాఁగ వలదు డస్సితి, కటకట ఘోరంపుఁదెరువు ◆ గడ యిఁకమీఁదన్
గుటిలాలక యని వీడ్కొని, పటుజవమునఁ బోవఁ దొడఁగెఁ ◆ బడఁతియు నంతన్.

వ. సమవర్తి ననువర్తించి. 137

తే. మగనికడ నున్ననాకు శ్రమంబు లేదు, పతికి నేగతి పట్టు నా◆గతియ నాకుఁ
బట్ట నగుఁ గాన నీవు నా◆భర్త నెటుఁ, దోడుకొనిపోదు వట నన్నుఁ◆దోడు కొనుము,

† మొలకలువాఱు = అంకురించు.



క. ధర్మాధర్మవిచక్షణు, లీర్మది గనుఁ డార్యజను ల◆హింసా పరమో
ధర్మ యని మనోవాక్తను,కర్మంబులఁ బ్రాణిహింసఁ ◆ గావింప రిలన్. 139

చ. మఱియును బేదలం దయను ◆ మంచన నెంచెద రర్థి కిచ్చుచోఁ
గొఱఁత పడంగనీ రెత్తిఁగి ◆ కోరిక లెల్లను దీర్తు రెవ్వరేఁ
దఱి యని కానిచోటఁ దమ◆దగ్గఱఁ జేరినఁ దమ్ముఁ జేర్తు రి
త్తెఱఁగున సాధుధర్మములు ◆ తేటపడుం జుమి సాధుశేఖరా. 140

ఆ. సాధుజనులతోడి◆సంగమం బెప్పుడు, వ్యర్థ మనఁగ రాదు ◆ వసుధ సాధు
శేఖరుఁడవు నీదు◆చెల్మి నందిన నాదు,వాంఛ సఫల మగుట ◆ వలదె చెపుమ.

క. నావుడు పరేతనాథుఁడు, నీవచనము నాకుఁ బ్రీతి◆నిం గలిగించెన్
సావిత్రి! సత్యవంతుని, జీవిత మది గాక కోర్కి◆ చెప్పు మొసఁగుదున్. 142

వ. అనిన సావిత్రి సూర్యపుత్రుదిక్కు మొగం బై. 143

క. వైరులచే నపహృత మగు,భూరాజ్యము మరల సకల◆మునినుతచరితున్
ధీరవరు ద్యుమత్సేనుని, వారక ప్రాపించునట్లు ◆ వర మీయఁ గదే. 144

వ. అనిన నతం డట్ల యిచ్చితి నీవు కడుదూరంబు వచ్చితి మార్గాయాసంబును పెచ్చు
చున్న దిఁక మరలు మనినం దరలాక్షి మఱియును. 145

చ. అమితదయారసార్ద్రహృద◆యాంబుజ నీవు సమస్తభూతసం
ఘమును యమింతు గావున జ◆గంబులలో యముఁ డండ్రు నిన్నుఁ బా
పముల శమింపఁ జేయువర◆పద్ధతి నొందినమేటి వౌటచే
శమనుఁడ వైతి పేర్కొనఁగఁ ◆ జాలుదురే నిను నెట్టివారలున్. 146

క. అరి యని చుట్టం బని నీ, వరయక సమబుద్ధి జగము◆లందు మెలఁగుటన్
బరఁగెను సమవర్తి యనన్, వరనామము నీకు నోదివాకరతనయా. 147

క. ధర్మంబ నీవ యగుటన్, ధర్మాత్ముఁడు ధర్మమూర్తి ◆ ధర్మవిదుండున్
ధర్ముండు ధర్మరా జను,నిర్మలనామములు నీకు ◆ నెగడు మహాత్మా. 148

చ. అనుడుఁ గృతాంతుఁ డిట్లనియె ◆ నాయమ కోయమ నీదువాక్యలం
దనిసితి నే మహాతపము◆నం బడి దప్పికి నైనవానికిన్
దనరుహిమాంబులం బలె నె◆దన్ ముద మయ్యెను సత్యవంతుజీ
వన మది గాక వే ఱొకటి◆వంకర మైనవరం బొసంగెదన్. 149

వ. వేఁడు కొమ్మనిన నచ్చేడియ వెండియు. 150

క. మాతండ్రి మద్రభూవిభుఁ, డీతఱి ననపత్యుఁ డగుచు ◆ నెరియు మనమునం
దాతనికిఁ బుత్రశతకముఁ, బ్రీతిం గరుణించి ప్రోవ◆వే కరుణాబ్ధీ. 151

వ. అనిన వైవస్వతుండు నీతండ్రి కౌరసంబగుపుత్రశతం బభినుతం బగు నీవు కడుదూరంబు వచ్చితి యింక మరలు మనిన సావిత్రియు. 152

తే. భర్తృసన్నిధి నడచిన బాట యెంత, దూర మైనను దూరంబు గా రహింప
దిపుడు నాహృదయం బెంత యేనిదూర, మఱికిపఱచుచునుండెనా యెఱుఁగు మినసుత.

సీ. అనఘ నీవు వివస్వదాత్మజుండవు గాన, వైవస్వతుం డన వఱలుచుందు
నీతండ్రిని న్మించి నీవు వెలుంగుదు, వధిక తేజంబున సమలమూర్తి
ప్రజల ధర్మంబునఁ బాలించుటం జేసి, ధర్మరా జను పేరఁ దనరి తీవు
నామనంబును నేన నమ్మను సజ్జనసమితి నమ్మినయట్లు సదమలాత్మ

తే. ప్రేమయమును గూర్తు సజ్జనగణమునందు, సర్వభూతములందు విశ్వాససౌహృ
దములు నెఱపెద నిట్టినే నమరవినుత, సజ్జనుని నిన్నుఁ గని రిత్తఁ జనఁగ నగునె.

తే. అనిన వైవస్వతుం డను నతివ నీవు, గాక వేఱొక్క రెవ రిట్లు గలరు పలుక
నీయెడం బ్రీతుఁ డైతి నీదుమగని, ప్రాణములుదక్క నొండొక్క వరముగొనుము.

వ. అని యిట్లు నాలవవరం బిచ్చెదఁ బుచ్చుకొను మనిన నక్కొమ్మ సమ్మతమ్మున.

తే. నాకు బలవీర్యశాలులు లోక మెన్న, నూర్వు రౌరసపుత్రు లీయుర్వియందు
సత్యవంతునివలనను సంభవించు, నటు వర మనుగ్రహింపు మోయయ్య యనియె.

వ. అనిన నట్ల యగుంగాత మీవు కడుదవ్వు వచ్చితి వింక నైన మగుడు మనుడు నమ్మగువయు. 158

ఉత్సాహము. తప్పి నొప్పి లేదు నాయెడంద భర్తృసేవకున్
దప్పి యుంట కింతయేని దప్పి నొప్పి నొంది తా
నెప్పుడుం దపించుచుండు నిట్లు గాదె లోకమం
దొప్పు సాధ్వీధర్మ మన్న నోవిభాకరాత్మజా. 159

వ. అని మఱియును. 160

సీ. సజ్జనుల కెనంగు శాశ్వతధర్మంబు, చెదరు వా రొరులను జెఱుపఁ గోరు
వారె లోకముల కాధారంబు వారల, నాశ్రయించినవారి కగును శుభము
వారలసత్యంబువలనఁ గదా ధాత్రి, కులధరంబులతోడ నిలిచి యుండుఁ
జంద్రసూర్యాదులు స్వస్వకార్యములందు, వెలయుచుండుట వారిపేర్మిఁ గాదె

ఆ. తమప్రయోజనంబుఁ దలఁపక వారు పరార్థములను దీర్ప నఖిలమిత్రు
వారి నాశ్రయించి వేరును విఫలు లై పోవ రనుచు శ్రుతులు పొగడుచుండు.

క. కావున సజ్జనశేఖరుఁ, డై వెలసినధర్మమూర్తి వగు నీవలనన్
నే వరము లంది శుభముల, తోఁ బ్రవిం బడ కేగ నగునె దుఃఖవిదారీ. 162



వ. అని యనేకవిధంబులం బ్రార్థించుటయును. 163

ఆ. అమ్మహాత్ముఁ డగల నంతరంగమ్మున, సంతసించి బాల సన్నుతాంగి
దనకుఁ దిరిగి సాధ్వి తెలియ వచ్చెను నీదు, సచ్చరిత్ర మెల్ల మెచ్చు వచ్చె.

క. నీకుఁ బ్రసన్నుఁడ నైతిని, నీ కిష్టం బైనవరము నే నిచ్చెద నో
లోకైకవినుత చరితా, చేకొనుము మనంబులోని సెలుగులు దొలఁగన్. 165

వ. అనిన సావిత్రి వినయవిస్మయసంభ్రమసంతోషంబు లొక్కపెట్ట యుల్లంబునఁ బెల్లుగ నల్లుకొనం బరేతరాట్టుం జూచి కృతాంజలి యై యి ట్లనియె. 166

ఉ. చేసితి నీమ సత్ప్రియుని జీవిత మొక్కఁడు దక్క నన్యమున్
వేఁడుమి యిత్తు నందు మును నీ వది యిప్పుడు త్రోచి పుచ్చి నీ
గోడు దొలంగ నిష్టమును గోరు మటంచు మదీయదీనతం
జూడఁగ లేక లోకగుణశోధక పల్కితి గాన వేఁడెదన్. 167

క. పతి లేనినాతిజీవిత, మతిహీనము దుస్సహంబు నా సతి ధరలో
వితతమై మిక్కిలియుం దూషితయు నగుం దిక్కు లేని చెన్నటి వోలెన్. 168

తే. పతివియోగంబు గలిగినపట్ల నాకు, నితరసుఖములఁ జెప్పంగ నేటికయ్య
స్వర్గసుఖ మైనఁ గోర నాస్వాంతమం దొకింతలోఁ బ్రాణముల పీడ యెంతుఁ గాన.

చ. అనఘుఁడు నామనోహరుఁ డనంతగుణోత్తరుఁ డార్యధర్మవ
ర్తనుఁడు సుమిత్రసన్నిభుఁ డధర్మపరాఙ్ముఖుఁ డిద్ధబుద్ధి స
జ్జనవినుతుండు సాళ్వమహిజానితనూజుఁడు జీవవంతుఁ డై
మనియెడునట్లు నీ వవె సమాశ్రితరక్షక పాపశిక్షకా. 170

వ. అని మఱియును. 171

ఆ. ఈశ! నాకు జీవితేశు నొసంగిన, వరము గాక మున్ను గరుణ నొర
సనుతశతముఁ బ్రీతి నొసఁగువరంబును, సఫల మగును జూవె సలలితాత్మ. 172

—— సత్యవంతుడు యమునియనుగ్రహంబునఁ బునర్జీవితుం డగుట. ——

వ. అని ప్రార్థించినం బ్రసన్నుం డై పాశధరుండు చిత్తాహ్వం బాశవిముక్తుం జేసి సావిత్రిం జూచి యి ట్లనియె. 173

ఉ. వీడితి నీమనోహరుని వీఁడు చతుశ్శతవర్షముల్ మనున్
బోఁడిమితోడఁ బుత్రశతముం గనుఁ బొంగి యశం బెసంగ నీ
కీమజగంబులం బ్రబలి యేలు ధరిత్రి మహామఖంబులన్
వేడుకఁ జేయు నల్లపుడు వేల్పులఁ బింపుఁ బ్రతుష్టి నొందఁగన్. 174

తే. పొలఁతి నీయందుఁ బొడమినపుత్రశతము, పుత్రపౌత్రాభివృద్ధి మైఁ బొలిచి రాజ్య
మేలు నీపేరఁ దద్వంశ మెసక మెసఁగు నీవు సుఖముండు మని జముం డిచ్చె నెగ.

వ. సావిత్రియుం జని యెప్పటియట్లు భర్తృకళేబరంబుఁ బొదివికొని యున్నయంత.

తే. ప్రాప్తచేతనుఁ డై సత్యవంతుఁ డపుడు, నాడులవిఱుపులు నూర్పులు నోడమునుస్స
రనుచు మేల్కాంచి తెప్ప లల్లార్చి జీవి,తేశ్వరిని జూచి మెల్లన నిట్టు లనియె. 177

క. తడ వయ్యె నిదుర వ్రాయితి, నాడలు మఱచి సంజ పడియె హాహామాదులకున్
జడమతి నైతి ననుఁ, బడఁతీ మేల్కొలుపరాదె మనలక యుండన్. 178

ఉ. నల్లనిపూరుషుం డొకఁడు నన్ను గ్రసించె నతం డెవండొ నా
యుల్లము తల్లడిల్లు నన సుగ్మలి యి ట్లను న్నిద్రవోయి తీ
వల్లన మేలుకొంటి విపు డాపురుషుండు కృతాంతుఁ డేగ లె
మ్మిల్లుఁ జనంగ శక్తి యగు నేని నిశీథిని యయ్యె నియ్యెడన్. 179

వ. అని పలికిన సత్యవంతుఁడు సుఖసుప్తోత్థితుండునుం బలె లబ్ధసంజ్ఞుం డై లేచి దిక్కు లవ
లోకించి సావిత్రిదిక్కు మొగం బై యి ట్లనియె. 180

సీ. పండ్లు దేరఁగ నిందుఁ బడఁతి నీతో వచ్చి, గొడ్డంటఁ గట్టియల్ కొట్టుటయును
దలయేరు సోఁకినఁ దరుణి నీతొడమీఁదఁ, దల వెట్టి నిదురింపఁ దలఁచుటయును
నే నెఱుంగుదు నిద్రలో నీలవేణి నే, నరసితి నొకఘోరపురుషమూర్తి
స్వప్నమో లే కది సత్యమో సతి నీవు, తెలిసితివే నాకుఁ దెలుపు మిపుడు

తే. నావుడును రేపు చెప్పెద నాథ యిపుడు, గాఢతమ మయ్యె దవనుండు గానరాఁడ
క్రూరసత్త్వము లిం దందుఁ గూడి తిరుగు, నిదిగొ లె మ్మిల్లు సేరుద మిట్టు లైన.

తే. పంచముఖము లై రాకాసిబలము లెల్లఁ, గెరలి తిరిగెడుఁ గెవ్వనఁ గేక లిడుచు
భూతబేతాళజాలముల్ భూతలమున, మెదలఁ జొచ్చెఁ గ్రౌర్యంబు పొదల నిపుడు.

చ. గడగడలాడు గుండెలు మొకంబులఁ గన్న నెఱుంగ విన్న ని
య్యడవి నిలంగ నాకు వెఱ పయ్యెడు సెంతయు నింతె కాదు నీ
తడయుట కార్య! నీదుతలిదండ్రులు మిక్కిలి పొక్కు చుందు ర
క్కడ నలమూఁడుకాళ్లముదుకళ్లకుఁ బ్రాణము లీవ కావునన్. 183

క. క్రన్ననఁ జని మనవారల, కన్నులకుం జల్లఁదనము గలిగింతు మటం
చు న్నొడివి పడఁతి పతిమై, నన్నుకొనువిషాదచేష్ట లారసి యంతన్. 184

వ. మిగుల వగలం బొగులుచు నమ్మగువ మగనిదిక్కు మొగం బై. 185

ఉ. అక్కట జీవితేశ్వర! నిశాళి యి ట్లెక్కడ యీవనాంతరం
బెక్కడ కొంత సేపటయు నింతకుఁ బోవదు పోవ శక్యమే
చిక్కనఁ గ్రమ్మ నీకటిక చీఁకటి నద్దమరేయి నింతపొ
ద్దిక్కడనుండి రేపకడ నేగుదమే తెఱఁ గెట్లు చెప్పవే. 186



ఆ. అనిన సత్యవంతుఁ డనియె వనము భయా,కార మంధకారకలిత మిపుడు
మిన్ను మన్నుఁ దెలియ దున్న దుంటకుఁ బోవు,టకును దోఁప దున్న దకట నాకు.

వ. అనిన సావిత్రి దేవా! యిదె సమీపానోకహంబున నగ్ని మండుచున్నయది దాని
దెచ్చి యీసమిధలం దవిలించెద నావెలుంగున నీవు నడ నోపితి వేని యిపుడ పోవు
దము కాదేని యీరే యిం దుండి రేపకడఁ బోవుద మనిన సత్యవంతుఁడు సావిత్రి
కి ట్లనియె. 188

సత్యవంతుఁడు తలిదండ్రులం దలంచుకొని దుఃఖించుట.

క. తలయేరు తొలఁగె మేనికి, బల మొకయినుమంత గలిగె బడలిక తీఱెన్
నిలువన్ నడువన్ గాళుల, కలవడియెన్ గొంతశక్తి హల్లకపాణీ. 189

క. నే నై మెల్లఁగ నడు గిడఁ, గా నేతుం దల్లిఁ దండ్రిఁ గన్గొనఁ బో కీ
కాననభూముల యుండున్, నే నీనిశ నింత ప్రొద్దు నిలువం గలనే. 190

ఉ. పుట్టిననాఁటనుండియును బోటిరొ! వింటివె నేఁటిదాఁక నె
వ్వట్టున నైన వారలను బాసి యెఱుంగ నొకింత సేపు నే
నట్టిది యైన నుండ నిపు డింత విలంబన మాట కార్తి వా
రెట్టివిపద్దశం బడిరొ యె ట్టయిరో మఱి యెట్టు లుండిరో. 191

క. అటు పొద్దు గ్రుంకుచుండిన, నిట నిలుపెడలంగ నీక యెప్పుడు నన్నున్
బటుబుద్ధి నాఁగు నాయమ, కటకట యిపు డెంత పడునొ కద మనలుటకున్: 192

సీ. అకట నాతలిదండ్రు లొకవేళ కైన నా,జత విడి తడ వుండఁ జాల రెడఁద
నాలసించితి వేమిరా! తండ్రి యని నన్ను, వారసుగుదు రేగి వచ్చినపుడు
నామీఁదనే జీవనము లుంచుకొన్న వా,రల కపచార మేఁ జలిపినాఁడ
నే నింత మనలుట కెంత సంతాపింతు,రో నేఁడు వా రందు రోసి రోసి

తే. చీఁకులము వృద్ధులము మేము చిన్నికొడుక, నిన్ను విడి బ్రదుకంగ లే మెన్న నీవె
మాకు నాలంబనమవని మాటి మాటి, కడలుచుం డ్రిప్డు వా రెట్లు పడిరొ నేఁడు.

సీ. మాయొడల్ జీవముల్ నీయధీనమ్ములు, మాకుమారక! నీవె మాకు దిక్కు
కనులఁ గాళ్లును లేని యనదల మిట మేము, మాకుమారక! నీవె మాకు దిక్కు
తినఁ ద్రావఁ గట్ట లే దని లేదు మగ మాకు, మాకుమారక! నీవె మాకు దిక్కు
మొగములు వంగడిండ్లుగ నుంటి మే మిందు, మాకుమారక! నీవె మాకు దిక్కు

తే. అనుచుఁ గౌఁగిటఁ గదియించి యంకతలము
లందు నిడికొని శిరము ము ద్దాడి ప్రేము

ననుదినముఁ బ్రేమ నడంపుదు ♦ రట్టి వృద్ధు
లిప్పు డెట్లున్నవారొకో ♦ యెఱుఁగ నకట. 194

క. ననుఁ బ్రేమించినజననియు, జనకుఁడు నాయెడయుకతనఁ ♦ జయ్యన నచటం
దనువు త్యజించెద రని నా,మన మగు నిట వారిఁ బాసి ♦ మనఁ గలనె యిఁకన్. 195

వ. అని యనేకవిధంబులం బలవించి పలవించి మించినదుఃఖభరంబునం జేతు లెత్తి యెలుంగు రాలువడ నుచ్చస్వరంబున నేడువం జొచ్చె నప్పు డాసావిత్రి కంట నీరు వెట్టుకొని వానికన్నీరు కరతలంబున నొత్తుచు. 196

ఉ. క్రొత్తది నేని నే దపము ♦ కొంత యొనర్చినదాన నేని నా
చిత్తము సత్యమార్గమునఁ ♦ జెన్నలరారెడు నేని దానముల్
మెత్తున యేని వేలిమికి ♦ నిచ్చలుఁ జొత్తున యేని నేఁడు మా
యత్తకు మామకున్ విభున ♦ కార్తి పొసంగక యుండుఁ గావుతన్. 197

వ. అని పలికి ప్రాణవల్లభు నూరార్చుచుం దల్లిదండ్రులం జూడ నభిలషించువానిం దన బాహుయుగ్మంబునం గ్రుచ్చి యెత్తి కవుఁగిటం జేర్చుకొని ధూళిధూసరితం బైన మగనిశరీరం బంతయుం దనచేలచెఱంగునం దుడిచి సావిత్రి సమిత్కుశఫలాదులు భారం బగుటం జేసి గరిడియ నట నొక్కవృక్షశాఖం దగిలించి యోగక్షేమార్థంబు పరశువుం గొని వానివామభుజంబు తన డాపలి మూఁపునం బెట్టుకొని దక్షిణభుజంబునం గౌఁగిలించుకొని మందగమనం బంగీకరించి చనుమించుఁబోఁడిం గాంచి చిత్రాశ్వుం డిట్లనియె. 198

సీ. పడఁతి నే నలవాటుపడియుంటిఁ గావున, నీతోవ లెల్ల నా ♦ కెఱుఁగ నయ్యెఁ
జెట్లసందులనుండి ♦ చేరినవెన్నెల, చేఁ గొంతఁ గుఱుతింపఁ ♦ జెల్లుచుండె
మనము ముందు బూలుఁబండ్లనుగోయుచున్వచ్చినట్టి డీదారి యయ్యగును దెలియఁ
గలవు మీఁదఁ బలాశఖండమునకు రెండు,పంథ లుత్తర పంథఁ ♦ బట్టు మీవు
తే. బలము వచ్చెను దలయేరు ♦ దొలఁగె మేన, నింత స్వస్థత గలిగె నే ♦ నింక మెల్ల
మెల్ల నడుగిడ నేర్తు నోయెఱుఁగుఁబోఁడి, కన్నవారలఁ జూచెదంకౌతుకమున. 199

వ. అని పలుకుచు నాశ్రమదిశాభిముఖులై పాదవిన్యాసంబు చేయుచుండి రంత నక్కడ.

ద్యుమత్సేనుఁడు సత్యవంతునిమఱలుటకు దుఃఖించుట.

చ. సమిధలు దేరఁ దాను దనయుఁ జానయుఁ గానసీమ కేగియుం
గొమరుఁడు రాక తక్కుటయు ♦ ఘోరవనాంతరమార్గ మాటయున్
సమయము దాఁటి పోవుటయుఁ ♦ జాల విచారము నొంది వృద్ధు లి
శ్రమ మన రానిచాడ్పున నఖండమనోవ్యథ లంది రత్తఱిన్. 201



ఉ. వచ్చును లేచుచుం బడఁతిపట్టును బట్టినకట్టెపట్టునన్
నచ్చుట కింత వీలుపడ ♦ నల్లడ మెట్టుచు దొట్టుదుఃఖముల్
గుచ్చుచు వృద్ధభూవిభుఁడు ♦ కుంతితుఁ డై సుతుఁ డేగుదేమిఁ దై
కేడ్చెను జుట్టుప్రక్కలముసేంద్రులు దన్నొగి ముట్టడింపఁగన్. 202

వ. అట్టిమహాదుఃఖసమయంబున. 203

ఉ. తామరమొగ్గ లర్యమునితాఁకున విచ్చినరీతిఁ జేతులన్
వేమఱు నశ్రుపూర్ల్ తుడువ ♦ విచ్చెను నేత్రము లట్టి చూడ నా
భూమిధవుండు దిక్కులును ♦ భూమియు నాకనముం గనంబడం
గా ముద మొగ నశ్రువులు ♦ గాలువ గట్టఁగ నేడ్చె బెట్టుగన్. 204

క. కన్నులఁ గాంచియుఁ గన్నుల,కన్నం గడు మిన్న యైనగాదిలికొమరున్
గన్నులఁ గానం జాలక, కన్నులు లేనట్టు లేడ్చెఁ ♦ గాననసీమన్. 205

తే. పడఁతియును దాను నిందందుఁ ♦ గొడుకు వెదకి
కొడుక! కొడుకా! యటంచు రాల్పడఁగ నెలుఁగు
చీరియును జీరి మిక్కిలి నేవు వాని
జాడ యగవడ కున్న లో ♦ జాలి నొంది. 206

చ. పదుచుఁద్దనంబువాఁడు పరభామలఁ దల్లులఁ బోలెఁ జూచువాఁ
డడరెడువాఁడు నవ్వమొగ ♦ మందినవాఁడు సతీసమేతుఁ డై
యడవికిఁ బండ్లు దే నరిగి నట్టివిలాసమువాఁడు వాఁడు నా
కొడుకు కుజంబులార వరకుంజములార యెఱిగెఁ జెప్పరే. 207

క. కల నైన బొంకి యెఱుఁగఁడు, వలికినఁ బలుకులను దప్పఁ ♦ బలుకం డెవుడున్
ఖలవృత్తముఁ దలపోయఁడు, పిలిచిన మఱి పలుకు నతని ♦ వీక్షింపరు గా. 208

వ. అని యగపడినవాని నెల్ల నడిగికొనుచు ద్యుమత్సేనుండు శైబ్యాసహితుం డై యాశ్రమంబులు వనంబులు కొలంకులు వాఁగులు వంతలు లోనగుప్రదేశంబు లెల్ల వెదకి సుతుం డెందునుం గానక చీమ చిటుక్కుమన్న సత్యవంతుండు సావిత్రీసహితుం డై వచ్చుచుండె నని యెదురు చూచుచు శిలలుం గంటకంబులుం దాఁకుటం జేసి రక్తసిక్తాంగుం డై యెలుం గెత్తి కొడుకుం గోడలిం బిలుచుచు నుల్లంబు తల్లడిల్ల హా కుమారా యనుచు ధైర్యంబు దిగఁద్రావి దేవురించుచున్న యెడ నందలిమును లెల్లరు నమ్ముదుసలిం బొదివికొని కన్నులు వచ్చుట కచ్చెరు వందుచు నతని కి ట్లనిరి.

మ. వినుమీ కోడలు సాధ్వి సద్గుణగణాభిఖ్యాతచారిత్ర స
జ్జనసంకీర్తనపాత్రకీర్తి వనితాశాఖావతంసంబు త
ద్ఘనపుణ్యంబున నీకు నేత్రములు సంకాశించె నీకోర్కులున్
దనరున్ నీసుతుఁడున్ సజీవుఁ డయి నీనందనుం బ్రకాశించెడిన్. 210

వ. మఱియు నాసమయంబున. 211

సీ. సాధ్వి సావిత్రి తత్పతి యాట బ్రదుకు నీవరసుతుం డనియె సువర్చసుండు
జపతపోనిరతిమైఁ జనునాకు నీపట్టి కనుపట్టె సుఖ యనె గౌతముండు
పతివెంట నంటిన కతన నీతనయుండు దనరు నం చనె భరద్వాజమౌని
శుభశకునంబులు చూపట్టుఁ గాన నీయాత్మజుం డలరు నం చనియె ధౌమ్యుఁ
తే. డెన్నఁడో పోయియున్న నీకన్నులిపుడు వెలసెఁ గాంతామతల్లి సావిత్రివ్రతము
కలిమి నీపుత్రుఁ డనుదానఁ జెలఁగు ననుచుఁ దవిలి భాషించె ననఘుఁ డాదాల్భ్యమౌని.

సావిత్రి సత్యవంతునితో వచ్చి సర్వవృత్తాంతము నెఱింగించుట.

వ. మఱియు నాపస్తంబప్రభృతు లగుమహర్షు లెల్లరును సావిత్రీసత్యవంతులు దీర్ఘాయు
ష్మంతులు సగవ కుందు రని సముచితసంభాషణంబుల నాశ్వాసింపుచుండి రంత
రెండు గడియలకు సావిత్రీసమేతుండై సత్యవంతుండు తనచెంతఁ బొడకట్టుటయును
మునికదంబమధ్యగతుం డగు ద్యుమత్సేనుండు. 213

చ. అడరుచు లేచి హర్షమున నాతనిఁ గౌఁగిటఁ జేర్చి మూర్ధముం
బుడుకుచు నాయనా! యిట మమ్ముం బడవైచి విళంబనంబు న
య్యడవి నొనర్చుచుండుటకు నైన కతం బది యేమొ చెప్పవే
బుడుగుల నిట్లు వాయుటలు భావ్య మటంచు మదిం దలంచితే. 214

చ. అనుటయు రాజపుత్రి యిసుమంతవినయంబునఁ దా నరణ్యముం
జనుటయుఁ బండ్లు గోయుటయు సారెకు గొడ్డలిఁ గొట్టుచుండఁ బెం
పునఁ దలయేరు సోఁకుటయు మూర్ఛిలి వ్రాలుటయుం గలం దనున్
ఘనుఁ డొకఁ డాగ్రహించుటయుఁ గ్రన్ననఁ దండ్రికిఁ జెప్పి వెండియున్. 215

క. ఒడ లింత వశము గామిన్, నడ మటకును శక్తి లేక నన్నొఱఁగఁగ వేఁ
డడ నీతి నింతదనుక నీ, పడఁతుక చేయూఁతఁ జేసి వచ్చుట గలిగెన్. 216

వ. అంత మునిజనసమేతుం డగుద్యుమత్సేనుండు సావిత్రిం బిలిచి తల్లీ నీవు సావిత్రిం
బోలినదాన విందలిరహస్యం బెఱింగియుందు వది మాకుం జెప్పం దగినది యేని
చెప్పు మనుటయు నామె మౌనివరేణ్యుల యానతిం గొని. 217



ఉ. మామకు మద్రరాజసుత మాటికి వందన మాచరించి వి
న్మో మహితాత్మ నేఁడు భవదుత్తమపుత్రున కీదినంబునం
దా మృతి యంచు నారదమహాముని చెప్పుటఁ జేసి వీనితో
నేమఱ కేను బోతి నట నే మగునో యనుసాధ్వసంబునన్. 218

మ. అట నీతండు ప్రసుప్తుఁ డై నతఁడె సుగ్రాకారుఁ డై కాలుఁ డ
చ్చటికి న్వచ్చి పెనన్ గ్రసించి యసురుల్ సాగింపఁగాఁ బైన మే
నటు వెంటం బడి సత్యధర్మసరణిం బ్రార్థింప నద్దేవుఁ డ
క్కటికం బొప్ప వరంబు లైదొసఁగె వేడ్కన్ నాకుఁ గైకొలుగన్. 219

వ. అందు మొదటిరెండువరంబులును నీకుఁ గన్నులు వచ్చుటకును రాజ్యంబుఁ దెచ్చు
టకును దృతీయచతుర్థవరంబులు నాతండ్రికిని నాకును సుతశతప్రాప్తికిని బంచమ
వరంబు నీవరపుత్రుండు జీవించి చతుశ్శతవర్షంబులు సుఖంబుండుటకును గారణంబు
లయ్యె నిది నాపూనినవ్రతముప్రభావం బిట్లు కష్టప్రారంభం బై సుఖోదర్కం బయ్యె
నని చెప్పిన నత్తమామ లత్యంతసంతోషాయత్తచిత్తులై యత్తపస్వినీజనమతల్లిం
గని యి ట్లనిరి. 220

శా. తల్లీ పుణ్యవతీమతల్లి భవదత్యంతప్రభావంబు మా
యుల్లం బెంతయుఁ బల్లవింపఁగను జేయుం దుఃఖవారాన్నిధిం
ద్రెళ్లం బోయెడునాదువంశమును బేర్మిన్ నావ వై నీవు సం
పల్లాభంబుగ నుద్ధరించితి నినున్ వర్ణింప సామాన్యమే. 221

వ. అని మఱియు ననేకవిధంబులఁ బ్రస్తుతిపూర్వకంబుగా నాసావిత్రిం బ్రశంసించుచుండి
రంత సమాగతు లైనమును లెల్లరు నాపెంతపఃప్రభావంబునకు భావంబున నద్భు
తంబు నొందుచు నిజోటజమ్ములకుం జని రమ్మఱునాఁడు. 222

ద్యుమత్సేనుఁడు వెండియు రాజ్యముం బొందుట.

చ. యమునివరప్రభావమున నక్కడ వృద్ధనరేంద్రశత్రువుల్
క్రమముగ భృత్యభేదము సెలంగుటఁ జేసి సబాంధవంబుగా
సమరమునందుఁ ద్రెళ్లుటయు సాళ్వమహీజను లాప్తమంత్రివ
ర్గము తమవెంట రాఁ గలసి కాననసీమకు వచ్చి ముచ్చటన్. 223

వ. సర్వవృత్తాంతంబు నివేదించి నీవు నిష్కంటకుండ వైతివి నిఖిలధరణీరాజ్యంబు
వహించి ప్రజలం బరిపాలింపు మని విన్నవించి. 224

క. కడు నిడుమలఁ గుడిచితి వీయడవులలో నింతదనుక నవనీశ్వర నీ
కడగండ్లు దీఱె నింకిటఁ, దడయంగా నేల రాజధానికి రమ్మా. 225

చ. అనినఁ బ్రహృష్టచిత్తుఁ డయి యా నృపసత్తముఁ డవ్వనంబునన్
మునులకుఁ బ్రొక్కుచున్ ముదముఁ బొంది కుటుంబసమేతుఁ డై వనం
బున ముద మందు మంత్రులను మున్నిడుకొంచు ప్రజాధిరాజుఁ డై
చనెఁ జతురంగసేన లొగి నందడిఁ జేయఁగ రాజధానికిన్. 226

వ. చని పట్టభద్రుం డై చిత్రాశ్వునకు యౌవరాజ్యపట్టంబుఁ గట్టి ప్రజాపాలనంబుఁ గావించుచుండె నంతఁ గొంతకాలంబునకు సావిత్రికిని సావిత్రిజనయిత్రికిని బుత్రశతంబు వుట్టె నివ్విధంబున. 227

ఆ. మగనిఁ దన్ను న త్తమామలఁ దలిదండ్రులను సముద్ధరించి ఘనయశమ్ముఁ
గాంచె మున్ను యుగములందు సావిత్రి, పుణ్యచరిత వింటె భూవరేణ్య. 228

క. ఆసావిత్రి తెఱంగున, భూసురనుతచరిత ద్రుపదపుత్రియు మిమ్మున్
మానకలాన్వయముం గొని, భాసురమతి నుద్ధరించుఁ బ్రజ్ఞానిధి యై. 229

వ. అని చెప్పి మార్కండేయుండు నిజాశ్రమంబునకు నిర్గమించె ధర్మనందనుండును విశోకుండు విజ్వరుండు నై కామ్యకకాననంబున నుండె నని వెండియు. 230

మ. మునిరాట్సంస్తవనీయ మాపదపహంబున్ ధర్మసంభావ్యమున్
ఘనపుణ్యంబు పతివ్రతాజనశరణ్యం బద్భుతాధీనమున్
వినయాహ్లాదకరంబు భవ్య మగుసావిత్రీచరిత్రం బొగిన్
వినినన్ భక్తిఁ బఠించినన్ సుకృతమున్ విజ్ఞానముం గల్గెడున్. 231

వ. అని వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పె నని చెప్పిన విని నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు చెప్పు మని సూతు నడుగుటయును. 232

అశ్వాసాంతము.

మ. సతి యై సర్వజగత్ప్రసిద్ధి కగు నా సావిత్రి నామంబు నా
సుతకుం బెట్టితిఁ దచ్చరిత్రమును ముం సొంపొప్ప వర్ణించి నే
నతిభక్తిం బచరించితిన్ మఱియు నీ యారణ్యమం దిట్లు చే
సితి నన్నుం గరుణించి దీని నెలమిన్ చేకొమ్ము లోకేశ్వరా. 233

గద్యము.

ఇది శ్రీమదఘునాతనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునం
...రణ్యపర్వంబున దశమాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.

